ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

తృతీయాద్యారంభః. తత్ర తృతీయే ప్రథమం క్షత్తుర్మైత్రేయసంగమశ్చతుర్భిరధ్యాయైః తతోఽష్టభిః సవిసర్గః సర్గ ప్రపంచః తతో విసర్గప్రస్తావేన సప్తభిర్వరాహావతారః తతః ఏకేన విసర్గసమాహారః తత్ర్పసంగేన చతుర్భిరధ్యాయైః కపిలావతారః తతో నవభిః కపిలాఖ్యానమితి త్రయస్త్రింశదధ్యాయైస్తృతీయ స్కంధ ప్రవృత్తిః. తత్ర ద్వితీయస్కంధాంతే శ్లో. 'పరిమాణం చ కాలస్య కల్పలక్షణవిగ్రహమ్. యథాపురస్తాద్వ్యాఖ్యాస్యే పాద్మం కల్పమథో శ్రుణు ఇతి. ప్రతిజ్ఞాతమర్థం విస్తరేణ నిరూపయితుమితిహాసం ప్రస్తౌతి – ఏవమితి ద్వాభ్యాం. బుద్ధిమత్ సర్వసంపద్భిః సంపూర్ణమ్. 1

సృష్టి ప్రారంభకాలమున ఈ భాగవతమును శ్రీనారాయణుడు బ్రహ్మదేవునకు 'అహమేవా సమేకోఽగ్రే ..' అనెడి చతుశ్లోకి భాగవతమును సంక్షిప్తముగా నిరూపించెను. దీనినే తరువాతి కాలమున 'బ్రహ్మ' నారద మహర్షికి ఉపదేశించెను. కాలాంతరమున నారద మహర్షి బదరికాశ్రమమున వ్యాస మహర్షికి ఉపదేశించెను. వ్యాస మహర్షి ఈ భాగవతమును పది లక్షణములతో 'శేషోక్తము' అను పేరిట సవిరముగా 18000 శ్లోకములతో వర్ణించినాడు. భాగవత సంప్రదాయములో ఇది రెండవ రూపము. భాగవతము యొక్క పది లక్షణములు ఈ మూడవ స్కంధము మొదలుకొని ఒక్కొక్క లక్షణము ఒక్కొక్క స్కంధములో నిరూపించడమైనది. ఈ స్కంధములో 'సర్గము' అనే లక్షణము నిరూపించడమైనది. ఈ స్కంధములో ముందుగా మొదటి నాలుగు అధ్యాయములలో విదురమైత్రేయ సమాగమము వర్ణించ బడినది. తరువాతి ఎనిమిదిఅధ్యాయములలో విసర్గవర్ణన కలదు. విసర్గ అనగా బ్రహ్మనుండి ఏర్పడిన చరాచరసృష్టి. ఆ పిమ్మట ఏడు అధ్యాయములలో వరహావతారము వర్ణించబడినది. పిమ్మట ఒకఅధ్యాయములో బ్రహ్మ నుండి ఏర్పడిన చరాచర సృష్టి సమాహారము కలదు. ఆ పైన నాలుగు అధ్యాయములలో కపిలావతారము వర్ణించబడినది. అటు తరువాత తొమ్మిదిఅధ్యాయములలో కపిల గీత అనుపేరుతో ప్రఖ్యాతమైన కపిలాఖ్యానము వర్ణించబడినది. 1

శ్లో॥ యద్వా అయం మంత్రకృద్వో భగవానఖిలేశ్వరః ।
పౌరవేంద్రగృహం హిత్వా ప్రవివేశాత్మసాత్కృతమ్ ॥ 2

టీ:- కించ. అతిశ్లాఘ్యం త్యాగానర్హమిత్యాహ. యదతి. యద్వై ప్రసిద్ధం గృహం వః పాండవానాం మంత్రకృత్ ద్యూతకర్తా సన్నయం శ్రీకృష్ణః. శ్రీకృష్ణస్య బుద్ధిసన్నిధానాదయమితి నిర్దేశః. పౌరవేంద్రో దుర్యోధనః.తస్య గృహం హిత్వా అనాహూత ఏవ ప్రవివేశ. అత్ర హేతుః-ఆత్మసాత్కృతం ఆత్మీయత్వేన కృతం గృహీతం.2

రాజోవాచ.

శ్లో॥ కుత్ర క్షత్తుర్భగవతా మైత్రేయేణాఽఽస సంగమః ।
కదా వా సహ సంవాదః ఏతద్వర్ణయ నః ప్రభో ॥ 3

టీ:- కుత్రేతి. కుత్ర సంగమః ఆస బభూవ. 3

శ్లో॥ న హ్యల్పార్థోదయస్తస్య విదురస్యామలాత్మనః ।
తస్మిన్వరీయసి ప్రశ్నస్సాధువాదోపబృంహితః ॥ 4

టీ:- నహీతి. వరీయసి శ్రేష్ఠే. అల్పస్యార్థస్య ఉదయో - యస్మాత్తథా భూతో న భవతి. సాధువాదేన సతామనుమోదనేన ఉపబృంహితః సంవర్ధితః. యద్వా సాధోర్మైత్రేయస్య సంవాదేన ఉత్తరేణ శ్లాఘిత ఇత్యర్థః। 4

సమస్త లోకములకు ప్రభువైన శ్రీకృష్ణభగవానుడు మీకు రాయబారిగా హస్తినాపురమునకు వెళ్ళినప్పుడు పౌరవేంద్రుడగు దుర్యోధనుని ఇంటికి వెళ్ళక స్వగృహముగా భావించి విదురుని ఇంటికి వెళ్ళెను. 2

పరీక్షిన్మహారాజు ఇట్లు అడిగెను.

ఓ శుక మహర్షీ ! విదురుడు మైత్రేయుని కలుసుకొనుట ఎచ్చట జరిగినది? ఈ విషయమును మాకు వర్ణించి చెప్పుము. 3

శుద్ధాంతఃకరణము కలిగిన విదురుడు మహాత్ముడగు మైత్రేయునకు వేసిన ప్రశ్న విషయములో గాని, ప్రయోజన దృష్ట్యా గాని సాధారణమైనది కాదు. ఆ ప్రశ్న మహిమాన్వితమైనది. మైత్రేయునిచే పొగడబడినది. 4

శ్రీ సూత ఉవాచ

శ్లో॥ స ఏవమృషివర్యోఽథ రాజ్ఞా పృష్టః పరీక్షతా ।
ప్రత్యా హతం స బహువిత్ప్రీతాత్మా శ్రూయతామితి ॥ 5

టీ:- సఇతి. శ్రూయతామితి భావే లకారః.శ్రూయతాం శ్రవణం క్రియతామిత్యర్థః. 5

శ్రీ సూత మహర్షి ఇట్లు చెప్పెను.

అఖండ భక్తి, జ్ఞాన, వైరాగ్య సంపన్నుడైన శ్రీ శుక మహర్షి పరీక్షిన్మహారాజు ప్రశ్నకు సంతోషపడెను. "సావధాన చిత్తముతో వినవలసినది" అని ఇట్లు చెప్పెను. 5

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ యదా తు రాజా స్వసుతా న
న సాధూన్ పుష్ణన్నధర్మేణ వినష్టదృష్టిః ।
భ్రాతుర్యవిష్ఠస్యసుతాన్విబంధూన్
ప్రవేశ్య లాక్షాభవనే దదాహ ॥ 6

టీ:- త్యాగానర్హస్యాపి గృహస్య త్యాగే హేతుత్వేన కౌరవాపరాధా నాహ- ఏకాదశభిః.యదేతి .ఏతేషాం చ తదా సః క్షత్తా అయాదిత్యేకాదశే క్రియాకారక సంబంధః. యవిష్ఠస్య కనిష్ఠస్య పాండోః విబంధూన్ పితృవిహీనాన్. 6

శ్రీ శుక మహర్షి ఇట్లు పలికెను.

పుత్రేషణ మనిషిని ఎంతటి అంధుని జేయునో ఈ శ్లోకము చెప్పుచున్నది. తన పుత్రుల యందు గల మోహముచే తండ్రి లేని వారు, తన తమ్ముని పుత్రులగు ధర్మజాదులను లక్క ఇంటిలో ప్రవేశింపజేసి తగలబెట్టించెను. దుర్మార్గులగు దుర్యోధనాదులను సమర్థించి చూపుతో పాటు వివేకముగూడా లేనివాడయ్యెను. 6

శ్లో॥ యదా సభాయాం కురుదేవదేవ్యాః
కేశాభిమర్శం సుతకర్మ గర్హ్యమ్ ।
న వారయామాస నృపః స్నుషాయాః
స్వాస్రైర్హరంత్యాః కుచకుంకుమాని ॥ 7

టీ:- యదేతి. కురుదేవస్య యుధిష్ఠిరస్య. దేవ్యాః ద్రౌపద్యాః. ఆత్మనః స్నుషాయాః స్వీయైరాస్రైరశ్రుభిః స్వకుచకుంకుమాని రిపుస్త్రీణాం వా తద్భర్తృవధేన హరంత్యాః. 7

నిండుసభలో కౌరవవంశపు రాణి, తనకు కోడలుయగు ద్రౌపదీదేవిని దుశ్శాసనుడు జుట్టుపట్టుకొని లాగెను. ఆమె తన వక్షఃస్థల మందలి కుంకుమను కన్నీటితో కడిగివేయబడునట్లు ఏడ్చెను. (ద్రౌపది వక్షఃస్థల కుంకుమ కన్నీటిచే తొలగుట శత్రువుల భార్యల పసుపు కుంకుమలు దూరమగుటకు సూచన) అయినప్పటికి ఆ ధృతరాష్ట్రమహారాజు తనకుమారుల దుర్మార్గచర్యలను అడ్డగించలేదు. 7

శ్లో॥ ద్యూతే త్వధర్మేణ జితస్య సాధోః
సత్యావలంబస్య వనాగతస్య
న యాచతో౽దాత్సమయేన దాయం
తమోజుషాణో యదజాతశత్రోః ॥ 8

టీ:- ద్యూత ఇతి. సత్యావలంబస్య సత్యాశ్రయస్య. వనాత్ ప్రత్యాగతస్య. సమయేన పూర్వకృతేన. దాయమంశం యాచమానస్య. యత్ యదా. నాదాత్ న దదౌ. తమః మోహం జుషాణః 8

ధర్మరాజు అధర్మపద్ధతిలో జూదమునందు ఓడిపోయెను. సత్యమును ఆశ్రయించినవాడు, అరణ్యఅజ్ఞాతవాసములు పూర్తి చేసుకుని తిరిగివచ్చినవాడు, సత్యనిష్ఠ గలవాడును అగు ధర్మరాజు తనకు న్యాయముగా రావలసిన రాజ్యభాగమును కోరగా మోహవశుడైన ధృతరాష్ట్రుడు, అజాతశత్రువైన ధర్మరాజునకు రాజ్యమివ్వలేదు. 8

శ్లో॥ యదా చ పార్థప్రహితః సభాయాం
జగద్గురుర్యాని జగాద కృష్ణః ।
న తాని పుంసామమృతాయనాని
రాజోరు మేనే క్షతపుణ్యలేశః ॥ 9

టీ:- యదేతి. యాని వచనాని పుంసాం భీష్మాదీనాం. అమృతాయనాని అమృతస్రావీణి. రాజా ధృతరాష్ట్రః దుర్యోధనోవా. ఉరు బాహు న మేనే. క్షతో నష్టః పుణ్యలేశో యస్య సః. న సుఖ కీర్తిధర్మార్థాది హేతుః కింతు రాజ్యప్రాప్తిమాత్ర హేతుః పుణ్యలేశ ఏవ ఆసీత్తస్యాపి నష్టత్వాదనాదృతవానిత్యర్థః. 9

ధర్మరాజు పంపగా జగద్గురువైన శ్రీకృష్ణుడు కౌరవ సభకు వెళ్ళి హితవచనములు పలికెను. భీష్మాదులకు ఆ మాటలు అమృత నిధానములు అయ్యెను. ఒకింత మిగిలిన పుణ్యముకూడా నశించిన దుర్యోధనుడు, ధృతరాష్ట్రుడు ఆ మాటలను ఆదరింపలేదు. 9

శ్లో॥ యదోపహూతో భవనం ప్రవిష్టో
మంత్రాయ పృష్టః కిల పూర్వజేన ।
అథాహ తంమంత్రదృశాం వరీయాన్
యన్మంత్రిణో వైదురికం వదంతి. ॥ 10

టీ:- ఇదానీం విదురస్యైవ కృతం పరాభవం దర్శయతి షడ్భిః. యదేతి. యదా పూర్వజేన ధృతరాష్ట్రేణ మంత్రాయోపహూతోఽంతర్ గృహం ప్రవిష్టో విదురః మంత్రం పృష్టస్సన్ అథానంతరం తదాహ. కిం. మంత్రిణోఽద్యాపి యద్వైదురికం విదురవాక్యమితి ప్రసిద్ధం వదంతి. 10

అన్నగారగు ధృతరాష్ట్రుడు, రాజనీతిలో శ్రేష్ఠుడగు విదురుని సలహా (మంత్రాంగము) కొఱకై పిలిచెను. అప్పుడు విదురుడు భవనమున ప్రవేశించి తన అన్నకు ధర్మమును బోధించెను. ఈ బోధనే నీతిశాస్త్రవేత్తలు "విదురనీతి" అని వ్యవహరించుచున్నారు. 10

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అజాతశత్రోః ప్రతియచ్ఛ దాయం
తితిక్షతో దుర్విషహం తవాగః ।
సహానుజో యత్ర వృకోదరాహిః
శ్వసన్రుషా యత్త్వమలం బిభేషి ॥ 11

టీ:- తదేవాహ త్రిభిః. అజాతశత్రోరితి. తవ ఆగః అపరాధం. సహమానస్య దాయం. ప్రతియచ్ఛ దేహి. యత్రాపరాధే అనుజైస్సహ వర్తమానో వృకోదరరూపః అహిః. క్రోధేన శ్వసన్వర్తతే. యత్ యస్మాత్ అలమత్యర్థం బిభేషి. 11

నీవు చేసిన అపరాధము సహింపరానిది. అయినను సహించుచున్న అజాతశత్రువగు ధర్మరాజునకు రావలసిన రాజ్యభాగమును ఇచ్చివేయుము. భీమసేనుడు సోదరులతో కూడినవాడై పామై బుసలు కొట్టుచున్నాడు. నీవు భీముని వలన మిక్కిలి భయపడెదవు కదా! 11

శ్లో॥ పార్థాంస్తు దేవో భగవాన్ ముకుందః
గృహీతవాన్ సః క్షితిదేవదేవః ।
ఆస్తే స్వపుర్యాం యదుదేవదేవో
వినిర్జితాశేష నృదేవదేవః ॥ 12

టీ:- మమ తాదృశాః బహవః పుత్రాస్సంతీతి గర్వం మా కృథా ఇత్యాహ. పార్థాంస్తు ముకుందః ఆత్మీయత్వేన గృహీతవాన్. స తు దేవః తత్రాపి భగవాన్ న తు ప్రాకృతః. కించ సహ క్షితిదేవైర్విప్రైర్దేవై రింద్రాదిభిశ్చ వర్తమానః యత్రాసౌ శ్రీకృష్ణః తత్ర విప్రా దేవాశ్చేత్యర్థః

మోక్షప్రదాతయగు శ్రీకృష్ణభగవానుడు, మహాబలవంతులును, పృథాదేవిపుత్రులునునగు పాండవులను సంరక్షించే బాధ్యతను స్వీకరించినాడు. కృష్ణానుగ్రహమున్నచోట బ్రాహ్మణులు, ఇంద్రాది దేవతలు నివసింతురు. అలాంటి బ్రాహ్మణరక్షకుడును, యాదవ ప్రభువును, సమస్తరాజలోకాన్ని జయించినవాడును యగు శ్రీకృష్ణుడు తన నగరమైన ద్వారకానగరములో ఉన్నాడు. 12

స చ స్వపుర్యామేవ సుఖమాస్తే, న త్వన్యత్ర గతః. కించ యదు దేవానాం దేవః పూజ్యః. యతోఽసౌ తత్రైవ యదుప్రవీరా ఇత్యర్థః. కిం చ నృదేవేషు మండలేశ్వరేషు దీవ్యంతి ప్రకాశంత ఇతి నృదేవ రాజానః వినిర్జితా అశేషా నృదేవదేవా యేన. యతోఽసౌ తత్రైవ రాజానః సర్వే. అతః పార్థానాం దాయం దేహీతి. 12

శ్లో॥ స ఏష దోషః పురుషద్విడాస్తే
గృహాన్ ప్రవిష్టోఽయమపత్య మత్యా ॥
పుష్ణాసి కృష్ణాద్విముఖో గతశ్రీః
త్యజాశ్వశైవం కులకౌశలాయ ॥ 13

టీ:- నను దుర్యోధనః తం న మన్యత ఇతి చేదత ఆహ సఇతి. స ఏష దోషో మూర్తో దోష ఏవ గృహాన్ ప్రవిష్ట ఆస్తే. దోషత్వే హేతుః- పురుషద్విట్ శ్రీకృష్ణద్వేష్టా. కోఽసౌ. యం త్వం అపత్యమత్యా అపత్యబుద్ధ్యా పుష్ణాసి న త్వపత్యమసౌ. న పతత్యస్మాదిత్యపత్యం ప్రాహుః గతా శ్రీర్యస్మాత్సః. త్వమిత్యాక్రోశతి. అత ఏనమశైవమమంగళం. ఆశు త్యజ. కథం పుత్రస్త్యాజ్యస్తత్రాహ. కులస్య కౌశలాయ. స్వార్థే తద్ధితః శ్లో."త్యజేదేకం కులస్యార్థే, గ్రామస్యార్థే కులం త్యజేత్, గ్రామం జనపదస్యార్థే, ఆత్మార్థే పృథివీం త్యజేత్." ఇత్యాదిన్యాయాత్. 13

దుర్యోధనుడు కృష్ణద్వేషమే స్వభావముగగల పాపి. అట్టి దుర్యోధనుడు పుత్రుడుగా ఇంట ప్రవేశించినాడు. వానిని కేవల పుత్ర భావముతో పోషించుచున్నావు. నిజమునకు పతనముకానివ్వనివాడు అపత్యము.(సంతానము). త్యజేదేకం కులస్యార్థే..... అనునట్లు కౌరవ వంశ రక్షణ కొఱకై అమంగళస్వరూపమగు దుర్యోధనుని వెంటనే విడిచిపెట్టుము. 13

శ్లో॥ ఇత్యూచివాంస్తత్ర సుయోధనేన
ప్రవృద్ధ కోప స్ఫురితాధరేణ ।
అసత్కృతస్సన్ స్పృహణీయశీలః
క్షత్తా సకర్ణానుజసౌబలేన ॥ 14

టీ:- ఇతీతి. ఇత్యూచివాన్ ఏవ ముక్తవాన్. అసౌ క్షత్తా. సతాం స్పృహణీయం శీలం యస్య సః. కర్ణ దుశ్శాసన శకుని సహితేన దుర్యోధనేన. అసత్కృతః. తిరస్కృతః. 14

విదురుడు సత్పురుషుల తోడు కోరుకొనే మంచిస్వభావము కలవాడు. దుర్యోధనుడు కర్ణ, దుశ్శాసన, శకునులతో కూడినవాడై, ఎక్కువ కోపముచే అదురుచున్న క్రిందిపెదవి గలవాడై విదురుని మిక్కిలి తిరస్కరించుచూ ఈ విధముగా పలికెను. 14

శ్లో॥ క ఏనమత్రోపజుహావ జింహం
దాస్యాస్సుతం యద్బలినైవ పుష్టః
తస్మిన్ ప్రతీపః పరకృత్య ఆస్తే
నిర్వాస్యతామాశు పురాచ్ఛ్వసానః ॥ 15

టీ:- తిరస్కారమేవాహ కఇతి. దాసీసుతోహ్యత్రాహ్వానానర్హః. జింహః కుటిలః.జింహతామాహ యస్య బలినాన్నేన పుష్టః. తస్మిన్నేవ ప్రతీపః ప్రతికూలః. పరేషాం కార్యే వర్తతే. అతః పురాత్ నిర్వాస్యతాం. శ్వసానః శ్వసన్ జీవనమాత్రశేష ఇత్యర్థః. పాఠాంతరే శ్మశానవదమంగళః సర్వం ధనాదిగృహీత్వా గృహాన్నిష్కాస్యతామితి భావః. 15

“దాసీపుత్రుడు, కుటిలుడు అయిన విదురుని ఇచటకు ఎవరు పిలిచినారు? నేను పెట్టెడు అన్నముతో శరీరమును పోషించుకొనుచు నాకే ప్రతికూలుడైనాడు. ఇతరులకు అనుకూలుడైనాడు. ప్రాణములు మాత్రమే యుండునట్లు విదురుని వెంటనే వెడలనడుపుడు”. (‘శ్వసాన’ కు బదలు శ్మశానం అని పాఠాంతరము కలదు. శవమును వలె విదురుని పంపుడు అని అర్థము) అని దుర్యోధనుడు పలికెను. 15

శ్లో॥ స ఇత్థమత్యుల్బణ కర్ణబాణైః
భ్రాతుః పురో మర్మసు తాడితోఽపి ।
స్వయం ధనుర్ద్వారి నిధాయ మాయాం
గతవ్యథోఽఽయాదురు మానయానః ॥ 16

టీ:- స ఇతి. అత్యుల్బణైః కర్ణయోర్బాణవత్పతద్భిః పరుషవాక్యైర్మర్మసు తాడితోఽపి గతవ్యథః. తత్ర హేతుః-మాయాం ఉరు బహుమానయన్ అహో మాయా మాహాత్మ్యమితి తామేవ తత్ర హేతుం మన్యమానః తన్నిస్సారణాత్పూర్వం స్వయమేవ అయాత్ నిర్జగామ. కిం కృత్వా. ఏతే నూనం మరిష్యంతి కిం ధనుషేతి తస్య ద్వారి ధన్నుర్నిదాయ. యద్వా భీమాదిభిస్సహ సంగత్య అస్మాభిర్యోత్స్యతీతి మా శంకీరితి ధనుర్నిధానం. 16

తన అన్నగారి ఎదుటనే కర్ణశూలములు, మర్మభేదకములు అయిన మాటలు వినియు విదురుడు దుఃఖమును పొందలేదు. ఇదంతా మాయాశక్తి గొప్పదనముగనే భావించెను. ధనుస్సును ద్వారమున ఉంచి వారువెడలనడపక ముందే తానే వెళ్ళెను. ధనుస్సు ద్వారమున ఉంచుట రణరంగమున భీమాదులచేత దుర్యోధనాదులు మరణింతు రనుటకు సూచన. 16

శ్లో॥ స నిర్గతః కౌరవ పుణ్యలబ్ధో
గజాహ్వయాత్తీర్థపదః పదాని
అన్వాక్రమత్పుణ్య చికీర్షయోర్వ్యాం
స్వధిష్ఠితో యాని సహస్రమూర్తిః ॥17

టీ:- తతో నిర్గతస్య తీర్థాటన ప్రకారమాహోష్టభిః - స ఇతి. సః గజాహ్వయాన్నిర్గతస్సన్ తీర్థం పాదే యస్య తస్య హరేః పదాని క్షేత్రాణి

కౌరవులు చేసికొన్న పుణ్య ఫలముగా వారికి విదురుడు లభించెను. అట్టి విదురుడు అవమానింపబడినవాడై హస్తినాపురము నుండి బయలుదేరి, పుణ్య సంపాదనేచ్ఛ గలవాడై తీర్థపదుడైన విష్ణువు యొక్క క్షేత్రములను తిరిగెను. గంగాది తీర్థములను సేవించెను. 17

పుణ్యచికీర్షయా అన్వాక్రమత్ క్రమేణ ప్రత్యపద్యత. కౌరవాణాం పుణ్యేన లబ్ధ ఇతి తేషాం భాగ్యమేవ తేన రూపేణాగతమితి సూచితం. ఉర్వ్యాం సహస్రమూర్తిః బ్రహ్మరుద్రాద్యనేకమూర్తిస్సన్ తీర్థపావనాయ యాన్యధిష్ఠాయ స్థితః. తాని తాని జగామేత్యర్థః 17

శ్లో॥ పురేషు పుణ్యోపవనాద్రి కుంజే
ష్వపంక తోయేషు సరిత్సరస్సు ।
అనంతలింగై స్సమలంకృతేషు
చచార తీర్థాయతనేష్వనన్యః ॥ 18

విదురుడు విష్ణుక్షేత్రములైన నగరముల యందును, పుణ్యవంతములైన ఉద్యానవనముల యందును, తీగలతో గూడిన పొదరిళ్ళయందును, బురదలేని నీరుగల నదులయందును, సరస్సుల యందును, తీర్థ ప్రదేశములయందును ఒంటరిగా తిరిగెను. 18

టీ:- పురేష్వితి. పుణ్యాని యాని ఉపవనాదీని తేషు కుంజేషు లతాది గూఢస్థానం అపంకాని తోయాని యేషాం తేషు సరిత్సు సరస్సు చ తీర్థేషు ఆయతనేషు చ క్షేత్రేషు చ. కీదృశేషు. అనంతస్య లింగైర్మూర్తిభిః సమ్యగలం కృతేషు. అనన్యః ఏకాకీ. 18

శ్లో॥ గాం పర్యటన్ మేధ్య వివిక్త వృత్తిః
సదాప్లుతోఽధశ్శయనోఽవధూతః ।
అలక్షితస్స్వైరవధూతవేషో
వ్రతాని చేరే హరితోషణాని ॥ 19

విదురుడు భారతదేశమునందలి తీర్థక్షేత్రములను తిరుగుచుండెను. పవిత్రములును, చెట్ల నుండి రాలినవియైన పళ్ళు మొదలగు వాటినే తినుచుండెడివాడు. సదా స్నానము చేయుచుండెడి వాడు. నేల మీదనే పడుకొనెడివాడు. తన వారు కూడా గుర్తు పట్టలేని విధంగా

టీ:- కించ. గామితి. గాం పర్యటన్ హరితోషణాని వ్రతాని చేరే ఆచరత్. మేధ్యా పవిత్రా వివిక్తా అసంకీర్ణా చ వృత్తిర్జీవికా యస్య సః సదాప్లుతః ప్రతితీర్థం స్నాతః. అధశ్శయనం యస్య. అవధూతః అసంస్కృతదేహః. అవధూతవేషః వల్కలాజినధారీ. అతఏవ స్వైరప్యలక్షితః. 19

యుండెడివాడు. విష్ణుప్రీతికరములైన వ్రతములను ఆచరించెడివాడు. (19)

శ్లో॥ ఇత్థం వ్రజన్ భారతమేవ వర్షం
కాలేన యావద్గతవాన్ ప్రభాసమ్ ।
తావచ్ఛశాస క్షితిమేక చక్రాం
ఏకాతపత్రామజితేన పార్థః ॥ 20

విదురుడు ఈ విధముగా భారతదేశములో మాత్రమే తిరుగుచు కొంత కాలమునకు ప్రభాసతీర్థము చేరెను. అప్పటికి ధర్మరాజు శ్రీకృష్ణుని అనుగ్రహము వలన ఏకచ్ఛత్రాధిపతిగా భూమండలమును పరిపాలించుచుండెను. 20

టీ:- ఇత్థమితి. ఏకస్యైవ చక్రం సైన్యం యస్యాం. ఏకమేవ రాజచిహ్నం శ్వేతాతపత్రం యస్యాం తాం. అజితేన శ్రీకృష్ణేన సహాయేన. 20

శ్లో॥ తత్రాథ శుశ్రావ సుహృద్వినష్టిం
వనం యథా వేణుజవహ్ని సంశ్రయమ్ ।
సంస్పర్ధయా దగ్ధమథానుశోచన్
సరస్వతీం ప్రత్యగియాయ తూష్ణీమ్ ॥ 21

వెదురు కర్రల పరస్పర రాపిడిచే పుట్టిన అగ్ని ఆ అడవినంతయు కాల్చివేయును. అట్లే కౌరవవంశీయులగు తన బంధువులు అన్యోన్య కలహముచే నశించినారని విదురుడు వినెను. ఈ దుఃఖవార్త విని ఏమియు మాటలాడకుండ సరస్వతీ నదీ తీరమునకు వెళ్ళెను. 21

టీ:- తత్రేతి. తత్రప్రభాసే. పరస్పరం స్పర్ధయా నిమిత్తభూతయా. సుహృదాం కౌరవాణాం వినష్టిం వినాశం అశృణోత్. పరస్పరనాశే దృష్టాంతః - వేణుజో వహ్నిః. సంశ్రయతే తద్వనం తద్యథా దగ్ధం భవతి తథా ప్రత్యక్పశ్చిమాభిముఖం యథా భవతి తథేత్యర్థః. 21

శ్లో॥ తస్యాం త్రితస్యోశనసో మనోశ్చ
పృథోరథాగ్నేరసితస్యవాయోః
తీర్థం సుదాసస్య గవాం గుహస్య
యచ్ఛ్రాద్ధదేవస్య స ఆసిషేవే ॥ 22

టీ:- తస్యామితి. తస్యాం సరస్వత్యాం త్రితాదీన్యేకాదశ తీర్థాని తత్తన్నామ్నా ప్రసిద్ధాని ఆసేవితవాన్. 22

శ్లో॥ అన్యాని చేహ ద్విజదేవదేవైః
కృతాని నానాయతనాని విష్ణోః ।
ప్రత్యంగ ముఖ్యాంకిత మందిరాణి
యద్దర్శనాత్కృష్ణ మనుస్మరంతి ॥ 23

టీ:- అన్యానీతి. ద్విజదేవైః ఋషిభిః దేవైశ్చ కృతాని. అంగమంగం ప్రతివర్తంత ఇతి ప్రత్యంగాని ఆయుధాని తేషు ముఖ్యం చక్రం తేనాంకితాని మూర్ధన్య హేమకుంభేషు చిహ్నితాని మందిరాణి యేషు

ఆ సరస్వతీ నదీ తీరమున మహానుభావులైన పదకొండుగురు పేర్లతో పదకొండు తీర్థములు కలవు. వారు 1. త్రితుడు 2. ఉశనుడు 3. మనువు 4. పృథువు 5. అగ్ని 6. అసితుడు 7. వాయుదేవుడు 8. సుదాసుడు 9. గోవులు 10. గుహుడు 11. శ్రాద్ధదేవుడు. విదురుడు పై పదకొండు తీర్థములను సేవించెను.(స్నానమాడెను). 22

అంతేగాకా మహర్షులచేత, దేవతలచేత ప్రతిష్ఠింపబడిన విష్ణ్వాలయములను విదురుడు సేవించెను. ఆ విష్ణు ఆయుధములలో ముఖ్యమైనది చక్రము. ఆలయ శిఖరములందుగల చక్రమును చూచినంతనే భక్తులు శ్రీకృష్ణుని స్మరింతురు. 23

తాని నానావిధాని శ్రీవిష్ణోరాయతనాని క్షేత్రాణి చ తీర్థాని చ ఆసిషేవే. యేషాం చక్రాంకిత మందిరవతాం దర్శనాత్ శ్రీకృష్ణం స్మరంతి. 23

శ్లో॥ తతస్త్వతివ్రజ్య సురాష్ట్రమృద్ధం
సౌవీరమత్స్యాన్ కురుజాంగలాంశ్చ ।
కాలేన తావద్యమునాముపేత్య
తత్రోద్ధవం భాగవతం దదర్శ ॥ 24

టీ:- తత ఇతి. అతివ్రజ్య అతిక్రమ్య. యావదుద్ధవః ప్రాప్తః - తావత్స్వయమపి యమునాముపేత్య. 24

విదురుడు ఆ తరువాత సమృద్ధమగు సౌరాష్ట్రమును, సౌవీరమును, మత్స్య, కురుజాంగల దేశములు దాటి యమునా నదీ తీరమును చేరుకొనెను. భగవద్భక్తుడగు ఉద్ధవుడు కనిపించేవరకు యమునాతీరమున నడిచెను. 24

శ్లో॥ స వాసుదేవానుచరం ప్రశాంతం
బృహస్పతేః ప్రాక్తనయం ప్రతీతం ।
ఆలింగ్య గాఢం ప్రణయేన భద్రం
స్వానామ పృచ్ఛద్భగవత్ప్రజానామ్॥ 25

టీ:- స ఇతి. స విదురః. ప్రాక్తనయం పూర్వశిష్యం నీతిశాస్త్రే. పాఠాంతరే ప్రాప్తో నయో నీతిశాస్త్రం యేన తం. ప్రతీతం ప్రఖ్యాతం. స్వానాం జ్ఞాతీనాం భద్రమపృచ్ఛత్. ప్రశ్నహేతుః - భగవతః ప్రజానాం పోష్యాణామ్. 25

ఉద్ధవుడు శ్రీకృష్ణుని అనుచరుడు. ప్రశాంతస్వభావము గలవాడు. ఒకప్పుడు బృహస్పతియొద్ద నీతిశాస్త్రమునభ్యసించిన శిష్యుడు. విదురుడు ఉద్ధవుని గట్టిగా కౌగిలించుకొని శ్రీకృష్ణుని ప్రజలను (సంతానము, పాలితులు, పోషింపబడేవారు) గూర్చిన క్షేమ సమాచారము అడిగెను. 25

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ కచ్చిత్పురాణౌ పురుషౌ స్వనాభ్య -
పాద్మానువృత్త్యేహ కిలావతీర్ణౌ ।
ఆసాత ఉర్వ్యాః కుశలం విధాయ
కృతక్షణౌ కుశలం శూరగేహే ॥ 26

టీ:- ప్రథమం తావద్రామకృష్ణయోః కుశలం పృచ్ఛతి కచ్చిదితి ప్రశ్నే స్వనాభౌ భవః స్వనాభ్యః పాద్మః బ్రహ్మ తస్యానువృత్త్యా ప్రార్థనయా ఇహావతీర్ణౌ కుశలమాసాతే వర్తేతే. కృతక్షణౌ స్వలోకం గంతుం దత్తావసరౌ సర్వేషాం కృతోత్సవావితి వా. తయోర్నిత్యకుశలత్వేఽపి ఉక్తవిశేషణవిశిష్టౌ శూరసేనస్య గృహే కచ్చిదాసాతే ఇతి ప్రశ్నః. 26

బ్రహ్మదేవుడు విష్ణుమూర్తి యొక్క నాభి కమలము నుండి పుట్టినవాడు. అట్టి బ్రహ్మ ప్రార్థింపగా విష్ణువు బలరామకృష్ణుల రూపమున అవతరించి భూభారమును తొలగించినాడు. అట్టి బలరామ కృష్ణులు శూరసేనుని గృహములో కుశలముగానున్నారా? అని విదురుడు ఉద్ధవుని అడిగెను. 26

శ్లో॥ కచ్చిత్కురూణాం పరమః సుహృన్నో
భామః స ఆస్తే సుఖమంగ శౌరిః ।
యో వై స్వసౄణాం పితృవద్దదాతి
వరాన్ వదాన్యో వరతర్పణేన ॥ 27

టీ:- యదూనాం కుశలం పృచ్ఛతి నవభిః. కచ్చిదితి. భామః పూజ్యః శౌరిః వసుదేవః. యద్వా భామో భగినీ భర్తా. కుంతీవసుదేవస్య భగినీ. అతో దేవకీ పాండోర్భగినీతి లోకస్య వ్యవహారః వరానర్థాన్. వదాన్యః అత్యుదారః. వరాణాం వస్తూనాం తర్పణేన సమ్మానేన సహ. 27

ఓ స్నేహితుడా! వసుదేవుడు కురువంశీయులకు మంచి స్నేహితుడు. కుంతీదేవి వసుదేవునికి సోదరి. అందువలననే దేవకి పాండురాజునకు భగిని యని లోకవ్యవహారము. అట్టి వసుదేవుడు తన తోబుట్టువులకు అభీష్టములగు వస్తువులను ఇచ్చుచు తండ్రివలె సంతోషపెట్టెడివాడు. ఉదారుడైన వసుదేవుడు కుశలముగానున్నాడా? (భామః అనుపదమునకు భావః అనుపాఠాంతరము కూడాకలదు). 27

శ్లో॥ కచ్చిద్వరూధాధిపతిర్యదూనాం
ప్రద్యుమ్న ఆస్తే సుఖమంగ వీరః ।
యం రుక్మిణీ భగవతోఽభి లేభే
ఆరాధ్య విప్రాన్స్మరమాదిసర్గే ॥ 28

టీ:- కచ్చిదితి. వరూధాధిపతిస్సేనానీః. ఆదిసర్గే పూర్వజన్మని స్మరం కామం సంతమభిలేభే పుత్రం లబ్ధవతీ. 28

మిత్రుడవగు ఓ ఉద్ధవా! వీరుడు, యాదవసేనానాయకుడగు ప్రద్యుమ్నుడు సుఖముగా నున్నాడా? బహుకాలము బ్రాహ్మణులను ఆరాధించిన శ్రీరుక్మిణీదేవి శ్రీకృష్ణుని వలన మన్మథుడైన ప్రద్యుమ్నుని పుత్రునిగా కన్నది. 28

శ్లో॥ కచ్చిత్సుఖం సాత్త్వత వృష్ణి భోజ
దాశార్హ కాణామధిప స్స ఆస్తే ।
యమభ్యషించచ్ఛతపత్రనేత్రో
నృపాసనాశాం పరిహృత్య దూరాత్ ॥ 29

టీ:- కచ్చిదితి. సాత్త్వతాదీనామధిపతిః ఉగ్రసేనః. శతపత్రనేత్రః శ్రీకృష్ణః. నృపాసనాశాం రాజ్యాభిలాషం పరిహృత్య శాపభయేన దూరాత్ స్థితమిత్యర్థః. 29

శతపత్రనేత్రుడైన శ్రీకృష్ణుడు పూర్వశాపభయము కారణముగా రాజ్యాధికారానికి దూరముగా ఉండి, ఉగ్రసేనుని మహారాజుగా అభిషేకించినాడు. అట్టి, సాత్త్వత, వృష్ణి, భోజ, దాశార్హవంశీయులగు యాదవులందరికి అధిపతియగు ఉగ్రసేనమహారాజు సుఖముగా నున్నాడా? ॥ 29 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ కచ్చిద్ధరే స్సౌమ్య సుతః సదృక్షః
ఆస్తేఽగ్రణీ రథినాం సాధు సాంబః
అసూత యం జాంబవతీ వ్రతాఢ్యా
దేవం గుహం యోఽంబికయా ధృతోఽగ్రే॥ 30

టీ:- కచ్చిదితి. హే సౌమ్య హరేస్సుతః తేన సదృక్షస్సదృశః సాధు యథాస్యాత్తథాసుఖమాస్తే. గుహం కార్తికేయం. అగ్రే పూర్వజన్మని యో భవాన్యా గర్భే ధృతః తం. 30

ప్రసన్నస్వభావము గల సౌమ్యుడవగు ఓ ఉద్ధవా! సాంబుడు శ్రీకృష్ణునకు అనురూపుడగు పుత్రుడు. రథికులలో అగ్రేసరుడు. పార్వతీపుత్రుడగు కుమారస్వామియే సాంబుడు. జాంబవతి అనేక వ్రతములను సలిపి సాంబుని పుత్రునిగా బడసినది. అట్టి సాంబుడు కుశలముగానున్నాడా? 30

శ్లో॥ క్షేమం స కచ్చిద్యుయుధాన ఆస్తే
యః ఫల్గునాల్లబ్ధ ధనూరహస్యః ।
లేభేఽంజసాఽధోక్షజ సేవయైవ
గతిం తదీయాం యతిభిర్దురాపామ్ ॥ 31

టీ:- క్షేమమితి. యుయుధానః సాత్యకిః. క్షేమం కుశలమాస్తే. ఫల్గునాత్ అర్జునాత్ లబ్ధం ధనుషో రహస్యం యేన. తదీయాం అధోక్షజ సంబంధినీం. 31

యుయుధాన్యుడే సాత్యకి. ఈ సాత్యకి అర్జునునివద్ద ధనుర్విద్యను నేర్చుకొన్నాడు. అట్టి సాత్యకి శ్రీకృష్ణుని మిక్కిలి సేవించినాడు. అట్టి సేవాఫలితముగా యతులకు కూడా పొందశక్యము కాని భాగవత(భగవత్) భక్తిని తేలికగా పొందినాడు. అటువంటి సాత్యకి క్షేమముగా నున్నాడా? 31

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ కచ్చిద్ బుధః స్వస్త్యనమీవ ఆస్తే
శ్వఫల్గు పుత్రో భగవత్ప్రపన్నః ।
యః కృష్ణపాదాంకిత మార్గపాంసు -
ష్వచేష్టత ప్రేమవిభిన్న ధైర్యః ॥ 32

టీ:- కచ్చిదితి. శ్వఫల్గుపుత్ర అక్రూరః. బుధో విద్వాన్. అతో భగవంతం ప్రపన్నః అనుసృతః.అతఏవ అనమీవః నిష్పాపః. భక్తౌ లింగమేతత్. అచేష్టత. వ్యలుఠత్. ప్రేమ్ణా విభిన్నం విదీర్ణం ధైర్యం యస్య సః. స్వస్తి క్షేమమాస్తే. 32

అక్రూరుడు శ్వఫల్గుని పుత్రుడు, పాపరహితుడు, భగవంతుని శరణుపొందినవాడు. ఈ లోకములో భగవంతుని శరణుపొందినవాడే బుధుడు. (పండితుడు) (అక్రూరుడు పండితుడని భావము) అతడు మార్గములందు ధూళిలో శ్రీకృష్ణుని పాదచిహ్నములను చూచి పెల్లుబికిన ప్రేమచేత ధైర్యము సడలినవాడై ఆ ధూళిలోనే పొరలాడినాడు. ఇట్టి అక్రూరుడు కుశలముగానున్నాడా? 32

శ్లో॥ కచ్చిచ్ఛివం దేవకభోజ పుత్ర్యా
విష్ణుప్రజాయా ఇవ దేవమాతుః ।
యా వై స్వగర్భేణ దధార దేవం
త్రయీ యథా యజ్ఞవితానమర్థమ్ ॥ 33

టీ:- కచ్చిదితి. దేవకనామా యో భోజః తస్య పుత్ర్యాః దేవక్యాః. విష్ణుః ప్రజా పుత్రో యస్యాః తస్యాః దేవమాతురదితేరివ. కచ్చిచ్ఛివం. యజ్ఞవితానరూపమర్థం త్రయీ యథా ప్రకాశకతయా బిభర్తి దధార. 33

దేవమాతయైన అదితి వంటిది దేవకి. ఆమె భోజవంశీయుడైన దేవకుని పుత్రిక. దేవకి శ్రీమహావిష్ణువునే సంతానముగా పొందిన ధన్యురాలు. వేదము(త్రయీ) తనలో యజ్ఞ ప్రక్రియా సంబంధ జ్ఞానమును ధరించినట్లే దేవకి శ్రీకృష్ణుని గర్భమునందు ధరించినది. అట్టి దేవకి కుశలముగానున్నదా? 33

శ్లో॥ అపిస్విదాస్తే భగవాన్ సుఖం
వో యత్సాత్త్వతాం కామదుఘోఽనిరుద్ధః ।
యమామనంతి స్మ హ శబ్దయోనిం
మనోమయం సత్త్వతురీయతత్త్వం॥ 34

టీ:- అపిస్విదితి. సాత్త్వతానాముపాసకానాం కామాన్ దోగ్ధి పూరయతీతి కామదుఘః భగవత్త్వే హేతుః. యం శబ్దస్య శాస్త్రస్య యోనిం కారణమామనంతి వేదాః. కుతః? మనోమయం మనసః ప్రవర్తకం. తత్కుతః? సత్త్వస్యాంతఃకరణస్య చతుర్విధస్య తురీయం తత్త్వం చతుర్థమధిదైవం. చిత్తాహంకార బుద్ధి మనసామంతఃకరణ భేదానాం క్రమేణ వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధా హ్యధిష్ఠాతారః. మనసశ్చ శబ్దయోనిత్వం ప్రసిద్ధం. తథా చ శ్రుతిః. తథాచ శ్రుతిః. "మనః పూర్వరూపం వాగుత్తరరూపం ఇతి. తథా "అన్యోంతర ఆత్మా మనోమయ" ఇతి ప్రస్తుత్య "తస్య యజురేవ శిరః. ఋగ్దక్షిణః పక్షః సామోత్తరః పక్షః" ఇత్యాది శ్రుతేః. తథా చ శిక్షాయాం, శ్లో."ఆత్మా బుద్ధ్యా సమేత్యర్థాన్ మనో యుఙ్క్తే వివక్షయా ,మనః కాయాగ్నిమాహంతి స ప్రేరయతి మారుతమ్ ." మూరుతస్తూరసి చరన్మంద్రం జనయతి స్వర"మిత్యాది. 34

అనిరుద్ధుడు యదువంశీయులకు, భక్తులకు కోరికలను ఇచ్చువాడు(తీర్చువాడు). "మనః పూర్వ రూపం. వాగుత్తర రూపం" అనునట్లు మనస్సు యొక్క ఉత్తరరూపము వాక్కు. వాక్కుకు మూలరూపం మనస్సు. అంతఃకరణము 1.చిత్తము 2.అహంకారము 3.బుద్ధి 4.మనస్సు అని నాలుగు భేదములుగా యుండును. ఈ నాల్గింటికి వరుసగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు అధిష్ఠాతలు అని మహాత్ములు చెప్పుచున్నారు. అట్టి మనస్సుకు అధిష్ఠాత అయిన అనిరుద్ధుడు క్షేమముగానున్నాడా? 34

శ్లో॥ అపిస్విదన్యే చ నిజాత్మదైవమన
న్యవృత్యా సమనువ్రతా యే ।
హృదీకసత్యాత్మజ చారుదేష్ణ గదా
దయ స్స్వస్తి చరంతి సౌమ్య ॥ 35

టీ:- అపిస్విదితి. అపిస్విదన్యే చ స్వస్తి చరంతి. నిజస్య దేహాది వ్యతిరిక్తస్యాత్మనో దైవం శ్రీకృష్ణం అనన్యవృత్యా ఏకాంతభావేన సమ్యగనువ్రతాః అనుసృతాః. హృదికశ్చ సత్యభామాయా ఆత్మజశ్చ చారుదేష్ణశ్చ గదశ్చ ఆదిర్యేషాం తేఽపి. 35

ఓ ఉద్ధవా! హృదీకుడు, సత్యభామాపుత్రుడగు చారుధేష్ణుడు, గదుడు మొదలగు ఇతరులు కుశలముగా సంచరించుచున్నారా? వారు తమ ఆత్మదైవమగు శ్రీకృష్ణుని ఏకాంతభావముతో అనుసరించు చుందురు. 35

శ్లో॥ అపి స్వదోర్భ్యాం విజయాచ్యుతాభ్యాం
ధర్మేణ ధర్మః పరిపాతి సేతుమ్ ।
దుర్యోధనోఽతప్యత యత్సభాయాం
సామ్రాజ్యలక్ష్మ్యా విజయానువృత్త్యా ॥ 36

టీ:- ఇదానీం కురూన్ పృచ్ఛతి షడ్భిః. అపీతి. అపి కిం. స్వదోర్భ్యాం స్వబాహువద్వర్తమానాభ్యాం విజయాచ్యుతాభ్యాం అర్జునకృష్ణాభ్యాం ధర్మమార్గేణ ధర్మో యుధిష్ఠిరః సేతుం ధర్మమర్యాదాం పరిపాతి. యస్య సభాయాం విజయానువృత్త్యా జయపరంపరయా, అర్జునస్య సేవయేతి వా. ఏవంభూతం యస్యైశ్వర్యమిత్యర్థః. 36

విదురుడు యాదవుల క్షేమమడిగిన పిదప కురువంశీయుల క్షేమము అడుగుచున్నాడు. కృష్ణార్జునులు ధర్మరాజుకు రెండు భుజముల వంటివారు. ధర్మరాజు ఆ కృష్ణార్జునుల సహాయముతో లోకమర్యాదను నిలబెడుతూ ధర్మబద్ధముగా పరిపాలిస్తున్నాడా? ఆయనకు గల మయసభావైభవమును, ప్రతాపమును జూచి దుర్యోధనుడు ఈర్ష్యతో చాల దుఃఖపడెను. 36

శ్లో॥ కిం వా కృతాఘేష్వఘమత్యమర్షీ
భీమోఽహివద్దీర్ఘతమం వ్యముంచత్ ।
యస్యాంఘ్రిపాతం రణభూర్న సేహే
మార్గం గదాయాశ్చరతో విచిత్రం॥ 37

టీ:- కిమితి. కృతాఘేషు కృతాపరాధేషు కురుషు స్వకర్తృకమఘం దీర్ఘతమం బహుకాలానుచింతితం, అహివదత్యమర్షీ భీమః కిం వ్యముంచత్ నో వా. గదయా సః విచిత్రం వివిధం మార్గం చరతః. (37)

అపరాధులయందు మిక్కిలి అసహనము గల భీముడు పామువలె చాలాకాలము పగబట్టేవాడు. చిత్రవిచిత్రంగా గదను త్రిప్పుతూ సంచరిస్తూ ఉంటే అతని కాళ్ళ త్రొక్కిడులను రణభూమి సహించలేదు. అట్టి భీముడు కోపమును విడిచిపెట్టినాడా? లేదా?37

శ్లో॥ కశ్చిద్యశోధా రథయూథపానాం
గాండీవధన్వోపరతారరాస్తే ।
అలక్షితో యచ్ఛరకూటగూఢో
మాయాకిరాతో గిరిశస్తుతోష ॥ 38

టీ:- కచ్చిదితి. కథయూథపానాం మధ్యే యశోధాః కీర్తిధారీ. యద్వా స్వీయానాం తేషాం కీర్తిప్రదః. ఉపరతాః అరయో యస్మాత్. యస్య శరకూటేన బాణసమూహేన గూఢః ఆచ్ఛన్నః. 38

మహారథులలో మరియు సేనానాయకులలో అర్జునుడు గొప్పవాడు. అతడు గొప్పకీర్తి కలవాడు. గాండీవధారి. అతడు శత్రువులను నిర్మూలించి ప్రశాంతముగానున్నాడా? కైలాసవాసియగు శంకరుడు మాయాకిరాతుడై వచ్చినప్పుడు అర్జునుడు అతడిని బాణములతో కప్పివేసెను. అందుకు శంకరుడు సంతోషించెను. 38

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ యమావుత స్విత్ స్తనయౌ పృథాయాః
పార్థైర్వృతౌ పక్ష్మభిరక్షిణీవ ।
రేమాత ఉద్దాయ మృధే స్వరిక్థం
పరాత్ సుపర్ణావివ వజ్రివక్త్రాత్ ॥39

టీ:- యమావితి. ఉతస్విత్కింస్విత్. యమౌ నకులసహదేవౌ రేమాతే క్రీడతే ఇత్యర్థః. సపత్న్యాస్సుతావపి పృథాయాః స్తనయౌ పృథాయాః పుత్రైః ఆవృతౌ. సుపర్ణావివ రేమాతే. కిం కృత్వా. పరాద్దుర్యోధనాత్ స్వరిక్థం స్వీయం రాజ్యం ఉద్దాయ ఆచ్ఛిద్య. వజ్రివక్త్రాత్ ఇంద్రస్య ముఖాత్ - స్వరిక్థమమృతం గరుడ ఇవేతి. యద్వా సుపర్ణావివేతి. యది ద్వౌగరుడౌ అమృతమానయేతాం తర్హి తద్వత్. అక్షిణీవేతి మనీవాదిగణత్వాత్సంధిః 39

నకుల సహదేవులను కుంతియే పెంచెను. పృథా పుత్రులగు ధర్మరాజ, భీమ, అర్జునులు ఆ కవలలను కంటిని రెప్పలవలె కాపాడేవారు. జంట గరుడ పక్షులు ఇంద్రని నోటి నుండి అమృతమును లాగుకున్నట్లు దుర్యోధనుడి నుండి స్వరాజ్య భాగమును లాగుకొనిన నకుల సహదేవులు సుఖముగానున్నారా? 39

శ్లో॥ అహో పృథాపి ధ్రియతేऽర్భకార్థే రాజర్షివర్యేణ వినాపి తేన ।
యస్త్వేకవీరోऽధిరథో విజిగ్యే ధనుర్ద్వితీయః కకుభశ్చతస్రః ॥40

టీ:- పృథాయాః కుశలం కిం పృచ్ఛేయం? యతః తస్యా పాండుం వినా ప్రాణధారణమత్యాశ్చర్యమిత్యాహ అహో ఇతి. ధ్రియతే జీవతి న చాత్యాశ్చర్యం. యతోऽర్భకార్థే ధ్రియతే న భోగార్థం. తదప్యాశ్చర్య మేవేత్యాహ. తేన తథా భూతేన వినా. తదేవాహ - యస్త్వితి. ధనురేవ ద్వితీయః సహాయో యస్య. 40

రాజర్షి అయిన పాండురాజు ధనుస్సు మాత్రమే తోడుగలవాడై నాలుగు దిక్కులను జయించెను. ఆయన భార్యయైన కుంతీదేవి కుశలము గూర్చి ఏమి అడుగవలెను? భర్తతో సహగమనము చేయకుండా ఆమె పాండురాజును విడిచి జీవించియుండుట ఆశ్చర్యము కదా! కుంతి కేవలము పుత్రరక్షణార్థమే జీవించినది. భోగము ననుభవించుట కొరకు కాదు. 40

శ్లో॥ సౌమ్యానుశోచే తమధః పతంతం
భ్రాత్రే పరేతాయ విదుద్రుహే యః ।
నిర్యాపితో యేన సుహృత్స్వపుర్యా
అహం స్వపుత్రాన్ సమనువ్రతేన॥ 41

టీ:- సౌమ్యేతి. పృథా అర్భకార్థే జీవతీతి యుక్తమేవ. హే సౌమ్య, తం ధృతరాష్ట్రం జీవంతమనుశోచామి. తత్కిమ్. అధః పతంతం తత్ర హేతుః-పరేతాయ మృతాయ భ్రాత్రే పాండవే. తత్పుత్రద్రోహేణ యో విదుద్రుహే ద్రోహం కృతవాన్. కించ జీవతోఽపి భ్రాతుర్మమ అపకృత వానిత్యాహ. యేన సుహృత్భ్రాతా అహంచ స్వపుర్యాస్సకాశాత్ నిర్వాపితః నిర్వాసితః. 41

సౌమ్యుడవగు ఓ ఉద్ధవా! అధోగతి నొందుచున్న ఆ ధృతరాష్ట్రుని గూర్చి దుఃఖించుచున్నాను. ఆ ధృతరాష్ట్రుడు మరణించిన తన సోదరుడగు పాండురాజునకు ద్రోహము చేసినాడు. కొడుకులు చెప్పిన మాటను వినుటయే వ్రతముగా గలిగియున్నాడు. ఆయన హితమును కోరిన నన్ను కూడా తన నగరము నుండి వెడలగొట్టినాడు. 41

శ్లో॥ సోఽహం హరేర్మర్త్యవిడంబనేన
దృశో నృణాం చాలయతో విధాతుః।
నాన్యోపలక్ష్యః పదవీం ప్రసాదాత్
చరామి పశ్యన్ గత విస్మయోఽత్ర ॥ 42

టీ:- అహో ఖలు విస్మయః. జానతోఽపి తస్యైవం దుశ్చేష్టితం, యతస్త్వం చ సాధురపి దుఃఖం ప్రాప్తోఽసీత్యత ఆహ. స ఇతి.

దుర్యోధనుని చేత వెడలనడుపబడిన నేను(విదురుడు) శ్రీకృష్ణుని అనుగ్రహము పొందినాను. శ్రీకృష్ణుడు మానవాకారము దాల్చి మానవుల మనోవృత్తులకు భ్రమను కలిగించుచున్నాడు. నేను విస్మయము లేనివాడనై, ఇతరులచే తెలియబడనివాడనై తిరుగు చున్నాను. శ్రీకృష్ణానుగ్రహము చేతనే మాయ తొలగును. ఆ కృష్ణానుగ్రహము చేతనే భ్రమలేనివాడనై యున్నాను. 42

సోఽహం శ్రీహరేః ప్రసాదాత్తస్య పదవీం మాహాత్మ్యం పశ్యన్ గతవిస్మయః. అత్ర భూతలే నాన్యోపలక్ష్యః గూఢస్సన్ సుఖం విచరామి. కథంభూతస్య. మర్త్యానాం విడంబనేన ఐశ్వర్యాచ్ఛాదకేన. మనుష్యాను కరణేన నృణాం దృశః చిత్తవృత్తిః చాలయతః భ్రామయతః. 42

శ్లో॥ నూనం నృపాణాం త్రిమదోత్పథానాం
మహీం ముహుశ్చాలయతాం చమూభిః ।
వధాత్ప్రపన్నార్తి జిహీర్షయేశోఽ
ప్యుపైక్షతాఘం భగవాన్ కురూణామ్ ॥ 43

టీ:- నను శ్రీహరేః కిమేవం లీలయా యేన స్వభక్తానాం చ వనవాసాదిక్లేశా భవంతి. స్వస్య చ దూత్యబంధనోద్యమాదిపరాభవః. తతః పరం తేషామపారాధానంతరమేవ హననం. నాపరాధ ఉపేక్ష్య ఇత్యత ఆహ నూనమితి. నూనం వినిశ్చితం. త్రిభిర్మదైః ఉత్పథానాం ఉద్వృత్తానాం వధాద్ధేతోః ప్రపన్నానామార్తిజిహీర్షయా ఈశోఽప్య ఘసమయ ఏవ. హంతుం సమర్థోఽపి కురూణాం అఘం ఉపైక్షత. తదానీమేవ తేషాం వధే సర్వదుష్టరాజన్యవధో న స్యాదిత్యాశయేనేత్యర్థః శ్లో. "విద్యామదో ధనమదస్తథైవాభిజనో మదః,ఏతే మదా మదాంధా నామేత ఏవ సతాం దమాః" ఇతి త్రయోమదాః.43

"విద్యామదో ధనమదస్తథైవాభిజనో మదః ఏతే మదా మదాంధా నామేత ఏవ సతాం దమాః" విద్య, ధనము, కులము, దుర్మార్గులకు మదమును కలిగించగా సత్పురుషులకు దమమును కలిగించును. శ్రీకృష్ణుడు స్వభక్తులగు పాండవులు జూదములో ఓడిన నెపముగా వనవాసాది క్లేశములను పోందుట చూచియు ఊరుకున్నాడు.ఏక కాలములో దుష్టశిక్షణ,శిష్టరక్షణ శ్రీకృష్ణోద్దేశ్యము. మదాంధులైన రాజులు దుర్మార్గులై మాటి మాటికి సైన్యములను నడిపి భూమికి బాధను కల్గించుచున్నారు. అట్టి దుర్మార్గులైన రాజులను సంహరింప జేసి తనను శరణుగోరిన పాండవులను రక్షింపదలచెను. అందుకే సమర్థుడయ్యును కౌరవులను ఉపేక్షంచుచున్నాడనిపించుచున్నది. 43

శ్లో॥ అజస్య జన్మోత్పథనాశనాయ
కర్మాణ్యకర్తుర్గ్రహణాయ పుంసామ్ ।
నన్వన్యథా కోఽర్హతి దేహయోగం
పరోఽగుణానాముత కర్మతంత్రమ్॥ 44

టీ:- సర్వదుర్వృత్తవధార్థమేవ భగవతో జన్మకర్మాణి నాన్యథేతి కౌముతికన్యాయేనాహ. అజస్యేతి- అజస్యాపి జన్మ, అకర్తురపి కర్మాణి పుంసాం గ్రహణాయ కర్మసు ప్రవృత్తయే అన్యథా న చేదేవం తర్హి భగవతో జన్మాదికథా తావదాస్తాం. కో వాన్యోఽపి గుణానాం పరో గుణాతీతః దేహయోగం కర్మవిస్తారం చార్హతీతి. 44

శ్లో॥ తస్య ప్రపన్నాఖిల లోకపానామవ స్థితానామనుశాసనే స్వే ।
అర్థాయ జాతస్య యదుష్వజస్య వార్తాం సఖే కీర్తయ తీర్థకీర్తేః ।45

టీ:- తస్మాదేవం భూతాచింత్య మాయా వినోదన కథాః కథయేత్యాహ - తస్యేతి. ప్రపన్నాః యేఅఖిలలోకపాలాః తేషామన్యేషాం చ స్వీయే అనుశాసనే స్థితానాం అర్థాయ ప్రయోజనాయ. యదుషు జాతస్య తీర్థభూతా సంసారతారణీ కీర్తిర్యసేతి. 45

శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,

ప్రథమోఽధ్యాయః

భగవంతుడు భక్తులయందు ఎంతటి దయ కనపరుచునో ఇచ్చట తెలియుచున్నది. భగవంతుడు దుష్టశిక్షణార్థమై తాను జన్మ రహితుడైనను జన్మకర్మలను పొందుచున్నాడు. గుణాతీతుడగు (జ్ఞానియైన) మానవుడే దేహసంబంధమును ఇష్టపడడు. భగవంతుడు మానవులను ఆకర్షించుటకు(ఉద్ధరించుటకు) కాక మరెందులకు జన్మ కర్మలను పొందును? 44

ఓ సఖుడా! ఇంద్రాది లోకపాలురందరును ఆయన ఆజ్ఞ యందుందురు. వారు శరణువేడగా వారి కార్యములను నెరవేర్చుటకై పుట్టుక లేని శ్రీకృష్ణభగవానుడు యాదవకులమందు పుట్టినాడు. అట్టి పరమపవిత్రమగు కీర్తిగల శ్రీకృష్ణుని వృత్తాంతము చెప్పమని (కీర్తింపుమని) విదురుడు ఉద్ధవుని కోరుచున్నాడు. 45

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు

మొదటి అధ్యాయము సమాప్తము.

ద్వితీయో௨ధ్యాయః

శ్లో ॥ 'ద్వితీయే కృష్ణవిశ్లేషాదనుశోచన్నథోద్ధవః।
క్షత్త్రే బాలచరిత్రాణి కృష్ణస్యావర్ణయచ్ఛ్వసన్' ॥

శ్రీశుక ఉవాచ

శ్లో ॥ ఇతి భాగవతః పృష్టః క్షత్త్రా వార్తాం ప్రియాశ్రయామ్ ।
ప్రతివక్తుం న చోత్సేహ ఔత్కంఠ్యాత్ స్మారితేశ్వరః ॥ 1

టీ:- తదేవం ప్రియవార్తాం పృష్టస్యోద్ధవస్య శ్రీకృష్ణవిరహౌత్కంఠ్యావేశేన ప్రతివచనాసామర్థ్యమాహ షడ్భిః. స్మారితః ఈశ్వరో యస్య. 1

శ్లో ॥ యః పంచహాయనో మాత్రా ప్రాతరాశాయ యాచితః ।
తన్నైచ్ఛద్రచయన్ యస్య సపర్యాం బాలలీలయా ॥2

టీ:- ఏతదేవ కైముతికన్యాయేన వక్తుం కైశోరం ప్రపంచయతి య ఇతి ద్వాభ్యాం. యః పంచవర్షో௨పి బాలలీలయా శ్రీకృష్ణం కంచిత్పరికల్ప్య కల్పితైరేవ సాధనైః పరిచర్యాం కుర్వన్ ప్రాతర్భోజనార్థం మాత్రా ప్రార్థితో௨పి తద్భోజనం నైచ్ఛత్. 2

2 వ అధ్యాయము

శ్రీశుకమహర్షి ఇట్లు పలికెను.

ద్వితీయాధ్యాయమునందు ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఎడబాటునకు మిక్కిలి శోకించెను. శ్రీకృష్ణుని బాలలీలలను వర్ణించెను. విదురుడు భగవద్భక్తుడగు ఉద్ధవుని శ్రీకృష్ణుని సమాచారము గురించి ప్రశ్నించెను. కాని శ్రీకృష్ణ విరహము వలన, కృష్ణుని యందుగల అధికప్రేమ వలన ఉద్ధవుడు సమాధానము చెప్పలేకపోయెను. ఈ ఆరు శ్లోకములలో శ్రీకృష్ణస్మరణ కలదు. 1

కైముతికన్యాయము ప్రకారము రెండు శ్లోకములలో కిశోరదశను స్మరించుచున్నాడు. అప్పటికి ఉద్ధవునకు అయిదుసంవత్సరముల వయస్సు. బాలక్రీడగా ఉద్ధవుడు శ్రీకృష్ణునియొక్క మూర్తిని కల్పించుకొని పూజచేయుచుండెను. తల్లి ప్రాతర్భోజనమునకు పిలుచుచున్నను తాను చేయుచున్న శ్రీకృష్ణసేవను విడిచివెళ్ళుటకు ఇష్టపడలేదు. 2

శ్లో ॥ స కథం సేవయా తస్య కాలే న జరసం గతః ।
పృష్టో వార్తాం ప్రతిబ్రూయాద్భర్తుః పాదావనుస్మరన్ ॥ 3

టీ:- స ఇతి. జరసం వృద్ధత్వం గతః ప్రాప్తః. 3

ఉద్ధవుడు దీర్ఘకాలము నుండి శ్రీకృష్ణుని సేవిస్తూ వృద్ధుడైనాడు. శ్రీకృష్ణుని గురించి ప్రశ్నించగానే, ఉద్ధవుడు తన ప్రభువు పాదములను స్మరించినాడు. అట్టి ఉద్ధవుడు ఎట్లు సమాధానం చెప్పగలడు? 3

శ్లో ॥ స ముహూర్తమభూత్తూష్ణీం కృష్ణాంఘ్రిసుధయా భృశమ్ ।
తీవ్రేణ భక్తియోగేన నిమగ్నస్సాధునిర్వృతః ॥ 4

టీ:- సఇతి. కృష్ణాంఘ్రిసుధయా సాధు నిర్వృతః. తస్యామేవ తీవ్రేణ వివశత్వాపాదకేన భక్తియోగేన భృశం నిమగ్నశ్చ. 4

శ్రీకృష్ణుని పాదస్మరణ అనెడి అమృతమును ఆస్వాదించినాడు ఉద్ధవుడు. తీవ్రమైన భక్తిలో మునిగి గొప్ప ఆనందముననుభవించినాడు. అట్టి స్థితిలో నున్న ఉద్ధవుడు ఒక ముహూర్తకాలము మౌనముగా నున్నాడు. 4

శ్లో ॥ పులకోద్భిన్న సర్వాంగో ముంచన్మీలద్దృశా శుచః ।
పూర్ణార్థో లక్షితస్తేన స్నేహ ప్రసరసంప్లుతః ॥ 5

టీ:- పులకేతి. పులకైరుద్భిన్నాని ఉజ్జృంభితాని సర్వాణ్యంగాని యస్య సః. మీలంత్యా దృశా శుచోఽశ్రూణి ముంచన్. తేన విదురేణ పూర్ణార్థః కృతార్థో లక్షితః. యతో భగవతి యః స్నేహః తస్య ప్రసరః పూరః తస్మిన్ సంప్లుతో నిమగ్నః. 5

ఉద్ధవుని దేహమంతయు పులకాంకురములతో నిండిపోయెను. ఆయన కన్నులు మూయుచు ఆనందాశ్రువులను విడుచుచుండెను. ప్రేమ ప్రవాహములలో మునిగి పోయెను. అట్టి ఉద్ధవుడు కృతార్థుడు గదాయని విదురుడు తలచెను. 5

శ్లో ॥ శనకైర్భగవల్లోకాన్ నృలోకం పునరాగతః ।
విమృజ్య నేత్రే విదురం ప్రత్యాహోద్ధవ ఉత్స్మయన్ ॥ 6

టీ:- శనకైరితి. భగవానేవ లోకః తస్మాత్. నృలోకం దేహానుసంధానం. ఉత్స్మయన్ యదుకుల సంహారాది భగవచ్చాతుర్య స్మరణేన విస్మయం ప్రాప్నువన్. 6

ఉద్ధవుడు నెమ్మదిగా భగవల్లోకము నుండి మనుష్య లోకమునకు తిరిగివచ్చెను. భగవత్ చింతనయే లోకమైయున్నది భగవల్లోకము. దేహాత్మభావము గల లోకము మనుష్యలోకము. దుష్టశిక్షణతో బాటు యదుకుల సంహారాది భగవల్లీలను స్మరిస్తూ నెమ్మదిగా కన్నులు తెరచుచు మిక్కిలి విస్మయము నొందుచు విదురునితో ఇట్లనెను. 6

ఉద్ధవ ఉవాచ

శ్లో ॥ కృష్ణద్యుమణి నిమ్లోచే గీర్ణేష్వజగరేణ హ ।
కిన్ను నః కుశలం బ్రూయాం గతశ్రీషు గృహేష్వహమ్ ॥ 7

టీ:- శ్రీకృష్ణవిరహేణ సంపత్యమానః ప్రత్యాహ కృష్ణేతి. కృష్ణఏవ ద్యుమణిః సూర్యః తస్య నిమ్లోచే అస్తమయే సతి. అజగరేణ కాల మహాసర్పేణ గీర్ణేషు నిగిలితేషు నో గృహేషు త్వత్పృష్టానాం బంధూనాం కిం ను కుశలం బ్రూయాం? 7

ఉద్ధవుడు పలికెను

శ్రీకృష్ణుని విరహము చేత సంతాపపడుచు ఉద్ధవుడు ఇట్లు పలికెను; కృష్ణుడనే సూర్యుడు అస్తమించినాడు. కాలమనే కొండచిలువ, సంపదలు నశించిన మా గృహములను మ్రింగినది. ఇట్టి స్థితిలో నేనేమి కుశల సమాచారము చెప్పగలను. 7

శ్లో ॥ దుర్భగో బత లోకోఽయం యదవో నితరామపి ।
యే సంవసంతో న విదుర్హరిం మీనా ఇవోడుపమ్ ॥ 8

ఉద్ధవుడు శోకిస్తూ, ఈ లోకము ఎంతటి దౌర్భాగ్యమైనదో కదా అన్నాడు. అయ్యో! యాదవులు మరింత భాగ్యహీనులు గదా! క్షీర సముద్రములో పుట్టిన చంద్రుణ్ణి అచటి చేపలు అందమైన

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య

టీ:- అనుశోచన్నాహ దుర్భగఇతి. బతేత్యనుకంపాయాం. ఖేదే వా. అయం లోకో జనః. దుర్భగః భాగ్యహీనః. యాదవస్తు నితరాం దుర్భగాః యేన సహ వసంతో௨పి హరిరయమితి న విదుః. యథా క్షీరసముద్రే జాతముడుపం చంద్రం. తదా తత్రత్యామీనాః కేవలం కమనీయః కశ్చిజ్జలచర ఇత్యేవం విదుః. న త్వమృతమయ ఇతి తద్వత్. యద్వా జలే ప్రతిబింబితం చంద్రం. యథేతి. 8

జలచరముగానే గుర్తించినట్లు, యాదవులు తమతో కలిసి మెలిసి జీవించియున్న శ్రీకృష్ణుని యాదవశ్రేష్ఠునిగానే గుర్తించిరి. అంతేగాని శ్రీహరిగా గుర్తింపజాలకుండిరి. యాదవుల విషయములో జాలితో "అయ్యో" (బత) అన్నాడు. 8

శ్లో॥ ఇంగితజ్ఞాః పురుప్రౌఢా ఏకారామాశ్చ సాత్వతాః ।
సాత్వతామృషభం సర్వే భూతావాసమమంసత ॥ 9

టీ:- భాగ్యహీనత్వాదేవ న విదుః న తు జ్ఞానసామగ్ర్యభావాదిత్యాహ ఇంగితజ్ఞాన ఇతి. ఇంగితం చిత్తస్థం జానంతీతి తథా. పురు అతిశయేన ప్రౌఢా నిపుణాః. ఏకస్మిన్నేవ స్థానే ఆరమంతీతి తథా. ఏవంభూతా అపి భూతానామావాసం. ఈశ్వరం సంతం సాత్త్వతానామృషభం సాత్త్వత శ్రేష్ఠమమన్యంత అమన్యంత. 9

ఇతరుల మనస్సులోని విషయము తెలిసికొనుట ఇంగితజ్ఞత. యాదవులు ఇంగితజ్ఞులు. యాదవులు ప్రౌఢులు (నిపుణులు). ఐనప్పటికి కేవల భాగ్యహీనతచేతనే శ్రీకృష్ణుడు సర్వాంతర్యామి, సర్వ ప్రాణుల యందు నివసించే పరమాత్మయని తెలిసికొనలేకపోయిరి. యాదవులు శ్రీకృష్ణునితో కలిసి ఒకే స్థలమునందు ఉంటూ ఆనందించిరి. వారు శ్రీకృష్ణుని కేవలము యాదవశ్రేష్ఠునిగా మాత్రమే తలపోసిరి. 9

శ్లో॥ దేవస్య మాయయా స్పృష్టా యే చాన్యదసదాశ్రితాః ।
భ్రామ్యతే ధీర్న తద్వాక్యైరాత్మన్యుప్తాత్మనో హరౌ ॥ 10

యాదవులు భగవన్మాయామోహితులు. కృష్ణుడు మా బంధువు. మా కులస్థుడైన యాదవుడు అని తలచి మాట్లాడేవారు. శిశుపాలాదులు వైరభావముతో మాట్లాడేవారు. పరమాత్మయైన శ్రీకృష్ణుని యందు

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

టీ:- యే యాదవాః దేవమాయయా వ్యాప్తాః. యాదవోఽయమస్మద్బంధురితి వదంతి. యే చ శిశుపాలాదయఃఅసదేవాన్యదత్యంతం వైరమాశ్రితాః నిందంతి. తేషాం వాక్యైరాత్మని ఉప్తాత్మనో నిక్షిప్త చిత్తస్య మాదృశస్య ధీః శుద్ధిః న భ్రామ్యతే మోహం న ప్రాప్నోతి అన్యే తు మూఢా ఏవేత్యర్థః. 10

అంతఃకరణమును సమర్పించిన భక్తునకు యాదవులమాటలు గాని, శిశుపాలాదుల మాటలు గాని భ్రాంతిని కలిగింపజాలవు. 10

శ్లో॥ ప్రదర్శ్యాతప్తతపసామవితృప్తదృశాం నృణామ్ ।
ఆదాయాంతరధాద్యస్తు స్వబింబం లోకలోచనం ॥ 11

టీ:- కోఽసౌ హరిరిత్యపేక్షాయామాహ ప్రేతి. న తప్తం తపోయైః అతః అవితృప్తా దృశో యేషాం తేషాం స్వబింబం శ్రీమూర్తిం ఏతావంతం కాలం ప్రదర్శ్య దర్శయిత్వా యోఽంతర్హితవాన్. లోకస్య లోచనమాదాయ ఆచ్ఛిద్య. తాదృశస్యాన్యస్య విలోకనీయస్యాభావాత్. 11

శ్రీకృష్ణుడు తపస్సు చేయని వారలకు గూడ త్రిలోకసుందరమగు తన రూపమును చూపించెను. ఆ కృష్ణరూప సందర్శనములో వారింకా తృప్తిచెందలేదు. అట్టి జనుల చూపును తనతో తీసుకపోయినాడా అన్నట్లు శ్రీకృష్ణుడు తనరూపమును ఉపసంహరించుకొని అంతర్ధానమైనాడు. 11

శ్లో॥ యన్మర్త్యలీలౌపయికం స్వయోగ
మాయాబలం దర్శయతా గృహీతమ్
విస్మాపనం స్వస్య చ సౌభగర్ధేః
పరం పదం భూషణ భూషణాంగమ్ ॥ 12

శ్రీకృష్ణుని సౌందర్యరూపమును ఈ మూడు శ్లోకములతో వర్ణించుచున్నాడు. శ్రీకృష్ణుడు తన యోగమాయా ప్రభావమును చూపించుటకై మానవలీలలకు యోగ్యమైన రూపమును, స్థానమును పొందినాడు. కృష్ణుని రూపసౌందర్యము కృష్ణునికే ఆశ్చర్యము కలిగించేదిగా ఉండెను. ఆ రూపము సౌభాగ్య సమృద్ధమై యుండెను. అవయవములు భూషణములై యుండెను. 12

టీ:- తదేవ బింబం వర్ణయతి త్రిభిః. యదితి. యన్మర్త్యలీలాసు ఔపయికం యోగ్యం స్థానం. స్వస్యాపి విస్మయజనకం యతస్సౌభగర్ధేః సౌభాగ్యాతిశయస్య పరం పదం పరాకాష్ఠా. భూషణానాం భూషణాన్యంగాని యస్మిన్. 12

శ్లో॥ యద్ధర్మసూనోర్బత రాజసూయే
నిరీక్ష్య దృక్స్వస్త్యయనం త్రిలోకః ।
కార్త్స్న్యేన చాద్యేహ గతం విధాతు
రర్వాక్సృతౌ కౌశలమిత్యమన్యత ॥ 13

టీ:- యదితి. దృశాం స్వస్త్యయనం పరమానందకరం. త్రిభువనస్థో లోకః ప్రాణిమాత్రం. అద్యేదానీం ఇహ బింబే. అర్వాక్సృతౌ అర్వాచీన సంసార నిర్మాణే మనుష్య నిర్మాణే వా యత్కౌశలం నైపుణ్యం తత్కార్త్స్న్యేన గతం ఉపక్షీణం నాతః పరం తస్య కౌశలమస్తీత్యేవ మేనే తన్మూర్తే ర్విధాతుః సృజ్యత్వాభావేఽపి లోకదృష్ట్యేదముక్తం. 13

ధర్మరాజు రాజసూయయాగములో శ్రీకృష్ణుని రూపము ముల్లోక జనులకు నయనానందకరముగా నుండెను. బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుని ఇట్లు సృష్టించి తన ప్రాచీనసృష్టిలోని సమస్తమునకు మించిన నైపుణ్యమును ప్రదర్శించెను గదా అని జనులు ఆశ్చర్యపోయిరి. 13

శ్లో॥ యస్యానురాగప్లుతహాసరాస
లీలావలోక ప్రతిలబ్ధమానాః।
వ్రజస్త్రియో దృగ్భిరనుప్రవృత్త
ధియోఽవతస్థుః ఖిల కృత్యశేషాః ॥ 14

శ్రీకృష్ణుడు గోపికలను ప్రేమతో నిండిన చిరునవ్వుతో, వినోదముతో, లీలలతో కూడిన చూపుతో చూచెను. గోపికలు అట్టి సన్మానము పొందినవారై, కృష్ణునే అనుసరించిన మనస్సుగల వారై గృహ కృత్యములను మధ్యలోనే విడిచినారు. కృష్ణునే చూస్తు నిలుచుండి నారు. 14

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- యస్యేతి. అనురాగేణ ప్లుతో వ్యాప్తో హాసో హసనం రాసో వినోదశ్చ లీలావలోకశ్చ తైః స్వకృతహాసాద్యనంతరం ప్రతిలబ్ధో మానో యాభిః స్త్రాః దృగ్భిస్సహానుప్రవృత్తాః గచ్ఛంతం తమేవానుగతాః ధియో యాసాం తాః. కృత్యే శేషో యాసాం తాః అసమాపితకృత్యా ఏవ తస్థుః. 14

శ్లో॥ స్వ శాంతరూపేష్వితరైః స్వరూపైః
అభ్యర్ద్యమానేష్వనుకంపితాత్మా ।
పరాపరేశో మహదంశయుక్తో
హ్యజోఽపి జాతో భగవాన్ యథాగ్నిః ॥ 15

టీ:- ఏవంభూతబింబప్రదర్శనే కారణమాహ - స్వేతి. స్వీయాన్యేవ శాంతాని అశాంతాని చ రూపాణి చేతి ద్వివిధాని. తత్ర శాంతరూపేషు ఇతరైః అశాంతరూపైః పీడ్యమానేషు అనుకంపితః కృతానుకంపకః ఆత్మా యస్య. అజోఽపి జాతః ఆవిర్భూతః. మహాభూతరూపేణ నిత్యసిద్ధ ఏవాగ్నిః యథా కాష్ఠేష్వావిర్భవతి తద్వత్. అజస్య జన్మని హేతుః. మహత్ మహత్తత్త్వం అంశః కార్యలేశః యస్యావ్యక్తస్య తన్మహదంశం తద్యుక్త ఇతి. 15

పైనవర్ణించిన దివ్యసుందర శ్రీకృష్ణ అవతారమునునకు కారణము చెప్పుచున్నాడు. భగవంతుడికి శాంతరూపములు, అశాంతరూపములు అని రెండు విధముల రూపములు. అశాంత రూపములచే (రాక్షసులు, దుర్మార్గులు) శాంతరూపములు (భక్తులు, సత్పురుషులు) బాధింపబడుచుండుట చూచి తాను పుట్టుకలేనివాడైనను శాంత రూపముల యందు దయగల వాడై కట్టె నుండి అగ్ని పుట్టినట్లు శ్రీకృష్ణుడు పుట్టెను. 15

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ మాం ఖేదయత్యేతదజస్య జన్మ
విడంబనం యద్వసుదేవ గేహే ।
వ్రజేచ వాసోఽరి భయాదివ స్వయం
పురాద్వ్యవాత్సీద్యదనంత వీర్యః ॥ 16

టీ:- నను కుతోఽసౌ పరాపరాణామీశః పారతంత్ర్య ప్రతీతేస్తత్రాహ ద్వాభ్యాం. మామితి. మమాప్యేతత్ అవితర్క్యం దుర్ఘటం చ ఖేదయతి. తదేవాహ - వసుదేవ గేహే బంధనాగారే యజ్జన్మనో విడంబనం అనుకరణం, న తు నృసింహవదకస్మాదావిర్భావః. కంస భయాదివ పురాన్మ ధురాయాః వ్యవాత్సీత్ అపలాయత. 16

శ్లో॥ ధునోతి చేతస్స్మరతో మమైత
ద్యదాహ పాదావభివంద్య పిత్రోః ।
తాతాంబ కంసాదురుశంకితానాం
ప్రసీదతం నోఽకృతనిష్కృతీనామ్ ॥17

టీ:- ధునోతీతి. ఏతచ్చ హరేశ్చరితం స్మరతో మమ చేతః కర్మభూతం ధునోతి వ్యథయతి తదేవ దర్శయతి యదాహేతి. హేతాత, హే అంబ, యువాం ప్రసీదతం ప్రసాదం కురుతమ్. న కృతా నిష్కృతిః శుశ్రూషణం యైః తేషాం నోఽస్మాకమితి బహువచనం తు రామాద్యభి ప్రాయమ్. 17

శ్రీకృష్ణుడు పర, అపరములకు ప్రభువు అయి కూడా పారతంత్ర్యాన్ని పొందినట్లు అగుపించుచున్నది. ఈ రెండు శ్లోకములలో ఆ విషయమే చెప్పబడుచున్నది. ఉద్ధవుడనైన నాకు ఈ విషయములో దుఃఖము కలుగుచున్నది. శ్రీకృష్ణుడు వసుదేవుడి ఇంట (కారాగారములో) పుట్టుట అనే లీల; (కంసుని వలన) శత్రుభయము వలననా! అన్నట్లు రేపల్లె చేరుట. (శ్రీకృష్ణుడు నరసింహస్వామి వలె ఆవిర్భావము తోడనే శత్రువును సంహరించలేదు). శత్రువులకు భయపడినాడా అన్నట్లు మధురను వదిలివెళ్ళుట అనెడు లీలలు నా దుఃఖమునకు కారణములు. 16

బలరామ శ్రీకృష్ణులు చెరసాలలోనున్న తల్లిదండ్రుల వద్దకు వెళ్ళి పాదాభివందనము చేసి ఓ అమ్మా! ఓ నాన్నా! కంసుడికి భయపడి ఇన్ని రోజులు మీకు సేవ చేయలేదు. అట్టి మా విషయమున మీరు ప్రసన్నులు కావలసినదని ప్రార్థించిరి. ఈ విషయము గుర్తుకు రాగానే నా మనస్సు దుఃఖపడుచున్నదని ఉద్ధవుడు పలికెను. 17

శ్లో॥ కో వా అముష్యాంఘ్రి సరోజ రేణుం
విస్మర్తుమీశీత పుమాన్విజిఘ్రన్ ।
యో విస్ఫురద్భ్రూవిటపేన భూమే
ర్భారం కృతాంతేన తిరశ్చకార ॥ 18

టీ:- నను తర్హి అనీశ్వర ఏవ కిం న స్యాత్, తవ తు శ్రద్ధామాత్రమేతత్త్రాహ త్రిభిః. క ఇతి. కోవా అంఘ్రి సరోజయోః యో రేణుః తమపి విజిఘ్రన్ సేవమానః పుమాన్ విస్మర్తుం ఈశీత శక్నుయాత్. విస్ఫురద్భ్రూ విటపః భ్రూలతైవ కృతాంతః తేన. 18

ఈ మూడు శ్లోకములతో శ్రీకృష్ణుని ఎడబాటు దుస్సహనమని చెప్పుచున్నాడు. కాలరూపుడైన శ్రీకృష్ణుడు తన కనుబొమ్మల కదలిక చేతనే ఈ భూభారమును హరించగలిగెను. అట్టి భగవానుని పాద పద్మములను సేవించే ఏ పురుషుడు ఆయనను మరువగలడు. 18

శ్లో॥ దృష్టా భవద్భిర్నను రాజసూయే
చైద్యస్య కృష్ణాద్విషతోఽపి సిద్ధిః ।
యాం యోగినస్సంస్పృహయంతి సమ్యక్
యోగేన కస్తద్విరహం సహేత ॥ 19

టీ:- న చ తస్యేశ్వరత్వం సాధనీయం, భవద్భిరపి దృష్టత్వాదిత్యాహ దృష్టేతి. యాం సిద్ధిం సమ్యగ్యోగేన ప్రాప్తుమిచ్ఛంతి. 19

రాజసూయయాగ కాలములో శిశుపాలుడు శ్రీకృష్ణుని మిక్కిలి ద్వేషించి కూడా కృష్ణునిచే సంహరింపబడిన తరువాత శ్రీకృష్ణుని యందే ఐక్యమగుట మీరందరును చూచినారు కదా! యోగులు తమ కఠిన సాధనలతో ఈ రకమైన భగవత్ప్రాప్తినేకదా కోరుచుందురు. అట్టి భగవానుని విరహమును ఎవరు సహించగలరు. 19

శ్లో॥ తథైవ చాన్యే నరలోకపాలాయ
ఆహవే కృష్ణముఖారవిందమ్ ।
నేత్రైః పిబంతో నయనాభిరామం
పార్థాస్త్ర పూతాః పదమాపురస్య ॥ 20

టీ:- తథేతి. ఆహవే యుద్ధే పార్థస్యాస్త్రైః పూతాః నిష్పాపాస్సంతః20

(తథైవ=శిశుపాలునివలెనే) భారతయుద్ధములో రాజులందరును నయనాభిరాముడైన శ్రీకృష్ణ ముఖారవింద రసపానమును చేయుచు అర్జున బాణములకు గురియైనారు. మరణకాలమున శ్రీకృష్ణదర్శమును పొందిన భాగ్యవంతులై రాజులందరును శిశుపాలునివలెనే శ్రీకృష్ణునిలో ఐక్యమును పొందిరి. 20

శ్లో॥ స్వయం త్వసామ్యాతిశయస్త్ర్య
ధీశః స్వారాజ్యలక్ష్మ్యాప్త సమస్తకామః।
బలిం హరద్భిశ్చిరలోకపాలైః
కిరీట కోట్యేడిత పాదపీఠః ॥ 21

టీ:- తదేవం పరమైశ్వర్యే సత్యపి యదుగ్రసేనానువర్తిత్వం తత్పునరస్మానత్యతం వ్యథయతీత్యాహ స్వయమితి. స్వయం తు య ఏవం భూతః తస్య తత్ కైంకర్యం నోఽస్మాన్ విగ్లాపయ తీత్యుత్తరే ణాన్వయః. న సామ్యాతిశయౌ యస్య. యమపేక్ష్యాన్యస్య సామ్యమతి శయశ్చ నాస్తీత్యర్థః. తత్ర హేతవః త్రధీశస్త్రయాణా పురుషాణాం లోకానాం గుణానాం వా ఈశః స్వారాజ్యలక్ష్మ్యా పరమానందస్వరూప సంపత్త్యైవ ప్రాప్త సమస్త భోగః. బలిం కరమర్పణం వా హరద్భిః సమర్పయద్భిః చిరకాలీనైః లోకపాలైః కిరీటాగ్రేణ ఈడితం స్తుతం పాదపీఠం యస్య. ప్రణమతాం కిరీటసంఘట్టనతః ఉద్భూతో ధ్వనిః స్తుతిత్వేనోత్ప్రేక్ష్యతే. 21

శ్రీకృష్ణునితో సమానమయినవాడుగానీ, అధికుడుగానీ లేడు. అతడు మూడులోకములకు, త్రిగుణాత్మకమయిన "మాయ" కు అధీశుడు. తన పరమానందస్వరూపముచే సమస్త అభీష్టములు పొందినవాడు. ఇంద్రాది దిక్పాలురు పూజాద్రవ్యములను, కానుకలను తెచ్చి శ్రీకృష్ణునకు సమర్పింతురు. తమ కిరీటముల కొనలను ఆయన పాదపీఠమునకు ఆనించి సేవింతురు. 21

శ్లో॥ తత్తస్య కైంకర్యమలం భృతాన్నో
విగ్లాపయత్యంగ యదుగ్రసేనమ్ ।
తిష్ఠన్నిషణ్ణం పరమేష్ఠి ధిష్ణ్యే
న్యబోధయద్దేవ నిధారయేతి ॥ 22

టీ:- తదితి. అంగ హే విదుర భృతాన్ భృత్యాన్. ఉగ్రసేనే యత్కిం కరత్వం తదేవాహ. పరమేష్ఠిధిష్ణ్యే సార్వభౌమాసనే నిషణ్ణం ఆసీనం స్వయం తిష్ఠన్ హే దేవ, నిధారయ అవధారయేతి న్యబోధయత్ విజ్ఞాపితవాన్, ఏవమనువృత్తిః తత్కృపయైవేతి సూచితం. 22

ఓ విదురా! ఉగ్రసేనమహారాజు రాజసింహాసనముపై కూర్చొని యుండగా శ్రీకృష్ణుడు ఆయన ముందు నిలబడి, 'ఓ మహారాజా! ఆలకించండి' అని విన్నవించెడివాడు. శ్రీకృష్ణుని ఆ సేవాభావము గుర్తుకువచ్చినపుడు నాకు మిక్కిలి బాధయగుచున్నది. ఇదంతయు శ్రీకృష్ణుని భక్తానుగ్రహ విశేషము గదా! 22

శ్లో॥ అహో బకీయం స్తన కాలకూటం
జిఘాంసయాపాయ యదప్య సాధ్వీ ।
లేభే గతిం ధాత్ర్యుచితాం తతోఽన్యం
కం వా దయాళుం శరణం వ్రజేమ ॥ 23

టీ:- అపకారిష్వపి తస్య కృపాళుతాం దర్శయన్నాహ అహో ఇతి. అహో ఆశ్చర్యం దయాళుతాయాః. జిఘాంసయా హంతుచ్ఛయాపి తత్ స్తనయోస్సంభృతం కాలకూటం విషం యమపాయయద్బకీ పూతనా అసాధ్వీ దుష్టాపి ధాత్ర్యా యశోదాయా ఉచితాం గతిం లేభే, భక్త వేషమాత్రేణ యస్సద్గతిం దత్తవానిత్యర్థః. తతోఽన్యం కం వా శరణం భజేమ. 23

అపకారుల విషయములో శ్రీకృష్ణుని దయాళుత్వమును చెప్పుచూ "అహో" యను ఆశ్చర్యార్థకమును ప్రయోగించినాడు. స్తనములలో కాలకూటవిషమును నింపుకొని తనను చంపుటకై వచ్చిన దుష్టురాలైన పూతనకు పుణ్యగతి కలిగించెను. తనను పెంచిన తల్లియైన యశోదతో సమానమైన సద్గతిని, భక్తురాలి వేషము ధరించిన మాత్రము చేత పూతనకు కూడా కలిగించుట మిక్కిలి ఆశ్చర్యకరము. అటువంటి కృష్ణునితప్ప ఇంకెవరిని శరుణువేడెదను. 23

శ్లో॥ మన్యే సురాన్ భాగవతాంస్త్ర్యధీశే
సంరంభమార్గాభినివిష్టచిత్తాన్
యే సంయుగేఽచక్షత తార్క్ష్య పుత్ర
మంసే సునాభాయుధమాపతంతమ్ ॥ 24

టీ:- నను భాగవతానేవ భగవాననుగృహ్ణాతీతి ప్రసిద్ధం. సత్యం. అసురానపి అహం భాగవతానేవమన్యే, యతో భాగవతా ఇవ తేఽపి భగవద్ధ్యానాభినివేశేన భగవంతమపరోక్షం పశ్యంతీత్యాహ మన్య ఇతి. సంరంభః క్రోధావేశః. తేన మార్గేణ అభినివిష్టం చిత్తం యేషాం తాన్. అత ఏవ యే సంగ్రామేతార్క్ష్యః. కశ్యపః తస్య పుత్రః గరుడః. తం అంసే స్కంధే సునాభాయుధశ్చక్రాయుధః హరిః తమచక్షతాపశ్యన్. తస్మాత్తేష్వపి అనుగ్రహో యుక్త ఏవేత్యర్థః. వక్ష్యతి చ సప్తమే. శ్లో. తస్మాత్కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేతి. 24

భగవంతుడు భాగవతులను మాత్రమే అనుగ్రహిస్తాడని ప్రసిద్ధము. సత్యమే. రాక్షసులు కూడా క్రోధావేశముతో భగవద్ధ్యానాభినివేశముతో భగవంతుని ప్రత్యక్షముగా చూడగల్గుచున్నారు. అట్టి రాక్షసులు కూడా భాగవతులేయని నా అభిప్రాయము. కనుకనే కశ్యప ప్రజాపతి యొక్క పుత్రుడగు గరుత్మంతుని భుజస్కంధములపై సుదర్శనాయుధుడగు శ్రీమహావిష్ణువును రాక్షసులు యుద్ధములో చూడగల్గిరి. 24

శో॥ వసుదేవస్య దేవక్యాం జాతో భోజేంద్ర బంధనే ।
చికీర్షుర్భగవానస్యాశ్శమజే నాభియాచితః ॥ 25

టీ:- ఇదానీం తస్యాంతర్ధాన ప్రకారం వక్తుం. ఆదిత ఆరభ్య తచ్చరితం సంక్షేపేణ కథయతి వసుదేవస్యేతి. వసుదేవస్య భార్యాయాం దేవక్యాం జాతః భోజేంద్రః కంసః తస్య బంధనాగారే, అస్యాః పృథివ్యాః శం సుఖం స్వయం చికీర్షురజేన యాచితస్సన్. 25

ఇప్పుడు శ్రీకృష్ణుని అంతర్ధానప్రకారమును చెప్పుచు కృష్ణచరిత్రను సంక్షేపముగా చెప్పుచున్నాడు. భోజదేశప్రభువగు కంసుని కారాగారములో వసుదేవునికి దేవకీదేవియందు శ్రీకృష్ణుడు జన్మించినాడు. బ్రహ్మదేవుని ప్రార్థనమేరకు భూమాతకు సుఖము కల్గించుటకై కృష్ణావిర్భావము జరిగినది. 25

శ్లో॥ తతో నందవ్రజమితః పిత్రా కంసాద్విబిభ్యతా ।
ఏకాదశ సమాస్తత్ర గూఢార్చిస్సబలోఽవసత్ ॥ 26

టీ:- తతఇతి. పిత్రా నిమిత్తభూతేన నందవ్రజం ఇతః గతః సమాః సంవత్సరాన్. గూఢార్చిః. గుప్తతేజాః. 26

కంసుని వలన భయపడుచున్న తండ్రిని నిమిత్తముగా చేసికొని నందవ్రజముచేరి, తన తేజస్సును గుప్తముగా ఉంచి పదకొండు సంవత్సరములు అక్కడనే ఉండెను. 26

శ్లో॥ పరీతో వత్సపైర్వత్సాంశ్చారయన్ వ్యహరద్విభుః।
యమునోపవనే కూజద్ద్విజసంకులితాంఘ్రిపే ॥ 27

టీ:- పరీతఇతి. వ్యహరత్ ఆక్రీడత్. కూజద్భిః ద్విజైః పక్షిభిః సంకులితాః వ్యాప్తాః అంఘ్రిపాః వృక్షాః యస్మిన్. 27

శ్రీకృష్ణుడు యమునాతీరమందలి అడవిలో లేగదూడలను మేపుచున్న గోపబాలకులు తన చుట్టూ తిరుగుచుండగా క్రీడించెను. పక్షులకూతలతో నిండిన వృక్షములుగల ఆ అడవి ఎంతో ఆహ్లాదకర ముగా నుండెను. 27

శ్లో॥ కౌమారీం దర్శయంశ్చేష్టాం ప్రేక్షణీయాం వ్రజౌకసామ్ ।
రుదన్నివ హసన్ముగ్ధ బాల సింహావలోకనః ॥ 28

టీ:- కౌమారీమితి. రుదన్నివేతి ఇవ శబ్దస్య యథా యోగం సర్వత్రాప్యన్వయః. ముగ్ధో బాలశ్చ యః సింహః తద్వదవలోకనం యస్య. 28

గోకులములోని జనుల మనస్సులను దోచివేయునట్లు శ్రీకృష్ణుడు బాల్యచేష్టలను చూపుచూ, ఒకప్పుడు నవ్వుచున్న వాడివలె, ఒకప్పుడు ఏడ్చుచున్న వాడివలె కనిపిస్తూ, బాలసింహము వలె (పరిశీలనగా) చూచెడివాడు. 28

శ్లో॥ స ఏవాధివయో లక్ష్మ్యానికేతం సితగోవృషమ్ ।
చారయన్ననుగాన్గోపా(న్రణద్వేణురరీరమత్ ॥ 29

టీ:- సఇతి. సఏవాధికం వయః ప్రాప్తస్సన్ గోధనం చాలయన్. కథంభూతం గోధనమ్. లక్ష్మ్యాః శోభాది సంపదో నివేతనం స్థానం. సితా గావో వృషాశ్చ వృషభా యస్మిన్. నానా వర్ణే గో సంఘే. రణన్ శబ్దం కుర్వన్ వేణుర్యస్య. అరీరమత్ రమయామాస. 29

శ్రీకృష్ణునకు కొంత పెద్దవయస్సు రాగానే, అందానికి పుట్టినిల్లైన గోసంపదను మేపుచు తిరుగుచుండెడివాడు. ఆయన ఆవులమందలో తెల్లని ఆవులేగాక ఇతర వర్ణపు ఆవులు, ఎద్దులు కూడా ఉండెడివి. వేణువునూదుతూ, తనవెంటతిరిగే గోపబాలురకు ఆనందము కలిగించెడివాడు. 29

శ్లో॥ ప్రయుక్తాన్ భోజరాజేన మాయినః కామరూపిణః ।
లీలయా వ్యనుదత్తాంస్తాన్ బాలః క్రీడనకానివ ॥ 30

టీ:- ప్రయుక్తానితి. వ్యనుదత్ జఘాన. క్రీడనకాన్ తృణాది నిర్మితాన్ మృగాన్ సింహాదీన్ యథా. 30

భోజవంశీయుడగు కంసుడు శ్రీకృష్ణుని చంపుటకై మాయావులు, కామరూపులు అయిన రాక్షసులను పంపినాడు. శ్రీకృష్ణుడు అట్టి రాక్షసులనందరినీ, సింహము చిన్న జంతువులను చంపునట్లు, బాలుడు ఆటవస్తువులతో ఆడుకొనునట్లు క్రీడిస్తూ, సంహరించెను. 30

శ్లో॥ విపన్నాన్విష తోయేన నిగృహ్య భుజగాధిపమ్।
ఉత్థాప్యాపాయయద్గావస్తత్తోయం ప్రకృతిస్థితమ్ ॥ 31

టీ:- విపన్నానితి. విపన్నాన్ గోపాన్ మృతాన్. గావ ఇతి గాశ్చోత్థాప్య తదేవ తోయం. ప్రకృతి స్థితం నిర్విషం అపాయయత్. 31

కాళీయుడు సరస్సులోని జలమంతా విషపూరితము చేయగా శ్రీకృష్ణుడు ఆ కాళీయుని దండించెను. విషజలము త్రాగి చనిపోయిన గోపాలురను, గోవులను మరల జీవింపజేసెను. ఆ సరస్సులోని జలములను నిర్విషములుగా జేసి పాన యోగ్యములుగా జేసెను. 31

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అయాజయద్గో సవేన గోపరాజం ద్విజోత్తమైః ।
విత్తస్య చోరుభారస్య చికీర్షన్ సద్వ్యయం విభుః ॥ 32

టీ:- అయాజదితి. ఇంద్రపూజాభంగేన కృతా గవాం పూజైవ గోసవః తేన. గోపరాజం నందం. విత్తస్య చేతి చకారాదింద్రస్య మానభంగం చ కుర్వన్ ఉరుభారస్య అతిసమృద్ధస్య. 32

ప్రతి సంవత్సరము జరిపే ఇంద్రోత్సవమునకు బదులుగా, గోపరాజైన నందునిచేత బ్రాహ్మణులద్వారా గోపూజను చేయించెను. సమృద్ధమగు ధనసంపదగల నందుని సంపదను సద్వ్యయము కావింపదలచెను. గోవర్ధనగిరి పూజయే గోపూజ. 32

శో॥ వర్షతీంద్రే వ్రజః కోపాద్భగ్నమానోఽతి విహ్వలః।
గోత్ర లీలాతపత్రేణ త్రాతో భద్రానుగృహ్ణతా ॥ 33

టీ:- వర్షతీతి. కోపాద్వర్షతీంద్రే. గోత్రః పర్వత ఏవ లీలాతపత్రం తేన. హే భద్ర. 33

ఓ విదురుడా! కోపముతో ఇంద్రుడు గొప్ప వర్షము కురిపింపగా గొల్లపల్లె మిక్కిలి ఆపదను పొందెను. శ్రీకృష్ణుడు ఆ పల్లెవారినందరిని అనుగ్రహిస్తూ ఆ పర్వతమును (గోవర్ధనగిరిని) అవలీలగా, గొడుగును వలె ఎత్తి పట్టుకుని రక్షించెను. 33

శో॥ శరచ్ఛశికరైర్మృష్టం మానయన్ రజనీముఖమ్ ।
గాయన్ కలపదం రేమే స్త్రీణాం మండల మండనః ॥ 34

టీ:- శరదితి. మృష్టముజ్జ్వలమ్. స్త్రీణాం మండలం మండయతీతి తథా. 34

శరదృతువు యొక్క సాయం సంధ్యాకాలము వెన్నెలతో ప్రకాశించుచుండెను. శ్రీకృష్ణుడు గోపికలమండలమునకు వన్నెను చేకూరుస్తూ మధురముగా పాడుచూ ఆ అందమైన ప్రకృతిలో విహరించెను. 34

శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
ద్వితీయోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
రెండవ అధ్యాయము సమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

### తృతీయోఽధ్యాయః

శ్లో. తృతీయే మధురామేత్య వ్రజాత్కంసవధాదికమ్. యత్కృతం ద్వారకాయాం చ కృష్ణేన తదవర్ణయత్.

ఉద్ధవ ఉవాచ

శ్లో॥ తతః స ఆగత్య పురం స్వపిత్రో
శ్చికీర్షయా శం బలదేవసంయుతః ।
నిపాత్య తుంగాద్రిపు యూథనాథం
హతం వ్యకర్షద్వ్యసుమోజసోర్వ్యాం ॥ 1

టీ:- తత ఇతి. శమిత్యవ్యయం. పిత్రోః సుఖస్య చికీర్షయేత్యర్థః. తుంగాత్ రాజమంచాత్. రిపు - యూథానాం నాథం కంసం. వ్యసోరపి వికర్షణం పిత్రోస్సుఖార్థం. 1

శ్లో॥ సాందీపనేః సకృత్ప్రోక్తం బ్రహ్మాధీత్య సవిస్తరం ।
తస్మై ప్రాదాద్వరం పుత్రం మృతం పంచజనోదరాత్ ॥ 2

టీ:- సాందీపనేరితి. బ్రహ్మ వేదం. సవిస్తరం షడంగాది సహితం. పరం శ్రేష్ఠం వరరూపం వా గురుదక్షిణారూపం వా పంచజనోదర విదారణద్వారా పుత్రమానీయేత్యర్థః. 2

### మూడవ అధ్యాయము

ఉద్ధవుడు పలికెను

మూడవ అధ్యాయములో శ్రీకృష్ణుడు వ్రజము నుండి మధురకు చేరుట, తండ్రి యొక్క సుఖముగోరి, కొండపై నుండి రాజు మంచెపైకి దుమికి, శత్రుసమూహమునకు అధిపతియైన కంసుని దోషములను తొలగించి (కంసుని సంహరించి, ఆతనికి సద్గతిని ఇచ్చుట) సంహరించుట, ద్వారకలో శ్రీకృష్ణుడి చేసిన లీలలు వర్ణింపబడినవి. 1

సాందీపనిమహర్షి ఒక్కసారి చెప్పినను శ్రీకృష్ణుడు వెంటనే నేర్చుకొనెడివాడు. ఇట్లు షడంగములతో కూడిన బ్రహ్మవిద్య అయిన వేదాధ్యయనము పూర్తిచేసి, పంచజనుడనే రాక్షసుని చంపి, ఎప్పుడో చనిపోయిన గురుపుత్రుని అతని ఉదరము నుండి తెచ్చి గురుదక్షిణగా (వరముగా) ఇచ్చెను. 2

శ్లో॥ సమాహుతా భీష్మకకన్యయా యే
శ్రియస్సవర్ణేన బుభూషయైషామ్ ।
గాంధర్వవృత్త్యా మిషతాం స్వభాగం
జహ్రే పదం మూర్ధ్ని దధత్సువర్ణః ॥ 3

టీ:- సమాహుతా ఇతి. భీష్మకకన్యయా రుక్మిణ్యా యే రాజానః సమాహుతాః సమాహూతాః హ్రస్వత్వమార్షం. సమాహృతా ఇతి పాఠే ఆకృష్టా ఇత్యర్థః. కేన సాధనేన. శ్రియో లక్ష్మ్యాస్సవర్ణేన సమానరూపేణ. యద్యపి తయా కేవలం శ్రీకృష్ణ ఏవాహూతః న సర్వే. తథాపి తస్యాః లావణ్యం తేషామాగమనే హేతురితి తయైవాహూతా ఇత్యుచ్యతే. ఏషాం మిషతాం పశ్యతాం మూర్ధ్ని పదం దధత్ . తయా సహ గాంధర్వవృత్త్యా పరస్పరసమయరూపయా బుభూషయా భవితు మిచ్ఛయా జహార . కథంభూతం. స్వభాగం లక్ష్మ్యంశత్వాత్తయా స్వాత్మనోఽ ర్పితత్వాచ్చ. సుపర్ణః. సుపతనః. యద్వా సుపర్ణఇవ స్వభాగం సుధామిత్యర్థః. యద్వా శ్రియః రుక్మిణ్యాః సమానం వర్ణద్వయం వాచకం యస్య సః శ్రియః సవర్ణో రుక్మీ తేన సమాహుతాః శిశుపాలాదయః. కిమర్థం. భీష్మకకన్యయా సహ తేషాం బుభూషయా. భూతిర్భవత్విత్యేతదర్థం. తత్ర శిశుపాలస్యాహ్వానం వరత్వేన బుభూషయా. జరాసంధాదీనాం తద్వివాహోత్సవేన. శేషం పూర్వవత్. 3

భీష్మకుని పుత్రికయగు రుక్మిణిచే శ్రీకృష్ణుడొక్కడే ఆహ్వానింపబడినను ఆమె అన్నయగు రుక్మిచేత వివాహార్థము రాజులందరును ఆహ్వానింపబడిరి. సమాహూతాః కు బదులు సమాహుతాః అనుట ఆర్షము. సమాహృతా అను పాఠాంతరముకలదు. రుక్మిణి సౌందర్యాతిశయము చేత రాజులందరు ఆకర్షింపబడిరని అర్థము. వారందరూ చూచుచుండగనే వారి శిరస్సులపై తన పాదము నుంచెను. అనగా ఆహ్వానించబడిన జరాసంధాదులను చిత్తుగా ఓడించెను. రుక్మిణిని గాంధర్వ విధానమున వివాహమాడగోరి, గరుత్మంతుడు అమృతమును తీసుకొని పోయినట్లు తనలో భాగమైన, లక్ష్మీదేవి వలె నున్న రుక్మిణిని శ్రీకృష్ణుడు తీసుకొనిపోయెను. 3

శ్లో॥ కకుద్మతో విద్ధనసో దమిత్వా
స్వయంవరే నాగ్నజితీముపాహ ।
తద్భగ్నమానానపి గృధ్నతోఽజ్ఞాన్
జఘ్నేఽక్షతశ్శస్త్రభృతః స్వశస్త్రైః ॥ 4

టీ:- కకుద్మతఇతి. కకుద్మతో వృషభాన్ అవిద్ధనస అవిద్ధ నాసికాన్. దమిత్వా మర్దయిత్వా. విద్ధనాసికాన్ కృత్వేతి వా. నగ్నజితః కన్యాం స్వయంవరే ఉపయేమే తైః వృషభైః తద్దమనేన చ భగ్నోమానో యేషాం తాన్ తథాపి తాన్ కన్యాం గృధ్యతః కామయమానాన్, అత ఏవ అజ్ఞాన్ శస్త్రభృతో రాజ్ఞః తచ్ఛస్త్రైః అక్షతఏవ జఘాన. 4

శ్రీకృష్ణుడు ముక్కుకుట్టని ఎద్దులను అదుపులోకి తెచ్చి స్వయంవరమునందు నగ్నజిత్తు కూతురు నాగ్నజితిని వివాహ మాడెను. ఆయన చేసిన ఆ గొప్పపనికి ఇతర రాజులకు గర్వభంగ మాయెను. భంగపడినను రాజకుమారి యందుగల తృష్ణ చేత ఆయుధ ధరులై శ్రీకృష్ణునెదిరించిరి. శ్రీకృష్ణుడు తాను గాయపడనివాడై తన ఆయుధములతో వారిని సంహరించెను. 4

శ్లో॥ ప్రియం ప్రభుర్గ్రామ్య ఇవ ప్రియాయా
విధిత్సురార్ఛద్ద్యుతరుం యదర్థే ।
వజ్ర్యాద్రవత్తం సగణో రుషాంఽధః
క్రీడామృగో మానమయం వధూనాం ॥ 5

టీ:- ప్రియమితి. యదా అదిత్యాః కుండలే దాతుం స్వర్గం గతః తదా ప్రభుః స్వతంత్రోఽపి గ్రామ్యః స్త్రీపరతంత్ర ఇవ ప్రియాయా స్సత్యభామాయాః ప్రియం విధాతుమిచ్ఛుః. ద్యుతరుం పారిజాతం ఆనీతవాన్ యదర్థే యన్నిమిత్తం తం శ్రీకృష్ణం వజ్రీ దేవేంద్రః అద్రవత్

శ్రీకృష్ణుడు అదితికి కుండలములను ఇచ్చుటకు స్వర్గమునకు వెళ్ళినప్పుడు తను స్వతంత్రుడైనప్పటికి స్త్రీ పరతంత్రుడివలె దేవ వృక్షమైన పారిజాతమును సత్యభామకు తెచ్చి ఇచ్చెను. అందుకుగాను వజ్రాయుధధారియగు ఇంద్రుడు తన ప్రియురాలి ప్రేరణచే సైన్య సమేతముగా శ్రీకృష్ణునిపై దండెత్తెను. ఇంద్రుడు స్త్రీల క్రీడా మృగమైనాడు కదా! 5

స్త్రీ ప్రేరితః యోద్ధుమభ్యధావత్. స్వకార్యసాధకేన శ్రీకృష్ణేన సహ యుద్ధోద్యమః తస్యాప్యయుక్తఏవేత్యాహ క్రీడామృగ ఇతి. అయం వజ్రీ. 5

శ్లో॥ సుతం మృధే ఖం వపుషా గ్రసంతం
దృష్ట్వా సునాభోన్మథితం ధరిత్ర్యా ।
ఆమంత్రితస్తత్తనయాయ శేషం
దత్వా తదంతః పురమావివేశ ॥ 6

టీ:- సుతమితి. సునాభేన చక్రేణ ఉన్మథితం సుతం భౌమం దృష్ట్వా తస్య మాత్రా ధరిత్ర్యా భూమ్యా. ఆమంత్రితః ప్రార్థితస్సన్ తస్య తనయాయ భగదత్తాయ. హృతశేషం రాజ్యం దత్వా. 6

యుద్ధములో నరకాసురుడు తన విశాలదేహముతో ఆకాశమును మ్రింగుచున్నాడా యన్నట్లు ఉండెను. అట్టి నరకాసురుని శ్రీకృష్ణుడు తన చక్రముతో సంహరించెను. నరకుని తల్లి యగు భూదేవి కోరగా మిగిలిన రాజ్యమును అతని(నరకుని) పుత్రుడగు భగదత్తునికి ఇచ్చి, వాని అంతఃపురములో ప్రవేశించెను. 6

శ్లో॥ తత్రాహృతాస్తా నరదేవకన్యాః
కుజేన దృష్ట్వా హరిమార్తబంధుమ్ ।
ఉత్థాయ సద్యో జగృహుః ప్రహర్ష
వ్రీడానురాగప్రహితావలోకైః ॥ 7

టీ:- తత్రేతి. తత్రాంతఃపురే. కుజేన భౌమేన యా ఆహృతాః ప్రహర్షశ్చ వ్రీడా చ అనురాగశ్చ తైః ప్రహితాః ప్రేరితాః యే అవలోకాః తైర్జగృహుః స్వీకృతవత్యః. 7

భూసుతుడగు నరకునిచే తీసుకురాబడిన రాజకన్యలు ఆ అంతఃపురములో ఉండిరి. కష్టములలో ఉన్నవారికి బంధువగు శ్రీకృష్ణుని చూచి వెంటనే లేచి నిలబడిరి. వారు గొప్ప సంతోషమును, సిగ్గును, అనురాగమును గలవారై శ్రీకృష్ణుని భర్తగా స్వీకరించిరి. 7

శ్లో॥ ఆసాం ముహూర్త ఏకస్మిన్నానాగారేషు యోషితామ్ ।
సవిధిం జగృహే పాణీన్ అనురూపస్స్వమాయయా ॥ 8

టీ:- ఆసామితి. ఆసాం యోషితాం. పాణీన్ తత్తదనురూపస్సన్ సవిధిం వివాహోచిత ప్రకార సహితం యథా భవతి తథా. 8

శ్రీకృష్ణుడు ఆ రాజకన్యలనందరినీ తన మాయచే వారికి తగిన రూపములను దాల్చినవాడై ఒకే ముహూర్తమునందు వేరువేరు గృహములలో యథా విధిగా వివాహమాడెను. 8

శ్లో ॥ తా స్వపత్యాన్యజనయదాత్మ తుల్యాని సర్వతః ।
ఏకైకస్యాం దశ దశ ప్రకృతేర్విబుభూషయా ॥ 9

టీ:- తాస్వితి. సర్వతః సర్వైర్గుణైః స్వతుల్యాని. ప్రకృతేర్మాయయా. వివిధం భవనం విస్తారస్తదిచ్ఛయా. యద్వా ప్రకృతేర్హేతోః వివిధం భవితుమిచ్ఛయా. 9

శ్రీకృష్ణుడు సృష్టిని విస్తరింపజేయు కోరికగలవాడై ఆ రాజకన్యకలయందు ఒక్కొక్కరియందు అన్నిరకములుగా తనతో సమానమైన పదిమంది సంతానమును కనెను. 9

శ్లో॥ కాలమాగధ సాల్వాదీననీకై రుంధతః పురమ్ ।
అజీఘనత్స్వయం దివ్యం స్వపుంసాం తేజ ఆదిశత్ ॥ 10

టీ:- కాలేతి. కాలః కాలయవనః రుంధతః ఆవృణ్వతః ముచుకుంద భీమాదిభిః నిమిత్తమాత్రైః స్వయమేవాజీఘనత్ ఘాతితవాన్. తేన చ తేషాం స్వపుంసాం తేజః ప్రభావం దివ్యం చ ఆదిశత్ దత్తవాన్. 10

కాలయవనుడు, మగధాధీశుడగు జరాసంధుడు, సాల్వుడు మొదలగువారు సైన్యసమేతులై తన పురమును ముట్టడించిరి. శ్రీకృష్ణుడు ముచుకుంద, భీమాదులను నిమిత్తముగా చేసికొని తానే వారిని సంహరించెను. తనవారలగు పాండవాదులకు దివ్యమగు తేజస్సును, పరాక్రమమును ఇచ్చెను. 10

శ్లో॥ శంబరం ద్వివిదం బాణం మురం పల్వలమేవ చ।
అన్యాంశ్చ దంతవక్త్రాదీనవధీత్కాంశ్చ ఘాతయత్ ॥ 11

టీ:- శంబతమితి. శంబర ద్వివిదపల్వలానన్యానపి కాంశ్చిత్ ప్రద్యుమ్న రామాదిభిః ఘాతయత్ అఘాతయత్. ఘాతయన్నితి వా పాఠః. దంతవక్త్రాదీన్ స్వయమేవావధీత్. 11

శంబరుడు, ద్వివిదుడు, పల్వలుడు మొదలగు కొందరిని ప్రద్యుమ్నుడు, బలరాముడు మొదలగు వారిచేత సంహరింపజేసెను. (ఘాతయత్ అను పాఠాంతరమును కలదు) దంతవక్త్రుడు మున్నగు వారిని శ్రీకృష్ణుడు స్వయముగా సంహరించెను. 11

శ్లో॥ అథ తే భ్రాతృపుత్రాణాం పక్షయోః పతితాన్నృపాన్ ।
చచాల భూః కురుక్షేత్రం యేషామాపతతాం బలైః ॥ 12

టీ:- అథేతి. తతః నృపాన్. అఘాతయదిత్యనుషంగః. కథం భూతాన్. కురుక్షేత్రమాపతతాం ఆసమంతాద్గచ్ఛతాం యేషాం రాజ్ఞాం బలైస్సైన్యైః భూస్సర్వాపి చచాల చకంపే. 12

అటు పిమ్మట నీ(విదురుని) సోదరుల పుత్రులగు కౌరవ పాండవుల పక్షములలో చేరిన రాజులను సంహరించెను. ఆ రాజులు సైన్యసమేతముగా కురుక్షేత్ర యుద్ధమునకు రాగా భూమి కంపించెను. 12

శ్లో॥ స కర్ణ దుశ్శాసన సౌబలానాం
కుమంత్ర పాకేన హత శ్రియాయుషమ్ ।
సుయోధనం సానుచరం శయానం
భగ్నోరుమూర్వ్యాం న ననంద పశ్యన్ ॥ 13

టీ:- సఇతి. సః శ్రీకృష్ణః. కర్ణాదీనాం కుమంత్ర పాకేన హతా శ్రీ

కర్ణ, దుశ్శాసన, శకునుల చెడు సలహాలు పరిపక్వమగుట చేత దుర్యోధనుని సంపద మరియు ఆయుర్దాయము నశించెను. అతడు తొడలు విరిగినవాడై, అనుచరులతో కూడినవాడై, నేలమీద పడి యుండెను. అట్టి దుర్యోధనుని జూచి శ్రీకృష్ణుడు సంతోషించలేదు. 13

రాయుశ్చ యస్య. భగ్నౌ ఊరూ యస్య తం ఉర్వ్యాం శయానం దుర్యోధనం పశ్యన్నపి న ననంద తోషం న ప్రాప. 13

శ్లో॥ కియాన్ భువోఽయం క్షపితోరుభారో
యద్ద్రోణ భీష్మార్జున భీమమూలైః ।
అష్టాదశా క్షౌహిణికో మదంశైరాస్తే
బలం దుర్విషహం యదూనామ్ ॥ 14

టీ:- అభినందనప్రకారమేవాహ- కియానితి. ద్రోణాదిభిర్మూలైః కారణ భూతైః. యదితి యః అష్టాదశాక్షౌహిణీయుక్తః హ్రస్వమార్షం. క్షపితః య ఉరుర్భారః. అయం కియానత్యల్పఇత్యర్థః. యస్మాత్ మదంశైః ప్రద్యుమ్నాదిభిః హేతుభూతైః దుర్విషహం బలమాస్తే. 14

శ్రీకృష్ణుడు ఈ విధముగా తలపోయుచున్నాడు. భీష్మ, అర్జున, భీమాదుల కారణముగా పదునెనిమిది అక్షౌహిణులు సైన్యము నశించినది. భూమియొక్క పెనుభారము తగ్గినది. ఈ తగ్గిన భూ భారము ఎమంతటిది? నా అంశములగు ప్రద్యుమ్నాదులతో కూడిన యాదవబలయు సహింపరానిదై ఇంకను మిగిలియే యున్నది కదా! 14

శ్లో॥ మిథో యదైషాం భవితా వివాదో
మధ్వామదా తామ్రవిలోచనానామ్ ।
నైషాం వధోపాయ ఇయానతోఽన్యో
మయ్యుద్యతేఽంతర్దధతే స్వయం స్మ ॥ 15

టీ:- మిథఇతి. న చాత్రాన్య ఉపాయః ప్రభవతి. కింతు. మధునాయః ఆమదః సర్వతో మదః తేన ఆతామ్రాణి విలోచనాని యేషాం తేషాం

ఈ యాదవులు మద్యమును త్రాగి నిషాతో ఎరుపెక్కిన కన్నులు గలవారై పరస్పరము పోట్లాడుకొనెదరు. వీరి వధకు ఇంతకంటె మరియొక ఉపాయము లేదు. నేను అవతారము చాలించుటకు సిద్ధ పడుచుండగా ఈ యాదవులు తమంతట తాముగా నశించెదరు. 15

వివాదో భవిష్యతి ఇయానేవైషాం వధోపాయః అతోఽన్యో నాస్తి. ఐకాత్మ్య మపి మయ్యుద్యతే సతి స్వయమేవ వివాదేనాంతర్ధ ధీరన్నిత్యర్థః. 15

శ్లో॥ ఏవం సంచింత్య భగవాన్ స్వరాజ్యే స్థాప్య ధర్మజమ్ ।
నందయామాస సుహృదస్సాధూనాం వర్త్మ దర్శయన్ ॥ 16

టీ:- ఏవమితి. ఏవం శ్లోక ద్వయోక్త క్రమేణ సంచింతయన్ స్వరాజ్యే పైతృకే స్థాపయిత్వా. 16

శ్లో॥ ఉత్తరాయాం ధృతః పూరోర్వంశస్సాధ్వభిమన్యునా।
స వై ద్రౌణ్యస్త్ర సంఛిన్నః పునర్భగవతా ధృతః ॥ 17

టీ:- ఉత్తరాయామితి. ధృతః రక్షితః. 17

శ్లో॥ అయాజయద్ధర్మసుత మశ్వమేధైస్త్రిభిర్విభుః ।
సోఽపి క్ష్మామనుజైరక్షన్ రేమే కృష్ణమనువ్రతః ॥ 18

టీ:- అయాజయదితి. అనుజైస్సహ. 18

పై రెండు శ్లోకములలో తెల్పినవిధముగా శ్రీకృష్ణుడు ఆలోచించి ధర్మరాజును పైతృకముగావచ్చు స్వరాజ్యమునందు స్థాపించెను. లోకమునకు, సత్పురుషులవలె నడుచుకొను బంధువులకు, మిత్రులకు ఆనందము కలుగజేసెను. 16

ఉత్తర గర్భమున అభిమన్యుడు పూరువంశము(కురువంశము) యొక్క బీజము నుంచెను. గర్భములో అభిమన్యుని పుత్రుడు పెరుగు-చుండగా ద్రోణపుత్రుడగు అశ్వత్థామ అస్త్రమును ప్రయోగించి సంహరింప జూచెను. అపుడు శ్రీకృష్ణభగవానుడు ఆ శిశువును రక్షించెను. 17

శ్రీకృష్ణభగవానుడు ధర్మరాజుచేత మూడు అశ్వమేధ యాగములను చేయించెను. ఆ ధర్మరాజు కూడ తమ్ములతో కూడినవాడై శ్రీకృష్ణుని అనుసరించుటయే వ్రతముగాగలవాడై రాజ్యమును పరిపాలిస్తూ సుఖముగా నుండెను. 18

శ్లో॥ భగవానపి విశ్వాత్మా లోక వేద పథానుగః ।
కామాన్ సిషేవే ద్వార్వత్యామసక్తస్సాంఖ్యమాస్థితః ॥ 19

టీ:- భగవానితి. సాంఖ్యం ప్రకృతిపురుషవివేకం. 19

విశ్వానికే ఆత్మస్వరూపుడగు శ్రీకృష్ణభగవానుడు లోకధర్మమును, వేదధర్మమును కూడ అనుసరించుచుండెను. సాంఖ్యమనగా ప్రకృతి పురుష వివేకము. సాంఖ్యమార్గమును(జ్ఞానమార్గమును) అనుసరించు చున్నవాడై, సంసారమునందు ఆసక్తిలేనివాడై ద్వారకా నగరములో భోగముల ననుభవించెను. 19

శ్లో॥ స్నిగ్ధస్మితావలోకేన వాచా పీయూషకల్పయా ।
చారిత్రేణాన వద్యేన శ్రీనికేతేన చాత్మనా ॥ 20

టీ:- స్నిగ్ధేతి. స్నిగ్ధో యః స్మిత సహితోఽవలోకః తేన. పీయూష కల్పయా సుధాతుల్యయా. పీయూష కుల్యయేతి పాఠే. సుధా ప్రవాహ రూపయా. ఆత్మనా దేహేన. 20

శ్లో॥ ఇమం లోకమముంచైవ రమయన్ సుతరాం యదూన్ ।
రేమే క్షణ దయా దత్త క్షణ స్త్రీ క్షణ సౌహృదః ॥ 21

టీ:- ఇమమితి. క్షణ దయా రాత్ర్యా దత్తః క్షణః అవసరః ఉత్సవో వా యాసాం స్త్రీణాం తాసు క్షణం సౌహృదం యస్య సః. 21

శ్రీకృష్ణుడు ప్రేమతోనిండిన చిరునవ్వుగల చూపులు, అమృత తుల్యమైన మాటలు, దోషరహితమైన చరిత్ర(నడవడి), శోభాయమాన మగు దేహముగలవాడుగా నుండెను. ఇట్లు ఈ లోకమును, పరలోకమును, ముఖ్యముగా యాదవులను సంతోషపరచుచుండెను. ఆయన రాత్రి యందు ఏ కొద్ది సమయము లభించిననూ, ఆ సందర్భ ములలో, ఉత్సాహముతో కూడియున్న గోపికల అనురాగ పూర్ణములగు చూపులను స్వీకరిస్తూ, రాసక్రీడ యందు రమించెను. (20-21)

శ్లో॥ తస్యైవం రమమాణస్య సంవత్సరగణాన్ బహూన్ ।
గృహమేధేషు యోగేషు విరాగస్సమజాయత ॥ 22

ఈ విధముగా గృహస్థాశ్రమమునకు సంబంధించిన కామభోగో పాయములందు వైరాగ్యముతో, అనేక సంవత్సరములు (అనాసక్తుడై) రమించెను. 22

టీ:- తస్యేతి. గృహమేధేషు గృహధర్మేషు యోగేషు కామభోగో-పాయేషు విరాగః ఔదాసీన్యం జాతమిత్యర్థః. 22

శ్లో॥ దైవాధీనేషు కామేషు దైవాధీనస్స్వయం పుమాన్ ।
కో విస్రంభేత యోగేన యోగేశ్వరమనువ్రతః ॥ 23

టీ:- దైవేతి. యదా స్వాధీనేష్వపి భగవతో విరాగః తదా దైవాధీనేషు కో విస్రంభేత విశ్వాసం ప్రీతిం వా కుర్యాత్.యోగేన చేద్యోగేశ్వరం శ్రీకృష్ణమనువ్రతః. 23

యోగేశ్వరుడు(యోగసాధనలకు ఫలమునిచ్చువాడు) శ్రీకృష్ణుడు. అట్టి శ్రీకృష్ణుని భక్తియోగముచేతగాని, జ్ఞానయోగముచేతగాని నిష్ఠతో సేవించే పురుషుడు స్వయముగా ఈశ్వరునకు అధీనములో నున్నవాడే. భోగములు కూడా ఈశ్వరాధీనములే కనుక అట్టి భక్తులు లేదా జ్ఞానులు ఎవరు కూడా ఈ భోగములను విశ్వసించరు. అనగా ప్రేమ చూపరు. (23)

శ్లో॥ పుర్యాం కదాచిత్క్రీడద్భిర్యదు భోజకుమారకైః ।
కోపితా మునయశ్శేపుర్భగవన్మత కోవిదాః ॥ 24

టీ:- పుర్యామితి. శేపుః శాపం దదుః. భగవతో మతే అభిప్రాయే కోవిదాః అభిజ్ఞాః. 24

ఒకప్పుడు యదుకుమారులు, భోజకుమారులు ద్వారకా నగరమునందు క్రీడించుచు మునీశ్వరులకు కోపము కలిగించిరి. ఆ మునీశ్వరులు భగవంతుడైన శ్రీకృష్ణుని అభిమతము నెరిగిన పండితులు. వారు యదు, భోజ కుమారులను శపించిరి. 24

శ్లో॥ తతః కతిపయైర్మాసై ర్వృష్ణి భోజాంధకాదయః ।
యయుః ప్రభాసం సంహృష్టారథైర్దైవ విమోహితాః ॥ 25

కొన్ని మాసముల తరువాత వృష్ణి, భోజ, అంధక వంశీయులగు యాదవులు దైవముచేత మోహింపబడినవారై మిక్కిలి సంతోషముతో రథారూఢులై ప్రభాసతీర్థమునకు వెళ్ళిరి. 25

శ్లో॥ తత్ర స్నాత్వా పితౄన్ దేవానృషీంశ్చైవ తదంభసా ।
తర్పయిత్వాఽథ విప్రేభ్యో గావో బహుగుణా దదుః ॥ 26

టీ:- తతఇతి. వయశ్శీలాది బహుగుణోపేతాః యా గావః తాః. 26

వారు ఆ ప్రభాసతీర్థమునందు స్నానము చేసి ఆ తీర్థజలముతో పితరులకు, దేవతలకు, ఋషులకు తర్పణములను విడిచిరి. మంచి వయస్సు, ఉత్తమస్వభావము, ఎక్కువ పాలుఇచ్చే ఆవులను బ్రాహ్మణులకు దానము చేసిరి. 26

శ్లో॥ హిరణ్యం రజతం శయ్యాం వాసాంస్యజిన కంబళాన్ ।
హయాన్రథానిభాన్కన్యా ధరాం వృత్తి కరీమపి ॥ 27

టీ:- హిరణ్యమితి. కన్యాశ్చ. ధరాంవృత్తికరీం జీవనపర్యాప్తాం. 27

శ్లో॥ అన్నం చోరురసం తేభ్యో దత్వా భగవదర్పణమ్ ।
గో విప్రార్థాసవ శ్శూరాః ప్రణేముర్భువి మూర్ధభిః ॥ 28

టీ:- అన్నమితి. భగవదర్పణం యథా భవతి. గో విప్రార్థమసవః యేషాం. 28

శూరులైన యాదవులు ఆవులను, బ్రాహ్మణులను పెంచి పోషించుట యందే ప్రాణములు గలవారు. అట్టి యాదవులు భగవదర్పణ బుద్ధితో బ్రాహ్మణులకు బంగారమును, వెండిని, శయ్యను, వస్త్రములను, మృగచర్మములను, కంబళ్ళను, గుఱ్ఱములను, రథములను, ఏనుగులను, జీవననిర్వహణకు సరిపోయే భూమిని, రుచికర పదార్థములతో కూడిన అన్నమును దానము చేసిరి. పిమ్మట ఆ బ్రాహ్మణులకు సాష్టాంగ నమస్కారములు చేసిరి. (27-28)

శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
తృతీయోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
మూడవ అధ్యాయము సమాప్తము.

## చతుర్థోఽధ్యాయః

శ్లో. ‘చతుర్థే బంధునిధనం శ్రుత్వాత్మజ్ఞానలబ్ధయే
ఉద్ధవస్యోపదేశేన క్షత్తా మైత్రేయమాగమత్ ’

ఉద్ధవ ఉవాచ

శ్లో॥ అథ తే తదనుజ్ఞాతా భుక్త్వా పీత్వా చ వారుణీమ్ ।
తయా విభ్రంశితజ్ఞానా దురుక్తైర్మర్మ పస్పృశుః ॥ 1

టీ:- అథేతి. తదనుజ్ఞాతాః తైర్బ్రాహ్మణైరనుజ్ఞాతాః. వారుణీం పైష్టీం మదిరాం. దురుక్తైః కర్ణారుంతుదవాక్యైః. 1

శ్లో॥ తేషాం మైరేయ దోషేణ విషమీకృతచేతసామ్ ।
నిమ్లోచతి రవావాసీద్వేణూనామివ మర్దనమ్ ॥ 2

టీ:- తేషామితి. వారుణ్యేవ మైరేయం తస్య దోషేణ. రవౌ నిమ్లోచతి అస్తం గచ్ఛతి సతి మర్దనం కదనం. 2

శ్లో॥ భగవాన్ స్వాత్మమాయాయా గతిం తామవలోక్య సః ।
సరస్వతీముపస్పృశ్య వృక్షమూలముపావిశత్ ॥ 3

టీ:- భగవానితి. ఉపస్పృశ్య సరస్వత్యామాచమ్యేత్యర్థః. 3

## 4 వ అధ్యాయము

ఉద్ధవుడు ఈ విధముగా పలికెను.

బంధువుల మరణవార్తను విని, విదురుడు ఉద్ధవుని ఉపదేశ ప్రకారము మైత్రేయుని వద్దకు చేరుట ఈ నాల్గవ అధ్యాయమునందలి విషయము. తరువాత ఆ యాదవులు బ్రాహ్మణానుమతిని పొంది భుజించిరి. పిమ్మట మద్యమును త్రాగిరి. ఆ మద్యపానముచే వివేకమును కోల్పోయిరి. ఒకరినొకరు సూటి పోటి మాటలతో నిందించుకొనిరి. 1

ఇంతలో సూర్యాస్తమయమయ్యెను. మద్యపాన ప్రభావము చేత వారి బుద్ధి నశించెను. అడవితో వెదురు కర్రలు ఒకదానితో ఒకటి రాసుకొని (అగ్నిపుట్టి) నశించునట్లు ఆ యాదవులు పరస్పరము (ఒకరితోనొకరు) ఘర్షణపడి, చంపుకొనసాగిరి. 2

శ్రీకృష్ణభగవానుడు తన మాయాప్రభావముచేత యాదవ కులమంతయు నశించుట చూచి, సరస్వతీనదిలో ఆచమనము చేసి చెట్టుమొదట్లో కూర్చుండెను. 3

శ్లో॥ అహంచోక్తో భగవతా ప్రపన్నార్తిహరేణ హ ।
బదరీం త్వం ప్రయాహీతి స్వకులం సంజిహీర్షుణా ॥ 4

టీ:- అహమితి. త్వం బదరికాశ్రమం గచ్ఛేతి పూర్వమేవ ద్వారకాయాం. భగవతాహం చోక్తః. 4

శరణాగతుల దుఃఖము పోగొట్టే శ్రీకృష్ణుడు తన వంశమును నశింపజేయదలచినాడు. ద్వారకలో యున్నప్పుడే నన్ను (ఉద్ధవుడిని) బదరికాశ్రమము వెళ్ళమని శ్రీకృష్ణభగవానుడు చెప్పియుండెను. 4

శ్లో॥ అథాపి తదభిప్రేతం జానన్నహమతంద్రితః ।
పృష్ఠతోఽన్వగమం భర్తుః పాదవిశ్లేషణాక్షమః ॥ 5

టీ:- అథేతి. అథాపి తతోక్తోఽపి తదభిప్రేతం కుల సంహారాదికం జానన్నహమతంద్రితస్సన్. 5

శ్రీకృష్ణభగవానుడు నన్ను బదరికాశ్రమము వెళ్ళమని చెప్పినప్పటికే యాదవకులనాశనమనెడి శ్రీకృష్ణుని అభిప్రాయము నెఱిగితిని. శ్రీకృష్ణ పాద వియోగము భరించనివాడనై, అలసట లేనివాడనై అనుసరించి వెళ్ళితిని. 5

శ్లో॥ అద్రాక్షమేకమాసీనం విచిన్వన్ దయితం పతిమ్ ।
శ్రీనికేతం సరస్వత్యాం కృతకేతమకేతనమ్ ॥ 6

టీ:- అద్రాక్షమితి. తత్ర గత్వా దయితం పతిమిష్టం. విచిన్వన్నహం సరస్వత్యాం సరస్వతీతటే కృతకేతం కృతావాసం. స్వయమకేతనం అనాశ్రయం. తత్రాసీనమేకం విజనప్రదేశత్వాత్. శ్రీనికేతం కాంత్యధిష్ఠానం. 6

నా ప్రియతముడు, పతి అయిన శ్రీకృష్ణుని వెదుకుతూ వెళ్ళితిని. లక్ష్మీదేవికి, సౌందర్యమునకు ఆశ్రయమైనవాడు శ్రీకృష్ణుడు. సర్వమునకు తాను ఆశ్రయమై, తనకు వేరొక ఆశ్రయము లేని వాడు. అట్టి శ్రీకృష్ణుడు సరస్వతీనదీ తీరమునందు ఒంటరిగా కూర్చుని యుండగా నేను (ఉద్ధవుడను) చూచితిని. 6

శ్లో॥ శ్యామావదాతం విరజం ప్రశాంతం చారులోచనమ్ ।
దోర్భిశ్చతుర్భిర్విదితం పీతకౌశాంబరేణ చ ॥ 7

టీ:- శ్యామేతి శ్యామవత్ శోభం విగతం రజోగుణం అతఏవ ప్రకర్షేణ శాంతం చతుర్భుజైర్విదితం లక్షితం. పీతాంబరేణ చ కౌశం కౌశేయ-మిత్యర్థః. 7

ప్రకాశిస్తున్న నీలము వంటి వన్నెకలవాడు, రజోగుణము తొలగిన వాడు (సాత్వికుడు), ప్రశాంతమైనవాడు, అందమైన కన్నులు గలవాడు, నాలుగు భుజములు గలవాడు, పచ్చని పట్టు వస్త్రములు గల ఆతనిని శ్రీకృష్ణుడని తెలిసికొనగలిగితిని. 7

శ్లో॥ వామ ఊరావధిశ్రిత్య దక్షిణాంఘ్రి సరోరుహమ్ ।
అపాశ్రితార్భకాశ్వత్థమకృశం త్యక్త పిప్పలమ్ ॥ 8

టీ:- వామేతి. అధిశ్రిత్య ఉపరిస్థం కృత్వా. అపాశ్రితః పృష్ఠతోఽవ-ష్టబ్ధః అర్భకో బాలః కోమలాశ్వత్థో యేన తం. త్యక్తం పిప్పలం విషయసుఖం యేన తం. తథాప్యకృశమానంద పరిపూర్ణం. 8

శ్రీకృష్ణుడు ఎడమ తొడపైన పద్మము వంటి తన కుడికాలిని పెట్టి, కోమలమైన లేతరావిచెట్టుకు నడుమును ఆనించి కూర్చుని యుండెను. ఆయన విషయసుఖములను వదిలినవాడుగా, ఆనంద పరిపూర్ణుడుగా నుండెను. 8

శ్లో॥ తస్మిన్మహాభాగవతో ద్వైపాయన సుహృత్సఖా ।
లోకాననుచరన్ సిద్ధ ఆజగామ యదృచ్ఛయా ॥ 9

టీ:- తస్మిన్నితి. తస్మిన్ ప్రదేశే. ద్వైపాయన సుహృత్సఖా చ యస్య సః స్వగురు పుత్రత్వాత్పరాశరశిష్యో మైత్రేయ ఇత్యర్థః. 9

పరమభాగవతుడును, తన గురువుయగు పరాశరుని పుత్రుడును, వ్యాసుని ప్రియశిష్యుడును సిద్ధుడును యగు మైత్రేయుడు స్వేచ్ఛగా లోకసంచారము చేయుచు ఆ ప్రదేశమునకు అనుకోకుండా వచ్చెను. 9

శ్లో॥ తస్యానురక్తస్య మునేర్ముకుందః
ప్రమోదభావానతకంధరస్య ।
ఆశృణ్వతో మామనురాగ హాస
సమీక్షయా విశ్రమయన్నువాచ ॥ 10

టీ:- తస్యేతి. ప్రమోదేన భావేన చ ఆనతా కంధరా యస్య తస్య. పాఠాంతరే ప్రమోదస్య భారేణ. అనురక్తస్య భక్తస్య మునేర్మైత్రేయస్య ఆశ్రుణ్వతః అనురాగేణ సహ హాసో యస్యాం తయా సమీక్షయా విశ్రమయన్ విగతశ్రమం కుర్వన్. 10

ఆ మైత్రేయుడు భగవానునిపై అధికమైన అనురాగము గలవాడు. సంతోషముచేత, భక్తిచేత శిరస్సు వంచియున్నాడు. అట్టి మైత్రేయమహర్షి వినుచుండగా నన్ను (ఉద్ధవుడిని) ప్రేమతో చూచుచూ, చిరునవ్వునవ్వుతూ, నాకు ఆనందము కలిగించుచూ ఇట్లు పలికెను. 10

శ్రీభగవానువాచ

శ్లో॥ వేదాహమంతర్మనసీప్సితం తే
దదామి యత్తద్దురవాపమన్యైః।
సత్రే పురా విశ్వసృజాం వసూనాం
మత్సిద్ధికామేన వసోత్వయేష్టః ॥ 11

టీ:- వేదేతి. హే ఉద్ధవ. తే మనసీప్సితమహమన్తః స్థితో వేద వేద్మి. దానే హేతుః-విశ్వసృజాం వసూనాం చ మిలితానాం సత్రే. హే వసో ఇతి పురా జన్మని త్వం వసురభూస్తదా మత్ప్రాప్తికామేన త్వయాఽహమిష్టః. అతస్తత్సాధనం దదామి దాస్యామి. అన్యైర్మత్పరాఙ్ముఖైః దుష్ప్రాపమ్ 11

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను.

ఓ ఉద్ధవా! నీ మనస్సులోని కోరిక నాకు తెలియును. నాకు విముఖులైన వారు (ఇతరులు) పొందలేని ఆ కోరికను తీర్చెదను. (కారణమేమనగా) పూర్వము విశ్వమును సృష్టించే ప్రజాపతులు, వసువులు కలిసి చేసిన యజ్ఞములో నీవు నన్ను పొందగోరి ఆరాధించితివి. 11

శ్లో॥ స ఏష సాధో చరమో భవానా
మాసాదితస్తే మదనుగ్రహో యత్ ।
యన్మాం నృలోకాన్రహ ఉత్సృజంతం
దిష్ట్యా దదృశ్వాన్విశదానువృత్త్యా ॥ 12

టీ:- తస్య భాగ్యమభినందతి - స ఏష భవో జన్మ తే భవానాం మధ్యే చరమః యద్యస్మిన్మదనుగ్రహ ఆసాదితో లబ్ధః యత్పునర్మాం రహ ఏకాంతే. విశదానువృత్త్యా. ఏకాంతభక్త్యా దదృశ్వాన్ దృష్టవానసి ఏతద్దిష్ట్యా భద్రం జాతమిత్యర్థః నృలోకాన్ నృశబ్దేన జీవాస్తేషాం. లోకాననుసృజన్తం తం వైకుంఠం గచ్ఛంతమిత్యర్థః. 12

ఉద్ధవుని భాగ్యమును కొనియాడుచున్నాడు. ఓ సాధువగు ఉద్ధవా!నా అనుగ్రహముపొందిన నీకు ఇదియే చివరి జన్మ. (ఎందుకనగా)మానవలోకము విడిచి వైకుంఠమునకు వెళ్ళుచున్న నన్ను దైవయోగముచే ఏకాంతమునందు స్వచ్ఛమగు భక్తితోచూచితివి. 12

శ్లో॥ పురా మయా ప్రోక్తమజాయ నాభ్యే
పద్మే నిషణ్ణాయ మమాదిసర్గే ।
జ్ఞానం పరం మన్మహిమావభాసం
యత్సూరయో భాగవతం వదంతి ॥ 13

టీ:- దదామీతి యదుక్తం తదేవ నిర్దిశతి - పురేతి. పురా పూర్వస్మిన్ పాద్మే కల్పే. ఆదిసర్గే సర్గోపక్రమ సమయే. నాభ్యే నాభిజే పద్మే. నిషణ్ణాయ అజాయ బ్రహ్మణే మన్మహిమా మమ లీలా అవభాస్యతే యేన తన్మహిమ

పదకొండవ శ్లోకములో చెప్పిన "దదామి"(ఇచ్చుదమ) అను మాటకు సంబంధము ఇచట కలదు. పూర్వము సృష్ట్యాదియందు పద్మకల్పమునందు నా నాభియందలి పద్మములో కూర్చునియున్న బ్రహ్మకు నా మహిమను తెలియజేసే సర్వోత్కృష్టమగు జ్ఞానమును ఉపదేశించితిని. దానినే విద్వాంసులు "భాగవతము" అనుచున్నారు. అట్టి "భాగవతజ్ఞానము"ను ఇప్పుడు నీకు నేను ఇచ్చుచున్నాను. 13

ప్రకాశకం. తత్పరం జ్ఞానం మయా ప్రోక్తం సూరయః యత్ జ్ఞానం భాగవతం వదంతి. 13

ఉద్ధవ ఉవాచ

శ్లో॥ ఇత్యాదృతోక్తః పరమస్య పుంసః
ప్రతిక్షణానుగ్రహ భాజనోఽహమ్ ।
స్నేహోత్థరోమా స్ఖలితాక్షరస్తం
ముంచన్ శుచః ప్రాంజలిరాబభాషే ॥ 14

టీ:- ఇతీతి. ఇత్యేవమాదృతశ్చాసావుక్తశ్చ పరమస్య పుంసః ప్రతిక్షణ మనుగ్రహస్య పాత్ర భూతోఽహం. పాఠాంతరే. ప్రతిక్షణం కృపావ లోక ఏవానుగ్రహః తస్యపాత్రభూతఇతి స్నేహపాశాదుత్థితరోమా. స్ఖలితాక్షరశ్చసన్ శుచోఽశ్రూణి ముంచంశ్చ ప్రాంజలిశ్చ సన్నా బభాషే ఉక్తవానస్మి. 14

ఉద్ధవుడు ఇట్లనెను

ఈ విధముగా శ్రీకృష్ణుడు నాతో ఆదరపూర్వకముగా పలికెను. నేను(ఉద్ధవుడిని) ప్రతి క్షణము ఆ పరమపురుషుని అనుగ్రహమునకు పాత్రుడనైతిని. నాకు ఆయునయందలి ప్రేమాతిశయముచే రోమాంచము కలిగినది. మాటలు తడబడు చుండెను. కన్నీరు విడుస్తూ చేతులు జోడించి ఇట్లు పలికితిని. 14

శ్లో॥ కో న్వీశ తే పాదసరోజ భాజాం
సుదుర్లభోఽర్థేషు చతుర్ష్వపీహ ।
తథాపి నాహం ప్రవృణోమి
భూమన్భవత్పదాంభోజ నిషేవణోత్సుకః ॥ 15

నేను నా అజ్ఞాన నివృత్తిని కోరడములేదు. కాని నిన్ను సేవించుటయందే ఉత్సాహము కలవాడను. అందుకే ధర్మ, అర్థ, కామ, మోక్షములలో దేనిని కోరుటలేదు అని చెప్పుచున్నాడు. ఓ పరబ్రహ్మస్వరూపుడా! నీ పాదపద్మములను సేవించువారికి ఈ

టీ:- న హి స్వాజ్ఞాన నివృత్తి కామోஉహం, కింతు త్వన్నిషేవణో-త్సుకః అతోధర్మాదీన్నవృణోమీత్యాహ - క ఇతి. ధర్మాదిషు చతుర్ష్వప్యర్థేషు చ. తేపాదసరోజభాజాం ఇహ కోஉన్వర్థస్సుదుర్లభః. తథాపి తస్మాత్కారణాత్. హే భూమన్. భవత్పదాంభోజనిషేవణే ఉత్కా ఉత్కంఠా యస్య సోஉహం ధర్మాదీన్న వృణోమి. 15

లోకములో ఏ అర్థములు దుర్లభములు? (అన్నీ సులభముగా లభించునని అర్థము) ఆ కారణము చేత, నీ పాద సరోజములను సేవించుట యందు ఉత్సాహముగల నేను ధర్మాది అర్థములను కోరను. (15)

శ్లో॥ కర్మాణ్యనీహస్య భవో భవస్య తే
దుర్గాశ్రయోஉథారిభయాత్పలాయనమ్ ।
కాలాత్మనో యత్ప్రమదాయుతాశ్రయః
స్వాత్మన్రతేః ఖిద్యతి ధీర్విదామిహ ॥ 16

టీ:- కింతు త్వయ్యఘటమానాచరణం దృష్ట్వా మే మోహో భవతి. అతస్తత్త్వజ్ఞానం దేహీతి ప్రార్థయిష్యన్ తావదఘటమానాచరణం దర్శయతి - కర్మాణీతి. అనీహస్య నిష్క్రియస్య . తే కర్మాణి. అభవస్య. అజన్మనః తే భవో జన్మ. కాలాత్మనః తవ. అరిభయాద్దుర్గాశ్రయః పలాయనం చ స్వాత్మని రతిర్యస్య ప్రమదాయుతేన బహ్వీభిస్త్రీభిరాశ్రయః గ్రహస్థాశ్రమ ఇతి యత్. ఇహాస్మిన్ విషయే విదుషామపి ధీః ఖిద్యతి సంశయమేతి. అపి శబ్దోஉత్రాధ్యాహర్తవ్యః. 16

కాని నీలోని అఘటనాఘటన ఆచరణను చూచి నాకు మోహము కలుగుచున్నది. అందుకే తత్త్వజ్ఞానమును ఇవ్వమని కోరుచునే కృష్ణుని అఘటనాఘటనాచరణను(ఉద్ధవుడు) చూచు - చున్నాడు. ఓ కృష్ణా కర్మలు చేయుట యందు నీకు కోరికలేదు, అకర్తవు, కాని కర్మలను ఆచరించుచుందువు. పుట్టుక లేనివాడవు. కాని అవతరించుచుందువు. కాల(మృత్యువు) స్వరూపుడవు. కాని శత్రువులకు భయపడి ద్వారక అనే దుర్గమును ఆశ్రయించితివి. ఆత్మస్వరూపమునందే రమించే నీవు పదివేల భార్యలతో గూడి గృహస్థుడవైతివి. ఇట్టి నీ పనులను గమనించినపుడు పండితుల బుద్ధి కూడా సంశయములో పడును. (16)

శ్లో॥ మంత్రేషు మాం వా ఉపహూయ యత్త్వమ్
అకుంఠితాఖండ సదాత్మబోధః ।
పృచ్ఛేః ప్రభో ముగ్ధ ఇవాప్రమత్తః
తన్నో మనో మోహయతీవ దేవ ॥ 17

టీ॥ కించ మంత్రేషు చ ప్రస్తుతేషు చ సత్సు మామాహూయ వై అహో పృచ్ఛేదపృచ్ఛః. అకుంఠితః కాలాదీనాఽ ఖండః సంతతః సదాత్మా సంశయాదిరహితో బోధో విద్యాశక్తిర్యస్య. ముగ్ధవదజ్ఞవత్. అప్రమత్తోఽ వహితః సన్. తన్నోఽస్మాకం మనో మోహయతీవ. 17

ఓ దేవా! నీవు మొక్కవోని అఖండ సచ్చిదాత్మజ్ఞానముగల వాడవు. అయిననూ, నన్ను పిలిచి, ఏమీ తెలియనివానివలె సావధానుడవై నా సలహాలను అడిగెడివాడవు. ఈ సంగతి నా మనస్సును మిక్కిలి మోహపెట్టుచున్నది. 17

శ్లో॥ జ్ఞానం పరం స్వాత్మరహః ప్రకాశం
ప్రోవాచ కస్మై భగవాన్ సమగ్రమ్ ।
అపి క్షమం నో గ్రహణాయ భర్త
ర్వదాంజసా యద్వృజినం తరేమ ॥ 18

టీ:- జ్ఞానమితి. స్వాత్మనస్తవ రహో రహస్య రూప తత్త్వస్య ప్రకాశకం. సమగ్రరూపం. పరంజ్ఞానం. కస్మై బ్రహ్మణే. సర్వనామత్వమార్షం. భగవాన్ ప్రోవాచ హి. నోఽస్మాకం గ్రహణాయాపి క్షమం యది యోగ్యం తర్హి హే భర్తః స్వామిన్ వద. యద్యతః వృజినం సంసార-దుఃఖం అంజసా అనాయాసేన. తరిష్యామః. 18

ఓ ప్రభూ ! భగవంతుడవగు నీ స్వరూపమును ప్రకాశింపజేసే గొప్ప రహస్యమైన జ్ఞానమును బ్రహ్మకు సమగ్రముగా చెప్పియుంటివి. నాకు ఆ రహస్యజ్ఞానము గ్రహించే సామర్థ్యము, యోగ్యత ఉన్నచో చెప్పుము. ఆ రహస్య జ్ఞానమువలన మేము సంసారదుఃఖమును తేలికగా తరించెదము. 18

శ్లో॥ ఇత్యావేదిత హార్దాయ మహ్యం స భగవాన్ గురుః ।
ఆదిదేశారవిందాక్ష ఆత్మనః పరమాం గతిమ్ ॥ 19

టీ:- ఇతీతి. అరవిందాక్షః గురుః పరమస్సభగవాన్ ఇత్యేవం ప్రకారేణావేదితో హార్దో హృదిస్థితోఽభిప్రాయో యేన తస్మై మహ్యం. 19

ఈ విధముగా నా మనస్సులోని అభిప్రాయమును తెలియజేయగా, జగద్గురువు, కమలలోచనుడు అయిన శ్రీకృష్ణభగవానుడు నాకు తన నిజస్వరూపమును, పరమతత్త్వమును ఉపదేశించెను. 19

శ్లో॥ స ఏవమారాధితపాదతీర్థా
దధీతతత్త్వాత్మ విబోధమార్గః ।
ప్రణమ్య పాదౌ పరివృత్య దేవమి
హాగతోఽహం విరహాతురాత్మా ॥ 20

టీ:- స ఇతి. ఆరాధిత పాదో భగవాన్ స ఏవ తీర్థం గురుస్తస్మాత్. అధీతోఽధిగతస్తత్త్వాత్మ విబోధస్య పరమార్థాత్మజ్ఞానస్య మార్గో యేన సోఽహం. దేవం పరివృత్య ప్రదక్షిణీకృత్య. 20

ఇట్లు అందరిచే ఆరాధింపబడే పవిత్రపాదములు గలిగిన శ్రీకృష్ణభగవానుని నుండి పరమాత్మతత్త్వమును తెలిసికొన్నాను. ఆయన పాదములకు నమస్కరించి, ప్రదక్షిణము చేసినాను. శ్రీకృష్ణుని విరహముచే వ్యాకులిత చిత్తముగలవాడనై ఇచ్చుటకు వచ్చినాను. 20

శ్లో॥ సోఽహం తద్దర్శనాహ్లాద వియోగార్తియుతః ప్రభోః ।
గమిష్యే దయితం తస్య బదర్యాశ్రమమండలమ్ ॥ 21

టీ:- స ఇతి. తస్య దర్శనేనాహ్లాదో వియోగేనార్తిశ్చ తాభ్యాం యుతః ప్రభోర్దయితం బదర్యాశ్రమస్థానం గమిష్యామి. 21

ఓ విదురా ! నేను శ్రీకృష్ణ దర్శనముచేత ఆనందమును మరియు వియోగముచేత దుఃఖమును పొందినాను. ఆ శ్రీకృష్ణునకు ప్రియమైన ప్రదేశమగు బదరికాశ్రమమునకు వెళ్ళెదను. 21

శ్లో॥ యత్ర నారాయణో దేవో నరశ్చ భగవానృషిః ।
మృదు తీవ్రం తపో దీర్ఘం తేపాతే లోకభవనౌ ॥ 22

టీ:- యత్రేతి. లోకభావనౌ లోకానుగ్రాహకౌ. మృదు పరోపద్రవ శూన్యం. తీవ్రం దుశ్చరం. దీర్ఘ మాకల్పాంతం. తేపాతే తపశ్చర ఇత్యర్థః. 22

ఆ బదరికాశ్రమము నందు లోకానుగ్రహకారకులైన నారాయణ దేవుడు, పూజ్యుడగు నరమహర్షి కల్పాంతము వరకు తపస్సు చేసిరి. వారి తపస్సు పరోపద్రవ శూన్యముగా దుశ్చరమైనదిగా ఉండెను. 22

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఇత్యుద్ధవాదుపాకర్ణ్య సుహృదాం దుస్సహం వధమ్ ।
జ్ఞానేనాశమయత్క్షత్తా శోకముత్పతితం బుధః ॥ 23

టీ:- ఇతీతి. జ్ఞానేన వివేకేన. 23

శ్రీశుకుడు ఇట్లు పలికెను

ఈ విధముగా మిత్రుల వధను గురించి దుస్సహమైన వార్తను ఉద్ధవుడు చెప్పగా విని వివేకియగు విదురుడు పొంగివస్తున్న శోకమును వివేకముచే తనలోపలే అణుచుకొనెను. 23

శ్లో॥ స తం మహాభాగవతం వ్రజంతం కౌరవర్షభః ।
విస్రంభాదభ్యధత్తేదం ముఖ్యం కృష్ణపరిగ్రహే ॥ 24

టీ:- స ఇతి. కృష్ణ పరిగృహీతజనే ముఖ్యం మహాభాగవతం తం విస్రంభాద్విశ్వాసాత్. 24

శ్రీకృష్ణుని సేవించి, ఆయనచే స్వీకరించబడిన వారిలో ముఖ్యుడు ఉద్ధవుడు. ఆయన గొప్ప భగవద్భక్తుడు. బదరికాశ్రమమునకు వెళ్ళబోతున్న ఉద్ధవునితో కౌరవోత్తముడగు విదురుడు విశ్వాసముతో ఇట్లు పలికెను. 24

విదుర ఉవాచ

శ్లో॥ జ్ఞానం పరం స్వాత్మరహః ప్రకాశం
యదాహ యోగేశ్వర ఈశ్వరస్తే ।
వక్తుం భవాన్నోఽర్హతి యద్ధి విష్ణో
ర్భృత్యాః స్వభృత్యార్థకృతశ్చరంతి ॥ 25

టీ:- జ్ఞానమితి. స్వాత్మానస్తవ రహః రహస్యరూప తత్త్వస్య ప్రకాశకం. జ్ఞానం పూర్వనిర్దిష్టం స్వభృత్యార్థకృతః. యద్య విష్ణోః భృత్యాః స్వభృత్య ప్రయోజన సాధకాః సంతశ్చరంతి. న హి కృతార్థానామన్యత్కృత్యమస్తీత్యర్థః. 25

విదురుడు ఇట్లు పలికెను:-

యోగేశ్వరుడగు శ్రీకృష్ణభగవానుడు తన రహస్యమును ఆత్మతత్త్వప్రకాశకమగు పరమజ్ఞానమును నీకు బోధించినాడు. అట్టి జ్ఞానమును (నేను అర్హుడనైతే) దయతో బోధించవలసినది. విష్ణు భక్తులు తమ భక్తుల ప్రయోజనములను నెరవేర్చుట కొరకై మాత్రమే సంచరించుచుందురు. కృతకృత్యులు సాధించదగిన ఇతర ప్రయోజన మేమియు ఉండదు కదా ! 25

ఉద్ధవ ఉవాచ

శ్లో॥ నను తే తత్త్వసంరాధ్య ఋషిః కౌషారవోఽంతిమే ।
సాక్షాద్భగవతాదిష్టో మర్త్యలోకం జిహాసతా ॥ 26

టీ:- నన్వితి. కౌషారవో మైత్రేయః. ఋషిః. తేత్వయా తత్త్వసంరాధ్యః తత్త్వాయతత్త్వోపదేశాయ సంరాధ్య ఇతి. సయద్యుపదేక్ష్యతి వానవేతి శంకా న కార్యా స తు మర్త్యలోకం జిహాసతా భగవతా అంతిమే తత్సమక్షమేవ త్వదుపదేశార్థం సాక్షాదాదిష్టో నిర్దిష్టః. అయం భావః.

ఉద్ధవుడు ఇట్లు పలికెను

తత్త్వజ్ఞానోపదేశము పొందుటకై నీవు మైత్రేయ మహర్షిని ఆరాధించుము. అతను నీకు తత్త్వజ్ఞానమును ఉపదేశించును. శ్రీకృష్ణ పరమాత్మ ఈ మానవలోకమును విడిచిపోయేవేళ నా సమక్షములోనే నీకు (విదురునకు) తత్త్వజ్ఞానోపదేశము చేయమని మైత్రేయమహర్షిని ఆదేశించినాడు. 26

భగవతైవ స్మరణమాత్రేణ తవాపి తత్త్వముపదిష్టప్రాయం అతః కేవల మసంభావనా నివృత్తయే జ్ఞానీ కశ్చిదారాధ్యః ఇత్యేతావదేవ కర్తవ్యః స చ తవారాధ్యో మైత్రేయః న త్వహం మమాంతికమేవ త్వదుపదేశే తస్యాదిష్టత్వాదితి. 26

శ్లో॥ ఇతి సహ విదురేణ విశ్వమూర్తేః
గుణ కథయా సుధయా ప్లావితో రుతాపః ।
క్షణమివ పులినే యమస్వసుస్తాం
సముషిత ఔపగవిర్నిశాంతతోఽగాత్ ॥ 27

ఈ విధముగా విదురునితో కలసి జగద్రూపుడగు భగవానుని గుణకథామృతము గ్రోలెను. ఆ అమృతపానముచే ఉద్ధవుని మనోవేదన అంతయు తొలగిపోయెను. ఆ రాత్రిని ఒక క్షణకాలమువలె గడిపి ఉద్ధవుడు అక్కడి నుండి వెడలిపోయెను. 27

టీ:- ఇతీతి. హరి గుణ కథాకారసుధాయా ఆప్లుతో ప్లావితో పనీత ఉరుస్తాపో యస్య సః. యమస్వసుః యమునాయాః పులినే తీరే. తాం నిశాం క్షణమివ సముషితః. ఔపగవిః ఉద్ధవః. 27

రాజోవాచ

శ్లో॥ నిధనముప గతేషు వృష్ణి భోజే
ష్వతి రథ యూథ పయూథపేషు ముఖ్యః ।
స తు కథమవశిష్ట ఉద్ధవో యద్ధ
రిరపి తత్యజ ఆకృతిం త్ర్యధీశః ॥ 28

పరీక్షిన్మహారాజు పలికెను

అతిరథులు, మహారథులు, వారికి కూడా నాయకులగు వృష్ణి భోజ వంశీయులు మరణమును పొందిరి. ముల్లోకాలకధిపతియగు శ్రీకృష్ణుడు కూడ దేహమును విడిచెను. మఱి ఒక్క ఉద్ధవుడు మాత్రము మిగిలియుండుట ఎట్లు సంభవించెను? 28

టీ:- నిధనమితి. అతిరథయూథపాః తద్యూథపాః తద్యూథపాశ్చేత్యతి రథయూథపయూథపాః తేష్వయంత్రివిధేషు అధమ మధ్యమోత్తమేష్వపి వృష్ణి భోజేషు బ్రహ్మశాపేన నిధనం ప్రాప్తేషు. ఏషాం తు ముఖ్యో నియంతా. త్ర్యధీశః త్రయాణాం బ్రహ్మాదీనామీశో హరిరపి ఆకృతిం మనుష్యాకారం తత్యజే త్యక్తవాన్. తత్ర సతూద్ధవః. కథమవశిష్టః. 28

శ్రీశుక ఉవాచ

శ్లో॥ బ్రహ్మశాపాప దేశాన కాలేనామోఘువాంఛితః ।
సంహృత్య స్వకులం స్ఫీతం త్యక్ష్యన్ దేహమచింతయత్ ॥29

టీ:- బ్రహ్మేతి. అమోఘం వాంఛితం యస్య సః శ్రీకృష్ణః. న హ్యత్ర శాపః ప్రభుః కింతు భగవదిచ్ఛైవేత్యర్థః.బ్రహ్మశాపః అపదేశో మిషం యస్య తేన కాలేన స్వశక్తిరూపేణ. స్వకులం సంహృత్య స్ఫీతం పుష్టం దేహత్యాగం కరిష్యన్. 29

శ్లో॥ అస్మాల్లోకాదుపరతే మయి జ్ఞానం మదాశ్రయమ్ ।
అర్హత్యుద్ధవ ఏవాద్ధా సంప్రత్యాత్మవతాం వరః ॥ 30

టీ:- అస్మాదితి. మయ్యుపరే సతి మదాశ్రయం జ్ఞానమర్హతి. అయం జ్ఞానయోగ్యో భవతి. అద్ధా ప్రత్యక్షసిద్ధః. ఆత్మవతాం ధీమతాం. 30

శ్రీశుకుడు పలికెను

సత్యసంకల్పుడగు శ్రీకృష్ణుడు బ్రాహ్మణశాపమను మిషచేత తన స్వీయరూపమగు కాలములో స్వశక్తి రూపమగు తన వంశమును నశింపజేసి తన దేహమును విడిచిపెట్టదలచి ఇట్లు ఆలోచించెను. 29

నేను ఈ లోకమునుండి వెడలిన పిమ్మట నా జ్ఞానమును (భగవతత్త్వ జ్ఞానమును) సాక్షాత్తుగ అవగతము చేసికొనుటకు బుద్ధి మంతులలో శ్రేష్ఠుడును, జితేంద్రియుడును అగు ఉద్ధవుడు మాత్రమే తగిన వాడు. 30

శ్లో॥ నోద్ధవోఽణ్వపి మన్న్యూనో యద్గుణైర్నార్దితః ప్రభుః।
అతో మద్వయునం లోకం గ్రాహయన్నిహ తిష్ఠతు ॥ 31

టీ:- నేతి. అణ్వీషదపి మత్తస్సకాశాత్ న్యూనగుణో న భవతి. యద్యస్మాత్ గుణైర్విషయైర్నార్దితో న క్షోభితః అతః కారణాత్ మద్వయునం మద్విషయం జ్ఞానం లోకస్య గ్రాహయన్నుపదిశన్. 31

ఉద్ధవుడు జితేంద్రియుడు, అతడు సత్త్వరజస్తమో గుణములచే పీడింపబడలేదు. శబ్దాది విషయములకు చిక్కలేదు. అందుచేత నా జ్ఞానమును (భగవతత్త్వజ్ఞానము) లోకులకు బోధిస్తూ ఈ లోకములోనే కొంత కాలము ఉండుగాక! 31

శ్లో॥ ఏవం త్రిలోక గురుణా సందిష్టశ్శబ్ద యోనినా ।
బదర్యాశ్రమమాసాద్య హరిమీజే సమాధినా ॥ 32

టీ:- ఏవమితి. శబ్దయోనినా వేద ప్రవర్తన కారణేన ఈజే పూజయామాస. 32

త్రిలోకములకు గురువు, వేదమునకు కారణమైనవాడు అగు శ్రీకృష్ణునిచే ఈ విధముగా ఆదేశింపబడినవాడై ఉద్ధవుడు బదరికాశ్రమము చేరుకుని ఏకాగ్రచిత్తముతో శ్రీహరిని ఆరాధించెను. 32

శ్లో॥ విదురోఽప్యుద్ధవాచ్ఛ్రుత్వా కృష్ణస్య పరమాత్మనః।
క్రీడయోపాత్త దేహస్య కర్మాణి శ్లాఘితాని చ ॥ 33

పరమాత్ముడును, లీలగా అవతారమును ధరించినవాడును అగు కృష్ణుని శ్లాఘనీయములగు చరితములను (లీలలను)ఉద్ధవుడు చెప్పగా విదురుడు వినెను. 33

శ్లో॥ దేహన్యాసం చ తస్యైవం ధీరాణాం ధైర్యవర్ధనమ్।
అన్యేషాం దుష్కరతరం పశూనాం విక్లబాత్మనామ్ ॥ 34

శ్రీకృష్ణుడు దేహమును విడిచిన ఈ విధానము పండితులకు ధైర్యము పెంచునదిగా యుండెను. ఇతరులగు అధైర్యవంతులకు,

టీ:- దేహేతి. పశూనాం పశుతుల్యానాం విక్లబాత్మనామ ధీర చిత్తానాం చ ధీరాణాం జ్ఞానినాం ధైర్యవర్ధనం తస్య శ్రీకృష్ణస్య దేహన్యాసం చ. (33,34)

శ్లో॥ ఆత్మానం చ కురుశ్రేష్ఠ కృష్ణేన మనసేక్షితమ్।
ధ్యాయన్ గతే భాగవతే రురోద ప్రేమవిహ్వలః ॥ 35

టీ:- ఆత్మానమితి. కృష్ణేన మనసేక్షితం చింతితం చాత్మానం. విదురస్య మైత్రేయ ఉపదేష్టేతి. తత్ర భగవత్స్మరణాత్ భాగవతే ఉద్ధవే అత్యుచ్చైః రురోద. 35

శ్లో॥ కాలింద్యాః కతిభిస్సిద్ధ అహోభిః భరతర్షభః।
ప్రాపద్యత స్వస్సరితం యత్ర మిత్రాసుతో మునిః ॥ 36

టీ:- కాళింద్యా ఇతి. శ్రీకృష్ణానుగ్రహాత్ కృత్యకృత్య ఏవ విదురః కతిభిరహోభిః కతిపయైర్దినైః.కాళింద్యా స్సకాశాత్ స్వస్సరితం గంగాం ప్రాపద్యత ప్రాప్తః. 36

శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
చతుర్థోఽధ్యాయః

పశుతుల్యులకు (అజ్ఞానులకు) దుష్కరముగా (ఆచరించుటకు కఠిన మైనదిగా) యుండెను. 34

కురుశ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! పరమభాగవతుడగు ఉద్ధవుడు వెళ్ళిన తరవాత, శ్రీకృష్ణుడు తనను స్మరించినాడని ఉద్ధవుడు చెప్పిన విషయాన్ని తలచుకొని, విదురుడు ఆ శ్రీకృష్ణుడినే ధ్యానిస్తూ, ప్రేమవ్యాకుల చిత్తము గలవాడై రోదించెను. 35

శ్రీకృష్ణానుగ్రహముచే కృతకృత్యుడైన, భరత వంశ శ్రేష్ఠుడైన విదురుడు కొన్ని దినములు కాళిందీతీరమున నివసించి, ఆ పిమ్మట బయలుదేరి గంగాతీరమును చేరెను. ఆ గంగా తీరములో మైత్రేయ మహర్షియుండెను. 36

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
నాలుగవ అధ్యాయము సమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## పంచమోఽధ్యాయః

శ్లో. పంచమే భగవల్లీలాం క్షత్త్రాపృష్టో మహామునిః, ప్రోవాచ మహదాదీనాం సర్గం తైశ్చహరేస్స్తుతిమ్. ఉక్తశ్చతుర్భిరధ్యాయైః.

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ద్వారి ద్యునద్యా ఋషభః కురూణాం
మైత్రేయమాసీనమగాధ బోధమ్।
క్షత్తోపసృత్యాచ్యుత భావ శుద్ధః
పప్రచ్ఛ సౌశీల్య గుణాభితృప్తః ॥1

టీ:- క్షత్త్రా మైత్రేయ సంగమః, సంవాదస్తు తయోస్కంధ ద్వయేనాథ నిగద్యతే. కౌషారవం పర్యపృచ్ఛద్గంగాద్వారే కృత క్రియం. విదురః కృష్ణనిర్దిష్టం ముకుందం మనసాగతః. ద్వారీతి. ద్యునద్యాః గంగాయాః . ద్వారి హరిద్వారే ఆసీనం న తు కర్మవ్యగ్రం. తత్ర హేతుః - అగాధో అపరిచ్ఛిన్నో బోధో యస్యేతి. సౌశీల్య గుణాభితృప్తం కరుణార్జవాదిగుణైః అభితృప్తః సంతుష్టం క్షత్తు స్సౌశీల్యాదిభిరభి తృప్తం వా ప్రశ్నానేవాహ సుఖాయేతి - పంచదశభిః. 1

## 5వ అధ్యాయము

విదురుడడుగగా మైత్రేయమహర్షి భగవానుని లీలలను, మహదాదుల సృష్టిని గురించి చెప్పడము, దానితో పాటు శ్రీహరి లీలలను కీర్తించుటయను విషయములను ఈ అయిదవ అధ్యాయ-మున వర్ణించడమైనది.

శ్రీశుకుడు ఇట్లు పలికెను.

గంగా ద్వారము నందు లోతైన జ్ఞానము గలవాడును, సర్వకర్మ సన్యాసియైనవాడును అయిన మైత్రేయమహర్షి కూర్చునియుండెను. మైత్రేయుని యొక్క సాధుస్వభావముచే మిక్కిలి ఆనందమును పొందినవాడై, కురువంశ శ్రేష్ఠుడును, శ్రీకృష్ణునియందలి భక్తిచే పవిత్రాంతఃకరణము గలవాడైన విదురుడు ఈ పదిహేను శ్లోకములతో ఇట్లు ప్రశ్నించెను. 1

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

విదుర ఉవాచ

శ్లో॥ సుఖాయ కర్మాణి కరోతి లోకో
న తైః సుఖంవాన్యదుపారమం వా ।
విందేత భూయస్తత ఏవ దుఃఖం
యదత్ర యుక్తం తు భవాన్ వదేన్నః ॥ 2

టీ:- సుఖాయేతి తైః కర్మభిః సుఖంవాఽన్యస్య దుఃఖస్యోపశమమ్ ఇత్యర్థః. అథవాన్యద్వా న విందేత కిం తదిత్యపేక్షాయాం తస్యైవ నిర్దేశః ఉపారమం వేతి. తతః తైః కర్మభిః భూయః పునః పునర్దుఖమేవ విందేత. అత్రైవంవిధే సంసారే నోఽస్మాకం యద్యుక్తం కర్తుం యోగ్యంతత్సర్వజ్ఞః ఖలు భగవాన్ వదేన్ని రూపయేత్. 2

విదురుడు ఇట్లు పలికెను.

మానవుడు సుఖమునుకోరి కర్మలను చేయుచున్నాడు. ఆ కర్మాచరణవలన సుఖమును పొందుట లేదు. సుఖేతరమైన దుఃఖమును విడుచుటలేదు. పైగా కర్మాచరణవలన తిరిగి తిరిగి దుఃఖమునే పొందు చున్నాడు. సర్వజ్ఞుడవైన నీవు ఇట్టి పరిస్థితిలో చిక్కుకున్న మానవులకు యోగ్యమైన ఉపాయమేమిటో తెలుపగలవు. 2

శ్లో॥ జనస్య కృష్ణాద్విముఖస్య దైవా
దధర్మశీలస్య సుదుఃఖితస్య ।
అనుగ్రహాయేహ చరంతి నూనం
భూతాని భవ్యాని జనార్దనస్య ॥ 3

టీ:- జనస్యేతి. దైవాత్ ప్రాచీనాత్ కర్మణో నిమిత్తభూతాత్ శ్రీకృష్ణాద్విముఖస్య దైవాదధర్మశీలస్య అత ఏవ సుదుఃఖితస్య జనస్యానుగ్రహాయ భవ్యాని మంగళాని భూతాని చరంతి. జనార్దనస్య శ్రీకృష్ణస్య

మానవులు పూర్వదుష్కర్మ వలన శ్రీకృష్ణుని యందు భక్తిలేని వారగుచున్నారు. ఆ కారణాన అధర్మాచరణ స్వభావము గలవారగు చున్నారు. అందుచేత గొప్ప దుఃఖములను అనుభవించుచున్నారు. ఇట్టి దుఃఖితులైన మానవులను అనుగ్రహించుట కొఱకు మాత్రమే మంగళకరులగు శ్రీకృష్ణభక్తులు ఈ లోకములో సంచరింతురు ఇది నిశ్చయము. 3

భూతాని మంగళకర పరోపకార శీలాని శ్రీకృష్ణభక్త్యా భవంతీతి భావః భవతః పరోపకారస్వభావా ఏవేత్యర్థః. ఇహాస్మిన్ లోకే చరంతినూనం. నైవకృత్యాంతరేచ్ఛయేతి శబ్దాభిప్రాయః. 3

శ్లో॥ తత్సాధువర్యాదిశ వర్త్మ శం నః
సంరాధితో భగవన్ యేన పుంసామ్ ।
హృదిస్థితో యచ్ఛతి భక్తిపూతే
జ్ఞానం సతత్త్వాధిగమం పురాణమ్ ॥ 4

ఓ సాధువులలో శ్రేష్ఠుడవైన మైత్రేయా! మాకు మంగళకరమగు త్రోవను చూపుము. మానవులు ఏ మార్గములో భగవానుని చక్కగా ఆరాధించి తమ హృదయములను భక్తితో పావనము చేసుకొనెదరో ఆ మార్గమునుపదేశించుము. భక్తిచే పవిత్రమగు హృదయములో నిలిచి యుండే భగవానుడు వారికి ఆత్మస్వరూపముయొక్క ప్రత్యక్షానుభూతిని కలిగించే సనాతనజ్ఞానమును అనుగ్రహించుము. 4

టీ:- తదితి. తత్తస్మా హే సాధువర్య. సాత్త్వికానాం శ్రేష్ఠనోఽస్మాకం. శం సుఖరూపం వర్త్మ ఆదిశ కథయ. యేన వర్త్మనా సమారాధితో భగవన్ భక్తిపరిపూతే హృది స్థితః సన్ సతత్త్వాధిగమ ఆత్మా పరోక్ష్యం సహితం పురాణమనాది వేదప్రమాణం. జ్ఞానం. యచ్ఛతి ప్రయచ్ఛతి. 4

శ్లో॥ కరోతి కర్మాణి కృతావతారో
యాన్యాత్మతంత్రో భగవాంస్త్ర్యధీశః ।
యథా ససర్జాగ్ర ఇదం నిరీహః
సంస్థాప్య వృత్తిం జగతో విధత్తే ॥ 5

భగవానుడు సత్త్వరజస్తమో గుణములకు అధిపతి. అందుచేతనే పూర్ణస్వతంత్రుడు. అట్టి భగవానుడు ఏ విధముగా అవతారములను ఎత్తుచు ఏ యే కర్మలనాచరించుచున్నాడు? ముందు ఈ విశ్వమును ఎలా సృజించి ఎలా సంరక్షించుచున్నాడో మాకు వర్ణించిచెప్ప-వలసినది. 5

టీ:- కరోతి కర్మాణీత్యాదీనాం వర్ణయేతి పంచమశ్లోకే క్రియా-సంబంధంః. కరోతీతి. త్ర్యధీశః త్రిగుణమాయానియంతా అత ఆత్మతంత్రః స్వతంత్ర ఏవ భగవాన్. యథా యేన ప్రకారేణ పురుష-రూపేణ కృతావతారః సన్ యాని కర్మాణి కరోతి. ఉత్తరార్థాదినా కర్మాణ్యేవ విశేషతః పృచ్ఛతి - నిరీహో నిష్క్రియః నిస్పృహో వా భగవానిదం విశ్వమగ్రే ప్రథమం యథా ససర్జ పునరస్య జగతః వృత్తిం జీవికాం సంస్థాప్య సుస్థితం కృత్వా భవిత్తే యథా పాలయతి. 5

శ్లో ॥ యథా పునః స్వే ఖ ఇదం నివేశ్య
శేతే గుహాయాం స నివృత్తవృత్తిః ।
యోగేశ్వరాధీశ్వర ఏక ఏతదను
ప్రవిష్టో బహుధా యథాసీత్ ॥ 6

టీ:- యథేతి. పునస్సః నివృత్తవృత్తిస్సన్ స్వే స్వీయే ఖే హృదయాకాశే ఇదం విశ్వం నివేశ్య గుహాయాం యోగమాయాయాం యథా శేతే పునరేతద్విశ్వమనుప్రవిష్టః అతఏవ యోగేశ్వరాణా మధీశ్వరోఽయమేక ఏవ ఏకోఽపి యథా బహుధా బ్రహ్మాది రూపేణా సీత్. 6

ఆ భగవానుడు మరల సంకల్పరూపమైన సృష్టివ్యాపారము నుండి విరమించుకొని తన స్వరూపమగు చిదాకాశమునందు ఈ ప్రపంచమును ఉపసంహరించుకొని యోగమాయయందు నిద్రించు విధమెట్టిది? యోగేశ్వరులకు అధీశ్వరుడగు ఆపరమాత్మ ఒక్కడే అయినను ఈ జగత్తును సృష్టించి, దాని యందు తానే అంతర్యామి రూపముగా ప్రవేశించి బ్రహ్మాది రూపముగ ప్రకటమయిన విధమెట్టిదో వర్ణించి చెప్పుము. 6

శ్లో॥ క్రీడన్విధత్తే ద్విజ గో సురాణాం
క్షేమాయ కర్మాణ్యవతార భేదైః।
మనో న తృప్యత్యపి శ్రుణ్వతాం నః
సుశ్లోక మౌళేశ్చరితామృతాని ॥ 7

టీ:- క్రీడన్నితి. మత్స్యాద్యవతారభేదైః క్రీడన్ సన్ ద్విజ గో సురాణాం క్షేమాయ యథా కర్మాణి విధత్తే. పునర్విశేషం ప్రష్టుమౌత్సుక్యమావిష్కరోతి మన ఇతి-సుశ్లోకాః పుణ్యకీర్తిమంతః పురుషాస్తేషాం మౌళి రివాధిక్యేనోపరి విరాజమానస్యేత్యర్థః. అన్వనుస్యూతం. 7

భగవానుడు మత్స్యాది అవతారములనెత్తుచు గో బ్రాహ్మణ, దేవతల కొరకు అనేక క్రీడలను సలుపుచుండును. శ్రీకృష్ణుడు పవిత్రమగు కీర్తి గలవారిలో శిఖామణి. ఆయన లీలలను వినుట అమృతపానము. ఈ విషయములో మాకు తృప్తి కలుగుట లేదు. 7

శ్లో॥ యైస్తత్త్వభేదైరధిలోకనాథో లోకానలోకాన్ సహలోకపాలాన్।
అచీక్లుపద్యత్రహి సర్వసత్త్వ నికాయభేదోఽధికృతః ప్రతీతః॥ 8

టీ:- యైరితి. అధిలోకనాథో లోకపాలాధిపతిః అలోకాన్ లోకపాల సహితాన్ లోకాన్ అలోకాన్. లోకాలోక పర్వతాన్ బహిర్భాగాంశ్చయైః తత్వభేదైః అచిక్లపత్ కల్పయామాస హ. యత్ర యేషు లోకేష్వ లోకేష్వపీత్యర్థః. సర్వాణి యాని సత్త్వని తేషాం నికాయాశ్చ తేషాం భేదః ప్రతీతః ప్రసిద్ధసన్. అధికృతః తత్తత్కర్మాధికార్యాశ్రిత ఇతి వా. ప్రతీయత ఇతి వా తత్ర యథా భవతీత్యర్థః. 8

సమస్తలోకములకు అధిపతియైన శ్రీహరి ఈ లోకములను, లోకపాలురను, లోకాలోకపర్వతమునకు వెలుపలి భాగములను ఏయే తత్త్వములచే రచించినాడు. ఈ బ్రహ్మాండములో నివసించే ప్రాణులలో భిన్న భిన్న లక్షణములు, భిన్న భిన్న అధికారములు, భిన్న భిన్న స్వభావములు ఉండుటకు కారణమేమో వివరించవలసినది. 8

శ్లో॥ యేన ప్రజానాముత ఆత్మకర్మ
రూపాభిధానాం చ భిదాం వ్యధత్త ।
నారాయణో విశ్వసృడాత్మ యోనిః
ఏతచ్చ నో వర్ణయ విప్రవర్య ॥ 9

టీ:- ఏనేతి ఉత అపి చ యేన ప్రకారేణ ప్రజానాం జీవానామాత్మా స్వభావః తత్కృతం కర్మ తత్కృతం రూపం తత్కృతా అభిధా యాసాం. భేదం కృతవాన్. విశ్వస్రష్టా స్వయమాత్మయోనిః స్వతః సిద్ధః. 9

ఓ బ్రాహ్మణోత్తమా! భగవంతుడు స్వయంభువు. జగత్తును సృజించినవాడు, అట్టి నారాయణుడు ఏ విధముగా జీవులలో స్వభావము, కర్మ, రూపము, నామము అను వాటిలో భేదములను సృజించెను. ఈ విషయములను మాకు వర్ణించి చెప్పుము. 9

శ్లో॥ పరాపరేషాం భగవన్ వ్రతాని
శ్రుతాని మే వ్యాసముఖాదభీక్ష్ణమ్ ।
అతృప్నుమః క్షుల్లసుఖావహానాం
తేషామృతే కృష్ణకథామృతౌఘాత్ ॥ 10

టీ:- నను మహాభారతే త్వయా సర్వం శ్రుతమేవ చేత్తత్రాహ-పరేతి. పరే త్రైవర్ణికా అపరే శూద్రాదయః.ః తేషాం వ్రతాని ధర్మాః హే భగవన్ శ్రీమద్వ్యాసముఖాదభీక్ష్ణం పునః పునః మయా శ్రుతాని. తత్ర హేతుః .కృష్ణ కథా మృతౌఘశ్చ సూచితః తస్మాదృతే. తేషాం వర్ణాశ్రమ ధర్మాణాం శ్రవణే అతృప్నుమః నతృప్తాః స్మః.తేషాం తుచ్ఛ సుఖా వహత్వాత్. శ్రీకృష్ణ కథామృతౌఘ శ్రవణే త్వలంబుద్ధిర్నాస్తీతిభావః10

ఓ పూజ్యుడా ! భారతమునందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములవారి వ్రతములను, ధర్మములను పలుమార్లు వినియుంటిని. అల్పసుఖదాయకములైన ఆ ధర్మములయందు తృప్తి కలిగినది. కాని శ్రీకృష్ణకథామృత ప్రవాహమునందు నాకు తృప్తి కలుగలేదు. 10

శ్లో॥ కస్తృప్నుయాత్తీర్థ పదోఽభిధానా
త్సత్రేషు వః సూరిభిరీడ్యమానాత్ ।
యః కర్ణనాడీం పురుషస్య యాతో
భవప్రదాం గేహరతిం ఛినత్తి ॥ 11

టీ:- తత్ర హేతుః - క ఇతి. తీర్థపదస్య శ్రీకృష్ణస్యాభిధానాత్కథామృతౌఘాత్. కిం భూతాత్ ? వః సత్రేషు సమాజేషు. సూరిభిర్నారదాదిభిరీడ్య మానాత్ కోవాతృప్నుయాత్. యః కథామృతౌఘః కర్ణరంధ్రం ప్రవిష్టస్సన్ సంసార ప్రదాం పురుషస్య గేహరతిం ఛినత్తి. 11

మీ సమాజములో తీర్థపాదుడగు శ్రీకృష్ణుని నారదాదులగు విద్వజ్జనులు కీర్తించుచుందురు. అట్టి కృష్ణ కీర్తనను విన్నవానికి ఎవనికి ఇక చాలును అనెడి తృప్తి కలుగును? ఎవ్వరికి కలుగదు. ఆ భగవత్కీర్తన మానవుని కర్ణరంధ్రములో ప్రవేశించి సంసారబంధ కారణమగు గృహాసక్తిని ఛేదించును. 11

శ్లో॥ మునిర్వివక్షుర్భగవద్గుణానాం
సఖాపి తే భారతమాహ కృష్ణః।
యస్మిన్నృణాం గ్రామ్యసుఖానువాదైః
మతిర్గృహీతా ను హరేః కథాయామ్ ॥12

టీ:- మహాభారతస్యాప్యత్రైవ తాత్పర్యమిత్యాహ - మునిరితి. మమ తే తవ సఖా శ్రీకృష్ణః వేదవ్యాసో మహామునిః నోఽస్మాకం. సర్వేషాం భగవద్గుణాన్ మోక్షధర్మాన్. నారాయణీయాఖ్యేన వక్తుమిచ్ఛుస్సన్ భారతమహ - అర్థకామాదివర్ణనం తు హరికథాయాం మతి ప్రవేశార్థ

నీ స్నేహితుడగు కృష్ణద్వైపాయనుడు(వ్యాసుడు) గూడా భగవద్గుణములను చెప్పదలచియే ముందుగా మహాభారతమును రచించెను. మహాభారతములో విషయసుఖములను వర్ణిస్తూ ప్రాకృత మానవుల బుద్ధిని భగవత్కథల వైపుకు మరలించుటకు ప్రయత్నిం-నాడు. 12

మేవేత్యాహ– యస్మిన్ భారతే గ్రామ్యసుఖాను వాదైర్ద్వార భూతైః నృణాం మతిః సునిశ్చితం హరేః కథాయాం గృహీతా నీతా భవతి. తదుక్త మితిహాససముచ్చయే. శ్లో. 'కామినో వర్ణయన్ కామాన్ లోభం లుబ్ధస్య వర్ణయన్, నరః కింఫలమాప్నోతి కూపేఽంధ మివ పాతయన్. లోకచిత్తావతారార్థం వర్ణయిత్వా త్రతేన తౌ, ఇతిహాసైః ప్రవిత్రార్థైః పునరత్రైవ నిందితౌ. అన్యథా ఘోరసంసార బంధహేతూ జనస్య తౌ, వర్ణయేత్స కథం విద్వాన్ మహాకారుణీకో ముని'రితి. 12

శ్లో॥ సా శ్రద్దధానస్య వివర్ధమానా
విరక్తిమన్యత్ర కరోతి పుంసః ।
హరేః కథానుస్మృతి నిర్వృతస్య
సమస్త దుఃఖాత్యయమాశు ధత్తే ॥13

టీ:– శ్రీహరికథాయాం మతిప్రవేశస్య ఫలమాహ – సేతి. ఏవం భూతాయాం కథాయాం పుంసాం మధ్యే శ్రద్ద ధానస్య సా కథా మతిర్వివివర్ధమానా సతీ అన్యత్ర గ్రామ్యసుఖే విషయేవిరక్తిం కరోతి. తతః కిమత ఆహ – హరేః కథానుస్మృత్యా సుఖితస్య సమస్త దుఃఖానామప్యయం నాశం ధత్తే. 13

శ్రీహరి కథలయందు ఆసక్తి కలుగుటచే లభించు ఫలమును చెప్పుచున్నాడు. కృష్ణగాథ శ్రద్ధాళువగు మానవునకు శ్రీహరి గాథల యందు అభిరుచిని పెంచుచు ఇతర విషయములందు విరక్తి కలిగించును. నిరంతరం శ్రీకృష్ణ పాదస్మరణ వలన భక్తునకు ఆనందము కలుగును. వెంటనే సకల దుఃఖములను తొలగించును. 13

శ్లో॥ తాన్ శోచ్యశోచ్యానవిదోను శోచే
హరేః కథాయాం విముఖా నఘే న ।
క్షిణోతి దేవోఽనిమిషస్తు యేషాం
ఆయుర్వృథావాదగతిస్మృతీనామ్ ॥ 14

టీ:- ఏవం భూతాయాం కథాయాం యే న రమంతే తాన్ శోచతి – తానితి. యే నరా అవిదః భాగవతతాత్పర్యానభిజ్ఞాః తాన్ శోచ్యాన్ యే తు తాత్పర్యం జ్ఞాత్వాఽపి శ్రీహరేః కథాయాం విముఖాః తాన్ శోచ్యానామపి శోచ్యానితి శ్యోచ్యశోచ్యానితి పదస్య విభజ్య యోజనా. తాననుశోచే. తత్ర హేతుః–ఆర్తేషు సంసార నిరర్థవాదాది మతాం తేషామాయుర్వ్యయాత్. తదాహ – యత్పదార్థస్తు శబ్దః అని మిషః కాలః వృధైవ వాదగస్మృతయో వాగ్దేహ మనోవ్యాపారా యేషాం తేషామాయుః క్షీణోతి క్షపయతీతి యత్. అతోఽనుశోచ ఇతి. వాచో వచనం వాగ్వ్యా పారఃగతిర్గమనందేహవ్యాపారః స్మృతిః స్మరణం మనోవ్యాపారః. 14

భాగవతకథ రుచింపనివారు, తాత్పర్యము తెలియనివారు శోచనీయులు, తాత్పర్యము తెలిసి కూడా హరికథల యందు విముఖులు శోచింపదగిన వారిలో మరీ శోచింపదగినవారు. అట్టి వారికై నేను బాధపడుచున్నాను. అట్టి వారి త్రికరణములలోని వ్యాపారములన్నియు వ్యర్థములే. సూర్యుని రూపములో నున్న కాలపురుషుడు వారి ఆయుర్దాయమును హరించుచున్నాడు. 14

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ తదస్య కౌషారవ శర్మ దాతు
ర్హరేః కథామేవ కథాసు సారమ్ ।
ఉద్ధృత్య పుష్పేభ్య ఇవార్తబంధో
శ్శివాయ నః కీర్తయ తీర్థకీర్తేః ॥ 15

టీ:- తదితి. తత్తస్మాద్ధేతోః కౌషారవ అస్య విశ్వస్య శర్మదాతుః రక్షారూపసుఖదాతుః ఆర్తేషు సంసారఘర్మార్తేషు బంధుస్తస్య తీర్థా పరిశుద్ధా కీర్తిర్యస్య తస్య హరేః కథాసు సారభూతాం. శ్రీహరేః కథామేవోద్ధృత్య నః అస్మాకం శివాయ కీర్తయ. యథా పుష్పేభ్యో మధుకరో మధూని అన్వాహరతి తద్వదుద్ధృత్యేతి. 15

ఓ మైత్రేయా ! కష్టములోనున్నవారికి శుభమునిచ్చువాడు, రక్షారూపమైన సుఖమునిచ్చువాడు, సంసార దుఃఖములో మునిగి ఉన్న వారికి బంధువు శ్రీహరి. తుమ్మెద పుష్పములోని తేనెను మాత్రమే గ్రహించినట్లు, నీవు పవిత్రకీర్తి గలవాడైన శ్రీకృష్ణుని కథలను లౌకిక కథలలో నుండి (భారత కథలలో నుండి) సారభూతముగా గ్రహించి మాకు చెప్పవలసినది. 15

శ్లో॥ స విశ్వజన్మ స్థితి సంయమార్థే
కృతావతారః ప్రగృహీతశక్తిః ।
చకార కర్మాణ్యతి పూరుషాణి
యానీశ్వరః కీర్తయ తాని మహ్యమ్ ॥ 16

టీ:- విశేషతః శ్రీకృష్ణకథైవ కథనీయేత్యాశయేనాహ - సఇతి. యో విశ్వస్య జన్మాద్యర్థం పూర్వం గృహీతశక్తిః స ఏవ పురుషేషు కృతావతారస్సన్ అతిపూరుషాణి పురుషానతిక్రమ్య వర్తమానాని యాని చకార. 16

ఆ పరమేశ్వరుడు (శ్రీకృష్ణుడు) ఈ విశ్వము యొక్క సృష్టి, స్థితి, మరియు లయములను మాయా శక్తిచే చేయుచున్నాడు. అవతార పురుషుడై అలౌకికములైన (మానవులకు సాధ్యము కాని) లీలలను (కర్మలను) చేయుచున్నాడు. అట్టి శ్రీకృష్ణుని దివ్యలీలలను(కర్మలను) నాకు వినిపింపుము. 16

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవం స భగవాన్ పృష్టః క్షత్త్రా కౌషారవో మునిః ।
పుంసాం నిశ్రేయసార్థాయ తమాహ బహు మానయన్ ॥17

టీ:- ఏవమితి. పుంసాం నిశ్రేయ స ఏవ అర్థః ప్రయోజనం తేన హేతునా పృష్టః. 17

శ్రీ శుకుడు ఇట్లు పలికెను

మానవులకు మోక్షోపాయమును అందించవలెననెడి భావనతో విదురుడు ఈ విధముగా ప్రశ్నించెను. కౌషారవుడు అని పిలువబడే మైత్రేయమహర్షి అందుకు సంతోషించెను. దిగువ ఐదు శ్లోకములతో విదురుడిని మెచ్చుకొనుచు (సన్మానించుచు)ఇట్లు పలికెను. 17

మైత్రేయ ఉవాచ

శ్లో॥ సాధు పృష్టం త్వయా సాధో లోకాన్ సాధ్వనుగృహ్ణతా ।
కీర్తిం వితన్వతా లోకే హ్యాత్మనోఽధోక్షజాత్మనః ॥ 18

టీ:- బహుమానమేవాహ - పంచభిః.సాధ్వితి. అధోక్షజే ఏవ ఆత్మా మనో యస్య తస్య ఆత్మనః స్వస్య కీర్తిం చ ప్రసంగాద్వితన్వతా. 18

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఓ సాధుపురుషుడవగు విదురా ! శ్రీకృష్ణుడు సదా నీ మనసులో ఉన్నాడు. భగవద్భక్తి గల మంచి మనలసు గలవాడవు నీవు. నీవు నన్నడిగిన ప్రశ్న, మానవులను అనుగ్రహించగలది. ఇట్టి ఈ సంభాషణ ద్వారా నీ కీర్తి గూడా లోకములో వెల్లడియగును. 18

శ్లో॥ నైతచ్చిత్రం త్వయి క్షత్తర్బాదరాయణవీర్యజే ।
గృహీతోఽనన్యభావేన యత్త్వయా హరిరీశ్వరః ॥ 19

టీ:- నేతి. శ్రీహరిర్యద్గృహీతః ఏతచ్చిత్రం త్వయి న భవతి. కుతః బాదరాయణస్య వీర్యజే. 19

ఓ విదురా ! బాదరాయణుని (వ్యాసుని) వీర్యము వలన సంభవించినవాడవు నీవు. నీవు సర్వేశ్వరుడగు శ్రీహరిని అనన్య భావముతో (ఏకాంతభక్తితో) ఆశ్రయించినావు. ఇట్టి నీవు లోకోపకార-మైన, భక్తిప్రవర్ధకమైన ప్రశ్నను అడుగుట చిత్రము కాదు. 19

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ మాండవ్యశాపాద్భగవాన్ప్రజా సంయమనో యమః ।
భ్రాతుః క్షేత్రే భుజిష్యాయాం జాతః సత్యవతీసుతాత్ ॥ 20

టీ:- నను తర్హి కథం శూద్రత్వం? కథం చ లోకానుగ్రాహకత్వం? తత్రాహ-మాండవ్యేతి. భ్రాతుర్విచిత్రవీర్యస్య క్షేత్రే క్షేత్రత్వేన స్వీకృతాయాం భుజిష్యాయాం దాస్యాం యమ ఏవ త్వం జాతోఽసి. 20

విదురుడు శూద్రుడగుట ఎట్లు? లోకానుగ్రహ లక్షణము కలిగియుండుట ఎట్లనగా చెప్పుచున్నాడు. మాండవ్యమహర్షి యమధర్మ రాజును శూద్రునిగా జన్మించుమని శపించగా, ఆ శాపముచే శూద్రుడుగా జన్మించిన యమధర్మరాజే విదురుడు. (విచిత్రవీర్యుని భార్యగా నటించిన శూద్రస్త్రీయగు దాసి యందు విచిత్రవీర్యుని భ్రాతయైన వ్యాసునికి జన్మించినవాడు విదురుడు.) 20

శ్లో॥ భవాన్ భగవతో నిత్యం సంమతః సానుగస్య చ ।
యస్య జ్ఞానోపదేశాయ మాదిశ్య భగవాన్వ్రజన్ ॥ 21

టీ:- కించ. భవానితి. భగవతస్సంమతః ఇష్టః కుతః యజ్జ్ఞానాదేశాయ యస్యతజ్జ్ఞానోపదేశాయ మామాదిష్ట్వా చకారాత్స్వ యమపి స్మృత్యోపదిష్టవానిత్యర్థః. 21

నీవు భగవానునకు మిక్కిలి ఇష్టుడవు. అందువలననే శ్రీకృష్ణ భగవానుడు అవతారమును చాలిస్తూ, నీకు జ్ఞానమును ఉపదేశించుమని నన్ను ఆదేశించినాడు. 21

శ్లో॥ అథ తే భగవల్లీలా యోగమాయోపబృంహితాః।
విశ్వస్థిత్యుద్భవాంతార్థా వర్ణయామ్యనుపూర్వశః ॥ 22

టీ:- అథేతి. విశ్వస్థిత్యాదయః అర్థావిషయో యాసాం తాః. 22

జగత్తు యొక్క సృష్టి,స్థితి మరియు లయములకు యోగమాయ కారణము. భగవానుడు యోగమాయచే విస్తారముగా లీలలను ప్రకటించినాడు. నేను ఇప్పుడు ఆ లీలలను నీకు వరుసగా వర్ణించి చెప్పెదను. 22

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ భగవానేక ఆసేదమగ్ర ఆత్మాత్మనాం విభుః।
ఆత్మేచ్ఛానుగతావాత్మాఽనానామత్యుపలక్షణః ॥ 23

టీ:- తత్ర సృష్టిలీలాం వర్ణయితుం తతః పూర్వావస్థామాహ- భగవానితి. ఇదం విశ్వమగ్రే సృష్టేఃపూర్వం భగవానేక ఏవాసం కథంభూతః? ఆత్మానాం జీవానామాత్మా స్వరూపం. విభుః స్వామీ చ ఆత్మా పరమాత్మా భగవానేక ఏవేతి అన్యద్ద్రష్టృ దృశ్యాత్మకం న కించిదాసీదితి భావః కుతః కారణాత్మనా సత్త్వేఽపి పృథక్ప్రతీత్యభావాదిత్యాహ - అనానామత్యుపలక్షితః నానాద్రష్టృ దృశ్యాదిభిర్నోపలక్షిత ఇతి తథా యద్వా.అకార ప్రశ్లేషం వినైవాయమర్థః.యస్సృష్టౌ నానామతిభిరుపలక్ష్యతే. అత ఏక ఏవాసీతి కుతః ఆత్మేచ్ఛా మాయా అస్యా అనుగతౌ లయే సతి యద్వా - ఆత్మనః ఏకాకిత్వేనావ స్థానేచ్ఛాయామను వృత్తాయామిత్యర్థః. 23

సృష్టి ఏర్పడుటకు పూర్వము ఈ జగత్తు అద్వితీయుడగు భగవానుని రూపములో యుండెను. ఆ భగవానుడే సర్వవ్యాపియై కానవచ్చుచున్నాడు. అనగా చూచువాడు, చూడబడునది, చూచేది అనే దృశ్యాత్మకమైనదేదీ ఇతరముగా లేదు. తన మాయాశక్తి తనలో లీనము కాగానే, కేవల శుద్ధచేతనుడగు పరమాత్మ మాత్రమే మిగిలి యుండును. 23

శ్లో॥ స వా ఏష తదా ద్రష్టా నాపశ్యద్దృశ్యమేకరాట్।
మేనే ఽసంతమివాత్మానం సుప్త శక్తిరసుప్త దృక్ ॥ 24

టీ:- తత్ర ప్రథమం మాయోద్భవ ప్రకారమాహ - ద్వాభ్యాం. స ఇతి. స వా ఏషః ద్రష్టా సన్ తదానీం దృశ్యం నాపశ్యత్.కుతః ఏకరాట్

భగవానుడు అద్వితీయుడై ప్రకాశించేవాడు. తాను ద్రష్టయై యుండగా దృశ్యమేమి కనబడలేదు. భగవంతుడు తనకుతాను అసత్‌గా (ఉనికి లేనివాడు) భాసించెను. అతడు అసుప్తదృక్కు అనగా లోపించుట లేని జ్ఞానస్వరూపి కేవలము ఆయన మాయాశక్తి నిద్రించుచుండెను (లీనమై యుండెను)24

ఏక ఏవ తదా ప్రకాశతే. ఇత్యేకరాట్. ఆత్మానం అసంతమివ మేనే. దృశ్యాభావే ద్రష్టృత్వాభావాత్తదాహ-సుప్తౌ మాయాద్యాశ్శక్తయో యస్య సః. న త్వసంతమేవ మేనే. యతః అసుకతప్తౌ దృక్ చిచ్ఛక్తిర్యస్యేతి. 24

శ్లో॥ సా వా ఏతస్య సంద్రష్టుః శక్తిః సదసదాత్మికా ।
మాయా నామ మహాభాగ యయేదం నిర్మమే విభుః ॥ 25

టీ:- సేతి. సా వై ద్రష్టృ దృశ్యానుసంధానరూపా సదసదాత్మికా కార్యకారణరూపా. యద్వా - సత్ దృష్యమ్ అసత్ అదృశ్యమానాత్మ-స్వరూపం చ తయోశ్చాత్మా యస్యాః. తదుభయా నుసంధానరూపత్వాత్. (25)

నిత్య దృక్ స్వరూపుడగు ఆ పరమేశ్వరుని శక్తియే మాయ. కార్యము కారణము కూడా ఆ మాయయే. ఆ మాయ సత్తు (ఉండుట), అసత్తుయును (లేకుండుట) అగుటచే అనిర్వచనీయము. పరమేశ్వరుడు ఆ మాయా శక్తినే కారణముగా జేసుకుని ఈ విశ్వమును నిర్మించినాడు. సర్వవ్యాపియైనాడు. 25

శ్లో॥ కాలవృత్త్యా తు మాయాయాం గుణమయ్యామధోక్షజః ।
పురుషేణాత్మభూతేన వీర్యమాధత్త వీర్యవాన్ ॥ 26

టీ:- కాలేతి. కాలవృత్త్యా కాలశక్త్యా గుణమయ్యాం క్షుభితగుణాయాం అధోక్షజః పరమాత్మా. ఆత్మాంశభూతేన పురుషేణ ప్రకృత్యధిష్ఠాతృ-రూపేణ వీర్యం చిదాభాసం ఆధత్త. వీర్యవాన్ చిచ్ఛక్తి యుక్తః. 26

భగవానుడు చైతన్యశక్తి స్వరూపుడు. అనుమానాది ప్రమాణములచేత తెలియబడనివాడు. మాయ త్రిగుణాత్మికమైనది. అట్టి మాయ యందు భగవానుడు తన స్వరూపమే అయియున్న పురుషుని ద్వారా చిదాభాసము అనే బీజము ఉంచెను. 26

శ్లో॥ తతోఽభవన్మహత్తత్త్వమవ్యక్తాత్కాల చోదితాత్ ।
విజ్ఞానాత్మాత్మదేహస్థం విశ్వం వ్యంజంస్తమోనుదః ॥ 27

టీ:- తత ఇతి. కాలచోదితాత్కాలప్రేరితాత్ తతస్తస్మాదవ్యక్తాన్మాయాతః తత్త్వపదం పరిత్యజ్య మహతో లక్షణం, అతః పుంలింగనిర్దేశో విజ్ఞానాత్మేతి. సత్త్వప్రధానత్వాత్ స్వదేహస్థం విశ్వముచ్చూన బీజ-గతమంకురాది రూపమివ విశ్వం వ్యంజన్ ప్రకాశయన్ యతోఽసౌ తమో నుదతీతి తమోనుదః. తదుక్తం సాత్వతతంత్రే. శ్లో."విష్ణోస్తు త్రీణి రూపాణి పురుషా ఖ్యాన్యతో విదుః,ప్రథమం మహతో రూపం ద్వితీయం త్వండసంస్థితమ్. తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వా విముచ్యత" ఇతి. 27

కాలచోదితమైన ఆ అవ్యక్త మాయ నుండి "మహత్తత్త్వము" పుట్టినది. ఆ మహత్తత్త్వము సమష్టిబుద్ధి తత్త్వము కలది. అజ్ఞానాంధకారమును పోగొట్టునది. తన యందు బీజ రూపముగా నున్న ప్రపంచమును ప్రకాశింపజేయునది. ఇదే విషయము సాత్వత తంత్రములో పేర్కొనబడినది. విష్ణువునకు గల మూడు రూపములు 1. మహత్ రూపము 2. అండసంస్థిత రూపము 3. సర్వభూతస్థ రూపము. 27

శ్లో॥ సోఽప్యంశ గుణకాలాత్మా భగవద్దృష్టి గోచరః ।
ఆత్మానం వ్యాకరోదాత్మా విశ్వస్యాస్య సిసృక్షయా ॥ 28

టీ:- అహంకారోత్పత్తిమాహ-సార్ధద్వాభ్యాం స ఇతి. అంశశ్చిదాభాసో నిమిత్తం గుణా ఉపాదానం, కాలః క్షోభకరః తదాత్మా తదధీనః భగవాన్ సర్వాధ్యక్షః తద్దృష్టి గోచరః సన్ స్వయమాత్మానం వ్యాకరోత్ రూపాంతర-మనయత్. 28

ఇచట అహంకారోత్పత్తిని గురించి చెప్పుచున్నాడు. ఆ మహత-త్త్వము చిదాభాసమునకు, సత్త్వ రజస్తమో గుణములకు, కాలమునకు ఆశ్రయమయినది. అది ఉపాధిచే మహత్తు అయినది కాని స్వరూపముచే పరబ్రహ్మయే. సర్వాధ్యక్షుడగు భగవంతుని దృష్టి పడినంతనే భగవదిచ్ఛకు విషయమయినదియై "అహంకారము"ను సృష్టించు కోరికతో రూపాంతరము చెందెను. 28

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ మహత్తత్త్వాద్వికుర్వాణాదహం తత్త్వం వ్యజానత ।
కార్యకారణకర్త్రాత్మా భూతేంద్రియ మనోమయః ॥ 29

టీ:- అహంకారస్య లక్షణమాహ - మహదితి. కార్యమధిభూతం కారణమధ్యాత్మం కర్తృ అధిదైవం తేషామాత్మా ఆశ్రయః. అత్ర హేతుః . భూతేంద్రియ మనోమయః తద్వికారవాన్. మన ఇతి దేవానామప్యుపలక్షణం. 29

శ్లో॥ వైకారికస్తైజసశ్చ తామసశ్చేత్యహం త్రిధా ।
అహం తత్త్వాద్వికుర్వాణాన్మనో వైకారికాదభూత్ ॥ 30

టీ:- ఏతదేవ. విభాగతః ప్రపంచయతి - వైకారిక ఇతి. వైకారికః సాత్త్వికః తైజసో రాజసః. వైకారికాత్సాత్త్వికాహంకారాత్మనః. 30

శ్లో॥ వైకారికాశ్చ దేవా వై అర్థాభివ్యంజనం యతః ।
తైజసానీంద్రియాణ్యేవ జ్ఞానకర్మమయాని చ ॥ 31

టీ:- వైకారికాఇతి. దేవాశ్చాపి వైకారికాః. కార్యభూతా ఇత్యర్థః. యతో యేభ్యః ఇంద్రియాధిష్ఠాతృభ్యో అర్థాదివ్యంజనం శబ్దాది ప్రకాశో భవతి. జ్ఞానేంద్రియాణి కర్మేంద్రియాణి చ తైజసాని రాజసాన్యేవ జ్ఞానమయానాం సాత్త్వికశంకా మాభూదిత్యేవకారః. 31

ఆ మహత్తత్త్వము వికారముచెంది అహంకారము పుట్టెను. ఈ అహంకారము కార్యము, కారణము, కర్త అను మూడింటికి ఆశ్రయమగుచున్నది . కార్యము అధిభూతము, కారణము అధ్యాత్మము, కర్త అధిదైవతము. ఈ అహంకారమే భూత, ఇంద్రియ, మనస్సులకు కారణమైనది. 29

అహంకారము సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధములుగా నున్నది. వాటిలో సాత్త్వికాహంకారము వికారము పొంది మనస్సు ఏర్పడినది. 30

సాత్త్వికాహంకారము నుండియే ఇంద్రియములకు అధిష్ఠానమగు దేవతలు పుట్టిరి. వారివలనే శబ్దము మొదలగు విషయములు ప్రకాశించుచున్నవి. తైజసములైన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు రాజసాహంకారము నుండి ఏర్పడినవి. 31

శ్లో॥ తామసో భూతసూక్ష్మాదిర్యతః ఖం లింగమాత్మనః ।
కాలమాయాంశ యోగేన భగవద్వీక్షితం నభః ॥ 32

టీ:- తామస ఇతి. తామసాహంకారః భూతసూక్ష్మస్య సూక్ష్మభూతస్య శబ్దస్యాదిః కారణం యతశ్శబ్దాత్ ఆత్మనో లింగం ఖం శబ్దగుణమాకాశం భవతి స్వగుణశబ్దరూపేణ ప్రమాపకం హృదయాకాశతయా వా. యద్వా - లింగం శరీరం. శ్రు "ఆకాశశరీరం బ్రహే" తి శ్రుతేః. కాలక్షోభకః మాయాత్ర తామసాంశా ప్రకృతిః.అంశశ్చి దా భాసస్స్వయం తామసా హంకారాన్నిస్సృతం ఉద్భూతం నభః కాలాది సముదాయే న భగవద్వీ క్షితం. భగవతా సర్వాధ్యక్షేణ వీక్షితం సత్.32

తామసాహంకారము నుండి శబ్దతన్మాత్ర పుట్టినది. ఈ శబ్దము ఆకాశమునకు గుణము. శబ్దము గుణముగా గల ఆకాశము పరమాత్మకు శరీరము. "ఆకాశః శరీరం బ్రహ్మ"అని శ్రుతి . కాలము, మాయాశక్తి, చిదాభాసల సంయోగముచేత భగవానుని అధ్యక్షత్వము నందు ఆకాశము పుట్టెను. 32

శ్లో॥ నభసోను సృతం స్పర్శం వికుర్వన్నిర్మమేఽనిలమ్ ।
అనిలోఽపి వికుర్వాణో నభసోరుబలాన్వితః ॥ 33

టీ:- నభస ఇతి. స్పర్శం వికుర్వత్. రూపాంతరం న యత్. అనిలం వాయుం నిర్మమే ఏవంసర్వత్ర తన్మాత్ర ద్వారా భూతోత్పత్తిరితి జ్ఞాతవ్యా. నభాసా సహితః స్వయం చ ఉరుబలాన్వితః.33

ఆకాశము నుండి స్పర్శతన్మాత్ర పుట్టెను. అది వికారముచెంది వాయువు పుట్టెను. మహాబలము కలిగిన వాయువు ఆకాశముతో గూడి వికారము పొందెను. 33

శ్లో॥ ససర్జ రూపతన్మాత్రం జ్యోతిర్లోకస్య లోచనమ్।
అనిలోనాన్వితం జ్యోతిర్వికుర్వత్పరవీక్షితమ్ ॥ 34

వాయువు ఆకాశముతోడ వికారమునొంది రూపతన్మాత్ర ఏర్పడెను. రూప తన్మాత్ర నుండి లోకమును ప్రకాశింపజేయు తేజస్సు

టీ:- ససర్జేతి. లోచనం ప్రకాశకం లోక ప్రకాశకం జ్యోతిరితి. పరమేణ భగవతా ఈక్షితం యథా భవతి తథా. అనిలేన వాయునా. 34

పుట్టినది. ఈ తేజస్సే అగ్ని. తేజస్సు వాయువుతో కూడినదై, పరబ్రహ్మ యొక్క ఈక్షణ ఎలా ఉందో అలా వికారమునొందినది. 34

శ్లో॥ అథత్తాంభో రసమయం కాలమాయాంశ యోగతః।
జ్యోతిషాంభోఽను సంసృష్టం వికుర్వద్బ్రహ్మ వీక్షితమ్ ॥ 35

టీ:- అథత్తేతి. జ్యోతిరగ్నిః. బ్రహ్మణా భగవతా వీక్షితం. జ్యోతిషా అనుసృష్టమంభః. 35

తేజస్సు వాయువుతో వికారము నొంది కాలము, మాయాంశలతో కలసి రసతన్మాత్ర ఏర్పడినది. దాని నుండి నీరు ఏర్పడినది. ఆ నీరు అగ్నితో అనుగతమైయున్నదై పరబ్రహ్మ చేత చూపబడినదై వికారము నొందినది. 35

శ్లో॥ మహీం గంధగుణామాధాత్కాలమాయాంశయోగతః।
భూతానాం నభ ఆదీనాం యద్యద్భవ్యం పరాపరమ్ ॥ 36

టీ:- మహీమితి. ఆకాశాదీనాం పంచభూతానాం యద్యత్పరమపరం చ కార్యం. 36

నీరు అగ్నితో వికారము నొంది కాలము, మాయ, అంశ గుణములతో కూడినదై గంధగుణముగల భూమి ఏర్పడెను. ఆకాశము మొదలగు పంచభూతములలో వెనుక దాని యందు ముందు ఉన్న భూతములు అనుగతమగుచున్నవి. 36

శ్లో॥ తేషాం పరానుసంసర్గాద్యథాసంఖ్యం గుణాన్ విదుః ।
ఏతే దేవాః కలా విష్ణోః కాలమాయాంశలింగినః ॥ 37

టీ:- తేషామితి.తేషాం కార్యాణాం పరైః కారణైః అను సంసర్గాదను షంగాత్ యథా సంఖ్యం యథా క్రమం ఉత్తరోత్తరమధికాన్ గుణా

ఆకాశాది పంచభూతములు వెనుక నున్నవాని యందు ముందు ఉన్న భూతములు కలియుటచేత వాటి గుణముల సంఖ్య అదే క్రమములో నుండునది తెలుసికొనవలెను. ఆకాశమునకు శబ్దము ఒక్కటే గుణము . వాయువునకు శబ్ద స్పర్శములు రెండు గుణములు. తేజస్సునకు శబ్ద, స్పర్శ, రూప గుణములు మూడు. జలమునకు

న్విదుః. తథా హి – నభసః శబ్దగుణః అన్వాన్వయాభావాత్ వాయోస్తు స్పర్శః ఆకాశాన్వయాచ్ఛబ్దశ్చ. ఏవం తేజసస్త్రౌచ రూపం చ అంభసస్త్రాని రసశ్చ మహ్యాస్సర్వే గుణాన్విదురితి పాఠః. ఏతే దేవా మహదాద్యభి మానినః విష్ణోః కలాః అంశాః కాలలింగం వికృతిః మాయాలింగం విక్షేపః అంశలింగం చేతనా తాని విద్యంతే యేషుతే కాలమయాంశ లింగినః. 37

శబ్ద,స్పర్శ,రూప,రస గుణములు నాలుగు. భూమికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ గుణములు అయిదు. మహత్తత్వము మొదలగు వాటి ఈ అభిమానదేవతలు విష్ణుమూర్తి యొక్క అంశలే. లింగము అనగా గుర్తు లేక చిహ్నము. కాలము యొక్క చిహ్నము వికృతి, అనగా వికారము(మార్పు)నొందుట. మాయా చిహ్నము విక్షేపము. అనగా అనేకము అగుట. అంశయొక్క చిహ్నము చైతన్యము వికారము, విక్షేపము, చైతన్యముల సమాహారమే ఈ దేవతలు. 37

శ్లో॥ నానాత్వాత్స్వక్రియాఽనీశాః ప్రోచుః ప్రాంజలయో విభుమ్ ॥ ॥37-1॥

ఈ అభిమానదేవతలు అనేకముగా నుండుటచే, పరస్పరము సంబంధము కలుగలేదు. ఆ కారణముగా బ్రహ్మాండమును సృష్టింప జాలనివారై చేతులు జోడించి పరమేశ్వరునితో ఇట్లు పలికిరి. 37-1

దేవా ఊచుః

శ్లో॥ నమామి తే దేవ పదారవిందం
ప్రపన్నతాపోప శమాతపత్రమ్ ।
యన్మూలకేతా యత యోఽంజసోరు
సంసార దుఃఖం బహిరుత్ క్షిపంతి ॥ 38

దేవతలు ఈ విధముగా పలికిరి.

ఓ దేవా! శరణుపొందినవారి తాపమును పొగొట్టే గొడుగు వంటిది నీ పాదయుగ్మము. అట్టి నీ పాదపద్మములకు నమస్కరించు-చున్నాము. ప్రయత్నశీలురు (భక్తులు) అయిన వారు నీ పాదపద్మములను ఆశ్రయించి సంసార దుఃఖమును తేలికగా (దూరము నుండియే) విడుతురు. 38

టీ:- నమామ ఇతి. అతస్సమత్వేన నానాత్వాత్పరస్పరమ సంబంధాః

స్వక్రియాయాం బ్రహ్మాండరచనాయామనీశాః అశక్తాస్సంతో విభుం పరమేశ్వరం ప్రాపుఃప్రసన్నాః. శ్లో. మిథస్సృర్ధిష్ణవో దేవామిళంతస్తే పరస్పరమ్, విశ్వకర్మణ్యనీశాశ్చ నిర్విణ్ణా హరిమిడిర ఇతి భావః. నమిమీతి. ప్రసన్నానాం తాపోపశమే ఆతపత్రం ఛత్రం తత్రహేతుః యన్మూలకేతాః యస్య పాదారవిందస్య మూలం తలం కేతనమాశ్రయో యేషాం తే బహిర్దూరతఏవ ఉత్క్షిపంతి పరిత్యజంతి. 39

శ్లో॥ ధాతర్యదస్మిన్ భవ ఈశ జీవా
స్తాపత్రయేణాభిహతా న శర్మ ।
ఆత్మన్ లభంతే భగవం స్తవాంఘ్రే
శ్ఛాయాం సవిద్యామత ఆశ్రయేమ ॥ 39

టీ:- పాంథః స్వగృహం ప్రాప్య మార్గశ్రమమివశ్రమం నివేదయంత ఆహుః ధాతరితి. హే ధాతః హే పితః హే ఈశ స్వామిన్, అస్మిన్ భవే సంసారే తాపత్రయేణాభిహతా జీవకోటయః ఆత్మన్ ఆత్మన్యంతః కరణ ఇతి లుప్తసప్తమ్యంతత్వేన వా నిర్దేశః. యద్యస్మాత్ శర్మ సుఖం న లభంతే. ఋతే యదస్మిన్ భవఇతి పాఠే యత్పాదభజనం వినా శర్మ న లభంత ఇతి యోజనా. అతో హే భగవాన్ సవిద్యాం సదా సప్రకాశాం జ్ఞానసహితామితి భావః. 39

పథికుడు స్వగృహములో ప్రవేశించి మార్గాయాసమును నివేదించునటుల నివేదిస్తున్నారు. ఓ విధాతా! ఓ తండ్రీ! ఓ ఈశ్వరుడా! ఓ స్వామీ! ఓ పరమేశ్వరా! జగత్తును పాలించేవాడా! ఈ ప్రపంచము ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము అను తాపత్రయముచే పీడించబడుచున్నది. జీవులు సుఖములేనివారై యున్నారు. నీ పాదములను భజించుటచే తప్ప సుఖము లభించదు. అందువలన విద్యతో కూడిన, సదా వెలుగుచుండెడి జ్ఞాన సహితమైన నీ పాద పద్మములను ఆశ్రయించుచున్నాము. 39

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ మార్గంతి యత్తే ముఖపద్మనీడై
శ్ఛందస్సుపర్ణైః ఋషయో వివిక్తే ।
యచ్ఛాఘమర్షో దసరి ద్వరాయాః
పదం పదం తీర్థపదః ప్రపన్నాః ॥ 40

టీ:- జ్ఞానసాధనమాహుః. మార్గంతీతి. హే భగవన్ సుధియశ్శుద్ధ చిత్తాః తే తవ ముఖపద్మం నీడం యేషాం తైః ఛందస్సుపర్ణైర్వేదపక్షిభిః వివిక్తే అసంగే మనసి. యన్మార్గంతి అన్వేషయంతి అఘమర్షమఘనాశక ముదం యాసాం సరితాం తాసు వరాయాః గంగాయాః పదముద్భవ స్థానం తీర్థపదస్తవ తచ్చ పదం తదేవ చరణం. వయం ప్రపన్నాః స్మః అతో గంగామనుసేవమానా అపి తదుద్భవస్థాం త్వత్పాదం ప్రాప్నువంతీ త్యర్థః. ఛందస్సుపర్ణైరిత్యత్ర యథా పక్షిణో నీడ మధ్య ఉద్భూతాస్తతస్తతః పరిభ్రామ్య పునః తత్రైవ ప్రవిశంతి, తథా వేదా అపి త్వత్త ఉద్గతాస్త్వయ్యేవ పర్యవస్యంతి అతో వేదానాశ్రిత్య త్వత్పాదం మృగయం తీతి దృష్టాంతాభిప్రాయః. 40

శ్లో॥ యచ్ఛ్రద్ధయా శ్రుతవత్యా చ భక్త్యా
సంమృజ్యమానే హృదయేఽవధార్య ।
జ్ఞానేన వైరాగ్య బలేన ధీరా
వ్రజేమ తత్తేఽంఘ్రిసరోజ పీఠమ్ ॥ 41

ఓ భగవంతుడా! నీ ముఖపద్మమనెడి గూడులో వేదములనెడి పక్షులు నివసించుచున్నాయి. ఆ వేదముల ద్వారా ఋషులు ఏకాంతము నందు నీ పాదములను అన్వేషింతురు. ఏ విధముగా గూటిలో పుట్టిన పక్షులు అటు నిటు తిరిగి ఆ గూటిలోకే ప్రవేశించునో అట్లే వేదములు కూడా నీ నుండి పుట్టి నిన్నే చేరుచున్నవి. అదే విధముగా ఋషులు వేదములనాశ్రయించి నీ పాదములను పొందుదురు. ఆ నీ పాదములు పాపములను పోగొట్టే గంగకు పుట్టుక స్థానము. అట్టి పావనమగు నీ పాదములను శరణువేడుచున్నాము. 40

విషయలోలతతో కూడిన చిత్తము గలవారికి భగవత్పాదాన్వేషణ ఎక్కడిది?అను విషయము వివరించబడుచున్నది. సాధకులు శ్రద్ధతో నీ లీలలను శ్రవణము చేసి నీయందు భక్తిని పెంపొందించుకొనెదరు. నీ లీలలను శ్రవణము చేయుటచే అంతఃకరణశుద్ధి యగును. దానిచే

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- నను విషయాకృష్టచిత్తానాం కుత స్తదన్వేషణం తత్రాహుః-- యదితి. సహగే చిత్తే ధ్యానాసంభవమాశంక్య తద్విశేషణం విశినష్టి--శ్రద్ధయా శ్రుతవత్యా శ్రవణ పూర్వికాయా భక్త్యా చ. సమ్మృజ్యమానే సంశోధ్యమానే హృదయే. యదవధార్య ధ్యాత్వా తత ఉత్పన్నేన వైరాగ్యం బలం యస్య తేన జ్ఞానేన ధీరాః కేచిన్ముముక్షవో నిశ్చల చిత్తాః భవంతి. తత్త్వదంఘ్రి సరోజ పీఠం శరణం వ్రజేమేతి. 41

వైరాగ్యము మరియు జ్ఞానము కలుగును. ఆ తరువాత జీవన్ముక్తు లగుదురు. ఇన్నింటికి మూలమైన నీ పాద పద్మములను మేము ఆశ్రయించుచున్నాము. 41

శ్లో॥ విశ్వస్య సర్గ స్థితి సంయమార్థే
కృతావతారస్య పదాంబుజం తే ।
వ్రజేమ సర్వే శరణం యదీశ
స్మృతం ప్రయచ్ఛత్యభయం స్వపుంసామ్ ॥ 42

ఓ దేవా! నీవు ఈ విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయములను చేయుట కొఱకే అవతరించుచుందువు. అట్టి నీ పాదపద్మములను మేమందరము శరణువేడుచున్నాము. భక్తులు మీ పాదపద్మములను స్మరించి అభయమును పొందుచున్నారు కదా ! 42

టీ:- భక్తానుగ్రహం స్మరంత ఆహుః - విశ్వస్యేతి. సర్వే వయం శరణం వ్రజేమ. కుతః? త్వత్పదాంబుజం స్మృతం సత్ స్వ పుంసాం భక్తానాం. అభయం ప్రయచ్ఛతీతి యద్యస్మాదత ఇతి. 42

శ్లో॥ యత్సానుబంధేఽసతి దేహ గేహే
మమాహమిత్యూఢదురాగ్రహాణామ్ ।
పుంసాం సుదూరం వసతోఽపి పుర్యాం
భజేమ తత్తే భగవన్ పదాబ్జమ్ ॥ 43

ఓ భగవంతుడా ! జీవులు ఈ దేహముఅనే ఇంట్లో నివసించుచుందురు. నేను, నాది అనెడి భావనలను దృఢముగా నిలుపుకొని యుందురు. ఇది మిథ్యయని వారెరుగరు. నీవు గూడా అదే దేహములో సర్వాంతర్యామిగా చైతన్యస్వరూపముగా నిలచి



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- అంతర్యామితయా నిత్య సన్నిహితే నిరర్థకం వ్రజనమిత్యాశంక్యాహుః - యదితి. హే దేవ ద్యోతనశీల సానుబంధే సోపకరణే. అసతి తుచ్ఛే దేహే అహం మదీయమిత్యహంకార మమతయా ఊఢ దురాగ్రహాణాం. పుర్యాం స్వదేహ ఏవ వసతోఽపి. తే తవ. యత్పదాబ్జం శ్రీపాదారవిందం సుదూరం దుష్ప్రాపం తద్వ్రజేమ. 43

శ్లో॥ తాన్వా అసద్వృత్తిభిరక్షిభిర్యే
పరాహృతాంతర్మనసః పరేశ ।
అథో న పశ్యంత్యురుగాయ నూనం
యే త్వత్పదన్యాసవిలాసలక్ష్మ్యాః ॥ 44

టీ:- అన్యథా భక్తనిరీక్షణం న ఘటత ఇత్యాహుః-తానితి. హే పరేశ మాయా నియంతః అసద్వృత్తిభిర్బహిర్ముఖైరింద్రియైః భవతః పరాహృతం దూరమపాకృష్టం. అంతస్థం మనో యేషాం తే. య ఉన్మత్తాస్సంతితే అథో అత ఏవాపాకృష్ట మనస్త్వాదిత్యర్థః. నూనం తాన్న పశ్యంతి వా వేతి ప్రసిద్ధే. తైస్తేషాం సంగమస్తు కుతః? పునస్తాన్ కానిత్యాహ-హే ఉరుగాయ యే తు త్వత్తవ పదన్యాసో గమనం తస్య విలాసో విభ్రమః తస్య లక్ష్మీశ్శోభా యేషాం తే త్వల్లీలా కథనాదిభిః శోభమానా ఇత్యర్థః తాం స్త్వద్భక్తానితి విలాస లక్ష్మ్యా ఇత్యాకారాంతాద్బహువచనం. యద్వా

యుందువు. అయిననూ అజ్ఞానులగుటచే జీవులకు నీ పాదము పొందరాని దగుచున్నది. అట్టి నీ పాదపద్మమును శరణుపొందుచున్నాము. 43

మాయాధీశుడవగు ఓ దేవా ! మానవులు కన్ను మొదలగు ఇంద్రియములద్వారా మిథ్యాభూతమగు జగత్తునందు సంచరించుచు బహిర్ముఖులైయుందురు. వారి చక్షురాది ఇంద్రియములు వారి అంతఃకరణమును (మనస్సును) నీ నుండి దూరముగా లాగివేయును. భక్తులచే నిరంతరము కీర్తించబడే ఓ దేవా! భక్తులు నీ నడక యొక్క విలాసమును ఉపాసించి ప్రకాశించేవారు. ఇట్టి భక్తులు, బహిర్ముఖులైన మానవులు సత్సంగము, హరికథాశ్రవణము మొదలగునవి లేకపోవుటచే అంతర్యామిగా నున్న నిన్ను కనజాలకున్నారు. 44

ఏవంభూతాస్తే తాన్ నూనమున్మత్తానేవ పశ్యంతీతి యోజనా. సత్సంగమా భావే హరికథా శ్రవణాభావాత్ హృది స్థితమపి తేషాం సుదూరమితి భావః. అత్ర పథ ఇతి చ లక్ష్మ్యానితి చ పాఠాంతరమస్తి తదా పథః పదస్య విశేషణం లక్ష్మ్యానితి. పథస్త్వన్మార్గభృతాన్ మార్గాదీన్న పశ్యంతీత్యర్థః. 44

శ్లో॥ పానేన తే దేవ కథాసుధాయాః
ప్రవృద్ధభక్త్యా విశదాశయా యే ।
వైరాగ్యసారం ప్రతిలభ్య బోధం
యథాంఽజసాఽన్వీయురకుంఠధిష్ణ్యమ్ ॥ 45

టీ:- ఏతదేవ స్ఫుటయంతి-పానేనేత్యాది ద్వాభ్యాం పానేనేతి. హే దేవ. తే కథామృతస్య పానేన ప్రవృద్ధయా భక్త్యా యే నిర్మలాంతః కరణాస్తే వైరాగ్యం సారో బలం యస్య తం లబ్ధ్వా అన్వ నంతరమేవ అకుంఠధిష్ణ్యం వైకుంఠలోకం యథా యథావచ్ఛీఘ్రమీయుః ప్రాప్త వంతః. 45

ఓ దేవా! నీ కథామృతము తాగుటవలన మానవులలో భక్తి పెంపొందును. దాని వలన నిర్మలమైన మనస్సుగల వారగుదురు. అట్టి వారు వైరాగ్యసారమైన జ్ఞానమును పొందుదురు. వారు వెంటనే వైకుంఠలోకమును పొందెదరు. 45

శ్లో॥ తథాఽపరే చాత్మసమాధియోగ
బలేన జిత్వా ప్రకృతిం బలిష్ఠామ్ ।
త్వామేవ ధీరాః పురుషం విశంతి
తేషాం శ్రమః స్యాన్నతు సేవయా తే ॥ 46

టీ:- అథేతి. అథ శబ్దో మార్గాంతరం ద్యోతయతి అపరే త్వాత్మని స్వస్మిన్ సమాధిః మనసఃస్థైర్యం స ఏవ యోగః ఉపాయః తస్య బలేన జ్ఞానయోగతః త్వామేవ ప్రవిశంతి తేషాం శ్రమస్స్యాత్ శ్రమేణ మోక్షస్స్యాత్. తే తవ సేవయా త్వనాయాసేనైవ మోక్షః.సేవా సత్సంగ రూపా తత్కథాశ్రవణాది రూపా చ. అహం మమతాధిష్ఠానం తు న కథం చిదితి భావః.46

ఇచ్చట జ్ఞానయోగమును ప్రస్తావించుచున్నారు. నిత్యానిత్య వస్తు వివేకము గల కొందరు చిత్తవృత్తి నిరోధము అనెడి ఉపాయము యొక్క బలముచేత బలీయమైన "మాయ"ను జయింతురు. ఆ పిమ్మట పూర్ణపురుషుడవైన నిన్ను చేరుదురు. అట్టి జ్ఞానయోగులకు శ్రమ అధికముగా నుండును. సత్సంగము, భగవత్కథా శ్రవణాదిరూపమైన నీ సేవ చేయు వారికి ఆ శ్రమలేకుండానే మోక్షము సిద్ధించును. 46

శ్లో॥ తత్తే వయం లోకసిసృక్షయాఽద్య
త్వయాఽనుసృష్టాస్త్రిభిరాత్మభిః స్మ ।
సర్వే వియుక్తాః స్వవిహారతంత్రం
న శక్నుమస్తత్ప్రతిహర్తవే తే ॥ 47

టీ:- తమేవం స్తుత్వా ప్రార్థయంతే చతుర్భిః. తదితి. హే అద్య తత్తస్మాత్తే వయం త్వదీయా వయం యస్మాల్లోకానాం సిసృక్షయా

నాలుగు శ్లోకములచే భగవానుని స్తుతిచేయుచున్నారు. సృష్టికి ఆదికారణుడవగు ఓ పరమేశ్వరా! నీవు లోకములను సృష్టించినావు. మేము సత్త్వము, రజస్సు, తమస్సులనే మూడు గుణములచే ఆవరింప బడియున్నాము. విభిన్న స్వభావములుగల వారమై విడిపోయి ఉన్నాము. అందుచేత నీ క్రీడకు యోగ్యమైన బ్రహ్మాండమును నిర్మించి నీకు సమర్పించలేకున్నాము. 47

త్వయానుసృష్టాః త్రిభిరాత్మభిస్సత్త్వాదిభిః స్వభావైః.అత ఏవవిరుద్ధ స్వభావత్వాత్తద్వియుక్తాస్సంతః యదర్థం సృష్టాః తత్స్వవ్యవహార తంత్రం క్రీడోపకరణం బ్రహ్మాండం. తే తుభ్యం. ప్రతిహర్తవే ప్రతిహర్తుం సమర్ప యితుం న శక్నుమః. అతస్త్వం నః చక్షుః పరిదేహీతి త్రయాణాం. శ్లోకానాం చతుర్థేన అన్వయః. 47

శ్లో॥ యావద్బలిం తేఽజ హరామ కాలే
యథా వయం చాన్నమదామ యత్ర।
యథోభయేషాం త ఇమేహి లోకా
బలిం హరంతోఽన్నమదంత్యనూహాః ॥ 48

టీ:- అసామర్థ్యమేవ ప్రపంచయితుం కార్యస్య వైచిత్ర్యమాహుః- యావదితి. హే అజ కాలే భోజనకాలే తత్తదవసరే బలిం భోగం యావత్సాకల్యేన తే తుభ్యం హరామ సమర్పయామ యథా యేన ప్రకారేణ వయం వా అన్నమదామ భక్ష్యామ. అన్నమదామేత్యనేన అన్నమాత్రమస్మాకమైశ్వర్యేణ తు భోగస్త్వవైవేత్యుక్తం. యథా యేన ప్రకారేణ ఉభయేషాం తవ చ త్వల్లోకా ఇతి పాఠే చ జీవా ఇత్యర్థః. ఇమే జీవా యత్రస్థిత్వా అనూహాః నిర్విఘ్నాః యద్వా అవితర్కాః నిస్సం శయా ఇత్యర్థః.ఏవం సంతతస్తవాస్మాకం చ బలిం భాగం హరంత

జన్మలేనివాడవైన ఓ దేవా! మేము ఆయా కాలముల యందు నీకు భోగమును(ఆహారము) సమర్పించవలయును. మరియు మేము మా స్థానమునందున్నవారమై ఆహారమును భుజించవలయును. అట్లే సకల జీవులు నీకు మాకు భోగ్యవస్తువులను సమర్పించి తమ యన్నమును భుజింపవలెను. ఇవన్నీ విఘ్నములులేని విధముగా, సందేహములులేని విధముగా జరుగునట్లు నీవు చేయవలెను. పరబ్రహ్మ ఈక్షణవల్ల జరిగిన పురుష సృష్టి (జీవుడు) తన సకలేంద్రియములు ఆకలి దప్పులతో బాధపడుతున్నట్లు నివేదించగా జీవుని (తన) పరితృప్తికై ఆయా విషయార్థాది అన్నమును సృజించి ఇచ్చెనని, తానే భోగించెను. అనే ఉపనిషత్తు వాక్యముతో పై అర్థము సమన్వయము పొందినది. 48

స్సంతః అన్నమదంతి.తథా చ శ్రుతిః' తాఏతా దేవతాస్సృష్టా అస్మిన్ మహత్యర్ణవే ప్రాప్తం తమశనాపిపాసాభ్యా మన్వవార్జత్ తా ఏవమ బ్రువన్నాయతనం నః ప్రజాపనీహీతి యస్మిన్ ప్రతిష్ఠితా అన్న మదామే'తి. 48

శ్లో॥ త్వం నః సురాణామపి సాన్వయానాం
కూటస్థ ఆద్యః పురుషః పురాణః ।
త్వం దేవ శక్త్యాం గుణకర్మయోనౌ
రేతస్త్వజాయాం కవిమాదధేఽ జః ॥ 49

టీ:- జనకత్వాదవశ్యం త్వయాస్మాకమేషాం చ కార్యోపాధీనాం జీవానాం వృత్తిః పరికల్పనీయేత్యాహుః. త్వం న ఇతి. సాన్వయానాం కార్యాణాం యద్వా అన్వేతీత్యన్వయః.కారణం తత్ర హేతవః,కూటస్థ అవిక్రియః పురుషోఽ ధిష్ఠాతా పురాణః పురాతనః ఏతదుపపాదయం-త్వమితి. హే దేవ అజఏవ త్వం.గుణానాం సత్త్వాదీనాం కర్మణాం జన్మాదీనాం చ యోనౌ కారణ భూతాయాం అజాయాం జనన రహితా యాం శక్త్యాం మాయా యాం కవిం సర్వజ్ఞం మహత్తత్త్వ రూపం రేతః ప్రథమం ఆదధే నిహిత వానసీత్యర్థః. 49

ఓ దేవా ! నీవు నిర్వికారుడవు. పూర్ణుడవు. సకల ప్రాణులకు అంతర్యామివి. సనాతనుడవు. సకల కార్యవర్గముతోకూడి యున్న మా దేవతలకు ఆదికారణుడవు."నీకు"పుట్టుక లేదు. సత్త్వరజస్తమో గుణములకు, జన్మాది క్రియలకు కారణమగు "మాయాశక్తి" కి కూడా పుట్టుకలేదు. నీవు అట్టి మాయాశక్తి యందు "మహత్తత్త్వము" అనెడి జగద్బీజమును (చిదాభాస అనెడి జగద్బీజము) ఉంచినావు. 49

శ్లో॥ తతో వయం సత్ప్రముఖా యదర్థే
బభూవిమాత్మన్ కరవామ కిం తే ।
త్వం నః స్వచక్షుః పరిదేహి శక్త్యా
దేవ క్రియార్థేయదనుగ్రహాణాం ॥ 50

టీ:- తత ఇతి. తతః హే ఆత్మన్ సత్ప్రముఖాః మహదాదయో వయం యదర్థే యత్ప్రయోజనం బభూవిమ తే తవ కిం కార్యం కరవామ? సృష్టి మితి చేత్తత్రాహుః -హే దేవ త్వం స్వచక్షుః స్వీయం జ్ఞానం శక్త్యా చ స హనోఽస్మాకం పరిదేహి ప్రయచ్ఛ. కీదృశానాం? నః త్వదనుగ్రహాణాం త్వత్తఏవానుగ్రహో యేషాం న ఇత్యేకం పదం. త్వత్ప్రదత్త జ్ఞానక్రియా శక్తిభ్యామేవ వయం సృష్టౌ క్షమాః నాన్యథేత్యర్థః 50

శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
పంచమోఽధ్యాయః

ఓ పరమాత్మా! మహత్తత్త్వాదులగు మేము ఏ పనికై జన్మించినాము? మేము ఆ పనిని ఎలా చేయవలెను? మమ్ము అనుగ్రహించువాడవు నీవే. బ్రహ్మాండ రచనకై మాకు నీ క్రియాశక్తితో గూడిన జ్ఞానశక్తిని ఇవ్వవలసినదిగా వేడుకొనుచున్నాము. 50

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఐదవ అధ్యాయము సమాప్తము.

## షష్ఠోఽధ్యాయః

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి తాసాం స్వశక్తీనాం సతీనామసమేత్య సః ।
ప్రసుప్త లోకతంత్రాణాం నిశామ్య గతిమీశ్వరః ॥ 1

టీ:- షష్ఠే తైరీశ్వరావిష్టైస్సృష్టి మాహ విరాట్తనోః ఆధిదైవాది భేదం చ తత్రైవ భగవత్కృతమ్. ఇతీతి. సదేవ ఈశ్వరః అసమేత్య అమిళిత్వా సతీనాం స్థితానాం ప్రసుప్తం నష్టం లోకతంత్ర విశ్వరచనా యాసాం యద్వా-ప్రసుప్తజీవోపకరణానాం స్వశక్తీనాం మహదాదీనాం. గతిం స్థితిం నిశామ్య దృష్ట్వా. 1

శ్లో॥ కాలసంజ్ఞాం తదా దేవీం బిభ్రచ్ఛక్తిమురుక్రమః ।
త్రయోవింశతితత్త్వానాం గణం యుగపదావిశత్ ॥ 2

టీ:- కాలేతి. తదానీం కాలేన సంజ్ఞా ఉద్బోధో యస్యాః. యద్వా - కలయతి క్షోభయతి స్వకార్యాణీతి వా కాలసంజ్ఞాప్రకృతిః. దేవీం ద్యోతనశీలాం తాం శక్తిం. బిభ్రత్సన్ ఉరుక్రమ్యః. ప్రకృత్యా సహ త్రయోవింశతి తత్త్వనాం గణం సమూహం. యుగపదావిశత్ అంతర్యామితయా ప్రవిష్టః. 2

## 6వ అధ్యాయము

మైత్రేయ మహర్షి ఈ విధముగా పలికెను.

ఈవిధముగా మహతత్త్వము మొదలగునవి ఒకదానితో మఱియొకటి కలియలేదు. కనుక వాటి యందు ప్రపంచమును సృష్టించే శక్తి ప్రసుప్తమై యుండెను. ఉద్బుద్ధము కాలేదు. ఈ పరిస్థితిని భగవానుడు చూచెను. 1

భగవంతుడు అపుడు ప్రకాశనశీలముగలదియగు "కాలము" అను దైవీశక్తిని స్వీకరించెను. సర్వశక్తిమంతుడగు భగవంతుడు ఒకేసారిగా, ప్రకృతితో సహా ఇరవైమూడు తత్త్వములలో అంతర్యామిగా ప్రవేశించెను. (ఆవేశించెను). ఆ ఇరవై మూడు తత్త్వములు ఏమనగా 1. మహతత్త్వము; 2. అహంకారము; 3. సూక్ష్మభూతములు (పంచతన్మాత్రలు) (5); స్థూలభూతములు (పంచభూతములు) (5) ; జ్ఞానేంద్రియములు(5); కర్మేంద్రియములు (5) మనస్సు. 2

శ్లో॥ సోఽనుప్రవిష్టో భగావాంశ్చేష్టారూపేణ తం గణమ్ ।
భిన్నం సంయోజయామాస సుప్తం కర్మప్రబోధయన్ ॥ 3

టీ:- సఇతి. చేష్టారూపేణ క్రియాశక్త్యా. సహ తం గణమనుప్రవిష్టస్స భగవాన్. సుప్తం లుప్తం కర్మ తేషాం క్రియాం జీవానాం సృష్టివా. ప్రబోధయన్ సన్. భిన్నం నానా. 3

భగవానుడు విడివిడిగా ఉన్న మహత్తత్త్వాది గణములో ప్రవేశించి వాటిలో సుప్తమైయున్న క్రియాశక్తిని మేల్కొలిపినాడు. ఆ మహత్త్వత్త్వాది గణముతో సంయోగము కలిగించినాడు. ఈ విధముగా జీవుల కర్మాశయమును ఫలవంతము చేసినాడు. 3

శ్లో॥ ప్రబుద్ధ కర్మా దైవేన త్రయోవింశతికోగణః ।
ప్రేరితోఽజనయత్స్వాభిర్మాత్రాభిరధిపూరుషమ్ ॥ 4

టీ:- ప్రబుద్ధేతి. దేవేనేశ్వరేణేతి నియంతృత్వముచ్యతే ప్రబుద్ధం కర్మ క్రియాశక్తిర్యస్య స త్రయోవింశతికః. త్రయోవింశతేర్గణః దేవేనేశ్వరేణ ప్రేరితః సన్మాత్రాభిరంశైః. అధిపూరుషం విరాడ్దేహమ జనయత్. 4

ఇరువదిమూడు తత్త్వగణములో ఈశ్వరుడు ప్రవేశించి క్రియాశక్తిని ఉజ్జీవింపజేసినాడు కదా! ఆ ఇరవదిమూడు తత్త్వములు తమ తమ అంశాలతో "విరాట్ పురుషు" ని (బ్రహ్మాండరూపదేహము) ఉత్పన్నము చేసినవి. 4

శ్లో॥ పరేణ విశతా స్వస్మిన్మాత్రయా విశ్వసృడ్గణః ।
చుక్షోభాన్యోన్యమాసాద్య యస్మిన్ లోకాశ్చరాచరాః ॥ 5

టీ:- జననమేవాహ. పరేణేతి. స్వస్మిన్నావిశతాపరేణైశ్వర్యేణ విశ్వం సృజంతీతి విశ్వసృజాం. తత్త్వానాం గణః అన్యోన్యమితరేతరం మాత్రయా అంశేన చుక్షోభపరిణతః న సర్వాత్మనా యస్మిన్ పరిణామే. చరాచరాలోకాః స్థితాః. 5

పరమేశ్వరుడు తమలో ప్రవేశించగానే విశ్వసృష్టిచేయు ఆ మహదాదులు ఒకదానితోనొకటి కలసి క్షోభను పొందినవి. చరాచరము - లగు ప్రాణులకు ఆశ్రయమగు విరాట్పురుషుని సృష్టించినవి. అనగా మహదాదులు స్థూల బ్రహ్మాండరూపముగ మార్పుచెందినవి. చరాచరా లోకములన్నియు ఈ విరాడ్దేహమందే అంతర్లీనమైయున్నవి. 5

శ్లో॥ హిరణ్మయః సపురుషః సహస్ర పరివత్సరాన్ ।
అండకోశ ఉవాసాప్సు సర్వత్త్వోపబృంహితః ॥ 6

టీ:- హిరణ్మయఇతి. యోஉధిపురుష ఇత్యుక్తః. స పురుషః. అండకోశే బ్రహాండమధ్యే అప్స్వనుశాభిస్సర్వైర్జీవైరుప బృంహితః సహితస్సన్. అనంతవత్సరానువాస. 6

ఆ విరాట్ పురుషుడే తేజోమయుడగు హిరణ్మయుడు. ఆతడు సకల జీవులతో కూడి వేయిసంవత్సరములు నీటిలో అండాకారపు ఆధారమునందు నివసించెను. 6

శ్లో॥ స వై విశ్వసృజాం గర్భో దైవకర్మాత్మ శక్తిమాన్ ।
విశ్వభాజాత్మనాత్మానమే కధా దశధా త్రిధా ॥ 7

టీ:- స ఇతి దైవశక్తిః కర్మశక్తిః ఆత్మశక్తిః. తత్త్రయవాన్ దైవకర్మాత్మ శక్తిమాన్ విశ్వసృజాం మహదాదీనాం. స వై గర్భః కార్యరూపో విరాట్ విశ్వభాజా విశ్వాకారేణాత్మనా ఆత్మన మేకధా దశదా త్రిధా చ. విభక్తవాన్. దైవశక్తిః జ్ఞానశక్తిః తయా ఏకధా. హృదయావచ్ఛిన్న చైతన్య రూపేణ కర్మశక్తిః క్రియాశక్తిః తయా దశధా ప్రాణరూపేణప్రాణాదయః పంచవాయవః. శ్లో.'నాగః కూర్మశ్చ కృకరో దేవదత్తో ధనంజయ', ఇత్యంతర్భూతాః ప్రాణాదిషు పంచ ఏవం వృత్తిభేదేన దశవిధః ప్రాణో భవతి. ఆత్మశక్తిః భోక్తృశక్తిః తయా ఆధ్యాత్మ్యాదిభేదేన త్రిధా ఏవం విభాగం కృతవానిత్యర్థః. 7

దైవశక్తి, కర్మశక్తి, ఆత్మశక్తులు గలవాడు ఆ భగవంతుడు. అనగా ఆ పరమాత్మ దైవశక్తి, క్రియాశక్తి, ఆత్మశక్తి రూపముగా ప్రకటింపబడేవాడు. జగత్తును సృష్టించే మహదాదులకు కార్యరూపుడైన విరాట్ పురుషుడు తనను తానే ఒకటి, మూడు, పది విధములుగా విభజించుకొనెను. అనగా ఆ పరమాత్మ (1)"జీవశక్తి" లేదా "చైతన్యము" అనే ఏకరూపముగాను, (2)ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ అనే పది ప్రాణముల రూపము గాను, (3) ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనే తాపత్రయముగాను తనను తాను విభజించుకొనెను. "విశ్వభాజాత్మ నాత్మానం" అను మాటకు "విభభాజాత్మనాత్మానం" అను పాఠాంతరము కలదు. 7

శ్లో॥ ఏష హ్యశేషసత్త్వానామాత్మాంశః పరమాత్మనః ।
ఆద్యోఽవతారో యత్రాసౌ భూతగ్రామో విభావ్యతే ॥ 8

టీ:- ఏవం విభాగసామర్థ్యాయ తస్యోత్కర్ష మాహ. ఏషఇతి. ఆది భూతోవతార రూప ఏషః. పరమాత్మనః అశేషసత్త్వాణాం వ్యష్టి రూపానాం ప్రాణినాం. ఆత్మాతదంశత్వాదంశో జీవ ఇత్యవతారత్వోక్తిః యత్రాంశే తస్మిన్నారాయణావిర్భావాభి ప్రాయేణ. 8

శ్లో॥ సాధ్యాత్మః సాధిభూతశ్చ సాధిదైవ ఇతి త్రిధా ।
విరాట్ప్రాణో దశవిధ ఏకధా హృదయేన చ ॥ 9

టీ:- స వై విశ్వసృజామిత్యాది పూర్వ శ్లోకార్థం వివృణోతి సాధ్యాత్మ ఇతి. అధ్యాత్మానీంద్రియాణి తత్సహితః సాధ్యాత్మః. విరాడితి సర్వత్ర యోజ్యం.9

శ్లో॥ స్మరన్ విశ్వసృజామీశో విజ్ఞాపితమధోక్షజః ।
విరాజమతపత్స్వేన తేజసైషాం వివృత్తయే ॥ 10

పరమేశ్వరుని మొట్టమొదటి అవతారమే హిరణ్యగర్భుడు. అదే విరాట్ శరీరము లేక బ్రహ్మాండగోళము. ఈ బ్రహ్మాండగోళము నందే చరాచరజగత్తు అంతయు భాసించుచున్నది. పరమేశ్వరుడు హిరణ్య గర్భరూపములో "సమష్టి రూపము" గాను, ఆ హిరణ్యగర్భుని అంశలైన జీవుల రూపములో వ్యష్టి రూపముగా భాసించుచున్నాడు. 8

ఏడవ శోక్లములోని విషయమునే ఇంకనూ వివరించడమైనది. త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వ, ఆఘ్రాణ, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ అను దశేంద్రియములతో గూడిన మనస్సు ఆధ్యాత్మికము. ఇంద్రియాదుల విషయములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అధిభూతము. ఇంద్రియాధిష్ఠానదేవతలు అధిదైవము. విరాట్పురుషుడు తన ఇచ్ఛామాత్రమున అధ్యాత్మాది మూడురూపాలలో, దశప్రాణముల రూపములో, హృదయమునందున్న చైతన్యమనే ఒక రూపముతో నున్నాడు. 9

మహత్తులు మొదలగు తత్త్వములు చేసిన విన్నపమును పరమేశ్వరుడగు శ్రీమహావిష్ణువు స్మరించెను. ఆ మహదాదులకు వివిధ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- ఆధ్యాత్మాదిభేదం ప్రపంచయితుమాహ. స్మరన్నితి. విశ్వసృజాం తత్త్వానాం. యావద్బలిం తేఽజ హరామ కాల ఇత్యాది విజ్ఞాపితం స్మరన్ సన్ ఏషాం తత్త్వానాం. వివృత్తయే వివిధవృత్తిలాభాయ స్వేన తేజసా చిచ్ఛక్త్యా అపతత్ ఏవం కరిష్యామీత్యాలోచితవాన్. శ్రు. "యస్యజ్ఞాన మయం తప" ఇతిశ్రుతేః. 10

శ్లో॥ అథ తస్యాభితప్తస్య కతి చాయతనాని హ ।
నిరభిద్యంత దేవానాం తాని మే గదతః శ్రుణు ॥ 11

టీ:- అథేతి . హకారః ప్రసిద్ధౌ. ఆయతనాన్యాస్యాదీని. దేవానామ గ్న్యాదీనాం మే మత్తః శ్రుణు. 11

శ్లో॥ తస్యాగ్నిరాస్యం నిర్భిన్నం లోకపాలోఽవిశత్పదమ్ ।
వాచా స్వాంశేన వక్తవ్యం యయాఽసౌ ప్రతిపద్యతే ॥ 12

టీ:- ఆయతనాన్యేవాహ-తస్యేత్యాదినా. తస్యేతి. తస్యవిరాజఃఆదావాస్యం నిర్భిన్నం తం అథలోకపాలోఽగ్నిస్తత్పదం స్వస్థానం స్వాంశేన స్వశక్త్యా వాచా సహావిశత్ ప్రవిష్టవాన్. అసౌ. జీవః యయా వాచా వక్తవ్యం ప్రతిపద్యతే. శబ్దముచ్చరతీత్యర్థః. తయాసహేతి సర్వత్ర

వ్యాపారములను చేసే సామర్థ్యమును కలిగింప కోరినవాడై తనదైన "చిత్" శక్తితో విరాట్‌పురుషుని ప్రకాశింపజేసెను. 10

శ్రీ మహావిష్ణువు విరాట్ పురుషుని ప్రకాశింపజేసిన పిదప ఆ విరాట్ పురుషుని యందు వివిధ దేవతల స్థానములు ఉత్పన్నమైనవి. అవి ఎన్నో వాటి వివరములు ఎమిటో నేను చెప్పెదను వినవలసినది. (11)

ఆ విరాట్ పురుషునకు నోరు అనే స్థానము ఏర్పడెను. లోకపాలకుడగు అగ్ని తన అంశయగు వాంగింద్రియముతో సహా ఆ విరాట్ పురుషుని నోటి యందు ప్రవేశించెను. ఆ వాక్ఛక్తి ద్వారానే ఈ జీవుడు మాటలాడగలుగుచున్నాడు. 12

నిర్భిన్నం తదధిష్ఠానం అగ్న్యాతి ప్రథమాంత మధిదైవతం. వాగాదీం ద్రియం తృతీయాంతమధ్యాత్మం ప్రతిపత్తవ్యమధి భూతం ఏవముత్తరత్రా ప్యూహనీయం. 12

శ్లో॥ నిర్భిన్నం తాలు వరుణో లోకపాలోఽవిశత్పదమ్
జిహ్వయాంఽశేన చ రసాన్యయాఽసౌ ప్రతిపద్యతే ॥ 13

టీ:- నిర్భిన్నమితి. తాల్వధిష్ఠానం జిహ్వారసనేంద్రియం. 13

ఆ విరాట్పురుషునకు తాలువు(దవడ) విడివడెను. అనగా దవడ ఏర్పడెను. లోకపాలుడగు వరుణుడు తన అంశయగు రస నేంద్రియముతో (నాలుక) కూడినవాడై ఆ విరాట్ పురుషుని దవడ యందు ప్రవేశించెను. ఆ రసనేంద్రియ కారణముగనే (నాలుక వలననే) జీవుడు రసములను గ్రహించుచున్నాడు. అవిశత్ పదం అను మాటకు బదులు అవిశత్ హరేః అను పాఠాంతరము కలదు. 13

శ్లో॥ నిర్భిన్నే అశ్వినౌ నాసే హరేరావిశతాంపరమ్ ।
ఘ్రాణేనాంశేన గంధస్య ప్రతిపత్తిర్యతో భవేత్॥ 14

టీ:- నిర్భిన్నే ఇతి హరేర్విరాజః నాసాపుటే నిర్భిన్నే. యతో యేన. 14

సర్వవ్యాపియగు ఆ హరి విరాట్పురుషుడుగా ఏర్పడినాడు కదా! ఆ విరాట్పురుషునికి రెండు నాసికాపుటములు ఏర్పడినవి. అశ్వినీ దేవతలు తమ అంశయగు ఘ్రాణేంద్రియముతో (ముక్కు) గూడి ఆ విరాట్పురుషుని నాసికపుటములయందు ప్రవేశించిరి. ఆ ఇంద్రియము వలననే జీవులకు గంధజ్ఞానము(వాసనను చూచే పరిజ్ఞానము) కలుగుచున్నది. 14

శ్లో॥ నిర్భిన్నే అక్షిణీ త్వష్టా లోకపాలోఽవిశత్పదమ్ ।
చక్షుషాంశేన రూపాణాం ప్రతిపత్తిర్యతో భవేత్ ॥15

టీ:- నిర్భిన్నే ఇతి.త్వష్టా ఆదిత్యః.15

సర్వవ్యాపియగు ఆ విరాట్ పురుషునకు కన్నులు ప్రకటము అయ్యెను. లోకపాలకుడగు సూర్యుడు తన అంశయగు చక్షురింద్రియముతో సహా ఆ కన్నులలో ప్రవేశించెను. జీవులు ఈ చక్షురింద్రియము చేతనే రూపములను తెలిసికొనగలుగుచున్నారు కదా! 15

శ్లో॥ నిర్భిన్నాన్యస్య చర్మాణి లోకపాలోఽనిలోఽవిశత్ ।
ప్రాణేనాంశేన సంస్పర్శం యేనాసౌ ప్రతిపద్యతే ॥ 16

టీ:- నిర్భిన్నానీతి. ప్రాణేనేత్యస్య ప్రాణేన యద్దేహవ్యాపినా త్వగింద్రియేణేత్యర్థః. (16)

ఆ విరాట్పురుషునకు చర్మము ప్రకటమయ్యెను. లోకపాలుడగు అనిలుడు(వాయువు) తన అంశయగు త్వగింద్రియముతో (స్పర్శేంద్రియముతో) ఆ విరాట్పురుషుని చర్మము నందు ప్రవేశించెను. జీవుడు ఈ త్వగింద్రియముతోనే స్పర్శను తెలిసికొనగలుగుచున్నాడు. 16

శ్లో॥ కర్ణావస్య వినిర్భిన్నౌ ధిష్ణ్యం స్వం వివిశుర్దిశః ।
శ్రోత్రేణాంశేన శబ్దస్య సిద్ధిం యేన ప్రపద్యతే ॥ 17

టీ:- శబ్దస్య సిద్ధిం జ్ఞానమ్. (17)

ఆ విరాట్ పురుషునకు చెవులు ప్రకటమయ్యెను. దిక్కులు (దిగ్దేవతలు) తమ అంశయగు శ్రోత్రేంద్రియముతో తమ స్థానమగు విరాట్పురుషుని చెవుల యందు ప్రవేశించినవి. జీవుడు ఈ శ్రోత్రేంద్రియముతోనే (శ్రవణేంద్రియం) శబ్దములను వినగలుగుచున్నాడు కదా! 17

శ్లో॥ త్వచమస్య వినిర్భిన్నాం వివిశుర్ధిష్ణ్యమోషధీః ।
అంశేన రోమభిః కండూం యైరసౌ ప్రతిపద్యతే ॥ 18

ఆ విరాట్పురుషుని నుండి ప్రకటమైన చర్మము నందు ఓషధుల అభిమాన దేవతలు తమ అంశయగు రోమములతో గూడి ప్రవేశించినవి. జీవుడు ఈ స్పర్శేంద్రియము తోడనే దురదను అనుభవించుచున్నాడు. 18

టీ:- త్వచమితి. త్వచం చర్మ. ఓషధీరోషధయః త్వగింద్రియస్యైవ స్థానభేదేన విషయద్వయం కండూః స్పర్శశ్చ. తత్రాయం నామభేదో దేవతా భేదశ్చేతి ద్వితీయస్కంధ ఏవ వ్యాఖ్యాతమ్. 18

శ్లో॥ మేఢ్రం తస్య వినిర్భిన్నం స్వధిష్ణ్యం క ఉపావిశత్ ।
రేతసాంఽశేన యేనాసావానందం ప్రతిపద్యతే ॥19

ఆ విరాట్పురుషునకు మేఢ్రము ప్రకటమయ్యెను. మ్రేఢము అనగా పురుషజననాంగము. కః అనగా ప్రజాపతి. ప్రజాపతి తన అంశయగు రేతస్సుతోగూడి తన స్థానమగు మ్రేఢమునందు ప్రవేశించెను. దానివలననే జీవుడు ఆనందమును అనుభవించుచున్నాడు. 19

శ్లో॥ గుదం పుంసో వినిర్భిన్నం మిత్రో ధిష్ణ్యం స్వమావిశత్ ।
పాయునాంఽశేన యేనాసౌ విసర్గం ప్రతిపద్యతే ॥ 20

టీ:- మేఢ్రమితి. కః ప్రజాపతిః (19-20)

ఆ విరాట్పురుషునకు గుదము ప్రకటమయ్యెను. లోకపాలుడగు మిత్రుడు తన అంశయగు పాయువు (విసర్జనేంద్రియము) తోగూడి అందు ప్రవేశించెను. దానిచేతనే జీవుడు మలవిసర్జన చేయుచున్నాడు. (20)

శ్లో॥ హస్తావస్య వినిర్భిన్నావింద్రః స్వర్పతిరావిశత్ ।
వార్తాయాంఽశేన పురుషో యయా వృత్తిం ప్రపద్యతే ॥21

టీ:- హస్తావితి. స్వః పతిః స్వర్గస్య పతిః. వార్తయా క్రయ విక్రయాది శక్త్యా. వృత్తిం జీవికామ్. 21

ఆ విరాట్పురషునకు హస్తములు ప్రకటమయ్యెను. స్వర్గ లోకాధిపతియగు ఇంద్రుడు పట్టుకొనుటకు అవసరమయ్యే శక్తి (బలము) తో గూడి ఆ చేతులలో ప్రవేశించెను. మానవుడు ఆ శక్తి చేతనే జీవికను (బ్రతుకుదెరువును) సంపాదించుకొనుచున్నాడు. 21

శ్లో॥ పాదావస్య వినిర్భిన్నౌ స్వధిష్ణ్యం విష్ణురావిశత్ ।
గత్యా స్వాంశేన గంతవ్యం యయాసౌ ప్రతిపద్యతే ॥ 22

ఆ విరాట్పురుషునకు పాదములు ప్రకటమయ్యెను. విష్ణువు తన అంశయగు గమన శక్తి (నడక) తో గూడి ఆ పాదముల యందు ప్రవేశించెను. ఆ గతిశక్తి చేతనే మానవుడు నడవగలిగి తాను చేరవలసిన ప్రదేశమును చేరుకొనుచున్నాడు. 22

శ్లో॥ హృదయం చాస్య నిర్భిన్నం చంద్రమా ధిష్ణ్యమావిశత్ ।
మనసాంఽశేన యేనాసౌ విక్రియాం ప్రతిపద్యతే ॥ 23

టీ:- హృదయమితి. విక్రియాం సంకల్పాదిరూపాం. 22-24

ఆ విరాట్పురుషునకు హృదయము ప్రకటమయ్యెను. చంద్రుడు తన అంశయగు మనస్సుతోగూడి ఆ హృదయము నందు ప్రవేశించెను. మానవుడు ఆ మనస్సు యెక్క శక్తి చేతనే సంకల్ప వికల్పములను పొందుచున్నాడు. అనగా వికారములను పొందుచున్నాడు. 23

శ్లో॥ బుద్ధిశ్చాస్య వినిర్భిన్నా వాగీశో ధిష్ణ్యమావిశత్ ।
బోధేనాంశేన బోద్ధవ్యప్రతిపత్తిర్యతో భవేత్ ॥ 24

ఈ విరాట్పురుషునకు బుద్ధి ప్రకటమయ్యెను. వాగీశుడైన బ్రహ్మ తన అంశయైన "బోధ" తో కూడినవాడై దానిలో ప్రవేశించెను. మానవుడు ఈ "బోధ" లేక బుద్ధిశక్తి చేతనే తెలియదగిన విషయములను తెలిసికొనగలుగుచున్నాడు. 24

శ్లో॥ ఆత్మానం చాస్య నిర్భిన్నమభిమానోఽవిశత్పదమ్ ।
కర్మణాంశేన యేనాసౌ కర్తవ్యం ప్రతిపద్యతే ॥ 25

టీ:- ఆత్మానమితి. అస్య నిర్భిన్నమాత్మానమహంకారం. అభిమన్యతేఽనేనేత్యభిమానో రుద్రః కర్మణా అహం ప్రకృత్యా కర్తవ్యమితి క్రియా. (25)

ఈ విరాట్పురుషునకు " అహంకారం" ప్రకటమయ్యెను. అభిమానమే రుద్రుడు. ఆ రుద్రుడు తన అంశయైన "క్రియాశక్తి" తో కూడినవాడై ఈ "అహంకారం"లో ప్రవేశించెను. ఈ క్రియాశక్తి చేతనే మానవుడు తన యందు కర్తవ్యమును భావించి పనులను చేయుచున్నాడు. అనగా తానే పనులను చేయుచున్నానని అనుకొనుచున్నాడు. 25

శ్లో॥ సత్త్వం చాస్య వినిర్భిన్నం మహాన్ ధిష్ణ్యముపావిశత్ ।
చిత్తేనాంశేన యేనాసౌ విజ్ఞానం ప్రతిపద్యతే ॥ 26

టీ:- సత్త్వమితి. సత్త్వమితి బుద్ధి చిత్తయోర భేదేన నిర్దేశః. మహాన్ ఇతి బ్రహ్మ చిత్తేన చేతనయా. 26

ఆ విరాట్‌పురుషునకు "చిత్తము" ప్రకటమయ్యెను. ఆ "చిత్తము"నందు మహతత్త్వము తన అంశయగు "చిత్తశక్తి" తో ప్రవేశించెను. ఆ మహతత్త్వము యొక్క అంశయైన చిత్తశక్తి చేతనే మానవుడు విజ్ఞానము పొందుచున్నాడు. 26

శ్లో॥ శీర్ష్ణోఽస్య ద్యౌర్ధరా పద్భ్యాం ఖం నాభేరుదపద్యత ।
గుణానాం వృత్తయో యేషు ప్రతీయంతే సురాదయః ॥27

టీ:- త్రైలోక్యోత్పత్తిమాహ - శీర్ష్ణ ఇతి. యేషు ద్యౌరాదిషు. వృత్తయః పరిణామాః. సురాదయః దేవాదయః. 27

ఈ విరాట్‌పురుషుని శిరస్సు నుండి స్వర్గలోకము పుట్టినది. నాభి నుండి అంతరిక్షము (ఆకాశము) పుట్టినది. వాటి యందు సత్త్వము, రజస్సు, తమో గుణముల పరిణామములగు దేవతలు మొదలగువారు గోచరించుచున్నారు. 27

శ్లో॥ ఆత్యంతికేన సత్త్వేన దివం దేవాః ప్రపేదిరే ।
ధరాం రజస్స్వభావేన పణయో యే చ తానను ॥ 28

టీ:- ఏతదేవ. ప్రపంచయతి-ద్వాభ్యాం. ఆత్యంతికేన. ఆత్యంతి కేనోర్జితేన. సత్త్వేన గుణేన. పణ వ్యవహార ఇతి ధాతోః పణంతే యాగాదినా వ్యవహరంతీతి పణయః మనుష్యా ఇత్యర్థః తాన్మనుష్యానను తదుపకరణభూతా యే గవాదయస్తేఽపి ధరాం ప్రపేదిరతి. 28

అతిశయించిన సత్త్వగుణము కారణము గా దేవతలు స్వర్గ లోకమును పొందిరి. "పణము" అనగా వ్యవహారము, "రజస్సు" స్వభావముగాగల మానవులు వ్యవహార పరిజ్ఞానము గలవారై భూలోకమును పొందిరి. మానవులకు ఉపకరించుటకై ఏర్పడిన 'ఆవులు' మొదలగు జీవజాలముగూడా భూలోకముననే ఏర్పడెను. 28

శ్లో॥ తార్తీయేన స్వభావేన భగవన్నాభిమాశ్రితాః ।
ఉభయోరంతరం వ్యోమ రుద్రపారిషదాం గణాః ॥ 29

టీ:- రుద్రపారిషదాం రుద్రస్య పార్షదాదీనాం భూతానాం గణాః తార్తీయేన తృతీయ స్తమోగుణః తదీయేన తామసేనేత్యర్థః. శ్రీ భగవన్నాబి రూపం ఉభయోర్ద్యావా పృథివ్యోరంతరం మధ్యమంతరిక్షం ఆశ్రితాః అంరిక్షమేం భగవతో నాభిరితి ఖలు ప్రసిద్ధం. 29

తమస్సు గుణములలో మూడవది. రుద్రుని అనుచరులైన భూత గణములలో అది ప్రధానముగా నుండును. ఆకాశము (భగవంతుని నాభి) స్వర్గ మర్త్యలోకముల మధ్యలోనున్నది. అట్టి అంతరిక్షము భూతగణములకు నివాసము. 29

శ్లో॥ ముఖతోఽవర్తత బ్రహ్మ పురుషస్య కురూద్వహ ।
యస్తూన్ముఖత్వాద్వర్ణానాం ముఖ్యోఽభూద్బ్రాహ్మణోగురుః॥30

టీ:- ముఖతఇతి. బ్రహ్మ వేదః పురుషస్య భగవతః ముఖతోఽవర్తత ముఖాత్ ప్రవృత్తం. యస్తూన్ముఖత్వాత్ ముఖోద్భవత్వాత్ వర్ణానాం ముఖ్యో ముఖమివ ప్రథమోఽభూత్ గురుశ్చాభూత్ సోఽపి ముఖతోఽవర్తతేత్యనుషంగః. అధ్యాపనాదినా బ్రాహ్మణస్య వేదో వృత్తిః తయా వృత్త్యా సహ బ్రహ్మణో ముఖతోజాత ఇత్యర్థః. ఏవముత్తరత్ర వర్ణ త్రయోఽపి జ్ఞాతవ్యమ్. 30

కురువంశంలో శ్రేష్ఠుడవవగు ఓ విదురా! విరాట్పురుషుని ముఖము నుండి బ్రహ్మ ఏర్పడెను. ఇచ్చట బ్రహ్మయనగా వేదము, అనగా విరాట్ పురుషుని ముఖము నుండి వేదము ఏర్పడెను. బ్రహ్మ శబ్దమునకు "బ్రాహ్మణుడు" అనియు నర్థము. వేదాధ్యాయి అయిన బ్రాహ్మణుడు వేదములతోసహా పుట్టుట వలననే అతడు వర్ణములలో ముఖ్యుడు, మఱియు "గురువు" అగుచున్నాడు. బ్రాహ్మణునికి వేద అధ్యయన, అధ్యాపనాదులు వృత్తులు అగుచున్నవి. ఆ వృత్తులతో సహా బ్రాహ్మణుడు ముఖము నుండి పుట్టినాడని అర్థము. ఇదే విధముగా తరువాతి మూడు వర్ణములను తెలిసికొనవలెను. (అనగా విరాట్ పురుషుని ముఖము నుండి పుట్టి, వేద అధ్యయన, అధ్యాపనాదులు చేయువాడే బ్రాహ్మణుడని తాత్పర్యము) 30

శ్లో॥ బాహుభ్యోఽవర్తత క్షత్రం క్షత్రియ స్తదనువ్రతః ।
యో జాతస్త్రాయతే వర్ణాన్ పౌరుషాన్ కంటక క్షతాన్ ॥31

టీ:- బాహుభ్య ఇతి. పాలనరూపా వృత్తిః క్షత్త్రమిత్యుచ్యతే తత్ పురుషస్య బాహుభ్యఃప్రవృత్తం తత్ క్షత్రమనువ్రతః అనుసృతః తయా వృత్త్యా క్షత్రియోఽపి బాహుభ్యోఽవర్తతేత్యర్థః అనువ్రతత్వమేవాహ-య ఇతి. యో బాహుజాతః పౌరుషాన్ పురుషస్య విష్ణోరంశభూతాన్ వర్ణాన్ బ్రాహ్మణాదీన్ కంటకాశ్చోరాదయః తేభ్యో యోజాతః ఉపద్రవః తస్మాత్త్రాయతే రక్షతి. 31

క్షత్త్రం అనగా పరిపాలనా రూపమైన వృత్తి. విరాట్పురుషుని బాహువుల నుండి క్షత్రవృత్తి మఱియు క్షత్రియ వృత్తి అనుసరించే క్షత్రియుడు పుట్టెను. ఆ క్షత్రియుడు విష్ణ్వంశ సంభూతుడై బ్రాహ్మణాది వర్ణముల వారిని కాపాడును. చోరులు మొదలగువారి నుండి ఇతర ఉపద్రవముల నుండి కాపాడును. 31

శ్లో॥ విశోఽవర్తంత తస్యోర్వోర్లోక వృత్తి కరీర్విభోః ।
వైశ్యస్త దుద్భవో వార్తాం నృణాం యః సమవర్తయత్ ॥ 32

టీ:- విశఇతి. కృష్యాది వ్యవసాయా లోకస్య వృత్తికరీః జీవికా హేతవః విశ ఇత్యుచ్యంతే. అత్ర విభక్తివ్యత్యయశ్ఛాన్దసః. తస్య విభోరూర్వోః ప్రవృత్తాః. తదుద్భవ ఊరుజః వార్తాం జీవికాం కృష్యాదికం సమవర్తయత్ స్వప్రవృత్త్యా సంపాదితవాన్. 32

“విశ” అనగా వ్యవసాయము మున్నగు జీవికకు (బ్రతుకు దెరువు) అవసరమైన పనులు. ఈ పనులు చేయువారు వైశ్యులు. విరాట్పురుషుని ఊరువుల నుండి వైశ్యులు ఏర్పడినారు. “వార్తా” అనగా కూడా వ్యవసాయము మొదలగు జీవిక. ఈ వైశ్యుల వలననే మానవులు “జీవిక” సంపాదించగలుగుచున్నారు. 32

శ్లో॥ పద్భ్యాం భగవతో జజ్ఞే శుశ్రూషా ధర్మసిద్ధయే ।
తస్యాం జాతః పురా శూద్రో యద్వృత్త్యా తుష్యతే హరిః ॥33

టీ:- పద్భ్యామితి. శుశ్రూషా జాతా. తస్యాం శుశ్రూషాయాం నిమిత్త భూతాయాం శూద్రో జాతః ధర్మవృద్ధ్యర్థం జాతయా స్వవృత్తి రూపయా సహ శూద్రో భగవతః పద్భ్యాం జాత ఇతి భావః యద్వృత్త్యా యస్య శూద్రస్య వృత్తిరూపయా. శుశ్రూషయా హరిః పురా ప్రథమం తుష్యతే స శూద్ర ఇతి. 33

విరాట్పురుషుడైన భగవంతుని పాదముల నుండి సేవాధర్మము పుట్టెను. ఈ సేవాధర్మము సకల ధర్మములను సిద్ధింపజేయుటకై ఏర్పడినది. సేవాధర్మముతో పాటు శూద్రులు కూడా పుట్టిరి. ఈ శూద్రుల సేవావృత్తి వలన భగవంతుడు సంతోషించును. 33

శ్లో॥ ఏతే వర్ణాః స్వధర్మేణ యజంతి స్వగురుం హరిమ్ ।
శ్రద్ధయాత్మ విశుధ్యర్థం యజ్జాతాః సహ వృత్తిభిః ॥34

టీ:- ఏతఇతి. వృత్తిభిస్సహ. యద్యస్మాజ్జాతాః గురుత్వాజ్జనకత్వాత్ అత్రవృత్తి ప్రదత్వాచ్చ. శ్రీహరేరారాధనం. తేషాం పరో ధర్మ ఇత్యర్థః 34

ఈ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములవారు తమ వృత్తులతో సహా శ్రీహరి నుండి జన్మించిన వారగుట వలన తమతమ వర్ణధర్మములను శ్రద్ధగా అనుష్ఠించవలెను. ఆ స్వవర్ణ ధర్మానుష్ఠానమే తమకు గురువగు శ్రీహరిని ఆరాధించుట. ఈ ఆరాధన వలన అంతఃకరణము శుద్ధియగును. 34

శ్లో॥ ఏతత్ క్షత్తర్భగవతో దైవకర్మాత్మరూపిణః ।
కః శ్రద్దధ్యాదుపాకర్తుం యోగమాయా బలోదితమ్ ॥ 35

టీ:- ఏతదితి. హేక్షత్తః దైవకర్మాత్మరూపిణః కాలకర్మ స్వభావ శక్తిమతః

ఓ విదురా! భగవానుడు కాలము, జీవుల కర్మ మరియు తన స్వభావశక్తితో కూడిన యోగమాయ అనువాటితో కూడి విరాట్రూపముగా ప్రకటమయ్యెను. ఇట్టి విరాట్రూపమును సమగ్రముగా వర్ణించే సాహసమును ఎవరు చేయగలరు. 35

భగవతో యోగమాయాబలేన. ఉదితముజ్జృంభితం ఏతద్విరాడ్రూపం ఉపాకర్తుం సాకల్యేన నిరూపయితుం కః శ్రద్దధ్యాత్ ఇచ్ఛేత్. ఇచ్ఛాపి కర్తుమశక్యా నిరూపణం తు దూరతో నిరస్తమిత్యర్థః. 35

శ్లో॥ అథాపి కీర్తయామ్యంగ యథామతి యథా శ్రుతమ్ ।
కీర్తిం హరేః స్వాం సత్కర్తుం గిరమన్యాభిధాఽసతీమ్ ॥ 36

టీ:- అథాపీతి. హే విదుర. అథాపి శ్రీహరేః కీర్తిం కీర్తయామి. యథాశ్రుతం గురుముఖాత్. తదపి న సర్వాత్మనా, కింతు యథామతి స్వమత్యనుసారేణ, యథామతి కీర్తనే కిం ప్రయోజనమిత్యాశంక్యాహ అన్యాభిధా శ్రీహరి వ్యతిరిక్తాభిధానం తయా అసతీం మలినాం. స్వాం స్వీయాం గిరం వాచం సత్కర్తుం పవిత్రీకర్తుమ్. 36

శ్లో॥ ఏకాంత లాభం వచసో ను పుంసాం
సుశ్లోక మౌళేర్గుణవాదమాహుః ।
శ్రుతేశ్చ విద్వద్భిరుపాకృతాయాం
కథాసుధాయాముపసంప్రయోగమ్ ॥ 37

టీ:- అజ్ఞాత్వాపి యథామతి కీర్తనే శ్రవణే చావశ్యకం కైవల్య

ఓ విదురా! నేను గురుముఖమునుండి విన్నంతమేరకు, అది కూడా సర్వాత్మనా కాదు, కాని నా బుద్ధికి తెలియవచ్చినంత వరకు శ్రీహరిని కీర్తించుచున్నాను. బుద్ధికి తోచినంత కీర్తించడంలో ఏమి ప్రయోజనమనగా, భగవత్ గుణకీర్తన కంటే ఇతరమైన ప్రసంగములచే మలినమైన నా వాక్కును పవిత్రము చేసికొనుటయే. ఇందుకొరకై శ్రీవిష్ణుదేవుని మహిమను కీర్తించెదను అని తాత్పర్యము. 36

ఓ విదురా! భగవానుడు పవిత్రమగుకీర్తి గలవారిలో శిఖామణి. అట్టి శ్రీహరి గుణములను గానము చేయుటవలన మానవుల వాక్కునకు సునిశ్చితలాభము చేకూరును. తెలియకపోయినా కూడా బుద్ధికి తోచినంత శ్రీహరి కీర్తనము, శ్రవణము చేసినచో తప్పకుండా కైవల్యము లభిస్తుంది. విద్వాంసులు ఈ భగవత్ గాథ అనే అమృతమును కురిపించుచుండగా ఆ అమృతపానమునకు చెవులను అప్పగించుట

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

మిత్యాహ. ఏకాంతేతి. ఏకాంతలాభం సునిశ్చితమిత్యాహుః. శ్రుతేః శ్రోత్రస్య. ఉపాకృతాయాం నిరూపితాయాం ఉపసంప్రయోగం సన్నిధావర్పణం. 37

వలన సునిశ్చితలాభము చేకూరునని మహాత్ములు చెప్పుచున్నారు. గదా! భక్తి కలుగుట, కలిగిన భక్తి పెరుగుట, స్థిరపడుటయే సునిశ్చిత లాభము. ఇది మోక్షప్రాప్తికన్నను మిన్నయైనది. 37

శ్లో॥ ఆత్మనోఽస్యాదిక వినా మహిమావసితోఽపి కిమ్ ।
సంవత్సర సహస్రాంతే ధియా యోగ విపక్వయా ॥ 38

టీ:- న చాతీవ జ్ఞానే నిర్బంధః కర్తవ్యః బ్రాహ్మణోఽపి దుర్జ్ఞేయత్వా - దిత్యాహ ఆత్మన ఇతి. ఆత్మనో హరేర్మహిమా యోగవిపక్వయాపి ధియా సంవత్సర సహస్రాణామంతేఽపి ఆదినా కవినా బ్రహ్మణాపి కిమవసితః ఇతి కాకూక్త్యా ఏతావానితి న జ్ఞాత ఏవేత్యుక్తమ్. 38

ఓ ప్రియమైన ఓ విదురా! అధిక జ్ఞానసంపన్నుడైన బ్రాహ్మణుడు దీక్షతో ప్రయత్నించినను శ్రీహరిమహిమను తెలిసికొనజాలడు. అంతెందుకు బ్రహ్మదేవునకు ఆదికవియని పేరు. అట్టి బ్రహ్మదేవుడు వేయి సంవత్సరాలు తపస్సు చేసిననూ, ఆ తపోమహిమ వలన కలిగిన బుద్ధిపరిపక్వత చేత కూడా ఆత్మరూపుడగు శ్రీహరి మహిమను నిశ్చయముగా, సమగ్రముగా తెలిసికొనజాలడు కదా! 38

శ్లో॥ అహో భాగవతీ మాయా మాయినామపి మోహినీ ।
యత్స్వయం చాత్మవర్త్మాత్మా న వేద కిముతాపరే ॥39

టీ:- అహో ఇతి యత్ యస్మాత్ స్వయమపి ఆత్మా హరిః ఆత్మవర్త్మ స్వమాయా గతిం. ఏతావదితి న వేద. అనంతత్వాత్. 39

ఆత్మస్వరూపుడగు శ్రీహరి గూడ తన మాయా స్వరూపమును తెలియలేకున్నాడు. ఇక ఇతరుల విషయమున చెప్పునదేమున్నది? 39

శ్లో॥ యతోऽప్రాప్య న్యవర్తంత వాచశ్చ మనసా సహ ।
అహం చాన్య ఇమే దేవాస్తస్మై భగవతే నమః ॥ 40

టీ:- అతో దుర్జ్ఞేయత్వాత్కేవలం నమస్కరోతి యత ఇతి. యస్య జ్ఞానాయ ప్రవృత్తా వాచోऽపి మనసా సహ తమప్రాప్యైవ న్యవర్తంత దుర్జ్ఞేయత్వాత్. న కేవలం వాఙ్మనసీ, అహం అహంకారస్య అధిష్ఠాతా రుద్రోऽపి. చకారాద్బుద్ధేరధిష్ఠాతా బ్రహ్మాపి. ఇమే ఇంద్రియాధిష్ఠాతారో దేవా అన్యే చ. 40

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
షష్ఠోऽధ్యాయః

భగవానుని స్వరూపమును వర్ణింపబూని వాక్కు, మనస్సు కూడా విఫలమై వెనుదిరిగినవి. అహంకారాధిష్ఠాతయగు రుద్రుడు, ఇతర ఇంద్రియాధిష్ఠాన దేవతలు కూడా భగవానుని మహిమను తెలియ లేకున్నారు. అట్టి భగవంతుడైన శ్రీహరికి నమస్కారములు. 40

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఆరవ అధ్యాయము సమాప్తము.

### సప్తమోఽధ్యాయః

శ్లో. సప్తమేసంశయశ్ఛేది ప్రతినంద్య మునేర్వచః, పునః క్షత్త్రా కృతా నానా ప్రశ్నాస్సమ్యగుదీరితాః.

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవం బ్రువాణం మైత్రేయం ద్వైపాయనసుతో బుధః ।
ప్రీణయన్నివ భారత్యా విదురః ప్రత్యభాషత ॥1

టీ:- శ్లో.'అథ తే భగవల్లీలా యోగమాయోపబృంహితా'ఇత్యాదినా మాయా గుణైర్లీలయా భగవాన్ సృష్ట్యాది కరోతీత్యేవం బ్రువాణం మైత్రేయం భారత్యా ప్రార్థనా రూపయా ప్రీణయన్నివేతి అభిప్రాయ పరిజ్ఞానేనాక్షేపాత్. 1

విదుర ఉవాచ

శ్లో॥ బ్రహ్మన్ కథం భగవతశ్చిన్మాత్రస్యావికారిణః ।
లీలయా చాపి యుజ్యేరన్నిర్గుణస్య గుణాః క్రియాః ॥2

టీ:- బ్రహ్మన్నితి. నిర్వికారస్య క్రియా, నిర్గుణస్య గుణాః కథం లీలయేత్యుక్తిః ప్రయోజనాభావం పరిహరతి న తు వస్తువిరోధమితి భావః. 2

### 7వ అధ్యాయము

సంశయచ్ఛేదకమగు బోధనలను విదురుడు మైత్రేయ మహాముని వలన వినెను. ఆ పిమ్మట ఇంకను ఆ భగవానుని అచింత్య లీలలను వినగోరి విదురుడు మైత్రేయుని అనేక విధములుగా (ఈ ఏడవ అధ్యాయమున) ప్రశ్నించుచున్నాడు.

శ్రీశుకుడు ఇట్లు పలికెను

విదురుడు మహావిద్వాంసుడు. వ్యాసనందనుడు. అతడు మైత్రేయముని యొక్క ఈ రకములైన మాటలను విని తన పలుకులతో ఆయనకు సంతోషము కలిగించుచూ ఇట్లు పలికెను. 1

విదురుడు ఇట్లు పలికెను

ఓ మైత్రేయ మహాత్మా ! (బ్రహ్మన్) భగవంతుడు శుద్ధచైతన్య స్వరూపుడు, వికారములేనివాడు, గుణసంబంధము లేనివాడు. అలాంటి భగవంతునకు లీలల కొరకైననూ గుణములు, క్రియలు ఎట్లు జతగూడు చున్నవి? 2

శ్లో॥ క్రీడయా ముద్యమోஉర్భస్య కామశ్చి క్రీడిషాన్యతః ।
స్వతస్తృప్తస్య చ కథం నివృత్తస్య సదాన్యతః ॥ 3

టీ:- అర్భకవల్లీలాపి న యుజ్యతే వైషమ్యాదిత్యాహ - క్రీడాయామితి. ఉద్యమయమితి ప్రవర్తయతీత్యుద్యమః కామః. అర్భస్య అర్భకస్య క్రీడాయాం ప్రవృత్తిహేతుః కామోஉస్తి. అన్యతశ్చ వస్త్వంతరేణ బాలాంతర ప్రవర్తనేన వా తస్య క్రీడేచ్ఛా భవతి. ఈశ్వరస్య తు స్వతస్తృప్తస్య కథం కామః అన్యతః సదా నివృత్తస్య చ. అసంగాద్వితీయస్య కథమన్యతశ్చిక్రీడిషేత్యర్థః. 3

చిన్న పిల్లవానికి క్రీడయందు ఆసక్తి (కోరిక) ఉండును. ఆడుకొనుటకు ఇతర వస్తువులు, మరికొందరు పిల్లలు కావలయును. కాని భగవంతుడు స్వయంగా సంతృప్తుడు. తన కంటే ఇతరమేమియు లేనివాడు. అసంగుడు అయినప్పటికి ఈ ప్రపంచమును లీలాభాండముగా చేసుకొని క్రీడింప కోరుచున్నాడు ఎందులకు? ( ఏ కోరిక చేత) 3

శ్లో॥ అస్రాక్షీద్భగవాన్ విశ్వం గుణమయ్యాత్మమాయయా ।
తయా సంస్థాపయత్యేతద్భూయః ప్రత్యభిధాస్యతి ॥ 4

టీ:- యదుక్తం. శ్లో.'స్మరన్ విశ్వసృజామీశో విజ్ఞాపితమధోక్షజ' ఇత్యాదినా అవిద్యోపాధేర్జీవస్య భోగార్థమీశ్వరః సృష్టాదికం కరోతీతి తదప్యాక్షిప్తుం అనువదతి-అస్రాక్షీదితి. గుణమయ్యా ఆత్మనో జీవస్య కర్తృత్వ భోక్తృత్వాది మోహోత్పాదికా యా మాయా తయా సృష్టవాన్. తదుక్తం ప్రథమే. శ్లో.'యయా సమ్మోహితో జీవ ఆత్మానం త్రిగుణాత్మకం, పరోஉపి మనుతేஉనర్థం తత్కృం చాభిపద్యత ' ఇత్యాదినా. అత్ర

తన మాయచేతనే భగవానుడు మూడుగుణములతో గూడిన ఈ ప్రపంచమును సృష్టించెను. ఈ మాయ చేతనే ఈ ప్రపంచమును రక్షించుచున్నాడు. ఈ మాయ చేతనే ప్రళయకాలమునందు మరల తనలోనికి ఉపసంహరించుకొనగలడు. 4

చ. శ్లో.'అహో భాగవతీ మాయా మాయినామపి మోహినీ'తి. సంస్థాపయతి పాలయతి. ప్రత్యభిధాస్యతి ప్రాతిలోమ్యేన తిరోహితం కరిష్యతి. పాఠాంతరే ప్రాతిలోమ్యేన ఆత్మని ధారయిష్యతి. 4

శ్లో॥ దేశతః కాలతో యోఽసావవస్థాతః స్వతోఽన్యతః ।
అవిలుప్తావబోధాత్మా స యుజ్యేతాజయా కథమ్ ॥ 5

టీ:- ఏతచ్చ జీవస్యావిద్యాశ్రయత్వే ఘటతే తత్తున సంభవతీత్యాహ - దేశతఇతి. యోఽసౌ దేశాదిభిరవిలుప్తావ బోధాత్మా జీవః, బ్రహ్మ స్వరూపత్వాత్సకథం అజయా అవిద్యయా యుజ్యేత. తత్ర దేశతో దీపప్రభాయా ఇవ లోపో నాస్తి. సర్వగతత్వాత్.న కాలతః విద్యుత ఇవ నిత్యత్వాత్. నావస్థాతః, స్మృతేరివ అవిక్రియత్వాత్. న స్వతః, స్వప్నవత్ సత్యత్వాత్. నాన్యతః ఘటాదివత్ అద్వితీయత్వాత్. ఏవమేవ-తైర్యస్య బోధో న లుప్యతే స కథమజయా యుజ్యేత? అజా చాత్ర అవిద్యైవ న మాయా, తస్యా అవబోధేన తిరోధానా భావాత్. 5

శ్లో॥ భగవానేక ఏవైష స్సర్వక్షేత్రేష్వవస్థితః ।
అముష్య దుర్భగత్వం వా క్లేశో వా కర్మభిః కుతః ॥ 6

ఈ భగవానుడు సర్వత్ర వ్యాపకుడు. ఎల్లప్పుడు ఉండువాడు. జాగ్రత్, స్వప్న, సుషుప్తలయందేకాక సర్వ అవస్థల యందు ఉండువాడు. కనుక నిర్విశేష జ్ఞానస్వరూపుడు. పరిపూర్ణుడు. అట్టి భగవానునకు "అజ" అయిన అవిద్యతో పొత్తు ఎట్లు పొసగును? పరిపూర్ణ జ్ఞానస్వరూపి అయిన భగవంతునకు అవిద్యా సంగమెట్లు పొసగునని ప్రశ్న. 5

ఒక్కడే అయి ఉన్న ఈ భగవంతుడు సర్వదేహములందు వ్యాపించి యున్నాడు కదా! సర్వవ్యాపియైన వాడికి చిద్రూపుడైనను, జీవత్వము పొందుట వలన, జీవ సంబంధములైన, కామాది

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- కించ బ్రహ్మస్వరూపత్వాదేవ జీవస్య సంసారోఽపి న యుజ్యత ఇత్యాక్షిపతి - భగవానితి. సర్వక్షేత్రేష్వవస్థితో భోక్తాపి వస్తుతో భగవానేవ, చిద్రూపత్వేన తద్వ్యతిరేకాభావాత్. ఏవం చ సత్యముష్య జీవస్య దుర్భగత్వమానందాదిభ్రంశః కర్మభిర్హేతుభూతైః క్లేశో వా కుతః కర్మ-సంబంధాభావాత్. అన్యథా ఈశ్వరస్యాసి తత్ప్రసంగస్స్యాదితి భావః6

ఆనందాభాసములతో కూడిన ఈ కర్మలచే బంధము, క్లేశములు, తగలకుండుట ఎట్లు సాధ్యము, దీనికి కారణమేమి? 6

శ్లో॥ ఏతస్మిన్మే మనో విద్వన్ ఖిద్యతేఽజ్ఞాన సంకటే ।
తన్నః పరాణుద విభో కశ్మలం మానసం మహత్ ॥ 7

టీ:- ఏతస్మిన్నితి. అజ్ఞానమేవ సంకటం దుర్గం తస్మిన్ మానసం కశ్మలం మోహం పరాణుద అపానుద అపాకుర్విత్యర్థః. 7

సర్వజ్ఞుడవైన ఓ మైత్రేయ మహర్షీ ! ఈ అజ్ఞానమనే సంకటములో పడి నా మనస్సు మిక్కిలి ఖేదము ననుభవించుచున్నది. నీవు ఈ సంకటము నుండి నన్ను దూరముచేయుము. నా మానసిక దోషమును తొలగించుము. 7

శ్రీశుక ఉవాచ

శ్లో॥ స ఇత్థం చోదితః క్షత్త్రా తద్విజిజ్ఞాసునా మునిః ।
ప్రత్యాహ భగవచ్చిత్తః స్మయన్నివ గతస్మయః ॥ 8

టీ:- స ఇతి. చోదితః ఆక్షిప్తః. స్మయన్నివ స్మయమావిష్కుర్వన్నివ వస్తుతస్తు గతస్మయః. 8

శ్రీశుకమహర్షి ఇట్లు పలుకెను.

విదురుడు తత్త్వమును తెలియగోరువాడు. అట్టి విదురుడు ప్రేరేపించగా మైత్రేయ మహాముని చిరునవ్వుతో ఇట్లు సమాధానము చెప్పెను. ఈ మైత్రేయ మహాముని తొలగిన అహంకారము గలవాడై సమాధానము చెప్పుచున్నాడు. 8

మైత్రేయ ఉవాచ

శ్లో॥ సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే ।
ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్యముత బంధనమ్ ॥ 9

టీ:- సేతి. భగవతోఽచింత్య శక్తేరీశ్వరస్య సేయం మాయా నయేన తర్కేణ విరుధ్యత ఇతి యత్. యా సా మాయేతి తర్కవిరోధమేవాను వదతి - ముక్తస్యావిద్యయా బంధనం కార్పణ్యం చేతి. 9

మైత్రేయుడు ఇట్లు వలికెను--

భగవంతునికి కర్మబంధము, క్లేశము తొలగుటకు కారణము చెప్పుచున్నాడు. నిత్యముక్తుడైన ఈశ్వరునకు దైన్యము, బంధము అనునవి యుక్తి విరుద్ధమగు స్థితులు. ఈ స్థితులకు కారణము భగవంతుని మాయయే. 9

శ్లో॥ యదర్థేన వినాముష్య పుంస ఆత్మవిపర్యయః ।
ప్రతీయత ఉపద్రష్టుః స్వశిరశ్ఛేదనాదికః ॥ 10

టీ:- అత్రోదాహరణమాహ - యత్ యథా అర్థేన స్వశిరశ్ఛేదనాదినా విన్యాప్యుపద్రష్టుః స్వప్నసాక్షిణః పుంసః మమేదం శిరశ్ఛిన్నమితి ఆత్మవిపర్యయః కేవలం మృషైవా ప్రతీయతే తద్వత్. 10

స్వప్నములో మానవునకు తన తల నరకబడినట్లుగను, ఇంకా అనేక విధములైన కష్ట సుఖములు పొందినట్లుగను తోచును. కాని ఇవేవి సత్యములు కావు. అట్లే వాస్తవమునకు మానవుడు బద్ధుడు కాకున్ననూ తన స్వరూపమునకు భిన్నముగా బద్ధుడైనట్లు తలచును. ఇది అజ్ఞాన కల్పితము మాత్రమే. సత్యము కాదు. 10

శ్లో॥ యథా జలే చంద్రమసః కంపాదిస్తత్కృతో గుణః ।
దృశ్యతేఽసన్నపి ద్రష్టురాత్మనోఽనాత్మనో గుణః ॥11

టీ:- తర్హి ఈశ్వరస్యాపి కిం న ప్రతీయతే? తత్రాహ - యథేతి.

ఆకాశమునందలి చంద్రుడు నీటిలో కనిపించును. నీరు కదులుచున్నంత సేపు చంద్రుడు కదులుచున్నట్లగుపడును. బింబమైన చంద్రునకు కదలికలేదు. అట్లే శుద్ధచైతన్యము (దృక్ స్వరూపము లేక శుద్ధజీవాత్మ) యందు దేహభావము, అది అనుభవించు సుఖ దుఃఖ

యథా జలే ప్రతిబింబగతస్యైవ చంద్రమసః జలోపాధికృత కంపాది గుణో ధర్మః దృశ్యతే, న త్వాకాశేస్థితస్య. తథా అనాత్మనో దేహాదేర్ధర్మః అసన్నపితదభిమానినో ద్రష్టురాత్మనో జీవస్యైవ నత్వీశ్వరస్యేత్యర్థః11

శ్లో॥ స వై నివృత్తిధర్మేణ వాసుదేవానుకంపయా ।
భగవద్భక్తి యోగేన తిరోధత్తే శనైరిహ ॥12

టీ:- తన్నివృత్త్యుపాయమాహ- స ఇతి. స వై అనాత్మనో గుణః నివృత్తిధర్మేణ వాసుదేవస్యానుకంపా తయా చ తస్మిన్భక్తియోగస్తేన తిరోధత్తేఽదృశ్యో భవతి. శనైరిత్యనేన సాధనానుసారేణేత్యుక్తం. 12

శ్లో॥ యదేంద్రియోపరామోఽథ ద్రష్టాత్మని పరే హరౌ ।
విలీయంతే తదా క్లేశాః సంసుప్తస్యేవ కృత్స్నశః ॥ 13

టీ:- తర్హి సర్వానర్థ నివృత్తిః కదేత్య పేక్షయామాహ యదేతి. ద్రష్టాత్మ న్యంతర్యామిరూపే పరే హరౌ పరమాత్మని ఉపరామ ఉపరమః యదంద్రియో పరమో నైశ్చల్యం అనంతరమేవ కృత్స్నశః క్లేశా విలీయంతే. సర్వ క్లేశ వినాశే దృష్టాంతః సంసుప్తస్యైవ యథా న తు పునరుత్థానే విలీయంతే యథేత్యత్ర యథాశబ్ద ఇవ శబ్దార్థకః. 13

అనుభూతులు లేవు. నీటి యందలి చంద్రుని వలె అవిద్య చేత ఆవరింపబడిన జీవునకు సుఖ దుఃఖాది అనాత్మగుణములు లేకున్నను ఉన్నట్లు తోచును. 11

ఆ దేహాత్మభావము లేక అవిద్యాభినివేశములు తొలుగు ఉపాయ ములు చెప్పుచున్నాడు. 1. నిష్కామకర్మ లేక నివృత్తి భావము. 2. ఆ వాసుదేవుని అనుగ్రహము. 3. భగవంతుని యందలి భక్తి. ఈ మూడు ఒనగూడునపుడు ఈ దేహాత్మభావన మెల్ల మెల్లగా తొలగును. మన సాధన యొక్క తీవ్రత ననుసరించి తొలగునని తాత్పర్యము. "వై" పదప్రయోగముచే ఈ అవిద్యాభినివేశము నిశ్చయముగా తొలగునని చెప్పడమైనది. 12

మానవుని సర్వేంద్రియములు ఆ పరమాత్మయందు విలీనము కావలెను. ఈ పరమాత్మయే ద్రష్టస్వరూపమైన శ్రీహరి. ఈ ఇంద్రియ- ములు సంసారము నుండి విరామము పొందినపుడే పరమాత్మయందు నిశ్చలముగా నుండును. అపుడు వెంటనే మానవుని చిత్తక్లేశములు పూర్తిగా నశించును. ఈ చిత్తక్లేశములు అయిదు. 1. అవిద్య 2. అస్మిత 3. రాగము 4. ద్వేషము 5. అభినివేశము. గాఢనిద్రలో నున్న వానికి చిత్తక్లేశములు తొలగి శాంతి సమకూరునట్లే పరమాత్మయందు ఇంద్రి యములు లగ్నమైనపుడు ఈ చిత్తక్లేశములు పూర్తిగా నశించును. 13

శ్లో॥ అశేష సంక్లేశశమం విధత్తే గుణానువాద శ్రవణం మురారేః।
కిం వా పునస్తచ్చరణారవిందపరాగసేవారతిరాత్మలబ్ధా ॥14

టీ:- భక్తియోగేన క్లేశనివృత్తిం దర్శయతి-అశేషేతి. గుణానామనువాదశ్చ శ్రవణం చ. ఆత్మని మనసి లబ్ధా శ్రవణకీర్తనా పేక్షయా సప్రేమధ్యానే కిం పునర్వాయోక్తిః. 14

మురారి గుణములను కీర్తించుటవలన, వినుట వలన సమస్తమైన క్లేశములు తొలగును. ఇక మనస్సునకే గనుక ఆ శ్రీహరి పాదపద్మములను సేవించవలెనను ప్రీతి ఏర్పడినచో మరి చెప్పవలసిన దేమున్నది? 14

విదుర ఉవాచ

శ్లో॥ సంఛిన్నః సంశయో మహ్యం తవ సూక్తాసినా విభో ।
భయత్రాపి భగవన్ మనో మే సంప్రధావతి ॥ 15

టీ:- ఉత్తరమభినందన్నాత్మనః కృతార్థతామావిష్కరోతి షడ్భిః సంఛిన్న ఇతి. చిద్రూపత్వా విశేషాత్కథమీశ్వరస్య జగత్కర్తృత్వాది, కథం వా జీవస్య సంసార ఇతి యస్సంశయో మహ్యం మమాసీత్ సః తవ సూక్తం సోపపత్తికం. వాక్యమేవాసిః ఖడ్గః తేన సంఛిన్నః. అత ఇదానీం మే మనః ఉభయత్రాపీశ్వర స్వాతంత్ర్యే జీవపారతంత్ర్యే చ సంప్రధావతి సమ్యక్ప్రవిశతి. ఏవం వా అవిప్లుతస్యావబోధ రూపస్యాత్మనః కథమ-విద్యయా బంధః, కుతో తన్నివృత్తిరితి వా సంశయః. ఉభయత్ర, బంధమోక్షే చేత్యర్థః. 15

విదురుడు చెప్పుచున్నాడు

సమాధానమును అభినందిస్తూ, నేను కృతార్థుడనైతినని ఆరు శ్లోకములతో చెప్పుచున్నాడు. ఓ ప్రభూ! నీ మాటలు అనెడి చురకత్తి నా సంశయములన్నింటిని ఛేదించివేసినది. ఓ పూజ్యుడా! ఇప్పుడు నా మనస్సు ఉభయత్ర చక్కగా ప్రవేశించుచున్నది. అనగా బంధ మోక్ష కారణములు రెండు చక్కగా తెలియుచున్నవని అర్థము. అట్లే 1. ఈశ్వరుని స్వతంత్రత - జీవుని పరతంత్రత 2. అవిద్యా కల్పితమగు బంధము - దాని నివృత్తి. నిత్యమగు మోక్షము అనే ఉభయ అంశములు చక్కగా తెలియుచున్నవి అని అర్థము. 15

శ్లో॥ సాధ్వ్యేతద్వ్యాహృతం విద్వన్నాత్మమాయాయనం హరేః।
ఆభాత్యపార్థం నిర్మూలం విశ్వమూలం న యద్బహిః ॥ 16

టీ:- సాధ్వితి. శ్రీహరేః శక్తిర్యాసాత్మ మాయా జీవవిషయా మాయా తదయనం తదాశ్రయం తదేతద్దుర్భగత్వాదికం ఆభాతి దుర్భగత్వం నామానందాదిభ్రంశః తదేవాజ్ఞానమితి పూర్వమేవ వ్యాఖ్యాతం. కథ మాభాతి స్వశిరశ్ఛేదాదివత్ అపార్థం సత్ తత్కర్తృకీదృశం విశ్వం నామ దేహాదిప్రపంచః తస్య మూలం బహిర్నాస్తి యద్వస్తు స్వయం నిర్మూలం మూలశూన్యం చ తదేవ త్వయా సాధు వ్యాహృతం.16

ఓ విద్వాంసుడా! చక్కగా చెప్పితివి. జీవుని బంధములన్నింటికి శ్రీహరి మాయయే కారణము. ఈ జగత్తు పరమాత్మ కంటె భిన్నము కాదు. కాని భిన్నముగా తోచుచున్నది. మిథ్యయైన జగత్తు యథార్థమా? అనిపించుచున్నది. దీనికంతటికి భగవన్మాయ, జీవుని అజ్ఞానమే కారణమగుచున్నది. స్వప్నమునందు శిరచ్ఛేదమైనట్లు అనిపించిననూ నిజముగా ఆ స్థితి లేనట్లే, ఈ ప్రపంచము మాయా కల్పితమే. 16

శ్లో॥ యశ్చ మూఢతమో లోకే యశ్చ బుద్ధేః పరం గతః ।
తావుభౌ సుఖమేధేతే క్లిశ్యత్యంతరితో జనః ॥ 17

టీ:- అల్పజ్ఞత్వాత్పూర్వం మమ సంశయో జాత ఇత్యాహ-యశ్చేతి. మూఢతమో దేహాద్యాసక్తో యశ్చ బుద్ధేః ప్రకృతేః పరమీశ్వరం ప్రాప్తః తౌ సుఖం యథా భవతి తథా ఏధేతే జీవత ఇత్యర్థః. సంశయక్లేశాభావాత్ యస్తు సుఖ దుఃఖానుసంధానేన ప్రపంచం జిహాసతి స్వానంద-సంవేదనాభావాచ్చ హాతుం న శక్నోతి స తు క్లిశ్యతీత్యర్థః. 17

మిక్కిలి మూఢుడు అనగా దేహాదులయందు ఆసక్తి గలవాడు మరియు బుద్ధికి కూడా అందని పరమాత్మ జ్ఞానమును పొందినవాడు ఈ ఇరువురే సుఖమును పొందుచున్నారు. ఈ రెండవస్థలకు మధ్య నున్నవారు అనగా సంశయాత్ములు క్లేశములననుభవించుచున్నారు. (17)

శ్లో॥ అర్థాభావం వినిశ్చిత్య ప్రతీత స్యాప్యనాత్మనః ।
తాం చాపి యుష్మచ్చరణసేవయాఽహం పరాణుదే ॥18

టీ:- అవశిష్టమపి ప్రతీతం యుష్మత్ప్రసాదాన్నివర్తిష్యత ఇత్యతః కృతార్థోఽస్మీత్యాహ-అర్థాభావమితి. ప్రతీతస్యాప్యనాత్మనః ప్రపంచస్య అర్థాభావం అర్థో నాస్తి కింతు ప్రతీతిమాత్రమితి వినిశ్చత్య అహం తాం ప్రతీతిమపి యుష్మచ్చరణసేవయా పరాణుదే పరతో నేష్యామి. యుష్మచ్చరణసేవయా వినిశ్చత్యేతి వా యోజనా. 18

ఈ ప్రపంచము అనాత్మ, అనగా ఆత్మకానిది, వాస్తవము కానిది. లేనిది ఉన్నట్లుగా కనిపించునది. ఇదియే ప్రతీతి. మీ పాదములను సేవించుటచే నేను ఆ "ప్రతీతి" ని కూడా తొలగించుకొనెదను. "ప్రతీతి" అనగా కనబడుట. 18

శ్లో॥ యత్సేవయా భగవతః కూటస్థస్య మధుద్విషః ।
రతిరాసో భవేత్తీవ్రః పాదయోర్వ్యసనార్దనః ॥19

టీ:- యదితి. తీవ్రః దుర్వారః. స్వాభావికం వ్యసనం సంసార మర్దయతి నాశయతీతి వ్యసనార్దనః. భగవతో మధుద్విషః పాదయోః రతిరాసః ప్రేమోత్సవః యస్మాన్మహత్సు సేవయా భవేత్ సా దుర్లభాపి సేవా మయా ప్రాప్తేత్యుత్తరత్రాన్వయః. 19

మీ పాదసేవచే "మధువైరి" యైన శ్రీకృష్ణుని యందు తీవ్రమైన ప్రేమ కలుగును. ఇచట "మధు" శబ్దమునకు సంసారము నందలి ఆసక్తి అనియునర్థము. మధువైరి అనగా సంసారాసక్తిని ద్వేషించువాడు. నిర్వికారుడు అయిన శ్రీహరి పాదములయందు ప్రేమ కలుగుటచే ఆ ప్రేమ ఉత్సవముగా వర్ధిల్లి, అది గొప్ప సేవగా మారును. అటువంటి దుర్లభమమైన సేవ నాకు లభించినది. ( అని తరువాతి శ్లోకముతో అన్వయము) దానివలన సమస్త సంసార బంధనములు కూడా తొలగును. 19

శ్లో॥ దురాపాహ్యల్పతపః సేవా వైకుంఠవర్త్మసు ।
యత్రోపగీయతే నిత్యం దేవదేవో జనార్దనః ॥ 20

టీ:- దురాపేతి. వైకుంఠస్య శ్రీవిష్ణోః తస్య లోకస్య వా వర్త్మసు మార్గ భూతేషు మహత్సు. సా సేవా అల్పతపసా దురాప దుర్లభాపి మయా సంప్రాప్తా హి. యత్ర యేషు. సత్సు తేషు సేవేతి మహత్సేవయా హరికథా శ్రవణం తతః. శ్రీహరౌ ప్రేమ, తేన చ దేహాద్యనుసంధాన-మపి నివర్తత ఇతి తాత్పర్యమ్. 20

మహాత్ములు, భక్తులైనవారు శ్రీవైకుంఠనాథుని చేరుమార్గంలో నడిచేవారు. లేదా వైకుంఠమునకు చేరు మార్గము లాంటివారు కొద్ది పాటి పుణ్యము చేసుకున్న వారికి అలాంటి భక్తుల సేవ లభించుట దుర్లభము కదా ! అట్టి మహాత్ముల సన్నిధిలో సదా జనార్దనుడు కీర్తింపబడుచుండును. 20

శ్లో॥ సృష్ట్వాఽగ్రే మహదాదీని సవికారాణ్యనుక్రమాత్ ।
తేభ్యో విరాజముద్ధృత్య తమను ప్రావిశద్విభుః ॥ 21

టీ:- అర్థాంతరం ప్రష్టుం తదుక్తార్థమనువదతి త్రిభిః-సృష్ట్వేతి. వికారైరింద్రియాదిభిః సహితాని సవికారాణి మహదాదీని విభుః అగ్రే ప్రథమం అనుక్రమాత్సృష్ట్వా తేభ్య ఉద్ధృతైస్తదంశైర్విరాజం సృష్ట్వా. తం విరాజ మనుప్రావిశత్ ప్రవిష్టః. 21

భగవానుడు మొదట పంచభూతములు, ఇంద్రియాదులు మొదలగు వికారములతో గూడిన మహత్తత్త్వాదులను సృష్టించెను. వాటి అంశలతో విరాట్పురుషుని ప్రకటింపచేసెను. తాను ఆ విరాట్ పురుషుని యందు (సత్తా, స్ఫురణల రూపంగా) ప్రవేశించెను. 21

శ్లో॥ యమాహురాద్యం పురుషం సహస్రాంఘ్ర్యూరు బాహుకమ్ ।
యత్ర విశ్వ ఇమే లోకాస్సవికాసం సమాసతే ॥ 22

టీ:- తత్స్వరూపమాహ-యమితి. విరాజం విశినష్టి-యత్రేతి. తే

విరాట్పురుషుని ఆదిపురుషుడని పండితులు చెప్పుచున్నారు. ఆయనకు వేలకొలది(అనంతములగు)పాదములు,తొడలు, బాహువులు ఉండును. ఈ సమస్త లోకములు, సమస్త ప్రాణులు ఆయన యందు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఇమే విశ్వే సర్వే లోకాశ్చ స వికాసమసంకోచేన తద్విభూతీర్వదస్వ న ఇత్యుత్త రేణాన్వయః. 22

శ్లో॥ యస్మిన్ దశవిధః ప్రాణః సేంద్రియార్థేంద్రియ స్త్రి స్త్రివృత్ ।
త్వయేరితో యతో వర్ణాస్తద్విభూతీర్వదస్వ నః ॥23

టీ:- యస్మిన్నితి. ప్రాణాదయః పంచ నాగాదయః పంచేత్యేవమ్ దశవిధః. సేంద్రియార్థేంద్రియ ఇత్యత్ర ఇంద్రియ పునరుక్తి స్తద్దేవతా లక్షణార్థా. అర్థ శబ్దో వచనాదానాది విషయద్యోతకః అతః ఇంద్రియై స్సహితః సేంద్రియః అర్థైస్సహితస్సార్థః ఇంద్రియాధిదేవతా సహిత స్సేంద్రియ ఇతి సమాసః. సర్వోపబృంహితత్వాత్ ప్రాణస్య తత్సాహిత్యం ఏవం త్రివృత్ త్రివిధశ్చ ప్రాణో యస్మిన్నాస్తే పూర్వ తస్త్వయేరితాః ఉక్తాః బ్రాహ్మణాదాయో వర్ణా యతో యస్మాదుద్భూతాః తద్విభూతీస్తస్య విసర్గ శబ్దవాచ్యా బ్రహ్మాద్యావిభూతీః నోస్మాకం వదస్వ. 23

శ్లో॥ యత్ర పుత్రైశ్చ పౌత్రైశ్చ నప్తృభిః సహ గోత్రజైః ।
ప్రజా విచిత్రాకృతయ ఆసన్ యాభిరిదం తతమ్ ॥ 24

టీ:- యత్రేతి. యాభిః ప్రజాభిః. ఇదం విశ్వం. తతం వ్యాప్తం విచిత్రాః కృతయస్తాః ప్రజాః పుత్రాధిభిస్సహ యత్ర యస్మిన్. ఆసన్ తస్య విభోర్విభూతీరితి పూర్వేణాన్వయః స ఇతి పరేణ వా. 24

సంకోచములేకుండా వికాసమునొందిన రూపములతో (నిండైన రూపములతో) ఇమిడిఉన్నవి (నిలిచి ఉన్నవి). 22

విరాట్‌పురుషుని యందు త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఆఘ్రాణము అనెడి జ్ఞానేంద్రియములు, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు అనెడి కర్మేంద్రియములు నెలకొని యున్నవి. ఈ ఇంద్రియ విషయములైన శబ్దాదులు మఱియు ఇంద్రియాధిష్ఠాన దేవతలు ఈ విరాట్ పురుషుని యందేయున్నవి. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కృకర, కూర్మ, దేవదత్త, ధనంజయ ప్రాణములు, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులతో గూడిన ప్రాణశక్తులు ఈ విరాట్ పురుషుని యందే యున్నవి. ఇట్టి విరాట్ పురుషుని నీవు వర్ణించి చెప్పియుంటివి. ఇప్పుడు ఆయన విభూతులను (మహిమలను) మాకు చెప్పవలసినదిగా కోరుచున్నాను. 23

ఆ విరాట్‌పురుషుని యందే అనేక విధముల దేహములుగల ప్రాణులు తమ పుత్రులతో, పౌత్రులతో, మనుమలతో, మునిమనమలతో తమ వంశీయులతో ఉంటున్నారు. వీరిచే ఈ జగత్తు అంతయూ వ్యాపించియున్నది. 24

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ప్రజాపతీనాం స పతిశ్చక్లుపేకాన్ ప్రజాపతీన్ ।
సర్గాంశ్చైవానుసర్గాంశ్చ మనూన్ మన్వంతరాధిపాన్ ॥ 25

ప్రజాపతులకు కూడా ప్రభువగు ఆ విరాట్పురుషుడు ఏయే ప్రజాపతులను సృష్టించినాడు. సర్గములను, అటుతరవాత వచ్చిన సర్గములను మరియు మన్వతంరాధిపతులగు స్వాయంభువాది మనువులను సృష్టించుట మొదలగు చరిత్రములను వర్ణించుము. 25

టీ:- శ్లో. "ఏవమేతత్పురా పృష్టో మైత్రేయో భగవాన్ కిలే"తి పరీక్షిత్ప్ర-శ్నోత్తరతయా విదుర మైత్రేయసంవాదః ప్రస్తావితః, అతస్తానేవ విదురేణ కృతప్రశ్నానాహ-యావదధ్యాయ పరిసమాప్తి. ప్రజాపతీనామితి. సప్రజాపతిన్ కాన్. నవవిధాన్. సర్గాంశ్చ. కాననుసర్గాంస్తద్భే దాంశ్చ చిక్లిపే అకల్పయత్ తాంశ్చ వర్ణయతేతి వక్ష్యమాణేనా న్వయః25

.శ్లో॥ ఏతేషామపి వంశ్యాంశ్చ వంశానుచరితాని చ ।
ఉపర్యధశ్చ యే లోకా భూమేర్మిత్రాత్మజా౨సతే ।
తేషాం సంస్థాం ప్రమాణం చ భూర్లోకస్య చ వర్ణయ ॥ 26

ఓ మైత్రేయా! ఈ మనువుల వంశములను ఆ వంశపురాజుల చరితములను వర్ణించుము. భూమికి పైనఉన్న లోకములను క్రింద ఉన్న లోకములను వర్ణించుము. భూలోకముతో పాటు ఆ లోకముల స్థితిని, వాటి ప్రమాణమును విస్తారముగా వర్ణించుము. 26

టీ:- ఏతేషామిత్యాదిసార్ధ శ్లోకమేకం వాక్యం ఏతేషామితి. ప్రజాపతి మనుమన్వంతరాధిపానాముపాదానం తద్వంశాన్ తథా వంశానుచరితం చ. హే మిత్రాయా ఆత్మజ. సంస్థాం సన్నివేశం. 26

శ్లో॥ తిర్యఙ్మానుష్య దేవానాం సరీసృపపతత్త్రిణామ్ ।
వద నః సర్గ సంవ్యూహం గార్భస్వేదద్విజోద్భిదామ్ ॥ 27

తిర్యక్కులు (అనగా అడ్డంగా నుండే పశుపక్ష్యాదులు) మానవులు, దేవతలు; సరీసృపములు (అనగా ప్రాకేజీవులు) పక్షులు; గర్భము

టీ:- తిర్యగితి. సర్గాణాం సంవ్యూహం సంవిభాగం గార్భాండస్వేద జోద్భిజాం గర్భజాః. జరాయుజాః. అండేభ్యో జాతాః అండజాః ద్రవాత్ స్వేదాచ్చ ద్వాభ్యాం జాతాః స్వేదజాః. ఉద్భిజాశ్చ. 27

శ్లో॥ గుణావతారైర్విశ్వస్య సర్గ స్థిత్యప్యయాశ్రయమ్ ।
సృజతః శ్రీనివాసస్య వ్యాచక్ష్వోదారవిక్రమమ్ ॥28

టీ:- గుణేతి. గుణావతారైః బ్రహ్మ విష్ణు రుద్రరూపైః సర్గ స్థిత్యప్యయా నామాశ్రయం చ సృజతః కుర్వతః. 28

శ్లో॥ వర్ణాశ్రమ విభాగాంశ్చ రూపశీలస్వభావతః ।
ఋషీణాం జన్మ కర్మాది వేదస్య చ వికర్షణమ్ ॥ 29

టీ:- వర్ణేతి. రూపం లింగం. శీలమాచారః స్వభావః శమాదిః, తతః వికర్షణం విభాగమ్. 29

శ్లో॥ యజ్ఞస్య చ వితానాని యోగస్య చ పథః ప్రభో ।
నైష్కర్మ్యస్య చ సాంఖ్యస్య తంత్రం వా భగవత్స్మృతమ్ ॥30

నుండి పుట్టునవి; చెమటనుండి పుట్టే పేలు మొదలగునవి, గ్రుడ్డు నుండి పుట్టేవి, నేలను చీల్చుకుని పుట్టే మొక్కలు మొదలగు వాటి యొక్క సృష్టిని గురించి మాకు వర్ణించి చెప్పుము. 27

బ్రహ్మ, విష్ణువు, శివుడు ఈ మూడు గుణావతారములు. విష్ణువు సత్త్వగుణుడు. ఈ ముువ్వురి రూపములను దాల్చి శ్రీనివాసుడైన పరమాత్మ సృష్టి, స్థితి, లయములను జరుపుచున్నాడు. అట్టి పరమాత్ము డైన శ్రీనివాసుని లీలను వివరించి చెప్పుము. 28

రూపము, శీలము, స్వభావము అనువాటిని అనుసరించి వర్ణాశ్రమ విభాగములు ఏర్పడెను. మరియు మహర్షుల యొక్క పుట్టుక, ఆ మహర్షుల కర్మములు, అంతేగాక వేదవిభాగమును వర్ణించి చెప్పుము. 29

ఓ ప్రభూ! యజ్ఞము యొక్క విస్తారమును, కర్మయోగ విధానమును, నైష్కర్మ్యము అనబడే జ్ఞానయోగ విధానమును, ప్రకృతి పురుష వివేకమును తెలియజెప్పే సాంఖ్యయోగమును వర్ణించి చెప్పుము.

టీ:- యజ్ఞస్యేతి. వితానాని విస్తరాః ప్రభో ఇతి సంబోధనం యోస్య యమాదేః. భక్తియోగస్యచ నైష్కర్మ్యస్యచ జ్ఞానస్య తదుపాయస్య సాంఖ్యస్య చ పథో మార్గాన్. స్మృతం సృష్టం. తంత్రంవా తంత్రం చ. 30

సాక్షాత్ భగవంతునిచే సృష్టించబడిన నారద పాంచరాత్రము మొదలగు తంత్రములను వర్ణించి చెప్పుము. 30

శ్లో॥ పాఖండ పథవైషమ్యం ప్రతిలోమనివేశనమ్ ।
జీవాస్య గతయో యాశ్చ యావతీర్గుణకర్మజాః ॥31

టీ:- పాషండేతి. పాషండానాం పంథాః ప్రవృత్తిః తదేవ వైషమ్యం. తేపి ద్వివిధాః శివ పాషండాః విష్ణుపాశండాశ్చేతి. ప్రతిలోమజా అస్మిన్న విశంత ఇతి ప్రతిలోమనివేశనం. తేషానూచారమిత్యర్థః. జీవానాం తు గతయో యాయాస్సంతి. గుణకర్మజాస్తాస్తా యావతీర్యావత్సంఖ్యాతాః (31)

వేదప్రమాణమునకు విరుద్ధమైనది పాషండమతము. ఆ పాషండమత మార్గమును అవలంబించుటచే కలిగిన కల్లోలము, వివిధ జాతుల మధ్య కలిగే సంబంధముల వలన కలిగే (ప్రతిలోమం) పరిణామములను వర్ణించి చెప్పుము. జీవులు తమ గుణములు కర్మములననుసరించి ఎట్టి గతులను పొందుదురు? ఆ గతులెన్ని? వాటిని వివరించి చెప్పుము. 31

శ్లో॥ ధర్మార్థ కామ మోక్షాణాం నిమిత్తాన్యవిరోధతః ।
వార్తాయా దండనీతేశ్చ శ్రుతస్య చ విధిం పృథక్ ॥ 32

టీ:- ధర్మేతి. నిమిత్తాని ఉపాయాన్ అవిరోధతః పరస్పరావిరోధేన చ. 32

ధర్మార్థ కామ మోక్షాలను ఒకదానితో మరియొకటి విరోధము లేకుండా సాధించుకొను విధానమును తెలుపుము. కృషి, వాణిజ్యము, దండనీతి, వేదము అనువాటి విధివిధానములను కూడా వివరించి చెప్పుము. 32

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ శ్రాద్ధస్య చ విధిం బ్రహ్మన్ పితౄణాం సర్గమేవ చ ।
గ్రహ నక్షత్ర తారాణాం కాలావయవసంస్థితిమ్ ॥ 33

టీ:- శ్రాద్ధస్యేతి. గ్రహాదీనాం కాలచక్రే సంస్థితమ్. 33

ఓ మహాత్మా! శ్రాద్ధవిధిని, పితృదేవతల సృష్టిని వివరించుము. గ్రహములు, నక్షత్రములు, తారకలు మున్నగు వాటికి కాలచక్రములో గల స్థితిని (విధానమును) తెలియజెప్పుము. 33

శ్లో॥ దానస్య తపసో వాపి యచ్చేష్టాపూర్తయోః ఫలమ్ ।
ప్రవాసస్థస్య యో ధర్మో యశ్చ పుంస ఉతాపది ॥ 34

టీ:- దానస్యేతి. ప్రవాసస్థస్య పుంసో యో ధర్మః ఆపది సంప్రాప్తాయాం యోధర్మః. 34

దానము, తపస్సు, యజ్ఞాచరణము వలన లభించే "ఇష్ట" ఫలము, వాపీ కూప తటాకాదులు త్రవ్వించుట వలన వచ్చే ఫలము "పూర్తి". వీటిని వివరించుము. పరదేశములో నున్న వాడి ధర్మమేమిటి? వివరించి చెప్పగలరు. 34

శ్లో॥ యేన వా భగవాంస్తుష్యేద్ధర్మయోనిర్జనార్దనః ।
సంప్రసీదతి వా యేషామేతదాఖ్యాహి మేఽనఘ ॥35

టీ:- యేనేతి. యేనమార్గేణ సంతుష్యేత్. యేషాం యాదృశానాం. 35

ఓ పుణ్యాత్మా ! ధర్మమునకు మూలమైనవాడు శ్రీకృష్ణుడు. దుర్మార్గులైన జనులను శిక్షించుటచే జనార్దనుడైనాడు. అట్టి శ్రీకృష్ణుడు ఎట్టి సాధనలచేత సంతోషించును. ఆయన ఎవరికి ప్రసన్నుడగును? ఈ విషయములు తెలుపవలసినది. 35

శ్లో॥ అనువ్రతానాం శిష్యాణాం పుత్రాణాం చ ద్విజోత్తమ।
అనాపృష్టమపి బ్రూయుర్గురవో దీనవత్సలాః ॥ 36

ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! నిష్ఠగా సేవించే శిష్యులకు, పుత్రులకు దీనవత్సలులగు గురువులు, అడుగక పోయినా జ్ఞానమును, కర్తవ్యము-లను ఉపదేశింతురు. నా యోగ్యతను అనుసరించి, దీనవత్సలుడవై

టీ:- అనువ్రతానామితి. అనాపృష్టమపి అపృష్టమపి మద్యోగ్యం విచార్య వక్తవ్యమితి భావః. 36

జ్ఞానోపదేశము చేయమని విదురుడు మైత్రేయమహామునిని ప్రార్థించుచున్నాడు. 36

శ్లో॥ తత్త్వానాం భగవంస్తేషాం కతిధా సంప్రతిక్రమః ।
తత్రేమం క ఉపాసీరన్ క ఉ స్విదనుశేరతే ॥ 37

టీ:- తత్త్వానామితి తేషాం మహదాదీనాం తత్త్వానాం ప్రతిసంక్రమః ప్రళయః కతిధా తత్ర ప్రళయే.ఇమం పరమేశ్వరం. శయానం రాజానమివ చామరాదిగ్రాహిణః కే వా ఉపాసీరన్ సమీపస్థాః అభవన్ కే వా అనుశేరతే శయానమనుస్వపంతి. 37

ఓ పూజ్యుడా! ఆ మహదాదితత్త్వములకు ఎన్ని విధములగు ప్రళయములు కలుగును? ప్రళయకాలమున పడుకొనియున్న ఆ భగవానుని ఎవరు సేవింతురు? ఆయనలో ఎవరు లీనమగుదురు? ఈ విషయములను తెలియజెప్పగలరు. 37

శ్లో॥ పురుషస్య చ సంస్థానం స్వరూపం వా పరస్య చ ।
జ్ఞానం చ నైగమం యత్తద్గురుశిష్య ప్రయోజనమ్ ॥ 38

టీ:- పురుస్యేతి. పురుషస్య సంస్థానం జీవస్య తత్త్వం. పరమేశ్వరస్య స్వరూపం యేనాంశేన తయోరైక్యం తథా జ్ఞానం చ.. నైగమమౌపనిషదం జ్ఞానం చ ఏతత్సర్వం వద. 38

జీవుని తత్త్వమేమిటి? పరమేశ్వర స్వరూపమెట్లుండును? ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన జ్ఞానమేమిటి? గురు శిష్యుల ప్రయోజనమేమిటి? ఈ విషయములను వివరింపుము. 38



శ్లో॥ నిమిత్తాని చ తస్యేహ ప్రోక్తాన్యనఘ సూరిభిః ।
స్వతో జ్ఞానం కుతః పుంసాం భక్తిర్వైరాగ్యమేవ వా ॥ 39
(నాస్త్యేవ భగవన్నేషాం మహతాం సేవయా వినా)

టీ:- నిమిత్తానీతి. హే అనఘ సూరిభిః ప్రోక్తాని తస్యోపనిషద జ్ఞానస్య నిమిత్తాని సాధనాని చ వద బ్రూహి శ్రీగురుం వినా నైతద్భవతీత్యాహ -స్వత ఇతి. జ్ఞానాదిత్రికం గురుం వినా పుంసాం కుతః స్వతో భాతి స్వయమేవ న ప్రకాశత ఇతి భావః. 39

ఓ పాపరహితుడా! (పుణ్యాత్ముడా) ఈ ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన జ్ఞానమును పొందుటకు విద్వాంసులు ఏయే సాధనములు తెల్పియున్నారు? మానవులకు స్వతహాగా భక్తి, జ్ఞాన వైరాగ్యములు కులుగునా? సాధన లేకుండా, గురువు లేకుండా, గురువుయందు భక్తి లేకుండా భక్తి, జ్ఞాన, వైరాగ్యములు నిశ్చయముగా కలుగవని తాత్పర్యము. 39

శ్లో॥ ఏతాన్మే పృచ్ఛతః ప్రశ్నాన్ హరేః కర్మ వివిత్సయా ।
బ్రూహి మేఽజ్ఞస్య మిత్రత్వాదజయా నష్ట చక్షుషః ॥ 40

టీ:- ఏతానితి. శ్రీహరేర్లీలాకర్మ వేత్తుమిచ్ఛయా పృచ్ఛతో మమైతాన్ ప్రశ్నాన్ బ్రూహి కస్మాద్ధేతోరితి అజయా మాయయా అమృష్టం పరామృష్టం చక్షుః జ్ఞాన చక్షుర్యస్య తస్య అతఏవ అంధస్య మే మిత్రత్వాత్ ఏవమన్వయభేదాత్ మేతిశబ్దస్య న పౌనరుక్త్యం. 40

అనాదియగు అవిద్యచేత నా ఆలోచనాదృష్టి నశించినది. కనుక నేను గ్రుడ్డివాడను. అజ్ఞానిని. నీవు నాకు మిక్కిలి స్నేహితుడవు. నేను శ్రీహరి యొక్క లీలలను తెలియగోరుచున్నాను. నేనడిగిన ప్రశ్నలకు స్నేహభావముతో సమాధానము చెప్పుము. 40

శ్లో॥ సర్వే వేదాశ్చ యజ్ఞాశ్చ తపో దానాని చానఘ ।
జీవాభయప్రదానస్య న కుర్వీరన్ కలామపి ॥ 41

టీ:- సర్వఇతి. తత్త్వోపదేశేన జీవాభయ ప్రదానస్య. 41

ఓ పాపరహితుడా! సకలవేదములు, యజ్ఞములు, దానములు, తపస్సులు ఇవన్నియు మానవునకు జ్ఞానబోధచేత అభయదానము చేయుట అనే పుణ్యకార్యములో (పదహారవ వంతులో) ఒక్క వంతుకు కూడా సరిపోవు. 41

శ్రీశుక ఉవాచ

శ్లో॥ స ఇత్థమాపృష్టపురాణకల్పః
కురుప్రధానేన మునిప్రధానః ।
ప్రవృద్ధహర్షో భగవత్కథాయాం
సంచోదితస్తం ప్రహసన్నివాహ ॥ 42

టీ:- పురాణే కల్పతే ప్రకాశత ఇతి పురాణకల్పో బుభుత్సితోఽర్థః ఆపృష్టః పురాణకల్పోఽయం మునీనాం ప్రధానః. భగవత్కథాయాం తేన సంచోదితః అత ఏవ ప్రవృద్ధ హర్షస్సన్ ప్రహసన్నివ తం విదురమాహ. 42

శ్రీశుకుడు ఈ విధముగా పలికెను

ఈ విధముగా కురువంశశ్రేష్ఠుడగు విదురుడు మైత్రేయ మహర్షిని పురాణరహస్యమును గురించి ప్రశ్నించెను.ఆ మైత్రేయ మహర్షి పరమానందభరితుడై భగవద్గాథలను వర్ణించుటకు ప్రేరేపితుడై నవ్వుచు ఇట్లు పలికెను. 42

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
సప్తమోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఏడవ అధ్యాయము సమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

## అష్టమోఽధ్యాయః

శ్లో. అష్టమే సమభూద్బ్రహ్మా నాభేస్తు జలశాయినః ।
తమజానన్ జలే బిభ్యత్తపసా తోషయత్ప్రభుమ్ ॥

## 8వ అధ్యాయము

జలశాయి అయిన శ్రీమహావిష్ణునాభికమలము నుండి బ్రహ్మదేవుడు జన్మించెను. తన పుట్టుకకు కారణమయిన ఆ పురుషుని తెలుసుకొనజాలక నీటిలోనికి ప్రవేశించెను. వంద సంవత్సరములు తపస్సుచేసి ఆయనను దర్శించెను. ఈ విషయములు ఈ ఎనమిదవ అధ్యాయమునందు చెప్పబడినవి.

మైత్రేయ ఉవాచ

శ్లో॥ సత్సేవనీయో బత పూరువంశో
యల్లోకపాలో భగవత్ప్రధానః ।
బభూవిథేహాజితకీర్తిమాలాం
పదే పదే నూతనయస్యభీక్ష్ణమ్ ॥ 1

టీ:- శ్రోతారమభినందతి. మైత్రేయః సదితి.'లోకస్తు భువనే జనే' లోకావ పాలయతీతి లోకపాలః పూరువంశః సత్సేవనీయః బతహర్షే. సతాం సేవితుం యోగ్య ఇత్యర్థః కుతః భగవానేవ ప్రధానభూతో యస్య సత్వం యద్యస్మాదిహాస్మివ వంశేబభూవిధ జాతోఽసి అతోఽయం పూరువంశః సత్సేవనీయ ఇతి త్వద్భగవత్ప్ర ధానత్వే అయం హేతుః అజితకీర్తి మాలాం శ్రీహరిచరిత్ర పరంపరాం పదేపదే ప్రతిక్షణమభీక్ష్ణం పునఃపునర్నూతనయసి నవీకరోషి. 1

శ్రీమైత్రేయముని చెప్పుచున్నాడు.

ఓ విదురా! నీవు సత్పురుషులు సేవింపదగిన "పురు" వంశములో జన్మించినావు. లోకపాలకుడగు యమధర్మరాజువు నీవు. నీవు ప్రతిక్షణమును శ్రీహరి యొక్క కీర్తి సమూహమును నిత్య నూతనముగా చేయుచున్నావు. అనగా ప్రతిక్షణమును భగవానుని లీలలను నూత్న భావముతో కీర్తించుచున్నావని అర్థము. 1

శ్లో॥ సోऽహం నృణాం క్షుల్లసుఖాయ దుఃఖం
మహద్గతానాం విరమాయ తస్య ।
ప్రవర్తయే భాగవతం పురాణం
యదాహ సాక్షాద్భగవానృషిభ్యః ॥2

టీ:- స ఇతి. అల్పసుఖాయ క్షణిక సుఖాయ మహద్దుఃఖం ప్రాప్తానాం తస్య దుఃఖస్య విరమాయ ప్రవర్తయే ప్రారభే. 2

మానవులు అల్ప విషయసుఖమునకై మహాదుఃఖమును పొందుచున్నారు. నీ చేత ప్రేరేపింపబడినవాడనై మానవుల దుఃఖమును పోగొట్టుటకొరకై భాగవత పురాణము చెప్పెదను. దీనిని పూర్వము సంకర్షణ భగవానుడే సనత్కుమారాది ఋషులకు బోధించెను. 2

శ్లో॥ ఆసీనముర్వ్యాం భగవంతమాద్యం
సంకర్షణం దేవమకుంఠసత్త్వమ్ ।
వివిత్సవస్తత్త్వమతః పరస్య
కుమారముఖ్యా మునయోऽన్వపృచ్ఛన్ ॥ 3

టీ:- కోऽసౌ భగవాన్, కేభ్యశ్చ ఋషిభ్యఆహ, కథం చ త్వయా ప్రాప్తమిత్యపేక్షాయామాహ-సప్తభిః ఆసీనమితి. ఉర్వ్యాం పాతాళతలే ఇత్యర్థః. అకుంఠసత్త్వమప్రతిహత జ్ఞానం భగవంతం సంకర్షణం. అతః సంకర్షణాత్పరస్య శ్రీవాసుదేవస్య తత్త్వం వివిత్సవః. స్వరూప సంవేదనేచ్ఛవః కుమారముఖ్యాః సనత్కుమార ప్రభృతయః. 3

సంకర్షణభగవానుడు ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము మరియు వైరాగ్యము అనెడి ఆరు లక్షణములు కలవాడు. సర్వకారణుడు, అఖండజ్ఞాన స్వరూపుడు. ఈతడు పాతాళలోకములో ఉండగా సనత్కుమారుడు మొదలైన మునీశ్వరులు పరబ్రహ్మతత్త్వమును (వాసుదేవుని తత్త్వమును) తెలియగోరినవారై సంకర్షణ భగవానుని సమీపించి ఇట్లు ప్రశ్నించిరి. 3

శ్లో॥ స్వమేవ ధిష్ణ్యం బహు మానయంతం
యం వాసుదేవాభిధమామనంతి ।
ప్రత్యగ్ధృతాక్షాంబుజకోశమీష
దున్మీలయంతం విబుధోదయాయ ॥ 4

టీ:- సంకర్షణమేవ విశినష్టి–స్వమితి. ఆమనంతి యన్మహాంతో మనసా మననం కుర్వంతీత్యర్థః శ్రీవాసుదేవసంజ్ఞం పరమానంద స్వరూపం తత్ స్వమేవ ధిష్ణ్యం స్వీయమాశ్రయం స్వీయమాధారం జ్యోతిరిత్యర్థః. బహుమానయంతం ధ్యానపదే అనుభూయ సర్వోత్కర్షేణ పూజయంతం పునః ప్రత్యక్ ధృతమంతర్ముఖీకృతం నేత్రాంబుజ కోశం ముకుళం విబుధోదయాయ సనత్కుమారాదీనామభ్యుదయార్థం. కృపావలోకనేన కించిదున్మీలయంతం అన్వపృచ్ఛతి పూర్వేణ. 4

సర్వజగన్నివాసుడు, చైతన్యస్వరూపుడు అయి "వాసుదేవుడు" అని పిలువబడే పరతత్త్వమే సంకర్షణ దేవుడు. మహర్షులందరును ఈయననే "వాసుదేవుడు" అని గొప్పగా కీర్తింతురు. సంకర్షణ దేవుడు అంతర్ముఖుడై కన్నులు మూసుకుని "వాసుదేవుని" ధ్యానించుచుండెను. జ్ఞానులగు సనత్కుమారాదులు ప్రశ్నించగా వారిని అనుగ్రహించుటకై సంకర్షణదేవులు తన పద్మ నేత్రములను కొద్దిగా తెరచి చూచెను. 4

శ్లో॥ స్వర్ధున్యుదార్ద్రైః స్వజటాకలాపై
రుపస్పృశంతశ్చరణోపధానమ్ ।
పద్మం యదర్చంత్యహిరాజకన్యాః
సప్రేమ నానాబలిభిర్వరార్థాః ॥ 5

టీ:- మునీనాం విశేషణం సార్ధేన స్వరితి. నాగరాజకన్యాః వరార్థాః

నాగరాజకన్యలు తాము కోరినవరుని పొందగోరి, అనేకములగు బహుమానములను (ఉపచారములను) సమర్పించి ఆ సంకర్షణ దేవుని పాదపీఠమును పూజించుచున్నారు. సనత్కుమారాది మహర్షులు గంగాజలములో స్నానమాడి, తడిగానున్న జటా సమూహముతో ఆ సంకర్షణదేవుని పాదపీఠమును నమస్కరించుచున్నారు. 5

పతికామాస్సత్యః. నానా బలిభిర్నానావిధోపహారైః సప్రేమ ప్రేమ సహితం యథా భవతి తథా యత్సంకర్షణచరణోపధానం పద్మమర్చంతి చరణా ఉపధీయంతే తస్మిన్నితి చరణోపధానం పద్మమితి. తత్పద్మం స్వర్ధున్యుద కేనార్ద్రైస్స్వజటాకలా పైః ఉపస్పృశంతః. 5

శ్లో॥ ముహుర్గృణంతో వచసానురాగ
స్ఖలత్పదేనాస్య కృతాని తత్ జ్ఞాః।
కిరీట సాహస్రమణిప్రవేక
ప్రద్యోతితోద్దామ ఫణాసహస్రమ్ ॥ 6

టీ:- ముహురితి. కృతానురాగేణ స్ఖలంతి పదాని యస్మిన్ తేన వచసా అస్య సంకర్షణస్య కృతాని కర్మాణి గృణంతస్తాని జానంతీతి తత్ జ్ఞాః మునయోఽన్వ పృచ్ఛన్నితి గంగోదకార్ద్రైరిత్యనేన శ్రీభాగవతశ్రవణార్థం సత్యలోకాత్పాతాళేష్వవతరంతో నిరంతరం గంగాయా మధ్యత ఏవ అవతీర్ణా ఇతి భావః. సహస్రమేవ సాహస్రం. కిరీటానాం సాహస్రేయే మణిప్రవేకాః మణ్యుత్తమాః. తైః ప్రద్యోతితానాముద్దామానాం ధీరో దాత్తానాం. ఫణానాం సహస్రం యస్య తమన్వపృచ్ఛన్నితి పూర్వేణ. 6

సంకర్షణ భగవానుడే ఆదిశేషువు. ఈ ఆదిశేషువు యొక్క వేయి కిరీటములలోని శ్రేష్ఠమైన మణులు గొప్పగా ప్రకాశించుచున్నవి. సంకర్షణ భగవానునిపై ప్రేమచే సనత్కుమారాదుల మాటలు తడబడు చుండెను. సంకర్షణుని లీలలను తెలిసికొన్న మునులు సత్యలోకము నుండి పాతాళమునకు అవతరించిన గంగాజలము వంటి తడియైన కన్నులతో భాగవత శ్రవణార్థమై ఆయన లీలలను పలుమార్లు గానము చేయుచు ఇట్లు ప్రశ్నించిరి. 6

శ్లో॥ ప్రోక్తం కిలైతద్భగవత్తమేన
నివృత్తి ధర్మాభిరతాయ తేన ।
సనత్కుమారాయ స చాహ పృష్టః
సాంఖ్యాయనాయాంగ ధృతవ్రతాయ ॥ 7

టీ:- ప్రోక్తమితి. తేన సంకర్షణేన సనత్కుమారాయ ప్రోక్తమ్. సనత్కుమారః. 7

నివృత్తి ధర్మ పరాయణుడైన సనత్కుమారునకు సంకర్షణ భగవానుడు ఈ భాగవతమును ఉపదేశించెను. పిమ్మట సాంఖ్యాయన ఋషి కోరగా అతనికి సనత్కుమారుడు భాగవతమును ఉపదేశించెను. (7)

శ్లో॥ సాంఖ్యాయనః పారమహంస్య ముఖ్యో
వివక్షమాణో భగవద్విభూతీః ।
జగాద సోఽస్మద్గురవేఽన్వితాయ
పరాశరాయాథ బృహస్పతేశ్చ ॥ 8

టీ:- సాంఖ్యాయన ఇతి. పారమహంస్యే ధర్మే ముఖ్యః. వివక్షమాణ ఇత్యాత్మనేపదం. బ్రూఞాదేశస్య వచేరుభయపదిత్వాత్. అన్వితాయాఽనుగతాయ. 8

సాంఖ్యాయనఋషి పరమహంసలలో శ్రేష్ఠుడు, అతడు భగవంతుని మహిమలను చెప్పకోరిక (వెల్లడించే కోరిక)గలవాడాయెను. తనకు ప్రియశిష్యుడగు పరాశరునకు మరియు బృహస్పతికి ఈ భాగవతమును చెప్పెను. ఆ పరాశరుడే మైత్రేయుడైన నాకు గురువు. 8

శ్లో॥ ప్రోవాచ మహ్యం స దయాలురుక్తో
మునిః పులస్త్యేన పురాణమాద్యమ్ ।
సోఽహం త వై తత్కథయామి వత్స
శ్రద్ధాలవే నిత్యమనువ్రతాయ ॥ 9

టీ:- ప్రోవాచేతి. పులస్త్యేనోక్త దయాళుః స మునిత్యత్ర ఏవమే వ్యాఖ్యాయికా - పితరం రాక్షసభక్షితం శ్రుత్వా పరాశరో రాక్షససత్రే ప్రవృత్తః సవసిష్ఠవచనాత్ నివృత్తోఽభూత్తతః స్వసంతతి రక్షణాత్తుష్టేన పులస్త్యేన వరో దత్తః పురాణవక్తా భవిష్యసీతి. 9

పరమకరుణగలవాడైన పరాశరమహర్షి నాకు ఈ సనాతనమైన భాగవతమును చెప్పెను. పరాశరుడు తన తండ్రియగు "శక్తి"ని రాక్షసుడు తిన్నాడని తెలిసి సర్వరాక్షస వినాశమునకై సత్రమును (యాగము) తలపెట్టెను. పులస్త్యుడు వసిష్ఠమహర్షిని వెంటనిడుకుని యాగ సమాప్తికై ప్రయత్నించెను. వసిష్ఠుని ఉపదేశానుసారము పరాశరుడు సత్రమును చాలించెను. తన సంతతి రక్షింపబడినందుకు సంతోషించిన పులస్త్యుడు పరాశరునకు పురాణ వక్తవగుదువు గాక అని వరమిచ్చెను. పరాశరుని వలన గ్రహించిన భాగవతము నీకు (విదురునకు) చెప్పుచున్నాను. 9

శ్లో॥ ఉదాప్లుతం విశ్వమిదం యదాఽఽసీ
త్తన్నిద్రయాఽమీలితదృజ్ న్యమీలయత్ ।
అహీంద్రతల్పేఽధిశయాన ఏకః
కృతక్షణః స్వాత్మరతౌ నిరీహః ॥ 10

టీ:- తదేవం సంకర్షణాత్సంప్రదాయప్రవృత్తిం ప్రదర్శ్య విభూతి-కథనాయ పద్మోద్భవం వక్తుమాహ-ఉదాప్లుతమితి. యదేవం విశ్వముదాప్లుతం ఏకార్ణవోదకే నిమగ్నమాసీత్ తత్తదా శేషపర్యంకే శయానః నిద్రయాత్వమీలిత దృక్. అతిరోహిత చిచ్ఛక్తిరేవ మాయా వినోదం పరిత్యజ్య స్వాత్మరతౌ స్వస్వరూపానంద ఏవ కృతక్షణః కృతోత్సవః

ఈ జగత్తు ప్రళయసముద్ర (ఏకార్ణవ) జలమున మునిగియున్నప్పుడు, అద్వితీయుడగు శ్రీమన్నారాయణుడు శేషశయ్యపై పరుండియుండెను. అపుడాయన సృష్టివ్యాపారము నుండి తొలగి తన స్వరూపమగు ఆనందమును అనుభవించుచుండెను. నిష్క్రియుడై యుండి యోగనిద్రను ఆశ్రయించిన వాడై కన్నులను మూసికొనెను. 10

అత ఏవ నిరీహో నిష్క్రియస్సన్. ఏకః శ్రీనారాయణః నేత్రే న్యమీలయత్ నిమీలితవాన్. 10

శ్లో॥ సోఽంతః శరీరేఽర్పితభూతసూక్ష్మః
కాలాత్మికాం శక్తిముదీరయాణః ।
ఉవాస తస్మిన్ సలిలే పదే స్వే
యథానలో దారుషు రుద్ధవీర్యః ॥ 11

టీ:- స ఇతి. కాలాత్మికాం శక్తిం ప్రేరణం పునః సృష్ట్యవసరే ప్రబోధనార్థం స్వే పదేఽధిష్ఠానే. బహిర్వృత్త్యభావే దృష్టాంతః. యథాఽనలోదారుష్వితి. 11

ఆ నారాయణుడు తనలో సర్వజీవుల సూక్ష్మశరీరములను ఇముడ్చుకొన్నవాడై యుండెను. ఆయన తన స్థానమగు జలముల యందు నివసించియుండెను. కట్టెయందు అగ్ని ఎట్లు అంతర్హితమై యుండునో అట్లు నారాయణుడుండెను. సమయము వచ్చినంతనే సృష్ట్యాదియందు తన "కాలాత్మికశక్తి"ని ప్రేరేపించును. 11

శ్లో॥ చతుర్యుగానాం చ సహస్రమప్సు
స్వపన్ స్వయోగేరితయా స్వశక్త్యా ।
కాలాఖ్యయాసాదిత కర్మతంత్రో
లోకాన్ ప్రలీనాన్ దదృశే స్వదేహే ॥ 12

టీ:- చతుర్యుగాణామితి. స్వయా చిచ్ఛక్త్యా సహ వర్తమాన ఏవ యోగ నిద్రయా స్వపన్ పునః పూర్వమేవ ప్రబోధనార్థం నియుక్తయా స్వయా కాలాఖ్యయా చ శక్త్యా ఆసాదితం ప్రాపితం కర్మతంత్రం క్రియాకలాపో

శ్రీమన్నారాయనుడు తన చిచ్ఛక్తితో కూడినవాడై జలములందు వేయి మహాయుగములు నిద్రించెను. నిద్రించుటకు పూర్వమే ప్రబోధనార్థము (తిరిగి సృష్టి సమయము కాగానే నన్ను ప్రబోధించుమని) తనచే నియమింపబడిన తన"కాలశక్తి" ద్వారా ప్రేరేపించబడెను. దానితో తమ "కర్మప్రవృత్తి" ననుభవించుటకై తనలో ఇమిడియున్న "లోకములను" (జీవులను) శ్రీమన్నారాయణుడు చూచెను. 12

యస్య సః స్వదేహే ప్రలీనాన్ పర్యవసితాన్ దదృశే లోకానవ లోకితవా నిత్యర్థః. 12

శ్లో॥ తస్యార్థ సూక్ష్మాభినివిష్టదృష్టే
రంతర్గతోఽర్థో రజసా తనీయాన్ ।
గుణేన కాలానుగతేన విద్ధః
సూష్యం స్తదాఽభిద్యత నాభిదేశాత్ ॥ 13

టీ:- తస్యేతి. అర్థం లోకసృష్ట్యర్థం. సూక్ష్మాభినివిష్టా ఇదమేవ సృజ్యమిత్యతి నైపుణ్యాభినివిష్ట దృష్టిః పరిజ్ఞాన చక్షురస్య తస్య నారాయణస్య తదర్థసూక్ష్మాభినివిష్ట సృష్టేరితిపాఠే. తదర్థాపూర్వశ్లోక ప్రస్తుత లోకార్థా సూక్ష్మం బీజాంకురాణువదతి తనీయోఽతి సూక్ష్మార్థో ఽభిప్రాయః. కాలానుగతేనానుసారిణా రజసా రజోగుణేన విద్ధః క్షోభితస్సన్ సూష్యన్ ప్రసూష్యన్ సన్ అభిద్యత ఉద్భూతః .13

లోకసృష్టికై సర్వజీవుల సూక్ష్మతత్త్వములపై (లింగదేహముల పై) ఆ నారాయణుని దృష్టి ప్రసరించినది. ఆ నారాయణునిలో అప్పటికే బీజరూపములోనున్న ఆ సూక్ష్మతత్త్వముల వర్గము(లింగదేహముల వర్గము) కాలముచే వికసింపబడి"రజోగుణము" ద్వారా క్షోభింపజేయ బడినది. ఆ వర్గము సృష్టినిమిత్తమై శ్రీమన్నారాయణుని నాభిదేశము నుండి బయల్వెడలినది. 13

శ్లో॥ సపద్మకోశః సహసోదతిష్ఠ
త్కాలేన కర్మప్రతిబోధనేన।
స్వరోచిషా తత్సలిలం విశాలం
విద్యోతయన్నర్క ఇవాత్మయోనిః ॥ 14

జీవుల అదృష్టము(కర్మఫలములు) వెల్లడి అయ్యే కాలము సంప్రాప్తమయ్యెను. సూక్ష్మతత్త్వ సముదాయము(సూక్ష్మదేహ లేక లింగదేహముల సముదాయము) ఆ పరమాత్మ నుండి "పద్మకోశ" రూపములో ఒక్కసారిగా ప్రకటమయ్యెను. ఆ పద్మకోశము తన

టీ:- సఇతి. కర్మాణి జీవాదృష్టాని ప్రతిబోధయతీతి కర్మప్రతిబోధనః తేన కాలేన తనీయానర్థః పద్మకోశస్సన్నుదతిష్ఠత్ కిం కుర్వన్ విశాలం విపులం తత్సలిలం స్వరోచిషా స్వస్య భాసా విద్యోతయన్ సన్. స కిం విశిష్టః ఆత్మా శ్రీవిష్ణుర్యోనిర్యస్య సః ఏతదర్కస్యాప్యాత్మయోనిత్వం సమానం. (14)

శ్లో॥ తల్లోక పద్మం స ఉ ఏవ విష్ణుః
ప్రావీవిశత్సర్వగుణావభాసమ్।
తస్మిన్ స్వయం వేదమయో విధాతా
స్వయంభువం యం ప్రవదంతి సోఽభూత్ ॥ 15

టీ:- తదితి. సర్వాన్ గుణాన్ జీవోపభోగ్యానర్థానేవావభాస యతీతి తల్లోక పద్మం త్రిలోకాత్మకం పద్మం సఏవ విష్ణుః ప్రావీవిశత్ ప్రకర్షేణా సుప్తశక్తిరేవాంతర్యామితయా వివేశ అత్రావీవిశదితి దీర్ఘశ్ఛాందసః. ఉఇతి సంబోధనే. అత్రాపి సంధ్యభావ ఆర్షః. యస్మా ద్విష్ణోరేతత్పదం జాతం సఏవ విష్ణురితి. తస్మిన్ శ్రీవిష్ణునాధిష్ఠితే పద్మే స్వయమేవ యథా భవతి తథా అభినివిష్టా దృష్టిర్యస్యేతి తస్యాంతర్గత వేదమయః నత్వధ్యయనేన ప్రాప్తవేదః విధాతా బ్రహ్మాభూత్కోఽసౌ? అదృష్టపితృత్వే నయం స్వయం భువం ప్రవదంతి సఇతి. ప్రాక్కల్పాంతే శ్రీనారాయణేన సహ నిద్రయా ఏకీభూత ఆసీత్ తస్మింశ్చ ప్రబుద్ధే తస్మా న్నారాయణాదేవ

సూర్యకాంతి వంటి కాంతులతో ఆ విశాలమైన ప్రళయకాలీన జలరాశిని ప్రకాశింపజేసెను. "పద్మకోశ" ఉత్పత్తికి ఆ నారాయణుని సంకల్పమే కారణము. 14

ఓయి విదురా! ఆ పద్మములో మూడులోకములు ఇమిడి యున్నవి. సకలజీవులకు భోగ్యములైన పదార్థజాలమంతయు ఈ పద్మమునందున్నది. ఈ పద్మమునందు స్వయముగా వేదస్వరూపుడైన విష్ణుమూర్తి అంతర్యామిగా ప్రవేశించెను. అందుచేత అధ్యయనము చేయకున్నను బ్రహ్మ వేదమూర్తి. సాక్షాత్తుగా వేదమూర్తియగు బ్రహ్మ ఈ పద్మమునందు ప్రకటమయ్యెను. బాహ్యముగా శరీరగతమైన పితృత్వము కనబడకపోవుటచే పండితులు బ్రహ్మను "స్వయంభువుడు" అని కీర్తించుచున్నారు. నారాయణుడే పద్మముద్వారా ప్రవేశించినందున ఇది పాద్మకల్పము. పద్మము, నాళము, పద్మములో ఉన్నవాడు నారాయణుడే. 15

పాద్మకల్పే పద్మద్వారేణాభి వ్యక్తిం ప్రాప్త ఇత్యర్థః. 15

శ్లో॥ తస్యాం స చాంభోరుహకర్ణికాయా
మవస్థితో లోకమపశ్యమానః ।
పరిక్రమన్ వ్యోమ్నివివృత్త నేత్ర
శ్చత్వారి లేభేఽనుదిశం ముఖాని ॥16

టీ:- స చ తస్మిన్ కల్పే చతుర్ముఖోఽభూదిత్యాహ - తస్యామితి. పరిక్రమంస్తత్రస్థ ఏవ గ్రీవాం చాలయన్ లోకనిరీక్షణార్థం వివృత్తే విచలతే నేత్రే యస్య సః. 16

ఆ పద్మము యొక్క కర్ణిక (దుద్దు) యందున్న బ్రహ్మకు ప్రపంచము కనబడలేదు. అప్పుడాయన కన్నులు తెరచినవాడై, మెడను త్రిప్పుతూ నాలుగు దిక్కులను చూచెను. అందుకు తగినట్లుగా ఆయనకు నాలుగు ముఖములు కలిగెను. 16

శ్లో॥ తస్మాద్యుగాంత శ్వసనావఘూర్ణ
మహోర్మి చక్రాత్సలిలాద్విరూఢమ్ ।
అప్యాశ్రితః కంజములోకతత్త్వం
నాత్మానమద్ధాఽవిదదాదిదేవః ॥ 17

టీ:- తస్య శ్రీనారాయణోపాసనయైవ ఆవిర్భూతజ్ఞాన క్రియాశక్తేర్లోక కర్తృత్వం న స్వతఇతి వక్తుం ప్రథమం తస్య విమోహమాహ- తస్మాదితి. యుగాంతశ్వసనః ప్రళయకాలవాయుః తేన అవఘూర్ణం తత్ర

శ్రీనారాయణోపాసన వలననే లోకసృష్టికి అవసరమైన శక్తి లభించినదనియు,అది తన స్వశక్తి కాదనియు తెలిసికొనుటకు ముందు బ్రహ్మకు కలిగిన మోహమును ఇచట తెల్పడమైనది. ప్రళయకాల-వాయువుల తాకిడికి ఆ జలరాశియందు గొప్ప కెరటములు పుట్టు చుండెను. ఆ కెరటముల మధ్యన ప్రకటమైన పద్మముపైన ఆదిదేవుడగు బ్రహ్మ అధిష్ఠించియుండెను. కాని ఆయనకు తన తత్త్వము గాని, పద్మము రూపములో ప్రకటమైన లోకతత్త్వము గురించి ఏమీ తెలియ కుండెను. 17

ప్రకంపితం తద్వశాదేవ సర్వత ఉద్భూతం మహోర్మిచక్రం యస్మిన్. తస్మాత్సలిలాద్విరూఢ ముద్గతం కంజం పద్మమాశ్రితోఽపి సాకల్యేన తత్కంజం లోకతత్త్వమాత్మానం చ అద్ధానావిదత్ సాక్షాన్న జ్ఞాతవాన్ ఉ ఇతి విస్మయే. 17

శ్లో॥ క ఏష యోఽసావహమబ్జపృష్ఠ
ఏతత్కుతోఽవాబ్జ మనన్యదప్సు ।
అస్తి హ్యధస్తాదిహ కించ నైత
దధిష్ఠితం యత్ర సతా ను భావ్యమ్ ॥18

టీ:- అవిదుష స్తస్య వితర్కమాహ-క ఇతి. యోఽసావహమబ్జ పృష్ఠే ఏష కః. అప్సు అనన్యదేకమేవై తదబ్జం కుతో వా జాతం యత్రైతదధిష్ఠితం తేనాధస్తాత్సతా వర్తమానేన సునిశ్చితం భావ్యం. అత ఇహ కించ-నాధిష్ఠానమస్తి స ఇత్థముదీక్ష్యేత్యుత్తరేణాన్వయః. తథాచ శ్రుతిః "సోఽపశ్యత్పుష్కరపర్ణం తిష్ఠత్ సోఽమన్యత అస్తి చైతత్ యస్మిన్నిద మధితిష్ఠతీతి". 18

"ఈ కమలకర్ణికపై కూర్చుండి యున్న నేనెవడను? ఈ కమలమునకు ఏదో ఆధారము ఉండవలెను కదా! అది ఏది? ఎట్టి ఆధారము లేకుండ జలములో ఎచట నుండి ఉత్పన్నమైనది?" అని బ్రహ్మ తలంచెను. 18

శ్లో॥ స ఇత్థముద్వీక్ష్య తదబ్జనాల నాడీభిరంతర్జలమావివేశ ।
నార్వాగ్గతస్తత్ఖరనాల నాభిం సవై విచిన్వంస్తదవిందతాజః॥19

బ్రహ్మదేవుడు బహిర్ముఖవృత్తుడై చాలా కాలము ఆలోచించినను సమాధానము తెలిసికొనలేకపోయెను. అప్పుడు ఆ పద్మము యొక్క

టీ:- తస్య చ బహిర్ముఖవృత్త్యా మహతాపి కాలేన తదప్రాప్తిమాహ - ద్వాభ్యాం. స ఇతి. తస్యాబ్జస్య యన్నాళం తస్య నాడీభిరంతశ్ఛిద్రైః అధస్తాద్గతోఽజశ్చతుర్ముఖః తస్య ఖరస్య కంజస్య పద్మస్య యన్నాళం కస్య నాభిమధిష్ఠానం విచిన్వన్నపి తత్తదా నావిందత న జ్ఞాతవాన్. 19

నాళములోని రంధ్రము ద్వారా క్రిందికి వెళ్ళెను. అక్కడ వెతుకుతూ ఆ నాళమునకు ఆధారమగు నాభికి దగ్గరగా చేరిననూ ఆయన దానిని గురించి ఏమియు తెలుసుకొనలేక పోయెను. 19

శ్లో॥ తమస్యపారే విదురాత్మసర్గం
విచిన్వతోఽభూత్సు మహాంస్త్రిణేమిః ।
యో దేహభాజాం భయమీరయాణః
పరిక్షిణోత్యాయురజస్య హేతిః ॥ 20

ఓ విదురా!అంతులేని ఆ చీకటిలో బ్రహ్మ తను పుట్టిన స్థానమును వెదుకుచుండగా చాలాకాలము గడిచిపోయెను. భూత, భవిష్యత్, వర్తమానములనే మూడు రూపములుగల కాలము భగవానుని ఆయుధము. ఇది ప్రాణులకు భయమును కలుగజేయుచు వారి ఆయువును హరించుచుండెను. 20

టీ:- తమస్యేతి. తమసఇతి షష్ఠ్యర్థే. తమస్యేతి. ప్రయోగోఽయ మార్షః. హే విదుర. జలాంతర్గతాంధ కారస్య పారే. ఆత్మనస్సర్గం స్వ కారణం విచిన్వతోఽజస్య సమహాన్ త్రినేమిః కాలోఽభూత్ భూతా ద్యవస్థాత్రయాత్మకత్వాత్ త్రినేమిరితి కాలవాచాజస్య తిలరాశ్యంతర్గతస్య తస్యకాలబహుత్వే సత్యపి తమసః పారం స్వకారణం చ న జ్ఞాతవానితి భావః. కీదృశస్సకాల ఇతి. అజస్య శ్రీహరేర్హేతిస్సుదర్శనాఖ్యం శస్త్రం తద్రూపోయః కాలదేహభాజాం నరాణాం భయమీరయానః ఉత్కర్ష యన్నుత్పాదయన్నితి వా. తేషాం ఆయుః పరిక్షిణోతి. సకాల ఇతి. ఏతేన తత్రాజస్య సంవత్సర శతమతిక్రాంతమ భవదిత్యుక్తం భవతి. 20

శ్లో॥ తతో నివృత్తో౽ప్రతి లబ్ధ కామః
స్వధిష్ణ్యమాసాద్య పునః స దేవః ।
శనైర్జిత శ్వాస నివృత్తచిత్తో
న్యషీదదారూఢ సమాధియోగః ॥ 21

టీ:- అంతర్ముఖ తయా తు భగవంతం దృష్టవానిత్యాహ - ద్వాభ్యాం తత ఇతి. స దేవః న ప్రతిలబ్ధః కామో మనోరథో యేన తథా విధస్సన్ తత స్తస్మాదన్వేషణాన్నివృత్య స్వధిష్ణ్యం పద్మం పునరాసాద్య శనైర్జితేన శ్వాసేన నివృత్తం సంయతం తచ్చిత్తం యస్య సః. అత ఏవారూఢ ఆశ్రితస్సమాధి యోగో యేన తథా భూతస్సన్ న్యషీదత్ ఉపవివేశ. 21

ఆ బ్రహ్మ కోరిక తీరలేదు. ఆయన తన ప్రయత్నము నుండి విరమించుకొని మరల తన స్థానమగు పద్మమును చేరుకొనెను. ఆ పద్మము నందు కూర్చొని అంతర్ముఖవృత్తి ద్వారా మెల్లగా శ్వాసను జయించి, మనస్సును జయించినవాడై సమాధి స్థితి యందు కూర్చుండెను. 21

శ్లో॥ కాలేన సో౽జః పురుషాయుషా౽భి
ప్రవృత్తయోగేన విరూఢ బోధః ।
స్వయం తదంతర్హృదయే౽వ భాత
మపశ్యతాపశ్యత యన్న పూర్వమ్ ॥22

టీ:- కాలేనేతి. స చతుర్ముఖః. పురుషాయుషా సంవత్సరశతేన. కాలేనాభి ప్రవృత్తః సునిష్పన్నో యోగస్తేన విరూఢబోధః విశేషత స్సముత్పన్న జ్ఞాన స్సన్ యత్పూర్వం విచిన్వన్నపి నాపశ్యత్ తత్స్వయమేవాంతర్హృదయే అవభాతమపశ్యత్. 22

బ్రహ్మదేవుడు మనుష్యుని పూర్ణాయుర్దాయమగు వంద సంవత్సరముల కాలము సమాధియందుండి తపస్సు చేసి విశేష జ్ఞానమును పొందెను. తాను పూర్వము అన్వేషించిననూ తెలియని కారణము తన హృదయములో ప్రకాశిస్తూ తనంత తానుగా సాక్షాత్కరించెను. (భగవంతుడు తన హృదయమున తోచెను). 22

శ్లో॥ మృణాల గౌరాయత శేషభోగ
పర్యంక ఏకం పురుషం శయానమ్ ।
ఫణాతపత్రాయుత మూర్ధరత్న
ద్యుభిర్హతధ్వాంత యుగాంత తోయే ॥ 23

టీ:- యదపశ్యత్తద్వర్ణయతి నవభిః - మృణాళేతి. మృణాళాది నవ స్వప్య పశ్యతే త్యస్యైవానుషంగః. ఫణాత పత్త్రైరాయుతా స్సర్పయుక్తా యే మూర్ధానస్తేషాం రత్నాని కిరీటస్థాని తేషాం ద్యుభిః ప్రభాభిః హతాంధకారే యుగాంతతోయే ప్రళయ ప్రవృత్త జల మధ్యే ఏతత్పర్యంక ఇత్యస్య విశేషణం వా మృణాళవద్గౌరశ్చాసావాయతశ్చ యశ్శేషస్య భోగో దేహః సఏవ పర్యంకస్తస్మిన్ స్థితం. 23

ఆదిశేషుని వేయిపడగలు గొడుగువలెనుండెను. ఆ పడగలపైన ఉండిన మణిరత్నములు తమ కాంతులచే ప్రళయకాల జలమునందలి చీకట్లను పారద్రోలుచున్నవి. తామర తూడు వలె నున్న తెల్లని విశాల మైన ఆదిశేషునిపై పరుండియున్న భగవానుని ఆ బ్రహ్మదేవుడు కనుగొనెను. 23

శ్లో॥ ప్రేక్షాం క్షిపంతం హరితోపలాద్రేః
సంధ్యాభ్ర నీవేరురురుక్మమూర్ధ్నః ।
రత్నోదధారోషధి సౌమనస్యవన
స్రజో వేణు భుజాంఘ్రిపాంఘ్రేః ॥ 24

టీ:- కథం భూతం పురుషమిత్యాహ - ప్రేక్షామితి. హరితోపలాద్రేః మరకతశిలామయపర్వతస్య ప్రేక్షాం శోభాం క్షపంతం స్వలావణ్యాతి

ఈ శ్లోకమున శేషశాయి ఎట్లుండునో వర్ణింపబడుచున్నది. ఆ పురుషోత్తముని దేహము "మరకత మాణిక్య పర్వతుని" శోభను తిరస్కరించుచున్నది. ఆ పర్వతునికి వెదుళ్ళే భుజములు, వృక్షములే పాదములు. ఆ పర్వతమునకు సంధ్యాకాల మేఘములే కట్టువస్త్రములు. ఆ వస్త్రములను శేషశాయి పురుషోత్తముని పీతవస్త్రము తలదన్ను చున్నది. ఆ పర్వతరాజుకు బంగారు శిఖరములే శోభనిచ్చుచుండగా శేషశాయి కిరీటశోభ అంతకుమిన్నయగు చున్నది. ఆ పర్వతరాజుకు

శయేనైవ తిరస్కృతవంతం తర్హి కాం? కేనేతి చేత్. సంధ్యాభ్రః నీవీ పరిధానం యస్య తస్య శోభాం పీతాంబరేణ క్షిపంతం. ఉరురక్మ మూర్ధ్నః. అనేక స్వర్ణశిఖరస్య తస్య శోభాం. స్వకిరీటైః క్షిపంతం రత్నాని చ. ఉదధారామేఘాశ్చ తదుపరిస్థ జలాశయాశ్చ వా. ఓషధయః. ఔషధరూపాః. ఉద్భిజ్జ విశేషాశ్చ సస్య విశేషాశ్చ వా. సౌమనస్యాని పుష్ప సమూహాశ్చ సుమనస ఏవ వా. తాన్యేష వనస్రగ్వన మాలా యస్య తస్య శోభాం స్వీయరత్న ముక్తాదామతులసీ పుష్ప దామవనమాలాదిభిః క్షిపంతం. వేణువో భుజా యస్య. అంఘ్రిపా ఏవాంఘ్రయో యస్య. తస్య శోభాంభుజైరంఘ్రిభిశ్చ క్షిపంతం క్షిపంత మివ. యది తస్మిన్ పర్వతే రత్నాదయో మాలాఇవ వేణవశ్చ భుజాఇవ వృక్షాశ్చ పాదా ఇవ. తర్హ్యేవకిమితి. 24

శ్లో॥ ఆయామతో విస్తరతః స్వమాన
దేహేన లోకత్రయసంగ్రహేణ ।
విచిత్ర దివ్యాభరణాంశుకానాం
కృత శ్రియోపాశ్రిత వేషదేహమ్ ॥ 25

టీ:- కించ. ఆయామత ఇతి. ఆయామతో దైర్ఘ్యేణ విస్తరేణ చ అమానో నిరుపమాన దేహస్తేన యద్వా ఆయామ విస్తారాభ్యామ పరిచ్ఛిన్నః

రత్నములు, నీటిధారలు, ఓషధులు పుష్పములు మాలగా ఏర్పడగా నారాయణునికి రత్నములు, ముత్యములు, తులసీ పుష్పములతో కూడిన వలమాల ఆ శోభను తిరస్కరించుచున్నది. 24

ఆ పురుషుని దేహము పొడవు వెడల్పుల చేత, వైశాల్యము చేత తనకు తానే సాటియై యుండెను. నిరుపమానమై యుండెను. ముల్లోకములను తనలో ఇముడ్చుకొని యుండెను. నానా విధములగు ఆభూషణములకు వస్త్రములకు శోభను కలిగించునదియై యుండెను. పీతాంబరాది వేషభూషణములచేత అలంకరింపబడి యుండెను. అట్టి దేహముగల పరమపురుషుని బ్రహ్మ చూచెను. 25

తేన ఆయామతో విస్తరతస్స్వమాన దేహేనేతి పాఠే మీయతేఽనేనేతి మానముపమా. స్వసదృశ శోభన దేహేన. యద్వా మానం ప్రమాణం స్వానురూప ప్రమాణేన దేహేన అత ఏవ లోక త్రయం సంగృహ్యతే ఽస్మిన్ తేన. విచిత్రాణి నానా విధాని దివ్యాన్యపూర్వాణ్యంశుకాన్యాభరణాని చ తేషాం కృతాశ్రీ శ్శోభా యేనతేన దేహేన. విశిష్టం. ఏవం స్వత ఏవాతి రమ్యత్వేఽపి. ఉపాశ్రితవేషః స్వీకృతాలంకారో దేహో యస్య. తమపశ్యత్. యద్వా కేన ప్రేక్షాంక్షిపంతమిత్యపేక్షాయాం ఏవం భూతేన దేహేనేతి సంబంధః. 25

శ్లో॥ పుంసాం స్వకామాయ వివిక్త మార్గై
రభ్యర్చతాం కామదుఘాంఘ్రిపద్మమ్ ।
ప్రదర్శయంతం కృపయా నఖేందు
మయూఖ భిన్నాంగులి చారుపత్రమ్ ॥ 26

టీ:- పుంసామితి. స్వకామాయ స్వాభిలషితఫలాయ వివిక్తై శ్శుద్ధైర్వేదోక్త మార్గైః అభ్యర్చతామారాధయతాం పుంసాం స్వనఖా ఏవేందవః తేషాం మయూఖాః రుచయః తైర్భిన్నా మిశ్రా అంగుళయఏవ చారూణి పత్రాణి యస్య తత్కామదుఘాంఘ్రి పద్మమిష్టప్రదం స్వచరణారవిందం కృపయా ప్రదర్శయంతం కించిదున్నమయ్య సమర్పయంతం. 26

తాము కోరిన ఫలములను అందజేయుటకు వేదమునందు నిర్దేశింపబడిన ఉపాయములచేత ప్రయత్నించువారికి ఆ భగవానుని పాదము కల్పతరువై యున్నది. పద్మము వంటి ఆ పాదమునకు చంద్ర వంకల వంటి గోళ్ళకాంతులతో వెలుగొందే వ్రేళ్ళు పద్మపత్రములవలె నున్నవి. అట్టి తన పాదపద్మమును భగవంతుడు కృపతో బ్రహ్మకు చూపెను. 26

శ్లో॥ ముఖేన లోకార్తిహర స్మితేన
పరిస్ఫురత్కుండలమండితేన ।
శోణాయితేనాధరబింబభాసా
ప్రత్యర్హయంతం సునసేన సుభ్ర్వా ॥ 27

టీ:- ముఖేనేతి. లోకార్తిహరం స్మితం యస్మిన్ తేన పరిస్ఫురద్భ్యాం కుండలాభ్యాం మండితేన అలంకృతేన అధరబింబదీప్త్యా శోణాయితేన శోణవదాచరితేన సునసేన శోభన నాసా యుక్తేన సుభ్ర్వా శోభనయా భ్రువా యుక్తేన ముఖేన ప్రత్యర్హయంతం పూజాకాన్ ప్రతి పూజయంతం సంమానయంతం. 27

ఆయన చిరునవ్వు ప్రజల దుఃఖమును పోగొట్టును. ఆయన ముఖము అందమైన ముక్కుతో, చక్కని కనుబొమ్మలతో ఇటు నటు కదులుతూ ప్రకాశించే కుండలములతో నలరారుచుండెను. దొండ-పండు వంటి క్రింది పెదవి గలిగి యుండెను. ఇట్టి సుందరమైన ముఖముతో తనను ఉపాసించుచున్నవారిని అనుగ్రహించుచున్నాడు. (27)

శ్లో॥ కదంబ కింజల్క పిశంగ వాససా
స్వలంకృతం మేఖలయా నితంబే ।
హారేణ చానంతధనేనవత్స
శ్రీవత్స వక్షఃస్థల వల్లభేన ॥ 28

టీ:- కదంబేతి. హే వత్స కదంబ కింజల్క పిశంగం యద్వా సస్తేన మేఖలయా చ స్వలం కృతం అనంత ధనేన అనర్ఘ్యేణ అతఏవ శ్రీవత్స యుక్తం యద్వ శ్రీస్థలం తద్వల్లభేనార్ఘేణ హారేణ వక్షసి స్వలంకృతం. (28)

ఓ వత్సా! ఆ పురుషోత్తముని నడుమున గల వస్త్రము కడిమి పూల పుప్పొడి వలె పసుపు వన్నెతో శోభిల్లుచుండెను. మొలనూలుతో అలంకరింపబడి యుండెను. ఆయన వక్షఃస్థలము"శ్రీవత్సము" అని పిలువబడే మచ్చతోను అమూల్యమైన హారములతోను శోభిల్లు చుండెను. 28

శ్లో॥ పరార్థ్య కేయూర మణిప్రవేక
పర్యస్త దోర్దండ సహస్ర శాఖమ్ ।
అవ్యక్తమూలం భువనాంఘ్రిపేంద్ర
మహీంద్ర భోగై రభివీతవల్కమ్ ॥ 29

టీ:- మహాచందన వృక్షరూపేణ నిరూపయితుం తం విశినష్టి - పరార్థ్యేతి. పరార్థ్యాని శ్రేష్ఠాని కేయూరాణ్యంగదాని మణిప్రవేకా మణ్యుత్తమాశ్చ తైః పర్యస్తా వ్యాప్తా దోర్దండా ఏవ సహస్రమనంతా శ్శాఖా యస్య తం చందనవృక్షోఽపి కేయూరాది తుల్యైః ఫలపుష్పాదిభి ర్వ్యాప్త శాఖో భవతి. అవ్యక్తం ప్రధానం. యద్వా బ్రహ్మమూల మధో భాగం యస్య బ్రహ్మాదివ్యక్తి రూపత్వాత్ బ్రహ్మానా మూలమితి వృక్షస్యాపి మూలమవ్యక్తమితి ప్రసిద్ధం. భువనాత్మకం అంఘ్రిపేంద్రం అహీంద్ర స్యానంతస్య భోగైః ఫణైః దేహావయవైర్వా అభివీతాస్సంవేష్టితాః స్ఫృష్టావల్కాః కంథా యస్యతం. శ్రు."వనస్పతే శతవల్శం విరోహే"తి శ్రుతేః. శ్రు."కాండేభ్య స్స్వాహా వల్కేభ్యస్స్వాహాపుష్పేభ్యస్స్వాహే"తి చ. సోఽపి సర్పైర్వేష్టితో భవతి. 29

జగత్కారణుడగు ఆ పురుషోత్తముడు గొప్ప"చందనవృక్షము" వలె విరాజిల్లుచున్నాడు. జగద్రూపముగా ప్రకటమయిన ఆయన జగత్తు అనే వృక్షాకారముగా వెలుగొందుచున్నాడు. ఆ వృక్షములో పురుషోత్తముని భుజ దండములే అనంతములగు శాఖలు. భుజములందు ప్రకాశించే కేయూరములు (అంగదములు), మరియు మణులే ఆ వృక్షము యొక్క పూలు, పండ్లు. అవ్యక్తము అనగా కనబడనివి. ఆ పురుషోత్తముని ప్రపంచ రచనా సంవిధానమునకు మూలము (వేరు) కనబడకుండుటచే అది అవ్యక్తము. ఆ పురుషోత్తముని భుజస్కందములను ఆదిశేషుని పడగలు చుట్టుచున్నవి. ఈ చందనవృక్షమును కూడా పాములు చుట్టివేయు చున్నవి. ఈ విధముగా ఆ పరమపురుషుని అంగములను జగద్రూప చందన వృక్షభాగములతో పోల్చడమైనది. 29

శ్లో॥ చరాచరౌ కో భగవన్మహీధ్ర
మహీంద్ర బంధుం సలిలోప గూఢమ్ ।
కిరీట సాహస్ర హిరణ్యశృంగ
మావిర్భవత్కౌస్తుభరత్నగర్భమ్ ॥ 30

టీ:- ప్రేక్షాం క్షిపంతమిత్యత్రైవ పర్వతరూపేణ నిరూపితమపి విశేషణాంతరైః పునర్నిరూపయతి – చరాచరేతి. చరాచరాణాం ఓకః స్థానం పర్వతోఽపి తథా అహీంద్రస్య శేషస్య బంధుస్తం. సోఽప్యహీంద్రాణాం బంధుః సలిలోపగూఢం ప్రళయజలావృతం పర్వతో మైనాకాదిశ్చ కిరీట సాహస్రమేవ హిరణ్యాత్మకాని శృంగాణి యస్య తం మేర్వాదిర్హిరణ్య శృంగవాన్ ఆవిర్భవత్ స్పష్టం దృశ్యమానం కౌస్తుభ రత్నం గర్భేమూర్తి మధ్యే యస్య తం తథా పర్వతోదరే క్వచిద్రత్న మావిర్భవతీతి ప్రసిద్ధిః. 30

ఈ శ్లోకమున భగవంతుని పర్వతరూపమున వర్ణించడమైనది. పర్వతము చరాచర ప్రాణులకు ఆశ్రయస్థానము. విరాట్పురుషుడు సమస్త జీవకోటికి ఆశ్రయస్థానము. "అహి"యనగా పాము. సర్ప నివాసమగుటచే పర్వతమునకు "అహిబంధువు"అనిపేరు. భగవానుడు నాగరాజయిన అనంతునకు బంధువు. శేషశాయి అగుట వలన "అహి బంధువు" అగుచున్నాడు. మైనాకాది పర్వత రాజములు సముద్ర మధ్యమున నిమగ్నమై యుండును. భగవానుడు ప్రళయ సముద్ర జలముచే చుట్టబడి యున్నాడు. ప్రధానములైన పర్వతశిఖరములు బంగారు కాంతులు వెదజల్లును. పర్వతములలో రత్నములుండునని ప్రసిద్ధి. పురుషోత్తముని వక్షఃస్థలము నందు "కౌస్తుభమణి" ప్రకాశించును. 30

శ్లో॥ నివీతమామ్నాయ మధువ్రత శ్రియా
స్వకీర్తిమయ్యా వనమాలయా హరిమ్।
సూర్యేందు వాయ్వగ్న్య గమం త్రిధామభిః
పరిక్రమత్ప్రాథ నికైర్దురాసదమ్ ॥ 31

ఆ దేవదేవుని కంఠదేశము కీర్తిమయమైన వనమాలచే శోభిల్లుతూ యున్నది. వేదములనెడు తుమ్మెదలు ఆ వనమాల చుట్టూ తిరుగుతూ ఆయన కీర్తిని గానము చేయుచున్నవి. సూర్యుడు, చంద్రుడు, అగ్ని మున్నగువారు శ్రీహరియొక్క ప్రకాశము ముందు వెలవెల పోవుచున్నారు. తమ తమ కార్యములందు నిమగ్నులై ఆ దేవదేవుని

టీ:- నివీతమితి. ఆమ్నాయా వేదాః తఏవ మధువ్రతాస్తైః శ్రీర్యస్యాః తయా. కంఠలంబిన్యా స్వకీర్తిస్వరూపయా వనమాలయా నివీతం వ్యాప్తం. కంఠలంబినీ యా కాచిత్సా వనమాలేతి. సూర్యాదిభిరగమం అగమ్యం. స్వవ్యాపారైరాకలయితు మశక్యమిత్యర్థః. త్రిధామభిః భూతాది త్రిష్వపి కాలేషు. ధామ స్ఫూర్తిర్యేషాంతైః రక్షణార్థం పరిక్రమద్భిః ప్రాథనికైః ప్రథనం సంగ్రామః తత్ప్రయోజనై స్సుదర్శనాదిభిర్హ్వై తు భూతైర్దురాసదం దుష్ప్రాపం. ఏవం భూతం పురుషం హరిమపశ్యదితి. పర్వతాది రూపం పశ్యన్నసౌ శ్రీహరిరితి జ్ఞాతవానిత్యర్థః. 31

శ్లో॥ తర్హ్యేవ తన్నాభి సరస్సరోజ
మాత్మానమంభ శ్శ్వసనం వియచ్చ ।
దదర్శ దేవో జగతో విధాతా
నాతః పరంలోక విసర్గ దృష్టిః ॥ 32

టీ:- తర్హీతి. లోక విసర్గదృష్టిః స దేవో జగద్విధాతా యదైవ హరి మపశ్యత్ తర్హ్యేవ తదైవ తస్య హరేర్నాభిసరసి సరోజమాత్మానం అంభః ప్రళయ జలం శ్వసనం ప్రళయకాల వాయుం వియదాకాశం చ దదర్శ అతః పరం. నాభి సరోజాది పంచకాత్పరం న కించిదపి దృష్టవానిత్యర్థః. 32

చూడలేకున్నారు. సుదర్శనము మొదలగు ఆయుధములు మూడు లోకములలో మూడు కాలములలో గొప్ప తేజస్సుతో దుర్నిరీక్ష్యములై ఉంటాయి. అవి కూడా ఆయనను సమీపించ లేకుండా ఉన్నవి. అట్లు సుదర్శనాద్యాయుధములు ఆయనను దుర్లభుని చేసినవి. 31

బ్రహ్మదేవుడు లోకములను సృష్టించాలనే కోరిక, లోక సృష్టికి కావలసిన జ్ఞానము కలవాడాయెను. జగద్విధాత యగు బ్రహ్మదేవుడు ఇప్పటి వరకు వర్ణింపబడిన శ్రీహరిని చూచెను. శ్రీహరి నాభికమలము నుండి పుట్టిన పద్మము, తన శరీరము, ప్రళయజలములు, ప్రళయ వాయువు మరియు ఆకాశము ఈ అయిదింటినే బ్రహ్మదేవుడు చూడ గలిగెను. ఇవి తప్ప మరేమియు ఆయనకు కనబడలేదు. 32

శ్లో॥ స కర్మబీజం రజసోపరక్తః ప్రజాః సిసృక్ష న్నియదేవ దృష్ట్వా ।
అస్తౌద్విసర్గాభిముఖస్తమీడ్యమవ్యక్తవర్త్మ న్యభివేశితాత్మా ॥ 33

టీ:- సఇతి. రజసా సజోగుణేన. ఉపరక్తో యుక్తః. అతఏవావ్యక్త వర్త్మని మాయా వాలాస మార్గే. అభినివేశిత చిత్తః. స విధాతా ప్రజాస్సిసృక్షన్ స్రష్టుమిచ్ఛన్.ఇయదేవ. నాభిసరోజాది పంచభిరేవ. కర్మబీజం లోకసృష్టేః కారణం దృష్ట్వా. విసర్గాభి ముఖః వివిధ దృష్టౌ దత్త చిత్తస్సన్ ఈద్యం స్తుత్యంతం హరిమస్తౌత్. 33

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
అష్టమోఽధ్యాయః

బ్రహ్మదేవుడు రజోగుణముతో కూడినవాడయ్యెను. ప్రజాసృష్టి చేయదలచెను. సృష్టికి కారణ భూతములగు ఈ అయిదు పదార్థములను మాత్రమే చూచెను. సృష్టి చేయగోరిన వాడగుటచే శ్రీహరి యందు మనస్సును లగ్నముచేసి ఆ భగవానుని స్తుతింపసాగెను. 33

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.

నవమోఽధ్యాయః

శ్లో. నవమే తపసా తుష్టం దృష్ట్వా నారాయణ స్త్వజః ।
అస్తౌ దేకార్ణవేసీదన్ లోకసర్గచికీర్షయా ॥

శ్రీభగవజ్ఞానేనాత్మనః కృతార్థతా మావిష్కుర్వన్ అజోఽజ్ఞాంశ్చ శోచన్నాహ–జ్ఞాతఇతి.

బ్రహ్మోవాచ

శ్లో॥ జ్ఞాతోఽసి మేఽద్య సుచిరాన్నను దేహభాజాం
న జ్ఞాయతే భగవతో గతిరిత్యవద్యమ్ ।
నాన్యత్త్వదస్తి భగవన్నపి తన్న శుద్ధం
మాయాగుణవ్యతికరాత్త్వమురుర్విభాసి ॥ 1

టీ:– సుచిరాద్బహు కాలోపాసనేన అద్య మే మయాత్వం జ్ఞాతోఽసి. నన్వహో దేహభాజం ఏతదవద్యం తత్కిమితి చేద్భగవతస్తవ గతిః తత్త్వం న జ్ఞాయతఇత్యేతత్. తథాహి. త్వమేవ జ్ఞాతుం యోగ్యః సత్యత్వాత్. నాన్యత్ అసత్యత్వాది త్యాహ –హే భగవన్ త్వత్తోఽన్యన్నాస్తి యదప్యస్తీతి ప్రతిభాతి. తత్తు శుద్ధసత్త్వం న భవతి కథమసతః ప్రతీతి స్తత్రాహ – యది యతో మాయాగుణ వ్యతికరాత్ క్షోభాత్ త్వమేవోరుః బహురూపస్సన్ విభాసి. 1

9వ అధ్యాయము

ఏకార్ణవమైన జలములలో, లోక సృష్టి చేయవలెనని కోరికతో, అజుడైన బ్రహ్మ చేసిన తపస్సుకు సంతోషించి, తన తత్త్వమును అవగతము చేయించిన నారాయణుని దర్శించి, కృతార్థుడనైతినని తలచి బ్రహ్మ చేసిన స్తుతి ఈ తొమ్మిదవ అధ్యాయమున వర్ణింపబడుచున్నది.

బ్రహ్మ ఇట్లు పలికెను

ఓ భగవానుడా! చాలాకాలము నిన్ను ఉపాసించి నేడు తెలిసికొంటిని. దేహాభిమానము గల జీవులు ఎంతటి దురదృష్టవంతులు వారు నీ స్వరూపము(భగవానుని స్వరూపము)ను తెలియజాలకున్నారు. ఇట్లు తెలియజాలకపోవుట అనే దోషము కలవారు జీవులు. నీవు తప్ప మరియొక వస్తువేదియు లేదు. ఉన్నట్లు తోచు వస్తువు కూడ సత్యమైనది (వాస్తవమైనది) కాదు. ఎందుకనగా త్రిగుణాత్మకమగు మాయాశక్తి చేత నీవే వివిధ రూపములలో భాసించుచున్నావు. 1

శ్లో॥ రూపం యదేతదవబోధరసోదయేన
శశ్వన్నివృత్త తమసః సదనుగ్రహాయ ।
ఆదౌ గృహీతమవతార శతైకబీజం
యన్నాభిపద్మ భవనాదహమావిరాసమ్ ॥ 2

టీ:- నను సమ్యఙ్న జానాసి యత్త్వయా దృష్టం రూపం. తదపి గుణాత్మక మేవ. నిర్గుణం బ్రహ్మైవ తు సత్యం తత్రాహ - ద్వాభ్యాం. రూపమితి. అవబోధ రసోదయేన చిచ్ఛక్త్యావిర్భావేన శశ్వత్ సదా నివృత్తం తమో యస్మాత్తస్య తవ. యదేతద్రూపం తవైవ స్వాతంత్ర్యేణ సతాముపాస కానామనుగ్రహాయ. గృహీతమాదౌ స్వీకృతం. ఆవిష్కృతమిత్యర్థః. అవతారశతస్య శుద్ధసత్వాత్మకస్య యదేకం బీజ మూలం తత్ప్రదర్శనార్థం గుణావతారబీజత్వం దర్శయతి-యన్నాభీతి. యస్య నాభిపద్మభవ నాదహ మావిర్భూతోఽస్మితదతోఽస్మాద్రూపాత్ పరం పశ్యామీత్యుత్త రేణ సంబంధః. 2

శ్లో॥ నాతః పరం పరమ యద్భవతః స్వరూప
మానందమాత్రమవికల్ప మవిద్ధవర్చః ।
పశ్యామి విశ్వసృజమేకమ విశ్వమాత్మన్
భూతేంద్రియాత్మకమదస్త ఉపాశ్రితోఽస్మి ॥ 3

నీ చైతన్యశక్తి యొక్క ప్రకాశము కారణముగా అజ్ఞానము సర్వదా తొలగుచున్నది. సత్పురుషులను అనుగ్రహించుట కొరకే నీ ఈ రూపము. ఇది వందలాది అవతారములకు మూలకారణముగా నున్నది. నేను నీ నాభి నుండి పుట్టిన పద్మము అనే భవనము నుండి ఆవిర్భవించితినని గ్రహించితిని. 2

ఓ పరమపురుషా! ఆత్మస్వరూపా! ఆనందమాత్రము, భేద రహితము తేజోమయము అగు బ్రహ్మస్వరూపము ఏది కలదో అది, నేను చూచుచున్న నీ ఈ రూపము కంటె భిన్నమైనది కాదు. అద్వితీయమగు ఈ నీ రూపము జగత్తును సృష్టించిననూ జగత్తుకు

టీ:– నేతి. హే పరమ హే ఆత్మన్ అవిద్ధ వర్చః అనావృత ప్రకాశం అతః అవికల్పం నిర్భేదం అతఏవ ఆనందమాత్రం ఏవం భూతం యద్భగవతః స్వరూపం తదతో రూపాత్పరం భిన్నం న పశ్యామి కింతు ఇదమేవ తత్ అతః కారణాత్తే తవ అద ఇదం రూపముపాశ్రితోఽస్మి యోగ్యత్వాదపీత్యాహ – ఏతముపాస్యేషు ముఖ్యం యతో విశ్వ సృజం విశ్వం సృజతీతి తథా. తదత ఏవ అవిశ్వం విశ్వస్మాదన్యద్భూతేంద్రియా త్మకం భూతానామీంద్రియాణాం చాత్మానం కరణమిత్యర్థః. 3

అతీతముగనే యున్నది. నీవు సకల భూతములకు ఇంద్రియములకు కారణ భూతుడవు. అట్టి నిన్ను శరణు వేడుచున్నాను. 3

శ్లో॥ తద్వా ఇదం భువనమంగళ మంగళాయ
ధ్యానే స్మ నో దర్శితంత ఉపాసకానామ్ ।
తస్మై నమో భగవతేఽనువిధేమ తుభ్యం
యోఽనాదృతో నరక భాగ్భిరసత్ప్రసంగైః ॥ 4

టీ:– నన్వేవమపి సోపాధికమేతదర్వాచీన మేవేత్యాశంక్యాహ–తదితి. హే భువనమంగళ ఉపాసకానాం నోఽస్మాకం మంగళాయ ధ్యానే తే త్వయా తద్వైతదేవం దర్శితం. స్మేతి యదర్థే. న హ్యవ్యక్తవర్త్మన్యభి నివేశిత చిత్తానామస్మాకం త్వదీయం సోపాధికదర్శనం యుక్తమితి భావః. ఇతి యస్మాదతస్తస్మై తుభ్యం. నమః అనువిధేమ అనువృత్త్యా నమస్కారం కరవామ తర్హి విమితి కేచిన్నద్రియంతే తత్రాహ–నరకభాగ్భి

సగుణమే నిర్గుణమునకు మూలమా అనే శంకను తొలగిస్తున్నాడు. ఓ భువనమంగళా! నీ ఉపాసకుడనగు నాకు మంగళమును చేకూర్చుటకై నీవు ఈ రూపమును దర్శింపచేసితివి. అట్టి సచ్చిదానంద విగ్రహుడవు అగు నీకు పలుమారు నమస్కరించుచున్నాను. పాపాసక్తులు, కుతర్కనిష్ఠులు, మిథ్యాభూతమగు ప్రపంచమునందు తీవ్ర ఆసక్తి గలవారగు వ్యక్తులు నిన్ను ఉపేక్షచేసి నరకమును పొందుచున్నారు. 4

స్తత్ర హేతుః. అసత్ప్రసంగైర్నిరీశ్వరకుతర్కనిష్ఠైః పురుషైర్వ ప్త్వనాదృతః ఉపేక్షితః. తస్మై తుభ్యమితి. 4

శ్లో॥ యే తు త్వదీయ చరణాంబుజకోశగంధం
జిఘ్రంతి కర్ణ వివరైః శ్రుతివాతనీతమ్ ।
భక్త్యా గృహీత చరణః పరయా చ తేషాం
నాపైషి నాథ హృదయాంబురుహాత్స్వపుంసామ్ ॥ 5

టీ:- ఆదరేణ త్వాం భజంతః. కృతార్థా ఇత్యాహ-త్రిభిః. య ఇతి. శ్రుతిర్వేదః సఏవ వాతః తేన నీతం ప్రాపితం నాపైషి నాపయాసి. యే త్వత్కథా శ్రవణం అత్యాదరేణ కుర్వంతి. తేషాం హృది నిత్యం ప్రకాశస ఇతి భావః. 5

ఓ నాథా! వేదములు నీ పాదమహిమను కీర్తించుచున్నవి. వేదములనెడి వాయువులచేత తీసికొని రాబడిన నీ పాదపద్మపు మొగ్గల సుగంధమును నీ భక్తులు ప్రేమతో వాసనచూసెదరు. ఆ వేదవాయువుల ద్వారా ప్రకటితమయ్యే నీ మహిమను (నీకథలను) భక్తులు అత్యంత ఆదరముతో విని ఆనందపడెదరు. వారు గొప్ప భక్తి చేత నీ పాద పద్మములను బంధింతురు. అట్టి భక్తుల హృదయ పద్మముల నుండి నీవు దూరము కాజాలవు.( వారి హృదయములో నీవు ఎల్లప్పుడు వెలుగొందుతుంటావని భావము) 5

శ్లో॥ తావద్భయం ద్రవిణగేహ సుహృన్నిమిత్తం
శోకః స్పృహాపరిభవో విపులశ్చ లోభః ।
తావన్మమేత్యసదవగ్రహ ఆర్తిమూలం
యావన్న తే౽ంఘ్రిమభయం ప్రవృణీత లోకః ॥ 6

టీ:- తతః కిమతఆహ-తావదితి.ద్రవిణాదిత్రికే విద్యమానే భయం

మానవుడు ఎంతవరకు అభయస్థానమగు నీ పాదమును ఆశ్రయించడో, అంత వరకు అతనికి, ఇల్లు, సంపద, బంధుమిత్రులు అనే బంధములు తొలగవు. ఇవి ఉన్నప్పుడు కలిగే దుఃఖమును, వీటి సంబంధము వలన తృష్ణ, అవమానము, మిక్కిలి లోభమును తప్పవు. వానికి "ఇది నాది" అనే మమకార దురభిమానముండును. మానవుల

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

గతే శోకః.పునశ్చ స్పృహా తతః పరిభవః తతః విపులో లోభః. తృష్ణా పునః కథంచిత్ప్రాప్తే అర్థే ఆర్తిమూలం భయశోకాదేః కారణం. మమేత్య సదవగ్రహః. యావదభయం ముక్తిప్రదం. తే తవాంఘ్రిం. న ప్రవృణీత నాశ్రయేత్. త్వత్పాదాశ్రయమాత్రేణ భయాదిని వృత్తిః కింపునస్త్వత్ప కాశే సతీతి భావః. 6

దుఃఖములన్నింటికిని మమకారమే మూలకారణమగుచున్నది. ఇట్టి వారు నీ పాదములను ఆశ్రయించరు. నీ పాదములను ఆశ్రయించిన మాత్రముననే భయాది నివృత్తి కలుగును అని భావము. 6

శ్లో॥ దైవేన తే హతధియో భవతః ప్రసంగాత్
సర్వాశుభోపశమనా ద్విముఖేంద్రియా యే ।
కుర్వంతి కామ సుఖ లేశ లవాయ దీనా
లోభాభిభూత మనసోఽకుశలాని శశ్వత్ ॥ 7

టీ:- యే తు నిష్కామా అపి సంతః త్వాం నాద్రియంతేతే నరకభాజ ఇత్యుక్తం.యే తు త్వత్కథా శ్రవణాది విముఖాస్సంతః కామ్యకర్మ పరాయణాస్తేఽతి మందా ఇత్యాహ- దైవేనేతి. యే దైవేన హతధియో నష్ట మతయః. అత ఏవ సర్వాశుభోపశమనాత్ సర్వ దుఃఖ నివర్తక త్వాత్. భవతః ప్రసంగాత్ శ్రవణకీర్తనరూపాత్. విముఖానీంద్రియాణి యేషాం తే. తే నికృష్టాః పురుషాః లోభేన పరిభూతం మనో యేషాం తే. అతఏవ దీనాస్సంతః కామ సుఖస్య భోగస్య లేశస్యాప్యణ్వంశాయ అకుశలాన్య క్షేమకరాణి శశ్వత్కుర్వంతి. 7

నిష్కాములైన కూడా, సత్పురుషులు నిన్ను ఆశ్రయించకపోతే నరకమును పొందుదురని చెప్పబడినది. కామ్యకర్మ పరాయణులై, నీ కథా శ్రవణ విముఖులైన వారు అతి మందబుద్ధులని చెప్పుచున్నాడు. ఓ భగవంతుడా! మీ నామ సంకీర్తనలను వినుట వలన, మీ గాథలను వినుటవలన మానవుల యొక్క సమస్త అమంగళములు, సర్వ దుఃఖములు తొలగిపోవును. కాని కొందరు దైవవశము చేత బుద్ధిని కోల్పోయి నీ కథలను వినుట యందు విముఖులగుదురు. ఇంద్రియ భోగముల వలన కలిగే రవ్వంత(కొద్దిపాటి) సుఖమునకు వశులై (దీనులై) స్వాతంత్ర్యమును కోల్పోదురు. మనస్సునకు పూర్తిగా లొంగి పోయి నిరంతరము అమంగళకరములగు కర్మలను చేయుచుందురు. (7)

శ్లో॥ క్షుత్తృట్త్రిధాతుభిరిమా ముహురర్ద్యమానాః
శీతోష్ణ వాత వర్షై రితరేతరాచ్చ ।
కామాగ్నినాఽచ్యుత రుషా చ సుదుర్భరేణ
సంపశ్యతో మన ఉరుక్రమ సీదతే మే ॥ 8

టీ:- అకుశలత్వమేవ దర్శయతి-క్షుదితి. త్రిధాతవః వాత పిత్త శ్లేష్మాణః క్షుదాదిభిః శీతాదిభిశ్చ (అత్ర ఛందోభంగఆర్షః. వాత జలదైరితి పాఠే న కాప్యనుపపత్తిః.) సుదుర్భరేణ సుతరాం దుస్సహేన కామాగ్నినా చ ఇతరేతరాదన్యోన్యం అచ్యుతయా అవిచ్ఛిన్నయా రుషా క్రోధేన చ ముహురర్ద్యమానాః పీడ్యమానాః. ఇమాః ప్రజాః సంపశ్యతో మే మనః హే ఉరుక్రమ సీదతే సీదతి. 8

ఓ అచ్యుతా! ఆకలిదప్పులచేత, వాత పిత్త శ్లేష్మలనే ధాతువులలో వచ్చే వైషమ్యముచేత, చలి, వేడి, గాలి, వర్షములచేత, పరస్పర కలహములచేత ఈ జీవులు పీడింపబడుచున్నారు. మఱియు కామాగ్ని చేతను, దుర్భరమైన కోపము చేతను నిరంతరము పీడింపబడు చున్నారు. ఇట్టి జీవులను చూచుచున్న నా మనస్సు మిక్కిలి బాధపడు చున్నది. 8

శ్లో॥ యావత్పృథక్త్వమిదమాత్మన ఇంద్రియార్థ
మాయాబలం భగవతో జన ఈశ పశ్యేత్ ।
తావన్న సంసృతి రసౌ ప్రతిసంక్రమేత
వ్యర్థాపి దుఃఖ నివహం వహతీ క్రియార్థా ॥ 9

టీ:- నన్వేవం భూతాయాస్సంసృతేర పరమార్థాయాః కామర్థం విషాదః క్రియతే తత్రాహ-యావదితి. హే ఈశ భగవతస్తవ ఇంద్రియార్థ

ఓఈశ్వరా! త్వక్, చక్షు, శ్రోత, జిహ్వాఘ్రాణములనే ఇంద్రియ ములకు వరుసగా స్పర్శ, రూప, శబ్ద, రస, గంధములు విషయ- ములు. ఇవి మానవుని బలముగా బంధించుచున్నవి. ఈ బంధనము నకు మూలకారణము భగవంతుని మాయాశక్తియే. ఈ బంధనములో చిక్కుకున్న మానవుడు జననమరణములతో గూడిన సంసార ప్రవా హములో పడియున్నాడు. ఎంతవరకు మానవుడు మాయా బలము నుండి విడివడడో, ఎంతవరకు తను ఆ పరమాత్మకంటె అభిన్నుడననే

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

రూపాయా మాయాయాః బలమాధిక్యం యస్య తత్. ఇదమాత్మనః పృథక్త్వం దేహాదిభావం. అయం జనో యావత్పశ్యేత్తావదపి క్రియాణా మర్థః ఫలం యస్యాస్సా. అత ఏవ వ్యర్థా సంస్కృతిర్న ప్రతిసంక్రమ ఇత నోపరమేత్. తావత్పునరసౌ జనో దుఃఖ సమూహం వహతి ప్రాప్నోతి. 9

సత్యమును గ్రహింపడో, ఎంతవరకు దేహాదిభావము తొలగిపోదో అంత వరకు ఈ సంసారము తొలగిపోదు. ఈ సంసారము నిరర్థకము. కర్మఫలములనిచ్చుచూ దుఃఖసమూహముతో నిండియుండును. (అద్వైత భావము దృఢపడు వరకు సంసారదుఃఖము తొలగదని సారాంశము). 9

శ్లో॥ అహ్న్యాపృతార్తకరణా నిశి నిః శయానా
నానామనోరథ ధియా క్షణ భగ్న నిద్రాః।
దైవాహతార్థ రచనా ఋషయోఽపి దేవ
యుష్మత్ప్రసంగ విముఖా ఇహ సంసరంతి ॥ 10

టీ:- భవత్వేవమవివేకినాం. వివేకినస్తు ముక్తాఏవేతి కిం తేషాం భక్త్యా వినాకృత్యమిత్యత ఆహ–అహ్నీతి. అహ్న్యా పృతాని వ్యాపృతాని. ఆర్తాని క్లిష్టాని చ. కరణానీంద్రియాణి యేషాంతే. రాత్రౌ విషయ లవోఽపి నాస్తి యతో నిశి నిశ్శయానాః నానామనోరథ ధియా స్వప్న దర్శనేన చ క్షణేన భగ్ననిద్రాః దైవేనాహతాః సర్వతః ప్రతిహతార్థరచనాః అర్థార్థో ద్యమా యేషాం తే ఋషయో వివేకినోఽపి భవతః శ్రవణకీర్తన రూపా త్ప్రసంగాద్విముఖాః యుష్మత్ప్రసంగ విముఖత్వం సంసార హేతుః (10)

ఓ దేవా!సామాన్యుల విషయము అట్లుండనీయుము. మహర్షులే యైనను. నీ లీలలను వినుటయందును, గానము చేయుట యందును ప్రీతిలేనివారైనచో వారి పరిస్థితి ఈ విధముగా నుండును. పగటి యందు అనేక విధములగు కార్యకలాపములను చేయుచు వివిధ క్లేశములను పొందుచున్నారు. రాత్రుల యందు రకరకములైన కోరికలతో మనోవిజృంభణము కారణముగా సుఖ నిద్రలేని వారగు చున్నారు. ఇట్టి వారు భౌతికసంపాదనాపరులైనను వారికి భగవంతుడు విఘాతము కల్గించును. వారీ విధముగా జన్మమృత్యుమయమైన సంసారప్రవాహములో కొట్టుకొనిపోవుదురు. నిరంతరము భగవత్ప్ర సంగమును వినుట, చెప్పుట యందు విముఖత్వము సంసారహేతు వగును. (సత్సంగము జరగనిదే ఎంతటివారికైనను సంసార నివృత్తి జరగదు) 10

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ త్వం భావయోగ పరిశోధిత హృత్సరోజ
ఆస్సే శ్రుతేక్షితపథో నను నాథ పుంసామ్ ।
యద్యద్ధియా త ఉరుగాయ విభాగయంతి
తత్తద్వపుః ప్రణయసే సదనుగ్రహాయ ॥11

టీ:- తదేవం భక్తానాం సంసారాన్నివృత్తిముక్త్వా భక్తానాం తన్నివృత్తి మాహ. త్వమితి. శ్రుతేన శ్రవణేన ఈక్షితః పంథా యస్య సః త్వం భావోభక్తిః భక్తియోగేన శోధితేహృత్సరోజే ఆస్సే తిష్ఠసి కించ హే ఉరుగాయ శ్రవణం వినాపి త్వద్భక్తాః మనసా యద్యత్తవ పురుషరూపం స్వేచ్ఛయా ధ్యాయంతి తత్తత్సతాం భక్తానామనుగ్రహాయ ప్రణయసే ప్రకటయసి. 11

ఓ నాథా! నీ లీలల శ్రవణము చేత నిన్ను సేవించేమార్గము గోచరించును. శ్రేయస్కాములు మొదట నీ లీలలను శ్రవణము చేయవలెను. అప్పుడే భక్తి ఉదయించును. భక్తియోగము చేత పవిత్రమైన హృదయములో నీవు ఎల్లప్పుడును నిశ్చయముగా నివసించెదవు. ఓ పవిత్రమైన కీర్తిగలవాడా! సత్పురుషులైన నీ భక్తులు నిన్ను ఏ యే రూపములలో ధ్యానించెదరో, నీవు ఆ యా రూపములనే ధరించుచు వారిని అనుగ్రహింతువు. 11

శ్లో॥ నాతి ప్రసీదసి తథోపచితోపచారైః
ఆరాధితః సురగణైర్హృది బద్ధకామైః ।
యత్సర్వభూత దయయా సదలభ్యయైకో
నానా జనేష్వవహితః సుహృదంతరాత్మా ॥ 12

టీ:- భక్తానాం తు నిష్కామానాం త్వమతిసులభో నేతరేషామిత్యాహ -నేతి. ప్రియత్వే హేతురేకఇత్యాది. ఏకః అద్వితీయః. ఉపాస్యేషు

ఓ దేవా! నీవు అద్వితీయుడవు. సకల ప్రాణుల యందు అంతర్యామిగా నివసించుచూ వారికి హితమును చేయుచున్నావు. సర్వభూతదయ ప్రధానలక్షణముగా గల భక్తులకు నీవు (చాలా) ప్రసన్నుడవగుదువు. కోరికలు గలవారైన దేవతాగణములు విపులమగు సామగ్రులతో నిన్ను గొప్పగా ఆరాధింతురు. అయినప్పటికి సర్వభూత దయగల భక్తుల విషయములో ప్రసన్నుడవైనట్లు ఈ దేవతాగణముల యందు ప్రసన్నుడవు కాజాలవు. అట్టి "భూతదయ" నీ భక్తులు కాని

ముఖ్యో వా. నానాజనేష్వవహితః. అతఏవాంతరాత్మా. అత ఏవ సుహృత్. త్వం అసతామభక్తానాం. అలభ్యయా సర్వభూత దయయా యద్యథా ప్రసీదసి.తథా హృది బద్ధకామైస్సురగణైః ఉపచితైరూర్జితై రుపచారైః పుష్పోపచారాదిభిః. నాతి ప్రసీదసి. 12

శ్లో॥ పుంసామతో వివిధ కర్మభిరధ్వరాద్యైః
దానేన చోగ్రతపసా వ్రతచర్యయా చ।
ఆరాధనం భగవతస్తవ సత్క్రియార్థో
ధర్మోఽర్పితః కర్హిచిత్ ధ్రియతే న యత్ర ॥ 13

టీ:- యతః కామినాం భగవాన్ నాతిప్రసీదతి. అతః కామప్రాప్తిః క్రియాణాముత్తమం ఫలం న భవతి. కింతు. త్వత్ప్రీణనమేవ కామ సంయోగస్త్వవాంతర ఫలేన ప్రరోచనార్థమిత్యాహ - పుంసామితి. అతః పుంసాం అధ్వరాద్యైః వివిధకర్మభిః దానాదిభిశ్చ. భగవతస్తవారాధనమేవ సత్క్రియార్థః. సంశ్చాసౌ క్రియార్థశ్చేతి.శ్రేష్ఠం క్రియాఫలమిత్యర్థః. శ్రేష్ఠత్వే హేతుః యత్ర త్వయ్యర్పితో ధర్మోన కదాచిత్ ధ్రియతే న నశ్యతి. (కర్హిచి దిత్యత్ర ఛందోభంగఆర్షః) కామార్థస్తు ధర్మః కామం దత్వానశ్యతీత్యర్థః. 13

వారికి (అభక్తులకు) దుర్లభము. నీ భక్తులకే భూతదయ అలవడును. భూతదయ లేని వారియందు నీవు ప్రసన్నుడవు కావు. 12

కామ్యకర్మలు (వేదోక్తమైన) భగవంతుని యందు ప్రీతి (రుచి) కలుగుటకు ఉద్దేశించినవి మాత్రమే అని చెప్పుచున్నాడు. భగవానుడు కోరికలు కోరేవారి యందు అంత ఎక్కువగా ప్రసన్నుడు కాజాలడు. కోరికలు నెరవేరుట కర్మాచరణకు ఉత్తమఫలము కాదు. భగవంతుడవగు నిన్ను సంతోషపెట్టుటయే ప్రధానఫలం. మానవులు యజ్ఞములను చేయుదురు. తపస్సు చేయుదురు. దానములు చేయుదురు. వ్రతములను చేయుదురు. ఇట్టి సత్కర్మా చరణకు భగవదారాధనయే మహాఫలము. నీ యందు సమర్పింపబడిన ధర్మమునకు ఏ కాలము నందైనను నాశము లేదు. (కర్హిచిద్ అన్నచోట ఛందోభంగము ఆర్షము.) (13)

శ్లో॥ శశ్వత్స్వరూపమహసైవ నిపీత భేద
మోహాయ బోధ ధిషణాయ నమః పరస్మై ।
విశ్వోద్భవ స్థితి లయేషు నిమిత్త లీలా
రాసాయ తే నమ ఇదం చకృమేశ్వరాయ ॥ 14

టీ:- అతస్త్వామేవ వయం నతా ఇత్యాహ-శశ్వదితి. శశ్వత్సర్వదా స్వరూప చైతన్యేనైవ నిరస్త భేదభ్రమాయ బోధఏవ ధిషణా విద్యాశక్తిర్యస్య. యద్వా. ధిషణం ఆశ్రయః తస్మాఏవ పరస్మై.అత్ర హేతుః విశ్వస్య ఉద్భవాదిషు నిమిత్తం మాయా తస్యాః లీలావిలాసః తయా సహ రాసః క్రీడా యస్య. అత ఏవేశ్వరాయ నియంత్రే తుభ్యమిదం నమో నమనం చకృమ. కృతవంతో వయం. 14

శ్లో॥ యస్యావతార గుణకర్మ విడంబనాని
నామాని యేఽసువిగమే వివశా గృణంతి ।
తే నైక జన్మశమలం సహసైవ హిత్వా
సంయాంత్యపావృతమృతం తమజం ప్రపద్యే ॥ 15

టీ:- నామగ్రహణమాత్రేణ కైవల్య ప్రదత్వేనైశ్వర్యం వ్యంజ యన్న మస్కరోతి-యస్యేతి. అవతారాదీనాం విడంబనం అనుకరణం యేషు

నీవే జ్ఞానమునకు అధిష్ఠానము. నీ స్వరూపమగు చైతన్యము యొక్క మహిమ చేతనే మానవులలోని భేదభ్రమ శాశ్వతముగా తొలగి పోవును. సృష్టి స్థితి లయములకు నిమిత్తము నీ స్వాధీనములో నున్న "మాయాశక్తి". ఈ మాయాశక్తి యొక్క విలాసము నీ క్రీడయే. నీవే ఈ ప్రపంచానికి నాథుడవు. పరమేశ్వరుడవు. అట్టి నీకు పలుమార్లు నమస్కరించుచున్నాను. 14

దేవకీనందనుడు, వసుదేవసుతుడు మొదలగునవి భగవంతుని అవతార సూచకములగు నామములు. సర్వజ్ఞుడు, భక్తవత్సలుడు మొదలగునవి భగవంతుని గుణములను తెలియజెప్పే నామములు. గోవర్ధనోద్ధరణుడు, కంసాంతకుడు అనునవి భగవంతుని కర్మలను సూచించు నామములు. మానవులు ప్రాణములు వదిలే సమయమున వివశులై కూడా, భగవంతుని ఏ నామమైనను ఉచ్చరించిన మాత్రమున వారి బహుజన్మ సంచిత పాపరాశి వెంటనే తొలగును. వారు

నామ స్వస్తి. తాని తత్రావతార విడంబనాని. దేవకీనందనేత్యాదీని గుణ విడంబనాని సర్వజ్ఞ భక్తవత్సలేత్యాదీని కర్మ విడంబనాని గోవర్ధనోద్ధరణ కంసారాతే ఇత్యాదీని యస్యైతాని దేవకీ నందనేత్యాదీని నామాని అసువిగమే ప్రాణోత్క్రమణసమయే వివశా అపి యే గృణంతి ఉచ్చారయంతి తే కేవలమనేక జన్మార్జిత శమలం పాపం సహసైవ తత్క్షణ ఏవ ఝడితి త్యక్త్వా అపావృతం నిరస్తావరణం ఋతం బ్రహ్మ సంయాంతి ప్రాప్నువంతి తమజం ప్రపద్యే న జాత ఇత్యజః. 15

శ్లో॥ యో వా అహం చ గిరిశశ్చ విభుః స్వయం చ
స్థిత్యుద్భవ ప్రళయ హేతవ ఆత్మమూలమ్ ।
భిత్త్వా త్రిపాద్వవృధ ఏక ఉరుప్రరోహః
తస్మై నమో భగవతే భువనద్రుమాయ ॥ 16

టీ:- తత్ర గుణావతారకర్మాణి దర్శయన్ ప్రణమతి-య ఇతి. యో వా ఏకః త్రిపాత్ త్రయో బ్రహ్మాదయః పాదాః స్కందాః యస్య ప్రత్యేకం చ ఉరవః ప్రరోహాః శాఖోపశాఖాః. మరీచ్యాది మన్వాదిరూపా యస్య తథా భూతస్సన్ వవృధే తస్మై భువనాకారాయ ద్రుమాయ తుభ్యం నమః స కిం కృత్వా వవృధే ఆత్మమూలమాత్మా స్వయమేన మూల మధిష్ఠానం యస్య తత్ప్రధానం భిత్త్వా గుణత్రయ రూపేణ విభజ్య

ముక్తులగుదురు. బ్రహ్మపదమును పొందుదురు. జన్మలేని అట్టి నీకు నమస్కారము. 15

భువనము అనగా లోకము.లోకమనే వృక్షరూపములో నున్న నీకు నమస్కారము. ఈ వృక్షమునకు అద్వితీయుడవైన నీ ఆధీనములో నున్న "మాయాశక్తి" యే(ఒక్కటే) వేరు (మూలము). ఆ మాయాశక్తి మూడు రూపములుగా విభజింపబడింది. సృష్టి కారకుడనగు నేను (బ్రహ్మను), స్థితికారకుడి రూపములో నున్న నీవు, లయకారకుడి రూపములో శివుడు త్రిమూర్తుల రూపములో నున్నాము. ఈ మూడు రూపములే భువన వృక్షరూపములో మూడు"త్రిపాత్"రూపములో భాసించుచున్నాము."త్రిపాత్" అనగా మూడు మొదళ్ళు లేక మూడు ప్రధాన కాండములు లేక మూడు బోదెలు, లేదా మూడు స్కంధములు. మాయా శక్తియే ఇంకనూ మార్పునొంది మరీచి మున్నగు ప్రజాపతులు అనే శాఖోపశాఖలుగా విలసిల్లుచున్నది. ఇట్లు ఒకే "మాయ" మూడు

అహం బ్రహ్మా గిరీశశ్చ స్వయం విభుర్విష్ణుశ్చేతి. అనేన త్రిపాత్త్వముక్తం. స్థిత్యుద్భవ ప్రశమ హేతవో వయం త్రిపాద్భూత్వా యో వవృధ ఇత్యర్థః (16)

శ్లో॥ లోకో వికర్మ నిరతః కుశలే ప్రమత్తః
కర్మణ్యయం త్వదుదితే భవదర్చనే స్వే ।
యస్తావదస్య బలవానిహ జీవితాశాం
సద్యశ్ఛినత్త్యనిమిషాయ నమోఽస్తు తస్మై ॥ 17

టీ:- ఏవం గుణావతారకర్మవిడంబనముక్త్వా తస్యైవ కాలాఖ్యం రూపం తత్కర్మ చ. దర్శయన్ ప్రణమతి ద్వాభ్యాం.లోకఇతి. వికర్మ నిరతో విరుద్ధ ధర్మ నిష్ఠస్సన్ అయం లోకః కుశలేహితే స్వే ఆత్మీయే త్వదుదితే త్వయైవ సాక్షాదుక్తే భగవద్దర్శనరూపే కర్మణి ప్రమత్తః అదత్త చిత్తో యావద్వర్తతే తావదస్య లోకస్య ఇహాస్మిన్ లోకే జీవితాశాం బలవాన్ యస్సద్యశ్ఛినత్తి తస్మై అనిమిషాయ కాలాయ నమః. శ్రీమద్గీతా యాం భగవతా సాక్షాదుక్తాని కర్మాణ్యమూని.శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణ. మితి. 17

విభిన్న కాండముల రూపములో శాఖోప శాఖలతో విరాజిల్లుతున్నట్లు కనిపించుచున్నది. అట్టి 'జగద్రూపవృక్షరాజము' నకు నమస్కారము. 16

గుణావతార రూపమును వివరించిన పిదప "కాలరూప భగవత్కర్మను" చెప్పుచున్నాడు. ఓ దేవా!"భగవదారాధనమే లోకులకు మేలు కలిగించు ధర్మము" అని నీవు బోధించియున్నావు. మానవుడు భగవదారాధన కన్న భిన్నమైన "నిషిద్ధకర్మ" యందు నిరతుడై క్షేమం-కరమైన "స్వధర్మము"ను మరచుచున్నాడు. ఈ జీవితమే శాశ్వతమను భావముతో కాలము గడుపుచున్నాడు. "కాలస్వరూపుడవై" అట్టి మనుష్యుల ఆశలను తెగగొట్టుచున్నావు."కాల స్వరూపివి" అయిన నీకు నమస్కారము. "కాలోఽస్మి లోకక్షయకృత్" అను గీతావాక్యము ఇదే విషయమును తెల్పుచున్నది. 17

శ్లో॥ యస్మాద్బిభేమ్యహమపి ద్విపరార్ధధిష్ణ్య
మధ్యాసితః సకలలోక నమస్కృతం యత్ ।
తేపే తపో బహుసవోఽవరురుత్సమానః
తస్మై నమో భగవతేఽధిమఖాయ తుభ్యమ్ ॥ 18

టీ:- ఆస్తాం తావల్లోకస్య కథేత్యాహ -యస్మాదితి. యత్ ద్విపరార్ధావస్థాయి ధిష్ణ్యం స్థానం సకల లోక నమస్కృతం తదారూఢోఽధ్యాస్థితః అహమపి యస్మాత్కాలాఖ్యత్త్వత్తః బిభేమి భీతః స్వసంభవం త్వామేవ. అవరురుత్సమానః ప్రాప్తుమిచ్ఛన్. తేపే తపస్తప్తవాన్ ఆర్షమాత్మనేపదం. కథం భూతః. బహవస్సవాః యాగాః. సంవత్సరా వా యస్య. బహూన్ యాగాన్ కృత్వా బహూన్ సంవత్సరాన్ వా. తపస్తప్తవాన్. అధిమఖాయ మఖాది కర్మాధిష్ఠాత్రే. 18

బ్రహ్మలోకము రెండు 'పరార్ధము'ల కాలము నిలిచియుండును. అది సకల లోకుల చేత నమస్కరింపబడేది. అట్టి బ్రహ్మలోకమునకు అధీశ్వరుడను నేను(బ్రహ్మను). అటువంటి నేను కూడా "కాల స్వరూపుడవు" అగు నీకు భయపడుదును. నేను నిన్ను పొందగోరిన వాడనై అనేక సంవత్సరముల కాలము తపస్సు, యజ్ఞములు చేసినాను. యజ్ఞములకు అధిష్ఠానము నీవే. అట్టి కాలస్వరూపివి, యజ్ఞస్వరూపివి అగు నీకు నమస్కారము. (ఇచట తేపే అనే ఆత్మనేపదము ఆర్షము)18

శ్లో॥ తిర్యఙ్మనుష్యవిబుధాదిషు జీవయోని
ష్వాత్మేచ్ఛయాఽఽత్మకృత సేతుపరీప్సయా యః ।
రేమే నిరస్తరతిరప్యవరుద్ధదేహః
తస్మై నమో భగవతే పురుషోత్తమాయ ॥ 19

టీ:- ఇదానీం తత్తత్కాలభావి లీలావతార కర్మాణి దర్శయన్నాహ--

(ఇపుడు ఆ యా కాలములయందలి లీలావతార కర్మలను పేర్కొనుచున్నాడు). భగవంతుడవైన నీకు విషయసుఖములందెట్టి కోరికయు లేదు. ఓ దేవా! నీవు పూర్ణకాముడవు. అయినను నీవు దేవతలు, మనుష్యులు, పక్షులు మొదలగు జీవయోనుల యందు స్వయముగ, ఇష్టపూర్వకముగ దేహములను స్వీకరించితివి. నీవే ఏర్పరచిన లోకమర్యాదను, ధర్మమర్యాదను దాటకుండ రమించితివి.

తిర్యగితి. నిరస్తరతిః వస్తుతస్తు స్వానందీనుభవేనైవ నిరస్తవిషయ సుఖోఽపి. యస్తిర్యగాదిషు జీవ యోనిషు ఆత్మేచ్ఛయా స్వేచ్ఛయా. ఉపలబ్ధదేహః స్వీకృతమూర్తిస్సన్. ఆత్మకృతసేతు పరీప్సయా స్వకృత కర్మ మర్యాదా పాలనేచ్ఛయా రేమే నిరస్త విషయ సుఖత్వాదేవ పురుషోత్తమః తదుపాధిధర్మా సంస్పర్శాత్మస్మై తదుక్తం గీతాసు. శ్లో. యస్మాత్ క్ష రమతీతోఽహమక్షరాదపిచోత్తమః, అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమ. ఇతి. 19

శ్లో॥ యో ఽవిద్యయాఽనుపహతోఽపి దశార్ధవృత్త్యా
నిద్రాముయవాహ జఠరీకృత లోకయాత్రః ।
అంతర్జలే హి కశిపు స్పర్శానుకూలాం
భీమోర్మిమాలిని జనస్య సుఖం వివృణ్వన్ ॥ 20

టీ:- ఇదానీం తు దృశ్యమానామేవ మూర్తిం ప్రణమతి ద్వాభ్యాం - య ఇతి. జఠరీ కృతా ఉదరే ప్రవిలాపితా. లోకయాత్రా లోకస్థితిర్యేన సః దశార్ధాః పంచవృత్తయో వక్ష్యమాణ పంచపర్వాణి యస్యాస్తయా నిద్రాహేతు భూతయా అవిద్యయా. అనుపహతోఽపి అనభిభూతోపి భీమానామూర్మీణాం మాలాః విద్యంతే యస్మిన్ తస్మిన్నంతర్జలే. అహిరేవ కశిపుశ్శయ్యా. (అత్ర ఛందోభంగ ఆర్షః) తస్యాః స్పర్శోనుకూలో యస్యా

లీలలను ప్రకటించితివి. పురుషోత్తముడవైతివి. అట్టి నీకు నమస్కారము.

భగవద్గీత యందలి

శ్లో॥ యస్మాత్ క్షరమతీతోఽహమక్షరాదపిచోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమ ॥

తా. నేను జడవర్గము కంటెను సర్వదా అతీతుడను. నాశరహితమైన జీవాత్మకంటెను ఉత్తముడను. కనుక ఈ జగత్తునందును, వేదముల యందును "పురుషోత్తముడ"నని ప్రసిద్ధికెక్కితిని. 19

నిద్రకు కారణము అవిద్య. ఇది అయిదు వృత్తుల(చిత్తక్లేశముల) సమాహారము 1. అవిద్య, 2. అస్మిత, 3. రాగము, 4. ద్వేషము, 5. అభినివేశము. ఈ అయిదువృత్తులు నిన్ను(భగవానుని) నిర్జింపలేవు. నీవు ప్రళయకాలములో సకల ప్రాణులను, సమస్త ప్రపంచమును నీ ఉదరములో నిలిపియుంచినావు. భయంకరమైన తరంగ పంక్తులతో కూడిన ప్రళయకాల జలములయందు మెత్తని స్పర్శతో సుఖముగా నుండే ఆదిశేషుడనే తల్పముపై శయనించి యోగనిద్రను పొందినావు. పురాకృతకర్మల ద్వారా అలసిన జీవులకు, క్లేశములంటని నిద్ర ఇలా ఉంటుందని తెలుపగోరి, పరోపకారాన్ని అపేక్షించి నీవు శయనించి నావు. 20

స్తాం నిద్రాం ఉవాహ తస్మై నమ ఇత్యుత్తరేణాన్వయః. నిద్రాణస్యా వివేకినో జనస్య నిద్రాసుఖమీదృగితి వివృణ్వన్ ప్రదర్శయన్ ఉపహస న్నిత్యర్థః. అత ఏవాంతర్జలాంతాది విశేషణం. యద్వా పూర్వకల్పే శ్రాంతస్య జనస్య విశ్రామ సుఖం వివృణ్వన్ విష్ఫారయన్. తదా తు పరోపకారాయ స్వయం దుస్సహమపి సోఢవ్యమితి ద్యోతనార్థం విశేషణాని. 20

శ్లో॥ యన్నాభిపద్మభవనాదహమాసమీడ్య
లోకత్రయోపకరణో యదనుగ్రహేణ ।
తస్మై నమస్త ఉదరస్థ భవాయ యోగ
నిద్రావసాన వికసన్నళినేక్షణాయ ॥ 21

టీ:- కించ. యదితి. లోకత్రయముపకరణం యస్య యద్వా లోక త్రయస్య సృష్ట్యాదిద్వారేణ ఉపకరోతీతి. తథా. తాదృశోఽహం నాభి పద్మమేవ భవనం తస్మాత్ అద్య యదనుగ్రహేణ ఆసం ఉదరే స్థితో భవః సంసారః ప్రపంచో యస్య యోగనిద్రావసానే వికసన్నళినవదీక్షణం యస్య తస్మా ఇతి. 21

స్తుతింపదగిన ఓ దేవా! నేను "సృష్టి" చేయుటద్వారా ముల్లోకము లకు ఉపకారినగుచున్నాను. అట్టి నేను నీ నాభి యందలి పద్మము నుండి జన్మించితిని. నీ ఉదరము నందు సమస్త ప్రపంచము ఇమిడి యున్నది. నీ యోగనిద్ర ఇప్పుడే పూర్తియయి నీ కమలము వంటి కన్నులు తెరుచుకొనుచున్నవి. అట్టి నీకు నమస్కారము. 21

శ్లో॥ సోఽయం సమస్తజగతాం సుహృదేక
ఆత్మా సత్త్వేన యన్మృడయతే భగవాన్ భగేన ।
తేనైవ మే దృశమనుస్పృశతాద్యథాహం
స్రక్ష్యామి పూర్వవదిదం ప్రణతప్రియోఽసౌ ॥ 22

టీ:- ఏవం స్తుత్వా ప్రార్థయతే చతుర్భిః - స ఇతి. యతస్స ఏవ సమస్త జగతాం సుహృత్ యతస్స ఏవైకోఽనన్యః ఆత్మా అంతర్యామీ యతః ప్రణతప్రి యోఽసౌ అహం చ ప్రణతః న చాన్యః ప్రార్థనీయోఽస్తి. స ఏవ విశిష్టోఽయం భగవాన్ యద్యేన సత్త్వేన జ్ఞానేన భగేనైశ్వర్యేణ చ. ఇదం విశ్వం. మృడయతే సుఖయతే తేనైవ మేదృశం ప్రజ్ఞామను స్పృశతాత్ యోజయేత్ యథాహం స్రక్ష్యామి స్రష్టుం క్షమో భవిష్యామి. (22)

నీవు సమస్త జగత్తునకు ఏకైక మిత్రుడవు, అద్వితీయుడవు. ఆత్మస్వరూపుడవు. నీవు ఎట్టి జ్ఞానము మఱియు ఐశ్వర్యము చేత జగత్తునకు ఆనందమును కలిగించుచున్నావో అట్టి జ్ఞానము మఱియు ఐశ్వర్యమును నా బుద్ధికి ప్రసాదించుము. దాని వలన నేను ఈ జగత్తును సృష్టించెదను. శ్రీహరివి అయిన నీవు ప్రణత ప్రియుడవు. అట్టి నీకు నేను ప్రణమిల్లుచున్నాను. 22

శ్లో॥ ఏష ప్రపన్న వరదో రమయాఽఽత్మ శక్త్యా
యద్యత్కరిష్యతి గృహీత గుణావతారః ।
తస్మిన్ స్వవిక్రమమిదం సృజతోఽపి చేతో
యుంజీత కర్మశమలం చ యథా విజహ్యామ్ ॥ 23

టీ:- ఏష ఇతి. గృహీత గుణావతారః. ప్రపన్న వరద ఏవ. భగవాన్ ఆత్మశక్త్యా రమయా సహ. యద్యత్కరిష్యతి. తత్సర్వం మమప్రస్ఫురత్వితి. శేషః. ప్రార్థనైషా. స్వవిక్రమం స్వస్య శ్రీవిష్ణురేవ విక్రమః ప్రభావో

దేవా! నీవు శరణుపొందినవారికి వరముల నిచ్చువాడవు. నీ ఆత్మశక్తి యగు లక్ష్మీదేవితో గూడి అనేక అవతారములలో దివ్య-గుణములను ప్రకటించుచు అద్భుతలీలలను జరుపబోవుచున్నావు నేను చేయు ఈ సృష్టి నీ ప్రభావమే. నా మనస్సు నీ లీలల యందే నిలుచుగాక! నేను "సృష్టికర్తను" అనే కర్తృత్వాభిమాన దోషము నా నుండి తొలగజేయుము. 23

యస్మిన్ తదిదం విశ్వం తదాజ్ఞయా సృజతో మే చేత స్తస్మిన్ భగవత్యేవ యుంజీత తథా ప్రవర్తయతు. యథా కర్మశక్తిం తత్కృతం శమలం వైషమ్యాది పాపం చ విజహ్యాం త్యజామి. 23

శ్లో॥ నాభిహ్రదాదిహ సతోఽంభసి యస్య పుంసో
విజ్ఞానశక్తి రహమా సమనంతశక్తేః ।
రూపం విచిత్రమిదమస్య వివృణ్వతో మే
మారీరిషీష్ట నిగమస్య గిరాం విసర్గః ॥ 24

నేను ఈ ప్రళయజలమునందు శేషశాయిగా నున్న అనంతశక్తిమంతుడైన పురుషోత్తముని నాభికమలమునుండి పుట్టితిని. ఆ దివ్యపురుషుని విజ్ఞానశక్తి స్వరూపుడను నేనే. నానా విధమగు సృష్టిని చేయబోవుచున్న నాకు వేదోచ్చారణ(శక్తి) క్షీణించకుండుగాక! 24

టీ:- తథాహి. నాభీతి. అంభ్య సతో యస్య నాభిహ్రదాదిహాసం విజ్ఞానే శక్తిర్యస్య మహత్తత్వాత్మకస్య. చిత్తస్య. తదభిమానీ. తస్యాస్య రూపమిదం విశ్వం విస్తారయతో మే నిగమస్యావయవ భూతానాం మే గిరాం విసర్గ ఉచ్చారణం మారీరిషీష్ట. శ్లో. హలాంతం బ్రహ్మవర్చస మితి న్యాయేన మాలుప్యతా మిత్యర్థః. 24

శ్లో॥ సోఽసావదభ్రకరుణో భగవాన్ వివృద్ధ
ప్రేమస్మితేన నయనాంబురుహం విజృంభన్ ।
ఉత్థాయ విశ్వవిజయాయ చ నో విషాదం
మాధ్వ్యా గిరాఽపనయతాత్పురుషః పురాణః ॥ 25

పురాణ పురుషుడవగు నీవు గొప్పదయగలవాడవు. ప్రేమతో నిండిన చిరునవ్వుతో నీ నేత్రకమలాలను వికసింపజేయుము. నిద్దుర నుండి మేల్కొనుము. ఈ విశ్వము యొక్క సృష్టి సంభవమగునట్లు చేయుము. తేనెలొలుకు మాటలతో నా దుఃఖమును తొలగించుము. 25

టీ:- స ఇతి. అదభ్రమనల్పం వివృద్ధప్రేమ్ణా యుక్తస్మితేన విజృంభయన్ వికాసయన్ విశ్వస్య విజయాయోద్భవాయ చకారాత్. అస్మదనురూపాయ చార్థాయ. 25

వైత్రేయ ఉవాచ

శ్లో॥ స్వసంభవం నిశామ్యైవం తపో విద్యా సమాధిభిః ।
యావన్మనో వచః స్తుత్వా విరరామ సఖిన్నవత్ ॥ 26

మైత్రేయుడు ఇట్లు పలికెను

ఆ బ్రహ్మ ఈ విధముగా తపస్సు చేసి చక్కగా ఉపాసించి, ఏకాగ్రమగు చిత్తముతో భగవానుని దర్శించెను. మనస్సునకు, వాక్కునకు వీలైనంతవరకు స్తుతించి అలసిపోయినవాడి మాదిరిగా మౌనముగా నుండెను. 26

టీ:- స్వేతి. స్వస్య సంభవో యస్మాత్తం తపశ్శారీరం విదాసి ఉపాసనా సమాధిరైకాగ్ర్యం. తైర్నిశామ్య దృష్ట్వా యావన్మనో వచః యథా శక్తి స్తుత్వా ఖిన్నవత్ శ్రాంతవద్విరరామ. 26

శ్లో॥ అథాభిప్రేతమన్వీక్ష్య బ్రహ్మణో మధుసూదనః ।
విషణ్ణ చేతసం తేన కల్పవ్యతికరాంభసా ॥ 27

టీ:- అథేతి. కల్పవ్యతికరాంభసా ప్రళయోదకేన విషణ్ణ చేతసః ఆత్మనః. 27

బ్రహ్మదేవుడు తాను చేయవలసిన జగత్ సృష్టి విషయములలో ఖిన్నుడై యుండెను. విజ్ఞానమును పొందగోరినవాడై యుండెను. ప్రళయకాల జలములను చూచి భయపడెను. అట్టి బ్రహ్మదేవుని అభిప్రాయము నెఱిగిన మధుసూదన భగవానుడు, ఆయన మోహమును తొలగిస్తూ గంభీరమగు వాక్కుతో ఇట్లు పలికెను. (27-28)

శ్లో॥ లోకసంస్థాన విజ్ఞాన ఆత్మనః పరిఖిద్యతః ।
తమాహాగాధయా వాచా కశ్మలం శమయన్నివ ॥28

టీ:- లోకేతి. లోకసంస్థాన విజ్ఞానే పరిఖిద్యతః. బ్రహ్మణః అభిప్రేత మాలక్ష్య తమాహ - కశ్మలం మోహమివేతి సమస్తమోహ శమనం దర్శయతి. 28

శ్రీ భగవానువాచ

శ్లో॥ మా వేదగర్భ గాస్తంద్రీం సర్గ ఉద్యమమావహ ।
తన్మయాపాదితం హ్యగ్రే యన్మాం ప్రార్థయతే భవాన్ ॥ 29

టీ:- మేతి. హే వేదగర్భ బ్రహ్మన్ తంద్రీం విషాదాకృతమాలస్యం మాగాః. సర్గే ఉద్యోగం కురు. తేనైవ మే దృశమనుస్పృశతాదిత్యాది యత్ ప్రార్థయతే తదగ్రే పూర్వమేవ మయా సంపాదితం హి. 29

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను

ఓ బ్రహ్మా! వేదగర్భుడవైన నీవు దుఃఖమును, అలసత్వమును వదలుము. సృష్టిచేయుటకై ప్రయత్నింపుము. నీవు నన్ను కోరినదానిని నీకు ముందే సమకూర్చిపెట్టితిని. 29

శ్లో॥ భూయస్త్వం తప ఆతిష్ఠ విద్యాం చైవ మదాశ్రయామ్ ।
తాభ్యామంతర్హృది బ్రహ్మన్ లోకాన్ ద్రక్ష్యస్యపావృతాన్ ॥30

టీ:- భూయఇతి. తర్హి కథమహం న జానామీత్యత ఆహ - అపావృతాన్ సుస్పష్టాన్. 30

ఓ బ్రహ్మా! నీవు మరల తపస్సు చేయుము. నా ఉపాసన చేయుము. ఈ తపస్సు, ఉపాసనలచే నీవు అంతఃకరణమునందు లోకములన్నింటిని స్పష్టముగా చూడగల్గుదువు. 30

శ్లో॥ తత ఆత్మని లోకే చ భక్తియుక్తః సమాహితః ।
ద్రష్టాஉసి మాం తతం బ్రహ్మన్మయిలోకాంస్త్వమాత్మనః ॥31

టీ:- తతమితి. భక్తియుక్త స్సమాహితస్త్వం పరం బ్రహ్మ రూపం మమాత్మని స్వస్మిన్ లోకే చ తతం వ్యాప్య స్థితం ద్రష్టాసి ద్రక్ష్యసి ఆత్మన ఆత్మసంబంధినో జీవాంశ్చ మయి. 31

ఓ బ్రహ్మా! తరువాత నీవు భక్తిగలవాడవై, ఏకాగ్రచిత్తుడవై నీ యందును, ఈ సమస్త జగత్తు యందును వ్యాపించి యున్న నన్ను చూడగలవు. అంతేగాక నాలో సర్వలోకములను, నిన్నును చూడ గలవు. 31

శ్లో॥ యదా తు సర్వభూతేషు దారుష్వగ్నిమివ స్థితమ్ ।
ప్రతిచక్షీత మాం లోకో జహ్యాత్తర్హ్యేవ కశ్మలమ్ ॥ 32

టీ:- సర్వత్ర మద్దర్శనాన్మోహో నివర్తత ఇత్యాహ-యదేతి. ప్రతిచక్షీత పశ్యేత్. 32

కట్టెలో నిప్పు అంతర్హితమై వ్యాపించి యుండును. అట్లే నేను సకల ప్రాణులలో వ్యాపించి యుందును. మానవుడు ఈ నిజమును ఎప్పుడు గ్రహించునో అప్పుడే అతని మోహమాలిన్యం తొలగును. 32

శ్లో॥ యదా రహితమాత్మానం భూతేంద్రియగుణాశయైః ।
స్వరూపేణ మయోపేతం పశ్యన్ స్వారాజ్యమృచ్ఛతి ॥ 33

టీ:- యదా మిథ్యాజ్ఞాన నివృత్తౌ ముచ్యత ఇత్యాహ-యదేతి. భూతాదిభిః విరహితమాత్మానం జీవం శుద్ధత్వంపదార్థం స్వరూపేణ స్వస్యాత్మభూతేన మయా తత్పదార్థేన ఉపేతమేకీభూతం పశ్యన్ భవతి తదా స్వారాజ్యం మోక్షం ప్రాప్నోతి. 33

జీవుడు తాను, పంచ భూతములు, దశ ఇంద్రియములు, త్రిగుణములు, అంతఃకరణము అనువాని కంటె భిన్నుడనని తలచ-వలెను. "తత్-త్వం-అసి" అని గురువు చెప్పే ఉపదేశవాక్యములోని "త్వం" అనే పదవాచ్యుడైన జీవుడు "తత్" అను పదముచే చెప్పబడు పరమాత్మునితో (ఉపేతుడు) కలసిపోవలెను. అప్పుడు వెంటనే మోక్షసామ్రాజ్యమును పొందును. 33

శ్లో॥ నానా కర్మ వితానేన ప్రజా బహ్వీః సిసృక్షతః ।
నాత్మవసీదత్యస్మింస్తే వర్షీయాన్ మదనుగ్రహః ॥ 34

టీ:- నానేతి. వర్షీయాన్ ప్రవృద్ధతరః అత్యధికోఽస్తీత్యర్థః. 34

నానా విధములగు కర్మసంస్కారములుగల అనేక విధములగు జీవులను నీవు సృష్టింపగోరుచున్నావు. నీ యందు నాకు అనుగ్రహము ఉండుటచే సృష్టి విషయములో నీ చిత్తము వ్యామోహము పొందదు. 34

శ్లో॥ ఋషిమాద్యం న బధ్నాతి పాపీయాంస్త్వాం రజోగుణః ।
యన్మనో మయి నిర్బద్ధం ప్రజాః సంసృజతోఽపి తే ॥ 35

టీ:- అనుగ్రహమేవ దర్శయతి-చతుర్భిః. ఋషిమితి. ప్రజాస్సంసృజతోఽపితే తవ మనః యద్యతో మయి నిర్బంధం నితరాం పసక్తం. 35

నీవు సృష్టి చేయవలెనను కోరికతోనున్నను పాపయుతమగు రజోగుణము నిన్నంటదు. మంత్ర ద్రష్టవగు నీవు నీ మనస్సును నా యందు దృఢముగ నిలిపియుంచుట వలన అది సాధ్యము. 35

శ్లో॥ జ్ఞాతోఽహం భవతా త్వద్య దుర్విజ్ఞేయోఽపి దేహినామ్ ।
యన్మాంత్వం మన్యసేఽయుక్తం భూతేంద్రియగుణాత్మభిః॥36

టీ:- జ్ఞాతఇతి. యద్యస్మాద్భూతైరింద్రియైర్గుణైస్సత్వాదిభిః ఆత్మనా అహంకారేణ చాయుక్తం మన్యసే. 36

నేను మానవులకు (దేహధారులకు) అంత సులభముగా తెలియబడను. చాలా క్లేశముతో మాత్రమే తెలియుదును. అయినను నన్ను నీవు తెలుసు కున్నావు. ఎందుకనగా నన్ను నీవు పంచభూతములకు, త్రిగుణములకు, అంతఃకరణచతుష్టయము కంటె భిన్నుడనని తెలుసుకున్నావు. 36

శ్లో॥ తుభ్యం మద్విచికిత్సాయామాత్మా మే దర్శితో ఽబహిః ।
నాళేణ సలిలే మూలం పుష్కరస్య విచిన్వతః ॥ 37

తామరతూడు ద్వారా జలములందు ప్రవేశించి ఆ పద్మము యొక్క మూలమును అన్వేషించితివి. అప్పుడు నీకు ఆశ్రయమెవరైనా

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- తుభ్యమితి. నాళేణ నాళరూపమార్గేణ పుష్కరస్య మూలమధిష్ఠానం సలిలే విచిన్వతః తుభ్యం తవ. ఆర్షోఽయం విభక్తి వ్యత్యయః మయి విచికిత్సాయాం భవితవ్యంస్యాశ్రయేణ న చ దృశ్యతే. అతోఽస్తి నాస్తీతి వా సందేహే సత్యాత్మా స్వరూపం మే మయా అబహిరంతర్హృది దర్శితః. 37

ఉన్నారా? లేరా? అనే సంశయము కలిగినది. ఆ సమయమున నీ అంతఃకరణమున నా స్వరూపమును చూపించితిని. 37

శ్లో॥ యచ్చకర్థాంగ మత్ స్తోత్రం మత్కథాభ్యుదయాంకితమ్ ।
యద్వా తపసి తే నిష్ఠా స ఏష మదనుగ్రహః ॥ 38

టీ:- యదితి. అంగ హే బ్రహ్మన్ చకర్థ కృతవానసి. మత్కథాభ్యుదయస్తేనాంకితం ఏష బంధాభావః మయి మనోనిర్బంధమజ్ఞానం తద్రూపస్య హృది దర్శనం స్తుతిస్తపోనిష్ఠా చేతి యత్సఏష సర్వో మదనుగ్రహః. 38

ఓ బ్రహ్మా! నీవు నా గాథల వైభవముతో గూడిన గొప్ప స్తోత్రమును చేసితివి. తపస్సు చేయుట యందు గొప్ప నిష్ఠగలవాడవైతివి. ఇదంతయు నా అనుగ్రహముగా భావింపుము. 38

శ్లో॥ ప్రీతోఽహమస్తు భద్రం తే లోకానాం విజయేచ్ఛయా ।
యదస్తౌషీర్గుణమయం నిర్గుణం మానువర్ణయన్ ॥ 39

టీ:- ప్రీత ఇతి. గుణమయత్వేన ప్రతీయమానమపి నిర్గుణమేవానువర్ణయన్. 39

నేను సామాన్యులకు గుణసంపన్నుడుగ భాసింతును. కాని గుణరహితుడను. లోక సృష్టి చేయు కోరికతో నన్ను గుణరహితుడిగ వర్ణించితివి. అందువలన నేను సంప్రీతుడనైతిని. నీకు శుభము కలుగుగాక!. 39

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ య ఏతేన పుమాన్నిత్యం స్తుత్వా స్తోత్రేణ మాం భజేత్ ।
తస్యాశుసంప్రసీదేయం సర్వకామవరేశ్వరః ॥ 40

టీ:- తవ ప్రీత ఇతి కిం వక్తవ్యమిత్యాహ - యఇతి. య ఏతేన మత్ స్తోత్రేణ స్తువన్ సన్ మాం భజేత్ సర్వకామ వరప్రదః. 40

(నా అనుగ్రహము కేవలము నీయందు మాత్రమే కాదంటూ చెప్పుచున్నాడు). ఏ మానవుడు ప్రతిరోజూ నన్ను ఈ స్తోత్రముతో కీర్తించునో, వానికి నేను ప్రసన్నుడనగుదును వారి కోరికలన్నింటినీ వెంటనే తీర్చెదను. 40

శ్లో॥ పూర్తేన తపసా యజ్ఞైర్దానైర్యోగ సమాధినా ।
రాద్ధం నిః శ్రేయసం పుంసాం మత్ప్రీతిస్తత్త్వవిన్మతమ్ ॥ 41

టీ:- న చ మత్ప్రీతేరప్యధికం కించిదస్తీత్యాహ-పూర్తేనేతి. పూర్తాదిభిః రాద్ధం సిద్ధంయన్నిశ్రేయసఫలం, తన్మత్ప్రీతిరేవేతి తత్త్వవిన్మతం. 41

ఇష్టాపూర్తి, (తటాకాదికములను నిర్మించడం) తపస్సు, యజ్ఞములు, యోగము, సమాధి మున్నగువాటిచే సిద్ధించే ఫలము నేను సంతోషించుటయే యని తత్త్వవేత్తల సిద్ధాంతము. నేను సంతోషించుట కంటె ఇవేవీ గొప్పవి కావనియు, పై వాటిచే లభించు ఫలము భగవత్ప్రీతికి మార్గములనుయు అభిప్రాయము. 41

శ్లో॥ అహమాత్మాత్మనాం ధాతః ప్రేష్ఠః సన్ప్రేయసామపి ।
అతో మయి రతిం కుర్యాద్దేహాదిర్యత్కృతే ప్రియః ॥ 42

టీ:- అత్రహేతుమాహ - అహమితి. ఆత్మనామహంకారోపాధీనాం జీవానాం, అహమాత్మా స్వరూపం అతః ప్రేయసామతి ప్రియాణామపి మధ్యే ప్రేష్ఠః. ప్రియతమస్సన్ నిరవద్యః యత్కృతే యదర్థే దేహాదిః దేహజాయాత్మజాదిరప్రియోఽనిష్టః. 42

ఓ బ్రహ్మా! జీవులకు భార్య,బిడ్డలు మొదలగు అనేక ప్రియ వస్తువులు కలవు. వాటి అన్నింటి కంటె “ఆత్మ” మిక్కిలి ప్రియమైనది. జీవులన్నింటిలో ఆత్మస్వరూపుడనై యున్నవాడను నేనే. చైతన్య స్వరూప మైన ఆత్మయొక్క ప్రకాశము చేతనే దేహాదులు చైతన్య వంతములవలె ప్రతి ఫలించుచున్నవి. అందుకే దేహము మిక్కిలి ప్రియతమగుచున్నది. కావున మానవుడు ఆత్మస్వరూపుడనగు నా యందు భక్తిని కలిగి యుండవలెను. 42

శ్లో॥ సర్వ వేదమయేనేదమాత్మనాత్మాత్మయోనినా ।
ప్రజాః సృజ యథాపూర్వం యాశ్చ మయ్యనుశేరతే ॥ 43

టీ:- అతస్త్వం కృతార్థఏవ తథాపి మత్ప్రియార్థం సృష్టిం కుర్విత్యాహ- సర్వేతి. ఆత్మా త్వమిదం త్రైలోక్యం. యా మయ్యనుశేరతే తాః ప్రజాశ్చ కేన ఆత్మనైవాన్య నిరపేక్షేణ. తత్ర జ్ఞాపకాపేక్షాభావమాహ - సర్వ వేదమయేనేతి. ఆత్మా అహం యోనిః కారణంయస్యేతి జ్ఞాన క్రియాశక్త్యతి శయం సూచయతి-యథాపూర్వమితి. తవాత్రాయాసోనా స్తీత్యుక్తం. మయ్యనుశేరత ఇతి స్థితానామభివ్యక్తి మాత్రమేవ కర్తవ్యమిత్య నాయా సత్వముక్తం. 43

సకల ప్రాణులు ఇప్పుడు నా యందు లీనమై నిద్రించుచున్నవి. నీవు నా నుండే ఏర్పడినావు. సకల వేదస్వరూపుడవైన నీవు ఈ ప్రపంచమును, ప్రాణులను పూర్వము వలెనే తిరిగి సృష్టించుము. 43

మైత్రేయ ఉవాచ

శ్లో॥ తస్మా ఏవం జగత్స్రష్టే ప్రధానపురుషేశ్వరః ।
వ్యజ్యేదం స్వేన రూపేణ కంజనాభస్తిరోదధే ॥ 44

టీ:- తస్మా ఇతి. ఇదం సృజ్యం. వ్యజ్యప్రకాశ్యకంజనాభః పద్మనాభః శ్రీనారాయణః స్వరూపేణ తిరోదధే అంతర్హితోఽభూత్. 44

మైత్రేయుడు ఇట్లు పలికెను:

పద్మనాభుడును, ప్రకృతి జీవులకు ఈశ్వరుడును అయిన శ్రీహరి సృష్టికర్తయగు బ్రహ్మదేవునకు సృష్టించవలసిన జగత్తును గురించి తెలియజేసి, తన రూపమును అంతర్ధానముచేసినాడు. 44

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే, వద్మోద్భవే విదుర మైత్రేయ సంవాదే నవమోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

దశమోఽధ్యాయః

శ్లో. దశమే కాలసంప్రశ్న ప్రాప్తి వక్తుం తదుద్భవః ।
ప్రాకృతాదివిభాగేన సర్గస్తు దశధోచ్యతే ॥

విదుర ఉవాచ

శ్లో॥ అన్తర్హితే భగవతి బ్రహ్మా లోకపితామహః ।
ప్రజాః ససర్జ కతిధా దైహికీర్మానసీర్విభుః ॥ 1

టీ:- య ఇతి. మేమయా. అద్ధా తత్వేన వదస్వ తాన్ ప్రశ్నానుత్తర రూపేణ సమ్యక్ప్రకాశయేత్యర్థః. (1,2)

శ్లో॥ యే చ మే భగవన్ పృష్టాస్త్వయ్యర్థా బహువిత్తమ ।
తాన్ వదస్వానుపూర్వ్యేణ ఛింధి నః సర్వసంశయాన్ ॥ 2

సూత ఉవాచ

శ్లో॥ ఏవం సంచోదితస్తేన క్షత్త్రా కౌషారవో మునిః
ప్రీతః ప్రత్యాహ తాన్ ప్రశ్నాన్ హృదిస్థానథ భార్గవ ॥ 3

టీ:- ఏవమితి. ఇతి సంబోధితః ప్రార్థితః హృదిస్థానేవాహ, న తు తే ప్రశ్నాస్తేన విస్మృతా ఇత్యర్థః. 3

10వ అధ్యాయము

ఈ పదియవ అధ్యాయమున కాలవిషయకమగు ప్రశ్నలకు సమాధానములు ఇవ్వబడినవి. ప్రాకృతాది బేధములతో ఆ యా కాలములో ఉత్పన్నమగు పదివిధములగు సృష్టులు వర్ణింపబడినవి.

విదురుడు ఇట్లు పలికెను

భగవానుడైన శ్రీహరి అంతర్ధాన మొందిన పిమ్మట లోక పితామహుడగు బ్రహ్మదేవుడు తన దేహమునుండి మరియు తన మనస్సు నుండి ఎన్ని విధములైన ప్రాణులను సృష్టి గావించినాడు? ఎన్ని రకములుగా సృష్టించినాడు? 1

ఓ పూజ్యుడా! ఓ జ్ఞానసంపన్నా! నేను నిన్ను కొన్ని విషయముల గురించి ప్రశ్నించియుంటిని. వాటన్నింటికి క్రమముగా సమాధాన ములు చెప్పి నా సర్వసంశయములను నివృత్తి చేయుము. 2

శ్రీ సూతుడు ఇట్లనెను

భృగునందనుడవగు ఓ శౌనకా! విదురునిచే (ప్రార్థింపబడిన) ప్రేరేపింపబడిన మైత్రేయమహర్షి సంతోషించెను. తన హృదయములో నున్న ఆ ప్రశ్నలకు సమాధానమును చెప్పెను. 3

మైత్రేయ ఉవాచ

శ్లో॥ విరించోఽపి తథా చక్రే దివ్యం వర్షశతం తపః ।
ఆత్మన్యాత్మానమావేశ్య యదాహ భగవానజః ॥ 4

టీ:- విరించ ఇతి. ఆత్మని శ్రీనారాయణే. ఆత్మానం మనః. 4

మైత్రేయుడు పలికెను

జన్మరహితుడగు శ్రీహరిభగవానుడు చెప్పిన విధముగా బ్రహ్మదేవుడు తన బుద్ధిని ఆత్మచైతన్యము నందు నిలిపి నూరు దివ్య సంవత్సరముల కాలము తపస్సు చేసెను. 4

శ్లో॥ తద్విలోక్యాబ్జ సంభూతో వాయునా యదధిష్ఠితః ।
పద్మమంభశ్చ తత్కాలకృత వీర్యేణ కంపితమ్ ॥ 5

టీ:- తదితి. అబ్జ సంభూతో బ్రహ్మా యదధిష్ఠితః యదధిష్ఠాయ స్థితః కర్తరిక్తః. తత్పద్మమంభశ్చ విలోక్య కథంభూతం పద్మమంభశ్చ తత్కాల కృత వీర్యేణ కంపితం తేన ప్రళయకాలేన కృతం వీర్యం యస్య తేన వాయునా కంపితం. 5

బ్రహ్మదేవుడు నీటిలోని పద్మము నుండి పుట్టినవాడై పద్మమును అధిష్ఠించి యుండెను. ప్రళయకాలము నందలి వాయువు మిక్కిలి బలము కలదై ఆ పద్మమును, జలములను మిక్కిలి కంపింప చేయు చుండుటను బ్రహ్మ చూచెను. 5

శ్లో॥ తపసా హ్యేధమానేన విద్యయా చాత్మసంస్థయా ।
వివృద్ధ విజ్ఞానబలో న్యపాద్వాయుం సహాంభసా ॥ 6

టీ:- తపసేతి. విలోకనానంతరమంభసా సహ తం వాయుం న్యపాత్. పాపాన ఇతి ధాతుః. సర్వం పీతవాన్ కథంభూతోఽబ్జసంభూతః? ఏధమానేన తపసా ఆత్మసంస్థయా విద్యయా చ వివృద్ధయా విజ్ఞానం బలం చ యస్య స ఇతి. 6

బ్రహ్మ యొక్క తపస్సు వృద్ధినిపొందెను. హృదయము నందు నెలకొన్న ఆత్మజ్ఞానముచే విజ్ఞానశక్తి సంపన్నుడాయెను. ఇట్టి బ్రహ్మదేవుడు ప్రళయజలముతో బాటు వాయువును కూడా త్రాగి వేసెను. 6

శ్లో॥ తద్విలోక్య వియద్వ్యాపి పుష్కరం యదధిష్ఠితమ్ ।
అనేన లోకాన్ ప్రాగ్లీనాన్ కల్పితాఽస్మీత్యచింతయత్ ॥ 7

టీ:- తదితి. పుష్కరం పద్మం ప్రాగ్లీనాన్ త్రిలోకాన్ కల్పితోఽస్మితి చింతితవాన్. 7

బ్రహ్మదేవుడు ఆకాశమున వ్యాపించియున్న పద్మమునందు ఆసీనుడైయుండెను. ఆ పద్మమును చూచి ఈ పద్మముతోనే కల్పాంతము నందు లీనమైయున్న లోకములను మరల సృష్టించెదను అని తలచెను. 7

శ్లో॥ పద్మకోశం తదావిశ్య భగవత్కర్మచోదితః ।
ఏకం వ్యభాంక్షీదురుధా త్రిధా భావ్యం ద్విసప్తధా ॥ 8

టీ:- పద్మకోశమితి. భగవత్కర్మచోదితః భగవతా శ్రీనారాయణేన. సచయదా కరణీయే కర్మణి చోదితో నియుక్తస్సన్. తదా పద్మకోశం ప్రవిశ్య. తమేకమేవ త్రిధాలోక త్రయ రూపేణ వ్యభాం క్షీత్ విబభాజ. ఏకేన కమలముకుళేన కథం లోకత్రయ సృష్టిరిత్య సంభావనాం నివారయితుం తస్య విశాలతామాహ-ద్విసప్తధా చతుర్దశ లోక రూపేణ ఉరుధా తతోఽపి బహుప్రకారేణ భావ్యం భావితుం యోగ్యమతో న తేన త్రిలోకీకరణం చిత్రమిత్యర్థః. 8

శ్రీహరి చేత కర్తవ్యకర్మయగు సృష్టి చేయుట యందు ప్రేరేపింప బడినవాడై బ్రహ్మదేవుడు పద్మకోశమును అధిష్ఠించెను. ఆ పద్మకోశము పదునాలుగు లోకములను గాని అంత కంటె ఎక్కువ లోకములను గాని నిర్మించుటకు తగినదై యుండెను. అట్టి ఒకే పద్మమును బ్రహ్మ దేవుడు మూడు లోకములుగా విభజించెను. 8

శ్లో॥ ఏతావాన్ జీవలోకస్య సంస్థాభేద స్సమాహృతః ।
ధర్మస్య హ్యనిమిత్తస్య విపాకః పరమేష్ఠ్యసౌ ॥ 9

జీవులకు భోగస్థానములగు ఈ మూడు లోకములు సృష్టింపబడునని శాస్త్రములు చెప్పుచున్నవి. ప్రతి కల్పమునందును

టీ:- త్రిలోక రూపేణైవ విభాగే హేతుమాహ- ఏతావానితి. ఏతావాం స్త్రిలోకీరూపః జీవలోకరూపః. జీవలోకస్య జీవానాం లోకస్య- భోగ స్థానస్య ప్రత్యహం సృజ్యస్య సంస్థాభేదో రచనావిశేషః సమాహృతః ఉక్తః. నను పరమేష్ఠినోఽపి జీవత్వావిశేషాద్బ్రహ్మలోకస్యాపి కిమితి ప్రత్యహం సృష్టిర్న భవతి తత్రాహ-హి యస్మాదనిమిత్తస్య నిష్కామస్య ధర్మస్య విపాకః ఫలరూపః అసౌ పరమేష్ఠీ ఏతదుపలక్షణం. సత్యలోకస్య మహః ప్రభృతి లోకానాం తద్వాసినాం చ త్రైలోక్యస్య కామ్యకర్మ ఫలత్వాత్ ప్రతి కల్పముత్పత్తి వినాశౌ భవతః.మహః ప్రభృతీనాం తూపాసనాసముదిత నిష్కామ ఫలత్వాత్ ద్విపరార్ధపర్యంతం న నాశః తత్ర స్థానాం చ తతః ప్రాయేణ ముక్తిరితి భావః. కాలభేదేన లోకసృష్టి భేదః. 9

ఈ మూడులోకములకు ఉత్పత్తి వినాశములు జరుగుచుండును. మూడు లోకములను ప్రత్యేకముగా విభజించుటకు కారణము చెప్పు చున్నాడు. మహర్లోకము మొదలుకొని ఇతర లోకములు నిష్కామకర్మ చేసికొన్న వారికి లభించును. ఈ లోకములకు ద్విపరార్ధము వరకు నాశనముండదు. అచట నుండిన వారికి ఆ తరువాత ముక్తి కలుగునని భావము. 9

విదుర ఉవాచ

శ్లో॥ యదాత్థ బహురూపస్య హరేరద్భుతకర్మణః ।
కాలాఖ్యం లక్షణం బ్రహ్మన్ యథా వర్ణయ నః ప్రభో ॥ 10

టీ:- శ్రుత్వాతమేవ కాలం జిజ్ఞాసుః పృచ్ఛతి-యదితి. యత్కాలాఖ్యం లక్షణం స్వరూపం ఆత్థ అబ్రవీః, కథం కాలః కల్ప్యతే కిం వా తస్య స్థూలం సూక్ష్మం రూపమితి. యథా వద్వర్ణయేత్యర్థః. అత్ర సామాన్యతః కాలస్య స్వరూపముచ్యతే.ఉత్తరాధ్యాయే తు విశేషతః. 10

విదురుడు ఈ విధముగా పలికెను.

(కాలభేదముననుసరించి లోక సృష్టి భేద ముండునని జిజ్ఞాసువై అడుగుచున్నాడు). ఓ ప్రభూ!ఓ మహర్షీ! భగవంతుడు అనేక రూపములు ధరించి అత్యద్భుతములగు లీలలను చేయుచుండును. ఆయన యొక్క “కాలము” అను స్వరూపమును గూర్చి చెప్పియుంటివి. దానిని నాకు వివరించి చెప్పవలసినది.(ఇచట కాల స్వరూపము సామాన్యముగా చెప్పబడినది. తరువాతి అధ్యాయములో విశేషముగా చెప్పబడును) 10

మైత్రేయ ఉవాచ

శ్లో॥ గుణ వ్యతికరాకారో నిర్విశేషోऽప్రతిష్ఠితః ।
పురుషస్తదుపాదానమాత్మానం లీలయాऽసృజత్ ॥11

టీ:- గుణేతి. గుణానాం వ్యతిరేకో మహదాదేః పరిణామః, తేనైవ క్రియతే స్వకాల ఇతి శేషః. వక్ష్యతే చైకాదశే. శ్లో. గుణవ్యతికరః కాలస్స్వభావ స్సూత్రమేవ. చేతి. వస్తుతస్తు నిర్విశేషః అప్రతిష్ఠితః ఆద్యంత శూన్య ఇత్యర్థః. ఏతదేవ దర్శయితు మీశ్వర సృష్ట్యాదికం తేన నిమిత్త భూతేన కరోతీత్యాహ-ఉత్తరార్ధేన. ఉపాదీయతే నిమిత్తతయా స్వీక్రియత ఇత్యుపాదానం నిమిత్తం యస్మిన్ తమాత్మానమేవ విశ్వ రూపేణా సృజత్ స్వవ్యతిరేకేణ సృజ్యత్వాభావాదేతచ్చ వస్తు కథన మాత్రం. కాలేన నిమిత్తేనా సృజదిత్యేతావదేవ వివక్షితం. 11

శ్లో॥ విశ్వం వై బ్రహ్మ తన్మాత్రం సంస్థితం విష్ణుమాయయా ।
ఈశ్వరేణ పరిచ్ఛిన్నం కాలేనావ్యక్తమూర్తినా ॥ 12

టీ:- స్వవ్యతిరిక్త సృజ్యాభావం దర్శయన్కాలస్య సృష్టి నిమిత్తతాం దర్శయతి-విశ్వమితి. శ్రీవిష్ణు మాయయా సంస్థితం సంభృతం బ్రహ్మ తన్మాత్రం యద్విశ్వం తద్విశ్వేశ్వరేణ కర్త్రా. కాలేన పరిచ్ఛిన్నం పృథక్ ప్రకాశితం అవ్యక్తామూర్తిః స్వరూపం యస్యేతి స్వతో నిర్విశేషం దర్శితం. 12

మైత్రేయుడు ఇట్లు పలికెను.

సత్త్వము, రజస్సు, తమస్సు అనే త్రిగుణాత్మకమగు ప్రకృతిలో కలిగే పరిణామమే(మార్పే) "కాలము" యొక్క స్వరూపము. "గుణ వ్యతికరో కాలః స్వభావః సూత్రమేవ చ" స్వతస్సిద్ధముగా ఈ కాలము నిర్విశేషము(విశేషములులేనిది). భగవంతుడు ఆద్యంత శూన్యుడు, రూప రహితుడే అయినను ప్రకృతి యొక్క మార్పును (కాలమును) ఉపాధిగా స్వీకరించి సాకారుడు, సగుణుడు అగుచున్నాడు. తన మహిమ యందు ప్రతిష్ఠితుడైన భగవానునకు మరియొక ఆశ్రయము లేదు. ఆయన "కాలము"ను ఉపాదానముగా (ముడిసరుకు) గా చేసి కొని తనను తానే "ప్రపంచ" రూపముగా సృష్టించుకొనెను. 11

ఈ సృష్టి భగవత్ స్వరూపము కన్న భిన్నము కాదని, "కాలము" యొక్క నిమిత్తతను తెలుపుచున్నాడు. విష్ణుమాయచే ఈ విశ్వము బ్రహ్మ రూపముగా విలీనమైయుండెను (బ్రహ్మలో విలీనమైయుండెను). అది మరల అవ్యక్త స్వరూపుడగు ఈశ్వరుని స్వరూపమైన "కాలము" ద్వారా భిన్నముగా ప్రకటితమయ్యెను. విడిగా ఏర్పడెనని అర్థము. 12

శ్లో॥ యథేదానీం తథాఽగ్రే చ పశ్చాదప్యేతదీదృశమ్ ।
సర్గో నవవిధస్తస్య ప్రాకృతో వైకృతస్తుయః ॥ 13

టీ:- అప్రతిష్ఠితత్వం దర్శయితుం తత్కార్యస్య విశ్వప్రవాహస్యాప్య ప్రతిష్ఠితత్వమాహ-యథేతి. యథేదానీవేతద్విశ్వమస్తి తథాగ్రే చ పూర్వ మప్యాసీత్పశ్చాదపీ దృశం భవిష్యతి. ఏవం సామాన్యతః కాలం నిరూప్య విశేషతో నిరూపయిష్యన్ తన్నిమిత్తస్య సర్గస్య పూర్వోక్తానేవ భేదా ననువదతి. విశ్వసర్గో నవవిధః. మహదాది నవ ప్రకారః అస్య నవ విధస్య సర్గస్య చ యస్తు ప్రాకృతో వైకృతశ్చ దశమః కౌమారః. 13

ఈ ప్రపంచము యొక్క అస్థిరత్వమును నిరూపించుచున్నాడు. ఈ ప్రపంచము ఇప్పుడు ఎలా ఉన్నదో గతంలో కూడా అలాగే ఉండెను. భవిష్యత్తులో కూడా అలాగే ఉండగలదు. మహదాదులుగా విశ్వసృష్టి తొమ్మిది విధములు. ప్రాకృత, వైకృత సృష్టులు కలిపిన కౌమారము అనే సృష్టితో కలిపి మొత్తము పది విధములగు సృష్టులగుచున్నది. (13)

శ్లో॥ కాల ద్రవ్య గుణైరస్య త్రివిధః ప్రతి సంక్రమః ।
ఆద్యస్తు మహతః సర్గో గుణ వైషమ్యమాత్మనః ॥ 14

టీ:- సర్గస్య చ కాలాదిభిస్త్రి విధం ప్రళయమాహ-కాలేతి. కాలేనైవ కేవలేన నిత్యప్రళయః సుషుప్తిః. ద్రవ్యేణ సంకర్షణాదినా నైమిత్తికః గుణైః స్వస్య కార్యాణి గ్రసద్భిః ప్రాకృతికః. తానేవ సర్గాన్ ప్రపంచయతి -ఆద్య ఇత్యాదినా యావదధ్యాయసమాప్తి. మహతస్సర్గః ఆద్యః ఆత్మనః శ్రీహరేస్సకాశాత్ గుణానాం వైషమ్యయిత్యేతన్మహతో లక్షణం. 14

ఇచట మూడువిధములగు ప్రళయములను చెప్పినాడు. ఈ పదవసృష్టికి మూడువిధములగు ప్రళయములు కలుగును. కాల, ద్రవ్య, గుణముల ద్వారా ఈ ప్రళయములు కలుగును. కాల నిమిత్తముగా జరిగేది నిత్యప్రళయము. ద్రవ్యము నిమిత్తముగా జరిగేది నైమిత్తికప్రళయము. తమ తమ కార్యములను గ్రహించు "గుణ" సమూహమైనది ప్రాకృతిక ప్రళయము. ఆ భగవానుని మాయా శక్తియొక్క గుణములు సత్త్వము, రజస్సు, తమస్సులు. ఈ మూడింటిలో ఏర్పడిన అసమానత్వము (వైషమ్యము) కారణముగా ఏర్పడినదే మహత్ తత్త్వము. ఈ మహత్తత్వమే దశవిధ సృష్టులలో మొదటిది. 14

శ్లో॥ ద్వితీయ స్త్వహమో యత్ర ద్రవ్య జ్ఞాన క్రియోదయః ।
భూత సర్గస్తృతీయస్తు తన్మాత్ర ద్రవ్య శక్తిమాన్ ॥ 15

టీ:- ద్వితీయ ఇతి. అహమః అహంకారస్య సర్గో ద్వితీయః తస్య లక్షణం యస్త్వితి. ద్రవ్యాదయో వక్ష్యమాణాస్త్రయః. తన్మాత్రస్తన్మాత్రాది భూతసర్గః. సూక్ష్మ భూత సర్గ ఇత్యర్థః. ద్రవ్యశక్తిర్మహాభూతోత్పాదికా. 15

దశ విధ సృష్టులలో రెండవది "అహంకారము". ఈ అహంకారము నుండే పంచభూతములు, అయిదు జ్ఞానేంద్రియములు మరియు అయిదు కర్మేంద్రియములు పుట్టినవి. మూడవ సృష్టి "భూత సృష్టి". అయిదు మహాభూతములు, అయిదు "తన్మాత్రలు" ఇందులో నుండును. ఈ తన్మాత్రలనే "సూక్ష్మభూతములు" అందురు. ఈ "తన్మాత్రల"కు పంచభూతములను ప్రకటింపజేసే శక్తి యుండును. 15

శ్లో॥ చతుర్థ ఐంద్రియన్ సర్గో యస్తు జ్ఞాన క్రియాత్మకః ।
వైకారికో దేవసర్గః పంచమో యన్మయం మనః ॥ 16

టీ:- చతుర్థ ఇతి. జ్ఞాన కర్మేంద్రియాత్మకో య ఇంద్రియసర్గః స చతుర్థః. 16

దశ విధ సృష్టులలో నాలుగవది జ్ఞానేంద్రియ, కర్మేంద్రియముల సృష్టి. దశవిధ సృష్టులలో అయిదవది "దేవతాసృష్టి". సాత్వికాహంకారము నుండి ఇంద్రియాధిష్ఠాన దేవతలు ఏర్పడుదురు. "మనస్సు" కూడా ప్రకటమగును. ఈ మనస్సు కూడా అయిదవ సృష్టి లోనిదే. 16

శ్లో॥ షష్ఠస్తు తమసః సర్గో యస్త్వబుద్ధికృతః ప్రభోః ।
షడిమే ప్రాకృతాః సర్గా వైకృతానపి మే శ్రుణు ॥ 17

టీ:- షష్ఠ ఇతి. తమసః పంచ పర్వా విద్యాయాః అబుద్ధిర్నామ జీవానామావరణం విక్షేపశ్చతౌ కరోతీత్య బుద్ధి కృత్ తస్య తమసః యస్తమసస్సర్గః షష్ఠః మే మత్తః. 17

ఓ విదురా! ఆరవది అవిద్యా సృష్టి. ఇది జీవులకు ఆవరణము, విక్షేపమును కలిగించును. ఆవరణము అనగా ఉన్న సత్యపదార్థమును కానరాకుండా చేయునది. విక్షేపము అనగా లేనిది కానవచ్చుట. ఈ అవిద్యయే తమస్సు. ఈ మహత్తత్త్వము, అహంకారము, భూతములు, ఇంద్రియములు, ఇంద్రియాధిష్ఠాన దేవతలు, అవిద్య అను ఆరు ప్రాకృత సృష్టులు (సర్గములు). ఇప్పుడు నేను వైకృత సర్గములను చెప్పెదను. వినుము. 17

శ్లో॥ రజోభాజో భగవతో లీలేయం హరిమేధసః ।
సప్తమో ముఖ్యసర్గస్తు షడ్విధస్తస్థుషాం చ యః ॥ 18

టీ:- అనుద్వేగేనశ్రోతవ్యతామాహ- రజ ఇతి. యద్విషయా మేధా సంసారం హరతీతి హరిమేధాస్తస్య శ్రీహరేర్లీలా యద్వా - ఇయమితి. తమ ఆది సర్గరూపావిద్యా రజోభాజ ఇతి బ్రహ్మరూపస్యేత్యర్థః. తస్మిన్ పక్షే అబుద్ధికృత ఇతి ప్రథమాంతః అనవధానకృత ఇత్యర్థః. తదా యస్త్వబుద్ధి కృత ఇతి యోజనా. వైకృతానాం మధ్యే ముఖమివ ప్రథమం కృతో ముఖ్య సర్గః తస్థుషాం స్థావరాణాం షడ్విధో యశ్చ తస్థుషాం సర్గః ముఖ్యస్తు సప్తమః. 18

శ్లో॥ వనస్పత్యోషధి లతాః త్వక్సారా వీరుధో ద్రుమాః ।
ఉత్స్రోత సస్తమః ప్రాయా అంతఃస్పర్శా విశేషిణః ॥ 19

టీ:- షడ్విధత్వమాహ-వనస్పతీతి. యే పుష్పం వినా ఫలంతి తే అశ్వత్థో దుంబర పనస న్యగ్రోధాదయో వనస్పతయః. యాః పుష్పితాః ఫలపాకాంతాస్తా వ్రీహి యవ ముద్గాదయః ఓషధయః. శ్రు."వర్షస్య రేతో ఓషధయః ఓషధినాం రేతోஉన్నమి"తి శ్రుతేః యాస్తు పుష్పాంతావా ఫలపాకాంతాశ్చ వా ఆరోహణానపేక్షాస్తాః మాలతీ

ఉద్వేగరహితముగా వినవలసినది. భగవంతుని మనస్సులో (బుద్ధిలో) నిలుపుకున్నవారికి సంసారము తొలగిపోవును. బ్రహ్మదేవుడు రజోగుణ ఆశ్రితుడు. భగవానుడు బ్రహ్మదేవుని రూపములో కావించిన లీల ఈ అవిద్యాసృష్టి. ఇక ఏడవది స్థావరముల సృష్టి. స్థావరములు అనగా వృక్షములు మొదలగునవి. శరీరములో ముఖ్య భాగము ముఖము. అట్లే ఈ స్థావరములు సృష్టిలో ముఖ్యమైనవి. కనుక "ముఖ్య సర్గము" అనబడుచున్నది. ఇది వైకృతసృష్టిలో మొట్టమొదటిది. ఈ స్థావర సృష్టి ఆరువిధములుగా నుండును. 18

ఈ స్థావర సృష్టిలో

1.వనస్పతులు - పువ్వులు లేకుండానే ఫలములనిచ్చునవి. మేడి, రావి, మఱ్ఱి మొదలగునవి.

2.ఓషధులు - ఫలించినంతనే నశించునవి. వరి, శనగ, గోధుమ మొదలగునవి.

3.లతలు - ఏదో ఒక చెట్టు మొదలగు దానిని ఆశ్రయించి పెరిగేవి. మల్లెతీగ, తిప్పతీగ మొదలగునవి.

4.త్వక్సారములు - గట్టి బెరడుగలవి. వెదురు మొదలగునవి.

5.వీరుధములు - (పొదలు)పైకి ప్రాకక భూమిమీదనే వ్యాపించునవి.

మల్లికా కారవల్లీ బృహత్యాదయో లతాః త్వక్సారా వేణ్వాదయః లతా ఏవ కాఠిన్యేనారోహణా నపేక్షా వీరుధః యే తు పుష్పైః ఫలంతి తే చూత పున్నాగాదయో ద్రుమాస్తేషాం సాధారణం లక్షణమాహ– ఉత్స్రో తసః ఊర్ధ్వం స్రోతఆసారస్సంచారో యేషాంతే. తమః ప్రాయాః అవ్యక్త చైతన్యాః అంతస్స్పర్శాః స్పర్శమేవ జానంతి నాన్యత్. తదప్యంతరేవ న బహిః విశేషేణ అవ్యవస్థిత పరిణామాద్యనేక భేదవంతః. 19

శ్లో॥ తిరశ్చామష్టమః సర్గః సోఽష్టావింశ ద్విధో మతః ।
అవిదో భూరితమసో ఘ్రాణజ్ఞా హృద్యవేదినః ॥ 20

టీ:– తిర్యక్ స్రోతసాం సర్గమాహ – తిరశ్చామితి. అష్టావింశ ద్విధో ఽష్టా వింశతిభేదః తేషాం లక్షణమేతత్. అవిదః శ్వస్తనజ్ఞాన శూన్యాః భూరి తమసః ఆహారాది జ్ఞానమాత్ర నిష్ఠాః. ఘ్రాణేనైవేష్ట మర్థం జానంతీతి ఘ్రాణజ్ఞాః హృద్యవేదినః దీర్ఘానుసంధాన శూన్యాః తథాచ – శ్రుతిః."అథేతరేషాం పశూనామశనా పిపాసే ఏవాభిజ్ఞానం న విజ్ఞాతం వదంతి. విదుః శ్వస్తనం నలోకాలోకౌత ఏతావంతో భవంతి యథా ప్రజ్ఞం హి సంభవా" ఇతి. 20

కరబూజ, పుచ్చతీగ మొదలగునవి.

6.ద్రుమములు – పూలనుండి కాయలు వచ్చేవి. మామిడి, జామ మొదలగునవి. వీటిలో పోషక రసము నేల నుండి పైకి ప్రసరించును. తమోగుణము ప్రధానము. అంతఃకరణ వికాసము తక్కువ. అంతః స్పర్శ లక్షణము ఎక్కువ. ఈ విధముగా ప్రతి దానిలో ఏదో విశేష గుణముండును. 19

ఎనిమిదవది తిర్యక్కుల సృష్టి. అనగా పశుపక్షాదుల సృష్టి. ఈ సృష్టి పదునెనిమిది విధములుగా నుండును. ఈ పశుపక్షాదులకు భవిష్యత్తును గురించిన కాల జ్ఞానముండదు. తమోగుణము అధికముగా నుండును. ఆహార సంపాదనాదులలోనే జ్ఞానముండును. ఘ్రాణేంద్రియము ద్వారానే విషయమును తెలిసికొనును. ముందు చూపు లేనివి. బుద్ధివికాసము, ఆలోచనాశక్తి యుండదు. 20

శ్లో॥ గౌరజో మహిషః కృష్ణః సూకరో గవయో రురుః ।
ద్విశఫాః పశవశ్చేమే అవిరుష్ట్రశ్చ సత్తమ ॥ 21

టీ:- అష్టావింశతి భేదానాహ-గౌరితి. గవాదయో నవ ద్విశఫాః 21

ఓ సత్పురుషా! పద్దెనిమిది రకములను చెప్పుచున్నాడు. ఆవు, మేక, గేదె, కృష్ణమృగము(లేడి), పంది, గవయ మృగము(గురుపోతు), దుప్పి, గొర్రె, ఒంటె అను ఈ తొమ్మిది రెండుగిట్టలు కలవి. 21

శ్లో॥ ఖరో౽శ్వో౽శ్వతరో గౌరః శరభ శ్చమరీ తథా ।
ఏతే చైకశఫాః క్షత్తః శృణు పంచనఖాన్ పశూన్ ॥ 22

ఓ విదురుడా! గాడిద, గుఱ్ఱము, కంచరగాడిద, గౌరమృగము, శరభము(ఎనిమిదికాళ్ళ మృగము), చమర మృగము అను ఆరు ఒంటి గిట్టలవి. ఇక ఐదు గోళ్ళు గల పశుపక్షాదులను గూర్చి చెప్పెదను వినుము. 22

శ్లో॥ శ్వా సృగాలో వృకో వ్యాఘ్రో మార్జారః శశశల్లకౌ
సింహః కపిర్గజః కూర్మో గోధా చ మకరాదయః ॥ 23

టీ:- శ్వేతి. శ్వాదయో గోధాంతాః ద్వాదశ పంచనఖాః ఏవమేతే భూచరాస్సప్త వింశతిః. మకరాదయో జలచరాః.23

కుక్క, నక్క, తోడేలు, పెద్దపులి, పిల్లి, కుందేలు, ఏదుపంది (ముళ్ళపంది), సింహము, కోతి, ఏనుగు, తాబేలు, ఉడుము అనునవి అయిదు గోళ్ళు గలిగి భూమిమీద సంచరించేవి. మొసలి మొదలగునవి జలచరములు. 23

శ్లో॥ కంక గృధ్ర వట శ్యేనభాస భల్లూక బర్హిణః ।
హంస సారస చక్రాహ్వ కాకోలూకాదయః ఖగాః ॥ 24

కంకపక్షి (రాబులుగు), గద్ద, గవ్వపక్షి(కొంగ), డేగ, రాబందు, ఎలుగుబంటి, నెమలి, హంస, బెగ్గురుపక్షి, చక్రవాకపక్షి(జక్కవపిట్ట), కాకి, గుడ్లగూబ అనునవి ఆకాశములో ఎగిరే పక్షులు. 24



టీ:- కంకేతి. కంకాదయశ్చ ఖచరాః అభూచరత్వేనైకీకృత్య ఏకభేదేన గృహీతాః తస్మాదేవమష్టావింశతిభేదా భవంతి. తేషు కృష్ణ రురు గవయా దయో మృగవిశేషా అప్యంతర్భూతాః. అన్యేషామపి తిర్యక్ప్రాణినాం యథా యథమేష్వంతర్భావః. 24

శ్లో|| అర్వాక్స్రోతస్తు నవమః క్షత్తరేకవిధో నృణామ్।
రజోధికాః కర్మపరా దుఃఖే చ సుఖమానినః ॥ 25

టీ:- అర్వాగితి. అర్వాగధః ఆహారసంచారౌయస్య సోఽర్వాక్ స్రోతః ప్రస్వత్వమార్షం. నృణాం సర్గః లక్షణం రజః అధికం యేషు తే. 25

ఓ విదురా! మానవుడు పైన గల నోటినుండి ఆహారము స్వీకరించును. ఆ ఆహారము క్రిందకు చేరును. కనుక మానవజాతికి "అర్వాక్ స్రోతస్సు" అని పేరు. మానవజాతి ఒకే విధము. రజోగుణము అధికముగానున్న మానవులు కర్మలంపటులై దుఃఖ దాయకములగు విషయానుభవములను సుఖములుగా తలచుచున్నారు. 25

శ్లో|| వైకృతాస్త్రయ ఏవైతే దేవసర్గశ్చ సత్తమ ।
వైకారికస్తు యః ప్రోక్తః కౌమారస్తూభయాత్మకః ॥ 26

టీ:- వైకృతా ఇతి. ఏతే త్రయ ఏవ వైకృతాః న కైమార సర్గ ఇత్య వధారణ ప్రయోజనం స తూభయాత్మకః ప్రాకృత వైకృతాత్మకః సనత్కుమారాదీనాం సర్గస్తు ప్రాకృతో వైకృతశ్చ. దేవత్వేన మనుష్యత్వేన చ పూజ్యా ఇత్యర్థః. దేవసర్గశ్చ వైకృత ఇత్యనుషంగః. వైకారికస్తు దేవవర్గః. ప్రాకృతేషు పూర్వమేవోక్తః అయం తు తతో న్యూనత్వాద్వైకృతః దేవసర్గత్వాదంత ర్భూతశ్చ. 26

ఓ సాధుసత్తమా! ముఖ్యసర్గము(7వసృష్టి), తిర్యక్సర్గము (8వసృష్టి), మానవులు(9వసృష్టి) అనే మూడు వైకారిక సర్గములే. దేవతల సృష్టి వైకారిక సర్గమే. 16వ శ్లోకములో పంచమ సృష్టిగా పేర్కొనబడిన సాత్వికా హంకారము నుండి ఏర్పడిన ఇంద్రియాధిష్ఠాన దేవతల సృష్టి ప్రాకృతము. సనత్కుమారాదుల కుమారసర్గము వైకృత ప్రాకృతములనెడి ఉభయాత్మకము. వారిలో దైవత్వ మానవత్వ లక్షణము లు రెండు ఇమిడియుండును. ఇది దశ విధ సృష్టులలో ఏడవది. 26

శ్లో॥ దేవ సర్గశ్చాష్ట విధో విబుధాః పితరోఽసురాః।
గంధర్వాప్సరసః సిద్ధా యక్ష రక్షాంసి చారణాః ॥ 27

శ్లో॥ భూత ప్రేత పిశాచాశ్చ విద్యాధ్రాః కిన్నరాదయః।
దశైతే విదురాఖ్యాతాః సర్గాస్తే విశ్వసృట్కృతాః ॥ 28

టీ:- దేవసర్గ ఇతి. వైకృతశ్చాయం దేవసర్గోఽష్ట విధః. తత్ర విబుధాదయస్త్రయో భేదాః గంధర్వాప్సరస ఏకః యక్ష రక్షాంస్యేకః సిద్ధచారణ విద్యాధరా ఏకః విద్యాధ్రా విద్యాధరాః కింనరాదయః ఏకః ఆదిశబ్దాత్ కింపురుషాః అశ్వముఖాదయః భూతప్రేతపిశాచాః ఏకః ఏతశ్చ సర్వం వింశాధ్యాయే స్పష్టం భవిష్యతి. (27-29)

ఈ దేవసర్గము ఎనిమిది విధములు. అవి 1.దేవతలు, 2.పితృదేవతలు, 3. అసురులు, 4.గంధర్వాప్సరసలు, 5.సిద్ధులు, చారణులు, విద్యాధరులు, 6.యక్షరాక్షసులు, 7.భూతప్రేత పిశాచములు, 8.కిన్నరులు, కింపురుషులు. ఈ విధముగా సృష్టి కర్తయగు బ్రహ్మదేవుడు చేసిన పది విధములగు సృష్టిని నీకు చెప్పితిని. ఈ విషయము ఇరువదియవ అధ్యాయమున ఇంకా స్పష్టముగా తెలియును. ( 27-28)

శ్లో॥ అతఃపరం ప్రవక్ష్యామి వంశాన్ మన్వంతరాణి చ ।
ఏవం రజః ప్లుతః స్రష్టా కల్పాదిష్వాత్మభూర్హరిః ।
సృజత్యమోఘ సంకల్ప ఆత్మైవాత్మానమాత్మనా ॥ 29

తరువాత నేను వంశములను,మన్వంతరములను చెప్పగలను. శ్రీహరి కల్పాదుల యందు రజోగుణమును ఉపాధిగా స్వీకరించును. బ్రహ్మదేవుడు సృష్టికర్త. శ్రీహరియే బ్రహ్మదేవుని రూపములో ఏర్పడి ఈ సృష్టిని తనయందు ప్రకటించును. 29

శ్లో॥ గుణ వ్యత్యయ ఏతస్మిన్ మాయావిత్వాదధీశితుః ।
న పౌర్వాపర్యమిచ్ఛన్తి నద్యాం భ్రామ్యద్ భ్రమేరివ ॥ 30

గమనిక:-ఈ రెండు శ్లోకములు అధికపాఠముగా కన్పించుచున్నది.

నది యందు సుడి ఏర్పడి భ్రమించును. (గుండ్రముగా తిరుగును) ఈ తిరుగుట ఎక్కడ మొదలు ఎక్కడ తరువాత యను మీమాంస యుండదు. అట్లే మహాశక్తి సంపన్నుడగు ఈశ్వరుని సృష్టిలో విజ్ఞులు పూర్వాపరములను ఆశించరు. ఈ సృష్టి గుణ పరివర్తనాత్మక మైనది. 30

శ్లో॥ దేవాసురాదయః క్షత్తః కల్పేఽస్మిన్ యే చ కీర్తితాః ।
త ఏవ నామరూపాభ్యా మాసన్మన్వంతరాన్తరే ॥ 31

నామ రూప భేదములతో ఏ దేవాసురులైతే ఈ కల్పమున వర్ణింపబడినారో ఆ దేవాసురులే ఇతర కల్పములలో ఇతర నామ రూపములతో నుందురు. 31

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
దశమోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
పదవ అధ్యాయము సమాప్తము.

ఏకాదశోఽధ్యాయః

శ్లో. తత ఏకాదశే కాలః పరమాణ్వాదిలక్షణైః, యుగమన్వంతరాదిభ్యః కల్పమానాది పర్ణ్యతే. తదేవం సామాన్యతః కాలస్యోపలక్షణ భూతం గుణవ్యతికరం దశవిధం నిరూప్యేదానీం తస్య కాలస్యైవ విశేషం నిరూపయితుం తత్పరిచ్ఛేద్యం వస్తు లక్షయతి - ద్వాభ్యాం. చరమ ఇత్యాదినా.

మైత్రేయ ఉవాచ

శ్లో॥ చరమః సద్విశేషాణామనేకోఽసంయుతః సదా ।
పరమాణుః సవిజ్ఞేయో నృణామైక్య భ్రమోయతః ॥ 1

టీ:- సతః కార్యరూపస్య. పదార్థస్య ప్రపంచస్య. విశేషాణా మంశానాం యశ్చరమోఽంత్యోంశోఽస్తియోఽంత్యశ్చ సన్ పునర్వి భాగం కర్తుం అశక్యో వర్తతే యస్య తు పునరంశో నాస్తీతి భావః అనేకః కార్యవస్థామప్రాప్తః అసంయుతః సముదాయావస్థాం చాప్రాప్తః అత ఏవ సదాకార్య సముదాయావస్థయోరపగ మోఽపృస్తి స పరమాణు ర్విజ్ఞేయః కిం తత్ర ప్రమాణమత ఆహ - యతో యేభ్యస్సమదితేభ్యః నృణాం వ్యవహర్తౄణాం ఐక్యభ్రమః అవయవిబుద్ధి తథా పంచమే అవయవినిరాకరణే వక్ష్యతి తేషాం సమూహేన కృతో విశేష ఇతి కార్యానుపపత్యా కల్ప్యత ఇతి భావః. 1

11వ అధ్యాయము

ఈ పదకొండవ అధ్యాయమున కాలనిరూపమణము చేయనైనది. పరమాణువు మొదలుకొని యుగ మన్వంతరాదుల వలన కల్పమానాది భేదము వర్ణించబడినది. కాలము యొక్క ఉపలక్షణ భూతము, గుణవ్యతికరమునగు దశవిధ సర్గమును నిరూపించి ఇపుడు కాలము యొక్క విశేష విభాగమును నిరూపించుచున్నాడు. మొదటి రెండు శ్లోకములలో కాల పరిచ్ఛేద్య వస్తువును తెల్పడమైనది.

మైత్రేయుడు ఇట్లు పలికెను

పృథివి మొదలగునవి కార్యవర్గము మొక్క అంశములు. వీటిని (ఒకవస్తువును) విడదీయగా, విడదీయగా ఇక విడదీయుటకు సాధ్యము కాని దానిని "పరమాణువు" అందురు. అనగా మిక్కిలి సూక్ష్మమైనది పరమాణువు. ఈ పరమాణువు ఇంకనూ కార్యావస్థను పొందినదై యుండును. ఇతరములతో కలియనిది. అనగా సముదాయావస్థ పొందనిది. కొన్ని పరమాణువుల సమష్టిరూపమే "పదార్థము". మానవులకు "పదార్థము" పరమాణువుల సమష్టి రూపమని తోచదు. వ్యష్టి రూపమనే "భ్రమ" కలుగును. 1

శ్లో॥ సత ఏవ పదార్థస్య స్వరూపావస్థితస్య యత్ ।
కైవల్యం పరమమహానవిశేషో నిరంతరః ॥ 2

టీ:- సూక్ష్మముక్త్వాస్థూలమాహ-సతయేవేత్యాదినా ద్వితీయేన. యస్య చరమోఽంశః పరమాణుః తస్యైవ సతః కార్యమాత్రస్య స్వరూపావస్థితస్య పరిణామాంతరం ప్రాప్తస్య యత్కైవల్యమైక్యం స ఏవ పరం మహాన్ యదితి నిర్దిష్టేన పరం మహానితి పుంస్త్వం పరమాణు ప్రయోగత్వాత్. నను నానా విశేషవాక్ పరస్పరం భిన్నశ్చ సర్వ పదార్థః కథమైక్యం తస్య? తత్రాహ- ఆవిశేషః విశేషవివక్షారహితః నిరం తరః భేద వివక్షారహితశ్చ. సర్వోఽపి ప్రపంచః పరం మహానిత్యర్థః2

పై శ్లోకములో సూక్ష్మరూపమును చెప్పి ఇప్పుడు స్థూల రూపమును చెప్పుచున్నాడు. ఈ పరమాణువు దేనికి సూక్ష్మతమమగు అంశమో, అట్టి పృథివ్యాది భూతపంచకమే కార్యరూపములలో నున్న "పదార్థములు". అవి తమ తమ స్వరూపము నందు వికారములు లేకుండా నిలిచియుండగా వాటి ఐక్యావస్థ యందు ఏర్పడిన నిండైన, అతి పెద్దది అయిన స్వరూపమే పరమమహత్తు. ఈ సమస్త ప్రపంచమే "పరమమహత్తు" అని అర్థము. అవిశేషత నిరంతరత దీని లక్షణము. 2

శ్లో॥ ఏవం కాలోఽప్యనుమితః సౌక్ష్మ్యే స్థౌల్యే చ సత్తమ ।
సంస్థాన భుక్త్యా భగవానవ్యక్తో వ్యక్త భుగ్విభుః ॥ 3

టీ:- ఏవమితి. సౌక్ష్మ్యే సూక్ష్మావస్థాయాం. సౌల్యే స్థూలావస్థాయాం చకారాన్మధ్యమావస్థాయాం చ యథాయం పదార్థః స్థూల స్సూక్ష్మస్తన్మధ్యగశ్చ ఏవం కాలోఽప్యనుమితః విభురుత్పత్త్యాదిషు దక్షః స్వతో వ్యక్తః భగవానితి హరేశ్శక్తిః సంస్థానం పరమాణ్వాద్యవస్థా తస్యా భుక్తిః ప్రాప్తిః తథా వ్యక్త భుక్ వ్యక్తం భుఙ్క్తే వ్యాప్నోతి. పరిచ్ఛిన్నత్తీతి తథా. 3

ఓ విదురా! పదార్థము సూక్ష్మము, మధ్యమము, స్థూలము అని ఉన్నట్లుగానే కాలమునందు గూడ మిక్కిలి చిన్నదియగు కాలము, మిక్కిలి పెద్దదియగు కాలము ఉండునని ఊహింపవచ్చును. ఈ కాలము వ్యక్తమైన పదార్థ జాతమును వ్యాపించి పరిచ్ఛేదము చేయును. కాలమును భగవంతుని స్వరూపముగ ఊహింపవలెను. 3

శ్లో॥ స కాలః పరమాణుర్వై యో భుంక్తే పరమాణుతామ్ ।
తతోఽవిశేషభుగ్యస్తు స కాలః పరమో మహాన్ ॥ 4

టీ:- ఏతదేవ ప్రపంచయతి - స ఇత్యాదినా. సతః ప్రపంచస్య పరమాణుతాం పరమాణ్వవస్థాం యో భుఙ్క్తే సకాలః పరమాణుః తస్యైవ ప్రపంచస్య విశేషం సాకల్యం యో భుఙ్క్తే స పరం మహాన్ సంవత్సరాతి రిక్తః కాలః తస్యైవ యుగమన్వం తారాది క్రమేణ ద్విపరార్ధం తత్త్వమితి తథా పంచమే సూర్యగత్యైవ కాలాదివిభాగం వక్ష్యతి. 4

ప్రపంచము యొక్క సూక్ష్మాంశము అగు పరమాణువు అవస్థను అనుభవించున్నట్టి కాలము "పరమాణుకాలము" అందురు. ఇదియే సూక్ష్మకాలము. ఇందుకు భిన్నముగా సృష్టి మొదలుకొని ప్రళయ పర్యంతము వ్యాపించి యుండు కాలము "పరమమహాన్" కాలము. దీనినే స్థూలకాలమందురు. సూర్యుడు పదార్థము యొక్క సూక్ష్మాంశమైన "పరమాణువును" దాటుటకు పట్టేకాలము పరమాణు కాలమనియు, పన్నెండు రాశులతో వ్యాపించి యుండు ఈ ప్రపంచమునంతటిని దాటుటకు పట్టేకాలమును "సంవత్సరకాలము"అని యందురు. ఈ సంవత్సర కాలము యొక్క "అనువృత్తి"(అనేకమార్లు తిరుగుట) ద్వారానే యుగము, మన్వంతరము ద్విపరార్ధము ఏర్పడును. 4

శ్లో॥ అణుర్ద్వౌ పరమాణూ స్యాత్త్రసరేణు స్త్రయోఽణవః ।
జాలార్కరశ్మ్యవగతః ఖమేవానుపతన్నగాత్ ॥ 5

టీ:- ఇదానీం ద్వ్యణుకాలాదిలక్షణపూర్వకం మధ్యమ కాలావస్థాః కథయతి-అణురితి. ద్వౌ పరమాణూ అణుస్యాత్ త్రయోఽణవస్త్ర సరేణుస్స్యాత్ సోఽసౌ త్రసరేణుస్తు ప్రత్యక్షఇత్యాహ - గవాక్ష ప్రవిష్టర్క రశ్మిష్వవగతో దృష్టస్సన్నితి లఘుత్వేన ఖమేవానుపతతి న తు పృథ్వీమిత్య వధారణార్థః. త్వమేవానుపతన్ గత ఇతి పాఠాంతరం. తత్రాపి న తు గాం. 5

రెండు పరమాణువులు కలిసిన ఒక "అణువు"యగును. మూడు అణువులు కలిసిన ఒక "త్రసరేణువు"అగును. కిటికీ నుండి ఇంటి లోనికి వచ్చే ఎండలో ఈ త్రసరేణువు (దుమ్ముకణము) ఎగురుతూ ఉన్నట్లు కనిపించును. చాలా తేలికగా యుండుటచే (భూమిపైకి దిగకుండా) ఇది ఆకాశములోనే తిరుగుతూ ఉంటుంది. 5

శ్లో॥ త్రసరేణు త్రికం భుంక్తే యః కాలః స తృటిః స్మృతః ।
శతభాగస్తు వేధః స్యాత్తైస్త్రిభిస్తు లవః స్మృతః ॥ 6

టీ:- త్రసరేణ్వితి. త్రసరేణోః త్రికంత్రయో భుంక్తే వ్యాప్నోతి సకాల స్తృటిస్స్మృతః తృటిరూపః శతం భాగో యస్మిన్ స వేధః త్రిభిస్తైః వేధైః లవ ఇతి స్మృతః. 6

సూర్యడు మూడు "త్రసరేణువుల"ను దాటుటకు పట్టే కాలమును "తృటి" యందురు. వంద తృటి కాలములు ఒక "వేధ" యగును. మూడు వేధల కాలము ఒక "లవము" అనబడును. 6

శ్లో॥ నిమేషస్త్రిలవో జ్ఞేయ ఆమ్నాతస్తే త్రయః క్షణః।
క్షణాన్ పంచ విదుః కాష్ఠాం లఘుతా దశ పంచ చ ॥ 7

టీ:- నిమేష ఇతి. లవత్రికం త్రిలవః సనిమేష ఇతి జ్ఞేయః. తే త్రయో నిమేషాః క్షణ ఇత్యామ్నాతః. పంచ క్షణాన్ కాష్ఠామితి విదుః. పంచదశ కాష్ఠాః లఘుతాం విదుః లఘుతైవ లఘుః. 7

మూడు లవముల కాలము ఒక "నిమేషము". మూడు నిమేషముల కాలము ఒక "క్షణము". అయిదు క్షణముల కాలము ఒక "కాష్ఠ". పదిహేను కాష్ఠల కాలము ఒక "లఘు"కాలము. 7

శ్లో॥ లఘూని వై సమామ్నాతా దశ పంచ చ నాడికా ।
తే ద్వే ముహూర్తః ప్రహరః షడ్యామః సప్త వా నృణామ్ ॥8

టీ:- లఘూనీతి. పంచదశ లఘూని నాడికా ఘటికా సమామ్నాతా. తే నాడికే ద్వే ముహూర్తస్సమామ్నాతః. తే షడ్వా సప్త వా నృణాం ప్రహరస్సమామ్నాతః సఏవ యామః అయం దినస్య రాత్రేశ్చతుర్థో

పదిహేను "లఘువులు" ఒక నాడిక. రెండు నాడికలు ఒక "ముహూర్తము". ఈ నాడికనే మనము "ఘటిక" లేదా "ఘడియ" లేదా "గడియ" అనుచున్నాము. పగలు, రాత్రి కాలములు ఒకప్పుడు ఎక్కువగను, ఒకప్పుడు తక్కువగను యుండును. ఎక్కువగ నున్నప్పుడు ఏడు ఘడియలు తక్కువగ యున్నప్పుడు ఆరు ఘడియలు "ఒక

భాగః హ్రాసే షణ్ణాడికాః వృద్ధౌ సప్త సంధ్యా ముహూర్త ద్వయం వినేతి జ్ఞాతం తత్రాపి నియమార్థో వా శబ్దః. ప్రత్యాహం తద్భేదానాం గణయితుమశక్యత్వాత్. 8

ప్రహరము". పగలు నాలుగు"ప్రహరములు"ఉండును. రాత్రి నాలుగు "ప్రహరములు"యుండును. ఈ ప్రహరమునే "యామము" లేదా "జాము" అనియు పిలుచుచున్నాము. వృద్ధిలో రెండు ముహూర్తములు సప్త సంధిగా గ్రహించ వచ్చును. కాని, దినములో ఈ సూక్ష్మ భేదములను గణించడము సులభ సాధ్యము కాదు. 8

శ్లో॥ ద్వాదశార్ధపలోన్మానం చతుర్భిశ్చతురంగులైః।
స్వర్ణమాషైః కృతచ్ఛిద్రం యావత్ప్రస్థ జలప్లుతమ్ ॥ 9

టీ:- నాడికాయా ఉన్మానమాహ - ద్వాదశేతి. ఉన్మీయతేనే నేత్యున్మానం పాత్రమిత్యర్థః. తత్తుషట్పల తామ్ర రచితం పంచ గుంజో మాషః. చతుర్భిస్స్వర్ణమయ మాషైశ్చతురంగులై శ్చతురంగులాయామశలాకా రూపేణ రచితైస్తైః కృత మూలచ్ఛిద్రం తేన ఛిద్రేణ యావత్ప్రస్థ పరిమిత జలమంతః ప్రవిశతి తేన చ ప్లుతం నిమగ్నం చ భవతి తావత్కాలో నాడికా అత్ర పలచ్ఛిద్రయోరాధిక్యే శీఘ్రం నిమజ్జేత్ అల్పత్వేన విళంబేనేతి పతశలాకయోర్నియమః. 9

"నాడికకాలము" యొక్క వివరణ చెప్పబడుచున్నది. ఆరు "పలముల" బరువుగల రాగిపాత్ర అడుగున బంగారు తీగతో ఒక చిల్లి (రంధ్రము) చేయవలెను. ఆ బంగారు తీగ నాలుగు మాసముల బరువుతో నాలుగు అంగుళముల పొడవు గలదై యుండవలెను. (అయిదు గుంజలకు ఒక మాసము) అట్టి రాగి పాత్రను నీటిలో ఉంచినప్పుడు దానిలోనికి ఒక 'ప్రస్థము' (దోసిలి) నీరు నిండి అది నీటిలో మునిగి పోవుటకు పట్టే "కాలము"ను నాడిక యందురు. దీనినే "దండము" అనియు నందురు. ఛిద్రము యొక్క కొలతననుసరించి, అనగా ఛిద్రము పెద్దదయినచో తొందరగా, చిన్నదయినచో నెమ్మదిగా మునుగునని తెలియవలెను. 9

శ్లో॥ యామాశ్చత్వారశ్చత్వారో మర్త్యానామహనీ ఉభే ।
పక్షః పంచ దశాహాని శుక్లః కృష్ణశ్చమానద ॥ 10

ఓ విదురా! మానవులకు నాలుగు యామములు రాత్రి. నాలుగు యామములు పగలు. పగలు రాత్రి కలిసి ఒక దినము. పదిహేను

టీ:- యామా ఇతి. చత్వారశ్చత్వారశ్చ యామామర్త్యానామహనీ అహోరాత్రే ఇత్యర్థః. 10

దినములు ఒక పక్షము. పక్షములు రెండు. ఒకటి శుక్ల పక్షము. రెండవది కృష్ణ పక్షము. 10

శ్లో॥ తయోః సముచ్చయో మాసః పితౄణాం తదహర్నిశమ్ ।
ద్వౌ తావృతుః షడయనం దక్షిణం చోత్తరం దివి ॥ 11

టీ:- తయోరితి. తయోః శుక్ల కృష్ణయోః పక్షయోః సముచ్చయో మాసః తత్పితౄణామహర్నిశం అహ శ్శుక్లో రాత్రిః కృష్ణ ఇత్యర్థః. తౌ ద్వౌ మాసౌ ఋతుః షట్ షణ్మాసాః అయనం దక్షిణం షణ్మాసాః ఉత్తరమయనం చ దివ ఇత్యస్యోత్తరేణాన్వయః. 11

ఆ శుక్లపక్ష, కృష్ణపక్ష సముదాయము ఒక మాసము. పితరులకు అది ఒక దివారాత్రము. అనగా ఒక రోజు. రెండు నెలలకు ఒక ఋతువు ఆరు నెలలకు ఒక అయనము. “దక్షిణ”అయనము “ఉత్తర” అయనము అని రెండు విధములు. 11

శ్లో॥ అయనే చాహనీ ప్రాహుర్వత్సరో ద్వాదశ స్మృతః ।
సంవత్సరశతం నృణాం పరమాయుర్నిరూపితమ్ ॥ 12

టీ:- అయనే ఇతి. దివ ఇతి లోకోపాదానం దేవానాముపలక్షణం. అతోదివ ఇత్యస్య దేవానామిత్యర్థః. ద్వే అయనే దేవానామహనీ అహోరాత్రే ప్రాహుః ద్వాదశ మాసాః వత్సరస్స్మృతః సంవత్సర శతం నృణాం పరమాయురితి నిశ్చయః. 12

ఈ రెండు అయనములు కలిసిన దేవతలకు ఒక అహోరాత్ర మగును. రెండు అయనములు లేదా పన్నెండు మాసములు ఒక సంవత్సరమగును. మానవులకు వంద సంవత్సరములు పూర్ణాయుర్దా యమని నిరూపింపబడినది. 12

శ్లో॥ గ్రహర్క్ష తారా చక్రస్థః పరమాణ్వాదినా జగత్ ।
సంవత్సరావసానేన పర్యేత్యనిమిషో విభుః ॥ 13

టీ:- అనేన క్రమేణాసౌ సూర్యో నిత్యమాయుః క్షపతీత్యాహ - గ్రహేతి. గ్రహాశ్చంద్రాదయః ఋక్షాణ్యశ్విన్యాదీని తారా అన్యాని నక్షత్రాణి తదుప లక్షితం యత్కాల చక్రం తత్ర స్థితో నిమిషః కాలాత్మా విభురీశ్వర స్సూర్యః జగద్ద్వాదశరాశ్యాత్మకం భువనకోశం పర్యేతి పర్యటతి కేన పరమాణ్వాదినా సంవత్సరావసానేన. 13

శ్లో॥ సంవత్సరః పరివత్సర ఇడావత్సర ఏవ చ ।
అనువత్సరో వత్సరశ్చ విదురైవం ప్రభాష్యతే ॥ 14

టీ:- సంవత్సరాది భేదశ్చ సౌర బార్హస్పత్య సావన చాంద్రనాక్షత్ర భేదేన ద్రష్టవ్య ఇత్యాహ-సంవత్సర ఇతి. అత్రాక్షరాధిక్యమార్షం. హే విదుర ప్రభాష్యతే ఏవముచ్చతే కేచిత్పునరేవమాహుః యదా శుక్లప్రతిపది సంక్రాతిర్భవతి. తదా సౌర చంద్రయోర్మాస యోర్యుగప దుపక్రమో భవతి తతస్సౌర మానేన వర్షే షడ్దినాని వర్ధంతి చంద్రమానేన షడ్గసంతీతి. ద్వాదశ దినవ్యవధానా దుభయోరగ్రే పశ్చాద్భాగో భవతి. ఏవం పంచ వర్షాణి గచ్ఛంతి తన్మధ్యే ద్వౌ మలమాసౌ భవతః పునశ్చ షష్ఠ సంవత్సరో భవతీతి. 14

ఈ విధముగా సూర్యుడు ప్రతినిత్యము ఆయుర్దాయమును తగ్గించుచుండుటను చెప్పుచున్నాడు. చంద్రాది గ్రహములు, అశ్విని మొదలగు ఋక్షములు (నక్షత్రములు) మరియు ఇతర నక్షత్రములతో కూడియున్న ఖగోళచక్రమునకు అధిష్ఠాత సూర్యభగవానుడు. ఇట్టి సూర్యభగవానుడు ద్వాదశ రాశి రూపమగు సర్వమును శాసిస్తూ పర్యటించుచున్నాడు. ఆయన పర్యటన వలన కాలమానములో మిక్కిలి చిన్నదియగు పరమాణువు మొదలుకొని సంవత్సరము వరకు “కాల”ము నిరూపింపబడుచున్నది. 13

ఓ విదురా! సూర్య, బృహస్పతి, సవన, చంద్ర, నక్షత్రములకు సంబంధించిన మాసభేదములనుబట్టి ఈ సంవత్సరమే పలువిధము-లగా నుండును. ఎప్పుడైతే శుక్లపక్ష ప్రతిపద రోజు సూర్య సంక్రమణము జరుగునో, సూర్య చంద్రులు ఏక కాలమున ఉపక్రమించుట జరుగునో అప్పుడు వచ్చే ఏడాదికి “సంవత్సరము” అని పేరు. అనగా ఉగాది రోజు సూర్యుడు మేషరాశియందు ప్రవేశించుట అని యర్థము. అటు పిమ్మట ప్రతి సౌరమాన సంవత్సరములో ఆరురోజులు పెరుగుతూ వస్తాయి . ఇట్లు ప్రతిసారి పద్రెండు రోజులు వ్యవధానము ఏర్పడుతుంది. ఇట్లు ప్రతిసారి పంద్రెండు రోజుల తేడాతో అయిదు వర్షములు(ఏడాదులు) గడచి పోతాయి. ఈ అయిదు ఏళ్ళలో రెండు

శ్లో॥ యః సృజ్య శక్తి మురుధోచ్ఛ్వసయన్ స్వశక్త్యా
పుంసోఽభ్రమాయ దివి ధావతి భూతభేదః ।
కాలాఖ్యయా గుణమయం క్రతుభిర్వితన్వన్
తస్మై బలిం కురుత వత్సర పంచకాయ ॥ 15

టీ:- ఏవం భూతః కాలాత్మా నిత్యమ ప్రమత్తైః పూజనీయ ఇత్యాహ-య ఇతి. సృజ్యం కార్యం అంకురాది తద్విషయాం బీజాదీనాం

మలమాసములు(అధిక మాసములు) వస్తాయి. తరువాత మళ్ళీ"సంవత్సరము" ఏర్పడుతుంది. 1.సంవత్సరము: సూర్యుడు ద్వాదశరాశులలో తిరుగుటకు పట్టేకాలము.

2.పరివత్సరము: బృహస్పతి ఒక రాశి నుండి ఇంకొక రాశికి మారుటకు పట్టేకాలము.

3.ఇడావత్సరము: సరిగ్గా నెలకు 30 రోజులు. 30×12=360 రోజుల కాలము.

4.అనువత్సరము: పన్నెండు చాంద్రమానముల అమావాస్యాంతములు.

5.వత్సరము: చంద్రుడు అశ్విన్యాది నక్షత్ర సంచారకాలము×12 నెలలు. (14)

కాలస్వరూపుడైన సూర్యభగవానుడు పూజనీయుడని చెప్పబడుచున్నది. సూర్యుడు సృజింపబడే పదార్థములకు కారణమైన శక్తి స్వరూపుడు "కాలము"అనే తన శక్తిచే సకల కారణతత్త్వముల యందలి బీజ శక్తిని పలు విధములుగా కార్యోన్ముఖము చేయును. మానవులకు చీకటిని, మోహాంధకారమును తొలగించును. దేవలోకము నందు సంచరించును. సకాములకు యజ్ఞముల ద్వారా స్వర్గాది ఫలముల నందించును. అంతరిక్షములో తిరుగుచూ ఆయువును హరిస్తూ

శక్తిం కాలాఖ్యయా కాలరూపయా స్వశక్త్యా ఉరుధా బహుధా ఉచ్ఛ్వసయన్ కార్యాభిముఖీ కుర్వన్ కించ సకామానాం గుణమయం స్వర్గాది ఫలం క్రతుభిర్వితన్వన్ విస్తారయన్ యో భూతభేదః మహాభూత విశేషస్తేజో మండలరూప స్సూర్యః. పుంసః పురుషస్య అభ్రమాయ భ్రమో మోహస్త న్నివృత్తయే .దివ్యంతరిక్షే యావతి ఆయురాది వ్యయేన విషయాసక్తిం నివర్తయతీత్యర్థః. వత్సరపంచక ప్రవర్తకాయ తస్మై బలిం పూజాం కురుత నమః ప్రధానకం భక్త్యా సహోపాస్తిం కురుతేత్యర్థః. 15

విషయాసక్తిని తొలగించును. (విషయాసక్తి తొలగడమే ఆయు-హరణము.) అట్టి శక్తివంతుడైన సూర్యదేవుని పూజించుము. భక్తి ప్రధానముగా నమస్కరించుమని అర్థము. 14వ శ్లోకములో వివరించిన అయిదు రకముల సంవత్సరముల స్వరూపుడు. అట్టి సూర్యదేవుని పూజింపుము. 15

విదుర ఉవాచ

శ్లో॥ పితృదేవ మనుష్యాణామాయుః పరమిదం స్మృతమ్ ।
పరేషాం గతిమాచక్ష్వ యే స్యుః కల్పాద్బహిర్విదః ॥ 16

టీ:- పితృదేవేతి. పిత్రాదీనాం పరమిదమాయుః ఇదం స్వ స్వమానేన వర్షశత మాయుర్మానం స్మృతం ప్రత్యహం కల్ప్యతే సృజ్యత ఇతి కల్పః త్రైలోక్యం తస్మాద్బాహ్యావిదో జ్ఞానినః తేషాం పరేషాం. 16

విదురుడు ఇట్లు పలికెను

నీవు పితృదేవతలు, దేవతలు, మనుష్యుల యొక్క ఆయుః ప్రమాణమును వర్ణించితివి. వారి వారి కాలమానము ప్రకారము వంద సంవత్సరములు పరమాయువు. ఈ మూడులోకములకు అతీతులై "కల్ప"కాలము కంటె ఎక్కువ కాలము నిలుచు ఇతర జీవులను గురించి చెప్పుము. 16

శ్లో॥ భగవాన్ వేద కాలస్య గతిం భగవతో నను ।
విశ్వం విచక్షతే ధీరా యోగరాద్ధేన చక్షుషా ॥ 17

ఓ దేవా! నీవు కాలస్వరూపుడవు. భగవానుని గతిని చక్కగా తెలిసినవాడవు. జ్ఞానులు యోగముచే సిద్ధించిన జ్ఞాననేత్రము ద్వారా జగత్తును దర్శింపగలరు. 17

టీ:- భగవానితి. భగవద్రూపీ భగవాన్ భగవతః కాలస్య గతిం వేద. నను తథాహి దివ్యైర్ద్వాదశ భిర్వర్షసహస్రైరిత్యాద్యుత్తర శ్లోక సముదాయాత్ జ్ఞాతవ్యం యైరవధీయతే తే ధీరాః యోగరాద్ధేన యోగ సంసిద్ధేన చక్షుసా విశ్వం విచక్షతే పశ్యంతి. 17

మైత్రేయ ఉవాచ

శ్లో॥ కృతం త్రేతా ద్వాపరం చ కలిశ్చేతి చతుర్యుగమ్ ।
దివ్యైర్ద్వాదశభిర్వర్షైః సావధానం నిరూపితమ్ ॥ 18

టీ:- కృతమితి. కృత ద్వాపరయోః క్లీబత్వం త్రేతాయాః స్త్రీత్వం కలేః పుంస్త్వం చతుర్యుగద్వాదశభిః దివ్యసంవత్సరైః నిరూప్యతే నిశ్చయత ఇతి నిరూపితం. 18

శ్లో॥ చత్వారి త్రీణి ద్వే చైకం కృతాదిషు యథాక్రమమ్ ।
సంఖ్యాతాని సహస్రాణి ద్విగుణాని శతాని చ ॥ 19

,టీ:- చత్వారీతి. కృత త్రేతా ద్వాపర కలిషు యథా క్రమం చత్వారి త్రీణి ద్వై చకం దివ్యవర్ష సహస్రాణి తత్తద్ద్విగుణాని శతాని చ సంఖ్యాతాని. అయమర్థః కృతే చత్వారి సాహస్రాణ్యష్టౌ శతాని చ.

మైత్రేయుడు ఇట్లు పలికెను

యుగములు నాలుగు 1. కృత యుగము, 2. త్రేతా యుగము, 3. ద్వాపర యుగము, 4. కలి యుగము. కాల స్వరూపము కృత ద్వాపరములలో నపుంసక స్థితిలో, త్రేతా యుగములో స్త్రీత్వంతో, కలియుగములో పురుషత్వముతో ఉండును. మరియు సంధ్య సంధ్యాంశలతో కూడి ఈ నాలుగు యుగములు దేవతల కాలమానము ప్రకారము పన్నెండువేల సంవత్సరముల పరిమాణముగా నిరూపించ-బడినది. రాబోయే శ్లోకమున దీని వివరణముండును. 18

కృతయుగమునకు నాలుగువేల దివ్య సంవత్సరములు, త్రేతా యుగమునకు మూడువేల దివ్యసంవత్సరములు, ద్వాపర యుగమునకు రెండువేల దివ్యసంవత్సరములు, కలియుగమునకు ఒక వెయ్యి దివ్య సంవత్సరములుండును. ఒక దివ్యసంవత్సరమునకు 360 మనుష్య సంవత్సరములు. అట్లే సంధ్యలు సంధ్యాంశలు కృతయుగమునకు

త్రేతాయాం త్రీణి సహస్రాణి షట్ఛతాని. ద్వాపరే ద్వే సహస్రే చత్వారి శతాని చ. కలౌ సహస్రం ద్వే శతే చ.ఏవం వర్షాని నిరూపితానీతి. 19

శ్లో॥ సంధ్యాంశయోరంతరేణ యః కాలః శత సంఖ్యయోః ।
తమేవాహుర్యుగం తజ్ఙ్ఞా యత్ర ధర్మో విధీయతే ॥ 20

టీ:- యుగస్యాదౌ సంధ్యా అంతేంశః సంధ్యాంశః. ఉక్తాని శతాని సంఖ్యా యయౌస్తయోరంతరేణ మధ్యే యుగమ్. తస్య విశేషమాహ-యత్రేతి. గవాలంబాది ధర్మ విశేషో యత్ర విధీయత ఇత్యర్థః. సాధారణ ధర్మస్తు సంధ్యాంశయోరప్యస్త్యేవ. 20

శ్లో॥ ధర్మశ్చతుష్పాన్మనుజాన్ కృతే సమనువర్తతే ।
స ఏవాన్యేష్వధర్మేణ వ్యేతిపాదేన వర్ధతా ॥ 21

టీ:- ధర్మఇతి. చతుష్పాత్సంపూర్ణః కృతే కృతయుగే సమ్యగనువర్తతే సఏవ ధర్మః అన్యేషు త్రేతాదిషు పాదేన వ్యేతి హ్రసతి. కేనపాదేన. వర్ధతా వర్ధమానేన అధర్మేణ హేతునా ఏతచ్చ స్వరూపకథన మాత్రం వైరాగ్యార్థం న తు ధర్మ సంకోచార్థం. 21

800, త్రేతా యుగమునకు 600, ద్వాపర యుగమునకు 400, కలియుగమునకు 200 దివ్యసంవత్సరములుండును. (19)

యుగారంభము సంధ్యయనియు, యుగాంతము సంధ్యాంశ అని పిలువబడును. ఈ సంధ్య సంధ్యాంశలు వందల దివ్య సంవత్సరములలో చెప్పబడినవి. సంధ్య, సంధ్యాంశల మధ్యకాలమునకే యుగము అని పేరు. ప్రతియుగమునకు ఒక విశేషధర్మము ఉండును. గవాలంబాది విశేష ధర్మము "యుగము" గా చెప్పబడిన కాలమునకే వర్తించును. సాధారణ ధర్మము సంధ్యాంశములకు కూడా వర్తించునని అభిప్రాయము. 20

కృతయుగము నందు ధర్మము నాలుగు పాదములతో అనగా సంపూర్ణముగా ప్రవర్తిల్లును. త్రేతాది యుగములలో అధర్మము ఒక్కొక్క పాదముగా పెరుగుచుండుటవలన ధర్మము క్రమముగా క్షీణించుచుండును. ఇది యుగ స్వరూపమును తెలియజేయుటకు, వైరాగ్య వృద్ధి కొరకు మాత్రమే తెలుపడమైనది. ధర్మాచరణలో సంకోచించుటకు కాదు. 21

శ్లో॥ త్రైలోక్యా యుగ సాహస్రం బహిరాబ్రహ్మణో దినమ్ ।
తావత్యేవ నిశా తాత యన్నిమీలతి విశ్వ సృట్ ॥ 22

టీ:- త్రైలోక్యాదితి. త్రైలోక్యాత్ త్రైలోక్యాద్బహిః మహర్లోక ప్రవృత్యా బ్రహ్మణో బ్రహ్మలోకమభివ్యాప్య చతుర్యుగ సహస్రమేకం దినం తావత్యేవ నిశా యద్యస్యాం నిశాయాం విశ్వసృట్ బ్రహ్మ నిమీలతి స్వపితి. 22

ఓ విదురా! మూడులోకములకు పైన యుండిన మహర్లోకము మొదలు కొని బ్రహ్మలోక పర్యంతము, మానవ లోకములోని వేయి చతుర్యుగములు ఒక పగటికి సమానము. అంతే కాలము రాత్రి యుండును. ఆ రాత్రి కాలము నందు బ్రహ్మదేవుడు నిద్రించి యుండును. 22

శ్లో॥ నిశావసాన ప్రారబ్ధ లోకకల్పో౽నువర్తతే ।
యావద్దినం భగవతో మనూన్భుంజంశ్చతుర్దశ ॥ 23

టీ:- తత్ర దినస్థితిమాహ-సార్ధైశ్చతుర్భిః. నిశేతి. నిశావసానే ప్రారబ్ధో లోకానాం కల్పః క్లృప్తిః భగవతో బ్రహ్మణో యావద్దినం తావచ్చతుర్దశ మనూన్ భుంజన్ పాలయన్ వ్యాప్నువన్ సన్నిత్యర్థః. అన్వనుసూత్యం ప్రవర్తతే 23

బ్రహ్మకు రాత్రి ముగియగానే సృష్టి ఆరంభమగును. ఆ సృష్టి పగలంతయు కొనసాగును. బ్రహ్మదేవుని ఆ పగటి కాలములో పద్నాలుగురు మనువులు గతించెదరు. 23

శ్లో॥ స్వం స్వం కాలం మనుర్భుంక్తే సాధికామేక సప్తతిమ్
మన్వంతరేషు క్రమశః తద్వంశ్యా ఋషయః సురాః ।
భవంతి చైతే యుగపత్సురేశాశ్చాను యే చ తాన్ ॥ 24

ప్రతి మనువు డెబ్బదియొక్క చతుర్యుగముల కాలము కంటె కొంచెము ఎక్కువ కాలము పరిపాలనలో కొనసాగును. మన్వంతరముల యందు ఆ యా మనువులు, వారి వంశీయులు, మహర్షులు, దేవతలు,

టీ:- స్వం స్వం కాలం మనుర్భుఙ్క్తే సాధికాంహ్యేక సప్తతిం ఏకో మనుః కించిదధికాం యుగానామేక సప్తతిం. తద్వంశ్యాః పృథివీ పాలకాః తచ్ఛబ్దేన మనవః పరామృశ్యంతే. తే రాజానస్తు క్రమశో భవంతి. ఋషయస్సప్త ఋష్యాదయః సురాః వసు రుద్రాదయః. సురేశా ఇంద్రాదయశ్చ తానింద్రాదీననువర్తంతే. యే గంధర్వాదయ స్తేఽపి తు యుగపత్సమ కాలమేవ భవంతి. 24

ఇంద్రాదులు, వారి అనుయాయులగు గంధర్వాదులు ఏక కాలము నందున్నవారై, అధికారము గలవారై లోకములను పరిపాలించెదరు. 24

శ్లో॥ ఏష దైనందినః సర్గో బ్రాహ్మస్త్రైలోక్య వర్ధనః ।
తిర్యఙ్నృ పితృదేవానాం సంభవో యత్ర కర్మభిః ॥ 25

టీ:- ఏష ఇతి. త్రైలోక్యం వర్ధయతీతి త్రైలోక్యవర్ధనః బ్రాహ్మః ఏషః దైనందిన స్సర్గః ప్రతిదినం ప్రవృత్తో దైనందినః యత్ర సర్గే తిర్యగాదీనాం సంభవః. 25

బ్రహ్మదేవుడు ఈ విధముగా మూడు లోకముల వరకు వ్యాపించి యుండు సృష్టిని ప్రతిదినము చేయుచుండును. జీవులు తమ తమ కర్మలననుసరించి బ్రహ్మదేవుని ఈ సృష్టిలో పశు పక్ష్యాదులు, మనుష్యులు, పితృదేవతలు, దేవతలుగ జన్మించెదరు. 25

శ్లో॥ మన్వంతరేషు భగవాన్బిభ్రత్సత్త్వం స్వమూర్తిభిః।
మన్వాదిభిరిదం విశ్వమవత్యుదితపౌరుషః ॥ 26

టీ:- మన్వంతరేష్వితి. సత్త్వం సత్త్వగుణం బిభ్రత్. స్వమూర్తిభిర్మ న్వంతరావతారైః మన్వాదిభిర్ద్వారభూతైరావిష్కృత పురుష భావస్సన్ విశ్వమవతి రక్షతి ఉదిత పూరుష ఇతి వా పాఠః. 26

మన్వంతర కాలము నందు భగవంతుడు తన పౌరుషమును ప్రకటించును. సత్త్వగుణమును ఆశ్రయించును. తానే మన్వాది మూర్తులు ధరించినవాడై ప్రపంచమును రక్షించును. 26

శ్లో॥ తమోమాత్రాముపాదాయ ప్రతిసంరుద్ధ విక్రమః ।
కాలేనానుగతాశేష ఆస్తే తూష్ణీం దినాత్యయే ॥ 27

టీ:- రాత్రి గతాం స్థితిమాహ- తమోమాత్రమితి. తమసో మాత్రం లేశం ప్రతిసంరుద్ధః ప్రత్యాహృతో విక్రమో యేన. అనుగత మను ప్రవిష్టమశేషం యస్మిన్. 27

బ్రహ్మదేవుని రాత్రి గురించి క్రింది అయిదు శ్లోకములలో చెప్పుచున్నాడు. బ్రహ్మదేవుడు దినాంతము యందు(రాత్రి ప్రారంభము నందు) తమో గుణమును స్వీకరించును. సృష్టి వ్యాపారమును విరమించును. నిశ్చేష్టుడుగా నుండును. అపుడు కాల ప్రభావముచే సర్వము ఆయన యందు లీనమగును. 27

శ్లో॥ తమేవాన్వపి ధీయంతే లోకా భూరాదయస్త్రయః ।
నిశాయామనువృత్తాయాం నిర్ముక్త శశి భాస్కరమ్ ॥ 28

టీ:- తదేవ స్పష్టయతి. తమితి. అన్వపి ధీయంత ఇతి కర్మ కర్తరి ప్రయోగః తిరోహితా భవంతీత్యర్థః. కథం నిర్ముక్తో రహితశ్శశీ భాస్కరశ్చ యథా భవతి తథా. 28

అదే విషయమును స్పష్టపరచుచున్నాడు."అన్వపి ధీయన్త" అనునది కర్మ కర్తరి ప్రయోగము. బ్రహ్మదేవుని రాత్రియందు జరిగే ప్రళయమునందు 1.భూలోకము, 2.భువర్లోకము, 3.సువర్లోకము అనే మూడు లోకములు ఆయన యందు విలీనమగును. సూర్య చంద్రులు సైతము ఉండరు. సర్వము ఆయనలో కలిసిపోవును. 28

శ్లో॥ త్రిలోక్యాం దహ్యమానాయాం శక్త్యా సంకర్షణాగ్నినా ।
యాంత్యూష్మణా మహర్లోకాజ్జనం భృగ్వాదయోఽర్దితాః ॥29

టీ:- త్రిలోక్యామితి. భగవచ్ఛక్తిరూపో యస్సంకర్షణముఖాగ్నిః తేన త్రిలోక్యాం దహ్యమానాయాం ఋషి ప్రభృతయః ఊష్మణా అర్దితాస్సంతో మహర్లోకాజ్జన లోకం యాంతి. 29

ఆదిశేషుని ముఖము నుండి భగవంతుని శక్తి అగ్ని (సంకర్ష ముఖాగ్ని) రూపములో వెలువడును. ఆ అగ్నిచేత మూడులోకములు దహింప బడును. ఆ వేడిమి చేత పీడింపబడిన వారై భృగు మహర్షి మొదలగు వారు మహర్లోకము నుండి జన లోకమునకు వెళ్ళెదరు. 29

శ్లో॥ తావత్త్రిభువనం సద్యః కల్పాన్తైధిత సింధవః ।
ప్లావయంత్యుత్కటాటోప చండ వాతేరితోర్మయః ॥ 30

టీ:- తావదితి. ఉత్కటః. ఆటోపః క్షోభో యేషాం తే చండ వాతే రితాశ్చోర్మయః కల్పాంతే నైధితాస్సింధవః సముద్రాః ప్లావయంతి. 30

అంతలోనే కల్పాంతము నందు సముద్రములలో కెరటములు ఉవ్వెత్తున లేచి పడుచుండును. ప్రచండమైన గాలులు వీచును. ఆ బలమైన గాలులచే కెరటములు సముద్రపు హద్దులను దాటి వెంటనే మూడు లోకములను ముంచి వేయును. 30

శ్లో॥ అంతః స తస్మిన్ సలిల ఆస్తేఽనంతాసనో హరిః ।
యోగనిద్రామీలితాక్షః స్తూయమానో జనాలయైః ॥ 31

టీ:- అంతరితి. జనలోక ఆలయో యేషాం తైః. 31

ఆ సమయమున భగవానుడు ప్రళయ సముద్రమున ఆదిశేషుని పై శయనించి యుండును. యోగ నిద్రచే కన్నులు మూసుకొని యుండును. మహర్లోకము నుండి వచ్చిన వారైన జన లోకవాసులు (భృగుమహర్షి మొదలగువారు) ఆ భగవానుని స్తోత్రము చేయు చుందురు. 31

శ్లో॥ ఏవం విధైరహో రాత్రైః కాల గత్యోపలక్షితైః ।
అపక్షీణమివాస్యాపి పరమాయుర్వయః శతమ్ ॥ 32

టీ:- లోకాంతర వైరాగ్యార్థమాహ - ఏవం విధైరితి. ఏవం విధైరహో రాత్రైః వర్షశతం సర్వేషాం ప్రాణినామాయుషః పరమధికమస్య బ్రహ్మణోఽపి యదా యుస్తదప్యపక్షిప్తం అపక్షీణమివేతి లోకోక్తేః గతప్రాయ మిత్యర్థః. 32

వైరాగ్యవృద్ధి కొఱకై చెప్పబడుచున్నది. ఈ సృష్టిలో అందరి కంటె పెద్ద ఆయుర్దాయము బ్రహ్మది. వేయి చతుర్యుగముల పరిమితము పగలు. వేయి చతుర్యుగముల పరిమితము రాత్రి. ఇట్టి రాత్రింబగళ్ళు గడచుచునేయున్నవి. అందరికిని వారి వారి ప్రమాణమును బట్టి వంద సంవత్సరములు పరమాయుర్దాయము. బ్రహ్మదేవునికి కూడా ఈ పరమాయువు గతించిపోయినట్లు తోచుచున్నది. 32

శ్లో॥ యదర్ధమాయుషస్తస్య పరార్ధమభి ధీయతే।
పూర్వః పరార్ధోఽతిక్రాంతో హ్యపరోఽద్య ప్రవర్తతే ॥ 33

టీ:- తదేవాహ-యదితి. అతిక్రాంతః వర్తత ఇతి వా పాఠః. 33

బ్రహ్మదేవుని యొక్క ఆయుర్దాయములో సగ భాగమునకు పరార్ధమని పేరు. దానిలో మొదటి పరార్ధము గడచిపోయినది. ఇప్పుడు రెండవ పరార్ధము జరుగుచున్నది. 33

శ్లో॥ పూర్వస్యాదౌ పరార్ధస్య బ్రాహ్మో నామ మహానభూత్ ।
కల్పో యత్రాభవద్బ్రహ్మా శబ్దబ్రహ్మేతి యం విదుః ॥ 34

టీ:- పూర్వస్యేతి. పూర్వస్య ప్రథమస్య పరార్ధస్య బ్రాహ్మో నామ మహాన్ కల్పోఽభూత్ యం శబ్ద బ్రహ్మేతి విదుః స యత్ర యస్మిన్ కల్పే భవత్సముద్భూతః స బ్రాహ్మ ఇతి. 34

మొదట పరార్ధఆరంభమున వచ్చిన కల్పమునకు బ్రహ్మ కల్పమని పేరు. ఆ కల్పము నందే శబ్ద బ్రహ్మ అని పేరు గాంచిన వేదమయుడగు బ్రహ్మ ఆవిర్భవించెను. 34

శ్లో॥ తస్యైవ చాంతే కల్పోఽభూద్యం పాద్మమభి చక్షతే ।
యద్ధరేర్నాభి సరస ఆసీల్లోక సరోరుహమ్ ॥ 35

టీ:- తస్యేతి. తస్య ప్రథమస్య పరార్ధస్యాంతే స కల్పోభూత్. యం పాద్మమితి ప్రచక్షతే. పాద్మే హేతుః. యద్ధరేరితి. నాభిరేవ సరస్తస్మాల్లోక ఏవ సరోరుహం. యద్వా సరోరుహాకారో లోకః సరోరుహ స దృశోవా ఆసీదుత్పన్న ఇతి యద్యస్మాత్తస్మాదితి. కల్ప లక్షణే ప్రథమ పరార్ధాద్యంత దినేత్ర పరిగణితే భవతః న తు తన్మధ్యపతి తాని అత్ర ప్రయోజనా భావాత్. 35

అదే పరార్ధము యొక్క చివరి కల్పమునకు “పాద్మకల్పము”అని పేరు. ఎందుకనగా ఆ కల్పము నందు విష్ణుమూర్తి యొక్క సరస్సు వంటి నాభినుండి సర్వలోకములకు నిలయమైన “కమలము” పుట్టినది. (35)

శ్లో॥ అయం తు కథితః కల్పో ద్వితీయస్యాపి భారత ।
వారాహ ఇతి విఖ్యాతో యత్రాసీత్సూకరోహరిః ॥ 36

టీ:- అయమితి. యత్రేత్యయం తు ద్వితీయస్యాదౌ కథితః అస్యాప్యు పాదానం ప్రయోజనార్థం. 36

భరతవంశీయుడవగు ఓ విదురా! ఇప్పుడు జరుగుచున్న ద్వితీయ పరార్ధమునకు 'వరాహకల్పము' అని పేరు. ఎందుకనగా శ్రీమహావిష్ణువు ఈ కల్పము నందే వరాహమూర్తియై అవతరించినాడు. (36)

శ్లో॥ కాలోఽయం ద్విపరార్ధాఖ్యో నిమేష ఉపచర్యతే ।
అవ్యాకృతస్యానంతస్యహ్యనాదేర్జగదాత్మనః ॥ 37

టీ:- తదేవం కాలేన నిమిత్తేన సృజ్యానామాయుః పరిణామముక్త్వా కాలవిచ్ఛేదరహితం తత్త్వమాహ-పంచభిః. కాల ఇతి. బ్రహ్మణః పర మాయుర్భూతోఽయం కాలః అవ్యాకృతస్య కార్యోపాధి శూన్యస్య అత ఏవానంతస్యానాదేశ్చ జగదాత్మనో జగత్కారణస్య భగవతః కేవలం నిమేష ఉపచర్యతే న త్వనేనాతిక్రమేణాయుర్గణనం తస్యేత్యవ్యాకృతాది విశేషణం. 37

కాలనిమిత్తముచేత జీవుల ఆయుర్దాయమును తెలిపి కాల పరిచ్ఛేద రహితమైన తత్త్వమును గురించి (శ్రీహరిని గురించి) ఈ దిగువ అయిదు శ్లోకములలో చెప్పబడుచున్నది. శ్రీహరి ఉపాధి రహితుడు, వికారరహితుడు. అంతము లేని వాడు. ఆది లేని వాడు. ప్రపంచమే తన స్వరూపముగా గలవాడు. అట్టి శ్రీహరికి ఈ రెండు పరార్ధముల కాలము ఒకరెప్పపాటు కాలమని తలంచ వచ్చును. 37

శ్లో॥ కాలోఽయం పరమాణ్వాది ద్విపరార్ధాంత ఈశ్వరః ।
నైవేశితుం ప్రభుర్భూమ్న ఈశ్వరో ధామ మానినామ్ ॥38

శ్రీహరి యందు "కాలము" సామర్థ్యము చూపజాలదని తెల్పు చున్నాడు. పరమాణువు మొదలుకొని ద్విపరార్ధము వరకు లెక్కింప బడుచున్న కాలము (ఈశ్వరః) సర్వసమర్థము (అధికారము నెరవు

టీ:- భగవతః పరిచ్ఛేదే కాలస్యాసామర్థ్య మిత్యుక్త్వా తదుత్పత్తి విచ్ఛేదయోః కాలస్యాసామర్థ్యమాహ-కాల ఇతి. కాలోఽ యమీశ్వరః సమర్థోఽపి భూమ్నః పరిపూర్ణస్యేశితుః నైవ ప్రభుర్న సమర్థః. యతో ధామమానినాం దేహగేహాద్యభిమానినామేవేశ్వరః. 38

శ్లో॥ వికారై ష్షోడశై ర్యుక్తో విశేషాదిభిరావృతః ।
అండకోశో బహిరయం పంచాశత్కోటి విస్తృతః ॥ 39

టీ:- యద్భూమ్న ఇత్యుక్తం తత్ప్రపంచయన్నాహ - వికారైరితి. షోడశై ర్వికారైర్యుక్తస్సహితః తైరారబ్ధ ఇత్యర్థః. పంచాశత్కోటి యోజన విస్తృతః అండకోశః. 39

సామర్థ్యము కలది). కాలము యొక్క ఈ అధికారము దేహము, ఇల్లు అనువాటి యందు అభిమానము గలవారిపై మాత్రమే చెల్లుబడి యగును. భూమ్నః అనగా పరిపూర్ణుడగు శ్రీహరి. పరబ్రహ్మమైన ఈ శ్రీహరి యందు "కాలము" తన అధికారమును నెరపజాలదు. 38

'భూమ్నః' అంటూ ఈ ప్రపంచాన్ని గురించి చెప్పుచున్నాడు. ఈ బ్రహ్మాండము ఎనిమిది ప్రకృతులతో 16 వికారములతో ఆరంభమైనది. (5 తన్మాత్రలు, ప్రకృతి, మహత్తు, అహంకారము కలిపి 8 ప్రకృతులు. 11 ఇంద్రియములు, 5 మహాభూతములు కలిపి 16 వికారములు). ఇట్టి బ్రహ్మాండము లోపల యాభైకోట్ల యోజనముల విస్తారము కలిగి యున్నది. బయటిభాగము భూమి మొదలగు ఏడు పదార్థముల ద్వారా ఆవరింపబడియున్నది. ఇంతటి "అండకోశము" పరమాత్మ యందు విలీనమై పరమాణువు వలె కనిపించునని తరువాతి శ్లోకముల ద్వారా తెలియనగును. 39

శ్లో॥ దశోత్తరాధికైర్యత్ర ప్రవిష్టః పరమాణువత్ ।
లక్ష్యంతేఽంతర్గతాశ్చాన్యే కోటిశో హ్యండరాశయః ॥ 40

టీ:- దశేతి. ప్రమాణాద్దశ గుణముత్తరోత్తరాధిక్యం యేషు తైర్వి శేషాదిభి స్సప్తభిర్బహిరావృతః అండకోశః యత్ర యస్మిన్ప్రవిష్టః. పరమాణు వల్లక్ష్యతే. తదక్షరం బ్రహ్మేత్యాహుః. న కేవలమయమేవ కిం త్వన్యేఽపి కోటిశోండరాశయః యత్రాన్తర్గతాస్సంతః పరమాణు వల్లక్ష్యంతే. 40

ఇంతటి అండకోశమునకు ఒకదాని కంటె ఒకటి పదిరెట్లు పెద్దవిగా గలవియై అనేక కోట్ల సంఖ్యలో బ్రహ్మాండములు కలవు. పరమాత్ముని యందు ఈ బ్రహ్మాండము అన్నియు పరమాణువుల వలె అగుపించును. 40

శ్లో॥ తదాహురక్షరం బ్రహ్మ సర్వకారణ కారణమ్।
విష్ణోర్ధామ పరం సాక్షాత్పురుషస్య మహాత్మనః ॥ 41

టీ:- తదితి. సర్వేషాం కారణానాం కారణం మహాత్మనః పురుషస్య విష్ణోః ధామ స్వరూపమక్షరం బ్రహ్మేత్యాహుః. 41

పైన వర్ణింపబడిన కాలస్వరూపమునే అవినాశియు, సమస్త కారణములకు కారణమైనవాడును, పరమాత్మయు, పూర్ణుడును అయిన విష్ణుమూర్తి యొక్క శ్రేష్ఠమైన ధామమని పండితులు చెప్పుచున్నారు. అట్టి విష్ణుమూర్తికి నమస్కారము. 41

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
ఏకాదశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
పదకొండవ అధ్యాయము సమాప్తము.

ద్వాదశోఽధ్యాయః

శ్లో. ద్వాదశే తు కుమారాదిమనః సర్గోహ్యమైథునాత్ ।
కాయద్వైధేన యౌనస్తు మనుసర్గోఽనువర్ణ్యతే ॥

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి తే వర్ణితః క్షత్తః కాలాఖ్యః పరమాత్మనః ।
మహిమా వేదగర్భోథ యథాఽస్రాక్షీన్నిబోధ మే ॥ 1

శ్లో॥ ససర్జాగ్రేఽంధతామిస్రమథ తామిస్రమాదికృత్ ।
మహామోహం చ మోహం చ తమశ్చాజ్ఞానవృత్తయః ॥ 2

టీ:- ససర్జేతి. ఆదికృద్బ్రహ్మా అగ్రే స్వసృష్టౌ ప్రథమమవిద్యావృత్తీః ససర్జ. తత్ర తమోనామ స్వరూపాప్రకాశః. మోహో దేహాద్యహంబుద్ధిః . మహా మోహో విషయభోగేచ్ఛా. తామిస్రః తత్ప్రతిఘాతే క్రోధః. అంధతామిస్రః తన్నాశే అహమేవ మృతోఽస్మీతి బుద్ధిః. తథైవోక్తం వైష్ణవే.

శ్లో॥ తమో వివేకో మోహః స్యాదంతః కరణ విభ్రమః
మహామోహస్తు విజ్ఞేయో గ్రామ్య భోగ సుఖైషణా ।

12వ అధ్యాయము

ఈ పన్నెండవ అధ్యాయమున సనందనాదుల సృష్టి విషయము, మరీచి మొదలగు మానసపుత్రుల విషయము, ధర్మాధర్మముల విషయము, స్త్రీ పురుషులను వారి దేహములనుండి సృష్టించిన విషయము వర్ణింపబడినది.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను.

ఓ విదురా! నేను నీకు ఇంతవరకు భగవంతుని "కాలము" అనే విభూతిని వర్ణించి చెప్పితిని. ఇప్పుడు వేదస్వరూపుడైన బ్రహ్మదేవుని సృష్టి గురించి చెప్పెదను వినుము. బ్రహ్మదేవుడు తన సృష్టి యందు మొదట అవిద్యావృత్తులను సృష్టించెను. ఇవి అయిదు వృత్తులు 1. అంధతా మిస్రము, 2. తామిస్రము, 3. మహామోహము, 4. మోహము, 5. తమస్సు అనేవి. వీటిలో 'తమస్సు' స్వరూపమును కప్పి పెట్టేది. 'మోహము' దేహమే నేను అను బుద్ధిని కలిగించేది. 'మహామోహము' భోగములను కోరికను కలిగించేది. 'తామిస్రము' భోగములు ప్రాప్తించు విషయములో అటంకము ఏర్పడినపుడు కలిగే క్రోధము. "అంధతా మిస్రము" ప్రాప్తించిన భోగములు తొలగినపుడు తానే చనిపోతున్నట్లు భావించే బుద్ధి. ఇదే విషయము వైష్ణవమందును కలదు.

పతంజలి యోగ సూత్రములలో "అవిద్యాస్మితా రాగద్వేషాభి నివేశాః పంచక్లేశాః అను సూత్రము కలదు. వీటినే శ్రీవిష్ణుస్వామి

మరణం హ్యంధతామిస్రం తామిస్రః క్రోధ ఉచ్యతే
అవిద్యా పంచపర్వైషా ప్రాదుర్భూతా మహాత్మనః ॥

ఇతి, పాతంజలేఽప్యేత ఏవోక్తాః అవిద్యా స్మిత రాగద్వేషాభి నివేశాః పంచ క్లేశా ఇతి. శ్రీవిష్ణుస్వామి ప్రోక్తా వా. అజ్ఞాన విపర్యాస భేద భయ శోకాః తదుక్తం

శ్లో. స్వాదృగుత్థ విపర్యా స భవ భేదజభీ శుచః ।
యన్మాయయాజుషన్నాస్తే తం నృసింహమహమ్ ॥ భజఇతి. 1,2

"అజ్ఞాన విపర్యాసభేదభయశోకాః" అని పేర్కొన్నాడు.

"స్వాదృగు త్థావిపర్యాసః" అనియు చెప్పబడినది. (1,2)

శ్లో॥ దృష్ట్వా పాపీయసీం సృష్టిం నాత్మానం బహ్వమన్యత।
భగవద్ధ్యాన పూతేన మనసాఽన్యాం తతోఽసృజత్ ॥ 3

టీ:- దృష్ట్వేతి. న బహ్వమన్యత వరమిత్యాత్మానం నాభ్యనందత్. 3

బ్రహ్మదేవుడు ఈ పాపభూయిష్ఠమైన సృష్టిని చూచి తనను తాను మెచ్చుకోలేదు. (అభినందించుకోలేదు) అపుడు భగవంతుని ధ్యానించి పవిత్రుడయ్యెను. పిమ్మట మరియొక సృష్టిని చేసెను. 3

శ్లో॥ సనకం చ సనందం చ సనాతనమథాత్మభూః ।
సనత్కుమారం చ మునీన్నిష్క్రియానూర్ధ్వరేతసః ॥4

టీ:- సనకమితి. మనసా సనకాదీన్ యద్యపి ప్రతికల్పం. సనకాది సృష్టిర్నాస్తి తథాపి బ్రహ్మసర్గత్వాదిహోచ్యతే. వస్తుతస్తు ముఖ్య సర్గాదయ ఏవ. ప్రతికల్పం భవంతి సనకాదయస్తు బ్రహ్మకల్ప సృష్టావేవాను వర్తంతే. 4

ప్రతికల్పము నందు సనకాదుల సృష్టి యుండదు. వాస్తవముగా ప్రతికల్పమునందును ముఖ్యసర్గాదులు మాత్రమే ఉండును. సనకాదుల సృష్టి బ్రహ్మ కల్పమునందు మాత్రమే ఉండును. సనకుడు,సనందనుడు, సనాతనుడు, సనత్కుమారులనే నలువురు కర్మలను సన్యసించినవారు. ఊర్ధ్వరేతస్కులు. ఆత్మజ్ఞాన నిష్ఠగల బ్రహ్మచారులు. ఇట్టి సనకాదులను బ్రహ్మదేవుడు సృష్టించెను. 4

శ్లో॥ తాన్ బభాషే స్వభూః పుత్రాన్ ప్రజాః సృజత పుత్రకాః ।
తనైచ్ఛన్మోక్ష ధర్మాణో వాసుదేవపరాయణాః ॥ 5

టీ:- తానితి. స్వభూః బ్రహ్మా. మోక్షసాధన భూతా ధర్మా యేషాం త ఇతి మధ్యమ పద లోపీ సమాసఃసూ.“ధర్మాదనిచ్కేవలా” దిత్యని చ్ప్రత్యయః 5

స్వయంభువుడగు బ్రహ్మదేవుడు సనకాదులను సంతానమును పొందుమని చెప్పెను. మోక్షధర్మము నందు ఆసక్తిగలవారు, వాసుదేవుని యందు అనన్యభక్తిగల సనకాదులు ప్రజాసృష్టికి ఇష్టపడలేదు. 5

శ్లో॥ సోఽవధ్యాతః సుతైరేవం ప్రత్యాఖ్యాతానుశాసనైః ।
క్రోధం దుర్విషహం జాతం నియంతుముపచక్రమే ॥ 6

టీ:- సఇతి. అవధ్యాతోఽవజ్ఞాతః. ప్రత్యాఖ్యాత మనంగీకృతం అనుశాసనం యైః. 6

తన కొడుకులు తనమాటను తిరస్కరించినారని బ్రహ్మదేవుడిని పట్టరానంత కోపము కలిగెను. ఆయన కోపమును ఆపుకొనుటకు ప్రయత్నించెను. 6

శ్లో॥ ధియా నిగృహ్యమాణోఽపి భ్రువోర్మధ్యాత్ప్రజాపతేః ।
సద్యోఽజాయత తన్మన్యుః కుమారో నీలలోహితః ॥ 7

టీ:- ధియేతి. స చాసౌ మన్యుశ్చ తన్మన్యుః. 7

బ్రహ్మదేవుడు తన కోపమును బుద్ధి పూర్వకముగా ఆపుకొనుటకు ప్రయత్నించెను. అయినప్పటికి, ఆ క్రోధ ఫలముగా ఆయన కనుబొమ్మల నడుమ నుండి నలుపు ఎరుపు రంగుగల కుమారుడు పుట్టెను. 7

శ్లో॥ స వై రురోద దేవానాం పూర్వజో భగవాన్ భవః ।
నామాని కురు మే ధాతః స్థానాని చ జగద్గురో ॥ 8

దేవతలలో ముందుపుట్టినవాడు అయిన రుద్రుడు ఏడుస్తూ ఇట్లు పలికెను. ఓ జగద్గురూ! విధాతా! నాకు పేర్లను (నామములను) స్థానములను (చోటును) ఏర్పాటు చేయుము. 8

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ ఇతి తస్య వచః పాద్మో భగవాన్ పరిపాలయన్ ।
అభ్యధాద్భద్రయా వాచా మారోదీస్తత్కరోమి తే ॥ 9

పద్మము నుండి పుట్టిన వాడైన బ్రహ్మదేవుడు ఆ రుద్రుని మాటలను మన్నించి తియ్యటి మాటలతో ఇట్లనెను. ఏడవకుము. నీ కోరికలు నెరవేర్చెదను. 9

శ్లో॥ యదరోదీః సుర శ్రేష్ఠ సోద్వేగ ఇవ బాలకః ।
తతస్త్వామభి ధాస్యంతి నామ్నా రుద్ర ఇతి ప్రజాః ॥ 10

ఓ దేవతలలో శ్రేష్ఠుడా! నీవు పిల్లవాడివలె పెద్దగా ఏడ్చినావు. కావున ప్రజలు నిన్ను "రుద్రుడు" అనే పేరుతో పిలిచెదరు. 10

టీ:- యదితి. బాలకః శిశురివ. (8-10)

శ్లో॥ హృదింద్రియాణ్యసుర్వ్యోమ వాయురగ్నిర్జలం మహీ ।
సూర్యశ్చంద్రస్తపశ్చైవ స్థానాన్యగ్రే కృతాని తే ॥ 11

హృదయము, ఇంద్రియములు, ప్రాణము, ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, భూమి, సూర్యుడు, చంద్రుడు మరియు తపస్సు అనే స్థానములను నీ కొరకు ముందుగానే ఏర్పాటుచేసినాను. 11

శ్లో॥ మన్యుర్మనుర్మహేశానో మహాన్ శివ ఋతధ్వజః।
ఉగ్రరేతా భవః కాలో వామదేవో ధృతవ్రతః ॥ 12

మన్యువు, మనువు, మహేశానుడు, మహాన్ (మహాత్ముడు), శివుడు, ఋతధ్వజుడు, ఉగ్రరేతుడు, భవుడు, కాలుడు, వామదేవుడు, ధృతవ్రతుడు అనేవి రుద్రునకు (నీకు) నామములు. మహేశానుడు అనే పేరుకు మహినసుడు అనే పాఠాంతరము కలదు. 12

శ్లో॥ ధీవృత్తిరుశనోమా చ నియుత్సర్పిరిళాంబికా ।
ఇరావతీ సుధా దీక్షారుద్రాణ్యో రుద్ర తే స్త్రియః ॥ 13

టీ:- హృదితి. అగ్రే పూర్వమేవ మయా కృతాని. (10-13)

ఓ రుద్రా! ధీ, వృత్తి, ఉశన, ఉమా, నియుత్, సర్పి, ఇల, అంబిక, ఇరావతీ, సుధా, దీక్ష అనేవారు పదకొండుమంది నీకు స్త్రీలుగా ఉందురు(రుద్రాణులు). 13

శ్లో॥ గృహాణైతాని నామాని స్థానాని చ సయోషణః।
ఏభిః సృజ ప్రజా బహ్వీః ప్రజానామసి యత్పతిః ॥ 14

టీ:- గృహాణేతి. సయోషణః సస్త్రీకః. ఏభిః స్థానైర్నామభిశ్చ యుక్తః (14)

నీవు ఈ పేర్లను స్థానములను స్వీకరించుము. నీవు ప్రజాపతివి. ఈ స్త్రీలతో గూడి ప్రజలను సృష్టింపుము. 14

శ్లో॥ ఇత్యాదిష్టః సగురుణా భగవన్నీల లోహితః ।
సత్త్వాకృతి స్వభావేన ససర్జాత్మసమాః ప్రజాః ॥15

టీ:- ఇతీతి. సత్త్వం బలం ఆకృతిః నీలలోహితతా స్వభావ స్త్రీవ్రతా. తేన. 15

భగవానుడయిన రుద్రుడు తన తండ్రియగు బ్రహ్మ చేత ఆదేశింపబడినవాడై తనతో సమానమయిన బలముగలవారు, తన వలె నీలలోహిత ఆకారము గలవారు తన వంటి తీవ్ర స్వభావముగల సంతానమును సృష్టించెను. 15

శ్లో॥ రుద్రాణాం రుద్ర సృష్టానాం సమంతాద్గ్రసతాం జగత్ ।
నిశామ్యాసంఖ్యశో యూథాన్ ప్రజాపతిరశంకత ॥ 16

టీ:- రుద్రాణామితి. రుద్రాణాం యూథాని దృష్ట్వా. బ్రహ్మా. 16

రుద్రునిచే సృష్టింపబడిన రుద్రులు గణములుగా ఏర్పడి జగత్తు నంతనూ భక్షించుచుండిరి. బ్రహ్మదేవుడు ఈ రుద్ర గణములను చూచి శంక (అనుమానము) గలవాడయ్యెను. 16

శ్లో॥ అలం ప్రజాభి స్సృష్టాభిరీదృశీభిః సురోత్తమ ।
మయా సహ దహంతీభిర్దిశశ్చక్షుర్భిరుల్బణైః ॥ 17

టీ:- అలమితి. ఉల్బణైరసహ్యైః. 17

ఓ దేవోత్తమా! రుద్రా! నీవు సృష్టించిన ఈ రుద్రగణము తమ క్రూరమగు చూపులతో నాతోసహా దిక్కులన్నింటిని కాల్చివేయు-చున్నారు. ఇట్టి సృష్టి ఇక చాలును. ఇకముందు సృష్టించవద్దు. 17

శ్లో॥ తప ఆతిష్ఠ భద్రం తే సర్వభూత సుఖావహమ్ ।
తపసైవ యథాపూర్వం స్రష్టా విశ్వమిదం భవాన్ ॥ 18

టీ:- తపఇతి. యథా పూర్వం కల్పానురోధేన స్రష్టా స్రక్ష్యతి. (18-25)

నీవు సమస్త ప్రాణులకు సుఖమును కలిగించే తపస్సును ఆచరించుము. నీకు శుభము కలుగుగాక. తపస్సు చేతనే ఈ విశ్వమును పూర్వము వలె సృష్టించగలవు. 18

శ్లో॥ తపసైవ పరం జ్యోతిర్భగవంతమధోక్షజమ్ ।
సర్వభూతగుహావాసమంజసా విందతే పుమాన్ ॥ 19

శ్రీహరి సర్వమును ప్రకాశింపజేసేవాడు. సమస్త ప్రాణుల బుద్ధిగుహయందు నివసించేవాడు. అధోక్షజుడు. ఇట్టి శ్రీహరి మానవులకు తపస్సు చేత మాత్రమే లభించును. 19

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఏవమాత్మభువాదిష్టః పరిక్రమ్య గిరాం పతిమ్ ।
బాఢమిత్యముమామంత్ర్య వివేశ తపసే వనమ్ ॥ 20

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను:-

ఈ విధముగా బ్రహ్మదేవుడు రుద్రుని ఆదేశించెను. వాక్పతి - యగు బ్రహ్మదేవుడికి రుద్రుడు ప్రదక్షిణము చేసి సరే అని ఒప్పుకొని సెలవు తీసికొని తపస్సుచేయుటకై అడవికి వెళ్ళెను. 20

శ్లో॥ అథాభిధ్యాయతః సర్గం దశ పుత్రాః ప్రజజ్ఞిరే ।
భగవచ్ఛక్తియుక్తస్య లోకసంతాన హేతవః ॥ 21

బ్రహ్మదేవుడు విష్ణుమూర్తి యొక్క శక్తితో కూడుకొన్నవాడై సృష్టిని గురించి ఆలోచించుచుండగా, పదిమంది పుత్రులు కలిగిరి. వారు వివిధ లోకముల, ప్రాణుల సృష్టికి కారణభూతులయినారు. 21

శ్లో॥ మరీచిరత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః।
భృగుర్వసిష్ఠో దక్షశ్చ దశమస్తత్ర నారదః ॥ 22

ఆ పది మంది పుత్రులు మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు, దక్షుడు మరియు నారదుడు. 22

శ్లో॥ ఉత్సంగాన్నారదో జజ్ఞే దక్షోఽంగుష్ఠాత్స్వయం భువః ।
ప్రాణాద్వసిష్ఠః సంజాతో భృగుస్త్వచి కరాత్క్రతుః ॥ 23

బ్రహ్మదేవుని ఒడి నుండి నారదుడు, బొటనవ్రేలి నుండి దక్షుడు, ప్రాణము నుండి వసిష్ఠుడు, చర్మము నుండి భృగువు, చేతి నుండి క్రతువు పుట్టిరి. 23

శ్లో॥ పులహో నాభితో జజ్ఞే పులస్త్యః కర్ణయోర్‌ఋషిః।
అంగిరా ముఖతోఽక్ష్ణోఽత్రిర్మరీచిర్మనసోఽభవత్ ॥ 24

నాభి నుండి పులహుడు, చెవుల నుండి పులస్త్యుడు నోటినుండి అంగిరసుడు, కంటి నుండి అత్రి, మనస్సు నుండి మరీచి పుట్టిరి. 24

శ్లో॥ ధర్మః స్తనాద్దక్షిణతో యత్ర నారాయణః స్వయమ్ ।
అధర్మః పృష్ఠతో యస్మాన్మృత్యుర్లోకభయంకరః ॥ 25

బ్రహ్మదేవుని కుడిస్తనము నుండి ధర్ముడు పుట్టెను. నారాయణుడు స్వయముగా ఆయనకు కుమారుడై జన్మించెను. బ్రహ్మదేవుని వీపునుండి అధర్మము పుట్టెను. ఆ అధర్మము నుండి లోకభయంకరమగు మృత్యువు పుట్టెను. 25

శ్లో॥ హృది కామో భ్రువః క్రోధో లోభశ్చాధరదచ్ఛదాత్ ।
ఆస్యాద్వాక్ సింధవో మేఢ్రాన్నిరృతిః పాయోరఘాశ్రయః ॥26

టీ:- హృదీతి. అధ రదచ్ఛదాత్ అధరోష్టాత్. 26

బ్రహ్మదేవుని హృదయమునుండి కామము, కనుబొమ్మల నుండి క్రోధము, క్రిందిపెదవి నుండి లోభము, ముఖము నుండి వాక్కు, మేఢ్రమునుండి సముద్రములు, మలద్వారము నుండి పాపము లకు నిలయుడైన నిరృతి పుట్టిరి. 26

శ్లో॥ ఛాయాయాః కర్దమో జజ్ఞే దేవహూత్యాః పతిః ప్రభుః ।
మనసో దేహతశ్చేదం జజ్ఞే విశ్వకృతో జగత్ ॥ 27

బ్రహ్మదేవుని ఛాయ(నీడ) నుండి దేవహూతి భర్తయైన కర్దమ ఋషి పుట్టెను. ఈ విధముగా బ్రహ్మదేవుని మనస్సు నుండి, దేహము నుండి ఈ జగత్తు పుట్టినది. 27

శ్లో॥ వాచం దుహితరం తన్వీం స్వయంభూర్హరతీం మనః ।
అకామాం చకమే క్షత్తః సకామ ఇతి నః శ్రుతమ్ ॥ 28

ఓ విదురా! బ్రహ్మదేవుని కూతురు అయిన సరస్వతీదేవి మిక్కిలి సౌందర్యవతి, సుకుమారి. కామవాసన లేని ఆ సరస్వతిని తండ్రియై కూడా బ్రహ్మదేవుడు కామించెనని మేము విన్నాము. 28

శ్లో॥ తమధర్మే కృతమతిం విలోక్య పితరం సుతాః ।
మరీచిముఖ్యా మునయో విస్రంభాత్ప్రత్యబోధయన్ ॥ 29

టీ:- దేహాంతరేణ కృతం సర్గం వక్తుం తద్దేహ త్యాగే. కారణమాహ-వాచమితి. నశ్రుతమితి వదన్ మహాపురుషేషు దూషణ మాత్మ నా దృష్టమపి దృష్టమితి న వాచ్యమితి సూచయతి. (27-29)

బ్రహ్మదేవుడు ఇతర దేహముతో సృష్టిచేయుటకును, ఈ దేహము వదలుటకును కారణము చెప్పబడుచున్నది. మరీచి మొదలగు మహర్షులు బ్రహ్మదేవుని కుమారులు తమ తండ్రియగు బ్రహ్మదేవుని మనస్సు అధర్మమునందు లగ్నమగుటను గమనించిరి. వారు తమ తండ్రి తమ మాటకాదనడనే విశ్వాసముతో వినయ పూర్వకముగా ఇట్లు చెప్పిరి. 29

శ్లో॥ నైతత్పూర్వైః కృతం త్వద్యే న కరిష్యంతి చాపరే ।
యత్వం దుహితరం గచ్ఛేరనిగృహ్యాం గజం ప్రభుః ॥ 30

టీ:- నేతి. త్వత్ త్వత్తో యే పూర్వే బ్రహ్మాణః అన్యేవతారాః తైరేవం నకృతం అంగజం కామం. 30

ఓ తండ్రీ! గడచిన కల్పములలోని ఏ బ్రహ్మలు ఇట్టి పని చేయలేదు. రాబోయే కల్పములలోని బ్రహ్మలు కూడా చేయరు. నీవు సమర్థుడవై యుండి కూడా కామమును జయింపలేక కన్న కూతురును పొందుటకు ప్రయత్నించితివి. 30

శ్లో॥ తేజీయసామపి హ్యేతన్న సుశ్లోక్యం జగద్గురో ।
యద్వృత్తమనుతిష్ఠన్ వై లోకః క్షేమాయ కల్పతే ॥ 31

టీ:- తేజీయసామితి. తేజీయసామతి తేజస్వినామపి. సుశ్లోక్యం సత్కీర్తి ప్రదం న భవతి యేషాం తేజస్వినాం వృత్తం. 31

ఓ జగద్గురూ! తేజోవంతులకు (తేజస్సుగల వారికి) ఇట్టిపని మంచికీర్తిని తెచ్చిపెట్టదు. నీవు లోకములకు తండ్రివి. నీ వంటి వారి ప్రవర్తనను లోకులు అనుసరించెదరు. వారికి క్షేమము కలగవలె ననిన నీకు ఇట్టిప్రవర్తన తగదు. నీ సత్ప్రవర్తన లోకులకు క్షేమము కలిగించును. 31

శ్లో॥ తస్మై నమో భగవతే య ఇదం స్వేన రోచిషా ।
ఆత్మస్థం వ్యంజయామాస స ధర్మం పాతుమర్హతి ॥ 32

టీ:- తస్మాఇతి. రోచిషా ప్రకాశేన ఆత్మస్థం ఆత్మనికారణే సూక్ష్మ రూపేణ స్థితం. 32

తనయందున్న ఈ జగత్తును స్వీయజ్ఞాన ప్రకాశము చేత భగవంతుడు ప్రకటము చేసినాడు (కనిపింపజేసినాడు). ఆ భగవానుడే ధర్మమును రక్షించుటకు సమర్థుడు. మేము అట్టి భగవంతునికి నమస్కరించుచున్నాము. 32

శ్లో॥ స ఇత్థం గృణతః పుత్రాన్పురో దృష్ట్వా ప్రజాపతీన్ ।
ప్రజాపతి పతిస్తన్వం తత్యాజ వ్రీడితస్తదా ॥ 33

టీ:- స ఇతి. తన్వం తనుం. 33

శ్లో॥ తాం దిశో జగృహుర్ఘోరాం నీహారం యద్విదుస్తమః ।
కదాచిద్ధ్యాయతః స్రష్టుర్వేదా ఆసంశ్చతుర్ముఖాత్
కథం స్రక్ష్యామ్యహం లోకాన్ సమవేతాన్ యథా పురా ॥ 34

టీ:- తామితి. కథం స్రక్ష్యామీత్యభిధ్యాయతః స్రష్టుః బ్రహ్మణః చతుస్సంఖ్యా యుక్తాత్. ముఖాత్. 34

శ్లో॥ చాతుర్హోత్రం కర్మతంత్రముపవేదనయైః సహ ।
ధర్మస్య పాదాశ్చత్వారస్తథైవాశ్రమవృత్తయః ॥ 35

టీ:- కథమితి. లోకాన్. జనాన్. సమవేతాన్ సుసంగతాన్. వ్యాపార విశేష యుక్తాన్వా. చాతుర్హోత్రం చతుర్ణాం హోత్రాదీనాం కర్మయత్ తత్తంత్రం యజ్ఞవిస్తారః. ఉపవేదైర్న్యాయైశ్చ సహ. ఆశ్రమాస్తద్వృత్తయ శ్చాసన్. 35

అప్పుడు ప్రజాపతులకు తండ్రియగు బ్రహ్మదేవుడు తన ఎదుట తన పుత్రులు ఇట్లు పలుకగా సిగ్గుపడి, దేహమును విడిచిపెట్టెను. 33

బ్రహ్మదేవుడు విడిచిన ఆ శరీరమును దిక్కులు స్వీకరించినవి. పండితులు దీనినే 'పొగమంచు' అనియు 'తమస్సు' అనియు చెప్పుచున్నారు. ఈ లోకములు పూర్వము సౌష్టవముతో సువ్యవస్థితమై ఎట్లుండెనో అట్లే ఎలా సృష్టించగలుగుదును? అని పునః సృష్టి కోసం ఆవిర్భవించిన బ్రహ్మదేవుడు ఆలోచించుచుండెను. అప్పుడు బ్రహ్మదేవుడి నాలుగు ముఖముల నుండి నాలుగు వేదములు ఆవిర్భవించినవి. 34

బ్రహ్మదేవుని ముఖముల నుండి హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనే నలుగురు చేసే కర్మలు పుట్టినవి. నాలుగు ఉపవేదములు, నీతిశాస్త్రము పుట్టినవి. ధర్మము యొక్క నాలుగు పాదములు, బ్రహ్మ చర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అనే ఆశ్రమములు మరియు వాటి ధర్మములు పుట్టినవి. 35

విదుర ఉవాచ

శ్లో॥ స వై విశ్వసృజామీశో వేదాదీన్ముఖతోఽసృజత్ ।
యద్యద్యేనాసృజద్దేవస్తన్మే బ్రూహి తపోధన ॥ 36

టీ:- సఇతి. ముఖతః ముఖేభ్యః. 36

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఋగ్యజుస్సామాథర్వాఖ్యాన్ వేదాన్పూర్వాదిభిర్ముఖైః ।
శస్త్రమిజ్యాం స్తుతిస్తోమం ప్రాయశ్చితం వ్యధాత్క్రమాత్ ॥ 37

టీ:- చాతుర్హోత్ర సృష్టి క్రమమాహ - ఋగితి. శస్త్రం అప్రగీత మంత్ర స్తోత్రం హోతుః కర్మ. ఇజ్యా అధ్వర్యోః కర్మ. స్తుతిస్తోమం. స్తుతిః సంప్రగీతం స్తోత్రం. స్తోమంతదర్థమృక్సముదాయం. శ్రు.'త్రివృత్ స్తోమో భవతీ' త్యాదివిహితం. ఉద్గాతృ ప్రయోజ్యం ప్రాయశ్చిత్తం బ్రాహ్మం. 37

విదురుడు ఇట్లు పలికెను

తపోధనుడవయిన ఓ మైత్రేయా! ప్రజాపతులకు ప్రభువగు బ్రహ్మదేవుడు తన నాలుగు ముఖముల నుండి వేదాదులను సృష్టించెను కదా! ఆయన ఏ ముఖము నుండి ఏ వేదమును సృష్టించెను. నాకు వివరింపుము. 36

మైత్రేయుడు ఇట్లు పలికెను

తూర్పు ముఖము నుండి ఋగ్వేదము, దక్షిణ ముఖము నుండి యజుర్వేదము, పశ్చిమ ముఖము నుండి సామవేదము, ఉత్తర ముఖము నుండి అథర్వణవేదము పుట్టినవి.

ఇక నలుగురు హోతల సృష్టి క్రమమును చెప్పుచున్నాడు.

శస్త్రము - ఇది హోత యొక్క కర్మ
ఇజ్యః - ఇది అధ్యర్యువు యొక్క కర్మ
స్తుతి స్తోమం - ఇది ఉద్గాత యొక్క కర్మ
ప్రాయశ్చిత్తము - ఇది బ్రహ్మ యొక్క కర్మ

ఈ నాలుగు కర్మలు వరుసగా తూర్పు, దక్షిణము, పడమర. ఉత్తర ముఖములనుండి పుట్టినవి. 37

శ్లో॥ ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేదమాత్మనః ।
స్థాపత్యం చాసృజద్వేదం క్రమాత్పూర్వాదిభిర్ముఖైః ॥ 38

బ్రహ్మదేవుడు తన తూర్పు ముఖము నుండి ఆయుర్వేదమును, దక్షిణ ముఖము నుండి ధనుర్వేదమును, పశ్చిమ ముఖము నుండి గాంధర్వవేదమును(సంగీతము), ఉత్తరముఖము నుండి స్థాపత్య-వేదమును (విశ్వకర్మ శాస్త్రము లేదా నిర్మాణ శాస్త్రము) సృష్టించెను. 38

శ్లో॥ ఇతిహాస పురాణాని పంచమం వేదమీశ్వరః ।
సర్వేభ్య ఏవ వక్త్రేభ్యః ససృజే సర్వదర్శనః ॥ 39

బ్రహ్మదేవుడు సర్వదర్శనుడు. సర్వాధికారి. అయిదవ వేదమనే పేరుగల ఇతిహాసములు మరియు పురాణములను తన ముఖము లన్నింటి నుండి సృష్టించెను. 39

టీ:- ఉప వేద క్రమమాహ - ఆయుర్వేదమితి. స్థాపత్యం విశ్వకర్మ సాధ్యం శాస్త్రం.(38-39)

శ్లో॥ షోడశ్యుక్థౌ పూర్వ వక్త్రాత్పురీష్యగ్నిష్టుతావథ ।
అప్తోర్యామాతి రాత్రౌ చ వాజపేయం సగోసవమ్ ॥ 40

కర్మతంత్రము యొక్క వరుసను చెప్పుచున్నాడు. బ్రహ్మదేవుని తూర్పు ముఖము నుండి షోడశి, ఉక్థములు అనే యాగములు, దక్షిణ ముఖము నుండి చయనము, అగ్నిష్టోమము అనే యాగములు, పశ్చిమ ముఖము నుండి ఆప్తోర్యామము, అతిరాత్రము అనే యాగములు, ఉత్తర ముఖము నుండి గోసవము, వాజపేయము అనే యాగములును పుట్టినవి. 40

టీ:- కర్మతంత్ర క్రమమాహ - షోడశీతి. పురిషి చయనం అగ్నిష్టుత్. అగ్నిష్టోమః. 40

శ్లో॥ విద్యా దానం తపః సత్యం ధర్మస్యేతి పదాని చ ।
ఆశ్రమాంశ్చ యథా సంఖ్యమసృజత్సహ వృత్తిభిః ॥ 41

టీ:- విద్యేతి. విద్యేతి శౌచం. శ్లో. క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానాద్వి శుద్ధిః పరమామతే.తి స్మృతేః. దానమితి దయా. శ్లో. భూతాభయ ప్రదానస్య కళాం నార్హంతి షోడశీ.మితి వచనాత్. ఏవం చ సతి. శ్లో. తపశ్శౌచం దయా సత్యమితి పాదాః కృతే కృతా.ఇతి ప్రథమస్కంధోక్తేరవిరోధః41

శ్లో॥ సావిత్రం ప్రాజాపత్యం చ బ్రాహ్మం చాథ బృహత్తథా ।
వార్తా సంచయశాలీనశిలోంఛ ఇతి వై గృహే ॥ 42

టీ:- బ్రహ్మచర్యాద్యాశ్రమేష్వేకైకస్య చాతుర్విధ్యమాహ-సావిత్ర మిత్యాదినా .సావిత్రం బ్రహ్మచర్యం ఉపనయనాదారభ్య గాయత్రీమ

ప్రథమస్కంధములో "తపశ్శౌచం దయా సత్యమితి పాదాః కృతే కృతా" అని ధర్మమునకు గల పాదాలను పేర్కొనడమయినది. ఈ శ్లోకమున బ్రహ్మ ముఖము నుండి విద్య, దానం, తపస్సు, సత్యము అనే ధర్మము యొక్క నాలుగు పాదములు బ్రహ్మ ముఖముల నుండి పుట్టినవి అని చెప్పబడినది. ప్రథమస్కంధములోని విషయమునకు ఇచ్చటికి విరోధము కనిపించుచున్నది. విరోధము లేకుండుటకై శ్రీధరుడు శ్లో. "క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానాద్విశుద్ధిః పరమాయతే" అనెడి స్మృతి వచనము ననుసరించి "విద్య" అనగా "శౌచం" అని తెలిపినాడు. శ్లో. "భూతాభయ ప్రదానస్య కళాం నార్హంతి షోడశి " అనే వచనము ప్రకారము "దానము" అనగా "దయ" అని చెప్పినాడు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస ఆశ్రమములను వారి వారి వృత్తులతో (బ్రతుకుదెరువులతో) సహా తూర్పు మొదలగు ముఖముల నుండి సృష్టించెను. 41

బ్రహ్మచర్యాది ఆశ్రమములలో ఒక్కొక్క దానిలో గల నాల్గేసి విధములను చెప్పుచున్నాడు.

1.సావిత్రము: ఉపనయనము కాగానే గాయత్రిని అధ్యయనము చేస్తూ చేసే మూడురాత్రుల వ్రతము.

2.ప్రాజాపత్యము: సంవత్సరకాలము బ్రహ్మచారి ఆచరించే వ్రతము.

ధీయానస్య త్రిరాత్రం ప్రాజాపత్యం. అత్ర ఛందోభంగ ఆర్షః వ్రతాన్యాచరతః. సంవత్సరం బ్రాహ్మం వేదగ్రహణాంతం. బృహత్. నైష్ఠికం. వార్తా అనిషిద్ధ కృష్యాదివృత్తిః. సంచయో యాచనాది వృత్తిః. శాలీనం అయాచిత వృత్తిః. శిలోంఛః క్షేత్ర పతిత కణిక కణసంగ్రహణవృత్తిః. ఏకవచనమార్షం. ఇత్యేతా గృహే వృత్తయ ఇతి. యద్వా-శిలోంఛ ఇతి ద్వంద్వైక్యేన సప్తమీ. ఏవం భేదే సతి గృహే స్థితా భవంతీత్యర్థః (.42)

శ్లో॥ వైఖానసా వాలఖిల్యౌదుంబరాః ఫేనపావనే ।
న్యాసే కుటీచకః పూర్వం బహ్వోదో హంసనిష్క్రియౌ ॥ 43

టీ:- వైఖానసా ఇతి. వనే స్థితాశ్చత్వారః. వైఖానసాః. అకృష్ట పచ్య వృత్తయః. వాలఖిల్యాః నవేలన్నే లబ్ధే పూర్వ సంచిత త్యాగినః. ఔదుంబరాః ప్రాతరుత్థాయ యాం దిశం ప్రథమం పశ్యంతి తత

3. బ్రాహ్మము: వేదాధ్యయనము పూర్తియగువరకు చేసే వ్రతము.
4. బృహత్: జీవితకాలము బ్రహ్మచారి ఆచరించేవ్రతము.

ఇక గృహస్థాశ్రమవృత్తులు చెప్పబడుచున్నవి.

1. వార్తా: శాస్త్రముద్వారా నిషిద్ధముకాని జీవిక,వ్యవసాయము మొదలగునవి.
2. సంచయము: యజ్ఞయాగాది వైదికక్రియలు చేయించుట ద్వారా బ్రతుకుట.
3. శాలీనము: అయాచితముగా దొరికినదానితో బ్రతుకుట.
4. శిలోంఛము: పంటను కోసిన స్థలములో క్రింద మిగిలిన ధాన్యపు గింజలను ఏరికొనుట అట్లే ధాన్య విక్రయ స్థలమున క్రింద మిగిలిన గింజలను సేకరించుకొని బ్రతుకుట. శిల, ఉంఛ అనువాటిని ద్వంద్వ సమాసముగా పేర్కొనడమయింది. 42

వానప్రస్థాశ్రమము నాలుగు విధములు.

1. వైఖానసులు: దున్నని భూమి నుండి లభించే ఆహారముతో బ్రతికేవారు.
2. వాలఖిల్యులు: ఆహారము లభించగనే అంతకు ముందున్న ఆహారమును ఇతరులకు ఇచ్చివేయు వారు.
3. ఔదుంబరులు: ఉదయము నిద్రలేవగానే ముఖము ఏ దిక్కువైపు

ఆహృతైః ఫలదిభిర్జీవంతః. ఫేనపాః స్వయం పతితైః ఫలాదిభిర్జీవంతః న్యాసే సన్యాసే స్థితాశ్చత్వారః. కుటీచకః స్వాశ్రమ కర్మ ప్రధానః బహూదః కర్మోపసర్జనీ కృత్య జ్ఞాన ప్రధానః. బహూదః కర్మోపసర్జనీకృత్య జ్ఞాన ప్రధానః. హంసో జ్ఞానాభ్యాసనిష్ఠః. నిష్క్రియః ప్రాప్తతత్వః. ఏతే సర్వే యథోత్తరం శ్రేష్ఠాః. 43

ఉండునో ఆ దిక్కులో లభించే ఆహారముతో జీవించేవారు.
4. ఫేనపులు: తమంతతాముగా రాలిన పళ్ళను తిని బ్రతికేవారు.
ఇక సన్న్యాసులలోని భేదములను చెప్పుచున్నారు.
1. కుటీచకులు: ఒక పూరింటిలో ఉంటూ సన్న్యాస ధర్మములను పాటించేవారు. (ఆశ్రమ ధర్మ ప్రధానముగాగల వారు)
2. బహూదకులు: జ్ఞానప్రాధాన్యము కలిగి,కర్మప్రాధాన్యత తక్కువగా గలవారు.
3. హంసులు: జ్ఞానాభ్యాసమునందు నిష్ఠగలవారు.
4. నిష్క్రియులు: పరమహంసలు,జ్ఞానప్రాప్తికలవారు.
వీరిలో మొదటివారికన్న తరువాత పేర్కొనబడినవారు శ్రేష్ఠులు. 43

శ్లో ॥ ఆన్వీక్షికీ త్రయీవార్తా దండనీతిస్తథైవ చ।
ఏవం వ్యాహృతయశ్చాసన్ ప్రణవో హ్యస్యదహ్రతః ॥ 44

టీ:- న్యాయాదీనాం పూర్వాది క్రమేణోత్పత్తిమాహ - ఆన్వీక్షకీతి. ఆన్వీక్షక్యాద్యా మోక్షధర్మకామార్థవిద్యాః. ఆన్వీక్షకీ ఆత్మానాత్మవివేకవిద్యా. మోక్షఫలా. త్రయీ కర్మవిద్యా స్వర్గాదిఫలపరా. వార్తా కృష్యాది రూపా జీవనఫలా. దండనీతిరర్థపరా. భూర్భువస్సువరితి వ్యస్తాస్తిస్రః. సమస్తా శ్చతుర్థీ. యథాహాశ్వలాయనః. ఏవం వ్యాహృతయః. ప్రోక్తావ్యస్తా

బ్రహ్మదేవుని తూర్పు మొదలగు ముఖముల నుండి వరుసగా
1. ఆన్వక్షకీ:- మోక్షమునిచ్చే ఆత్మవిద్య.
2. త్రయీ:- స్వర్గము మున్నగు వాటినిచ్చే కర్మకలాపము.
3. వార్త:- వ్యవసాయము,వ్యాపారము.
4. దండనీతి:- రాజనీతి (పరిపాలనా విధానము). పుట్టినవి. అట్లే వరుసగా వ్యాహృతులు పుట్టినవి. భూర్భువస్సువః అని మూడు వ్యాహృతులు "మహ"అను దానితో కలిపి నాలుగు వ్యాహృతులు. ఆశ్వలాయన మహర్షి చెప్పినట్లు "భూర్భువస్వః" అనునది ఏకపదము.

స్సమస్తా ఇతి. యద్వా. మహ ఇతి చతుర్థీ. తథా చ శ్రుతిః. "భూర్భువస్సువరితి వా ఏతాస్తిస్రో వ్యాహృతయః. తాసాముహస్మైతాం చతుర్థీం. మహాచ మస్యః ప్రదవేయతే. మహఇతీ"తి శ్రుత్యుక్తా వ్యాహృతయః దప్రహతః హృదయాకాశాత్. 44

మరియు భూః, భువః, సువః అనునవి విడిపదములు. తైత్తిరీయోపనిషత్తులో "భూర్భువః సువరితి వా ఏతాస్తిస్రో వ్యాహృతయః. తాసాముహస్మైతాం చతుర్థీం మాహాచమస్యః ప్రవేదయతే. మహ ఇతి" అని కలదు. "ఓం" కారము బ్రహ్మదేవుని హృదయాకాశము నుండి వెలువడినది. 44

శ్లో ॥ తస్యోష్ణిగాసీల్లోమభ్యో గాయత్రీ చ త్వచో విభోః ।
త్రిష్టుబ్మాంసాత్స్నుతోఽనుష్టుబ్జగత్యస్థ్నః ప్రజాపతేః ॥ 45

టీ:- తస్యేతి. స్నుతః స్నాయుతః.శ్రు."అనుష్టుప్ స్నావాని"తి శ్రుతేః 45

విభుడు, ప్రజాపతి అయిన బ్రహ్మదేవుని రోమముల నుండి ఉష్ణిక్ ఛందస్సు, చర్మమునుండి గాయత్రీ ఛందస్సు, మాంసము నుండి త్రిష్టుప్ ఛందస్సులు పుట్టినవి. నరముల నుండి అనుష్టుప్ ఛందస్సు పుట్టినది. "అనుష్టుప్ స్నావాన్" అని వేదవాక్యము. ఎముకల నుండి జగతీ ఛందస్సు పుట్టినది. 45

శ్లో. మజ్జాయాః పఙ్క్తిరుత్పన్నా బృహతీ ప్రాణతోఽభవత్ ।
స్పర్శాస్తస్యాభవజ్జీవః స్వరో దేహ ఉదాహృతః ॥ 46

టీ:- మహాకల్పే బ్రహ్మ శబ్ద బ్రహ్మరూపో భవతీత్యుక్తం. తదేవ దర్శయన్వర్ణానాముత్పత్తి మాహ - సార్ధేన. మజ్జాయా ఇతి. స్పర్శాః కాది వర్గ పంచకం. స్వరః అకారాదిః. 46

బ్రహ్మదేవుని మజ్జనుండి పంక్తి ఛందస్సు, ప్రాణముల నుండి బృహతీఛందస్సు పుట్టినవి. మహాకల్పము నందు బ్రహ్మ, శబ్దబ్రహ్మ స్వరూపముగా ఏర్పడినాడు. దానిని నిరూపిస్తూ వర్ణోత్పత్తిని చెప్పుచున్నాడు. బ్రహ్మదేవుని యొక్క జీవుడే "స్పర్శ" అక్షరములైనవి."క" మొదలగు అయిదు వర్గములు స్పర్శములు. బ్రహ్మదేవుని యొక్క దేహము "అచ్చులు" అయినవి. (అ..ఇ.. మొదలగునవి.) 46

శ్లో ॥ ఉష్మాణమింద్రియాణ్యాహు రంతస్థా బలమాత్మనః ।
స్వరాః సప్త విహారేణ భవంతి స్మ ప్రజాపతేః ॥ 47

టీ:- ఊష్మాణ ఇతి. ఊష్మాణః శ ష స హ చతుష్కం. అంతస్థాః య ర ల వాః. సప్తస్వరాః షడ్జాదయః. విహారేణ క్రీడయా. 47

"ఊష్మములు" శ ష స హ అనే నాల్గు అక్షరములు. ఇవి బ్రహ్మదేవుని ఇంద్రియములనియు, య, ర, ల, వ అనే నాల్గు అంతస్థములు బ్రహ్మదేవుని బలము అనియు చెప్పెదరు. బ్రహ్మదేవుని విహారము నుండి 1. నిషాదము, 2. రిషభము, 3. గాంధారము, 4. షడ్జము, 5. మధ్యమము, 6. దైవతము, 7. పంచమము అనే సప్తస్వరములు ఏర్పడినవి. 47

శ్లో ॥ శబ్దబ్రహ్మాత్మనస్తస్య వ్యక్తావ్యక్తాత్మనః పరః ।
బ్రహ్మావభాతి వితతో నానాశక్త్యుపబృంహితః ॥ 48

టీ:- అతఏవ శబ్దతనుత్వాద్బ్రహ్మణః. పరమేశ్వరో నిత్యప్రకాశ ఇత్యాహ- శబ్దేతి. వ్యక్తా వైఖరీ. అవ్యక్తః ప్రణవః. తదాత్మనః తస్య బ్రహ్మణః వరః పరమేశ్వర ఆభాతి. కీదృశః బ్రహ్మ పరిపూర్ణం తత్రా వ్యక్తాత్మనో బ్రహ్మ రూపో వితతో భవతి వ్యక్తాత్మనో నానా శక్త్యుప బృంహితః ఇంద్రాది రూపో విభాతి. 48

శబ్ద శరీరము కలవాడు కనుకనే బ్రహ్మదేవుడు పరమేశ్వరుడు, నిత్యప్రకాశము గలవాడు అని పిలువబడుచున్నాడు. శబ్దబ్రహ్మ వ్యక్తము, అవ్యక్తము అని రెండు రూపములు గలవాడు. వ్యక్తస్వరూపము వైఖరి. అక్షరముల రూపములో ప్రకటమయ్యేది. అవ్యక్తము ఓంకారము, ప్రణవస్వరూపము. వర్ణముల ప్రకటమునకు కారణము పరా, పశ్యంతీ, మధ్యమారూపములు. వ్యక్తస్వరూపము నుండే పరబ్రహ్మరూప మావిర్భవించినది. వ్యక్తస్వరూపము నుండే బహువిధ శక్తులతో గూడిన ఇంద్రాది దేవతలు వెల్లడి అయినారు. 48

శ్లో ॥ తతో పరాముపాదాయ స సర్గాయ మనో దధే ।
ఋషీణాం భూరివీర్యాణామపి సర్గమవిస్తృతమ్ ॥ 49

బ్రహ్మదేవుడు తాను పరిగ్రహించిన శరీరము పొగమంచు (నీహారము)తో గూడిన తమస్సు అగుటవలన ఆ శరీరమును విడిచి మరియొక దేహమును స్వీకరించెను. మరియొక దేహమును

టీ:- తత ఇతి. యా పూర్వం విసృష్టా సతీ నీహారం తమో భవత్. తతో పరాం అనిషిద్ధ కామశక్తిం తనుం శబ్దబ్రహ్మ తనుస్తు సదాస్త్యేవ. తన్వంతరగ్రహణే కారణమాహ - ఋషీణామిత్యాదినా. తేషాం సర్గమ విస్తృతం జ్ఞాత్వా. (49-50)

శ్లో ॥ జ్ఞాత్వా తద్వృద్ధయే భూయశ్చింతయా మాస కౌరవ ।
అహో అద్భుతమేతన్మే వ్యాపృతస్యాపి నిత్యదా ॥ 50

శ్లో ॥ న హ్యేధంతే ప్రజా నూనం దైవమత్ర విఘాతకమ్ ।
ఏవం యుక్తకృతస్తస్య దైవం చావేక్షతస్తదా ॥ 51

టీ:- నహీతి. యుక్తకృతః యథోచితం కుర్వతః. 51

శ్లో ॥ కస్య రూపమభూద్వేధా యత్కాయమభిచక్షతే ।
తాభ్యాం రూపవిభాగాభ్యాం మిథునం సమపద్యత ॥ 52

టీ:- కస్యేతి. అత ఏవ కస్య బ్రహ్మణః ఇదం ద్వేధా భూతం. ఇత్యాశ్చ ర్యాత్కాయమద్యాప్యభిచక్షతే. 52

స్వీకరించుటకు కారణమును తెల్పుచున్నాడు. మరీచి మొదలగు ఋషులు మహాబలవంతులే అయినను వారివల్ల సృష్టి విస్తరిల్లలేదు. (49)

"అహో" అంటూ బ్రహ్మదేవుని "చింత"ను చెప్పుచున్నాడు.

ఓ విదురా! మరీచ్యాదుల వల్ల సృష్టి విస్తారము జరుగలేదని తెలిసికొని ఇట్లు చింతించసాగెను. అయ్యో! ఏమి ఆశ్చర్యము ! నేను సర్వకాలముల యందును సృష్టి విస్తరణకై ప్రయత్నించుచున్నాను. నా సంతానము విస్తరిల్లుట లేదు. 50

సృష్టివిస్తరిల్లకుండుటకు దైవమే ప్రతికూలముగానున్నది. అని సముచితమగు ప్రయత్నము చేయుటకు ఉద్యుక్తుడై దైవానుగ్రహమునకై భావించుచుండెను. 51

అప్పుడు బ్రహ్మదేవుని శరీరము రెండుగా విడిపోయెను. "క" అనగా బ్రహ్మ. విడిపోయిన బ్రహ్మ శరీరము అనునర్థము చేతనే దేహమునకు (శరీరమునకు) "కాయము"అని పేరువచ్చినది. విడి-పోయిన రెండు భాగముల నుండి స్త్రీ, పురుషుడు అనే జంట ఏర్పడినది. 52

శ్లో ॥ యస్తు తత్ర పుమాన్సోఽభూన్మనుః స్వాయం భువః స్వరాట్
స్త్రీ యాఽఽసీచ్ఛతరూపాఖ్యా మహిష్యస్య మహాత్మనః ॥ 53

టీ:- యఇతి. యా స్త్రీ సా అస్య మహిషీ. 53

ఆ జంటలోని పురుషుడే సార్వభౌముడగు స్వాయంభువ మనువు అయ్యెను. ఆ స్త్రీ శతరూప అనే పేరు పొందెను. మహాత్ముడైన స్వాయంభువునకు ఈమె పత్ని అయ్యెను. 53

శ్లో ॥ తదా మిథున ధర్మేణ ప్రజా హ్యేధాం బభూవిరే ।
స చాపి శతరూపాయాం పంచాపత్యాన్యజీజనత్ ॥ 54

శ్లో ॥ ప్రియవ్రతోత్తానపాదౌ తిస్రః కన్యాశ్చ భారత ।
ఆకూతిర్దేవహూతిశ్చ ప్రసూతిరితి సత్తమ ॥ 55

టీ:-- తదేతి. ఏధాం బభూవిరే వృద్ధిం ప్రాప్తాః. (54-55)

మహానుభావుడవైన ఓ విదురా! అప్పటి నుండి స్త్రీ పురుష సంభోగరూపమైన మిథున ధర్మముచే ప్రాణులు వర్ధిల్లసాగిరి. స్వాయం-భువమనువుకు శతరూప యందు అయిదుగురు సంతానము కలిగిరి. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కొడుకులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు బిడ్డలు కలిగిరి. (54-55)

శ్లో ॥ ఆకూతిం రుచయే ప్రాదాత్కర్దమాయ తు మధ్యమామ్ ।
దక్షాయాదాత్ప్రసూతిం చ యత ఆపూరితం జగత్ ॥ 56

టీ:-- తదేవాహ--ఆకూతిమితి. యః యాసాం సంతతిభిః జగదాపూరితం. 56

ఆకూతిని రుచిప్రజాపతికి, మధ్య కూతురగు దేవహూతిని కర్దమప్రజాపతికి, ప్రసూతిని దక్షప్రజాపతికి ఇచ్చి వివాహము చేసెను. ఈ ఆకూతి, ప్రసూతి, దేవహూతిల సంతానమే జగత్తునంతటా వ్యాపించెను. 56

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
ద్వాదశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
పన్నెండవ అధ్యాయము సమాప్తము.

త్రయోదశోఽధ్యాయః

శ్లో. త్రయోదశే సిసృక్షాయాం మనోరాకస్మికాప్లుతామ్ ।
ధరాముద్ధ -ర్తుముద్భూతాత్క్రోడాద్దైత్యానుసూదనమ్ ॥ సఇతి.

శ్రీ శుక ఉవాచ

శ్లో ॥ నిశమ్య వాచం వదతో మునేః పుణ్యతమాం నృప ।
భూయః పప్రచ్ఛ కౌరవ్యో వాసుదేవకథాదృతః ॥ 1

టీ:- స్వయంభువః పుత్రః తద్దేహాంశత్వాత్. (1,2)

శ్రీ విదుర ఉవాచ

శ్లో॥ స వై స్వాయంభువః సమ్రాట్ ప్రియః పుత్రః స్వయంభువః ।
ప్రతిలభ్య ప్రియాం పత్నీం కిం చకార తతో మునే ॥ 2

శ్లో॥ చరితం తస్య రాజర్షేరాది రాజస్య సత్తమ ।
బ్రూహి మే శ్రద్దధానాయ విష్వక్సేనాశ్రయో హ్యసౌ ॥ 3

టీ:- చరితమితి. విష్వక్సేనః హరిరేవ ఆశ్రయో యస్య. 3

13వ అధ్యాయము

ఈ పదమూడవ అధ్యాయమున సృష్టి విస్తరణాభిలాషియైన బ్రహ్మచేత ఆజ్ఞాపితుడైన స్వాయంభువమనువు సంతానమును వృద్ధి పొందించుట, నీటిలో మునిగియున్న భూమిని విష్ణుమూర్తి ఉద్ధరించుట హిరణ్యాక్షుని వధించుట అనే విషయములు కలవు.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఓ రాజా! కురువంశీయుడగు విదురుడు మైత్రేయ మహర్షి చెప్పిన పవిత్రమగు ఈ కథను వినెనను. వాసుదేవుని కథల యందు మిక్కిలి ఆసక్తి గలవాడైన విదురుడు మరల ఇట్లు ప్రశ్నించెను. 1

విదురుడు ఇట్లు పలికెను

ఓ మైత్రేయ మహర్షీ! స్వయంభువుడు బ్రహ్మదేవుడు. ఆయన ప్రియమైన కుమారుడు స్వాయంభువు. ఈయన సార్వభౌముడుగా ప్రసిద్ధిగాంచెను. స్వాయంభువమనువు “శతరూప”ను భార్యగా పొందిన పిదప ఏమి చేసెను. 2

ఓ ఉత్తముడా! మొదటిరాజగు స్వాయంభువమనువు యొక్క చరిత్రమును నాకు చెప్పుము. ఆయన రాజర్షి, శ్రీహరిని శరణుపొందిన పరమభక్తుడు. నాకు ఆయన చరిత్ర వినాలనే కోరిక ఎక్కువ. 3

శ్లో॥ శ్రుతస్య పుంసాం సుచిరశ్రమస్య
నన్వంజసా సూరిభిరీడితోఽర్థః ।
యత్తద్గుణానుశ్రవణం ముకుంద
పాదారవిందం హృదయేషు యేషామ్ ॥ 4

టీ:- అతస్తస్య చరితం శ్రోతవ్యమిత్యాహ - శ్రుతస్యేతి. సుచిరం శ్రమో యస్మిన్ తస్య పుంసాం శ్రుతస్య. అధీత విద్యా జాతస్య అయమేవార్థః. ఈడితః స్తుతో నను యేషాం హృదయేష్వస్తి. తేషాం భాగవతానాం. గుణానుశ్రవణం. 4

మానవులు చాలాకాలము శ్రమపడి శాస్త్రాధ్యయనమును చేతురు. ఎవరి హృదయములో శ్రీవిష్ణుమూర్తి యొక్క పాదపద్మములు నిలిచియుండునో, అట్టి భక్తుల కథలను, గుణములను వినుటయే శాస్త్రాధ్యయనమునకు యథార్థ ప్రయోజనమని పండితుల అభిప్రాయము. 4

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇతి బ్రువాణం విదురం వినీతం
సహస్ర శీర్ష్ణశ్చరణోపధానమ్ ।
ప్రహృష్టరోమా భగవత్కథాయాం
ప్రణీయమానో మునిరభ్యచష్ట ॥ 5

టీ:- ఇతీతి. సహస్రశీర్ష్ణః శ్రీకృష్ణస్య. చరణావుపధీయేతే యస్మిన్ శ్రీకృష్ణః ప్రీత్యా యస్యోత్సంగే చరణౌ ప్రసారయతీత్యర్థః. తమభ్యచష్ట అభ్యభాషత. ప్రణీయమానః తేన ప్రవర్త్యమానః. (5-6)

శ్రీ శుకుడు ఇట్లు పలికెను

శ్రీహరి (శ్రీకృష్ణుడు) అనంతములైన శిరస్సులు, పాదములు కలవాడు. అట్టి శ్రీహరిని (శ్రీకృష్ణుని) శరణుజొచ్చిన భక్తుడు విదురుడు. విదురుడు వినయసంపద గలవాడు. అలాంటి విదురుడు మైత్రేయుని భగవత్కథయందు ప్రేరేపించెను. ఆనందముచే రోమాంచితము కలవాడై మైత్రేయమహర్షి ఇట్లు చెప్పదొడంగెను. 5

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ యదా స్వభార్యయా సాకం జాతః స్వాయంభువో మనుః ।
ప్రాంజలిః ప్రణతశ్చేదం వేదగర్భమభాషత ॥ 6

మైత్రేయుడు పలికెను

స్వాయంభువమనువు తన భార్యయగు శతరూపతో కలిసి పుట్టిన సమయములో, వేదగర్భుడగు తన తండ్రికి చేతులు జోడించి నమస్కరించి ఇట్లు పలికెను. 6

శ్లో ॥ త్వమేక స్సర్వభూతానాం జన్మకృద్వృత్తిదః పితా ।
అథాపి నః ప్రజానాం తే శుశ్రూషా కేన వా భవేత్ ॥ 7

టీ:- త్వమితి. త్వమేవైకః పితా సర్వేషాం. యతో జన్మకృత్. వృత్తిదః పోషకశ్చ త్వమేవ. అతస్తవ యద్యప్యన్యస్యాపేక్షా నాస్తి. అథాప్యస్మాకం. తే శుశ్రూషా కేన కర్మణా భవేత్. తద్విధేహీత్యుత్తరేణాన్వయః. 7

సకల ప్రాణులకు నీవే తండ్రివి, పోషకుడవు. అయినప్పటికి నీ సంతానమగు మేము నిన్ను ఏ విధముగా సేవించవలయును? ఆ భాగ్యము మాకు ఎట్లు కలుగును? (తరువాతి శ్లోకముతో అన్వయము.)7

శ్లో ॥ తద్విధేహి నమస్తుభ్యం కర్మస్వీడ్యాత్మశక్తిషు ।
యత్కృత్వేహ యశో విష్వగముత్ర చ భవేద్గతిః ॥ 8

టీ:- తదితి. హే ఈడ్య ఆత్మశక్తిషు అస్మచ్ఛక్యేషు కర్తసు మధ్యే. యేన కర్మణా. భవేత్ తద్విధేహి. ఇదం కర్తవ్యమితి కథయ. యత్కృత్వా యస్మిన్ కృతే సతి. విశ్వక్సర్వశః. 8

కొనియాడదగిన ఓ తండ్రీ! మేము చేయగలిగిన (చేయుటకు సామర్థ్యము కలిగిన) పనులలో ఒక పనిని మాకు నిర్ణయించి విధించుము. ఆ పనినిచేసి ఈ లోకములో కీర్తిని, పరలోకములో ఉత్తమగతిని పొందెదము. నీకు నమస్కారము. 8

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

బ్రహ్మా ఉవాచ

శ్లో ॥ ప్రీతస్తుభ్యమహం తాత స్వస్తి స్తాద్వాం క్షితీశ్వర ।
యన్నిర్వ్యలీకేన హృదా శాధి మేత్యాత్మనాఽర్పితమ్ ॥ 9

టీ:- ప్రీత ఇతి. యువాభ్యాం స్వస్తి భద్రం. స్యాద్భూయాత్. యత్ యతః. మా మాం శాధి అనుశిక్షయ. ఇత్యాత్మనా స్వయమేవ. అర్పితం నివేదితం అతః ప్రీతోఽస్మి. 9

బ్రహ్మ ఇట్లు పలికెను:--

ఓ కుమారుడా! రాజా! నీవు కపటములేనివాడివై 'పని యందు నియోగింపుము' అని ఆత్మ సమర్పణముచేసితివి. అందుకు సంతోషించి తిని. మీ ఇద్దరకు శుభము చేకూరుగాక. 9

శ్లో ॥ ఏతావత్యాత్మజైర్వీర కార్యా హ్యపచితిర్గురౌ ।
శక్త్యాఽప్రమత్తైర్గృహ్యేత సాదరం గతమత్సరైః ॥ 10

టీ:- ఏతావతీతి. అపచితిః పూజా గృహ్యేత ఆజ్ఞేతి శేషః. సనకాదయో న కుర్వంతి. వయం కిమితి కరిష్యామ ఇత్యేవం భూతో మత్సరో యైభ్య స్తైః. 10

ఓ వీరా! తండ్రియెడల కొడుకులు మాత్సర్యములేనివారై సావధానులై శక్తికొలది సేవను చేయవలెను. తండ్రి ఆజ్ఞను పాలించుటయే తండ్రికి చేసే సేవ. మత్ అగ్రే సరతి ఇతి మత్సరః. (సనకాదులు సంతానవృద్ధి చేయలేదు. నేనేల చేయవలెను? అని అనుకోరాదని భావము.) 10

శ్లో ॥ స త్వమస్యామపత్యాని సదృశాన్యాత్మనో గుణైః ।
ఉత్పాద్య శాస ధర్మేణ గాం యజ్ఞైః పురుషం యజ ॥ 11

టీ:- స ఇతి. గాం శాస పాలయేత్యర్థః. పురుషం శ్రీహరిం. 11

నీ భార్యయైన శతరూప యందు నీతో సమానులైన సంతానమును పొందుము. ఈ భూమండలమును పాలింపుము, యజ్ఞములను ఆచరిస్తూ శ్రీహరిని ఆరాధింపుము. 11

శ్లో ॥ పరం శుశ్రూషణం మహ్యం స్యాత్ప్రజా రక్షయా నృప ।
భగవాంస్తే ప్రజాభర్తుర్హృషీకేశో ను తుష్యతి ॥ 12

టీ:- పరమతి. ప్రజాపాతకస్య తే. తుష్టో భవతి. 12

ఓ మహారాజా! ప్రజలను రక్షించుటయే నీవు నాకు చేసే గొప్ప శుశ్రూష(సేవ) యగును. ప్రజాపాలకుడవైనచో భగవానుడు నీకు ప్రసన్నుడగును. 12

శ్లో ॥ యేషాం న తుష్టో భగవాన్యజ్ఞలింగో జనార్దనః ।
తేషాం శ్రమో హ్యపార్థాయ యదాత్మా నాదృతః స్వయమ్ ॥13

టీ:- యేషామితి. యజ్ఞలింగః యజ్ఞమూర్తిః. అపగతః అర్థో యస్మిన్. కేవలం శ్రమాయైవేత్యర్థః. యత్ యస్మాత్. స్వాత్మైవ స్వయం నాదృతః తస్మిన్నతుష్టే స్వార్థస్యైవాసిద్ధేః. సర్వాత్మకత్వాచ్చ తస్య. 13

ప్రజాపాలన విషయములో నిరాసక్తుడగు వాని యందు భగవానుడు, శ్రీహరి, యజ్ఞస్వరూపుడు, జనార్దనుడు అయిన దేవదేవుడు ప్రసన్నుడు కాడు. వాడు పడే శ్రమ వ్యర్థమగును. ఎందుకనగా ఆత్మస్వరూపుడైన శ్రీహరిని వారు ఆదరించుటలేదు. తమను తామే నిరాదరించుకొనుచున్నారు. 13

మనురువాచ

శ్లో ॥ ఆదేశేఽహం భగవతో వర్తేయామీవసూదన ।
స్థానం త్విహానుజానీహి ప్రజానాం మమ చ ప్రభో ॥ 14

టీ:- ఆదేశ ఇతి. వర్తేయ వర్తిష్యే. హే అమీవసూదన పాపనాశన. అనుజానీహి అత్ర స్థాతవ్యమిత్యనుజ్ఞాం దేహి. 14

మనువు ఇట్లు పలికెను

ఓ ప్రభూ! పాపములను నశింపజేసేవాడా! నేను నీ ఆజ్ఞను శిరసావహించెదను. కాని నాకు, ప్రజలకు నివాసస్థానమును చూపుము. (అనుగ్రహించుము). 14

శ్లో ॥ యదోకః సర్వసత్త్వానాం మహీ మగ్నా మహాంభసి।
అస్యా ఉద్ధరణే యత్నో దేవ దేవ్యా విధీయతామ్ ॥ 15

టీ:- మహీతి చేదత ఆహ - యదితి. యదోకః స్థానం. సా మహీ. హే దేవ. అస్యాః దేవ్యాః. 15

ఓ దేవా! సకల ప్రాణులకు నివాసస్థానమైన మహి (భూమి) మహాజలములో (ప్రళయజలములో) మునిగి యున్నది. ఈ భూదేవిని పైకి తీయుటకు ప్రయత్నము చేయవలయును. 15

శ్లో ॥ పీతం జలం మయా సర్వం పృథివీ చ నివేశితా ।
తథాపి కిమిదం సాఽద్య ప్లావ్యతే పునదంబుభిః ॥

నేనింతకు పూర్వమే సమస్తమైన జలమును త్రాగితిని, భూమిని నిల్పితిని. అయిననూ భూమి నీట మునిగియున్నది. కారణమేమి?

శ్లో ॥ ప్రజాదేవాసుర పితౄన్మనుష్యా న్పశు పక్షిణః ।
సరీసృపాన్నగాన్నాగాన్ భూతాన్యుచ్చావచాని చ ॥

ప్రజలు, దేవతలు, అసురులు, పితరులు, మనుష్యులు, పశువులు, పక్షులు, సరీసృపములు, పర్వతములు, సర్పములు మొదలగు ఉచ్చావచములైన ప్రాణులను నేను సృష్టింపబూనితిని.

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ పరమేష్ఠీ త్వపాం మధ్యే తదా సన్నామవేక్ష్య గామ్ ।
కథమేనాం సమున్నేష్య ఇతి దధ్యౌ ధియా చిరమ్ ॥16

టీ:- పరమేష్ఠీతి. పూర్వం పానేకృతేఽపి పునరకాండవివోద్భూతానాం. అపాం మధ్యే. సన్నామవసన్నాం నిమగ్నాం. సమున్నేష్యే ఉద్ధరిష్యామితి. చింతయామాస. చింతామేవాహ - సరీసృపానితి.

మైత్రేయుడు ఇట్లు పలికెను

ఈ భూమి నీట మునిగియున్నది. దీనిని పైకి తెచ్చుట ఎట్లు? అని బ్రహ్మదేవుడు చాలాసేపు ఆలోచించెను. 16

సృజతస్సతోవార్భిః అద్భిః రసాం రసాతలం. అథేతి. ఈశ్వరేణ సర్గేణ యోజితో మే. అనుష్ఠేయం స ఏవ విదధాతు.(16,17)

శ్లో ॥ సృజతో మే క్షితిర్వార్భిః ప్లావ్యమానా రసాం గతా ।
అథాత్ర కిమనుష్ఠేయ మస్మాభిః సర్గ యోజితైః ।
యస్యాహం హృదయాదాసం స ఈశో విదధాతు మే ॥ 17

బ్రహ్మదేవుని చింతను గురించియే చెప్పుచున్నాడు. నేను సృష్టి చేయనుండగా ఈ భూమి రసాతలమునకు వెళ్ళిపోయినది. ఇప్పుడు నేనేమి చేయగలను? సంకల్ప మాత్రముచే శ్రీహరికి జన్మించి, సృష్టి గురించి ఆలోచించుచుంటిని. ఆ శ్రీహరియే ఈ నా కర్తవ్యమును నెరవేర్చుగాక! 17

శ్లో ॥ ఇత్యభిధ్యాయతో నాసావివరాత్సహసాఽనఘ ।
వరాహతోకో నిరగాదంగుష్ఠపరిమాణతః ॥ 18

టీ:- ఇతీతి. వరాహతోకః సూక్ష్మ వరాహః.18

పాపరహితుడవైన ఓ విదురా! బ్రహ్మదేవుడు ఇలా ఆలోచించు చుండగనే అప్పటికప్పుడు ఆయన ముక్కురంధ్రము నుండి బొటన వ్రేలంత వరాహశిశువు బయటకు వచ్చెను.18

శ్లో ॥ తస్యాభిపశ్యతః ఖస్థః క్షణేన కిల భారత ।
గజమాత్రః ప్రవవృధే తదద్భుతమభూన్మహత్ ॥ 19

టీ:- తస్యేతి. ఖస్థః ఆకాశే స్థితస్సన్. 19

ఓ విదురా! బ్రహ్మదేవుడు ఆకాశములోనున్న ఆ వరాహమును చూచుచుండగనే అది గొప్ప ఆశ్చర్యకరముగ, ఏనుగంత పెద్దదా యెను. 19

శ్లో ॥ మరీచి ప్రముఖైర్విప్రైః కుమారైర్మనునా సహ ।
దృష్ట్వా తత్సౌకరం రూపం తర్కయామాస చిత్రధా ॥ 20

బ్రహ్మదేవుడు మరీచి మొదలగు విప్రులతో, కుమారుడగు స్వాయంభువ మనువుతో కూడినవాడై ఆ వరాహమును చూచి అనేక విధములుగా ఆలోచించుచుండెను. 20

శ్లో ॥ కిమేతత్సౌకర వ్యాజం సత్త్వం దివ్యముపస్థితమ్ ।
అహో బతాశ్చర్యమిదం నాసాయామే వినిస్సృతమ్ ॥ 21

టీ:- మరీచీతి. చిత్రధా అనేకధా. (20,21)

చాలా ఆశ్చర్యము. వరాహము రూపముగా వచ్చిన ఈ దివ్య ప్రాణి ఏమైయుండును. ఇది నా ముక్కు నుండి బయటకు వచ్చుట వింత గదా! 21

శ్లో ॥ దృష్టోఽఙ్గుష్ఠ శిరోమాత్రః క్షణాద్గండశిలాసమః ।
అపిస్విద్భగవానేష యజ్ఞో మే ఖేదయన్మనః ॥ 22

టీ:- దృష్ట ఇతి. పూర్వమంగుష్ఠ ప్రమాణో దృష్టః. తతో గండ శిలా స్థూల పాషాణః. తత్సమః. యజ్ఞః విష్ణుః, నిజరూప తిరోధానేన. మే మనః. ఖేదయన్. 22

బొటనవేలు చివరి భాగమంత పరిమాణముగా నున్న ఈ వరాహము క్షణములో పెద్ద బండరాయి అంత అయినది. యజ్ఞమూర్తి యైన భగవానుడే నా మనస్సును ఖేదపెట్టుచున్నాడా ఏమి? (మోహ పెట్టు చున్నాడా?) 22

శ్లో ॥ ఇతి మీమాంసతస్తస్య బ్రహ్మణః సహ సూనుభిః ।
భగవాన్ యజ్ఞ పురుషో జగర్జాగేంద్రసన్నిభః ॥ 23

టీ:- ఇతీతి. ఇతి మీమాంసతః మీమాంసమానస్య సతః. జగర్జ అగర్జత్. అగేన్ద్రసన్నిభః గిరీంద్రతుల్యః. 23

బ్రహ్మదేవుడు ఇట్లు తన కుమారులతో కలిసి చర్చించుచుండగా భగవానుడు యజ్ఞ వరాహరూపమును దాల్చి గొప్ప పర్వతమును బోలియున్న వాడై గర్జించెను. 23

శ్లో ॥ బ్రహ్మాణం హర్షయామాస హరిస్తాంశ్చ ద్విజోత్తమాన్ ।
స్వ గర్జితేన కకుభః ప్రతిస్వనయతా విభుః ॥ 24

గర్జించుట యొక్క ఉపయోగమును చెప్పుచున్నాడు. సర్వశక్తి మంతుడగు ఆ వరాహమూర్తి చేసే గర్జనతో దిక్కులు ప్రతి ధ్వనించెను. ఆ గర్జనతో బ్రహ్మదేవునికి మరీచ్యాది మహర్షులకు ఆనందము కలిగెను. 24

శ్లో ॥ నిశమ్య తే ఘర్ఘరితం స్వఖే ద
క్షయిష్ణు మాయామయ సూకరస్య ।
జనస్తపస్సత్య నివాసినస్తే
త్రిభిః పవిత్రైర్మునయోఽగృణన్ స్మ ॥ 25

టీ:- గర్జనప్రయోజనమాహ – నిశ్యమ్యేతి. ఘర్ఘరితం తజ్జాత్యనుకరణ ధ్వనిం పూర్వమనిశ్చయేన. యః స్వఖేదః తం. క్షపిష్ణు క్షపయిష్ణు. నాశకం. త ఇతి పునరుక్తిః ప్రసిద్ధిఖ్యాపనార్థా. త్రిభిః పవిత్రైః ఋగ్యజుస్సామమంత్రైః. అస్తువన్. (24,25)

"ఘురఘుర" అనునది వరాహ((పంది) జాతి చేసే శబ్దమునకు అనుకరణము. యజ్ఞ వరాహమూర్తి చేసిన ధ్వనితో బ్రహ్మ మొదలగు వారి అనిశ్చయమైన దుఃఖము దూరమయ్యెను."తే" శబ్దము యొక్క పునరుక్తి బ్రహ్మాదుల, జనలోక, తపోలోక, సత్యలోక నివాసుల ప్రసిద్ధిని తెలుపుచున్నది. ఆ యజ్ఞభగవానుని, జనలోక, తపోలోక, సత్యలోక వాసులగు మునులు ఋక్, యజుస్, సామవేద మంత్రములతో స్తుతించిరి. 25

శ్లో ॥ తేషాం సతాం వేదవితానమూర్తి
ర్బ్రహ్మావధార్యాత్మగుణానువాదమ్ ।
వినద్య భూయో విబుధోదయాయ
గజేంద్రలీలో జలమావివేశ ॥ 26

వేదములచేత స్తుతింపబడిన ఆకారముగలవాడు వేదవితాన మూర్తి. వేదములు విష్ణుమూర్తి యొక్క గుణవర్ణన రూపములో నున్నవి. ఆ మునులు, ఋషులు పఠించిన వేద మంత్రములను విని ఆయన పులకించెను. అందుకే దేవతల, ఋషుల మేలు కోరి మరియొక

టీ:- తేషామితి. వేదైః వితన్యతే స్తూయతే మూర్తిర్యస్య సః. అత ఏవాత్మనో గుణాననువదతీతి తథా. తతస్తేషాం. బ్రహ్మ ఉచ్చారితం. వేదం అవధార్య జ్ఞాత్వా. 26

శ్లో ॥ ఉత్క్షిప్తవాలః ఖచరః కఠోరః
సటా విధున్వన్ఖరరోమశత్వక్ ।
ఖురాహతాభ్రః సిత దంష్ట్ర ఈక్షా
జ్యోతిర్బభాసే భగవాన్ మహీధ్రః ॥ 27

టీ:- కథంభూతస్సన్నివేశేత్యపేక్షాయామాహ - ఉత్క్షిప్తేతి. ఉచ్చైః క్షిప్తో వాలః పుచ్ఛం యేన. ఖచరః ఆకాశచారీ కఠోరః కఠినః. సటాః స్కంధవాలాః. ఖరాణి తీక్ష్ణాని. రోమాని యస్యాం సా త్వక్. యస్య ఖురైరాహతాన్యభ్రాణి యేన. సిత దంష్ట్రః అతిశుక్లదంష్ట్రః ఈక్షా నిరీక్షణమేవ జ్యోతిరాలోకో యస్య. తదా ప్రకాశాంతరాభావాత్. బభాసే బభౌ. మహీధ్రః ఉద్ధర్తా. 27

శ్లో ॥ ఘ్రాణేన పృథ్వ్యాః పదవీం విజిఘ్రన్
క్రోడాపదేశః స్వయమధ్వరాంగః ।
కరాళ దంష్ట్రోఽప్య కరాళ దృగ్భ్యా
ముద్వీక్ష్య విప్రాన్ గృణతోఽవిశత్కమ్ ॥ 28

మారు గర్జించెను. (అప్పుడు) గొప్ప ఏనుగు వంటి విలాసముగల ఆ వరాహభగవానుడు నీటిలో ప్రవేశించెను. 26

ఈ రెండు శ్లోకములలో వరాహమూర్తి జలములలో ప్రవేశించే సమయాన ఎట్లుండెనో వర్ణింపబడుచున్నది. శ్రీహరి భగవానుడు వరాహ రూపములో తోకను పైకెత్తినవాడుగను, ఆకాశమునందు సంచరించువాడుగను, కఠినమైన అవయవములుగలవాడుగను, మెడ యందలి జూలును విదిలించేవాడుగనూ, చర్మము మీది వెంద్రుకలు వాడివిగా గలవాడును, డెక్కల చేత మేఘములను చెల్లాచెదురు చేయు వాడుగను, తెల్లని కోరలు గలవాడుగను, ప్రకాశించే కన్నులు గలవాడు గను, పర్వతాకారము గలవాడుగను ఉండెను. 27

శ్రీహరి స్వయముగ యజ్ఞస్వరూపుడై యుండియు వరాహము నెపమున వాసన చూస్తూ భూమిని వెదకసాగెను. భయంకరములైన కోరలు గలవాడయ్యును కృపాదృష్టి గలవాడయ్యెను. తనను స్తోత్రము చేయుచున్న మరీచాది ఋషులను తలపైకెత్తి చూస్తూ నీటిలో ప్రవేశించెను. 28

టీ:- ఘ్రాణేనేతి క్రోడాపదేశః వరాహచ్ఛద్మా. అతః స్వయమధ్వరాం గోఽపి పశురివ ఘ్రాణేన విజిఘ్రన్. గృణతస్స్తోత్‌న్ విప్రాన్ ఉద్వీక్ష్య ఊర్ధ్వం వీక్ష్య కం జలమవిశత్. 28

శ్లో ॥ స వజ్ర కూటాంగ నిపాత వేగ
విశీర్ణ కుక్షిః స్తనయన్నుదన్వాన్ ।
ఉత్సృష్ట దీర్ఘోర్మిభుజైరివార్త
శ్చుక్రోశ యజ్ఞేశ్వర పాహి మేతి ॥ 29

టీ:- తదానీం తనం సముద్ర ధ్వనిముత్ప్రేక్షతే - స ఇతి. ఉదన్వాన్ సముద్రః. ఆర్తఇవ స్తనయన్ శబ్దం కుర్వన్ భో యజ్ఞేశ్వర మా మాం పాహి. మా భింద్ధీత్యేవం చుక్రోశ. ఆర్తసామ్యమాహ - ఉత్సృష్టాః ప్రసారితాః ఊర్మయ ఏవ భుజాః తైర్విశిష్టః ఆర్తత్వే హేతుః. వజ్రకూటో వజ్రమయ పర్వతః. తద్వదంగం యస్య భగవతః. తస్య నిపాత వేగేన. విశీర్ణా కుక్షిర్యస్య. 29

అప్పటి సముద్ర ధ్వనిని ఆర్తధ్వనిగా ఉత్ప్రేక్షించి చెప్పుచున్నాడు. వరాహభగవానునిది వజ్రపర్వతము వంటి దేహము. అది సముద్రములో పడుట చేత సముద్రగర్భము చీలిపోయి పెద్ద ధ్వని ఏర్పడెను. ఆ ధ్వని సముద్రుడు తన తరంగములనే భుజములను చాచి ఓ యజ్ఞేశ్వరా! రక్షింపుము, రక్షింపుము అని ఆర్తుని వలె మొరపెట్టుచున్నట్లుండెను. 29

శ్లో ॥ ఖురైః క్షురప్రైర్దరయం స్తదాప
ఉత్పార పారం త్రిపరూ రసాయామ్ ।
దదర్శ గాం తత్ర సుషుప్సురగ్రే
యాం జీవధానీం స్వయమభ్యధత్త ॥30

అపుడు రసాతలములో భూమిని చూచెను. (కః = ఎవరు?) ప్రాతస్సవన, మాధ్యందినసవన, సాయంసవనములనే మూడు పర్వాలు గల యజ్ఞస్వరూపుడైన వరాహభగవానుడు. (కింకుర్వన్=ఏమిచేయుచు) పొడవాటి కత్తుల వంటి డెక్కులతో అపారములైన జలరాశిని పారము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- ఖురైరితి. తదా రసాయాం రసాతలే గాం పృథ్వీం దదర్శ కః త్రిపరుః త్రీణి పరూంషి సవనాత్మకాని పర్వాణి యస్య యజ్ఞమూర్తిరిత్యర్థః కిం కుర్వన్ క్షురప్రాః. ఆయతాగ్రాః శరాః తత్సదృశైః ఖురైః అపో దరయన్ ఉత్పారపారం ఉత్పారాణాం పారశూన్యానామపాం, పారమవసానం యథా భవతి తథా. విదారయన్. కథంభూతానాం అగ్రే ప్రళయసమయే. తత్ర తాసు అప్సు సుషుప్సుః శిశయిషుస్సన్ జీవా ధీయంతే యస్యాం తాం. సర్వజీవాధారభూతాం స్వయమభ్యధత్త ఆభిముఖ్యేన దధార. జఠరే ధృతవానిత్యర్థః. అనేన తదుద్ధారణే అనాయాసం ద్యోతయతి. 30

గలదిగా జేసెను. (ఒక ఒడ్డు గలదిగా చేసెను). (కథం ధృతః= ఎట్లు భరించెను) ప్రళయకాలమున నిద్రించగోరిన భగవానుడు, సర్వ జీవాధారమయిన భూమిని తానే స్వయముగా తన యందు ధరించెను. (జఠరమునందు ధరించెనని అర్థము) అందు చేత ఆ భూమిని ఉద్ధరించడంలో అనాయాసము కనిపించుచున్నది. భగవానుడు అనాయాసముగా భూమిని ఉద్ధరించినాడని అర్థము. 30

శ్లో ॥ స్వదంష్ట్రయోద్ధృత్య మహీం నిమగ్నాం
స ఉత్థితః సంరురుచే రసాయాః ।
తత్రాపిదైత్యం గదయాఽఽపతంతం
సునాభసందీపిత తీవ్రమన్యుః ॥ 31

టీ:- స్వేతి. రసాయాస్సకాశాదుత్థితస్సయజ్ఞవరాహః సంరురుచే సమ్యగశోభత. తత్రాప్యంభసి. గదాముద్యమ్య ఆగచ్ఛంతం. రుంధానం ప్రతిబధ్నంతం అసహ్యస్సహనానర్హో విక్రమో యస్య తం దైత్యం సునాభం చక్రం. తద్దత్సందీపితస్తీవ్రో మన్యుర్యస్య. యద్వా. మయి విద్యమానే కిమితి. పరిభవం సహస ఇతి. సునాభసందీపితః తీవ్రమన్యుః. 31

రసాతలమున మునిగియున్న భూమిని తన కోరలతో పైకెత్తు నపుడు ఆ వరాహభగవానుడు మిక్కిలి శోభిల్లెను. హిరణ్యాక్షుడనే రాక్షసుడు గదను ధరించినవాడై అడ్డగించుచు అతని మీదికి వచ్చు చుండెను. అప్పుడు వరాహభగవానుడు తీవ్రమగు కోపముతో సుదర్శన చక్రమువలె మండిపడెను. (తరువాతి శ్లోకముతో అన్వయము). 31

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ జఘాన రుంధానమసహ్య విక్రమం
సలీలయేభం మృగరాడివాంభసి ।
తద్రక్త పంకాంకిత గండ తుండో
యథా గజేంద్రో జగతీం విభిందన్ ॥ 32

టీ:- జఘానేతి. స భగవాన్ సింహో గజమివ. లీలయా జఘాన. గజేంద్రో జగతీం వప్రాది భూమిం క్రీడయా విదారయన్ గైరికయా యథా అరుణ గండ తుండో భవతి, తథా తస్య రక్తమేవ పంకః. తేనాంకితం గండ తుండం యస్య జఘానేతి పూర్వేణాన్వయః. 32

సహింపరాని పరాక్రమముతో తనను అడ్డగించుచున్న హిరణ్యాక్షుడిని, సింహము ఏనుగును చంపునట్లు అవలీలగా ఆ నీటిలో సంహరించెను. గజేంద్రుడు విలాసముగా పర్వత ప్రాంత భూమిని రాపిడి చేసినప్పుడు ఆ గజేంద్రుని చెక్కిళ్ళు, తొండము గైరికాది ధాతువుల ప్రభావముచే ఎరుపెక్కును. అట్లే హిరణ్యాక్షుని సంహరించినపుడు ఆ రాక్షసుని రక్తముచే వరాహభగవానుని చెక్కిళ్ళు, ముఖ భాగము ఎరుపెక్కెను. 32

శ్లో ॥ తమాల నీలం సిత దంత కోట్యా
క్ష్మాముత్క్షిపంతం గజలీలయాఽఙ్గ ।
ప్రజ్ఞాయ బద్ధాంజలయోఽనువాకైః
విరించి ముఖ్యా ఉపతస్థురీశమ్ ॥ 33

ఓ విదురా! తమాలవృక్షమువలె నలుపుగా నున్న వరాహ భగవానుడు తన తెల్లనైన దంతపుకొనతో భూమిని పైకి ఎత్తెను. అది ఏనుగు విలాసముగా కమలపుష్పమును పైకి ఎత్తినట్లుండెను. బ్రహ్మాదులు ఈ దృశ్యమును చూచి వేద సూక్తములతో స్తుతించిరి. 33

ఋషయః ఊచుః

శ్లో ॥ జితం జితం తేఽజిత యజ్ఞ భావన
త్రయీం తనుం స్వాం పరిధున్వతే నమః।
యద్రోమ గర్తేషు నిలిల్యురధ్వరాః
తస్మై నమః కారణసూకరాయ తే ॥ 34

ఋషులు పలికిరి

ఓ పరాజయమెరుగనివాడా! ఓ యజ్ఞారాధ్యుడా! నీకు జయము. జయము. వేదమయమగు దేహమును విదుల్చుచున్న నీకు నమస్కారము. నీ రోమకూపములందు యజ్ఞములు విలీనమైయున్నవి. అట్టి నీకు నమస్కారములు. పృథివిని ఉద్ధరించుటకై సూకర(వరాహ)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.


టీ:- తమాలేతి. ప్రాజ్ఞాయ ఆలక్ష్య. అనువాకో వైదికం సూక్తం. తత్సదృశైర్వాక్యైస్తుష్టువుః. (33,34)

శ్లో ॥ రూపం తవైతన్నను దుష్కృతాత్మనాం
దుర్దర్శనం దేవయదధ్వరాత్మకమ్ ।
ఛందాంసి యస్య త్వచి బర్హిరోమ
స్వాజ్యం దృశిత్వంఘ్రిషు చాతుర్హోత్రమ్ ॥ 35

టీ:- యజ్ఞాత్మతతాం ప్రపంచయంతః స్తువంతి చతుర్భిః-రూప మితి. ఛందాంసి గాయత్ర్యాదీని. అత్ర యజ్ఞాంగభూత ఛంద ఆద్యను వాదేన భగవదవయవతా విధీయతే. బర్హి శబ్దే రేఫాభావ ఆర్షః. స్వాజ్యం సంస్కృతాజ్యం. దృశి చక్షుషి. చాతుర్హోత్రం హోత్రాదికర్మ చతుష్టయం. 35

శ్లో ॥ స్రుక్తుండ ఆసీత్స్రువ ఈశ నాసయోః
ఇడోదరే చమసాః కర్ణరంధ్రే ।
ప్రాశిత్రమాస్యే గ్రసనే గ్రహాస్తు తే
యచ్చర్వణం తే భగవన్నగ్నిహోత్రమ్ ॥ 36

టీ:- స్రుగితి. స్రుక్ జుహూః. తుండే ముఖాగ్రే. స్రువోనాసికయోః

రూపమును ధరించిన నీకు నమస్కారము. 34

ఈ నాలుగు శ్లోకములలో భగవంతుని యజ్ఞస్వరూపమును వివరించడమైనది. ఈ నీ యజ్ఞమయమగు స్వరూపమును దుష్టబుద్ధులు అసలే చూడజాలరు. నీ చర్మమునందు గాయత్రి మొదలగు ఛందస్సులు గలవు. (ఛందస్సులు మొదలగునవి భగవంతుని యజ్ఞాంగ భూతములైన అవయవములుగా నిరూపించడమైనది). నీ రోమముల యందు దర్భలు గలవు. కంటి యందు నెయ్యి కలదు. పాదముల యందు హోత, ఉద్గాత, అధ్వర్యుడు మరియు బ్రహ్మ అనే నలుగురు ఋత్విక్కుల కర్మలు కలవు. 35

ఓ వరాహ భగవానుడా! నీ తుండము(ముఖాగ్రము) నందు స్రుక్, నాసికా రంధ్రముల యందు స్రువము కలరు. ఇడాపాత్ర అనగా భక్షణ పాత్ర. అది నీ ఉదరమునందు ఇమిడియున్నది. చెవి చిల్లుల యందు సోమరసము నుంచే చమస పాత్రలు కలవు. నోటి యందు బ్రహ్మ భాగ పాత్ర కలదు. కంఠ వివరములందు గ్రహములు కలవు. నీవు భక్షించుటయే అగ్నిహోత్రము. 36

ఇడా భక్షణ పాత్రం చమసాః గ్రహాశ్చ సోమ పాత్రాణి. తత్ర చమసాః చతురశ్రాః గ్రహాః ఊర్ధ్వాకారాః. ప్రాశిత్రం బ్రహ్మభాగ పాత్రం గ్రసతేఽనేనేతి గ్రసనం ముఖాంతర్విర్తిఛిద్రం చర్వణం భక్షణం. 36

శ్లో ॥ దీక్షాఽనుజన్మోపసదః శిరో ధరం
త్వం ప్రాయణీయో దయనీయ దంష్ట్రః ।
జిహ్వా ప్రవర్గ్యస్తవ శీర్షకం క్రతోః
సభ్యావసథ్యం చితయోఽసవో హి తే ॥ 37

టీ:- దీక్షేతి. దీక్షా దీక్షణీయేష్టిః, అనుజన్మ భగవతో వారం వారమభివ్యక్తిః. ఉపసదః తిస్ర ఇష్టయః. శిరోధరః గ్రీవా. ప్రాయణీయా దీక్షానంతరేష్టిః ఉదయనీయా సమాప్తేష్టిః. ప్రాయణీయోదయనీయేష్టీ తే ఏవ దంష్ట్రేయస్య. ప్రవర్గ్యో మహావీరః. యత్సంతప్త ఘృత పూర్ణే మహావీరే క్షీర ప్రక్షారణం ప్రత్యుపసదం పూర్వం క్రియతే. సభ్యో హోమ రహితోఽగ్నిః. అవసథ్యః ఔపాసనాగ్నిః. తయోర్ద్వంద్వైక్యం. తత్తవ క్రతురూపస్య. శీర్షం శిరః. చితయః ఇష్టకాచయనాని. పంచ అసవః ప్రాణాః. 37

ఓ యజ్ఞస్వరూపుడా! నీవు పలుమార్లు అవతరించుటయే దీక్షణీయేష్టి. ఉపసత్తులు అనే మూడు ఇష్టులే నీ మెడ. దీక్ష తరువాతది ప్రాయణీయేష్టి. యజ్ఞాంతములో చేసేది ఉదయనీయేష్టి. ప్రాయణీయ, ఉదయనీయేష్టులే నీ కోరలు. ఉపసత్తునకు ముందు చేసే కర్మను ప్రవర్గ్యమందురు. అది నీ నాలుక. సభ్యాగ్ని అనగా హోమములేని అగ్ని. ఆవసథ్యం అనగా ఔపాసనాగ్ని. ఈ సభ్యాగ్ని, ఔపాసనాగ్నుల సమూహమే నీ తల. యజ్ఞములో ఉపయోగించే ఇటుకల చయనములే నీ ప్రాణములు. 37

శ్లో ॥ సోమస్తు రేతః సవనాన్యవస్థితిః
సంస్థా విభేదాస్తవ దేవ ధాతవః ।
సత్రాణి సర్వాణి శరీర సంధిస్త్వం
సర్వయజ్ఞ క్రతురిష్టిబంధనః ॥ 38

టీ:- సోమ ఇతి. ప్రాతస్సవనాదీని. అవస్థితిః అవస్థానం బాల్యాద్య వస్థా వా. అగ్నిష్టోమాత్యగ్నిష్టోమ ఉక్థ్య షోడశీ వాజపేయాతి రాత్రా ప్తోర్యామాస్సప్త సంస్థాభేదాః. త్వఙ్మాంసాది సప్తధాతవః. సత్రాణి ద్వాదశాహాదీని బహుయాగ సంఘాత రూపాణి. అసోమాః యజ్ఞాః. ససోమాః క్రతవః. తద్రూపః త్వం. ఇష్టిర్యజనం అనుష్ఠానం తదేవ బంధనం యస్య సః. 38

ఓ దేవా! సోమరసమే నీరేతస్సు. ప్రాతస్సవనము, మాధ్యందిన సవనము, సాయంసవనము అనునవి నీ బాల్యాది అవస్థలు లేదా జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే అవస్థలు. సోమ యాగములు ఏడు. 1. అగ్నిష్టోమము, 2. అత్యగ్నిష్టోమము, 3. ఉక్థము, 4. షోడశి, 5. వాజపేయము. 6. అతిరాత్రము. 7. ఆప్తోర్యామము. ఈ ఏడు సోమయాగములు నీకు చర్మము, మాంసము, మజ్జ మొదలగు సప్త ధాతువులు. సత్రయాగములు నీ దేహములోని కీళ్ళు. సోమరసములేని యాగములను యజ్ఞమందురు. సోమరసముకల యాగములను క్రతువు లందురు. ఈ యాగములు, క్రతువులు నీ స్వరూపమే. ఇష్టులు నీ శరీరములోని కండరములు. 38

శ్లో ॥ నమో నమస్తేఽఖిల మంత్రదేవతా
ద్రవ్యాయ సర్వక్రతవే క్రియాత్మనే ।
వైరాగ్య భక్త్యాత్మజయానుభావిత
జ్ఞానాయ విద్యా గురవే నమో నమః ॥ 39

టీ:- పూర్వోక్తమేవ సపరికరం కీర్తయంతః ప్రణమంతి - నమో నమ ఇతి. అఖిల మంత్రాది రూపాయ. క్రియాత్మనే సామాన్య వ్యాపార

(ముందు చెప్పిన దానినే సపరికరముగా కీర్తిస్తూ నమస్కరించు చున్నాడు). నీవు సమస్తమంత్రములకు, దేవతలకు, యజ్ఞ ద్రవ్యములకు, సకల క్రతువులకు స్వరూపమువు. వైరాగ్యముచేత, భక్తిచేత, మనోజయముచేత ఏర్పడే ఆత్మజ్ఞానము నీ స్వరూపమే. అట్టి జ్ఞాన ప్రదాతయయిన గురువువు నీవే. నీకు అనేక నమస్కారములు. 39

రూపాయ. కించ. వైరాగ్య యుక్తాయ అకామ్యకర్మ సాధ్యాసత్త్వశుద్ధిః తతో భక్తిః తతః ఆత్మజయః చిత్తస్థైర్యం. తేనానుభావితం సాక్షాత్కృతం యద్ జ్ఞానం తస్మై. ఏవంభూత జ్ఞాన ప్రదాయ గురవే చ. 39

శ్లో ॥ దంష్ట్రాగ్ర కోట్యా భగవంస్త్వయా ధృతా
విరాజతే భూధర భూః సభూధరా ।
యథా వనాన్నిస్సరతో దతా ధృతా
మతం గజేంద్రస్య సపత్ర పద్మినీ ॥ 40

భూమిని ధరించిన ఓ భగవానుడా! పర్వతములతో కూడిన భూమిని నీవు నీ వాడి కోరల కొనపై ధరించినావు. ఏనుగు నీటినుండి బయటకు వస్తూ, ఆకులతో కూడిన తామరపుష్పమును తెచ్చేటప్పుడు, ఆ తామరపుష్పము ప్రకాశించినట్లు భూమి ప్రకాశించుచున్నది. 40

శ్లో ॥ త్రయీమయం రూపమిదం చ సౌకరం
భూమండలేనాథ దతా ధృతేన తే ।
చకాస్తి శృంగోఢఘనేన భూయసా
కులాచలేంద్రస్య యథైవ విభ్రమః ॥ 41

టీ:- దంష్ట్రాగ్రకోట్యా భగవంస్త్వయా ధృతా భూర్విరాజత ఇత్యుక్తం. ఇదానీం భూమండలేన త్వద్రూపం విరాజత ఇత్యాహ - త్రయీమయ మితి. యథేత్యర్థాంతరే. ఇదం చ తే రూపం. దతా దంతేన. ధృతం యద్భూమండలేన. చకాస్తి శోభతే శృంగేణ ఉద్ధృతో యో ఘనః. తేన భూయసా మహతా. విభ్రమో విలాసః. (40-41)

ఇప్పటివరకు నీవు ధరించిన భూమండలము ప్రకాశించినదని చెప్పబడినది. ఇప్పుడు భూమండలముచేత నీ వరాహ రూపము ప్రకాశించుచున్నదని చెప్పబడుచున్నది. నీ వరాహ విగ్రహకోరలపైన నిలుపుకొనిన భూమండలము ద్వారా వేదమయ మగు నీ శరీరము మిక్కిలి అతిశయముగా శోభిల్లుచున్నది. ఇది పర్వత శిఖరముపై మేఘములు ఉండినప్పుడు ఆ మేఘముల కారణముగా కుల పర్వతము అధికముగా శోభిల్లినట్లున్నది. 41

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ సంస్థాపయైనాం జగతాం సతస్థుషాం
లోకాయ పత్నీమసి మాతరం పితా ।
విధేమ చాస్యై నమసా సహ త్వయా
యస్యాం స్వతేజోఽగ్నిమివారణావధాః ॥ 42

టీ:- సంస్థాపయేతి. లోకాయ వాసం స్థానార్థం. తే పత్నీం. జగతాం మాతరం యతస్త్వం పితాసి ఏవం సతి. తత్ర స్థితాస్సంతః. త్వయా పిత్రా సహ. అస్యై మాత్రే. నమసా విధేమ. నమనం కరిష్యామః. నమస్కారేణ పరిచరేమేతి వా. స్వతేజో ధారణాది శక్తిం యాజ్ఞికాః మంత్రతోఽగ్నిం. అరణావివ. అధాః నిహితవానసి. 42

ఈ భూమి స్థావర జంగమములకు నివాసస్థానము. ఈ భూమి నీకు భార్య. మాకు తల్లి. నీవు మాకు తండ్రివి. నీవే భూమిని నీటిపై చక్కగా నిలబెట్టుము. యజ్ఞములో యాజ్ఞికులు, మథించే "అరణి" యందు అగ్నిని స్థాపించినట్లు నీవీ ధరణి యందు నీ తేజస్సును స్థాపించినావు. నీకు, ఈ భూమాతకు నమస్కరించుచున్నాము. 42

శ్లో ॥ కః శ్రద్దధీతాన్యతమస్తవ ప్రభో
రసాం గతాయా భువ ఉద్విబర్హణమ్ ।
న విస్మయోఽసౌ త్వయి విశ్వవిస్మయే
యో మాయయేదం సస్పృజేఽతి విస్మయమ్ ॥ 43

టీ:- ఇదం చ త్వయా అతిదుష్కరం కృతమిత్యాహుః-క ఇతి. హే ప్రభో. తవ త్వయా కృతం. భువ ఉద్విబర్హణం ఉద్ధరణం. త్వదన్యః కః శ్రద్దధీత స్పృహయేత్. అధ్యవస్యేదిత్యర్థః. త్వయి పునః అసౌ

(ఈ శ్లోకములో అతిదుష్కృతమైన పనిని నీవు చేసినావు అని చెప్పడమైనది.) ఓ ప్రభూ! రసాతలమునుండి భూమిని ఉద్ధరించుట అనే ఈ పనిని నీవు తప్ప వేరెవ్వరును సంకల్పించజాలరు. అత్యాశ్చర్య కరమైన ఈ పని నీ విషయములో ఆశ్చర్యము కాదు. ఎందుకనగా నీవు మహాశ్చర్యకమైన ఈ ప్రపంచమునే నీ మాయాశక్తి చేత సృష్టించిన వాడవు గదా! 43

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

విస్మయో న భవతి. యతో విశ్వే సర్వే విస్మయా యస్మిన్. కుతః. యో భవాన్. అతివిస్మయం అత్యద్భుతం. ఇదం విశ్వం. క్రియావిశేషణం వా. ససృజే సృష్టవాన్. 43

శ్లో ॥ విధున్వతా వేదమయం నిజం వపుః
జనస్తపః సత్య నివాసినో వయమ్ ।
సటాశిఖోద్ధూత శివాంబుబిందుభిః
విమృజ్యమానా భృశమీశ పావితాః ॥ 44

టీ:- విస్మయం దర్శయంతః ప్రార్థయంతే - ద్వాభ్యాం. విధున్వతేతి. సటానాం శిఖాభిః అగ్రైః ఉద్ధూతాః ఉచ్చలితాః. యే శివా అంబుబిందవః తైః. సిచ్యమానా వయం. పవిత్రీకృతాః. 44

(ఆశ్చర్యమును ప్రకటిస్తూ ఈ రెండు శ్లోకములలో ప్రార్థించు చున్నారు.) ఓ ఈశ్వరా! నీవు వేదమయమగు దేహమును విదిల్చినపుడు నీ మెడమీది జూలు యొక్క కొనల నుండి పవిత్రమైన జల బిందువులు మాపై పడినవి. ఆ మంగళజలము జన లోక, తపో లోక, సత్య లోక వాసులమగు మమ్ము మిక్కిలి పవిత్రులను చేసినది. 44

శ్లో ॥ స వై బత భ్రష్టమతస్తవైష తే
యః కర్మణాం పారమపారకర్మణః ।
యద్యోగమాయాగుణయోగ మోహితం
విశ్వం సమస్తం భగవన్ విధేహి శమ్ ॥ 45

టీ:- స ఇతి. తవ కర్మణాం పారం య ఈషతి అవలోకయతే

నీ లీల అపారమైనది. ఎవడైతే నీ లీలలపారమును తెలియ గోరుచున్నాడో వాడు కేవలము మూఢుడు సుమా! నీ మాయాగుణ సంయోగముచే ఈ సకల జగత్తు వ్యామోహమును పొందుచున్నది. బుద్ధికి అందని, అనంతశక్తి సంపన్నుడవైన నీవు మాకు శుభమును చేకూర్చుము. 45

జ్ఞాతుమిచ్ఛతీత్యర్థః. యస్య తవ. యోగమాయాగుణైః సహ. యో యోగన్తేన మోహితం. సమస్తం విశ్వం. అతో విశ్వస్య. శం మంగళం విధేహి. యథా త్వామచింత్యం. అచింత్యశక్తిం. జ్ఞాత్వా భజేత. తథాను గృహాణేత్యర్థః. 45

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఇత్యుపస్థీయమానస్తైర్మునిభి ర్బ్రహ్మవాదిభిః ।
సలిలే స్వ ఖురాక్రాంత ఉపాధత్తా వితాऽవనిమ్ ॥ 46

టీ:- ఇతీతి. ఉపస్థీయమానః స్తూయమానః స్వఖురాక్రాంత ఇతి జలేऽపి ధారణాశక్త్యా సంతం. ధ్యానం దర్శయతి అవితా రక్షకః. 46

శ్లో ॥ స ఇత్థం భగవానుర్వీం విష్వక్సేనః ప్రజాపతిః ।
రసాయా లీలయోన్నీతామప్సు న్యస్య యయౌ హరిః ॥ 47

మైత్రేయుడు ఇట్లు పలికెను:

ఈ విధముగా బ్రహ్మవాదులగు మునులు స్తోత్రము చేయు చుండగా రక్షకుడగు వరాహభగవానుడు తన గిట్టలపై యుండిన భూమిని జలముపై స్థాపించెను. 46

సూర్యకిరణములు అంతటా వ్యాపించియున్నవి. ఈ కారణాన భగవంతుడు విష్వక్సేనుడు అయినాడు. అట్టి విష్వక్సేనుడును, ప్రజాపతి యగు శ్రీహరిభగవానుడు భూమిని రసాతలము నుండి అవలీలగా తెచ్చి జలముపై నిలిపి అంతర్ధానమయ్యెను. 47

శ్లో ॥ య ఏవమేతాం హరిమేధసో హరేః
కథాం సుభద్రాం కథనీయమాయినః।
శృణ్వీత భక్త్యా శ్రవయేత వోశతీం
జనార్దనోఽస్యాశు హృది ప్రసీదతి ॥ 48

టీ:- య ఇతి. కథనీయాని మాయాని మాయావంతి చరిత్రాణి యస్య. శ్రవయేత్. శ్రావయేత్ హ్రస్వమార్షం. ఉశతీం కమనీయం. హృది ప్రసీదతి స్వమనసి సంతుష్యతీత్యర్థః. (47,48)

బుద్ధియందు నిలిచి యుండి పాపమును పోగెట్టేవాడగుటచే భగవంతుడు హరిమేధసుడు. మాయాధీశుడు, కీర్తనీయుడునగు భగవానుని కమనీయమైన ఈ కథను భక్తితో విన్నవారికి, వినిపించిన వారికి జనార్దనుడు వెంటనే ప్రసన్నుడగును. 48

శ్లో ॥ తస్మిన్ప్రసన్నే సకలాశిషాం ప్రభౌ
కిం దుర్లభం తాభిరలం లవాత్మభిః ।
అనన్యదృష్ట్యా భజతాం గుహాశయః
స్వయం విధత్తే స్వగతిం పరః పరామ్ ॥ 49

టీ:- యద్యపి సులభాః తథాపి తా న ప్రార్థనీయాఇత్యాహ - తస్మిన్నితి. తాభిరాశీర్భిః. అలం లవాత్మభిః తుచ్ఛాత్మభిః న చ తథా భజనస్య విఫలత్వం శంకనీయమిత్యాహ-భగవద్భజనస్య వ్యతికరేణ. ఫలాంతర దృష్టిం వినా భజతాం. స్వపద ప్రాప్తిం స్వయమేవ విధత్తే. గుహాశయ త్వాదహైతుకీం భక్తిం జానన్. 49

(కోరుకునేవారికి సులభుడైనను కోరనవసరము లేదని చెప్పుచున్నాడు). భగవానుడు కోరికలన్నింటికీ ప్రభువు. అతడు ప్రసన్నుడయితే ఇక దుర్లభమైనదేదియును ఉండదు. బుద్ధి గుహ యందు నివసించే పరమేశ్వరుడు తనను అనన్య భావముతో సేవించే వారలకు తన పరమపదమును స్వయముగా అనుగ్రహించును. 49

శ్లో ॥ కో నామ లోకే పురుషార్థసారవిత్
పురాకథానాం భగవత్కథాసుధామ్ ।
ఆపీయ కర్ణాంజలిభిర్భవాపహా
మహో విరజ్యేత వినా నరేతరమ్ ॥ 50

టీ:- కఇతి. అతః కో నామ. పురా కథానాం పూర్వవృత్తానాం మధ్యే కథంచిదాపీయ. విరజ్యేత విరమేత్. నరేతరం పశుం వినా. 50

ప్రాచీనకథలలోని భగవత్కథామృతమును చెవులు అనే దోసిళ్ళతో నిండుగా త్రాగినచో ఆ అమృతము వలన సంసారము దూరమగును. పురుషార్థ సారము నెరిగిన వాడెవ్వడూ కథామృత పానము నందు విరక్తిచెందడు. పశుప్రాయుడు తప్ప. 50

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
వరాహ ప్రాదుర్భావానువర్ణనే త్రయోదశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
పదమూడవ అధ్యాయము సమాప్తము.

చతుర్దశోఽధ్యాయః

శ్లో॥ చతుర్దశే నిదానాం తు తద్వధే వక్తుముచ్యతే ।
సంధ్యాయాం కశ్యపాద్గర్భసంభవః కామతోదితేః ॥

14వ అధ్యాయము

ఈ పదునాల్గవ అధ్యాయములో హిరణ్యాక్షుని వధకు కారణము చెప్పబడినది. సంధ్యాకాలములో కశ్యపమహర్షి వలన దితి గర్భము ధరించుట వర్ణింపబడినది.

శ్రీ శుక ఉవాచ

శ్లో ॥ నిశమ్య కౌషారవిణోపవర్ణితాం
హరేః కథాం కారణసూకరాత్మనః ।
పునః స పప్రచ్ఛ తముద్యతాంజలిః
న చాతితృప్తో విదురో ధృతవ్రతః ॥ 1

శ్రీశుకుడు ఇట్లు పలికెను.

దృఢవ్రత నిష్ఠగల విదురుడు మైత్రేయుడు చెప్పిన వరాహ భగవానుని కథను వినియు పూర్ణతృప్తిని పొందలేదు. అపుడాయన చేతులు జోడించి మరల మైత్రేయుని ఇట్లు ప్రశ్నించెను. ॥ 1 ॥

విదుర ఉవాచ

శ్లో ॥ తేనైవ తు మునిశ్రేష్ఠ హరిణా యజ్ఞమూర్తినా ।
ఆదిదైత్యో హిరణ్యాక్షో హత ఇత్యనుశుశ్రుమ ॥ 2

టీ:- తేనేతి. తేనైవ. యేన భూమిరుద్ధృతా. అనుశుశ్రుమః. త్వన్ముఖాత్. (1,2)

విదురుడు పలికెను.

ఓ మునిశ్రేష్ఠా! యజ్ఞవరాహరూపుడగు శ్రీహరియే దితి మొదటి సంతానమైన హిరణ్యాక్షుని సంహరించెనని నీవు చెప్పగా వినియుంటిని. ॥ 2 ॥

శ్లో ॥ తస్య చోద్ధరతః క్షోణీం స్వదంష్ట్రాగ్రేణ లీలయా।
దైత్యరాజస్య చ బ్రహ్మన్ కస్మాద్ధేతోరభూన్మృధః ॥ 3

ఓ మహామునీ! తన కోరలపై అవలీలగా భూమిని పైకెత్తుచున్న వరాహభగవానునకు దైత్యరాజగు హిరణ్యాక్షునితో ఏ కారణము చేత యుద్ధము జరిగినది. ॥ 3 ॥

శ్లో ॥ శ్రద్దధానాయ భక్తాయ బ్రూహి తజ్జన్మవిస్తరమ్ ।
ఋషే న తృప్యతి మనః పరం కౌతూహలం హి మే ॥ 4

టీ:- తస్యేతి. మృథో యుద్ధం. ॥ 4 ॥

ఓ మునీ! శ్రద్ధావంతుడును, భక్తుడునగు ఆ రాక్షసుని కథ వివరించి చెప్పుము. నా మనస్సు హరికథ యందు ఇంకనూ తృప్తి చెందుటలేదు. ॥ 4 ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ సాధు వీర త్వయా పృష్టమవతారకథాం హరేః ।
యత్త్వం పృచ్ఛసి మర్త్యానాం మృత్యుపాశవిశాతనీమ్ ॥ 5

టీ:- సాధ్వితి. సాధుత్వే హేతుః. యద్యస్మాత్త్వం. హరేరవతార కథాం పృచ్ఛసి. మృత్యోః పాశం విశాతయతి మోచయతీతి తథా. ॥ 5

మైత్రేయుడు ఇట్లు పలికెను:

ఓ విదురా! ధర్మవీరుడవగు నీవు చక్కగా ప్రశ్నించితివి. మృత్యు పాశమును తెంపే విష్ణుమూర్తి అవతార కథను గురించి నీవు చక్కగా ప్రశ్నించుచున్నావు. ॥ 5 ॥

శ్లో ॥ యయోత్తానపదః పుత్రో మునినా గీతయాఽర్భకః।
మృత్యోః కృత్వైవ మూర్ధ్న్యంఘ్రిమారురోహ హరేః పదమ్ ॥ 6

(ధ్రువునికథ ద్వారా నిరూపించుచున్నాడు)

ఉత్తానపాదుని కుమారుడు చిన్నపిల్లవాడు, నారదుని వలన శ్రీహరిమహిమను విని ఉపదేశమును పొందెను. తపమాచరించి

టీ:- తదేవ దర్శయతి-యయేతి. యయా కథయా ఉత్తానపదః పుత్రః ధ్రువః. మునినా నారదేన. అర్భకఏవ యదా ధ్రువాయ. సునందాదిభిర్విమానమానీతం. తదా తస్య దేహత్యాగోఽపేక్షితః. స్యాదితి మత్వా. మృత్వావాసన్నేఽపి. దేహం న తత్యాజ. కింతు సోపానఇవ. తస్య మూర్ధ్నిపదం దత్వా. విమానమారుహ్య. విష్ణుపదమారూఢః. వక్ష్యతి చ. శ్లో.'పరేత్యాభ్యర్చ్య ధిష్ణ్యాగ్ర్యం పార్షతానాభినంద్య చ, ఇయేష తదధిష్ఠాతుమ్ బిభ్రద్రూపం హిరణ్మయ' మితి.6

శ్రీహరి సాక్షాత్కారమును పొందెను. చివరకు సునంద, నందులనే విష్ణుదూతలు ధ్రువునిని వైకుంఠమునకు తీసుకవెళ్ళుటకు వచ్చినపుడు అదే సమయములో కాలుడు (మృత్యువు) వచ్చి యుండెను. ధ్రువుడు మృత్యువు యొక్క శిరస్సుపైన తన పాదము మోపి (సోపానముగా చేసికొని) ఆ దివ్య విమానమును ఎక్కి ధ్రువ పదమును పొందెను. ధ్రువుడు విమానమును పూజించి ప్రదక్షిణము చేసెను. విష్ణుపార్శదులకు నమస్కరించెను. తేజో రూపమును దాల్చి విమానమును అధిరోహింపగోరెను. 6

శ్లో ॥ అథాత్రాపీతిహాసోఽయం శ్రుతో మే వర్ణితః పురా ।
బ్రహ్మణా దేవదేవేన దేవానామనుపృచ్ఛతామ్ ॥ 7

టీ:- తయోస్సంగ్రామహేతుం వక్తుమితిహాసం ప్రస్తౌతి - అథేతి. అనుపృచ్ఛతాం దేవానాం. బ్రహ్మణా వర్ణిత ఇతి. ఇతిహాసో మయా శ్రుతః. ॥ 7 ॥

(శ్రీహరి హిరణ్యాక్షుల సంగ్రామకారణము చెప్పుటకు ఇతిహాసము ప్రస్తావించుచున్నాడు.) ఓ విదురా! నీవిపుడు అడిగిన ఈ యుద్ధ వృత్తాంతమును పూర్వము బ్రహ్మదేవుడు దేవతలకు చెప్పెను. ఆ ఇతిహాసమును నేను వినియుంటిని. 7

శ్లో ॥ దితిర్దాక్షాయణీ క్షత్తర్మారీచం కశ్యపం పతిమ్ ।
అపత్య కామా చకమే సంధ్యాయాం హృచ్ఛయార్దితా ॥ 8

టీ:- దేవప్రశ్న ప్రస్తావాయ ప్రథమం హిరణ్యాక్ష హిరణ్యకశిపూత్పత్తి

(దితి..అను ఈ శ్లోకము మొదలుకొని అధ్యాయపరిసమాప్తము వరకు మొదట హిరణ్యాక్షహిరణ్యకశిపుల జన్మవృత్తాంతము చెప్పబడుచున్నది.) ఓ విదురా! దక్షునికుమార్తె దితి. మరీచిమహర్షి

ప్రకారమాహ-యావదధ్యాయ పరిసమాప్తి. దితిరితి. మరీచేః పుత్రం. హృచ్ఛయః కామః. తేనార్దితా. అతస్సంధ్యాయామేవ కామితవతీ. 8

శ్లో॥ ఇష్ట్వాఽగ్ని జిహ్వం పయసా పురుషం యజుషాం పతిమ్ ।
నిమ్లోచత్యర్క ఆసీనమగ్న్యగారే సమాహితమ్ ॥ 9

టీ:- ఇష్ట్వేతి. తదప్యగ్నిహోత్రశాలాయాం. తత్రాపి సమాహితం. అగ్నిః జిహ్వా యస్య యజుషాం యజ్ఞానాం పతిం. పురుషం శ్రీవిష్ణుం. 9

దితిరువాచ

శ్లో॥ ఏషమాం త్వత్కృతే విద్వన్ కామ ఆత్తశరాసనః ।
దునోతి దీనాం విక్రమ్య రంభామివ మతంగజః ॥ 10

టీ:- కృపణాం బహు భాషిణీమితి వక్ష్యతి. తత్ర. ఏషమామితి ద్వాభ్యాం కార్పణ్యం. భర్తరీతి చతుర్భిశ్చ బహుభాషణం వర్ణ్యతే. ఏషఇతి. దునోతి పీడయతి. విక్రమ్యశౌర్యమావిర్భావ్య. రంభాం కదళీం. (10)

కుమారుడు కశ్యపుడు. ఒకనాడు దితి సంతానాపేక్ష కలదై, కామ పీడితురాలై సంధ్యాకాలములోనే భర్తయగుకశ్యపుని ప్రార్థించెను. 8

యజ్ఞములకు ప్రభువు విష్ణుదేవుడు. అతడు అగ్ని అనే నాలుక చేత హవిస్సులను స్వీకరించును. కశ్యపుడు అట్టి విష్ణువును పయో హోమముచే ఆరాధించి అగ్నిహోత్రశాలలో ధ్యానమగ్నుడై యుండగా దితి ప్రార్థించెను.(ఈ శ్లోకములో దితి దోషతీవ్రత పేర్కొనడమైనది. కామ తీవ్రతతో; ఒకటి సంధ్యాకాలములో, రెండు హోమశాలలో, మూడు పతి ధ్యానమగ్నుడైనవేళ పతిని ప్రార్థించినది.) 9

దితి ఇట్లు పలికెను

(దీనురాలు, ఎక్కువగా మాటలాడునది అని దితిని గూర్చి రాబోయే శ్లోకములలో చెప్పబడును. ఏషమాం...అనే ఈ రెండు శ్లోకములలో దితిదైన్యమును చెప్పుచున్నాడు. భర్తరి... మొదలగు నాలుగు శ్లోకములలో దితి బహుభాషిత్వమును చెప్పుచున్నాడు.) ఓ విద్వాంసుడా! ఈ మన్మథుడు తన ధనుస్సు ఎక్కుపెట్టి నీ పొందుకొరకై దీనురాలినైన నాపై పరాక్రమించుచున్నాడు. అరటి చెట్టును ఏనుగు పీడించినట్లు నన్ను పీడించుచున్నాడు. 10

శ్లో ॥ తద్భవాన్ దహ్యమానాయాం సపత్నీ నాం సమృద్ధిభిః ।
ప్రజావతీనాం భద్రం తే మయ్యాయుఙ్క్ష్వామనుగ్రహమ్ ॥11

టీ:- తదితి. అయుఙ్క్ష్వాం సర్వతో యునక్తు. సమ్యక్కరోతు.11

నా సవతులు సంతానమును పొంది వైభవముతో గొప్పగా నున్నారు. వారిని చూచి నా హృదయము దహించుకుపోవుచున్నది. కావున నీవు నా యందు అన్నివిధములుగా అనుగ్రహమును చూపుము. నీకు శుభము కలుగును. ॥ 11 ॥

శ్లో ॥ భర్తర్యాప్తోరుమానానాం లోకానావిశతే యశః ।
పతిర్భవాద్విధో యాసాం ప్రజయా నను జాయతే ॥ 12

టీ:- భర్తరీతి. భర్తరి ప్రాప్తబహుమానానాం స్త్రీణాం. ఆవిశతే ప్రాప్నోతి. ప్రజాయా పుత్రరూపేణ. శ్రు. "సజాయా జాయా భవతి యదస్యాం జాయతే పురే" తి శ్రుతేః. ॥ 12 ॥

ఏ స్త్రీల కడుపున నీ వంటి మహాత్ములగు భర్తలు పుత్రరూపములో జన్మించెదరో ఆ స్త్రీలు ధన్యురాళ్ళు. వారు భర్తల వద్ద అధిక ఆదరమును పొందెదరు. వారి కీర్తి లోకమంతటా వ్యాపించును. ("సజాయా జాయా భవతి యదస్యాం జాయతే పురే" అని శ్రుతి. ఏ భార్యయందు భర్త సంతానరూపములో జన్మించునో ఆమెయే భార్య అనిపించుకొనును.) ॥ 12 ॥

శ్లో ॥ పురా పితా నో భగవాన్ దక్షో దుహితృ వత్సలః ।
కం వృణీత వరం వత్సా ఇత్యపృచ్ఛత నః పృథక్ ॥ 13

పూర్వము పుత్రికలపై వాత్సల్యముగలవాడగు దక్షుడు "అమ్మాయిలూ! మీరు ఎవరిని భర్తలుగా వరింతురు?" అని ఒక్కొక్కరిని విడి విడిగా అడిగెను. ॥ 13 ॥

శ్లో ॥ స విదిత్వాత్మజానాం నో భావం సంతానభావనః ।
త్రయోదశాదదాత్తాసాం యాస్తే శీలమనువ్రతాః ॥ 14

మా తండ్రి దక్షుడు తన సంతానము యొక్క హితమును కోరినవాడై పుత్రికల భావమును తెలిసికొని పదముగ్గురు కన్యలను నీకు ఇచ్చెను. మేమంతా నీ గుణమును స్వభావమును అనుసరించే

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- పురేతి. నోఽస్మాకం పితా. నోఽస్మాన్. పృథక్పృథగపృచ్ఛత్, అయం భావః. త్రయోదశానామప్యస్మాకం త్వయా భావసామ్యే వైషమ్యాచరణమనుచితమితి. ॥ 13-14 ॥

శ్లో ॥ అథ మే కురు కల్యాణ కామం కంజవిలోచన ।
ఆర్తోపసర్పణం భూమన్న మోఘం హి మహీయసి ॥ 15

టీ:- అథేతి. మోఘం నాభూత్. వరీయసి మహీయసీ. త్వాదృశే మహత్తమే. 15

శ్లో ॥ ఇతి తాం వీరమారీచః కృపణాం బహుభాషిణీం ।
ప్రత్యాహానునయన్వాచా ప్రవృద్ధానంగకశ్మలామ్ ॥ 16

టీ:- ఇతీతి. ప్రవృద్ధానంగేన కశ్మలం మోహో యస్యాస్తాం. 16

శ్లో ॥ ఏష తేఽహం విధాస్యామి ప్రియం భీరు యదిచ్ఛసి ।
తస్యాః కామం న కః కుర్యాత్సిద్ధిస్త్రైవర్గికీ యతః ॥ 17

టీ:- సంధ్యాకాల వందనాయ భార్యా ప్రశంసా. ఏష ఇతి పంచభిః యతో యస్యాస్సకాశాత్. 17

వారము. (మా పదముగ్గురి విషయములో మీరు భేదమును చూపరాదని భావము.) 14

ఓ కల్యాణమూర్తీ! పద్మములవంటి కన్నులు గలవాడా! ఓ మహాత్మా! నీవు నా కోరికను తీర్చుము. మీ వంటి మహాత్ముల వద్ద చేసికొనిన ఆర్తుల ప్రార్థన ఎప్పుడును వ్యర్థము కాదు. 15

ఓ విదురా! ఇట్లు బహువిధములుగా మాట్లాడుచున్నదియు, దీనురాలును, మిక్కిలి కామోద్రేకముచే పీడింపబడుచున్నదైన దితిని కశ్యపుడు మంచిమాటలచే ఓదార్చుచు ఇట్లు పలికెను. 16

ఓ భయస్వభావము గలదానా! (నన్ను ప్రార్థించుచున్న) నీ కోరికను తప్పక నెరవేర్చెదను. ధర్మార్థ కామములను తీర్చే భార్య కోరికను ఏ మానవుడు నెరవేర్చకుందును? 17

శ్లో ॥ సర్వాశ్రమానుపాదాయ స్వాశ్రమేణ కళత్రవాన్ ।
వ్యసనార్ణవమత్యేతి జలయానైర్యథార్ణవమ్ ॥ 18

టీ:- సర్వాశ్రమానుపాదాయేతి. తానప్యన్నాదిదానేన. కృచ్ఛ్రాన్ని స్సారయన్. స్వయం తరతీత్యర్థః. 18

శ్లో ॥ యామాహురాత్మ నో హ్యర్థం శ్రేయస్కామస్య మానిని ।
యస్యాం స్వధురమధ్యస్య పుమాంశ్చరతి విజ్వరః ॥ 19

టీ:- యామితి. ఆత్మనో దేహస్యార్థం కర్మసు ద్వయోస్సహాధికారాత్. యచ్ఛబ్దానాం తామితి తృతీయశ్లోకేన సంబంధః. స్వధురం దృష్టాదృష్ట కర్మభారం. విజ్వరో నిశ్చింతః. 19

శ్లో ॥ యామాశ్రిత్యేంద్రియారాతీన్ దుర్జయానితరాశ్రమైః ।
వయం జయేమ హేలాభిర్దస్యూన్ దుర్గపతిర్యథా ॥ 20

(ఏష...అను ఈ శ్లోకము మొదలుకొని అయిదు శ్లోకములవరకు సంధ్యాకాలసంగమదోషము తప్పించుటకై, తాను సంధ్యావందనము ఆచరించుటకై భార్య ప్రశంస చేయబడినది.) నావికుడు నౌక సహాయముతో తాను సముద్రమును దాటును. ఇతరులను దాటించును. అట్లే గృహస్థుడు భార్య సహాయముతో తాను ఆకలిదప్పులనే దుఃఖ సముద్రమును దాటును. బ్రహ్మచారి, వానప్రస్థ, సన్న్యాసాశ్రమము లందున్నవారిని కూడా అన్నము మొదలైన వాటి దానముచేత. ఆకలి దప్పులనే సముద్రము నుండి తరింప జేయును. 18

ఓ అభిమానవతీ! శ్రేయస్సుకోరే మానవునకు భార్య తన దేహములో సగభాగమని చెప్పుదురు. భార్యతో కూడిన వాడికే కర్మాధి కారము. తన దృష్టాదృష్ట భారమును భార్యకు అప్పగించి పురుషుడు నిశ్చింతగా యుండును. (ఇచటి 'యత్' శబ్దమునకు మూడవ శ్లోకము లోని తాం,త్వాం అను పదములతో సంబంధము కలదు.) 19

దుర్గము కల్గిన దుర్గాధిపతి బందిపోటు దొంగలను సులభముగా జయించును. అట్లే గృహస్థులమైన మేము ఇంద్రియములనే శత్రువులను ధర్మపత్నితో కూడినవారమై విలాసయుతులమై అవలీలగా

టీ:- యామితి. హేలాభిర్లీలాభిః. జయేమేతి. సభార్యస్యేంద్రియాణి. ప్రాయేణ తతస్తతో న సర్పంతీతి భావః. 20

జయింతుము. ఇంద్రియజయము బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాస ఆశ్రమముల వారికి సులభముకాదు. (భర్త ఇంద్రియవ్యాపారము ఇతర స్థలములందు ఉండదని భావము.) ॥ 20

శ్లో॥ న వయం ప్రభవస్తాం త్వామనుకర్తుం గృహేశ్వరి ।
అప్యాయుషా వా కార్త్స్న్యేన యే చాన్యే గుణగృధ్నవః ॥ 21

టీ:- నేతి. తామనేకోపకారకర్త్రీం త్వాం. కార్త్స్న్యేన అనుకర్తుం ప్రత్యుపకారైః తాదృశీ భవితుం న ప్రభవః. న సమర్థాః. యే చాన్యే గుణగృధ్నవః. గుణప్రియాస్తేఽపి. పూర్ణేనాప్యాయుషా. వాశబ్దాజ్జన్మాంతరైరపి. న ప్రభవ ఇత్యుక్తం. 21

ఓ గృహ యజమానురాలా! నీ వంటి భార్య చేసినసేవకు తగిన ప్రత్యుపకారము చేయుటకు మాకు ఈ పూర్ణాయుర్దాయము సరిపోదు. మా సామర్థ్యము సరిపోదు. ఇతరులైన గుణగ్రాహులకైనను ఆయుర్దాయము చాలదు. (మరుజన్మలో కూడా నీకు తగిన ప్రత్యుపకారము చేయజాలమని భావము.) 21

శ్లో॥ అథాపి కామమేతం తే ప్రజాత్యై కరవాణ్యలమ్ ।
యథా మాం నాతివోచంతి ముహూర్తం ప్రతిపాలయ ॥ 22

టీ:- యద్యపిత్వదనుకరణ మశ్యకం. ప్రజాత్యైపుత్రోత్పత్త్యై. నాతివోచంతీ న నిందంతీ. ప్రతిపాలయ ప్రతీక్షస్వ. 22

నీకు ప్రత్యుపకారము చేయగల్గుట అసంభవమైనప్పటికీ, నీ సంతానవాంఛను నేను నెరవేర్చెదను. నీవు ఒకగంట వేచియుండుము. అట్లు వేచియుండుటవలన జనులు నన్ను నిందింపకుందురు. 22

శ్లో॥ ఏషా ఘోరతమా వేళా ఘోరాణాం ఘోరదర్శనా ।
చరంతి యస్యాం భూతాని భూతేశానుచరాణి హ ॥ 23

(తన నిందను లెక్కచేయకుండిననూ ఈ సంధ్యవేళ పనికి రాదంటూ ఈ ఏడుశ్లోకములలో సంధ్యాకాల భయంకరత్వమును

టీ:- స్వనిందామనుగణయంతీం భీషయంతీం. శ్రీరుద్ర మను వర్ణయతి - ఏషేతి సప్తభిః. ఘోరాణామేషాం వేళా. స్వయం చ ఘోరదర్శనా. 23

చెప్పుచున్నాడు.) ఘోరమగు ఈ సంధ్యాసమయము చూచుటకైనను భయమును కల్గించును. రాక్షసులు భయంకరాకారులై తిరిగేకాలమిది. భూతములకు ప్రభువగు రుద్రుని అనుచరగణములు ఈ సంధ్యాకాలములో తిరుగుచుందురు. 23

శ్లో ॥ ఏతస్యాం సాధ్వి సంధ్యాయాం భగవాన్ భూతభావనః ।
పరీతో భూత పార్షద్భిర్వృషేణాటతి భూతరాట్ ॥ 24

టీ:- ఏతస్యామితి. భూతపరిషద్భిర్భూతగణైః. 24

ఓ పతివ్రతా! ఈ సంధ్యావేళ సకలప్రాణి రక్షకుడును, భూత ప్రేతాదులకు ప్రభువును అయిన రుద్ర భగవానుడు ఎద్దునెక్కి తిరుగుచుండును. భూతముల గుంపు ఆయన చుట్టు ఉండును. 24

శ్లో ॥ శ్మశాన చక్రానిల ధూళి ధూమ్ర వికీర్ణ విద్యోత జటాకలాపః ।
భస్మావ గుంఠామలరుక్మదేహో దేవస్త్రిభిః పశ్యతి దేవరస్తే ।25।

టీ:- తర్హి తత్సమ్ముఖమాత్రం వర్జనీయమితి చేత్తత్రాహ - శ్మశానేతి. శ్మశానే చక్రానిలః వాత మండలః. తస్మిన్ యా ధూళిః. తయా ధూమ్రః వికీర్ణో విక్షిప్తః విద్యోతో ద్యుతిమాన్. జటాకలాపో యస్య. అమల రుక్మవద్దేహో యస్య. సదేవస్త్రిభిస్సోమార్కాగ్ని నేత్రైః. పశ్యతీతి. అస్యోత్తర శ్లోకత్రయేఽప్యనుషంగః. ఏకస్య జామాతరః పరస్పరం భ్రాతర ఇతి వ్యవహ్రియంతే. అతో మమ భ్రాతాసౌ తవ దేవర ఇతి లజ్జార్థముక్తం. (25)

శ్మశానమునందు చక్రాకారముగా తిరుగు సుడిగాలిచే చెల్లా చెదురైన రుద్రుని జటాజూటము బూడిద రంగుతో నిండియుండును. అతడు బంగరు కాంతిగల తన దేహమునిండా తెల్లని భస్మమును పూసుకొని యుండును. అతడు సూర్య, చంద్ర, అగ్ని నేత్రములతో చూచుచుండును. అట్టి రుద్రుడు కశ్యపుడు షడ్డకులు (తోడల్లుళ్ళు) దితికి రుద్రుడు మరిది వరుస. (రుద్రుడు నా సోదరుడు కనుక నీకు మరిది అని చెప్పడం ఆమె సిగ్గు పడుట కొరకు) మరిది చూచుచుండగా సిగ్గు పడదగిన స్త్రీపురుష సంగమము పనికిరాదు. (రాబోయే మూడు శ్లోకము అనుబంధము) 25

శ్లో ॥ న యస్య లోకే స్వజనః పరో వా
నాత్యాదృతో నోత కశ్చిద్విగర్హ్యః ।
వయం వ్రతైర్యచ్చరణాపవిద్ధా
మాశాస్మహేఽజాం బత భుక్తభోగామ్ ॥ 26

టీ:- నను తథాపి మహత్త్వేనాదరణీయస్య స్వజనస్య చ తవ. సర్వం చ క్షమేతైవ తత్రాహ - నేతి. యస్య స్వజనాదిర్నాస్తి. సమత్వాదీశ్వరస్య. ఐశ్వర్యమేవాహ - యేన చరణేన. అపవిద్ధాం. నిర్మాల్యవద్దూరతస్త్యక్తాం. యేన చ భుక్తభోగాం. అజాం. మాయాం. తన్మయీం విభూతిం. మహాప్రసాద ఇత్యాహశాస్మహే. 26

(అయినప్పటికిని, గొప్పదనము చేతను, ఆదరణీయత చేతను శివునకు తనవాడు పరాయివాడు అనే భేద భావము లేదని చెప్పుచున్నాడు.) ఆ పరమేశ్వరునికి లోకములో స్వజనులు, పరజనులు లేరు. ఆయనకు ఆదరణీయుడు, నిందనీయుడు లేడు. మేము అనేక వ్రతములు ఆచరించి ఆయన మాయాశక్తిని ప్రార్థించుచుందుము. కాని ఆయన ఆ మాయాశక్తికి అధీశుడై, విజయము సాధించి పాదముల వద్ద దూరముగా నుంచినాడు.(వినియోగము తరువాత నిర్మాల్యమువలె దూరముగా నుంచినాడని భావము.) 26

శ్లో ॥ యస్యానవద్యాచరితం మనీషిణో
గృణంత్యవిద్యాపటలం బిభిత్సవః ।
నిరస్తసామ్యాతిశయోఽపి యత్స్వయం
పిశాచ చర్యామచరద్గతిః సతామ్ ॥ 27

టీ:- వ్రతైస్సమారాధ్య. అనిషిద్ధ సుఖ త్యాగాదసౌ పిశాచ ఇత్యపహాసో న కార్య ఇత్యాహ - ద్వాభ్యాం. యస్యేతి. యస్యానవద్యం విషయాశక్తిశూన్యమాచరితం. బిభిత్సవః భేత్తుమిచ్ఛవః. ॥ 27 ॥

వ్రతములు చేసి శివుని ఆరాధించిన మేము నిషిద్ధకార్యాచరణమును త్యాగముచేయవలెను. పిశాచ లక్షణములు కలవాడని శివుడిని అపహసించరాదని ఈ రెండుశ్లోకములలో చెప్పుచున్నాడు. పండితులు అవిద్యారాశిని నశింపజేయదలతురు. విషయాసక్తి శూన్యుడైన మహాదేవుని ఆచరణమును ఆదరణముతో గ్రహింతురు. అట్టి సాధువులకు శివుడే గతి స్వరూపుడు. అతడు సమానాధిక శూన్యుడు. అయిననూ అతడు స్వయముగ పిశాచమువలె సంచరించుచున్నాడు. 27

శ్లో ॥ హసంతి యస్యాచరితం హి దుర్భగాః
స్వాత్మన్ రతస్యా విదుషః సమీహితమ్ ।
యైర్వస్త్ర మాల్యాభరణానులేపనైః
శ్వభోజనం స్వాత్మతయోపలాలితమ్ ॥ 28

టీ:- హసంతీతి. సమీహితమభిప్రేతం. లోకశిక్షారూపం. అవిదుషః అవిద్వాంసః. యద్వా న విద్వానన్యోయస్మాత్తస్య సర్వజ్ఞస్యేత్యర్థః. దుర్భగానేవాహ - యైరితి. శ్వభోజనం. శునాం భోజ్యం శరీరం. స్వాత్మతయా. అయమేవాత్మేతి బుధ్యా. 28

శ్లో ॥ బ్రహ్మాదయో యత్కృతసేతుపాలాః
యత్కారణం విశ్వమిదం చ మాయా ।
ఆజ్ఞాకరీ తస్య పిశాచచర్యా
అహో విభూమ్నశ్చరితం విడంబనమ్ ॥ 29

టీ:- అహో అప్రతర్క్యం తస్య చరిత్రమిత్యాహ - బ్రహ్మేతి. బ్రహ్మాదయః. యేన కృతాన్ సేతూన్ స్వస్వాధికారాన్ పాలయంతి. యేన కృతాన్ సేతూన్ వర్ణాశ్రమాచారమర్యాదాన్ పాలయంతీత్యర్థకః. యత్కారణం. యః కారణం యస్య. యేన కృతమిదం విశ్వం మాయా చ. యస్యాజ్ఞాకరీ. విభూమ్నః పరమేశ్వరస్య. విడంబనమతర్క్యమిత్యర్థః (29)

రుద్రుడు తన స్వస్వరూపమునందు రమించేవాడు. మానవులకు శిక్షణ గరుపుటకై ప్రవర్తించేవాడు. మందభాగ్యులు ఆయన అభిప్రాయము తెలియనివారై పరిహసింతురు. ఈ శరీరము కుక్కలకు భోజనము. ఇట్టి శరీరమును వస్త్రములు, పుష్పమాలలు, ఆభరణములతో అలంకరించి పోషించుచున్నారు. (దేహాత్మభావము గలవారు రుద్రుని మహిమను గుర్తెరుగజాలరని భావము.) 28

(రుద్రుని చరిత్ర తర్కమునకు అందదని చెప్పుచున్నాడు.)

రుద్రుడు ఏర్పరచిన మర్యాదలను బ్రహ్మాదులు కూడా జవదాటరు. వర్ణాశ్రమాచారాది ధర్మములను పాలింతురని అర్థము. ఈ ప్రపంచమునకు, ప్రపంచనడవడికి కారణమైన మాయకు అధిష్ఠానము ఆ రుద్రుడే. మాయ ఆయన అధీనములో నుండును. ఆయన పిశాచము వలె ప్రవర్తించుట మరియు ఆయన చరిత్ర మన ఊహకు అందదు సుమా! 29

మైత్రేయ ఉవాచ.

శ్లో ॥ సైవం సంవేదితే భర్త్రా మన్మథోన్మథితేంద్రియా ।
జగ్రాహ వాసో బ్రహ్మర్షేర్వృషలీవ గతత్రపా ॥ 30

టీ:- సేతి. భర్త్రా నిరూపకేణైవం. సంవేదితే జ్ఞాపితే సతి వృషలీవ వేశ్యేవ. ॥ 30 ॥

శ్లో ॥ స విదిత్వాఽథ స్వభార్యాయాస్తం నిర్బంధం వికర్మణి ।
నత్వాదిష్టాయ రహసి తయాఽథోపవివేశ హ ॥ 31

టీ:- సఇతి. వికర్మణి. నిషిద్ధేకర్మణి. దిష్టాయ దైవరూపాయేశ్వరాయ. ఉపవిశేశమైథునం లక్ష్యతే. ॥ 31 ॥

శ్లో ॥ అథోపస్పృశ్య సలిలం ప్రాణానాయమ్య వాగ్యతః ।
ధ్యాయన్ జజాప విరజం బ్రహ్మ జ్యోతిః సనాతనమ్ ॥ 32

టీ:- అథేతి. ఉపస్పృశ్యస్నాత్వా. భర్గశబ్దవాచ్యం విరజం బ్రహ్మర్జ్యోతిర్ధ్యాయన్. సనాతనం బ్రహ్మ. గాయత్రీం ప్రణవం వా జజాప. 32

మైత్రేయమహర్షి వలుకుచున్నాడు.

భర్తయగు కశ్యపమహర్షి ఇట్లు నచ్చచెప్పుచుండెను. అయిననూ దితి మనస్సు మన్మథునిచే పీడింపబడెను. దితి సిగ్గులేనిదై వేశ్యవలె భర్తయొక్క వస్త్రమును పట్టుకొనిలాగెను. 30

తరువాత ఆ కశ్యపమహర్షి భార్యయొక్క నిషిద్ధ కర్మ యందలి పట్టుదలను గమనించెను. దైవ రూపమైన ఈశ్వరునికి నమస్కరించి ఏకాంతమునందు ఆమెతో రమించెను. 31

పిమ్మట ఆయన స్నానముచేసి ప్రాణాయామము చేసెను. మౌనమును దాల్చెను. వికారములు లేనివాడై భర్గ శబ్ద వాచ్యమైన జ్యోతిర్మయము, సనాతనమగు ఓంకారమును (గాయత్రిని) జపించెను. (32)

శ్లో ॥ దితిస్తు వ్రీడితా నేన కర్మావద్యేన భారత ।
ఉపసంగమ్య విప్రర్షిమధోముఖ్యభ్యభాషత ॥ 33

టీ:- దితిరితి. కర్మావద్యేన కర్మదోషేణ. 33

ఓ భరతవంశీయుడవైన విదురా! దితి కూడా దోషయుక్తమగు ఆ కర్మకు సిగ్గుపడినదై కశ్యపమహర్షి వద్దకు చేరి తలవంచుకొని ఇట్లు పలికెను. 33

దితిరువాచ.

శ్లో ॥ మామే గర్భమిమం బ్రహ్మన్ భూతానామృషభోఽవధీత్ ।
రుద్రః పతిర్హి భూతానాం యస్యాకరవమంహసమ్ ॥ 34

దితి పలికెను.

ఓ మహర్షీ! భూతపతియు, ప్రమథగణాధిపతియైన రుద్రుడు నా ఈ గర్భమును సంహరించకుండుగాక! నేను ఆయన యెడల అపరాధమును చేసితిని. 34

శ్లో ॥ నమో రుద్రాయ మహతే దేవాయోగ్రాయ మీఢుషే ।
శివాయ న్యస్తదండాయ ధృతదండాయ మన్యవే ॥ 35

టీ:- మేతి. మావధీన్మాహన్యాదిత్యర్థః. వధ శంకాబీజమాహ-రుద్ర ఇతి. అంహస మంహః అపరాధమకరవం. కృతవత్యస్మి. 34-35

దుఃఖమును పారద్రోలేవాడు రుద్రుడు. ఆతని ఆనతి దాట శక్యము కాదు. అతడు మహోగ్రుడు. అతడు దేవతలలో గొప్ప వాడగుటచే మహాదేవుడు. సకాములకు ఫలమును వర్షించు వాడు. నిష్కాములకు మంగళస్వరూపుడు. స్వతసిద్ధముగా దండము లేనివాడు కాని దుష్టుల విషయములో దండము కలవాడు. సంహార కాలమున క్రోధస్వరూపుడైన శంకరునకు నమస్కారము. 35

శ్లో ॥ స నః ప్రసీదతాం భామో భగవానుర్వనుగ్రహః ।
వ్యాధస్యాప్యనుకంప్యానాం స్త్రీణాం దేవః సతీపతిః ॥ 36

మిక్కిలి క్రూరులైనను స్త్రీలపై దయను చూపెదరు. దంపతుల మధ్య స్త్రీల కుండే స్వభావమును తెలిసినవాడు మా బావగారు.గొప్ప

టీ:- స ఇతి. భావః భగినీభర్తా. ఉరుః అనుగ్రహో యస్య. వ్యాధస్య నిర్దయస్యాపి. సతీపతిరిత్యనేన స్త్రీస్వభావం స్వయమపి వేత్తీతి సూచయతి. 36

అనుగ్రహము చూపే స్వభావము గలవాడు, సతీదేవికి భర్త అయిన రుద్రుడు నాకు ప్రసన్నుడగుగాక! ॥ 36।

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ స్వగర్భస్యాశిషం లోక్యామాశాసానాం ప్రవేపతీమ్ ।
నిర్వృత్త సంధ్యానియమో భార్యామాహ ప్రజాపతిః ॥ 37

టీ:- స్వగర్భస్యేతి. స్వగర్భస్య స్వసంతానస్య ఆశిషం. శుభం. లోక్యాం లోకత్రయార్హాం. సంధ్యాయాం యో నియమః స నివృత్తో యస్య సః (37)

మైత్రేయమహర్షి ఇట్లు పలికెను

ఇహపరములయందు తన సంతానమునకు శుభము కలుగవలెనని తలచి దితి భగవానుని ప్రార్థించుచుండెను. ఆమె తాను చేసిన అపరాధమునకు వణకుచుండెను. కశ్యపప్రజాపతి తన సంధ్యాది విధులను పూర్తి చేసికొని ఆమెతో ఇట్లనెను. 37

కశ్యప ఉవాచ

శ్లో ॥ అప్రాయత్యాదాత్మనస్తే దోషాన్మౌహూర్తికాదుత ।
మన్నిదేశాతిచారేణ దేవానాం చాతి హేళనాత్ ॥ 38

టీ:- అప్రాయత్యాదితి. ఆత్మనశ్చిత్తస్య. అప్రాయత్యాదశుచిత్వాత్. మౌహూర్తికాదుత. సంధ్యారూపాదపి మమ నిదేశస్యాజ్ఞాయాః. అతి చారేణాతిక్రమేణ. దేవానాం రుద్రానుచరాణాం. 38

కశ్యపమహర్షి ఇట్లు పలికెను:

ఓ అపరిశుభ్రమైనదానా! కోపనా! (కోపము కలదానా) 1.నీ మనస్సు అపవిత్రమైన దగుటవలనను, 2.సంగమించినది సంధ్యాకాల మగుట చేతను, 3.నా యాజ్ఞను పాటింపకుండుట చేతను, 4.రుద్రాది దేవతలను అవమానించుట చేతను నీకు కలుగబోయే ఇద్దరు పుత్రులు అధములగుదురు. అమంగళ స్వరూపులగుదురు. లోకపాలురతో సహా ముల్లోకములను మాటి మాటికి పీడింతురు. ॥ 38-39 ॥

శ్లో ॥ భవిష్యతస్తవాభద్రావభద్రే జారరాధమౌ ।
లోకాన్ సపాలాం స్త్రీం శ్చండి ముహురాక్రందయిష్యతః ॥39

టీ:- భవిష్యతఇతి. జారరాధమౌ పుత్రాధమౌ చండి హే కోపనే. 39

శ్లో ॥ ప్రాణినాం హన్యమానానాం దీనానామకృతాగసామ్ ।
స్త్రీణాం నిగృహ్యమాణానాం కోపితేషు మహాత్మసు ॥ 40

టీ:- ప్రాణినామితి హన్యమానానాం సతాం. 40

శ్లో ॥ తదా విశ్వేశ్వరః క్రుద్ధో భగవాన్ లోకభావనః ।
హనిష్యత్యవతీర్యాసౌ యథాద్రీన్ శతపర్వధృక్ ॥ 41

టీ:- తదేతి. శతపర్వధృక్ వజ్రధర ఇంద్రః. 41

నీకు కలుగబోయే పుత్రులిరువురు నిరపరాధులను, దీనులను హింసించెదరు. స్త్రీలను చెరబట్టెదరు. మహాత్ములకు కోపమును కలిగింపగా జగత్పాలకుడగు శ్రీహరి అవతరించును. ఇంద్రుడు వజ్రాయుధముతో పర్వతముల రెక్కలను నరికిన విధముగా నీ పుత్రులిద్దరినీ సంహరించును. ॥ 40-41 ॥

దితిరువాచ

శ్లో ॥ వధం భగవతా సాక్షాత్సునాభోదారబాహునా ।
ఆశాసే పుత్రయోర్మహ్యం మా క్రుద్ధాద్బ్రాహ్మణాద్విభో ॥ 42

దితి ఇట్లు పలికెను

(క్రితము శ్లోకములో మహాత్ములు(బ్రాహ్మణులు) కోపింతురు అను ప్రస్తావన కలదు) ఓ ప్రభూ! నా పుత్రులు బ్రాహ్మణశాపముచే మరణింపకుందురు గాక! సునాభమని పిలువబడే చక్రాయుధమును

టీ:- వధమితి. సునాభేన ఉదార బాహుర్యస్య. కోపితేష్వితృుక్తత్వా చ్ఛంకితచిత్తా సతీ ప్రార్థయతే - బ్రాహ్మణాన్మాభూదితి. 42

ధరించిన గొప్పబాహువులు గల శ్రీహరిచే నా పుత్రులు మరణింప వలెనని ప్రార్థించుచున్నాను. 42

శ్లో ॥ న బ్రహ్మదండదగ్ధస్య న భూతభయదస్య చ ।
నారకాశ్చానుగృహ్ణంతి యాం యాం యోనిమసౌ గతః ॥ 43

టీ:- నేతి. నారకా అపి తథా. యాం యోనిమసౌ గతో భవతి. తత్రస్థా అపి. నానుగృహ్ణంతి కృపాం న కుర్వంతి. 43

బ్రాహ్మణుని శాపముచే మరణించినవానిపట్ల, ప్రాణులను భయ పెట్టు వానిపట్ల నరకమునందలి వారు కూడా దయచూపరు. అట్టివాడు ఏ యే జన్మలెత్తునో ఆ యా జన్మల యందు అక్కడివారు ఎవరూ దయచూపరు. 43

కశ్యప ఉవాచ

శ్లో ॥ కృతశోకానుతాపేన సద్యః ప్రత్యవమర్శనాత్ ।
భగవత్యురుమానాచ్చ భవే మయ్యపి చాదరాత్ ॥ 44

టీ:- కృతేతి. కృతో య అపరాధః. తతో య అనుతాపః. తేన ప్రత్యవమర్శనాత్ యుక్తాయుక్త విచారాత్. భగవతి హరౌ. భవే శ్రీరుద్రే. ఏతైః పంచభిః కారణైః.44

కశ్యపుడు ఇట్లు పలికెను

1.చేసిన పనికి పశ్చాత్తాపపడుచున్నావు. దాని వలన దుఃఖపడు చున్నావు.
2.చేసిన పని ఉచితమా అనుచితమా అని వెంటనే విమర్శించు చున్నావు దానివలన వివేకము కలిగినది.
3.విష్ణుమూర్తియందు ఆదరము చూపుచున్నావు.
4.రుద్రునియందు ఆదరము చూపుచున్నావు.
5.భర్త అయిన నా యందు ఆదరము చూపుచున్నావు. ఈ అయిదు కారణములచే నీ కొడుకులలో ఒకనికి పుట్టబోయేవాడు సత్పురుషులచే కీర్తింపబడేవాడగును. అతడే ప్రహ్లాదుడు. (ఈ అయిదు శ్లోకములలో ప్రహ్లాదుని కీర్తి వర్ణింపబడుచున్నది.) ॥ 44-45 ॥

శ్లో ॥ పుత్రస్యైవ తు పుత్రాణాం భవితైకః సతాం మతః ।
గాస్యంతి యద్యశః శుద్ధం భగవద్యశసా సమమ్ ॥ 45

టీ:- పుత్రస్యేతి. పుత్రస్య హిరణ్యకశిపోః. పుత్రాణాం మధ్యే. ఏకః సతాంమతో భవిష్యతి. తమేవ వర్ణయతి – గాస్యంతీతి సార్ధైః పంచభిః సమం సహ. సదృశం వా. 45

శ్లో ॥ యోగైర్హేమేవ దుర్వర్ణం భావయిష్యంతి సాధవః ।
నిర్వైరాదిభిరాత్మానం యచ్ఛీలమనువర్తితుమ్ ॥ 46

టీ:- యోగైరితి. హీనవర్ణం యథాహేమ. యోగైర్దాహాదిభిరుపాయైః శోధ్యతే. తథా యస్య శీలం స్వభావం. అనువర్తితుం అనుగంతుం ప్రాప్తుంనిర్వైరాదిభిఃయోగైః ఆత్మానం భావయిష్యంతి శోధయిష్యంతి. 46

శ్లో ॥ యత్ప్రసాదాదిదం విశ్వం ప్రసీదతి యదాత్మకమ్ ।
స స్వదృగ్భగవాన్ యస్య తోష్యతేఽనన్యయా దృశా ॥ 47

టీ:- యదితి. విశ్వప్రసాదే హేతుః. యదాత్మకం. స్వదృగాత్మసాక్షీ. యస్యానన్యయా భగవానేవ సత్య ఇత్యేవం భూతయా దృశా. తోష్యతే తోషం ప్రాప్నోతి. తత్ర హేతుః. 47

రంగు తగ్గిన బంగారమును (కల్తీ బంగారమును) అగ్నిలో కాల్చుట, పుటముపెట్టుట మొదలగు ఉపాయములచేతను శుద్ధి చేయుదురు. నీ పౌత్రుడగు ప్రహ్లాదునికి వైరము లేకుండుట మొదలగు ఉత్తమ స్వభావములు కలవు. సాధువులైన వారు నీ పౌత్రుని ఉత్తమ స్వభావముల ననుసరించి బంగారమును వలె శుద్ధినొందుదురు. 46

ఈ ప్రపంచమునకు అధిష్ఠానము భగవంతుడు. ఆ భగవానుని అనుగ్రహమున్నచో ఈ జగత్తు యొక్క అనుగ్రహము కూడ లభించును. అట్టి స్వయం ప్రకాశస్వరూపుడు, ఆత్మసాక్షియగు శ్రీహరి నీ పౌత్రుడగు ప్రహ్లాదుని అనన్య భక్తికి సంతోషించగలడు. 47

శ్లో ॥ స వై మహాభాగవతో మహాత్మా
మహానుభావో మహతాం మహిష్ఠః ।
ప్రవృద్ధ భక్త్యాహ్యనుభావితాశయే
నివేశ్య వైకుంఠమిమం విహాస్యతి ॥ 48

టీ:- స ఇతి. మహాత్మా అపరిచ్ఛిన్న దృష్టిః. మహానుభావః. మహా ప్రభావః మహతామపి మధ్యే మహిష్ఠః అతిశయేన మహాన్. ప్రవృద్ధయా భక్త్యా. అనువిభావితే సంశోధితే చిత్తే వైకుంఠం శ్రీహరిం. నివేశ్య ప్రాప్య అతత్ దేహాద్యభిమానం త్యక్ష్యతి. 48

శ్లో ॥ అలం పటః శీలధరో గుణాకరో
హృష్టః సమృద్ధ్యావ్యథితో దుఃఖితేషు ।
అభూత శత్రుర్జగతః శోకహర్తా
నైదాఘికం తాపమివోడురాజః ॥ 49

టీ:- మహాభాగవతత్వమేవాహ-అలంపట ఇతి. శీలధరస్సు స్వభావః గుణానాం ధైర్యాదీనాం. కరో జన్మభూమిః పరేషాం సమృద్ధ్యా హృష్టః పరేషు దుఃఖితేషు దుఃఖితః. న భూతోఽ జాతశ్శత్రుః. యస్య. నిదాఘభవం తాపం. చంద్రో యథా హరతి. ఏవం జగతశ్శోక హర్తా భవిష్యతి. 49

ఆ ప్రహ్లాదుడు గొప్ప భగవద్భక్తుడు, విశాల హృదయుడు అగును. గొప్ప ప్రభావము గలవాడగును. గొప్పవారిలోకెల్ల గొప్పవాడ గును. అతిశయించిన పవిత్రమైన భక్తిచేత తన హృదయములో శ్రీహరిని నిలుపుకొని దేహాభిమానమును విడువగలడు. 48

(ఆతని మహాభాగవతత్త్వమును చెప్పుచున్నాడు)

ప్రహ్లాదుడు ఇంద్రియభోగములందు ఆసక్తి లేనివాడు. మంచి స్వభావమును అలవరుచుకొన్నవాడు. సద్గుణాలకు నిలయమైనవాడు. ఇతరుల సంపదను చూపి సంతోషించేవాడు. దుఃఖితులను చూచి తాను బాధపడేవాడు. శత్రువులు లేనివాడు. వేసవి తాపమును చల్లార్చే చంద్రుని వలె ప్రపంచము యొక్క తాపమును చల్లార్చేవాడు. 49

శ్లో ॥ అంతర్బహిశ్చామలమబ్జనేత్రం
స్వపూరుషేచ్ఛానుగృహీతరూపమ్ ।
పౌత్రస్తవ శ్రీలలనాలలామం
ద్రష్టా స్ఫురత్కుండలమండితాననమ్ ॥ 50

టీ:- అపరిచ్ఛిన్నదృష్టిత్వమాహ - అంతరితి. స్వ పూరుషాణా మిచ్ఛయా. పునః పునర్గృహీతాని రూపాణి యేన. శ్రీరేవ లలనా సుందరీ. అస్యా లలామం మండనం. ద్రష్టా ద్రక్ష్యతి. 50

(ప్రహ్లాదుడి యొక్క అపరిచ్ఛిన్న దృష్టిని చెప్పుచున్నాడు)

శ్రీహరి స్వచ్ఛమైనవాడు. పద్మములవంటి నేత్రములు గలవాడు. తన భక్తుల కోరికననుసరించి అవతారములనెత్తేవాడు. లక్ష్మీదేవికి అలంకారమైనవాడు. మెరిసే కుండలములు ఆయన ముఖమునకు అలంకారములై ప్రకాశించును. అట్టి శ్రీహరిని నీ మనుమడగు ప్రహ్లాదుడు ఎల్లప్పుడు తన హృదయము లోపల మరియు బయట ప్రపంచ రూపములో చూడగలడు. 50

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ శ్రుత్వా భాగవతం పౌత్రమమోదత దితిర్భృశమ్ ।
పుత్రయోశ్చ వధం కృష్ణాద్విదిత్వాసీన్మహామనాః ॥ 51

టీ:- శ్రుత్వేతి. మహామనాః మహోత్సవ చిత్తా. హరిణా సహ యుద్ధేన. పుత్రయోః మరణే కీర్తిస్సద్గతిశ్చభవేదితి. 51

మైత్రేయుడు ఇట్లు పలికెను

తన మనుమడగు ప్రహ్లాదుడు భగవద్భక్తుడు కాగలడని విని దితి చాలా సంతోషించెను. తన పుత్రులిద్దరు శ్రీహరిచే మరణింతురనియు, కీర్తిని, సద్గతిని పొందుదురని తెలిసికొని ఆమె చాలా ఉత్సాహము పొందెను. 51

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
దితి కశ్యప సంవాదే చతుర్దశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
పద్నాల్గవ అధ్యాయము సమాప్తము.

పంచదశోఽధ్యాయః

శ్లో ॥ హతప్రభైస్సురైః పృష్టః ప్రాహ పంచదశే విధిః ।
తద్భీజం విప్రశాపాది వైకుంఠే విష్ణుభృత్యయోః ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ ప్రాజాపత్యం తు తత్తేజః పరతేజోహనం దితిః ।
దధార శత వర్షాణి శంకమానా సురార్దనాత్ ॥ 1

టీ:- తదేవం దేవానాం బ్రహ్మణశ్చ సంవాదప్రస్తావముక్త్వా ఇదానీం తం సంవాదమాహ - ప్రాజాపత్యమితి. ప్రాజాపత్యం కాశ్యపం. తేజో వీర్యం. పరేషాం తేజో హంతీతి తథా. వర్షశతం. స్వపుత్రాభ్యాం కరిష్యతే తత్పురాణామర్దనం పీడనం తస్మాత్. శంకమానా. 1

శ్లో ॥ లోకే తేన హతాలోకే లోకపాలా హతౌజసః ।
న్యవేదయన్విశ్వసృజే ధ్వాంతవ్యతికరం దిశామ్ ॥ 2

టీ:- లోక ఇతి. తేన గర్భతేజసా. హతాలోకే నిరస్త సూర్యాది ప్రకాశే. హతౌజసో హతప్రభాః. ధ్వాంతేన వ్యతికరం సంకరం. ॥ 2 ॥

15వ అధ్యాయము

ఈ పదిహేనవ అధ్యాయమున దితిగర్భములోనున్న సంతాన విషయమై దేవతలు భయపడుట, కాంతి తగ్గిన ఆ దేవతలు దితి సంతతి విషయమై బ్రహ్మనడుగుట, విష్ణుభృత్యులైన ఇరువురికి బ్రాహ్మణ శాపము కలుగుట మొదలగు విషయములు వర్ణింపబడినవి.

మైత్రేయమహర్షి ఇట్లు పలికెను

(దేవతలకు బ్రాహ్మణులకు జరిగిన సంవాదమును ప్రస్తావించుచున్నాడు.) కశ్యపప్రజాపతి యొక్క ఆ వీర్యము (తేజస్సు) ఇతరుల తేజస్సును నశింపజేయునదై యుండెను. తన గర్భము వలన దేవతలకు పీడకలుగునేమో అనే అనుమానముతో దితి వంద సంవత్సరముల కాలము గర్భము ధరించి యుండెను. ॥ 1 ॥

ఆ దితియొక్క గర్భతేజముచేత లోకముల తేజస్సు నశించినది. లోకపాలుర సామర్థ్యము తగ్గినది. ఇది ఈ దిక్కు అని తెలియకపోయినది. అనగా దిక్కులు కలిసి పోయినవి. లోకపాలురు ఈ విపరీతమును, అవ్యవస్థను సృష్టికర్తయగు బ్రహ్మదేవునికి విన్నవించిరి. ॥ 2 ॥

దేవా ఊచుః

శ్లో ॥ తమ ఏతద్విభో వేత్థ సంవిగ్నా యద్వయం భృశమ్ ।
న హ్యవ్యక్తం భగవతః కాలేనాస్పృష్టవర్త్మనః ॥ 3

టీ:- తమ ఇతి. వేత్థ జానాసి కిం విచారయసి. యద్యతో వయం. సంవిగ్నాః భీతాః. అవ్యక్తమజ్ఞాతం న స్పృష్టం వర్త్మ జ్ఞాన ప్రవాహో యస్య. ॥ 3 ॥

దేవతలు పలికిరి

ఓ ప్రభూ! నీకు ఈ చీకటి విషయము తెలియును. ఈ చీకటి మమ్ము భయమును గొల్పుచున్నది. కాలము నీ జ్ఞాన శక్తిని అడ్డగింపజాలదు. నీకు తెలియనిది ఏదీ లేదు. ॥ 3 ॥

శ్లో ॥ దేవదేవ జగద్ధాతర్లోకనాథ శిఖామణే ।
పరేషామపరేషాం త్వం భూతానామసి భావవిత్ ॥ 4

టీ:- బ్రహ్మాణం పరమేశ్వరత్వేన స్తువంతః ప్రార్థయంతే - దేవదేవేతి సప్తభిః. లోకనాథానాం శిఖామణే. భావవిత్ అభిప్రాయజ్ఞోఽసి కేన అభిప్రాయేణ దితేః గర్భోఽవర్ధత ఇతి జానాసీత్యర్థః. ॥ 4 ॥

(బ్రహ్మదేవుని పరమేశ్వరుడిగా ఈ ఏడుశ్లోకములతో దేవతలు ప్రార్థించుచున్నారు.) ఓ దేవదేవా! జగత్తులను సృష్టించేవాడా! లోకపాలురలో శ్రేష్ఠుడా! నీవు శ్రేష్ఠుల, నికృష్టుల అభిప్రాయమును కూడా తెలిసినవాడవు. సకల ప్రాణుల అభిప్రాయము తెలిసిన నీకు, ఏ అభిప్రాయముతో దితిగర్భముదాల్చినదో కూడా తెలియునని అర్థము. (4)

శ్లో ॥ నమో విజ్ఞాన వీర్యాయ మాయయేదముపేయుషే ।
గృహీత గుణ భేదాయ నమస్తేఽవ్యక్తయోనయే ॥ 5

టీ:- నమ ఇతి. విజ్ఞానం వీర్యం బలం యస్య. ఇదం బ్రహ్మదేహం.

చైతన్యమే బలముగాకలవాడవు. గుణములలో ఒకటగు రజోగుణమును సృష్ట్యాదుల కొరకై స్వీకరించిన చతుర్ముఖ బ్రహ్మవు. ఈ ప్రపంచమునకు కారణభూతమైన వాడవు(లేదా ప్రత్యక్షాది ఏ

ఉపేయుషే ప్రాప్తవతే. గృహీతో గుణభేదో రజోగుణో యేన. వ్యక్తస్య ప్రపంచస్య. యోనయే కారణాయ. న వ్యక్తా కేనాపి ప్రమాణేన అవిజ్ఞాతా యోనిర్యస్యేతి వా. 5

శ్లో ॥ యే త్వాఽనన్యేనభావేన భావయంత్యాత్మభావనమ్ ।
ఆత్మని ప్రోతభువనం పరం సదసదాత్మకమ్ ॥ 6 ॥

టీ:- సకామతయా ప్రతిక్షణం దుఃఖమనుభవంతో నిష్కామ భక్తాన్ స్తువంత ఆహుర్ద్వాభ్యాం -య ఇతి. యే త్వాం. త్వాం అనన్యేన నిష్కామేన. భావేన భక్త్యా ధ్యాయంతి. ఆత్మనో జీవాన్ భావయతీతి తథా. స్వస్మిన్ ప్రోతాని గ్రథితాని భువనాని యేన. చేతనాచేతన ప్రపంచకారణమిత్యర్థః. తత్రహేతుః-సదసదాత్మక కార్యకారణ రూపం వస్తుతస్తాభ్యాం పరం. 6

శ్లో ॥ తేషాం సుపక్వయోగానాం జితశ్వాసేంద్రియాత్మనామ్ ।
లబ్ధయుష్మత్ప్రసాదానాం న కుతశ్చిత్పరాభవః ॥ 7

టీ:- తేషామితి. జితాని శ్వాసేంద్రియాణ్యాత్మామనశ్చ యైః. అత స్సుపక్వ యోగాః. అతఏవ ప్రాప్తో యుష్మత్ప్రసాదో యైః తేషాం. 7

ప్రమాణముల చేత కూడా తెలియరాని వాడవు). అట్టి నీకు అనేక నమస్కారములు. 5

(ఈ రెండు శ్లోకములు సకాములైనవారు ప్రతిక్షణం దుఃఖము ననుభవించెదరని, నిష్కామభక్తిని స్తుతించుచు చెప్పనైనది) ఈ భువనములన్నియు నీ లోనే నిలిచియున్నవి. నీవు జీవులందరిని పాలించేవాడవు. కార్యరూపముగాను, కారణరూపము గాను ఉన్నవాడవు నీవే. అట్టి నిన్ను ఎవరైతే అనన్యభావనతో కూడిన నిష్కామభక్తితో ధ్యానించెదరో అట్టివారి యోగసాధన పరిపక్వమగును. అట్టి యోగులు తమ 1.శ్వాసను ప్రాణాయామము ద్వారా వశము చేసుకొందురు, 2. ఇంద్రియములను ప్రత్యాహారము ద్వారా వశము చేసుకొందురు, 3. మనస్సును ధారణ ద్వారా వశము చేసుకొందురు. నీ అనుగ్రహమునకు పాత్రులగుదురు. నీ అనుగ్రహపాత్రులైన యోగులకు ప్రపంచములో దేని వలనను పరాభవము కలుగదు.(6-7)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ యస్య వాచా ప్రజాస్సర్వాః గావస్తంత్యేవ యంత్రితాః ।
హరంతి బలిమాయత్తాస్తస్మై ముఖ్యాయ తే నమః ॥ 8

టీ:- అన్యేతు నిత్యం కర్మ క్లేశిన ఇత్యాహుః-యస్యేతి. తన్త్యాదామన్యా. ఆయత్తాః అధీనాః. ముఖ్యాయ నియంత్రే ప్రాణ రూపాయేతి వా. తథా చ శ్రుతిః. "తస్య వాక్తంత్రీనామాని దామాని" ఇత్యాది. 8

(ఈ శ్లోకములో ఇతరులు ప్రతినిత్యం కర్మక్లేశమునను భవింతురని చెప్పడమైనది) "తస్య వాక్తంత్రీనామాని దామాని దామానీ" అని శ్రుతి చెప్పినట్లుగా నీది వేదరూపమగు వాక్కు, ఎద్దులు త్రాటిచే బంధింపబడినట్లు ప్రజలందరూ బంధితులైనారు. ధర్మాధర్మములకు బద్ధులను చేసి వేదము నియంత్రించుచున్నది. జనులు కర్మాచరణ తత్పరులై నీకు పూజాదికమును సమర్పించుచున్నారు. ప్రాణులలో నీవు ప్రాణము(ప్రాణాపాన వ్యానోదాన సమానములలో మొదటిది ప్రాణము ముఖము నందు శ్వాస రూపముగా ఉండేది) రూపములో ఉన్నావు. నీకు నమస్కారము. 8

శ్లో ॥ సత్వం విధత్స్వశం భూమంస్తమసా లుప్త కర్మణామ్ ।
అదభ్రదయయా దృష్ట్యా ఆపన్నానర్హసీక్షితుమ్ ॥ 9

టీ:- స ఇతి. తమసా అహోరాత్ర విభాగాభావేన. లుప్తాని కర్మాణి యేషాం. ఆపన్నానాప్లుతానస్మాన్. 9

ఓ పరబ్రహ్మస్వరూపుడా! చీకటిచే అహోరాత్రి విభాగము తెలియక మా కర్మానుష్ఠానము లోపించినది. అట్టి మాకు సుఖమును కలిగించుము. ఆపదలో చిక్కుకున్న మమ్ము గొప్ప దయాదృష్టితో చూడుము. 9

శ్లో ॥ ఏష దేవ దితేర్గర్భ ఓజః కాశ్యపమర్పితమ్ ।
దిశస్తిమిరయన్ సర్వా ఏధతేஉగ్నిరివైధసి ॥ 10

(ఆపదకుగల కారణమును చెప్పుచున్నారు)

ఓ దేవా! కశ్యపప్రజాపతి యొక్క తేజస్సును(వీర్యమును) దితి ధరించినది. ఆమె గర్భము, ఎండు కట్టెయందలి అగ్నివలె వర్ధిల్లు

టీ:- ఆపత్కారణమాహుః-ఏష ఇతి. ఏష గర్భః తస్య విశేషణం. అర్పితం నిక్షిప్తం. కాశ్యపమోజో వీర్యం. దిశస్తిమిరయన్, తమో వ్యాప్తాః కుర్వన్. 10

చున్నది. దిక్కులయందు చీకట్లను వ్యాపింపజేయుచున్నది. 10

మైత్రేయ ఉవాచ

శ్లో॥ స ప్రహస్య మహాబాహో భగవాన్ శబ్దగోచరః ।
ప్రత్యాచష్టాత్మభూర్దేవాన్ప్రీణన్రుచిరయా గిరా ॥ 11

టీ:- సఇతి. దితేః కుచేష్టితం జ్ఞాత్వా. దేవానాం యే శబ్దాః విజ్ఞప్తి వాక్యాని. తేషాం గోచరో విషయభూతః. ప్రత్యాచష్ట. ప్రత్యభాషత. 11

మైత్రేయమహర్షి ఇట్లు పలికెను

స్వయంభువుడగు బ్రహ్మదేవుడు దేవతల విజ్ఞాపనవాక్యాలను విని, దితియొక్క కుచేష్టితము నెరిగినవాడై నవ్వెను. తన మధురమైన వాక్కుతో దేవతలను సంతోషింపజేస్తూ ఇట్లు బదులు పలికెను. 11

బ్రహ్మోవాచ

శ్లో॥ మానసా మే సుతా యుష్మత్పూర్వజాః సనకాదయః ।
చేరుర్విహాయసా లోకాన్ లోకేషు విగతస్పృహాః ॥ 12

టీ:- మానసా ఇతి. యుష్మత్సకాశాత్పూర్వం జాతాః. 12

బ్రహ్మదేవుడు ఇట్లు పలికెను

సనకాదులగు మహర్షులు నాకు మానసపుత్రులు. మీకు ముందు తరములవారు. వారు కోరికలులేనివారై ఆకాశమార్గమున లోకములందు సంచరించుచుండిరి. 12

శ్లో॥ త ఏకదా భగవతో వైకుంఠస్యామలాత్మనః ।
యయుర్వైకుంఠనిలయం సర్వలోక నమస్కృతమ్ ॥ 13

శ్రీహరి సత్త్వగుణప్రధానులైన జీవులలో శుద్ధచైతన్య

టీ:- తఇతి. శ్రీవైకుంఠాఖ్యం లోకం యయుః. 13

స్వరూపముగా వెలుగొందుచుండును. సర్వలోకములచే నమస్కరింపబడే ఆ శ్రీహరి వైకుంఠ నివాసి. అట్టి వైకుంఠమునకు ఒకప్పుడు సనకాదిమహర్షులు వెళ్ళిరి. 13

శ్లో ॥ వసంతి యత్ర పురుషాస్సర్వే వైకుంఠమూర్తయః ।
యేఽనిమిత్త నిమిత్తేన ధర్మేణారాధయన్ హరిమ్ ॥ 14

టీ:- తం వర్ణయతి - వసంతీత్యాదినా ద్వాదశభిః. శ్రీవైకుంఠస్య హరేరేవ మూర్తిర్యేషాం తే. నిమిత్తం ఫలం, ననిమిత్తం ప్రవర్తకం యస్మిన్. నిష్కామేన ధర్మేణేత్యర్థః. ఆరాధయన్ ఆరాధితవంతః. 14

( ఆ వైకుంఠమును ఈ పన్నెండు శ్లోకములతో వర్ణించుచున్నారు) ఆ వైకుంఠవాసులు శ్రీహరిరూపమును పోలియుందురు. ఏ కారణములేకుండానే(నిష్కామభావనతో) ఆరాధించుటయే వైకుంఠ-వాసుల ధర్మము.(నిష్కామముతో శ్రీహరిని ఆరాధించిన భగవత్స్వరూపమును పొందగలరని తాత్పర్యము). 14

శ్లో ॥ యత్రచాద్యః పుమానాస్తే భగవాన్ శబ్దగోచరః ।
సత్త్వం విష్టభ్య విరజం స్వానాం నో మృడయన్వృషః ॥ 15

టీ:- యత్రేతి. శబ్దగోచరః వేదాంతైకవేద్యః. విరజం సత్త్వమూర్తిం. విష్టభ్య ధృత్వా. వృషో ధర్మమూర్తిః. స్వానాం స్వాన్. 15

వైకుంఠవాసియైన శ్రీహరి వేదములచే ప్రతిపాదింపబడేవాడు. (వేదవేద్యుడు). కారణరహితుడు. (ఆదిపురుషుడు). పూర్ణస్వరూపుడు. ధర్మస్వరూపుడు. అట్టి శ్రీహరి రజోగుణములేని సత్త్వగుణమయమగు మూర్తిని ధరించి తనవారలమగు మాకు సుఖమును కలిగించుచున్నాడు. 15

శ్లో ॥ యత్ర నైశ్రేయసం నామ వనం కామదుఘైర్ద్రుమైః ।
సర్వర్తు శ్రీభిర్విభ్రాజత్కైవల్యమివ మూర్తిమత్ ॥ 16

(ఆ వైకుంఠమునందలి వనమును ఈ నాలుగు శ్లోకములతో వర్ణించుచున్నాడు). ఆ వైకుంఠములో రూపుదాల్చిన కైవల్యము వలె

టీ:- తద్వనం విశినష్టి - యత్రేతి చతుర్భిః. సర్వేష్వృతుషు శ్రీః పుష్పాది సంపద్యేషాం తైః. 16

‘నిశ్శ్రేయసము’ అనే పేరుగల ఒక వనము కలదు. ఆ వనము అన్ని ఋతువుల శోభను కలిగి యుండును. అన్ని కోర్కెలను దీర్చు వృక్షములతో ఒప్పారుచుండును. 16

శ్లో ॥ వైమానికాః సలలనాశ్చరితాని యత్ర
గాయంతి లోకశమలక్షపణాని భర్తుః ।
అంతర్జలేఽనువికసన్మధు మాధవీనాం
గంధేన ఖండితధియోఽప్యనిలం క్షిపంతః ॥ 17

టీ:- వైమానికా ఇతి. చరితాని చరిత్రాణి. భర్తుః ప్రభోః. అనువికసంత్యః. మధు మకరందః. తద్యుక్తా మాధవ్యో వాసంత్యో లతాః. యద్వా-అనువికసన్మధవః ప్రస్రవన్మకరందాః. మాధవ్యో మధుకరాలీనాః సుమనసః. తాసాం సుగంధేన ఖండితా విఘ్నితా ధీర్యేషాం తేఽపి తద్గంధప్రాపకం అనిలం క్షిపంతః తిరస్కుర్వంతః గాయంతి అనేన భగవత్పార్షదానాం నిరతిశయవిషయసుఖేఽపి భగవత్ భజనానందాసక్తిర్దర్శితా. 17

ఆ వనమునందుగల సరస్సులో మాధవీలతలకు, వాసంతికా లతలకు పూసే పూలు వికసించి యుండెను. ఆ పూలు పూదేనియలతో నిండియుండెను. వాటి మీదుగా వీచే సుగంధయుతమైన గాలి, తమ భార్యలతోగూడి విమానములలో గంధర్వులకు సోకుచూ వారికి బుద్ధి-చాంచల్యమును కలిగించుచుండెను. జనుల హృదయము లోని పాపములను నశింపజేసే శ్రీహరియొక్క లీలలను గానము చేయుచూ ఆ గాన మాధుర్యమున పరవశించే గంధర్వులు తమకు బుద్ధి - చాంచల్యమును కలిగించే విధముగా పుష్పసుగంధమును మోసుకువచ్చే వాయువును నిందించుచుందురు. 17

శ్లో ॥ పారావతాన్యభృతసారసచక్రవాక
దాత్యూహ హంస శుక తిత్తిరి బర్హిణాం యః ।
కోలాహలో విరమతేఽచిరమాత్రముచ్చైః
భృంగాధిపే హరికథామివ గాయమానే ॥ 18

ఆ వనములో పావురములు, కోకిలలు, బెగ్గురుపక్షులు, చాతకపక్షులు, హంసలు, చిలుకలు, తీతువులు, నెమళ్ళు మొదలగు పక్షులు కోలాహలము చేయుచుండును. తుమ్మెద హరికథను గానము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- పారావతేతి. అన్య భృతః కోకిలాః, దాత్యూహశ్చాతకః. అచిర మాత్రం క్షణమాత్రం విరమతి. అనేన పక్షిణామపి తత్ర హరికథా శ్రవణాది పరమానందో దర్శితః. 18

శ్లో ॥ మందార కుంద కురవోత్పల చంపకార్ణ
పున్నాగ నాగ వకుళాంబుజ పారిజాతాః ।
గంధేఽర్చితే తులసికా భరణేన తస్యాః
యస్మింస్తపః సుమనసో బహుమానయంతి ॥ 19

టీ:- మందారేతి. మందార పారిజాతౌ సుర తరు విశేషౌ. కురవకః తిలక వృక్షః.ఉత్పలం రాత్రివికాసి. అంబుజం దినవికాసి. నాగో నాగకేసరః. ఏతాస్సుమనసః. పుష్పజాతయః. సుగంధా అపి. తులసికా - భరణేన శ్రీకృష్ణేన తులస్యా గంధే అర్చితే. యస్మిన్ వనే. తస్యాస్తపో బహు మానయంతి. అనేన తత్రత్యా గుణగ్రాహిణో ఏవ న మత్సరిణ ఇత్యుక్తం. యత్ర ఏవం భూతం వనం. యత్ర శ్రీవైకుంఠం యయురితి పూర్వేణాన్వయః. 19

చేయుచున్నదా అన్నట్లు ఝుంకారము మొదలు పెట్టుటతోనే ఆ పక్షుల కోలాహలము ఆగిపోవును. పక్షులకుకూడా హరికథలు వినుట యందలి పరమానందము తెల్పబడుచున్నది. 18

వైకుంఠములో మందారము, పారిజాతములు, (ఈ రెండు విశేషమైన దేవతావృక్షములు) మల్లెలు, కురవకము(దీనికే గోరింట, తిలక వృక్షమనిపేరు), ఉత్పలము(కలువ, ఇది రాత్రి వికసించును) సంపెంగ, అర్కపుష్పము, సురపొన్న, నాగకేసర, పొగడ, అంబుజము (పద్మము, ఇది పగలు వికసించును) మొదలగు దేవతల పుష్పజాతు లన్నియు సుగంధ భరితములు. శ్రీహరికి తులసి ఆభరణము వంటిది. ఆయనకు పై పుష్పసుగంధములన్నింటి కన్న తులసీగంధమునందు ప్రీతి మెండు. వైకుంఠవాసులు గుణ గ్రాహులు. మత్సరులను ఆదరింప - రని భావము. ఈ విధమైన వైకుంఠమున సనకాదులు ప్రవేశించిరని పూర్వశ్లోకములతో అన్వయము. 19

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ యత్సంకులం హరిపదానతిమాత్రదృష్టైః
వైదూర్య మారకత హేమమయైర్విమానైః ।
యేషాం బృహత్కటితటాః స్మిత శోభిముఖ్యః
కృష్ణాత్మనాం న రజఆదదురుత్స్మయాద్యైః ॥ 20

టీ:- పునర్వైకుంఠమేవ విశినష్టి-యదితి. యత్సంకులం వ్యాప్తం భవతి. శ్రీహరిపాదయోరానతిః ప్రణామః. తావన్మాత్రేణ దృష్టైః. భక్తానాం విమానైః. న కర్మాదిప్రాప్తైః. వైదూర్య మారకతైర్హేమమయైశ్చ విమానైః బృహంతి కటితటాని యాసాం. స్మితేన శోభీని ముఖాని యాసాం తా అపి. శ్రీకృష్ణే ఆత్మా యేషాం. రజఃకామం. ఉత్స్మయాద్యైః పరిహాసాదిభిర్నఆదదుర్న జనయామాసుః. 20

(మళ్ళీ వైకుంఠవిశేషమునే చెప్పుచున్నాడు)

ఆ వైకుంఠము విమానములతో రద్దీగా యుండును. ఆ విమానములు వైదూర్యములు, పచ్చలతో (మరకతములతో) పొదగబడి బంగారముతో నిర్మితములైనవి. అవి శ్రీహరి పాదములకు ప్రణమిల్లిన మాత్రమున లభించేవి. ఆ విమానములలో సంచరించే జనుల హృదయములలో శ్రీహరి సర్వదా నిలిచియుండును. విశాల కటిభాగములు కలిగి, చిరునవ్వులతో విరాజిల్లే ముఖములుగల స్త్రీల పరిహాసములు గూడా, ఆ విమానములలో సంచరించేవారి హృదయములందు రజోగుణ సముద్భవమైన కామ వికారములను పుట్టించలేవు. 20

శ్లో ॥ శ్రీ రూపిణీ క్వణయతీ చరణారవిందం
లీలాంబుజేన హరిసద్మని ముక్తదోషా ।
సంలక్ష్యతే స్ఫటికకుడ్య ఉపేతహేమ్ని
సంమార్జతీవ యదనుగ్రహణేఽన్యయత్నః ॥ 21

టీ:- శ్రీరితి. శ్రీర్లక్ష్మీః, మనోహరమూర్తి ధారిణీ సతీ. హరేస్సద్మని సంమార్జనం కుర్వతీవ యస్మిన్ లోకే సంలక్ష్యతే. చరణారవిందం క్వణయతీ నూపురేణ శబ్దయంతీ. ముక్తో దోషశ్చాంచల్యం యయా.

లక్ష్మీదేవి మిక్కిలి రూపవతి. ఆమె తన చాంచల్యదోషమును విడిచిపెట్టి పద్మము వంటి పాదములందు అందెల మువ్వలు సవ్వడి చేయుచుండగా శ్రీహరి నివాసమున తిరుగుచుండెను. శ్రీహరి నివాసము బంగారముతో నిర్మింపబడినదై స్ఫటిక మయములైన గోడలు కలిగియుండును. రజోగుణ ప్రభావముతో బ్రహ్మాదులకు దూరమైన లక్ష్మీదేవి సత్త్వగుణ శోభితమగు శ్రీహరి లీలా కమలమువలె శోభించు

యద్వా ముక్తేన దోషా ప్రసారితేన బాహునా. కీదృశే సద్మని. స్ఫటిక మయాని కుడ్యాని యస్మిన్. మధ్యే మధ్యే శోభార్థముపేతం సంయుక్తం హేమ యస్మిన్. యస్య అనుగ్రహణే. శ్రీరనుగ్రహం కరోతీత్యేతదర్థం అన్యేషాం బ్రహ్మాదీనాం యత్నః సా అయం భావః. యద్యపి తత్ర రజోనాస్త్యేవ. తథాపి స్వర్ణపట్టికావచ్ఛిన్న భిత్తి భాగేషు. బహుధా ప్రతిబింబితా సతీ లీలాంబుజం భ్రామయంతీ. వినయ భయభక్తిభ్యాం తథా లక్ష్యతే ఇతి. 21

శ్లో ॥ వాపీషు విద్రుమతటాస్వమలామృతాప్సు
ప్రేష్యాన్వితా నిజవనే తులసీభిరీశమ్ ।
అభ్యర్చతీ స్వలకమున్నసమీక్ష్య వక్త్ర
ముచ్ఛేషితం భగవతేత్యమతాంగ యచ్ఛ్రీః ॥ 22

టీ:- వాపీతి. అంగ హే దేవాః. యద్యస్మిన్ లోకే, శ్రీరేవమమత అమంస్త మేనే. కింకుర్వతీ. విద్రుమమయాని తటాని యాసాం తాసు. అమలాః అమృతతుల్యాః ఆపో యాసాం తాసు వాపీషు. నిజవనే లక్ష్మీవనే. పరిచారికాభిరన్వితా. తులసీభిర్విష్ణుం పూజయంతీ. తదుదకే ప్రతిబింబితం. శోభనాలక యుక్తం. ఉత్కృష్టనాసికా యుక్తం. చ స్వవక్త్రం వీక్ష్య భగవతా ఉచ్ఛేషితం. చుంబితమిత్యమన్యత. అనేన లక్ష్మ్యా అపి సౌభాగ్యసుఖం భగవదనుగ్రహేణైవేతి ద్యోతితం. 22

చున్నది. ఆమె తిరుగుచున్నప్పుడు స్ఫటికపు గోడలలో ప్రతిబింబము పడి పద్మముతో శ్రీహరి నివాసమును ఊడ్చుచున్న ట్లుండెను. (ఊడ్చుట వినయ, భక్తులను సూచించును.) 21

దేవతలారా! ఆ వైకుంఠమున లక్ష్మీదేవి పరిచారికలతో గూడి తులసితో విష్ణువును అర్చించుచుండును. ఆ వనములో అమృతముతో సమానమైన నిర్మల జలముతోకూడిన సరోవరములుండును. అవి పగడపుమణులతో నిర్మితమైన తటములు (ఒడ్డులు) కలవై యుండును. లక్ష్మీదేవి సరోవరజలములో సుందరములగు తన ముంగురులను, ఉన్నతమగు నాసికతో శోభిల్లు ముఖమునుచూచి, దంతక్షతాది చిహ్నములనుచూచి భగవానుడు తనను చుంబించుటను స్మరించెను. (దీని వలన లక్ష్మీదేవి సౌభాగ్యసుఖమునకు కూడా భగవదనుగ్రహమే కారణమని తెలియుచున్నది.) 22

శ్లో ॥ యన్న వ్రజంత్యఘభిదో రచనానువాదా
చ్ఛృణ్వంతి యేఽన్య విషయాః కుకథా మతిఘ్నీః ।
యాస్తు శ్రుతా హతభగైర్నృభిరాత్తసారాః
తాంస్తాన్ క్షిపంత్యశరణేషు తమత్సు హంత ॥ 23

టీ:- యదితి. పునః కథంభూతం తద్వైకుంఠం. యద్వైకుంఠం న వ్రజంతి. కే. యే కుకథాః శృణ్వంతి. కాస్తాః. అఘం భినత్తీత్యఘభిత్తస్య శ్రీహరేః రచనా సృష్ట్యాదిలీలా. తస్యా అనువాదాదన్య విషయాః అర్థ కామాదివార్తాః మతిభ్రంశకాః. తేషామవ్రజనే హేతుః. యాస్తు హతభగైర్నృభిః. శ్రుతాస్సత్యస్తాంస్తాన్ శ్రోతౄన్ అశరణేషు నిరాశ్రయేషు. తమస్సు నరకేషు క్షిపంతి. హంత ఖేదే. కథంభూతాః-ఆత్తసారాః ఆత్తం శ్రోతౄణాం పుణ్యం యాభిస్తాః. 23

శ్రీహరికథలు పాపములను పోగొట్టేవి. మందభాగ్యులు జగద్రచన మొదలైన శ్రీహరి లీలలను వినరు. భగవదేతర (కుకథలను) కథలను వినువారు వైకుంఠమును పొందలేరు. సారహీనములు, మతిని భ్రమింపజేసేవి, అర్థకామములకు సంబంధించిన కథలను విని నరకములలో బడుదురు. అయ్యో! అచట వారిని రక్షించేవారు ఉండరు సుమా! 23

శ్లో ॥ యేఽభ్యర్థితామపి చ నో నృగతిం ప్రపన్నా
జ్ఞానం చ తత్త్వవిషయం సహధర్మ యత్ర ।
నారాధనం భగవతో వితరంత్యముష్య
సమ్మోహితా వితతయా నను మాయయా తే ॥ 24

టీ:- ప్రసంగాత్తాన్ శోచతి - యఇతి. నోఽస్మాభిర్బ్రహ్మాదిభిరపి. అభ్యర్థితాం మనుష్యజాతిం. ప్రపన్నాః ప్రాప్తాస్సంతోఽపి. హరేర్నా

మనుష్యజన్మము ధర్మముతో గూడిన తత్త్వజ్ఞానము పొందుటకు అనువైనది. కనుకనే బ్రహ్మాదులమగు మేము మనుష్య జన్మమును పొందగోరుచున్నాము. ఇట్టి మానవజన్మ పొందియు శ్రీహరిసేవ చేయని వారు ఆ భగవంతుని విస్తారమైన మాయలో చిక్కి మోహము నకు గురియగుదురు. అయ్యో! భగవద్విముఖులు ఎంతటి దురదృష్ట

రాధనం కుర్వంతి. తే కీదృశీం నృగతిం. యత్ర యస్యాం ధర్మసహితం తత్త్వజ్ఞానం భవతి. తదుభయసాధనత్వాత్తస్యాః. తే ఆముష్య భగవతః విస్తృతయా మాయయా నను సంమోహితాః. బతేతి ఖేదే యది చైవం సంబంధః కేవలం త ఏవ న వ్రజంతి. కింతు యే భగవదారాధనం న కుర్వంతి. తేஉపి తేషాం మాయామోహితత్వాదితి. ॥ 24

శ్లో ॥ యచ్చ వ్రజంత్యనిమిషామృషభానువృత్త్యా
దూరే యమా హ్యుపరి నః స్పృహణీయశీలాః ।
భర్తుర్మిథస్సుయశసః కథనానురాగ
వైక్లబ్యరాగకలయా పులకీకృతాంగాః ॥ 25

టీ:- యదితి. పునః కథంభూతం. యచ్చ న ఉపరి స్థితంవ్రజంతి. కే. అనిమిషాణాం దేవానామృషభః శ్రేష్ఠో హరిః తస్యానువృత్త్యాదూరే యమో యేషాం. యద్వా దూరీకృతాః యమ నియమాః. పాఠాంతరే దూరీకృతాహంకారా ఇత్యర్థః. స్పృహణీయం కరణాది శీలం యేషాం. కించ భర్తుర్హరేః. యత్సుయశః తస్య మిథః కథనేన. యోஉనురాగః తేన. వైక్లబ్యం. వైవశ్యం తేన యా బాష్పకలా తయా సహ. ప్రపులకీకృతం అంగం యేషాం. యద్వా న ఉపరి ఇతి వ్రజతాం విశేషణం. నిరహంకారత్వా దస్మత్తోயేஉధికాస్తే యద్వ్రజంతీత్యర్థః. 25

వంతులో కదా! (అంటూ శోచిస్తున్నాడు). 24

1. భక్తులు దేవతాశ్రేష్ఠుడైన శ్రీహరిని సర్వదా స్మరిస్తూ మృత్యుభయము - లేని వారగుదురు.
2. వారు కారుణ్యాది సద్గుణములు గలవారు. అందుచే దేవతలుగూడా ఈ భక్తులవంటి సద్గుణములు తమకుండవలెనని కోరుకొనుచుందురు.
3. వారు బ్రహ్మాదిదేవతలమైన మనకంటె గొప్పవారు.
4. వారు పరస్పరము శ్రీహరియొక్క కీర్తిని గానము చేసి వర్ణించుచు, అందలి అనురాగముచే పరవశులగుదురు. ఆనందాశ్రువులు రాల్చుచు పులకాంకిత గాత్రులగుదురు. ఈ లక్షణములు గల భక్తులు వైకుంఠ-మును పొందుదురు. 25

శ్లో ॥ తద్విశ్వగుర్వధికృతం భువనైకవంద్యం
దివ్యం విచిత్రవిబుధాగ్ర్య విమానశోచిః ।
ఆపుః పరాం ముదమపూర్వముపేత్య యోగ
మాయాబలేన మునయస్తదథో వికుంఠం ॥ 26

టీ:- తదితి. తత్తదా తదపూర్వం వికుంఠం. అథో అనంతరముపేత్య మునయః పరాముత్కృష్టాం ముదమాపుః. అపూర్వత్వే హేతవః. విశ్వగురుణా శ్రీహరిణా అధికృతమధిష్ఠితం. భువనానామేకమేవ వంద్యం. దివ్యం అలౌకికం. విచిత్రాణి విబుధాగ్ర్యాణాం విమానాని. తేషాం శోచిర్దీప్తిర్యస్మిన్. యోగమాయా బలేనేతి అష్టాంగయోగప్రభావేనోపేత్య. పరమేశ్వరే తు యోగమాయేతి చిచ్ఛక్త్యేతి ద్రష్టవ్యం. 26

అపుడు సనకాది మునులు తము సాధనచేసిన అష్టాంగయోగ ప్రభావముచేత, చిచ్ఛక్తి ప్రభావముచేత వైకుంఠమునకు చేరుకొనిరి. ఆ వైకుంఠము జగద్గురువగు శ్రీహరిచేత అధిష్ఠించబడినది. సకల భువనములలో ముఖ్యముగా నమస్కరింపదగినది. అలౌకికమైనది. నానావిధములగు దేవతావిమానములతో ప్రకాశించునది. అట్టి వైకుంఠమును చేరి సనకాదిమహర్షులు మహదానందమును పొందిరి. (26)

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ తస్మిన్నతీత్య మునయష్షడసజ్జమానాః
కక్ష్యాః సమానవయసావథ సప్తమాయామ్ ।
దేవావచక్షత గృహీత గదౌ పరార్ధ్య
కేయూర కుండల కిరీట విటంక వేషౌ ॥ 27

టీ:- తస్మిన్నితి. తస్మిన్ వైకుంఠే షట్ కక్ష్యాః ప్రాకార ద్వారాణి. అసజ్జమానా భగద్దర్శనోత్కంఠతయా తత్తదద్భుతదర్శనే ఆసక్తిమ

మైత్రేయుడు పలికెను

సనకాదిమహర్షులు ఆరు ప్రాకారద్వారములను దాటిరి, అచ్చటనున్న అద్భుతదృశ్యములేవియు భగవద్దర్శనార్థులైన వారిని అడ్డగించలేకపోయినవి, ఆకర్షింపలేకపోయినవి, తరువాత వారు ఏడవ ద్వారమును సమీపించిరి. అచ్చట గదలను పట్టుకొని కావలి కాయుచున్న ఇద్దరు దేవతలను చేరిరి. వారు సమానవయస్సు గలవారై మిక్కిలి శ్రేష్ఠమైన కేయూరములు, కుండలములు, కిరీటములు దాల్చి

కుర్వాణాః. ద్వారపాలౌ దేవావపశ్యన్. కథంభూతౌ. సమానం వయో యయోః. గృహీతే గదే యాభ్యాం. పరార్ధ్యైః కేయూరాదిభిః విటంకః సుందరో వేషో యయోః. 27

అత్యంత సుందరముగా కనిపించుచుండిరి. 27

శ్లో ॥ మత్తద్విరేఫ వనమాలికయా నివీతౌ
విన్యస్తయాఽసితచతుష్టయబాహుమధ్యే ।
వక్త్రం భ్రువా కుటిలయా స్ఫుటనిర్గమాభ్యాం
రక్తేక్షణేన చ మనాగ్రభసం దధానౌ ॥ 28

టీ:- తావేవ వర్ణయతి-మత్తేతి. మత్తద్విరేఫాః భ్రమరాః యస్యాం. తయా వనమాలికయా నివీతౌ కంఠలంబిన్యా అలంకృతౌ. అసితా నీలాః. చతుష్టయం చతుస్సంఖ్యాకాః బాహవః. తేషాం మధ్యే విన్యస్తయా వక్త్రం చ మనాక్ రభసం కించిత్ క్షుబ్ధం దధానౌ. స్ఫుటౌ ఉత్ఫుల్లౌ నిర్గమౌ శ్వాసమార్గౌ నాసాపుటే తాభ్యాం. 28

ఆ ద్వారపాలకులిరువురు నాలుగు భుజములు కలిగియుండిరి. ఆ భుజములు నీలవర్ణములై యుండెను. ఆ భుజములమధ్య వనమాల అలంకరింపబడి యుండెను. ఆ వనమాల మదించిన తుమ్మెదలతో చుట్టబడియుండెను. ఆ ద్వారపాలకులు ముడివేయబడిన కను-బొమ్మలతో, వికసించిన ముక్కు పుటములతో ఎఱ్ఱని కన్నులతో గూడి యుండిరి. వారి ముఖములలో చిరుకోపము కనిపించుచుండెను. 28

శ్లో ॥ ద్వార్యేతయోర్నివివిశుర్మిషతోరపృష్ట్వా
పూర్వా యథా పురటవజ్రకవాటికాయాః ।
సర్వత్ర తేఽవిషమయా మునయః స్వదృష్ట్యా
యే సంచరంత్యవిహతా విగతాభిశంకాః ॥ 29

ఆ ద్వారములన్నియు బంగారముతో చేయబడి వజ్రములచే పొదగబడి యుండెను. వారు మొదటి ఆరు ద్వారములను ఎట్లా దాటి వచ్చినారో, అట్లే ఏడవ ద్వారములోను ద్వారపాలకుల అనుమతి

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- ద్వారీతి. ఏతయోర్మిషతోః పశ్యతోః తావనాదృత్య ఆపృష్ట్వేవ. యాః పూర్వాః షట్ద్వారః. పురాలంకృతా వజ్రమయాః కవాటికా యాసు తా యథా వివిశుస్తథా సప్తమాయామపి ద్వారి తే నివివిశుః. అప్రశ్నే హేతుః-సర్వత్ర యే అవిహతాః అనివారితాస్సంచరంతి. నిశ్శంకత్వే హేతుః. అవిషమయా స్వదృష్ట్యేతి. 29

లేకుండా ప్రవేశించినారు. వారి గమనము సర్వత్రా (అంతటా) అడ్డులేనిది. కనుకనే వారు ద్వారపాలకులను అడుగలేదు. వారు వైషమ్యములేని సమదృష్టిగలవారు కావుననే నిశ్శంకగా (నిస్సందేహముగా) ఏడవ ద్వారములోనికి ప్రవేశించిరి. 29

శ్లో ॥ తాన్వీక్ష్య వాతరశనాంశ్చతురః కుమారాన్
వృద్ధాన్ దశార్ధవయసో విదితాత్మతత్త్వాన్ ।
వేత్రేణ చాస్ఖలయతామతదర్హణాంస్తౌ
తేజో విహస్య భగవత్ప్రతికూలశీలౌ ॥ 30

టీ:- తానితి. వాతరశనాన్నగ్నాన్. వృద్ధానపి పంచవర్షబాలకవత్ప్రతీయమానాన్. చకారాదాజ్ఞయా చాస్ఖలయతాం, నివారితవంతౌ. న తత్. స్ఖలనమర్హంతీతి తథా తాన్. అహో అత్రాపి ధార్ష్ట్యమిత్యేవం. తేషాం తేజో విహస్య. భగవతో బ్రహ్మణ్యదేవస్య ప్రతికూలం శీలం యయోః. 30

ఆ సనకాది మహర్షులు దిగంబరులు. వృద్ధులైనను అయిదు సంవత్సరముల వయస్సుగల బాలురవలె కన్పింతురు. ఆత్మతత్త్వము నెరిగినవారు. అడ్డుపెట్టుటకు కూడనివారు. (గొప్పవారని అర్థము). ఆ ద్వారపాలకులిరువురును భగద్విరోధ స్వభావముగల వారగుటచే (ఆ సమయములో) మహర్షుల ప్రవర్తనను పోగరుబోతుదనముగా భావించి పరిహసించిరి. బెత్తములతోనడ్డగించిరి. 30

శ్లో ॥ తాభ్యామ్మిషత్స్వనిమిషేషు నిషిధ్యమానాః
స్వర్హత్తమా హ్యపి హరేః ప్రతిహారపాభ్యామ్ ।
ఊచుస్సుహృత్తమదిదృక్షిత భంగ ఈషత్
కామనుజేన సహసా త ఉపప్లుతాక్షాః ॥ 31

వారు మహర్షులు. గొప్పగా పూజింపదగినవారు కూడా, ఆ కారణముచేత ప్రవేశమును నిషేధించుటకు అనర్హులు. అట్టి మహర్షులను దేవతలు చూచుచుండగా ద్వారపాలకులు అడ్డగించిరి.

టీ:- తాభ్యామితి. హరేర్ద్వారపాలపతిభ్యాం. దేవేషు పశ్యత్సు వార్యమాణాస్తే మునయః. కో వా ఇత్యాది శ్లోక త్రయమూచుః. సుహృత్తమః శ్రీహరిః తస్య దిదృక్షితం దర్శనేచ్ఛా. తస్య భంగే సతి. కామానుజః క్రోధః. తేన సహసా అకస్మాదేవ. ఉపప్లుతాని క్షుభితాని అక్షీణీ యేషాం తే. సుష్ఠు పూజ్యతమా అపీతి నిషేధానర్హత్వే హేతుః. 31

సనకాదులకు భగవంతుడిని దర్శించవలెననెడు మిక్కిలి కోరిక (కామము) యుండగా ద్వారపాలకులు అడ్డుతగిలిరి. దానితో సనకాదులకు కామము యొక్క తమ్ముడగు క్రోధము కలిగెను (ఆవహించెను). ఆ క్రోధము కన్నులలో వ్యాపించి కో వా.... అంటూ క్రింది మూడు శ్లోకములలో చెప్పిన విధముగా ప్రశ్నించిరి. 31

మునయ ఊచుః

శ్లో ॥ కో వామిహైత్య భగవత్పరిచర్యయోచ్చైః
తద్ధర్మిణాం నివసతాం విషమః స్వభావః ।
తస్మిన్ ప్రశాంతపురుషే గతవిగ్రహే వాం
కో వాత్మవత్కుహకయోః పరిశంకనీయః ॥ 32

టీ:- క ఇతి. ఉచ్చైర్మహత్యా పరిచర్యయా భగవత్పరిచర్యయా ఏత్య ప్రాప్య. ఇహ వైకుంఠే. నివసతాం తద్ధర్మిణా భగవద్ధర్మిణా సమదర్శినాం మధ్యే.వాం యువయో రేవ కోఽయం విషమస్వభావః. కైశ్చిత్ప్రవేష్టవ్యం కైశ్చిన్న ప్రవేష్టవ్యం ఇత్యేవంభూతః నను స్వామినో రక్షణార్థం ద్వారకపాలకయో రేషస్స్వభావో గుణ ఏవేతి చేదత ఆహుః.తస్మిన్నితి. కుహకయోః కపటయోః. ఆత్మవత్స్వదృష్టాంతేన. యథా ఆవాం కపటౌ. తథాన్యోఽపి కశ్చిత్కపటః ప్రవేక్ష్యతీతి. అయం భావః. న హ్యత్ర భగవద్భక్తిం వినా కశ్చిదాగచ్ఛతి. న చేశ్వరే ప్రశాంతత్వాదవిద్యమాన విరోధే భయశంకా. అతో యువాం కేవలం ధూర్తావేవేతి. 32

మునులు ఇట్లు పలికిరి

మీరు గత జన్మలలో భగవంతుని గొప్పగా ఆరాధించి ఇచ్చటకు వచ్చితిరి. ఈ వైకుంఠములో సమదర్శియగు భగవంతుని ధర్మములే యుండవలెను. కాని మీకు ఈ విషమస్వభావము ఎట్లు వచ్చినది? భగవానుడగు విష్ణుమూర్తి పరమశాంతస్వభావుడు. ఆయనకు కలహము లేదు. విరోధులు లేరు. అయినప్పుడు కొందరిని లోనికి ప్రవేశపెట్టుట, కొందరిని ప్రవేశపెట్టకుండుట స్వామి రక్షణార్థమనుట పొసగదు. మీరు కపటస్వభావము గలవారగుటచే ఇతరుల యందు (మాయందు) దోషమును చూచుచున్నారు. భగవద్భక్తులను దోష - దృష్టితో చూచే మీరు ధూర్తులు. భగవద్భక్తి లేకుండా ఇచటికి ఎవరు రాగలరు? 32

శ్లో ॥ న హ్యంతరం భగవతీహ సమస్తకుక్షా
వాత్మానమాత్మని నభో నభసీవ ధీరాః ।
పశ్యంతి యత్ర యువయోస్సురలింగినోః కిం
వ్యుత్పాదితం హ్యుదర భేది భయం యతోఽస్య ॥ 33

టీ:- భయశంకాది బీజం చ భేదః, స చ కస్యాప్యస్మిన్నాస్తీత్యాహ. న హీతి. సమస్తం విశ్వం కుక్షౌ యస్య. యత్ర యదేహ భగవతి. ధీరాః విద్వాంసః. ఆత్మనోంతరం భేదం న పశ్యంతి. కిం త్వస్మిన్ పరమాత్మని. ఆత్మానమంతర్భూతం పశ్యంతి.మహాకాశే ఘటాకాశమివ తథా. యథా అన్యస్య రాజాదేః ఉదరభేద్యుదర భేదయుక్తం. భయం భవతి. తథాస్య శ్రీహరేస్తాదృగ్భయం యతో యేన కారణేన. సురవేషధారిణోర్యువయోః విశేషేణోత్పాదితం తత్కిం న కించిదిత్యర్థః. 33

ఈ విష్ణుభగవానుని ఉదరమునందు సకల విశ్వములు విరాజిల్లు చున్నవి. ఆయన సకల ప్రాణులలో ఆత్మరూపముగా నున్నాడు. జ్ఞానులు ఘటాకాశమును మహాకాశమునందువలె, జీవాత్మను పరమాత్మ యందు అభేదభావముతో చూతురు. జీవాత్మ పరమాత్మయందలి అంతర్భాగమని తలతురు. ఇతరరాజులకు వలె ఈ విష్ణు భగవానునకు కీడుకలుగునేమో అను భయము(ఉదరభేదిభయము) మీకు ఎందుకు కలిగినది. దేవతలవేషములతోనున్న మీ ఇరువురికి ఇట్టి అనుమానము కలుగుటకు కారణమేమి? 33

శ్లో ॥ తద్వామముష్య పరమస్య వికుంఠభర్తుః
కర్తుం ప్రకృష్టమిహ ధీమహి మందధీభ్యామ్ ।
లోకానితో వ్రజతమంతరభావదృష్ట్యా
పాపీయసస్త్రయ ఇమే రిపవోఽస్య యత్ర ॥ 34

టీ:- తదితి. తత్తస్మాద్వైకుంఠనాథస్య,భృత్యాభ్యాం యువాభ్యాం

మీరు సత్త్వగుణానికి అధిపతియగు వైకుంఠనాథునికి ద్వార పాలకులు. కాని మందబుద్ధులు. వైకుంఠాధిపతికే కీడును శంకించు చున్నారు. మీ భేదబుద్ధి తొలగునట్లు మీకు తగిన శిక్షను వేయవలెనని ఆలోచించుచున్నాము (ఇచట శిక్ష యనగా తగిన పరివర్తనకు అవకాశము). కామ క్రోధః తథా లోభః అను గీతావాక్యానుసారము

ప్రకృష్టం భద్రమేవ కర్తుం ఇహాస్మిన్నపరాధే యద్యుక్తం తద్ధీమహి చింతయేమ. తదేవాహుః–అంతర్యః స్వభావః. సత్తాదర్శనేన. ఇతః వైకుంఠాల్లోకాద్ర్వజంతం. యత్ర యేషు లోకేషు. అస్య పాపీయసో ద్రష్టుః. ఇమే "కామః క్రోధస్తథా లోభ" ఇతి గీతోక్తాస్త్రయోరిపవో భవంతి. పాపీయసో లోకాని వా. 34

ఈ కామ క్రోధ లోభములు మూడు శత్రువులు. ఆ శత్రువులకు నివాసస్థానములగు ఇతర లోకములను పొందుడు. ఈ వైకుంఠమును విడిచి వెళ్ళుడు. 34

శ్లో ॥ తేషామితీరితముభావవధార్య ఘోరం
తం బ్రహ్మదండమనివారితమస్త్రపూగైః ।
సద్యో హరేరనుచరావురుబిభ్యతస్తత్
పాదగ్రహావపతతామతికాతరేణ ॥ 35

టీ:– తేషామితి. ఇతి తేషామీరితం భాషణం. ఘోరమవధార్య. దండే చ బ్రహ్మదండం బ్రహ్మశాపమవధార్య. తం శస్త్రసమూహైరప్యనివార్యం అవధార్య. శ్రీహరేరనుచరౌ. అతికాతర్యేణ భయేన. తత్పాదగ్రహణం కుర్వం తౌ సంతౌ. దండవదపతతాం. కథభూతస్య హరేః. ఏవం భూతేభ్యో మునిభ్యః. తాభ్యామపి. ఉరు అధికం బిభ్యతః. భయం భావయతః. 35

ఇట్లు పలికిన సనకాదుల మాటలను (జయ విజయులు) వినిరి. బ్రాహ్మణ శాపమెట్టి అస్త్రశస్త్రాదులచేతనైనను నివారింపరానిదని తలచి మిక్కిలి భయపడిరి. సాక్షాత్తు విష్ణుమూర్తి కూడా బ్రాహ్మణశాపమునకు భయపడును. శ్రీహరి యొక్క సేవకులగు జయ విజయులు మిక్కిలి దైన్యముతో ఆ మునుల పాదములపై బడిరి. 35

శ్లో ॥ భూయాదఘోని భగవద్భిరకారి దండో
యోఽనౌ హరేత సురహేళనమప్యశేషమ్ ।
మావోఽనుతాపకలయా భగవత్స్మృతిఘ్నో
మోహో భవేదిహ తు నౌ వ్రజతో రధోధః ॥ 36

టీ:- అహో అపరాద్ధమస్మాభిరిత్యనుతప్యమానాన్ ప్రత్యూచతుః. భూయాదితి. అఘోని అఘవతి. య ఉచితో దండః సఏవ భగవద్భిరకారి. నాత్ర భగవతామపరాధః కశ్చిత్. అతోఽసౌ ఆవయోర్భూయాత్. యో అశేషమపి సురహేళనం. ఈశ్వరాజ్ఞాతిక్రమ-రూపం పాపం హరేత్. కింతు వః యుష్మాకం యః కృపానిమిత్తోను తాపః. తస్య లేశేన. నౌ ఆవయోః. అధోధః మూఢయోనీ వ్రజతోరపి. భగవత్ స్మృతి ప్రతిఘాతకో మోహో న భవేత్. కింతు మోహోఽపి స్మృతిమేవ ప్రహతాదితి ప్రార్ధనా. 36

అపరాధము చేసినామనెడు పశ్చాత్తాపముతో జయవిజయులిట్లు పలుకుచున్నారు. అపరాధులైన మాకు మీరు విధించిన శిక్ష ఉచితమైనదే. మీరు విధించిన శిక్ష అనుభవించెదము. దాని వలన ఈశ్వరాజ్ఞను అతిక్రమించుట, మిమ్ము అవహేళనము చేయుట యనెడి పాపము పూర్తిగా తొలగిపోవును. మేము అధమయోనిలోనికి పోవు చున్నాము. మేము చేసిన దోషమువలన రాబోయే జన్మలలో భగవద్వి-స్మరణము కలుగును. మా యీ దుర్దశను చూచి మీకు ఒకించుక దయ గలిగినచో మాకు రాబోయే జన్మలలో భగవద్విస్మరణము కలుగుకుండునట్లు ప్రార్థించుచున్నాము. (అపరాధులమైనను మీ అనుగ్రహముచేత సర్వదా మాకు భగవత్స్మరణ ఉండవలెనని ప్రార్థన) (36)

శ్లో ॥ ఏవం తదైవ భగవానరవిందనాభః
స్వానాం విబుధ్య సదతిక్రమమార్యహృద్యః ।
తస్మిన్ యయౌ పరమహంస మహామునీనా
మన్వేషణీయచరణౌ చలయన్ సహశ్రీః ॥ 37

శ్రీమహావిష్ణువు తన సేవకులు చేసిన మహాపరాధమును ఆ క్షణముననే తెలిసికొనెను. ఆయన సత్పురుషులకు మనోజ్ఞుడు. పరమహంసలగు మహర్షులు ఏ దివ్యచరణములను సదా అన్వేషించు చుందురో, అట్టి దివ్యచరణములతో లక్ష్మీదేవితో గూడినవాడై

టీ:- ఏవమితి. ఏవం స్వానాం. మహత్స్వతిక్రమమపరాధం. తత్క్షణాదేవావబుధ్య తస్మిన్ యత్ర తే రుద్ధాస్తం దేశం యయౌ. ఆర్యాణాం హృద్యో మనోజ్ఞః. చరణౌ చలయన్నితి. అయం భావః. మచ్చరణదర్శనప్రతిఘాతజం క్రోధం తౌ దర్శన్ శమయిష్యామీతి త్వరా వ్యాజేన. పద్భ్యామేవ యయౌ. ఆర్యాణాం సాహిత్యం. నిష్కామానపి విభూతిభిః పూరయిత్వా. క్షమాపయితుమ్. 37

శ్లో ॥ తం త్వాగతం ప్రతిహృతౌపయికం స్వపుంభి
స్తే౽చక్షతాక్షివిషయం స్వసమాధిభాగ్యమ్ ।
హంసశ్రియోర్వ్యజనయోశ్శివవాయులోల
శుభ్రాతపత్ర శశి కేసర సీకరాంబుమ్ ॥ 38

టీ:- తత్ర తైర్దృష్టం దేవమనువర్ణయతి-పంచభిః. తమితి - తం త్వాగతం తే౽చక్షత, అపశ్యన్. ఆపంచమాదిదమేవ క్రియాపదం. స్వపుంభిః. శీఘ్రం ప్రతిహృతమానీత మౌపయికం గమనోచితఛత్ర పాదుకాది యస్య స్వసమాధినా భాగ్యం భజనీయం ఫలం. బ్రహ్మ యత్త దక్షి విషయం. హంసవత్ శ్రీర్యయోస్తయోః. ఉభయతశ్చలతోర్వ్య జనయోః యశ్శివో౽నుకూలో వాయుః. తేన లోలాశ్చలంతః. శుభ్రాత పత్ర శశికేసరాః, శుభ్రం యదాతపత్రం తదేవ శశిసాదృశ్యాచ్ఛశీ.

ఋషులను అడ్డగించిన ఆ ప్రదేశమునకు, నా చరణదర్శనమునకు కలిగిన ఆటంకము ద్వారా వారిద్దరికి కలిగిన కోపమును శమింప జేసెదననే తొందరలో అట్టి దివ్య పాద పద్మములతో నడిచి వచ్చెను. ।(37)

క్రింది అయిదు శ్లోకములలో మహర్షులు చూచిన భగవంతుని రూపము వర్ణించబడినది. ఈ శ్లోకములో నున్న "ఆచక్షత" అనే క్రియాపదమే ఈ అయిదు శ్లోకములకు అన్వయించును. సేవకులు ఛత్ర పాదుకలు వెంట తీసికొనిరాగా శ్రీహరి ఆ మహర్షులకు కనిపించెను. ఆ దేవుడు మహర్షుల తపస్సమాధులకు ఫలమైనవాడు. ఇంద్రియములకు అగోచరమైనవాడు. చామరములను సేవకులు వీచుచుండిరి. ఆ చామరములు హంసలరెక్కలవలె నుండెను. చామరముల కదలికచే ఛత్రమునందు కూర్చబడిన ముత్యాల హారములు కదులుచుండెను. ఆ హారముల కదలికచే చంద్రుని వెన్నెల వంటి అమృతకిరణములు ఆయనపై పడుచుండెను. అట్టి భగవానుని సనకాది ఋషులు చూచిరి. 38

తస్య కేసరా ముక్తాహార విలంబాస్తేభ్యః. గలంతి శీకరాంబూని యస్మిన్ తమ్. శీకరోంబుకణః. 38

శ్లో ॥ కృత్స్న ప్రసాద సుముఖం స్పృహణీయధామ
స్నేహావలోకకలయా హృది సంస్పృశంతమ్ ।
శ్యామే పృథావురసి శోభితయా శ్రియా స్వః
చూడామణిం సుభగయంతమివాత్మధిష్ణ్యమ్ ॥ 39

శ్రీమహావిష్ణువు ద్వారపాలకులపైనను, మునులపైనను దయ చూపుచున్నవాడుగా నుండెను. కోరదగిన సద్గుణములకు నిలయమైన వాడుగా నుండెను. ప్రేమతో గూడిన చూపులతో మనస్సునకు హాయి గలిగించేవాడుగా నుండెను. వక్షఃస్థలమునందు లక్ష్మీదేవి విరాజిల్లు చుండెను. సత్యలోకము వరకు గల స్వర్గలోకములకు వైకుంఠము తలమానికము. అట్టి వైకుంఠమునకు శోభ గూర్చు నారాయణుని ఋషులు దర్శించిరి. 39

టీ:- కృత్స్నేతి. కృత్స్నస్య ద్వారపాలమునిబృందస్య ప్రసాదే సుముఖం. స్పృహణీయధామ. స్పృహణీయానాం గుణానాం ధామ స్థానం. స్నేహావలోకకలయా. సప్రేమకటాక్షేణ. హృది సంస్పృశంతం సుఖయంతం. త్రైలోక్యవివక్షాపక్షే సత్యలోకపర్యంతం స్వర్గః. తస్య చూడామణిమివ స్థితం. స్వధిష్ణ్యం శ్రీవైకుంఠం. సుభగయంతం శోభయంతం. 39

శ్లో ॥ పీతాంశుకే పృథనితంబిని విస్ఫురంత్యా
కాంచ్యాళిభిర్విరుతయా వనమాలయా చ ।
వల్గుప్రకోష్ఠవలయం వినతాసుతాంసే
విన్యస్తహస్తమితరేణ ధునానమబ్జమ్ ॥ 40

శ్రీహరి విశాలమైన నితంబముగలవాడుగా నుండెను. ఆ విశాల నితంబుపై పచ్చని వస్త్రము ఉండెను. ఆ పీతాంబరముపై మొలనూలు శోభిల్లుచుండెను. మెడలో వనమాల విరాజిల్లుచుండెను. ఆ వనమాల

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- పీతాంశుక ఇతి. పృథు నితంబమాశ్రయత్వేన విద్యతే యస్య తస్మిన్ పీతాంశుకే. అళిభిర్నాదితయా వనమాలయా యుక్తం. సుభగయంతమితి పూర్వేణైవ వా సంబంధః. వల్గుషు ప్రకోష్ఠేషు వలయాని యస్య గరుడస్య స్కంధే విన్యస్త ఏకో హస్తో యేన ఇతరేణాన్యేన. అబ్జం లీలాకమలం ధునానం భ్రామయంతం. విన్యస్యేతి పాఠే వల్గ్విత్యాదిహస్తస్య విశేషణమ్. 40

శ్లో ॥ విద్యుత్ క్షిపన్మకర కుండల మండనార్హ
గండస్థలోన్నసముఖం మణిమత్కిరీటమ్ ।
దోర్దండషండ వివరే హరతా పరార్ఘ్య
హారేణ కంధరగతేన చ కౌస్తుభేన ॥ 41

టీ:- విద్యుదితి. స్వకాంత్యా విద్యుతః క్షిపతీ యే మకరాకారే కుండలే తయోర్మండనార్హే గండస్థలే యస్మిన్ తచ్చ తదున్నసం చ ముఖం చ యస్య. మణియుక్తం కిరీటం యస్య. దోర్దండానాం షండస్సమూహః తస్య వివరే మధ్యే స్థితేన హరతా మనోహరేణ విహరతేతి వా. పరార్ఘ్యః ఉత్కృష్టః. తేన హారేణ. కంధరగతేన స్థితేన కౌస్తుభేన చ యుక్తమ్. 41

చుట్టు తుమ్మెదలు చేరి రొదచేయుచుండెను. శ్రీహరి ఒకచేయిని గరుడుని మూపుపై ఉంచెను. మరియొక చేయితో లీలాకమలమును అటునిటు త్రిప్పుచుండెను. ఆ చేతులకు సుందరములైన కంకణములుండెను. విన్యస్త (ఉంచిన) అనే శబ్దమునకు సుందరమైన ముంజేతి కంకణములు విశేషణము. ఈ రకముగా శోభిల్లుచున్న శ్రీహరిని ఋషులు చూచిరి. 40

శ్రీహరియొక్క చెవులకు మకరాకారపు కుండలములుండెను. అవి తమ కాంతిచే మెరుపులను తలదన్నుచున్నట్లుండెను. ఆ కాంతులు చెక్కిళ్ళకు శోభను చేకూర్చుచుండెను. శ్రీహరి ముఖము ఎత్తైన నాసికతో ప్రకాశించుచుండెను. ఆయన మణులుపొదిగిన కిరీటము ధరించి యుండెను. ఆయన నాల్గుభుజదండముల మధ్యలో గొప్పహారము కదులుచుండెను. కౌస్తుభమాణిక్యములతో వ్రేలాడే హారముతో ఆయన వక్షఃస్థలము ప్రకాశించుచుండెను. ఇట్టి శ్రీహరిని ఋషులు చూచిరి. (41)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో ॥ అత్రోపసృష్టమితి చోత్స్మితమిందిరాయాః
స్వానాం ధియా విరచితం బహుసౌష్ఠవాఢ్యమ్ ।
మహ్యం భవస్య భవతాం చ భజంతమంగం
నేముర్నిరీక్ష్య న వితృప్త దృశో ముదా కైః ॥ 42

టీ:- అత్రేతి. కిం బహునా. ఇందిరాయాః ఉత్మి ్సతం. అహమేవ సర్వసౌందర్య నిధిరిత్యహంకరణం అత్ర భగవత స్సౌందర్యే ఉపసృష్ట మస్తంగతమితి. స్వానాం భక్తానాం ధియా విరచితం. భృత్యైః స్వమనస్యేవం వితర్కితమిత్యర్థః. కుతః. బహుసౌష్ఠవేన సౌందర్యేణ ఆఢ్యం యుక్తం. కించ మహ్యం మమ భవస్య ఈశ్వరస్య. భవతాం చ కృతేఽ_గం. అంగం భజంతం. మూర్తిం ప్రకటయంతమచక్షత. నిరీక్ష్య. చ కైః శిరోభిర్ముదా నేముః నమశ్చక్రుః. న విశేషేణ తృప్తాని నేత్రాణి యేషాం తే. 42

శ్లో ॥ తస్యారవిందనయనస్య పదారవింద
కింజల్క మిశ్ర తులసీ మకరంద వాయుః ।
అంతర్గత స్స్వవివరేణ చకార తేషాం
సంక్షోభమక్షర జుషామపి చిత్తతన్వోః ॥ 43

ఈ రకమైన అత్యద్భుత సౌందర్యమును జూచి భక్తులు లక్ష్మీదేవి యొక్క సౌందర్యగర్వము నష్టమైనదని తలంతురు. ఓ దేవతలారా! నాకు, శివునకు, మీకు అద్భుతమైన సౌందర్యముతో గూడిన రూపమును శ్రీహరి ప్రకటించినాడు. మహర్షులు శ్రీహరి రూపమును ఎంత చూచినను వారికి తనివి తీరలేదు. వారు ఆనందముతో తలలు వంచి నమస్కరించిరి. 42

(స్వరూపానందము కన్నను భజనానందము యొక్క ఆధిక్యమును చెప్పుచున్నాడు) పద్మనేత్రుడైన శ్రీహరిపాదములు పద్మములవలె నుండెను. కాలివ్రేళ్ళు పద్మకేసరముల వలెనుండెను. తులసీగంధయుతమైన వాయువు పాదపద్మ మకరందగంధయుతమై

టీ:- స్వరూపానందాదపి తేషాం భజనానందాధిక్యమాహ - తస్యేతి. తస్య పదారవిందకింజల్కైః కేసరైః మిశ్రాయా తులసీ. తస్యాః మకరందేన. యుక్తో వాయుః. స్వవివరేణ నాసాఛిద్రేణ, అక్షర జుషాం బ్రహ్మానందసేవినామపి. సంక్షోభం చిత్తేఽతి హర్షం. తనౌ రోమాంచం. హర్షకారితం. 43

ఆ మహర్షుల నాసా పుటముల ద్వారా లోనికి ప్రవేశించెను. బ్రహ్మనిష్ఠ గలవారే అయినను ఆ వాయువు వారి మనస్సులకు ఆనందాతిశయమును కలిగెంచెను. వారి దేహములకు పులకాంకురములను కలిగించెను. 43

శ్లో ॥ తే వా అముష్య వదనాసిత పద్మకోశ
ముద్వీక్ష్య సుందరతరాధర కుందహాసమ్ ।
లబ్ధాశిషః పునరవేక్ష్య తదీయమంఘ్రి
ద్వంద్వం నఖారుణ (మణి) శ్రయణం నిదధ్యుః ॥ 44

టీ:- సంభవమాహ-ద్వాభ్యాం. త ఇతి. తే వై కిల వదనమేవ అసితపద్మం తస్య. కోశోఽంతర్భాగస్తమ్. అసితపద్మకోశమిత్యభూతో-పమా. సుందరతరే అరుణే అధరోష్ఠే. కుందవద్ధాసో యస్మిన్ తం. ఉత్ ఊర్ధ్వం వీక్ష్య లబ్ధమనోరథాస్సంతః. నఖా ఏవారుణమణయః. తేషాం శ్రయణమాశ్రయ భూతమంఘ్రిద్వంద్వం. పునరవేక్ష్యాధో దృష్ట్వా పునః పునరేవం నిరీక్ష్య యుగపత్సర్వాంగలావణ్యగ్రహణాశక్తేః. పశ్చాన్నిదధ్యుః ధ్యాతవంతః. 44

ఆ మహర్షులు తలలను పైకెత్తి శ్రీహరి యొక్క అందమైన క్రిందిపెదవిని, దానిపై విరిసే మల్లెలవంటి చిరునవ్వును చూచిరి. నల్లకలువ మొగ్గవంటి ముఖమును చూచిరి. కోరికతీరినవారై మరల చూపులను క్రిందకుదించి పద్మరాగ మాణిక్యముల వంటి గోళ్ళను, ఆ గోళ్ళకు ఆశ్రయమగు పాదద్వంద్వమును చూచిరి. తరువాత ధ్యానించిరి. ఏక కాలమున శ్రీహరియొక్క సర్వాంగలావణ్యమును గ్రహింపలేని వారైరి. 44

శ్లో ॥ పుంసాం గతిం మృగయతామిహ యోగమార్గైః
ధ్యానాస్పదం బహుమతం నయనాభిరామమ్ ।
పౌంస్నం వపుర్దర్శయానమనన్యసిద్ధైః
ఔత్పత్తికైస్సమగృణన్ యుతమష్ట భోగైః ॥ 45

టీ:- పుంసామితి. యోగమార్గైర్గతిం మృగయతాం పుంసాం ధ్యానస్య విషయభూతం. బహుమతం అత్యాదరాస్పదం. బహూనాం తత్త్వ దృశాం. సంమతమితి వా. పౌంస్యం పౌరుషం వపుః దర్శయంతం అన్యేష్వసిద్ధైరసాధారణైః ఔత్పత్తికైర్నిత్యైరణిమాద్యష్టైశ్వర్యైర్యుతం. సమగృణన్ సమ్యగస్తువన్. 45

ఈ లోకములో మానవులు యోగమార్గముల ద్వారా మోక్షమును కోరుకొందురు. వారి ధ్యానమునకు ఆస్పదమైనదియు, నేత్రానందకర మైనదియు, అత్యాదరమునకు ఆశ్రయమైనదియునగు రూపమును భగవానుడు సనకాదిమునులకు చూపెను. అసాధారణములైన అణిమాద్యష్టసిద్ధులు శ్రీహరిలో సహజస్థిరముగా నున్నవి. అట్టి భగవానుని మహర్షులు చక్కగా స్తుతించిరి. 45

కుమారా ఊచుః

శ్లో ॥ యోఽంతర్హితో హృది గతోఽపి దురాత్మనాం త్వం
సోఽద్యైవ నో నయనమూలమనంత రాద్ధః ।
యర్హ్యేవ కర్ణవివరేణ గుహాం గతో నః
పిత్రానువర్ణితరహా భవదుద్భవేన ॥ 46

టీ:- నిత్యం బ్రహ్మరూపేణ ప్రకాశసే, తన్న చిత్రం. ఇదానీం తు పరమమంగళ విశుద్ధమూర్త్యా ప్రత్యక్షోఽసి. అహో భాగ్యమస్మాక మిత్యాహుః - యఇతి. హే అనంత. యస్త్వం హృద్గతోఽపి. దురాత్మ నామం తర్హితో న స్ఫురసి.స నోఽస్మాకం. అంతర్హితో న భవసి.

కుమారులు ఇట్లు పలికిరి

(నిత్యము బ్రహ్మరూపముతో ప్రకాశించే నీవు, ఇప్పుడు పరమ మంగళవిశుద్ధరూపముతో ప్రత్యక్షమగుట మా యొక్క భాగ్యవిశేషమని స్తుతించుచున్నారు.) ఓ అనంతుడా! నీవు జీవుల హృదయముల లోనే విరాజిల్లుచున్నను దుష్టులకు కనబడవు. దాగియుందువు. అట్టి నీవు ఈనాడు మాకు ప్రత్యక్షమయితివి. నీ నుండి జన్మించిన మా తండ్రియగు బ్రహ్మ నీ రహస్యమును మాకు బోధించినాడు. ఆనాడే నీవు చెవిరంధ్రములద్వారా మా బుద్ధిలోనికి ప్రవేశించినావు. నీ దయచే

నయనమూలం త్వద్వైవరాద్ధః ప్రాప్తోఽసి. అంతర్ధానాభావే హేతుః. భవతస్సకాశాదుద్భవో యస్య తేనాస్మత్పిత్రా యర్షి యదైవ. అనువర్ణి తరహో ఉపదిష్ట రహస్యః. తదైవ నః కర్ణయోర్మార్గేణ గుహాం బుద్ధిం గతః ప్రాప్తోఽసి. 46

మేము నిన్నిప్పుడు చూడగల్గు చున్నాము. 46

శ్లో ॥ తం త్వా విదామ భగవన్ పరమాత్మతత్త్వం
సత్త్వేన సంప్రతి రతిం రచయంతమేషామ్ ।
యత్తేఽనుతాప విదితైర్దృఢ భక్తియోగైః
ఉద్గ్రంథయో హృది విదుర్మునయో విరాగాః ॥ 47

టీ:- నను పిత్రోపదిష్టం భవతామదృశ్యం అమాయామయం. తత్త్వం అహం త్వన్య ఏవ స్యాం దృశ్యత్వాత్. నైవమస్మత్ప్రత్యభిజ్ఞయా భేదనిరాసాదిత్యాహుః. తమితి. హే భగవన్, ఆత్మతత్త్వమేవ పరం త్వాం విదామ విద్మః ప్రత్యభిజానీమః. నను నిరుపాధేరాత్మతత్త్వస్య. కథమీదృశమైశ్వర్యం స్యాదత ఆహుః. సత్త్వేన విశుద్ధసత్త్వమూర్త్యా. యేషాం భక్తానాం. సమ్యక్ప్రతిక్షణం సంప్రతి రతిం ప్రీతిస్తాం రచయంతం. ఆత్మతత్త్వ మేవాహుః.తేనుతాపస్తేనైవ. విదితైర్జ్ఞాతైః. దృఢైర్భక్తియోగై శ్రవణాదిభిఃమునయో హృది యద్విదుః. కీదృశాః. ఉద్గ్రంధయః నిరహమ్మానాః. అత ఏవ విగతరాగాః. 47

ఓ భగవానుడా! నిరహంకారులు, విరాగులునగు వారలకు నీ కృపవలననే నీస్వరూపము తెలియవచ్చును. నీ భక్తులమగు మా ఎదుట నీ శుద్ధసత్త్వప్రధానమగు సగుణరూపమును చూపి సంతోషమును కలిగించినావు. ఈ సగుణరూపమే ఉత్కృష్టమగు ఆత్మతత్త్వమని మేము గుర్తించుచున్నాము. నీ భక్తులు దృఢమగు భక్తి -యోగము పొందినవారై ఆత్మతత్త్వమును తమ హృదయములో సాక్షాత్కరించుకొనుచున్నారు. 47

శ్లో ॥ నాత్యంతికం విగణయంత్యపి తే ప్రసాదం
కిం త్వన్యదర్పితభయం భ్రువ ఉన్నయైస్తే ।
యేఽంగ త్వదంఘ్రిశరణా భవతః కథాయాః
కీర్తన్యతీర్థయశసః కుశలా రసజ్ఞాః ॥ 48

టీ:- స్వయమపి భక్తిం ప్రార్థయితుం. భక్తానాం సుఖాతిశయమాహు -నేతి. ఆత్యంతికం మోక్షాఖ్యమపి తవ ప్రసాదం తే న గణయంతి నాద్రియంతే. కింతు కిముతాన్యదింద్రాదిపదం. తే తవ. భ్రువఉన్నయై రుజ్జృంభి తైః. అర్పితం నిహితం. భయం యస్మిన్ తత్. తే కే అంగ హే భగవన్. యే భవతః కథాయా రసజ్ఞాః. కథం భూతస్య. రమణీయత్వేన పావనత్వేన చ కీర్తన్యం కీర్తనార్హం తీర్థం పవిత్రం. చ యశో యస్య. 48

(తమకు భక్తి కావలెనని కోరుటకుగాను భక్తుల సుఖాతి - శయమును చెప్పుచున్నారు.) ఓ దేవా! నీ భక్తులు నేర్పరులు. నీ పాదములే శరణుగా గలవారు. కీర్తించదగిన పవిత్రమగు కీర్తిగల నీ కథల రసము నెరిగినవారు. వారు నీ అనుగ్రహముగా లభించే మోక్షమును గూడా లెక్కచేయరు. కాలాధీనమైన ఇంద్రాది పదవులను లెక్క చేయరని వేరుగా చెప్పవలసినదేమి? నీవు కనుబొమ్మ ముడివేసి- నంత మాత్రాన ఇంద్రాదులు కూడా భయకంపితులగుదురు కదా!48

శ్లో ॥ కామం భవ స్వవృజినైర్నిరయేషు నః స్యా
చ్చేతోఽలివద్యది ను తే పదయోరమేత ।
వాచశ్చ నస్తులసివద్యది తేఽంఘ్రిశోభాః
పూర్యేత తే గుణగణైర్యది కర్ణ రంధ్రః ॥ 49

టీ:- ఇదానీం స్వాపరాధం దర్శయంతో భక్తిం ప్రార్థయంతే - కామమితి. భగవన్నితః పూర్వమస్మాకం. వృజినం నాభవత్. ఇదానీం తు సర్వాణ్యప్యుపజాతాని. యతస్త్వద్భక్తౌ శప్తౌ. అతస్తైః స్వవృజినైః నిరయేషు కామం భవో జన్మస్యాత్. ను వితర్కే. యది నశ్చేతః తే

(తమ అపరాధములను చూపుచూ భక్తిని ప్రార్థించుచున్నారు) దేవా! మా మనస్సులు తుమ్మెదలవలె నీ పాదపద్మముల యందే రమించవలెను. మా వాక్కులు తులసివలె నీ చరణములందే శోభిల్లవలెను. మా చెవులు నీ గుణకీర్తనలచే నిండిపోవలెను. అట్లైన మాకు నరకాది ఎట్టి జన్మ లభించినను చింతలేదు. (ముల్లు కలిగియున్నను తుమ్మెద పుష్పము నందలి తేనెను త్రాగును. పుష్పము యొక్క ఆశ్రయమునే కోరును. ఆటంకములను లెక్కించకుండా మా

పదయోః రమేత. అళిర్యథా కంటకైరాపీడ్యమానోఽపి పుష్పేషు రమేతే తద్వత్. విఘ్నా నవిగణయ్య యది రమేత. అంఘ్రిభ్యాం శోభా యాసాం. యథా చ తులసీ స్వగుణనిరపేక్షేణ త్వదంఘ్రిసంబంధేనైవ శోభతే. తథా యది నో వాచశ్శోభేరన్. యది చ తే గుణగణైః పూర్యేత. కర్ణ తు రంధ్రమిత్యల్పస్య పూరణ మివ యాచకరీత్యా ప్రార్థయతే. అయం గూఢోఽభిప్రాయః. కర్ణరంధ్రస్యాకాశత్వాత్. గుణానాం చామూర్తిత్వాత్ న కదాచిత్పూరణం. అతో నిత్యమేవ శ్రవణం ఫలిష్యతీతి. 49

శ్లో॥ ప్రాదుశ్చకర్థ యదిదం పురుహూత రూపం
తేనేశ నిర్వృతిమవాపురలం దృశో నః ।
తస్మా ఇదం భగవతే నమ ఇద్విధేమ
యోఽనాత్మనాం దురదయో భగవాన్ప్రతీతః ॥ 50

టీ:- అద్య వయం కృతార్థాః స్మ ఇత్యాహుః. పాదుశ్చకర్థేతి. హే పురుహూత విపులకీర్తే, యదిదం రూపం ప్రాదుశ్చకర్థ ప్రకటీకృతవానసి, దృశో నేత్రాణి. అనాత్మనామజితేంద్రియాణాం. దురుదయః అప్రకటోఽపి ఇత్ ఇత్థం యః ప్రతీతోఽసి. తస్మై తుభ్యమిదం నమో విధేమ నమస్కారం కుర్మఇత్యర్థః. 50

శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,

పంచదశోఽధ్యాయః

చిత్తభ్రమరము నీ పాదపద్మ మధువునే గ్రోలవలెను. తులసి నీ చరణాశ్రయమునే పొంది శోభిల్లినట్లు మా వాక్కులు నీ చరణముల గుణ వర్ణనములను విడవకుండా యుండి శోభిల్లవలెను. మా చెవులు ఎప్పుడూ నీ గుణానుకీర్తనలను వినుట వలన పరిపూర్ణములై యుండవలెను.) 49

(నేడు మేము కృతార్థులమైనామని చెప్పుచున్నారు) విపులమగు కీర్తిగల ఓ దేవా! నీవు చూపిన ఈ మనోహరరూపముచే మాకు అధికమైన గొప్ప ఆనందము కలిగినది. విషయాసక్తులు, అజితేంద్రియులగు మానవులకు ఈ రూపము కనబడుట మిక్కిలి దుర్లభము. ఈ విధముగా కనిపించిన నీకు మేము నమస్కరించుచున్నాము. 50

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు

షోడశోఽధ్యాయః

శ్లో॥ హరిణా సాంత్వితైర్విప్రైరనుతప్తైస్తుషోడశే ।
తయోరసురభావేపి కృతోఽనుగ్రహ ఈర్యతే ॥

బ్రహ్మోవాచ

శ్లో ॥ ఇతి తద్గృణతాం తేషాం మునీనాం యోగధర్మిణామ్ ।
ప్రతినంద్య జగాదేదం వికుంఠనిలయో విభుః ॥ 1

టీ:- ఇతీతి. ఇతి గృణతాం తేషాం తద్వాక్యం ప్రతినంద్య ఇదం జగాద ఏతావిత్యాద్యేకాదశభిః. 1

శ్రీభగవానువాచ

శ్లో ॥ ఏతౌ హి పార్షదౌ మహ్యం జయో విజయ ఏవ చ ।
కదర్థీకృత్య మాం యద్వో బహ్వక్రాతామతిక్రమమ్ ॥ 2

టీ:- ఏతావితి. యద్యస్మాత్. మాం కదర్థీకృత్య తుచ్ఛీకృత్య బహు యథా భవతి తథా అతిక్రమం చ కృతవంతౌ. 2

పదిహేనవ అధ్యాయము సమాప్తము

16 వ అధ్యాయము

ఈ పదహారవ అధ్యాయమున శ్రీమన్నారాయణుడు సనకాదులను ఓదార్చుట, మునులు ద్వారపాలకులపై దయచూపుట, ద్వారపాలకులు వైకుంఠమునుండి పతితులై అసురులుగా ఏర్పడుట అను విషయములు వర్ణింపబడినవి

బ్రహ్మ ఇట్లు పలికెను

ఆత్మజ్ఞానము గలవారు, యోగ ధర్మరతులైన ఆ మునులు చేసిన స్తోత్రమును వైకుంఠాధిపతియగు శ్రీమన్నారాయణుడు విని ఆనందముతో ఇట్లు పలికెను. 1

(ఏతౌ హి మొదలుకొని(రెండవ శ్లోకము) పదకొండు శ్లోకములలో శ్రీహరి ఈ విధముగా చెప్పుచున్నాడు)

భగవానుడు పలికెను

ఈ జయవిజయులనే ఇద్దరు నా అనుచరులు. వీరు మీ విషయములో గొప్ప అపరాధమునుచేసి శాపమునకు గురియైనారు.

శ్లో ॥ యస్త్వేతయోర్ధృతో దండో భవద్భిర్మామనువ్రతైః ।
స ఏవానుమతోఽస్మాభిర్మునయో దేవహేళనాత్ ॥ 3

టీ:- య ఇతి. తస్మాత్స ఏవ దండోఽంగీకృతః. 3

ఈ విధముగా ప్రవర్తించి వారు నన్ను కూడా అవమానించినారు. 2

ఓ మహర్షులారా! దేవతా స్వరూపులగు మిమ్ములను పరిహసించుట ద్వారా వీరు నన్ను అవమానించినట్లైనది. మీరు నన్ను భక్తితో ఆరాధించేవారు. మీరు వీరికి విధించిన శిక్షను నేను కూడా ఆమోదిస్తున్నాను. 3

శ్లో ॥ తద్వః ప్రసాదయామ్యద్య బ్రహ్మ దైవం పరం హి మే ।
తద్ధిహ్యాత్మకృతం మన్యేయత్స్వపుంభిరసత్కృతాః ॥ 4

టీ:- తదితి. యస్మాద్బ్రహ్మ బ్రాహ్మణా ఏవ మే పరమం దైవం దైవతం తత్తస్మాదద్య వః ప్రసాదయామి. తవ కోఽపరాధ ఇతి చేత్తత్రాహ-తద్ధీతి. మదీయైఃపుంభిః అసత్కృతాస్తిరస్కృతా ఇతి యత్తదాత్మకృతమేవ మన్యే. 4

కావున మీరు ఇప్పుడు ప్రసన్నులు కావలసినదిగా ప్రార్థించుచున్నాను. ఎందుకనగా నాకు బ్రాహ్మణుడు గొప్పదైవము. నా అనుచరులు మీకు చేసిన అవమానము నేను మీకు చేసిన అవమానమే యని తలచుచున్నాను. 4

శ్లో ॥ యన్నామాని చ గృహ్ణంతి లోకో భృత్యే కృతాగసి ।
సోఽసాధువాదస్తత్కీర్తిం హంతి త్వచమివామయః ॥ 5

టీ:- కించ మమైవైతాభ్యామనిష్టం కృతమిత్యాహ - యదితి. యస్య స్వామినో నామాని తస్య కీర్తిం. ఆమయోఽత్ర శ్వేతకుష్ఠమ్. 5

సేవకుడు అపరాధము చేసినపుడు ప్రజలు వాని యజమానిని నిందించెదరు. శ్వేతకుష్ఠువు చర్మమును పాడుచేయునట్లు, ప్రజల నిందలు వాని (యజమాని) కీర్తిని నశింపజేయును. 5

శ్లో ॥ యస్యామలామృతయశశ్శ్రవణావగాహః
సద్యః పునాతి జగదాశ్వపచాద్వికుంఠః ।
సోఽహం భవద్భ్య ఉపలబ్ధసుతీర్థకీర్తి
శ్ఛింద్యాం స్వబాహుమపి వః ప్రతికూల వృత్తిమ్ ॥ 6

టీ:- యస్యేతి. యస్య మే అమృతరూపే అమలే యశసి శ్రవణే నావగాహః ప్రవేశః. సఏవవమభివ్యాప్త జగత్ సద్యః తత్క్షణమేవ పునాతి సోఽహం. వికుంఠో భవద్భ్యో హేతుభ్యః. ఉపలబ్ధా ప్రాప్తా సుశోభనా తీర్థభూతా కీర్తిర్యేన సః. స్వబాహుస్థానీయం లోకేశ్వరమపి హన్యాం. కాఽన్యస్య కథేత్యర్థః. ॥ 6 ॥

లోకములో నా నిర్మలయశస్సు అనే అమృతము వంటి స్వచ్ఛమైన కీర్తియందు, ఎవడైతే శ్రవణము అనే మునక వేయునో వాడు వెంటనే పవిత్రుడగును. భక్తుడు మొదలుకొని పరమ కిరాతకుడి వరకు ఎవడైనను పవిత్రులగుదురు. అట్టి మొక్కవోని కీర్తి నాకు మీ-వంటి మహాత్ముల వలననే లభించినది. మీకు ప్రతికూలముగ వ్యవహరించిననాడు నా బాహుస్థానీయుడగు లోకాధిపతియైనను తెగ గొట్టెదను. ఇక ఇతరుల విషయమేమి? ॥ 6 ॥

శ్లో ॥ యత్సేవయా చరణపద్మ పవిత్రరేణుం
సద్యః క్షతాఖిల మలం ప్రతిలబ్ధ శీలం ।
న శ్రీర్విరక్తమపి మాం విజహాతి యస్యాః
ప్రేక్షాలవార్థ ఇతరే నియమాన్వహంతి ॥ 7

టీ:- స్వగుణానువర్ణనం తు బ్రాహ్మణోత్కర్షార్థమేవ. యదితి. చరణపద్మయోః స్థితః పవిత్రోరేణుః యస్య. అత ఏవ క్షతో నిరస్తః. అఖిలస్య లోకస్య మలో యేన. యద్వా చరణపద్మాల్లగ్నః పవిత్రో

(బ్రాహ్మణ మహిమను చాటుటకే తన గుణములను వర్ణించడమైనది). బ్రహ్మవేత్తలగు మిమ్ములను సేవించుటచేతనే మీ పాద పద్మముల ధూళి నన్ను పవిత్రునిగా చేయుచున్నది. నా లోని సకల దోషములను పారద్రోలినది. నా పాదములందలి రేణువులు అత్యంత-పవిత్రములు. సమస్త లోకమునందలి కామాది దోషములను వెంటనే నశింప జేయగలవు. నా పాదరేణువులకు అంతటి శక్తి మిమ్ము సేవించుట వలననే కలిగినది. అంతే గాకుండా మీ సేవ వలన నాకు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

రేణుః యస్మిన్నితి. క్షతోఽఖిలమలో యస్యేతి చ విగ్రహః. ప్రతిలబ్ధం ప్రాప్తం శీలం యేన. యేషాం సేవయైతే గుణాః, మమ అత ఏవ శ్రీర్మాం న విజహాతి ప్రేక్షాలవార్థే అవలోకన లేశార్థే ఇతరే బ్రహ్మాదయః నియమాన్ వహంతి తేషాం వః ప్రతికూలవృత్తిం ఛింద్యామితి పూర్వేణైవ సంబంధః. 7

శ్లో ॥ నాహం తథాఽద్మి యజమానహవిర్వితానే
శ్చ్యోతత్ ఘృత ప్లుతమదన్ హుతభుఙ్ముఖేన ।
యద్బ్రాహ్మణస్య ముఖతశ్చరతోఽనుఘాసం
తుష్టస్య మయ్యవహితైర్నిజకర్మపాకైః ॥ 8

టీ:- కించ బ్రాహ్మణా మమైవ శ్రేష్ఠం ముఖమ్, అతో యుష్మదవజ్ఞయా మన్ముఖతిరస్కార ఏవ కృత ఇత్యాహ-నాహమితి. వితానే యజ్ఞే యజమానస్య హవిః చరుపురోడాశాది. హుతభుగగ్నిః తేన ముఖేన అదన్నశ్నన్నపి తథా నాద్మి నాశ్నామి. యద్యథా చ్యోతతా క్షరతా ఘృతేన ఆప్లుతం విలోడితం పాయసాది ప్రతిగ్రాసం రసాస్వాదనపూర్వకం చరతో భుంజానస్య జ్ఞానినో వా బ్రాహ్మణస్య ముఖతోఽశ్నామి. మయి సమర్పితైః కర్మఫలైః తుష్టస్య నిష్కామస్యేత్యర్థః. ॥ 8

సుందరమగు శీలము అబ్బినది. ఇంద్రాది దేవతలు లక్ష్మీదేవి కటాక్షమునకై వ్రతనియమాదులు ఆచరిస్తూ కష్టపడుచున్నారు. విరక్తుడనైనప్పటికి లక్ష్మీదేవి నన్ను విడువకున్నది. ఇది మీ సేవాఫలమే. కనుక బ్రాహ్మణాపరాధము చేసిన వారిని నేను క్షమించను. ॥ 7 ॥

యజ్ఞములో యజమాని కారుతున్న నేతితోనిండియున్న పురోడాశము మున్నగు హవిస్సులను సమర్పించును. నేను అగ్ని ముఖుడనై వాటిని భక్షింతును. బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులు తమ కర్మఫలమును నాకు సమర్పింతురు. వారు ఘృతయుక్తమైన అన్నమును భక్షింతురు. ఆ బ్రాహ్మణరూపాన ఆ అన్నాదులను భక్షించునది నేనే. యజ్ఞ హవిస్సులరూపాన భక్షించుదానికన్నను బ్రాహ్మణ రూపాన భక్షించుటయే నాకు ఎక్కువ తృప్తిగా యుండును. అట్టి బ్రాహ్మణులను వీరు అవమానపరచిరి. బ్రాహ్మణ ధిక్కారమును నేను సహించను.॥8

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ యేషాం బిభర్మ్యహమఖండవికుంఠయోగ
మాయావిభూతిరమలాంఘ్రిరజః కిరీటైః ।
విప్రాంస్తు కో న విషహేత యదర్హణాంభః
సద్యః పునాతి సహచంద్రలలామలోకాన్ ॥ 9

టీ:- యేషామితి. యేషామమలమంఘ్రిరజః అహం కిరీటైర్బిభర్మి తాన్విప్రానపకుర్వతోఽపి కోఽన్యో న విషహేత. కథంభూతోఽహం. అఖండానవచ్ఛిన్నా వికుంఠా అప్రతిహతా చ యోగమాయావిలాస - భూతా విభూతిర్యస్య సః తథా యస్యార్హణాంభః పాదోదకం చంద్రలలా మేనేశ్వరేణ సహితాన్ లోకాన్ సద్యః పునాతి. ఏవం పరమేశ్వరః పరమపావనోఽపి సన్నహం బిభర్మీతి. ॥ 9 ॥

నా యోగమాయ అఖండమైనది. మొక్కవోనిది. అట్టి మాయకు అధిపతిని నేను. పరమపావనుడను. నా పాదోదకము గంగాధారి, చంద్రశేఖరుడైన శివునితోసహా సమస్తలోకములను తక్షణమే పవిత్రము చేయుచున్నది. నేనింతటి వాడనైనను బ్రహ్మవేత్తల పాదధూళిని నా కిరీటముపై ధరింతును. అంతటి మహిమాన్వితులైన బ్రాహ్మణులెట్టి అపకారములను చేసినను ఇతరులు ఆ అపకారముల నేల సహించరు? (సహింపవలెనని తాత్పర్యము) ॥ 9 ॥

శ్లో ॥ యే మే తనూర్ద్విజవరాన్ దుహతీర్మదీయా
భూతాన్యలబ్ధశరణాని చ భేదబుద్ధ్యా ।
ద్రక్ష్యంత్యఘక్షత దృశో హ్యహిమన్యవస్తాన్
గృధ్రా రుషా మమ కుషంత్యధిదండ నేతుః ॥ 10

టీ:- యఇతి. కించ. మే తనూరధిష్ఠానాని. కాస్తాః. ద్విజవరాన్ దుహతీర్ధోగ్ధ్రీః గా ఇత్యర్థః. దుహితౄరితి పాఠేఽపి గా ఏవ.

ఆచారవంతులగు బ్రాహ్మణులు, ఆవులు, రక్షకులులేని దీనులు. ఈ మూడును నా శరీరములే! విష్ణుస్వరూపుడగు సూర్యునివలన ఆవులు ఏర్పడినందున ఆవులు విష్ణుస్వరూపములే. నన్ను ఈ మూడింటిని అభేద దృష్టితో చూడవలెను. భేద దృష్టితో చూచిన వారు పాపదృష్టిగల వారు. అట్టివారిని శిక్షించే అధికారమును నేను యమునకు ఇచ్చినాను. కోపముతో బుసలు కొట్టే పాములవంటి ఆ

విష్ణురూపాత్సూర్యాదుత్పన్నత్వాత్. సూర్యసుతాశ్చ గావః ఇతి వచనాత్. అలబ్ధశరణాని రక్షకహీనాని భేదబుద్ధ్యా మదధిష్ఠానం న సంభవతీతి పృథగ్దృష్ట్యా యే ద్రక్ష్యంతి. అఘేన క్షతా నష్టా దృష్టిర్యేషామ్ తాన్. మదీయోऽధికృతో దండనేతా యో యమస్తస్య గృధ్రాకారాః యే దూతాః అహివన్ మన్యుర్యేషామ్. తే రుషా క్రోధేన కుషంతి చంచుభిః ఛిన్దంతి. 10

శ్లో ॥ యే బ్రాహ్మణాన్మయిధియా క్షిపతోऽర్చయంతః
తుష్యద్ధృదః స్మిత సుధోక్షిత పద్మవక్త్రాః ।
వాణ్యానురాగ కలయాత్మజవద్గృణంతః
సంబోధయంత్యహమివాహ ముపా కృతస్తైః ॥ 11

టీ:- ఏవంభూతాస్తు మాం వంశీకుర్వన్తీత్యాహ-య ఇతి. యే క్షిపతః పురుషం భాషమాణానపి బ్రాహ్మణాన్ సంబోధయంతి. మయి యాధీస్తయా వాసుదేవ దృష్ట్యా అర్చయంతః సన్తః తుష్యత్ హృదః ప్రీయమాణ చిత్తాః. స్మితమేవ సుధా తయోక్షితం సిక్తం పద్మతుల్యం వక్త్రం యేషాం. అనురాగకలయా ప్రేమశోభయా వాణ్యా గృణంతః స్తువంతః. యథా కుపితమాత్మజం స్నిగ్ధః పితా సత్పుత్రోవా పితరం. అహమివ భృగుం యుష్మాన్వా. తైరహముపాహృతో వశీకృతః. 11

యముని కింకరులు మిక్కిలి కోపింతురు. గ్రద్దలు తమ చుంచువులతో (ముక్కుతో) పాములను పొడుచునట్లు యమదూతలు ఈ పాపులను చీల్చివేసెదరు. ॥ 10 ॥

(ఈ శ్లోకములో చెప్పినట్లు చేసినవారు నన్ను వశపరచుకొనెదరు). బ్రాహ్మణులు పరుషపువాక్కులు పల్కినప్పటికిని, వారిని వాసుదేవుని దృష్టితో అర్చించవలెను. వారిని చిరునవ్వుతో అనురాగముతో, అమృతతుల్యమైన మాటలతో స్తుతించవలెను. కోపించిన తండ్రిని సత్పుత్రుడు గౌరవించినట్లు, కోపముతో నన్ను నిందించిన భృగు మహర్షిని నేను ఆదరించినట్లు, బ్రాహ్మణులు కోపించిననూ వారిని పూజించే వారికి నేను వశీకృతమౌతాను. 11

శ్లో ॥ తన్మే స్వభర్తురవసాయమలక్షమాణౌ
యుష్మద్వ్యతిక్రమగతిం ప్రతిపద్యసద్యః ।
భూయో మమాంతికమితాం తదనుగ్రహో మే
యత్కల్పతామచిరతో భృతయోర్వివాసః ॥ 12

టీ:- తదితి. తత్తస్మాత్ అవసాయమభిప్రాయం అలక్షమాణావజానంతౌ యుష్మదపరాధోచితాం గతిం సద్యః ప్రాప్య మత్సమీపం ఇతాం ప్రాప్నుతాం తదితి స మేఽనుగ్రహః. తమేవాహ-యద్భృతయోర్వివాసః అచిరతః శీఘ్రం కల్పతాం సంపాద్యతాం సమాప్యతామితి. ॥ 12 ॥

వీరిద్దరును తమ ప్రభువగు నా నిశ్చయమును గ్రహింపజాలక పోయిరి. మీ విషయములో అపరాధమును చేసిరి. వెంటనే దాని ఫలమును పొందుచున్నారు. మీరు ఈ ఇరువురు సేవకుల వియోగము తొందరగా సమాప్తమగునట్లు అనుగ్రహింపుడు. నన్నను గ్రహించుచు, వీరు తొందరగా నన్ను చేరునట్లు అనుగ్రహించుడు. ॥ 12 ॥

బ్రహ్మోవాచ

శ్లో ॥ అథ తస్యోశతీం దేవీం ఋషికుల్యాం సరస్వతీమ్ ।
నాస్వాద్య మన్యుదష్టానాం తేషామాత్మాప్యతృప్యత ॥ 13

టీ:- అథేతి. ఉశతీం కమనీయాం ప్రియాం. దేవీం ద్యోతమానానాం ఋషికుల్యాం ఋషయో మంత్రా స్తత్ప్రవాహరూపాం, ఋషికుల యోగ్యామితి వా సరస్వతీం ఆస్వాద్య తన్మాధుర్యమనుభూయ. సర్ప ప్రాయేణ మన్యునా దష్టానామపి. క్రోధ విషయ వ్యాప్తానాం హి మనో రసానుభవాభావాత్ప్రియభాషణమపి న సహతే. తేషాం త్వాత్మా మనో నాతృప్యత అలమితి నామన్యత. 13

బ్రహ్మా ఇట్లు పలికెను

ఋషులు మహాక్రోధమనే విషముతో కూడినవారైరి. శ్రీహరి మిక్కిలి మధురమైన, సమ్మానార్హమైన మహర్షుల గుణములకు హితమైన మాటలను పలికెను. వారా మాటలను వినినను తృప్తి పొందలేక పోయిరి. (పరమపవిత్రమైనదియు, సాధుజనులకు ప్రీతికరమైనదియు నగు సరస్వతీనదీ జలమును ఎంతత్రాగినను పాముకరిచినవానికి దాహము తీరనట్లు.) భగవానుని మాటలు ఇంకా వినగోరిరని తాత్పర్యము. 13

శ్లో ॥ సతీం వ్యాదాయ శ్రుణ్వంతో లఘ్వీం గుర్వర్థగహ్వరామ్ ।
విగాహ్యాగాధగంభీరాం న విదుస్తచ్చికీర్షితం ॥ 14

టీ:- సతీమితి. సతీం శ్రేష్ఠాం. వ్యాదాయ ప్రసార్య. కర్ణం దత్వేత్యర్థః లఘ్వీం మితాక్షరాం. గురుభిరర్థైర్గహ్వరాం దుష్ప్రవేశాం. అగాధామభి ప్రాయతః గంభీరాం అర్థతః విగాహ్య విచార్యాపి కిమస్మానభినందతి నిందతి వా. అస్మత్కృతం దండం వా. సంకోచయతీతి న విదుః. 14

శ్రేష్ఠమైనదియు, సూత్రమువలె అల్పాక్షరములు గలదియు, గొప్ప అర్థముతో గూడినదియు, సులభముగా తెలియరాదనియు నగు భగవానుని వాక్కును శ్రద్ధగా వినిరి. ఆ మాటలను గూర్చి గొప్పగా ఆలోచించిరి. తాము పెట్టిన శాపవిషయములో భగవానుడు అభినందించుచున్నాడా? లేక సంకోచించుచున్నాడా? భగవానుడు ఏమి చేయదలచెనో తెలియజాలకపోయిరి. ॥ 14 ॥

శ్లో ॥ తే యోగమాయయారబ్ధ పారమేష్ఠ్య మహోదయమ్ ।
ప్రోచుః ప్రాంజలయో విప్రాః ప్రహృష్టాః క్షుభితత్వచః ॥15

టీ:- తతశ్చాభినందతీతి జ్ఞాత్వా తే ప్రహృష్టాస్సంతః ప్రోచుః- తఇతి. క్షుభితా రోమాంచితా త్వగ్యేషాం. కూపితేతి పాఠే సంజాతరోమకూపోక్త్యా రోమాంచితత్వమేవోక్తం. ఆరబ్ధః. ఆవిష్కృతః. పారమేష్ఠ్యస్య పరమైశ్వ ర్యస్య. మహోదయః పరమోత్కర్షో యేన తం. అధిరాజత్వ మావిష్కృత్య రాజ శిక్షార్థం బ్రాహ్మణాన్ మానయతీతి జ్ఞాత్వేత్యర్థః. 15

శ్రీహరి యోగమాయచే తన పరమైశ్వర్యము యొక్క ఉత్కర్షను ప్రకటించినాడు. భగవానుడు తమ్మభినందించుచున్నాడని తెలిసి ఆ ఋషులు సంతోషము గలవారై గగుర్పాటు గలవారై చేతులు జోడించి ఇట్లనిరి. ॥ 15 ॥

ఋషయ ఊచుః

శ్లో ॥ న వయం భగవన్విద్మస్తవ దేవ చికీర్షితమ్ ।
కృతో మేఽనుగ్రహశ్చేతి యదధ్యక్షః ప్రభాషసే ॥ 16

మహర్షులు ఇట్లు పలికిరి

ఓ దేవా! నీవు సమస్తజగత్తులకు అధ్యక్షుడవై యుండియు మీరు

టీ:- నేతి. అధ్యక్షస్సర్వేశ్వరస్సన్ తద్ధిహ్యాత్మకృతం మన్యఇత్యుక్తం. మయాఽపరాధః కృత ఇతి, తథా తదనుగ్రహో మమేత్యాది వచనేన. మమానుగ్రహశ్చేతి యత్ప్రభాషసే తేన తవ తచ్చికీర్షితం తన్నవిద్మః (16)

నన్ను అనుగ్రహించుచున్నారని పలికినారు. జరిగిన అపరాధము మీరు చేసినట్లు పలికినారు. మీ అభిప్రాయమును తెలియజాల కున్నాము. 16

శ్లో ॥ బ్రహ్మణ్యస్య పరం దైవం బ్రాహ్మణాః కిల తే ప్రభో ।
విప్రాణాం దేవదేవానాం భగవానాత్మదైవతమ్ ॥ 17

టీ:- బ్రహ్మణ్యస్యేతి. కిలేతి లోకశిక్షార్థత్వం సూచితం. పరమార్థ మాహుః - విప్రాణామితి. దేవదేవానాం దేవపూజ్యానామపి, భగవాన్ త్వమాత్మా చ దైవం చ. ॥ 17 ॥

ఓ ప్రభూ! నీవు బ్రాహ్మణుల మేలు కోరేవాడవు. అందువలన లోకమునకు తెలుపుటకై బ్రాహ్మణులే నీకు పరమపూజ్యులని చెప్పుచున్నావు. కాని దేవతలకు, దేవపూజ్యులగు బ్రాహ్మణులకు నీవే ఆత్మవు. ఆరాధ్యుడవు. ॥ 17 ॥

శ్లో ॥ త్వత్తస్సనాతనో ధర్మో రక్ష్యతే తనుభిస్తవ ।
ధర్మస్య పరమో గుహ్యో నిర్వికారో భవాన్మతః ॥ 18

టీ:- లోకశిక్షార్థతాం ప్రపంచయతి- త్వత్త ఇత్యష్టభిః. త్వత్తఇతి. ధర్మస్త్వత్త ఏవ భవతి రక్ష్యతే చ త్వదవతారైః పరమ ఫలరూపః. అత ఏవ గుహ్యః గోప్యః. న చ స్వర్గాదిఫలవద్వికారీ. భవాన్ కింతు నిర్వికారో మతః అతఏవంభూతస్య తవేదం లోకశిక్షార్థమాత్రమితిభావః. ॥18 ॥

(ఈ శ్లోకము మొదలుకొని ఎనిమిది శ్లోకములు లోకశిక్షార్థము వివరించడమైనది) . సనాతనధర్మము నీ నుండియే ఏర్పడినది. నీవే అవతారములెత్తుచు కాపాడుచున్నావు. ఈ ధర్మముయొక్క ఫల స్వరూపుడవు నీవే. పరమరహస్యమైన వేదసారము నీవేయని శాస్త్రములు చెప్పుచున్నవి. అయినప్పటికీ నీ ఈ ప్రవర్తన కేవలము లోకశిక్షార్థము. (నేడు హిందూమతముగా పిలువబడుచున్నదాని వాస్తవ

శ్లో ॥ తరంతి హ్యంజసా మృత్యుం నివృత్తా యదనుగ్రహాత్ ।
యోగినస్సభవాన్ కిం స్విదనుగృహ్యేత యత్పరైః ॥ 19

టీ:- విపరీతం చైతదిత్యాహుః. తరంతీతి. యస్యానుగ్రహాదేవ నివృత్తాః విరక్తాః యోగినశ్చ. సంతో మృత్యుం తరంతీతి. సభవాన్ పరైరనుగృహ్యతే ఇతి కింస్విత్. న కించిదిత్యర్థః. ॥ 19 ॥

శ్లో ॥ యం వై విభూతిరుపయాత్యనువేలమన్యై
రర్థార్థిభిః స్వశిరసా ధృతపాదరేణుః ।
ధన్యార్పితాంఘ్రితులసీ నవదామధామ్నో
లోకం మధువ్రతపతేరివ కామయానా ॥ 20

టీ:- యచ్చోక్తం. శ్లో. "యత్సేవయా చరణపద్మ పవిత్రరేణుం సద్యః క్షతాఖిలమలం ప్రతిలబ్ధశీల" మిత్యాది. తదంతమసంభావిత మిత్యాహుః ద్వాభ్యాం-యమితి. యం వై విభూతిర్లక్ష్మీః అనువేలం ప్రత్యవసర ముపయాతి సేవతే. ధృతః పాదరేణుర్యస్యాః. ధన్యైః సుకృతిభిరర్పిత మంఘ్ర్యో తులస్యా నవ దామ మాలా. తద్ధామ స్థానం యస్య తస్య. మధువ్రతస్య పతేర్భ్రమరముఖ్యస్య లోకం స్థానమంఘ్రిం. కామయ-మానేవ. ॥ 20 ॥

నామము, (ప్రాచీననామము సనాతనధర్మము.) 18

(ఈ ప్రవర్తన విపరీతముగా నున్నదని చెప్పుచున్నాడు)నివృత్తి ధర్మమునందు నిష్ఠగల ఆత్మజ్ఞానులగు మహాత్ములు నీ అనుగ్రహము చేతనే జనన మరణ చక్రము నుండి తేలికగా తరించెదరు. అట్టి నీవు ఇతరులను అనుగ్రహింపుమని కోరుటలో అభిప్రాయ మేమిటి? 19

(యత్సేవయా చరణ పద్మ పవిత్రరేణుం సద్యః క్షతాఖిలమలం ప్రతిలబ్ధశీలం. అనే ఏడవశ్లోకములో ఆ విషయమే ప్రస్తావించబడినది) ఐశ్వర్యాభిలాషులగు జనులు, ఇంద్రాది దేవతలు, లక్ష్మీదేవి పాదధూళిని ఎల్లప్పుడును తమ శిరస్సుపై ధరించుచుందురు. భక్తులు నీ పాదముల యందు సమర్పించిన నూతన తులసీమాల యందు గండుతుమ్మెద తిరుగాడుచుండును. అట్టి నీ పాద పద్మములను లక్ష్మీదేవి తనకు నివాసస్థానముగా చేసికొని నిన్ను సేవించుచుండును. 20

శ్లో ॥ యస్త్వాం వివిక్తచరితైరనువర్తమానాం
నాత్యాద్రియత్పరమ భాగవతప్రసంగః ।
స త్వం ద్విజానుపథ పుణ్యరజః పునీతః
శ్రీవత్సలక్ష్మ కిమగా భగభాజనస్త్వమ్ ॥ 21

టీ:- య ఇతి. వివిక్త చరితైర్విశుద్ధైః పరిచరణైః. అనువర్తమానాం సేవమానా మపి. యో నాత్యాద్రియత్ నాతీవాదృతవాన్. ఆర్షం పరస్మైపదం. స ఏవం భూతస్త్వం. అయంభావః. ఇత్థం నామాతిలం- పటతయా లక్ష్మీస్త్వాం సేవతే, కథం ఏవం హి సా మేనే. అయం హి సారగ్రాహీ మధువ్రతశ్చంచలశ్చ స చాంఘ్రిగతాయాం తులస్యాం సపరివారో నిశ్చలస్సన్ రమతే. అతోంఘ్రిలావణ్యమత్యధికం స్యాత్. తతోహం వక్షసి స్థితాపి యోగిజనాది బహుసేవకసంఘమంగీకృతాపి తులస్యా సహ సాపత్న్యేనాపి చరణౌ సేవిష్యామీతి తదేవమౌత్సుక్యే నానువర్తమానామపి తాం. త్వం నాతీవాద్రియసే. యతః పరమ భాగవతేష్వేవ ప్రకృష్టసంగవాన్. స ఏవం పరమసౌభాగ్య నిధిస్త్వం. అతో బ్రాహ్మణ ప్రసాదాన్మాం శ్రీర్న విజహాతీతి అలభ్యలాభత్వేన నిర్దేశో న సమంజస ఇతి. కించ స్వత ఏవ త్వం భగభాజనః భజనీయానాం గుణానామాశ్రయః. పరమశుద్ధశ్చ. తం త్వాం. ద్విజానామనుపథం. పథి పథి లగ్నం యత్పుణ్యరజః. తథా శ్రీవత్సలక్ష్మ చ కిం పునీతః

లక్ష్మీదేవి తన విశుద్ధమైన పరిచర్యలచే నిన్ను సేవించుచున్నది. అయినప్పటికిని ఆమెను నీవు (నీ భక్తుల కన్న) గొప్పగా ఆదరించుట లేదు. నీకు లక్ష్మీదేవి యందు ఉన్న ప్రేమకన్ననూ నీ భక్తులపైన విశేషమైన ప్రేమ ఉండును. నీవు స్వయముగా పూజింపదగిన సమస్త- సద్గుణములకు ఆశ్రయుడవు. అచ్చటచ్చట బ్రహ్మవేత్తలు నడిచే మార్గములోని పవిత్రమైన పాదధూళిని ధరింతువు. ఈ బ్రాహ్మణుల పాదధూళి, శ్రీవత్సచిహ్నము నిన్ను పవిత్రునిగా చేయునా? కాదు. నీవు షడ్గుణైశ్వర్యపూర్ణుడవు, సర్వసౌభాగ్యనిధివి, పరిశుద్ధుడవు. అయిననూ ఈ చర్యలన్నియూ నీ భక్తవాత్సల్యమును లోకమునకు తెలుపుటకేయని మా అభిప్రాయము. అందువలననే శ్లో॥ "యత్సేవయా చరణ పద్మ పవిత్రరేణు" మొదలగు మాటలు లోకసంగ్రహము కొరకే అని అర్థము. (తాం -లక్ష్మీదేవిని) లక్ష్మీదేవి ఈ విధముగా తలచు చున్నది. నేను దేవేంద్రాది సురసంఘముతో సేవించబడుచున్న దానను, విష్ణు వక్షఃస్థలమునందున్నదానను. సారగ్రాహి అయిన తుమ్మెద చంచల స్వభావము కలదైనప్పటికిని విష్ణుమూర్తి పాదముల యందున్న తులసియందు అనివార్యముగ నిశ్చలత్వము కలిగి ఆనందించుచున్నది. విష్ణుపాదములు అధికలావణ్యము కలవేమో! తులసి నాకు సవతి (సపత్ని). సవతితో సహచర్యము కోరరానిది.

పవిత్రీకురుతః కిమర్థం చ తే ఉభే అగాః ప్రాప్తభూషణత్వేన స్వీకృతవా-నసి. అతః. శ్లో. "యత్సేవయా చరణపద్మపవిత్రరేణు" మిత్యాదివచనం లోకసంగ్రహమాత్రమిత్యర్థః. ॥ 21 ॥

శ్లో ॥ ధర్మస్య తే భగవతస్త్రియుగ త్రిభిస్స్వైః
పద్భిశ్చరాచరమిదం ద్విజదేవతార్థమ్ ।
నూనం భృతం తదభిఘాతిరజస్తమశ్చ
సత్త్వేన నో వరదయా తనువా నిరస్య ॥ 22

టీ:- ధర్మమూర్తేశ్చ తవేదముచితమేవేత్యాహుః-ధర్మస్యేత్యాదిత్రిభిః త్రిష్వేవ యుగేష్వావిర్భవో యస్యేతి త్రియుగః. యద్వా త్రీణి యుగాని. యుగలాని త్రిగుణాః షడ్గుణాః. భగశబ్దవాచ్యాః సంత్యస్యేతి త్రియుగః హే త్రియుగ. ధర్మ- స్వరూపస్య తవ. త్రిభిః పద్భిః. స్వైరసాధారణై స్తపశ్శౌచదయాభిః. సత్యస్య ధర్మవిప్లవేఽపి కేవలానువర్తమానత్వాత్. త్రిభిరిత్యుక్తం. భృతం పాలితం. కిం కృత్వా. నోఽస్మాకం వరదయా సత్త్వేన తనువా తన్వా సత్త్వమూర్త్యా. తదభిఘాతి తేషాం పదానామ-భిఘాతకం రజశ్చ తమశ్చ. నిరస్య నిరాకృత్య. ద్విజానాం దేవతానాం చ ప్రయోజనాయ నూనం భృతమ్. యద్వా ఇహ లోకే రూపం నిరస్యేతి. అస్మాకం తన్నివర్తయే- త్యర్థః .॥ 22 ॥

అయినప్పటికినీ విష్ణుపాదసేవ కొరకై సవతి సహచర్యమును సహించెదను. ఇలా తలచుచూ విష్ణుపాదసేవకై ఉత్సాహపడుచున్న ఆ లక్ష్మీదేవిని, శ్రీమహావిష్ణువు తన భక్తులకన్నా ఎక్కువగా ఆదరించడు. (21)

(ధర్మస్య మొదలుకొని ఈ మూడు శ్లోకములలో ధర్మమూర్తివైన నీకు ఇది ఉచితమేయని చెప్పుచున్నాడు) నీవు కృత, త్రేత, ద్వాపర అనే మూడు యుగములలో మాత్రమే ప్రత్యక్షముగా కన్పింతువు. కనుకనే "త్రియుగ" అనే పేరుగల వాడవు. మరియొక అర్థము కూడా కలదు. "యుగ" అనగా జంట. మూడు జంటలు ఆరు. మూడు జంటలు కలవాడు "త్రియుగ" భగవంతుడు లోని 'భగ' శబ్దమునకు చెప్పబడే ఆరు గొప్ప గుణములు గలవాడవు. తపస్సు, దయ, దానము అనునవి నీ పాదములు. నీవు ఈ మూడు పాదములతో చరాచర జగత్తును రక్షించుచున్నావు. మా ధర్మ ప్రవర్తనకు విరోధముగా నున్న రజోగుణము, తమోగుణములను ఇప్పుడు నీవు పోగొట్టుము. సత్త్వమయమగు మూర్తితో మాకు వరముల నొసగుము. 22

శ్లో ॥ న త్వం ద్విజోత్తమకులం యదిహాత్మగోపం
గోప్తా వృషః స్వర్హణేన చ సూనృతేన ।
తర్హ్యేవ నంక్ష్యతి శివస్తవ వేద పంథా
లోకోఽగ్రహీష్యదృషభస్య హి తత్ప్రమాణమ్ ॥ 23

టీ:- నేతి. ఆత్మగోపం త్వయైవ రక్షణీయం. ద్విజోత్తమానాం కులం. యది హ స్ఫుటం. త్వం న గోప్తా న రక్షితా. తృన్ ప్రత్యయాంతత్వాత్ న షష్ఠ్యాః ప్రయోగః. తర్హ్యేవ శివశ్శోభనః. తవ వేదమార్గః నంక్ష్యతి నాశం యాస్యతి. కుతః హి యస్మాత్. ఋషభస్య శ్రేష్ఠస్య. తత్ అనర్హణమసూనృతం చ లోకో జనః అగ్రహీష్యత్. ఉక్తం హి గీతాసు. శ్లో."యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః, సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తత" ఇతి. ॥ 23 ॥

దేవా! సర్వశ్రేష్ఠుడవైన నీవు బ్రాహ్మణులను సుమధుర మగు మాటలచేతను, పూజలచేతను చక్కగా సన్మానించుచున్నావు. నీవు అట్లు చేయనిచో శుభకరమైన వేదమార్గము నశించును.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।
సయత్ప్రమాణం కురుతేలోకస్తదనువర్తతే ॥

అను గీతావాక్యము ప్రమాణము. నీవు బ్రాహ్మణులను రక్షించనిచో లోకమున బ్రాహ్మణులకు రక్షణ యుండదు. లోకము నిన్ననుసరించి బ్రాహ్మణులను పూజించును. ॥ 23 ॥

శ్లో ॥ తత్తేనభీష్టమివ సత్త్వనిధేర్విధిత్సోః
క్షేమం జనాయ నిజశక్తిభిరుద్ధృతారేః ।
నైతావతా త్ర్యధిపతే తవ విశ్వభర్తుః
తేజః క్షతం త్వవనతస్య న తే వినోదః ॥ 24

టీ:- నశ్యత్వితి చేత్తత్రాహుః. తదితి. తద్వేదమార్గనాశనం. ఇవేతి లోకోక్తిః సత్త్వనిధిత్వాత్. జనాయ క్షేమం శం విధాతుమిచ్ఛోః. అతఏవ

నీవు సత్త్వగుణమునకు నిధివి. మానవుల కల్యాణమును గోరి నీ శక్తి స్వరూపులగు రాజులద్వారా శత్రువులను నశింపజేసినావు. ధర్మమార్గము నశించుట నీకు ఏ మాత్రము సమ్మతము కాదు. త్రిగుణములకు అధిపతివైన నీవు జగత్తును పాలించి పోషించు - చున్నావు. నీవు బ్రాహ్మణులపట్ల వినయమును చూపినంత మాత్రమున అది నీ తేజస్సుకు లోపము కాదు. ఇట్లు బ్రాహ్మణులపట్ల చూపే

నిజశక్తిభిః రాజాదిభిః. ఉత్పాటితధర్మప్రతిపక్షస్యతవ. అతస్తవ బ్రహ్మకులే అవనతిర్యుక్తైవ,నను మహతోఽన్యేష్వవనతి స్తేజోహానికరీతి తత్రాహుః ఏతావతా తు ధర్మత్రాణప్రయోజనేన. అవనతస్య నమనం కృతవతః తవ తేజః ప్రభావః న క్షతః న క్షీణం.యతః సః నమనాదిస్తే వినోదః (24)

వినయము నీ లీల మాత్రమే. 24

శ్లో ॥ యం వాఽనయోర్దమమధీశ భవాన్ విధత్తే
వృత్తిం ను వా తదను మన్మహి నిర్వ్యలీకమ్ ।
అస్మాసు వా య ఉచితో ధ్రియతాం స దండో
యోఽనాగసౌ వయమయుంక్ష్మహి కిల్బిషేణ ॥ 25

టీ:- శాపాగ్రహం పరిత్యజ్య విజ్ఞాపయంతి. యమితి. యం వా అన్యం దండం. విధాస్యతి భవాన్, వృత్తిం చ ఔపయికీం జీవికాం వా. తత్సర్వమనుమన్యామహే. యే వయం నిరపరాధావేతౌ. కిల్బిషేణ శాపేన. అయుఙ్క్ష్మహి యోజితవంతః. ॥ 25 ॥

శాపము పెట్టిన కోపమును(శాపము విషయములో పట్టుదలను) వదిలి భగవంతునితో విన్నవించుచున్నారు. ఓ సర్వేశ్వరా! వీరిద్దరికి నీవు ఏ శిక్ష విధించినా, లేక ఏ గొప్ప అనుకూలము చేసినా దానిని మేము కపటములేకుండా అనుమోదింతుము. మాకు కూడా ఉచితమగు శిక్షను విధించుము. అది కూడా మాకు అంగీకారమే. మేము నిరపరాధులగు ఈ ఇద్దరిని శపించితిమి కదా! ॥ 25 ॥



శ్రీభగవానువాచ

శ్లో॥ ఏతౌ సురేతరగతిం ప్రతిపద్య సద్యః
సంరంభ సంభృత సమాధ్యనుబద్ధయోగౌ ।
భూయః సకాశముపయాస్యత ఆశు యో వః
శాపో మయైవ నిమితస్తదవైత విప్రాః ॥ 26

టీ:- మత్కారితత్వాత్ శాపస్య యుష్మాకం నాపరాధ ఇత్యాశ్వాసయన్నాహ - ఏతావితి. ఏతౌ సద్య ఏవ. అసురగతిం ప్రాప్య. భూయోప్యాశు. మత్సమీపమాగమిష్యతః. సంరంభేణ క్రోధావేశేన. సంభృతస్సంవృద్ధః. యస్సమాధిరేకాగ్రతా. తేనానుబద్ధో దృఢీకృతో యోగః యయోః. హే విప్రాః. యో వశ్శాపః యుష్మత్కృత శ్శాపః తదితి స మయైవ నిమితః నిర్మితః. ఇత్యవైత జానీత. ॥ 26 ॥

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను

(నా సంకల్పము చేతనే మీచేత వీరికి శాపము ఇవ్వబడినది మీ అపరాధమేమి లేదు అని ఊరడిస్తూ చెప్పుచున్నాడు.) ఓ మహర్షులారా! వీరిద్దరు వెంటనే రాక్షసజన్మను పొంది మరల తొందరలోనే నా సన్నిధికి చేరెదరు. రాక్షస జన్మలో నా యందు మిక్కిలి కోపము గలవారగుదురు. ఆ కోపకారణముగా నా యందు చిత్తైకాగ్రము కలిగి యుందురు. యోగులు సమాధిలో నన్ను ధ్యానించినట్లు వీరు కోపా వేశముతో నన్ను ధ్యానింతురు. నా ప్రేరణ-చేతనే మీరు వీరిని శపించినట్లు గమనించుదు. ॥ 26 ॥

బ్రహ్మోవాచ

శ్లో॥ అథ తే మునయో దృష్ట్వా నయనానందభాజనమ్ ।
వైకుంఠం తదధిష్ఠానం వికుంఠం చ స్వయం ప్రభమ్ ॥ 27

టీ:- అథేతి. నేత్రోత్సవజనకం వికుఠం హరిం తన్నివాసంచ వైకుంఠం లోకమ్. స్వయం ప్రభం ప్రకాశాంతరానపేక్షం. సత్త్వపరిణామత్వాత్. ॥ 27 ॥

బ్రహ్మ ఇట్లు పలికెను

తరువాత సనకాదిమహర్షులు కన్నుల పండుగాఉన్న, స్వయం ప్రకాశస్వరూపుడు, వైకుంఠనాథుడుఅగు, విష్ణుమూర్తియొక్క దివ్య మంగళస్వరూపమును దర్శించిరి. ఆయన నివాసమగు దివ్య కాంతులీనే వైకుంఠమును చూచిరి. 27



శ్లో ॥ భగవంతం పరిక్రమ్య ప్రణిపత్యానుమాన్య చ ।
ప్రతిజగ్ముః ప్రముదితాః శంసంతో వైష్ణవీం శ్రియమ్ ॥ 28

టీ:- భగవంతమితి. అనుమాన్య అనుజ్ఞాప్య. పరిక్రమ్య ప్రదక్షిణీకృత్య. వైష్ణవీం శ్రియం వైకుంఠే వర్ణితామ్. ॥ 28 ॥

సనకాదిఋషులు భగవానునికి ప్రదక్షిణము చేసి నమస్కరించిరి. విష్ణుమూర్తి యొక్క అనుమతిని పొంది, శ్రీహరి యొక్క వైభవమును వర్ణిస్తూ మహానందముతో తిరిగి వెళ్ళిరి. ॥ 28 ॥

శ్లో ॥ భగవాననుగావాహ యాతం మా భైష్టమస్తు శమ్ ।
బ్రహ్మతేజః సమర్థోఽపి హంతుం నేచ్ఛే మతం తు మే ॥29

శ్లో ॥ ఏతత్పురైవ నిర్దిష్టం రమయా క్రుద్ధయా యదా ।
పురాఽపవారితా ద్వారి విశంతీ మయ్యుపారతే ॥ 30

టీ:- భగవానితి. మమైవ తు మతం సంమతం. ఇదమత్ర తత్త్వం. యద్యపి సనకాదీనాం క్రోధోఽపి న సంభవతి న చ భగవత్పార్షదయోః బ్రాహ్మణ ప్రాతికూల్యం, న చ భగవతః స్వభక్తోపేక్షా, న చ వైకుంఠ గతానాం పునర్జన్మ, తథాపి భగవతస్సిసృక్షాదివత్. కదాచిద్యు యుత్సా సమజని తదా అన్యేషామల్పబలత్వాత్ యత్స్వపార్షదానాం చ తుల్య బలత్వేపి ప్రాతిపక్ష్యానుపపత్తేః. ఏతావేవ బ్రాహ్మణనివారణే ప్రవర్త్య. తేషు చ క్రోధముద్దీప్య తచ్ఛాపవ్యాజేన ప్రతిపక్షౌ విధాయ యుద్ధకౌతుకం

(విష్ణువు తన పార్షదులతో ఇట్లు చెప్పుచున్నాడు) ఇది నా అభిప్రాయమే. నా సంకల్పమే కార్యరూపము దాల్చగలదు. సహజము గా సనకాదులకు క్రోధము రాదు. భగవత్పార్షదులకు (జయవిజయు లకు) బ్రాహ్మణప్రతికూల ప్రవర్తన యుండదు. భగవంతునకు తన భక్తుల విషయములో ఉపేక్షయుండదు. వైకుంఠము జేరిన వారికి పునర్జన్మ యుండదు. అయినప్పటికి భగవంతునికి సృష్టించవలెననెడు కోరికయు, యుద్ధము చేయవలెననెడి కోరిక కలిగెను. అల్పబలురగు పార్శదులను తనతో సమానబలముగల ప్రతిపక్షులను చేయదలచి, తన సంకల్పముచేతనే బ్రాహ్మణులను అడ్డగింపజేసెను. ఋషుల యందు క్రోధమును కలిగింపజేసెను. శాపమనెడి నెపమున రాక్షసు-లుగా ఏర్పరచి యుద్ధోత్సాహము పొందగోరెను. అందుకే ఇదంతయు జరిగినది. కనుకనే భగవానుడు ఇట్లు పలుకుచున్నాడు. మీరు వెళ్ళండి. భయపడకండి. మీకు మంగళమగునుగాక. బ్రాహ్మణశాపమును



సంపాదనీయమితి భగవతైవ వ్యవసితం. అతస్సర్వం సంగచ్ఛతే. తదుక్తశాపో మయైవ నిమిత్త ఇతి, మా భైష్టమితి. అస్తు శమితి, హంతుం నేచ్ఛే మతం తు మే ఇత్యాది. యదా మయి ఉపారతే యోగనిద్రా గతవతి సతి ద్వారి విశంతీ యువాభ్యాం పురా౽ పరివారితా తదా కృద్ధయా రమయా ఏతద్యద్బ్రాహ్మణైరిదానీముక్తం తత్పూరైవ నిర్దిష్టమ్. ॥ 29-30 ॥

తొలగించే సామర్థ్యముఉన్నను బ్రహ్మతేజస్సును తోసిపుచ్చుట ఇష్టములేదు. కనుకనే నేను వారి శాపమునకు సమ్మతి తెల్పుచున్నాను. పూర్వము ఒకసారి నేను యోగనిద్రలో ఉండగా, లోపలికి వచ్చుచున్న లక్ష్మీదేవిని మీరు అడ్డగించితిరి. లక్ష్మీదేవి కోపగించినది. మీకీ శాపము కలుగునట్లు సంకల్పించినది. ॥ 29,30 ॥

శ్లో ॥ మయి సంరంభయోగేన నిస్తీర్య బ్రహ్మహేళనమ్ ।
ప్రత్యేష్యతం నికాశం మే కాలేనాల్పీయసా పునః ॥ 31

మీరు నాయందు మిక్కిలి క్రోధము కలిగి యుండి, బ్రహ్మవేత్తల శాపమును పోగొట్టుకొని (శాపపాపము తొలగించుకొని) కొద్ది కాలములోనే మరల నా సన్నిధికి చేరుకోగలరు. ॥ 31 ॥

శ్లో ॥ ద్వాఃస్థావాదిశ్య భగవాన్విమానశ్రేణి భూషణమ్ ।
సర్వాతిశయయా లక్ష్మ్యా జుష్టం స్వం ధిష్ణ్యమావిశత్ ॥ 32

శ్రీమహావిష్ణువు ద్వారపాలకులను ఈ విధంగా ఆదేశించి తన స్థానమునకు వెళ్ళెను. వైకుంఠము విమానవరుసలతో కూడి గొప్పనైన సంపదతో నిండియుండెను. సర్వోత్కృష్ట సౌందర్యరాశియగు లక్ష్మీదేవిచే సేవింపబడుచుండును. ॥ 32 ॥

టీ:- మయీతి.ప్రత్యేష్యతమ్ ప్రత్యేష్యథః. నికాశం సమీపం. 31-32

శ్లో ॥ తౌ తు గీర్వాణ ఋషభౌ దుస్తరాద్ధరి లోకతః ।
హతశ్రియౌ బ్రహ్మశాపాదభూతాం విగతస్మయౌ ॥ 33

(జయ విజయులు) దేవతలలో శ్రేష్ఠులగు వారిద్దరు దాటశక్యము గాని బ్రాహ్మణశాపము కారణముగా వైకుంఠములోనే తమ గర్వమును,

టీ:- తావితి. దుస్తరాద్బ్రహ్మశాపాత్. హరి లోకతః పతంతావితి శేషః శ్రీహరిలోకత ఏవ హతశ్రియావభూతామితిహ విగతస్మయౌ నష్టగర్వౌ చ . 33

శోభను కోల్పోయి, వైకుంఠము నుండి పతితులైరి. ॥ 33 ॥

శ్లో ॥ తదా వికుంఠధిషణాత్తయోర్నిపతమానయోః ।
హాహాకారో మహానాసీద్విమానాగ్ర్యేషు పుత్రకాః ॥ 34

టీ:- తతఇతి. వికుంఠస్య ధిషణాత్ స్థానాత్. పుత్రకాః హే దేవాః34

ఓ దేవతలారా! వారిద్దరు శ్రీహరి స్థానమగు వైకుంఠము నుండి పతితులగుచుండగా విమానముల యందున్న దేవతలు హాహాకార - ములు చేసిరి. ॥ 34 ॥

శ్లో ॥ తావేవ హ్యధునా ప్రాప్తౌ పార్షదప్రవరా హరేః ।
దితేర్జఠరనిర్విష్టం కాశ్యపం తేజ ఉల్బణమ్ ॥ 35

టీ:- తావితి. కాశ్యపం తేజో వీర్యం ప్రాప్తౌ. సహసైవ గర్భే ప్రవిష్టౌ యమౌ. ॥ 35 ॥

విష్ణుమూర్తి యొక్క ప్రధాన పార్షదులే ఇప్పుడు దితి యొక్క గర్భములోనికి ప్రవేశించి భయంకరమగు తేజస్సును పొందిరి. 35

శ్లో ॥ తయోరసురయోరద్య తేజసా యమయోర్హి వః ।
ఆక్షిప్తం తేజ ఏతర్హి భగవాంస్తద్విధిత్సతి ॥ 36

ఆ అసురుల యొక్క తేజస్సే ఇప్పుడు మీ తేజస్సును తిరస్కరించు చున్నది. ఈ అసురులను అడ్డుకొనుశక్తి నాకు లేదు. ఈ పరిస్థితి భగవానుని ఇచ్ఛానుసారమే ఏర్పడినది. ॥ 36 ॥

టీ:- తయోరితి. తయోస్తేజసా. వస్తేజ ఆక్షిప్తం తిరస్కృతం. న చాత్ర మే ప్రతినిధిశ్శక్యః.యతః ఏతర్హీదానీం. భగవానేవ తదేవం విధాతు మిచ్ఛతి. 36

శ్లో ॥ విశ్వస్య యః స్థితి లయోద్భవ హేతురాద్యో
యోగేశ్వరైరపి దురత్యయ యోగమాయః ।
క్షేమం విధాస్యతి స నో భగవాంస్త్ర్యధీశః
తత్రాస్మదీయవిమృశేన కియానిహార్థః ॥ 37 ॥

టీ:- తథాపి కోప్యుపాయో విచార్యతామితి చేత్తత్రాహ - విశ్వస్యేతి. త్రయాణాం గుణానామీశః స ఏవ సత్వోత్కర్షకాలే నః క్షేమం విధాస్యతి విమృశేన విమర్శేన. ॥ 37 ॥

శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,

షోడశోఽధ్యాయః

(అయినప్పటికి ఏదేని ఉపాయమును గురించి ఆలోచించుట అనవసరమని చెప్పబడుచున్నది) విష్ణుమూర్తి ఈ ప్రపంచము యొక్క సృష్టి స్థితి లయములకు ఆదికారణుడు, ఆయన సృష్టి, స్థితి,లయములను సత్త్వ, రజః, తమో గుణములను తన వశము నందుచుకొన్న వాడు. శ్రేష్ఠులగు యోగులు కూడా ఆయన యోగమాయను దాటలేరు. అట్టి భగవానుడే మనలకు క్షేమమును కలిగించగలడు. దీనిని గూర్చి మనము విచారించి ఏమి ప్రయోజనము? ప్రయోజనము లేదని తాత్పర్యము. ॥ 37 ॥

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు

పదహారవ అధ్యాయము సమాప్తము

సప్తదశోఽధ్యాయః

శ్లో ॥ తతస్సప్తదశే జన్మ తయోర్లోకభయంకరమ్ ।
హిరణ్యాక్షప్రభావశ్చ వర్ణ్యతే దిగ్జయేఽద్భుతమ్ ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ నిశమ్యాత్మభూవా గీతం కారణం శంకయోజ్ఝితాః ।
తతః సర్వే న్యవర్తంత త్రిదివాయ దివౌకసః ॥ 1

టీ:- నిశమ్యేతి. క్షేమం విధాస్యతీతి బ్రహ్మవచనానంతరం వచనాత్ శంకయా త్యక్తాః.॥1॥

శ్లో ॥ దితిస్తు భర్తురాదేశాదపత్యపరిశంకినీ ।
పూర్ణేవర్షశతే సాధ్వీ పుత్రౌ ప్రసుషువే యమౌ ॥ 2

టీ:- దితిరితి. భర్తురాదేశాత్. శ్లో. "లోకాన్ సపాలాం స్త్రీం శ్చండి ముహురాక్రందయిష్యత" ఇతి వచనాత్. స్వాపత్యాభ్యాం పరిశంకినీ. దేవోపద్రవం శంకమానా. ॥ 2 ॥

శ్లో ॥ ఉత్పాతా బహవస్తత్ర నిపేతుర్జాయమానయోః ।
దివి భువ్యంతరిక్షే చ లోకస్యోరుభయావహాః ॥ 3

17 వ అధ్యాయము

ఈ పదహేడవ అధ్యాయమున ఆ హిరణ్యాక్ష హిరణ్యకశిపుల భయంకరమగు పుట్టుకయు, హిరణ్యాక్షుని దిగ్విజయమును, అద్భుత ప్రభావమును పర్ణింపబడినది.

మైత్రేయుడు ఇట్లు పలికెను

(పిమ్మట) స్వయంభువుడగు బ్రహ్మదేవుడు దేవతల తేజస్సు క్షీణమగుటకుగల కారణమును వివరించి చెప్పెను. దానిని విని దేవతలందరు సందేహములు తొలగినవారై స్వర్గలోకమునకు మరలి వెళ్ళిరి. ॥ 1 ॥

సాధ్వియగు దితి తన భర్తయగు కశ్యపుడు చెప్పిన మాట ('లోకాన్ సపాలాంస్త్రీంశ్చండి ముహురాక్రయిష్యతః దిక్పాలురతో పాటు లోకములను మాటిమాటికి పీడించెదరు) ప్రకారము దుష్ట సంతానము కలుగబోవుచున్నదని శంకించుచుండెను. వంద సంవత్సరముల పిమ్మట ఇద్దరు మగపిల్లలను గనెను. ॥ 2 ॥

వారిద్దరు పుట్టినపుడు స్వర్గలోకములో, ఆకాశములో, భూ

టీ:- ఉత్పాతా ఇతి. తత్ర తదానీం నిపేతుర్బభూవుః. ఉరు భయమా-సమంతాద్వహన్తీతి. ॥ 3 ॥

లోకములో అనేకములగు ఉత్పాతములు(చెడుశకునములు) పుట్టినవి. ఆ శకునములు భూలోక ప్రజలకు గొప్ప భయమును కలిగించినవి. 3

శ్లో ॥ సహాచలా భువశ్చేలుర్దిశః సర్వాః ప్రజజ్వలుః ।
సోల్కాశ్చాశనయః పేతుః కేతవశ్చార్తిహేతవః ॥ 4

టీ:- సహాచలా ఇతి. అచలైస్సహితాః భువః ప్రదేశాః. కేతవశ్చ ఉదయం చక్రురితి శేషః. ॥ 4 ॥

అపుడు పర్వతాలతోసహా భూమి కంపించినది. దిక్కులలో అగ్ని - జ్వాలలు వ్యాపించినవి. లోకమునకు భయమును కలిగించే తోకచుక్కలు కనబడినవి. ॥ 4 ॥

శ్లో ॥ వవౌ వాయుః సుదుఃస్పర్శః ఫూత్కారానీరయన్ముహుః ।
ఉన్మూలయన్నగపతీన్వాత్యానీకో రజోధ్వజః ॥ 5

టీ:- వవావితి. ఫూత్కారానితి తీవ్రవాయుశబ్దానుకరణం. నగపతీన్ మహావృక్షాన్. వాత్యా ఏవానీకం రజ ఏవ ధ్వజో యస్య. ॥ 5 ॥

వాయువు మిక్కిలి సహింపరానిదై (దుఃఖ స్పర్శ గలదై) నిరంతరముగా ఊలలు వేయుచూ (గొప్పశబ్దము చేయుచూ) వీచ - సాగెను. ఆ సుడిగాలులకు దుమ్ము పైకిలేచి ధ్వజములవలె నుండెను. మహావృక్షములు పెకిలింపబడుచుండెను. ॥ 5 ॥

శ్లో ॥ ఉద్ధసత్తడిదంభోదఘటయా నష్టభాగణే ।
వ్యోమ్ని ప్రవిష్టతమసా న స్మ వ్యాదృశ్యతే పదం ॥ 6

టీ:- ఉద్ధసదితి. ఉచ్చైర్హసంత్య ఇవ తటితో యేషు తేషామంబు - దానాం ఘటయా సమూహేన నష్టో భాగణః సూర్యాదిప్రభాసమూహో యస్మిన్. తత్పదం స్థానం న వ్యాదృశ్యతే స్మ ఈషదపి నాదృశ్యత. ॥ 6

ఆ సమయములో మెరుపుతీగలు అట్టహాసము (పెద్దనవ్వు) చేయుచుండెను. మేఘములగుంపు ఆకాశమును కప్పివేయగా చీకట్లు క్రమ్ముకొనెను. సూర్యచంద్రులకాంతిగాని, నక్షత్రములకాంతిగాని లేకుండెను. అంధకారమయమయ్యెను. ఎక్కడ ఏ వస్తువు కనిపించ-

శ్లో ॥ చుక్రోశ విమనా వార్ధిరుదూర్మిః క్షుభితోదరః ।
సోదపానాశ్చ సరితశ్చుక్షుభుః శుష్కపంకజాః ॥ 7

టీ:- ఉద్గతేతి. వార్ధిస్సముద్రః. విమానా ఇవ ఉద్గతాః ఊర్మయో యస్మాత్. క్షుభితాః ఉదరస్థా మకరాదయో యస్మిన్. ఉదపానైర్వాపీ-కూపాది భిః సహితాః. శుష్కాణి పంకజాని యాసు. ॥ 7 ॥

కుండెను. ॥ 6 ॥

మొసళ్ళు మొదలగు జలజంతువులకు ఆటపట్టైన సముద్రమధ్య భాగము కలచివేయబడెను (క్షోభించెను). తరంగములు ఉప్పొంగెను. వికలమనస్సుగలవానివలె సముద్రము ఆక్రోశించెను. మంచినీటి - బావులు, సరస్సులు, నదులు కల్లోలితములయ్యెను. వాటిలోని పద్మములు వాడిపోయెను. ॥ 7 ॥

శ్లో ॥ ముహుః పరిధయోఽభూవన్ సరాహ్వోశ్శశిసూర్యయోః ।
నిర్ఘాతా రథ నిర్హ్రాదా వివరేభ్యః ప్రజజ్ఞిరే ॥ 8

టీ:- ముహురితి. పరిధయః పరివేషాః. సరాహ్వోః రాహుగ్రస్తయోః నిర్ఘాతా రథః నిరభ్రగర్జనశబ్దః. రథ నిర్హ్రాదాః ప్రతిధ్వనయః. వివరేభ్యో గిరిగుహాభ్యః. ॥ 8 ॥

సూర్య, చంద్ర గ్రహణములు ఏర్పడినవి. ఆ చంద్ర సూర్యుల చుట్టూ నిరంతరముగా పరివేషములు కలిగినవి. (పరివేషము అనగా కాంతిగూడుకట్టుట). మేఘములు లేకుండానే గర్జనలు వినబడినవి. పర్వతగుహలనుండి రథము పరిగెత్తేటప్పుడు వచ్చే ధ్వనిలాంటి ధ్వనులు బయలుదేరినవి. ॥ 8 ॥

శ్లో ॥ అంతర్గ్రామేషు ముఖతో వమంత్యో వహ్నిముల్బణమ్ ।
సృగాలోలూకటంకారైః ప్రణేదురశివంశివాః ॥ 9

టీ:- అంతర్గ్రామేష్వితి. సృగాలానాములూకానాం చ. టంకారైర్ధ్వనిభిః. సహ. శివాః సృగాల్యః. 9

గ్రామములలో (మధ్యలో) నక్కల కూతలు, గుడ్లగూబల కూతలు వినబడసాగినవి. అమంగళకరమైన ఈ కూతలతో, బాటు ఆడనక్కలు ముఖమునుండి నిప్పులు గ్రక్కుచుండెను. ॥ 9 ॥

శ్లో ॥ సంగీతవద్రోదనవదున్నమయ్య శిరోధరామ్ ।
వ్యముంచన్ వివిధా వాచో గ్రామసింహాస్తతస్తతః ॥ 10

టీ:- సంగీతవదితి. గ్రామసింహాః శ్వానః. ॥ 10 ॥

అక్కడక్కడ కుక్కలు మెడలను పైకెత్తి అనేక శబ్దములను చేయసాగెను. ఆ శబ్దములలో కొన్నిశబ్దములు సంగీతధ్వనులను కొన్ని ఏడ్పుధ్వనులను పోలియుండెను. ॥ 10 ॥

శ్లో ॥ ఖరాశ్చ కర్కశైః క్షత్తః ఖురైః ఘ్నంతో ధరాతలమ్ ।
ఖార్కారరభసామత్తాః పర్యధావన్ వరూథశః ॥ 11

టీ:- ఖరాఇతి. కర్కశైస్తీక్ష్ణైః. హే క్షత్తః, ఖార్కారః గర్దభజాతి శబ్దః తస్మిన్ రభసః సంభ్రమో యేషాం, తేవరూధశః సంఘశః. ॥ 11 ॥

ఓ విదురా! గాడిదలు మత్తెక్కినవై గుంపులు గుంపులుగా చేరి వాడియైన డెక్కలతో భూమిని త్రవ్వుచూ "ఖరఖర" శబ్దమును జేయుచూ నలుదిక్కుల పరుగెత్తసాగెను. ॥ 11 ॥

శ్లో ॥ రుదంతో రాసభత్రస్తా నీడాదుదపతన్ ఖగాః ।
ఘోషేఽరణ్యే చ పశవః శకృన్మూత్రమకుర్వత ॥ 12 ॥

టీ:-- రుదంతఇతి. రాసభశబ్దాత్ త్రస్తాః. సర్వతః క్రోశంతః. 12

గాడిదల అరుపులకు భయపడినవై పక్షులు ఏడ్చుచూ గూళ్ళనుండి బయటకువచ్చి ఎగిరిపడుచుండెను. పల్లెయందు, అరణ్యమునందున్న పశువులు భయపడినవై మలమూత్రములను విడుచుచుండెను. ॥ 12 ॥

శ్లో ॥ గావోఽత్రసన్నసృగ్దోహాస్తోయదాః పూయవర్షిణః ।
వ్యరుదన్ దేవలింగాని ద్రుమాః పేతుర్వినాఽనిలమ్ ॥ 13

టీ:- గావఇతి. గావః అత్రసన్ త్రస్తాః. అసృగ్దోహాశ్చ బభూవుః. దేవలింగాని వ్యరుదన్. ప్రతిమానామశ్రుస్రావ ఆసీదిత్యర్థః. ॥ 13 ॥

ఆవులన్నియు భయపడుతూ రక్తమయములైన పాలను స్రవించినవి. మేఘములు చీమును వర్షింపసాగెను. దేవతా విగ్రహములనుండి కన్నీరుకారుచుండెను. గాలి లేకుండానే చెట్లు నేల కూలుచుండెను. ॥ 13 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ గ్రహాన్పుణ్యతమానన్యే భగణాంశ్చాపి దీపితాః ।
అతిచేరుర్వక్రగత్యా యుయుధుశ్చ పరస్పరమ్ ॥ 14

టీ:- గ్రహానితి. పుణ్యతమాన్ గురు. బుధాదీన్. భగణాన్ బహూని నక్షత్రాణి చ. అన్యే క్రూరగ్రహాః భౌమాదయః. అతి చేరుః అతిక్రమ్య జగ్ముః వక్రగత్యా ప్రత్యావృత్త్యా యుయుధుశ్చపరస్పరం. ॥ 14 ॥

పుణ్యతమములగు గురు, బుధ, శుక్రాది శుభగ్రహములను మరియు అనేక నక్షత్రములను, శని, కుజాది క్రూరగ్రహములు ఉద్దీప్తములై (ప్రకాశించుచున్నవై) అతిక్రమించి సంచరించసాగెను. వక్రగతులద్వారా తిరిగివచ్చి ఒకదానితోనొకటి యుద్ధము చేయసాగెను. ॥ 14 ॥

శ్లో ॥ దృష్ట్వాఽన్యాంశ్చ మహోత్పాతానతత్త్వవిదః ప్రజాః ।
బ్రహ్మపుత్రానృతే భీతా మేనిరే విశ్వసంప్లవమ్ ॥ 15

టీ:- దృష్ట్వేతి. బ్రహ్మపుత్రానృతే వినా.తేషాం స్వశాపాదిజ్ఞానాత్ 15

ఇంకను ఇతరములగు మహోత్పాతములు బయలుదేరినవి. ఈ పెద్దఉత్పాతములు చూచి బ్రహ్మపుత్రులగు సనకాదులు మాత్రము కారణము తెలిసినవారగుటచే భయపడలేదు. ఇతరప్రజలు మిక్కిలి భయమంది ప్రపంచమునకు ప్రళయము వచ్చుచున్నదని తలచిరి. 15

శ్లో ॥ తావాదిదైత్యౌ సహసా వ్యజ్యమానాత్మపౌరుషౌ ।
వవృధాతేఽశ్మసారేణ కాయేనాద్రిపతీ ఇవ ॥ 16

టీ:- తావితి. వ్యజ్యమానం ఆత్మపౌరుషం పూర్వసిద్ధం స్వపౌరుషం యయోస్తౌ. ॥ 16 ॥

దితి యొక్క మొదటి సంతానమైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులిద్దరిలో పుట్టిన వెంటనే పూర్వపరాక్రమము వెల్లడికాజొచ్చినది. ఇనుము వంటి దృఢదేహము గలవారై గొప్పపర్వతములవలె పెరుగసాగిరి. 16

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ దివిస్పృశౌ హేమకిరీటకోటిభిః
నిరుద్ధకాష్ఠౌ స్ఫురదంగదాభుజౌ ।
గాం కంపయంతౌ చరణైః పదే పదే
కట్యా సుకాంచ్యాఽర్కమతీత్య తస్థతుః ॥ 17

టీ:- దివిస్పృశావితి. నిరుద్ధాః వ్యాప్తాః. కాష్ఠాః దిశోయాభ్యాం. స్ఫురంతి అంగదాని యేషు తే. భుజాః యయోస్తౌ. అంగదేతి టాబంతత్వమార్షం. శోభనా కాంచీ యస్యాం తయా కట్యా ॥ 17 ॥

వారు ధరించిన బంగారుకిరీటముల కొనలు స్వర్గలోకమును తాకుచుండెను. వారి శరీరములు దిక్కులలో వ్యాపించి యుండెను (అడ్డగించు చుండెను). వారి భుజములందు బాహుపురులు, నడుము నందు అందమైన మొలనూలు గొప్పగా ప్రకాశించుచుండెను. వారు వేసే ప్రతిఅడుగునకు భూమి కంపించుచుండెను. వారు సూర్యుని కన్నను గొప్పగా ప్రకాశించుచుండిరి. ॥ 17 ॥

శ్లో ॥ ప్రజాపతిర్నామ తయోరకార్షీత్
యః ప్రాక్స్వదేహాద్యమయోరజాయత ।
తం వై హిరణ్యకశిపుం విదుః ప్రజాః
యం తం హిరణ్యాక్షమసూత సాగ్రతః ॥ 18

టీ:- ప్రజాపతిరితి. యమయోర్మధ్యే యః. స్వదేహాత్ప్రాక్ప్రథమమ జాయత. తం యథా హిరణ్యకశిపుం విదుః. సా దితిః ప్రథమం యమసూత తం హిరణ్యాక్షం యథా విదుః. తథా నామ కృతవానిత్యర్థః అయం భావః. యదా హి గర్భాధానసమయే. యోనిపుష్పం విశద్వీర్యం ద్వేధా విభక్తం. ఆదితః పశ్చాద్భావేన ప్రవిశతి. తదా యమౌ భవతః

ఆ కవల పిల్లలిద్దరికీ కశ్యపప్రజాపతి నామకరణము చేసెను. వారిద్దరిలో కశ్యపుని దేహమునుండి మొదట జన్మించిన వానిని హిరణ్యకశిపుడని, దితి మొదట ప్రసవించిన వానిని హిరణ్యాక్షుడనియు ప్రజలు పిలిచిరి. హిరణ్యకశిపుడు జ్యేష్ఠుడు. హిరణ్యాక్షుడు కనిష్ఠుడు. ఇందులో అంతరార్థమేమనగా, గర్భాధాన సమయములో యోని పుష్పము రెండుగా విభజింపబడినది. ఇద్దరు కవలలుగా పుట్టినప్పటికి వీర్యప్రవేశ క్రమములో మొదటివాడు హిరణ్యకశిపుడు, రెండవవాడు హిరణ్యాక్షుడు.

శ్లో. యథావిశశద్ద్విధా భూతం యోనింపుష్పం పరిక్షరత్ ।

తయోశ్చ పితృతః ప్రవేశక్రమవిపర్యయేణ మాతృతః ప్రసూతిః.

శ్లో. యదా విశశద్ద్విధా భూతం బీజం పుష్పం పరిక్షరత్ ।
ద్వౌ తదా భవతో గర్భౌ సూతిర్వేశవిపర్యయాత్ ॥

ఇతి పిండసిద్ధస్మరణాత్. అతః స్వదేహాత్పూర్వం యో జాతః స్వస్య హిరణ్యకశిపురితి. దితిః ప్రథమం యమసూత. తస్య హిరణాక్ష ఇతి. నామ కృతవానితి. 18

ద్వౌ తదా భవతో గర్భౌ సూతిర్వేశవిపర్యయా ॥

అనే అభిప్రాయముననుసరించి తరువాతి (చివరి) వీర్యము వల్లనేర్పడిన వానిని దితి ముందుగా ప్రసవించినది. వానికి హిరణ్యాక్షుడని పేరు. ముందుగా వీర్యప్రవేశమువలన నేర్పడినవాడు తరువాత జన్మించి నాడు. అతడు హిరణ్యకశిపుడు. ప్రసూతి కాలాన ముందు వెనకలు జరిగినది. ॥ 18 ॥

శ్లో ॥ చక్రే హిరణ్యకశిపుర్దోర్భ్యాం బ్రహ్మవరేణ చ ।
వశే సపాలాన్ లోకాంస్త్రీనకుతో మృత్యురుద్ధతః ॥ 19

టీ:- చక్ర ఇతి. దోర్భ్యాం ఉద్ధతః బ్రహ్మవరేణ అకుతో భయ మృత్యుః (19)

హిరణ్యకశిపుడు తన భుజబలముచేత గర్వించెను. బ్రహ్మ నుండి దేనివలననూ మరణములేని విధముగా వరమును పొంది, లోకపాలురతోసహా మూడులోకములను తన స్వాధీనములో నుంచుకొనెను. ॥ 19 ॥

శ్లో ॥ హిరణ్యాక్షోఽనుజస్తస్య ప్రియః ప్రీతికృదన్వహమ్ ।
గదాపాణిర్దివం యాతో యుయుత్సుర్మృగయన్ రణమ్ ॥ 20

టీ:- హిరణ్యాక్షఇతి. రణం యుద్ధం. ॥ 20 ॥

వాని ప్రియమైన తమ్ముడగు హిరణ్యాక్షుడు ఎల్లప్పుడు అన్నగారికి ప్రీతిని కలిగించేవాడు. అతనికి యుద్ధమంటే ఎక్కువ ఇష్టము. ఆ హిరణ్యాక్షుడు గదను చేతబట్టుకొని యుద్ధము చేయగోరి స్వర్గమునకు వెళ్ళెను. ॥ 20 ॥

శ్లో ॥ తం వీక్ష్య దుస్సహజవం రణత్కాంచననూపురమ్ ।
వైజయంత్యా స్రజా జుష్టమంసన్యస్త మహాగదమ్ ॥ 21

టీ:- తమితి. దుస్సహో జవో వేగో యస్య. రణంతౌ కాంచనమయౌ నూపురౌ యస్య, అంసే న్యస్తా మహతీ గదా యేన. ॥ 21 ॥

శ్లో ॥ మనోవీర్య వరోత్సిక్తమసృణ్యమకుతోభయమ్ ।
భీతానిలిల్యిరే దేవాస్తార్క్ష్యత్రస్తా ఇవాహయః ॥ 22

టీ:- మనఇతి. మనసా శౌర్యేణ. వీర్యేణ. బలేన వరేణ చ ఉత్సిక్తం గర్వితం. అసృణ్యం నిరంకుశం నిలిల్యిరే లీనా బభూవుః. ॥ 22 ॥

శ్లో ॥ స వై తిరోహితాన్ దృష్ట్వా మహసా స్వేన దైత్యరాట్ ।
సేంద్రాన్ దేవగణాన్ క్షీబానపశ్యన్వ్యనదద్భృశమ్ ॥ 23

శ్లో ॥ తతో నివృత్తః క్రీడిష్యన్గంభీరం భీమనిస్వనమ్ ।
విజగాహే మహాసత్త్వో వార్ధిం మత్త ఇవ ద్విపః ॥ 24

ఆ హిరణ్యాక్షుడు సహింపరాని వేగము కలవాడుగా నుండెను. అతడు భుజముపై పెద్దగదనుంచుకొని నడచుచుండగా కాళ్ళకున్న బంగారు ఆభరణములు(నూపురములు) గొప్పగా శబ్దముచేయు - చుండెను. మెడలో విజయసూచకముగా వైజయంతీ పుష్పమాలను ధరించియుండెను. ॥ 21 ॥

ఆ హిరణ్యాక్షుడు మనోబలము చేత, శరీరబలము చేత మరియు బ్రహ్మ వరముచేత గర్వించియుండెను. నిరంకుశుడగు ఆతనికి ఎవరన్ననూ, ఏదన్ననూ భయము లేకుండెను. దేవతలు ఆ హిరణ్యాక్షుని చూచి భయపడిరి. గరుత్మంతుని చూచిన పాములవలె దాగియుండిరి. (22)

ఆ రాక్షసరాజునకు, గర్వితులై యుండే ఇంద్రుడు మొదలగు దేవగణములు కనబడ లేదు. తన తేజస్సుముందు దేవతలు నిలువలేక దాగియుండుటను చూచి గొప్పగా గర్జించెను. (క్షీబాన్ అనుచోట క్లీబాన్ అని పాఠాంతరము. పౌరుష హీనులని అన్వయము.)23

తరువాత మహాబలిష్ఠుడగు ఆ హిరణ్యాక్షుడు స్వర్గము నుండి

టీ:- స ఇతి. స్వేన మహసా తిరోహితాన్. దృష్ట్వా జ్ఞాత్వా క్షీబోమత్తః న పశ్యన్ అపశ్యన్ సన్. క్లీబానితి పాఠే పౌరుష హీనాన్. ॥ 23,24॥

వెనుదిరిగెను. క్రీడింపదలచినవాడై సముద్రము లోనికి ప్రవేశించెను. ఆ సముద్రము గంభీరమై, భయంకరముగ ధ్వనించునదై యుండెను. అట్టి సముద్రములోనికి మదించిన ఏనుగువలె ప్రవేశించెను.॥24॥

శ్లో ॥ తస్మిన్ప్రవిష్టే వరుణస్య సైనికాః
యాదోగణాః సన్నధియస్ససాధ్వసాః ।
అహన్యమానా అపి తస్య వర్చసా
ప్రధర్షితా దూరతరం ప్రదుద్రువుః ॥ 25

టీ:- తస్మిన్నితి. సన్నా అవసన్నా ధీర్యేషాం తే. వర్చసా తేజసా. ప్రధర్షితాః అభిభూతాస్సంతః. ॥ 25 ॥

ఆ హిరణ్యాక్షుడు సముద్రమున ప్రవేశింపగానే వరుణుని సైనికులగు జలజంతువులు చాలాభయపడినవి. ఆతడు వాటిజోలికి పోకున్నను వాని పరాక్రమమునకు తాళజాలక పోయినవి. ఆ జల - జంతువులు బహు దూరము పారిపోయినవి. ॥ 25 ॥

శ్లో ॥ స వర్షపూగానుదధౌ మహాబలః
చరన్మహోర్మీన్ శ్వసనేరితాన్ముహుః ।
మౌర్వ్యాభిజఘ్నే గదయా విభావరీమ్
ఆసేదివాంస్తాత పురీం ప్రచేతసః ॥ 26

టీ:- స ఇతి. మహోర్మీనభిజఘ్నే. మౌర్వ్యా మారయతీతి మౌర్వం కార్ష్ణ్యాయ సం. తన్మయ్యా. యద్వా మౌర్వీ భూస్తృణ విశేషః, తన్మయ్యా రజ్జ్వా. దృఢం నిబద్ధయేత్యర్థః. విభావరీ సంజ్ఞామాసేదివాన్ ప్రాప్తవాన్. (26)

ఓ విదురా! మహాబలుడగు ఆ హిరణ్యాక్షుడు సముద్రమున అనేక సంవత్సరములు విహరించెను. వాని నిట్టూర్పులచే కలత చెంది సముద్రమున పెద్ద తరంగములు బయలుదేరెను. ఆ తరంగములను అతడు నలుపు రంగుతోనున్న లోహమయమైన గదతో మాటి మాటికి కొట్టుచుండెను. పిమ్మట వరుణుని నగరమైన 'విభావరి'కి చేరుకొనెను. (26)

శ్లో ॥ తత్రోపలభ్యాసురలోకపాలకం
యాదోగణానామృషభం ప్రచేతసమ్ ।
స్మయన్ప్రలబ్ధుం ప్రణిపత్య నీచవత్
జగాద మే దేహ్యధిరాజ సంయుగమ్ ॥ 27

టీ:- తత్రేతి. అసురాణాం లోకః పాతాళం తత్పాలకం. ప్రలబ్ధుం ఉపహసితుం ప్రణిపత్య. ॥ 27 ॥

రాక్షస లోకమునకు అధీశ్వరుడును, జలజంతువుల సముదాయ - మునకు ప్రభువుఅయిన వరుణుని హిరణ్యాక్షుడు చూచెను. ఆ వరుణుని పరిహసించుటకై చిరునవ్వునవ్వి అల్పునివలె నటిస్తూ ఆయనకు నమస్కరించి, ఇట్లు పలికెను. ఓ మహారాజా! నాకు యుద్ధమును ఇవ్వుము. (నాతో యుద్ధము చేయమని అర్థము)27

శ్లో ॥ త్వం లోకపాలోఽధిపతిర్బృహచ్ఛ్రవా
వీర్యాపహో దుర్మద వీరమానినామ్ ।
విజిత్య లోకేఽఖిలదైత్యదానవాన్
యద్రాజసూయేన పురాఽజయత్ప్రభో ॥ 28

టీ:- త్వమితి. యస్మాత్ రాజసూయేన. భవాన్ అయజత్. ॥ 28 ॥

ఓ ప్రభూ! నీవు గొప్ప కీర్తిగల, లోకాధిపతివి. బలగర్వముచే మదించినవారి దర్పమును అణచినవాడవు. పూర్వము నీవు దైత్య దానవులను జయించి రాజసూయయాగమును చేసితివి కదా! ఇప్పుడు నాతో యుద్ధము చేయుము. ॥ 28 ॥

శ్లో ॥ స ఏవముత్సిక్తమదేన విద్విషా
దృఢం ప్రలబ్ధో భగవానపాంపతిః ।
రోషం సముత్థం శమయన్ స్వయా ధియా
వ్యవోచదంగోపశమం గతా వయమ్ ॥ 29

టీ:- స ఇతి. ఉపశమం యుద్ధాది కౌతుకాదుపరమమ్. ॥ 29 ॥

యుద్ధమదోన్మత్తుడును, శత్రువునగు హిరణ్యాక్షుడు ఇట్లు వేళాకోళము చేయగా జలాధిపతియగు వరుణుడు పైకి పొంగుచున్న కోపమును తన బుద్ధిబలముతో అణచుకొని ఇట్లనెను. ఓ రాక్షసరాజా! "నేను యుద్ధములనుండి విరమించుకొన్నాను." ॥ 29 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ పశ్యామి నాన్యం పురుషాత్పురాతనాత్
యస్సంయుగే త్వాం రణమార్గ కోవిదమ్ ।
ఆరాధయిష్యత్యసురర్షభేహితం
మనస్వినో యం గృణతే భవాదృశాః ॥ 30

టీ:- పశ్యామీతి. యుద్ధమార్గే నిపుణం త్వాం. యస్తోషయిష్యతి తమిహి గచ్ఛ. గృణతే స్తువంతి. ॥ 30 ॥

శ్లో ॥ తం వీరమారాదభిపత్య విస్మయః
శయిష్యసే వీరశయే శ్వభిర్వృతః ।
యస్త్వద్విధానామసతాం ప్రశాంతయే
రూపాణి ధత్తేసదనుగ్రహేచ్ఛయా ॥ 31

టీ: తమితి. ఆరాత్ శీఘ్రం. విస్మయః నష్టగర్వః. వీరశయే రణాంగణే. రూపాణి వరాహాద్యవతారాన్. ॥ 31 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
హిరణ్యాక్షదిగ్విజయే నప్తదశోఽధ్యాయః

ఓ రాక్షసశ్రేష్ఠా! నీవు యుద్ధవిద్యలలో నిపుణుడవు. నిన్ను యుద్ధమున సంతోషపెట్టగలవాడు, సనాతనపురుషుడగు శ్రీహరికంటె మరియొకడు లేడు. నీ వంటి వీరులెల్లప్పుడు ఆయనను స్తుతించుచుందురు. అందువలన నీవు ఆ విష్ణుమూర్తి వద్దకు వెళ్ళుము. 30

ఆ మహావీరునివద్దకు శీఘ్రముగ వెడలుము. అతనితో యుద్ధములో నీ గర్వము నష్టమగును. రణరంగములో నీవు నిద్రించుచుండగా నీ చుట్టూ కుక్కలు మూగును. ఆ శ్రీహరి నీ వంటి దుష్టులను నశింపజేసి సత్పురుషులననుగ్రహించుటకై వరాహాద్యవతారములను ధరించును. ॥ 31 ॥

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
పదిహేడవ అధ్యాయము సమాప్తము

అష్టాదశోஉధ్యాయః

శ్లో ॥ అష్టాదశే హిరణాక్షధరోద్ధర్తృవరాహయోః ।
నిర్విశేషం మహాయుద్ధం దేవక్షోభి నిరూప్యతే ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ తదేవమాకర్ణ్య జలేశభాషితం
మహామనాస్తద్విగణయ్య దుర్మదః ।
హరేర్విదిత్వా గతిమంగ నారదాత్
రసాతలం నిర్వివిశే త్వరాన్వితః ॥ 1

టీ:- తదితి. ప్రతియోద్ధారం శ్రుత్వా. మహామనాః. శయిష్యస ఇతి యదుక్తం తత్. విగణయ్య అగణయిత్వా. యతో దుర్మదః. ॥ 1

శ్లో ॥ దదర్శ తత్రాభిజితం ధరాధరం
ప్రోన్నీయమానావనిమగ్ర దంష్ట్రయా ।
ముష్ణంతమక్ష్ణా స్వరుచోஉరుణశ్రియా
జహాస చాహో వనగోచరో మృగః ॥ 2

టీ:- దదర్శేతి. అభితో జయతీత్యభిజిత్తం శ్రీహరిం. ప్రకర్షేణోర్ధ్వం నీయమానావనిం యేన అగ్రదంష్ట్రయా దంష్ట్రాగ్రేణ. స్వరుచో

18 వ అధ్యాయము

ఈ పద్దెనిమిదవ అధ్యాయమున వరాహదేవునితో హిరణ్యాక్షుడు చేసిన యుద్ధవర్ణన కలదు.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను

ఓ విదురా! జలాధిదేవతయగు వరుణుని ఈ మాటలను విని, తనకు తగిన ప్రతియోధ శ్రీహరియే అని తెలిసికొని, మహాబలుడు, మదాంధుడైన ఆ హిరణ్యాక్షుడు సంతోషించెను. శ్రీహరి చేతిలో నీవు మరణింతువనే వరుణుని మాటలను లెక్కచేయలేదు. నారదునిచే శ్రీహరి ఉన్న స్థానమును తెలిసికొని వెంటనే రసాతలమునకు వెళ్ళెను. 1

ఆ రసాతలమున పర్వతాకారముతోనొప్పువాడును, విశ్వవిజేత-యునగు వరాహభగవానుని రాక్షసుడు చూచెను. ఆ వరాహ - భగవానుడు తన కోరలకొనపై భూమిని ధరించి పైకి తెచ్చుచుండెను. ఎర్రనికన్నులకాంతితో ప్రకాశించే భగవానుని శోభ హిరణ్యాక్షుని శోభను తిరస్కరించుచుండెను. వరాహదేవున్ని చూచి, అరే! ఇది

హిరణ్యాక్ష తేజాంసి. అరుణశ్రియా యుక్తం. యత్తేనాక్షానేత్రేణ. ముష్ణంతం తిరస్కుర్వంతం. అహో విచిత్రం. వనగోచరో మృగః. వారిచరో వరాహః. ॥ 2 ॥

వనచర మృగము కదా! అని పరిహసించెను. వనము అనగా అడవి. వనము అనగా నీరు. అడవిజంతువు అని ఒక అర్థము. జలజంతువు అని మరియొక అర్థము. ॥ 2 ॥

శ్లో ॥ ఆహైన మేహ్యజ్ఞ మహీ విముంచ నో
రసౌకసాం విశ్వసృజేయమర్పితా ।
న స్వస్తి యాస్యస్యనయా మమేక్షతః
సురాధమాసాదిత సూకరాకృతే ॥ 3

టీ:- ఆహేతి. ఏహ్యాగచ్ఛ. రసౌకసాం పాతాళవాసినాం. నోస్మాకం. సమర్పితా. అన్యథా పాతాళవతరణమసా న ఘటత ఇతి భావః. హిరణ్యాక్షేణాధిక్షేపార్థం ప్రయుక్తాపి భారతీ వస్తుతో భగవంతం స్తౌతి-తథాహి. వనగోచరః జల శయనః. శ్రీనారాయణః స ఏవ యోగిభిర్మృగ్యత ఇతి మృగః. దుష్టాన్విహంతుం మృగయత ఇతి వా. అజ్ఞః నాస్తి జ్ఞో యస్మాత్ సర్వజ్ఞేత్యర్థః. సురాః అధమాః యస్మాత్. హే సురోత్తమ. మమేక్షమాణస్యాపి సతః మామనాదృత్య అపి త్వమనయా సహ వర్తమానోఽస్మదీయం స్వస్తి సమస్తమంగళం రాజ్యం యాస్యసి ప్రాప్స్యసి. నాత్ర సందేహః. తథాప్యస్మత్కృపయా విముంచేత్యర్థః. ఆసాదితా లీలయా స్వీకృతా సూకరాకృతిర్యేన. ॥ 3 ॥

ఆ హిరణ్యాక్షుడు వరాహభగవానునితో ఇట్లనెను. ఓరీ మూర్ఖా! ఇటు రమ్ము. ఈ భూమిని విడిచిపెట్టుము. పాతాళవాసులమగు మాకు బ్రహ్మ దీనిని అప్పగించినాడు. వరాహరూపములో నున్న దేవతాధమా! నేను చూచుచుండగా నీవీ భూమిని తీసికొని క్షేమముగా వెళ్ళగలవా? 3

శ్లో ॥ త్వం నః సపత్నైరభవాయ కిం భృతో
యో మాయయా హంత్యసురాన్పరోక్షజిత్ ।
త్వాం యోగమాయాబలమల్పపౌరుషం
సంస్థాప్య మూఢ ప్రమృజే సుహృచ్ఛుచః ॥ 4

టీ:– త్వమితి. అభవాయ నాశాయ భృతః పుష్టః. వస్తుతస్తు మోక్షాయ భృతో ధృతః ఆశ్రిత ఇత్యర్థః. యో భవాన్ పరోక్షేణ చౌర్యేణ జయతీతి తథా, వస్తుతస్తు సుదూరత ఏవ స్థిత్వా జయతీతి. సంస్థాప్య హత్వా. వస్తుతస్తు యోగమాయారూపమచింత్యం బలం యస్య. అల్పం పౌరుషం యస్మాత్తం త్వాం. సమ్యక్ స్థాపయిత్వా. భక్త్యా హృది స్థిరీకృత్యేత్యర్థః. హే మూఢ, మూఢాన్ప్రాతి ఆప్యాయయతీతి. తథా. ప్రాపూర్తావితి ధాతుః. సుహృదాం శుచః. సంసార దుఃఖాని మృజే నాశయామి. యతస్త్వం స్తర్మూర్ఖాంధవానపి మోచయసీతి భావః. ॥4

శ్లో ॥ త్వయి సంస్థితే గదయా ఽ శీర్ణశీర్ష
ణ్యస్మద్భుజచ్యుతయా యే చ తుభ్యం ।
బలిం హరంత్యృషయో యే చ దేవాః
స్వయం సర్వే న భవిష్యంత్యమూలాః ॥ 5

ఈ శ్లోకమునకు పైకి తెలియబడే అర్థము ఒకటి, వాస్తవమైన అర్థము మరియొకటి కలదు. మొదటి అర్థము: ఓరీ మూర్ఖా! మా శత్రువులు మమ్ము నాశనము జేయుటకై నిన్ను పోషించినారా! ఏమి? నీవు ఎదుటపడకుండా మాయతో రాక్షసులను సంహరించి విజయము పొందుచున్నావు. నీకు బలము యోగమాయ. నీ పౌరుషము అల్పము. నిన్ను సంహరించి నేను నా మిత్రుల, బంధువుల కన్నీటిని తుడిచి వేయుదును. వాస్తవమైన అర్థము: నీవు అతిమూర్ఖులకు కూడా భక్తి నొసంగి ప్రేమించేవాడవు. నాకు మోక్షము నొసగుటకు దేవతలచే ఆశ్రయింపబడుచున్నావు. నీవు సుదూరమునుండియూ విజయమును సాధింతువు. నీ యోగమాయ, రూపము ఊహకందనిది. నిన్ను భక్తితో హృదయములో స్థాపించుకొందును. సంసారదుఃఖమును నశింపజేసి కొందును. నిన్ను స్మరించువాని బంధువుల దుఃఖమును కూడా నీవు పోగొట్టెదవు. 4

ఈ శ్లోకమునకుకూడా రెండురకములైన తాత్పర్యములు కలవు. మొదటిరకము: నా చేతి నుండి విడుదలయిన గదా ప్రహారముతో నీ శిరస్సు పగులును. నీవు మరణింతువు. నిన్ను ఆరాధించే దేవతలు, ఋషులు మొదలగు వారందరు మూలము (తల్లివేరు) నశించిన

టీ:- త్వయీతి. అస్మద్భుజచ్యుతయాపి గదయా శీర్ణం శీర్షం యస్య. తథాభూతే త్వయి సుఖం సంస్థితే సతి యే తుభ్యమధునా బలిం హరంతి. నవీనాః భక్తాః. యే చ పూర్వభక్తా ఋషయో దేవాశ్చ తే సర్వే స్వయమేవోద్యమం వినైవ. అమూలా న భవిష్యంతి. కింతు దృఢమూలాఏవ భవిష్యంతీత్యర్థః. ॥ 5 ॥

శ్లో ॥ స తుద్యమానోఽరిదురుక్తితోమరైః
దంష్ట్రాగ్రగాం గాముపలక్ష్య భీతామ్ ।
తోదం మృషన్నిరగాదంబుమధ్యాత్
గ్రాహాహతస్సకరేణుర్యథేభః ॥ 6

టీ:- స ఇతి. సః శ్రీహరిః. అరేర్దురుక్తాన్యేవ. తోమరాశ్శస్త్రవిశేషః తైస్తుద్యమానో వ్యథమానః. దంష్ట్రాగ్రగతాం పృథివీం భీతామాలక్ష్య తోదం దురుక్తవ్యథాం. మృషన్ సహమాన ఏవ నిర్గతః. కరేణుః హస్తినీ. వస్తుతస్తు దురుక్తితః అమరైర్నిమిత్తభూతైస్తుద్యమానః. యథా శ్రుతార్థ గ్రాహిణాం బ్రహ్మాదీనాం వ్యథాం దృష్ట్వా అనుకంపయా నిపీడ్యమాన ఇత్యర్థః. తోదం మృషన్నిత్యస్యాప్యయమేవార్థః. ॥ 6 ॥

చెట్టువలె నశించెదరు. రెండవ రకము: నేను ప్రయోగించిన గద వలన నీకు ఏమాత్రము దెబ్బ తగలదు, నీవు సుఖముగా ఉందువు. అందువలన ఇప్పుడు నీకు నైవేద్యాదులను తెచ్చే క్రొత్తవారైన భక్తులు, పూర్వభక్తులైన ఋషులు, దేవతలు వీరందరూ అప్రయత్నముగానే మూలములేనివారుగా కాకుందురు. అనగా మూలము కల వారగుదురని అర్థము. 5

తోమరము అనునది ఒక ఆయుధము. హిరణ్యాక్షుడు శ్రీహరిని పరుషవాక్యములతో నొప్పించెను. ఆ మాటలు 'తోమరము' తో పొడిచినట్లు శ్రీహరిని గాయపరచినవి, పీడను కల్గించినవి. ఆ వరాహభగవానుని కోరలచివర ఉన్న భూదేవి భయపడసాగెను. ఆ భూదేవిని చూస్తూ వరాహభగవానుడు ఆ నొప్పిని సహించెను. ఆడఏనుగుతో ఉన్న మగఏనుగు నీటిలోనున్న మొసలినుండి తప్పించుకొని బయటకు వచ్చినట్లు వరాహభగవానుడు బయటకు వచ్చెను. బ్రహ్మాదిదేవతలకు మేలుచేయుట కొరకై వారియందు దయకలిగినవాడై ఆ నొప్పిని సహించెనని అర్థము. 6

శ్లో ॥ తం నిస్సరంతం సలిలాదనుద్రుతో
హిరణ్యకేశోద్విరదం యథా ఝషః ।
కరాళదంష్ట్రోఽశనినిస్వనోఽబ్రవీద్గత
హ్రియాం కిం త్వసతాం విగర్హితమ్ ॥ 7

టీ:- తమితి. సలిలాన్నిర్గచ్ఛంతమనుగతస్సన్. హిరణ్యవత్కపిశాః కేశా యస్య దేవస్య ఝషో మకరః. కరాళాః తుంగాః దంష్ట్రాః యస్య. అశనివన్నిస్వనో యస్య. నిర్లజ్జానాం అసతాం కిం విగర్హితమస్తి. నిందా భయాభావాత్ పలాయనమయుక్తమిత్యర్థః. వస్తుతస్తు గతహ్రియః ప్రాప్త హ్రియః న సంతో యేభ్యస్తేషాం కృపాళూనాం కిం విగర్హితమ్. న కించిత్. అతః కృపాలుత్వాత్ దంష్ట్రాశ్రిత భూ రక్షణార్థం కించిత్పలాయనమపి న నిందితమిత్యర్థః. యద్వా. లోకోపకారార్థం భువముద్ధరతా. అనుద్రవణమనుచితం మన్యమానో దైత్యతః. ఆత్మాన మధిక్షిపతి. గతహ్రియాం స్వార్థైకపరాణాం అసతామస్మాకం. కిం విగర్హితం గణనాస్తి. అపితు నాస్త్యేవ ధిగస్మానిత్యబ్రవీదిత్యర్థః. 7

హిరణ్యాక్షుడు బంగారురంగు జుట్టును కలిగియుండెను. భయంకరమైన కోరలనుకలిగి పిడుగుపాటువంటి ధ్వనిచేయుచుండెను. నీటినుండి బయటకు వచ్చుచున్న వరాహదేవుని, ఆ హిరణ్యాక్షుడు, మొసలి ఏనుగును వెంబడించినట్లు వెంబడించెను. పారిపోవుట అనే నిందింపదగిన పనిని సిగ్గులేనివారు చేయకుందురా? అంటూ ఆక్షేపించ - సాగెను. ( తన కోరలచివరలో ఉన్న భూమిని రక్షించుటకొరకు పారిపోవుట నిందింపదగిన పని కాదని అర్థము. లోకోపకారము కొరకు భూమిని ఉద్ధరించుట కృపాళువుల లక్షణము కదా! పారిపోవుట సిగ్గుపడదగిన పని యని తలంచుచున్న హిరణ్యాక్షుని నిందను కూడా సహిస్తూ భూమిని ఉద్ధరించుట ఆశ్రితరక్షణకు తార్కాణము.) 7

శ్లో ॥ స గాముదస్తాత్సలిలస్య గోచరే
విన్యస్య తస్యామదధాత్స్వసత్త్వమ్ ।
అభిష్టుతో విశ్వసృజా ప్రసూనైః
ఆపూర్యమాణో విబుధైః పశ్యతోఽరేః ॥ 8

జగత్కర్తయగు బ్రహ్మదేవుడు వరాహభగవానుని స్తుతించు చుండెను. దేవతలు పుష్పవర్షము కురిపించుచుండిరి. ఆ వరాహ - దేవుడు హిరణ్యాక్షుని లెక్కచేయకయే నీటిపైన అనుకూలమైన

టీ:- స ఇతి. స భగవాన్ విశ్వసృజా బ్రహ్మణా. అభిష్టుతః విబుధైశ్చ ప్రసూనైరాపూర్యమాణః. పాఠాంతరే విశ్వసృజాం ప్రసూనైర్విబుధైరభి-ష్టుత ఇతి. సలిలస్యోదస్తాదుపరి. వ్యవహారగోచరే దేశే. గాం పృథివీం విన్యస్య తస్యాం స్వసత్త్వమాధార శక్తిం నిహితవాన్. అరేస్తస్య పశ్యత ఏవ. ॥ 8 ॥

శ్లో ॥ పరానుషక్తం తపనీయోపకల్పం
మహాగదం కాంచనచిత్రదంశమ్ ।
మర్మాణ్యభీక్ష్ణంప్రతుదంతం దురుక్తైః
ప్రచండమన్యుః ప్రహసంస్తం బభాషే ॥ 9

టీ:- పరానుషక్తమితి. పరా పృష్ఠతోఽనుషక్తం లగ్నమ్. తపనీయోప కల్పం సువర్ణాభరణం యస్య.కాంచనమయం చిత్రం దంశః కవచం యస్య తం దైత్యం. ప్రచండమన్యుత్వమధిక్షేపాదికం చానుకరణ మాత్రం. దైత్యవాక్యభీతానాం దేవానాం భయనివృత్తయే. వస్తుతస్తేన తథాఽనుక్తత్వేన. కోపాది హేతుత్వాభావాత్. ॥ 9 ॥

స్థానమున భూమిని నిలిపి దానియందు తన ఆధారశక్తిని ప్రవేశ పెట్టెను. (విశ్వసృజా ప్రసూనైర్విబుధైరభిష్టుత అనే పాఠాంతరము కూడా కలదు.) ॥ 8 ॥

సువర్ణాభరణభూషితుడై, రంగు రంగులతో యున్న బంగారు కవచమును, మహాగదను ధరించిన హిరణ్యాక్షుడు భగవానుని వెంబడిస్తూ పరుషవచనములతో భగవానుని మనస్సుకు పీడను కలిగించుచుండెను. భగవానుడు క్రోధయుక్తుడై నవ్వుతూ వానితో నిట్లనెను. (హిరణ్యాక్షుని మాటలకు భయపడిన దేవతల యొక్క భయ-నివృత్తికై ఇట్లు పలికెను) ॥ 9 ॥

శ్రీ భగవానువాచ

శ్లో ॥ సత్యం వయం భో వనగోచరా మృగా
యుష్మద్విధాన్మృగయే గ్రామసింహాన్ ।
న మృత్యుపాశైః ప్రతిముక్తస్య వీరా
వికత్థనం తవ గృహ్ణంత్యభద్రం ॥ 10

టీ:- సత్యమితి. గ్రామసింహాన్ శునః. ప్రతిముక్తస్య లబ్ధస్య. వికత్థనం శ్లాఘనం. ॥ 10 ॥

భగవానుడు ఇట్లు పలికెను

ఓరీ దుష్టుడా! నిజమే! నేను వనచరమును. అడవిలో తిరిగే జంతువునే. (వనమనగా నీరు అనే అర్థములో జలచరమృగమునే) కాని నీ వంటి కుక్కలను వెదకి పట్టుకొందును. మృత్యుపాశములచే బంధింపబడిన నీ వంటి ఆత్మ స్తుతిపరులను వీరులు లెక్కచేయరు. 10

శ్లో ॥ ఏతే వయం న్యాసహరా రసౌకసాం
గతహ్రియో గదయా ద్రావితాస్తే ।
తిష్ఠామహేऽథాపి కథంచిదాజౌ
స్థేయం క్వ యామో బలినోత్పాద్యవైరం ॥ 11

టీ:- ఏతఇతి. న్యాసహరాః నిక్షేపహరాః. ద్రావితాః పలాయనం కారితాః. అథాప్యసమర్థా అపి తిష్ఠామః. తత్కిమ్. యతః స్థేయం స్థాతవ్యమేవాస్మాభిః. తత్కిమిత్యత ఆహ- క్వ యామః. గంతవ్యదేశాభావాత్. ॥ 11 ॥

ప్రజాపతియగు బ్రహ్మ రసాతలవాసులగు మీ వద్ద దాచిన భూమిని మేము అపహరించుట నిజమే. నీవు గదను చేతబట్టి తరుముతూరాగా మేము పలాయనము చిత్తగించుచున్నాము. పారిపోవుటకు స్థలము లేనందున యుద్ధరంగమునందే యున్నాము. మహాబలశాలివగు నీతో వైరముపెట్టుకొని ఎక్కడకు పోగలము? 11

శ్లో ॥ త్వం పద్రథానాం కిల యూథపాధిపో
ఘటస్వ నోఽస్వస్తయ ఆశ్వనూహః ।
సంస్థాప్య చాస్మాన్ప్రమృజాశ్రు స్వకానాం
యస్స్వాం ప్రతిజ్ఞాం నాతిపిపర్త్యసభ్యః ॥ 12

టీ:- త్వమితి. పద్రథానాం పదాతీనాం యే యూథపాః. తేషామధిపః ముఖ్యఇత్యర్థః. అస్వస్తయే పరాభవార్థం అశు ఘటస్వ యతస్వ అనూహః. నిర్వితర్కః. యో నాతిపిపర్తి స పాలయతీతి వా. అసౌ అసభ్యః. సభాయామనర్హః. ॥ 12 ॥

పాదచారులగు వీరులకు నీవు అధిపతివి కదా! శంకను విడిచి వెంటనే మాకు పరాభవము కలిగించే ప్రయత్నము చేయుము. మమ్ము సంహరించి నీ వారల కన్నీటిని తుడుపుము. చేసిన ప్రతిజ్ఞను పూర్తి చేయనివారు అసభ్యులు. (సభా ప్రవేశార్హతలేని వారు.) ॥ 12 ॥

మైత్రేయ ఉవాచ.

శ్లో ॥ సోఽధిక్షిప్తో భగవతా ప్రలబ్ధశ్చ రుషా భృశమ్ ।
ఆజహారోల్బణం క్రోధం క్రీడ్యమానోఽహిరాడివ ॥ 13

టీ:- సఇతి. సోఽధిక్షిప్తస్సత్యం వయమితి శ్లోకేన. రుషా ప్రలబ్ధశ్చ అపహసితశ్చ. ఏతే వయమితి ద్వాభ్యామ్. క్రీడాం కార్యమాణః. అహిరాట్ మహాసర్ప ఇవ. ॥ 13 ॥

మైత్రేయుడు వలకెను.

హిరణ్యాక్షుడు వరాహభగవానునిచే సత్యం వయమితి అనే 10వ శ్లోకము ద్వారా అధిక్షేపింపబడినవాడాయెను. ఏతే వయం, త్వం పద్రథానాం అనే 11,12 శ్లోకముల ద్వారా వెక్కిరింపబడిన వాడాయెను. వేళాకోళము చేయబడినవాడాయెను. అందుకుగాను హిరణ్యాక్షుడు. ఆటలాడింపబడే నాగరాజువలె భయంకరమగు కోపమును పొందెను.॥13॥

శ్లో ॥ సృజన్నమర్షితః శ్వాసాన్మన్యుప్రచలితేంద్రియః ।
ఆసాద్య తరసా దైత్యో గదయాఽభ్యహనద్ధరిమ్ ॥ 14

టీ:- సృజన్నితి. మన్యునా ప్రచలితాని క్షుభితానీంద్రియాణి యస్య. 14

క్రోధము వలన ఆ హిరణ్యాక్షుని ఇంద్రియములు వణికిపోవుచుండెను. ఆతడు గొప్పనిట్టూర్పులు విడుచుచూ వెంటనే భగవానుని

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో ॥ భగవాంస్తు గదావేగం విసృష్టం రిపుణోరసి ।
అవంచయత్తిరశ్చీనో యోగారూఢఇవాంతకమ్ ॥ 15

శ్లో ॥ పునర్గదాం స్వామాదాయ భ్రామయంతమభీక్ష్ణశః ।
అభ్యధావద్ధరిః క్రుద్ధస్సంరంభాద్దష్టదచ్ఛదమ్ ॥ 16

టీ:- భగవానితి. అంతకం మృత్యుం. ॥ 15,16 ॥

శ్లో ॥ తతశ్చ గదయా చాతిం దక్షిణస్యాం భ్రువి ప్రభుః ।
ఆజఘ్నే న తు తాం సౌమ్య గదయా కోవిదోఽహనత్ ॥ 17

టీ:- తతఇతి. హే సౌమ్య విదుర. తాం గదాం అప్రాప్తామేవ అహనత్. ॥ 17 ॥

శ్లో ॥ ఏవం గదాభ్యాం గుర్వీభ్యాం హర్యక్షో హరిరేవ చ ।
జిగీషయా సుసంరబ్ధావన్యోన్యమభిజఘ్నతుః ॥ 18

టీ:- ఏవమితి. హర్యక్షో హిరణ్యాక్షః. ॥ 18 ॥

సమీపించి గదతో గట్టిగా కొట్టబోయెను. ॥ 14 ॥

కాని, మహాయోగి తన యోగసిద్ధిమహిమతో మృత్యువును వంచించినట్లు, వరాహభగవానుడు తన వక్షఃస్థలమునందు పడ - బోయిన దెబ్బను, ప్రక్కకు తొలగి తప్పించుకొనెను. ॥ 15 ॥

మరల ఆ హిరణ్యాక్షుడు తన గదను తీసికొని మాటిమాటికి త్రిప్పుచుండెను. కోపముతో క్రిందిపెదవిని కొఱుకుచుండెను. వరాహ- భగవానుడు మిక్కిలి కోపడించినవాడై రాక్షసుని వైపు పరుగెత్తెను. 16

వరాహభగవానుడు తన శత్రువైన హిరణ్యాక్షుని కుడికను బొమ్మపై గదతో సాగదీసి కొట్టబోయెను. కాని నేర్పరియగు ఆ రాక్షసుడు ఆ దెబ్బపడక ముందే తన గదతో భగవంతుని గదను అడ్డుకొనెను. 17

ఈ విధముగా పచ్చనికన్నులుగల హిరణ్యాక్షుడు మరియు వరాహభగవానుడు గొప్ప క్రోధముగలవారై జయింపవలెననే కోరికతో బరువైన పెద్దగదలతో ఒకరినొకరు కొట్టుకొనిరి. ॥ 18 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ తయోః స్పృధోస్తిగ్మగదాహతాంగయోః
క్షతాస్రవఘ్రాణవివృద్ధమన్వ్యోః ।
విచిత్రమార్గాంశ్చరతోర్జిగీషయా
వ్యభాదిలాయామివ శుష్మిణోర్మృథః ॥ 19

టీ:- తయోరితి. స్పృధోః స్పర్ధమానయోః. తిగ్మాభ్యాం గదాభ్యాం ఆహతాన్యంగాని యయోః. క్షతాదాస్రవతీతి క్షతాస్రవం రుధిరం. తస్య ఘ్రాణమవఘ్రాణం. తేన వివృద్ధో మన్యుర్యయోః. విచిత్రాన్ మార్గాన్ గదాయుద్ధభ్రమణభేదాన్. ఇళా గౌస్తస్యాం నిమిత్తభూతాయాం. శుష్మిణోః మత్తయోర్వృషభయోః. ప్రస్తుతేஉపి ఇళా పృథ్వీ తదర్థమ్ వృషభౌ హి ఖలు బహూని దినాని సంగ్రథితోత్తుంగ శృంగ సంఘర్షణ విదీర్ణాంగగళ ద్రుధిరౌ. పరస్పరోపమర్దవ్యగ్రోగ్ర సంరంభౌ. చమత్కారిత గజయూథపౌ. యుధ్యమానౌ తిష్ఠత ఇతి ప్రసిద్ధం. ॥ 19 ॥

శ్లో ॥ దైత్యస్య యజ్ఞావయవస్య మాయా
గృహీత వారాహతనోర్మహాత్మనః ।
కౌరవ్య మహ్యాం ద్విషతోర్విమర్దనం
దిదృక్షురాగాదృషిభిర్వృతః స్వరాట్ ॥ 20

ఆ సమయమున వారిద్దరు పరస్పర జయేచ్ఛతో పోటీపడిరి. గదల పదునైన అంచులుతగిలి వారి శరీరములనుండి రక్తము కారుచుండెను. ఆ రక్తము వాసనచూడగానే వారి కోపము మరీమరీ పెరుగుచుండెను. చిత్రవిచిత్రమైన పద్ధతులలో గదాయుద్ధము చేయసాగిరి. భూమి కొరకై సాగుచుండిన పోరు ఆవు కొరకై రెండు మహావృషభములు పోరాడుచున్నట్లుండెను. ॥ 19 ॥

ఓ విదురా! శ్రీహరి యజ్ఞములే అవయములుగా గలవాడు. మాయాశక్తిచే వరాహరూపము గ్రహించినవాడు. పరబ్రహ్మ స్వరూపుడు. అట్టి దేవదేవుడు హిరణ్యాక్షునితో ఇట్లు యుద్ధమునకు తలపడెను. వారిరువురి యుద్ధమును జూచుటకై మరీచ్యాది

శ్లో ॥ ఆసన్న శౌండీర్యమపేతసాధ్వసం
కృతప్రతీకారమహార్యవిక్రమమ్ ।
విలక్ష్య దైత్యం భగవాన్ సహస్రణీః
జగాద నారాయణమాది సూకరమ్ ॥ 21

బ్రహ్మోవాచ

శ్లో ॥ ఏష తే దేవ దేవానామంఘ్రిమూలముపేయుషామ్ ।
విప్రాణాం సౌరభేయీణాం భూతానామప్యనాగసామ్ ॥ 22

టీ:- దైత్యస్యేతి. యజ్ఞా ఏవావయవా యస్య చ. మహ్యాం మహీ నిమిత్తం ద్విషతోః ఏవం విధం విమర్దనం యుద్ధం దిదృక్షుః స్వరాట్ బ్రహ్మా తత్రాగాత్ప్రాప్తః. ఆసన్నేతి. ఆగత్య చ బ్రహ్మా శ్రీనారాయణ మాహ-కిం కృత్వా. దైత్యం విలక్ష్య కథంభూతమ్ ఆసన్నం ప్రాప్తం. శౌండిర్యం మదో యేన తమ్. అపేతం సాధ్వసం యస్మాత్. కృతః ప్రతీకారో యేన. అహార్యః అప్రతిహార్యో విక్రమో యస్య. సహస్రణీః ఋషి సహస్రాణాం నేతా బ్రహ్మా. ఏషఇతి. హే దేవ తే తవ అంఘ్రిమూలం. ప్రాప్తానాం దేవాదీనాం. ఏషోఽసురః.॥20-22 ॥

మహర్షులతో కూడినవాడై బ్రహ్మదేవుడు అచటకు వచ్చెను. ॥ 20 ॥

(బ్రహ్మదేవుడు శ్రీనారాయణమూర్తితో పలుకుచున్నాడు)

వేలకొలది మహర్షులు అనుసరించిరాగా బ్రహ్మదేవుడు హిరణ్యాక్షుని చూచెను. ఆ హిరణ్యాక్షుడు బలగర్వితుడై, భయరహితుడై, దెబ్బకుదెబ్బతీయువాడై ప్రతీకారము చేయుటకు వీలులేని పరాక్రమము గలవాడై పోరుచుండెను. అట్టి దైత్యుని చూచి బ్రహ్మ ఆదివరాహ - నారాయణునితో ఇట్లనెను. ॥ 21 ॥

బ్రహ్మదేవుడు ఇట్లు పలికెను

ఓ దేవా! ఈ రాక్షసుడు, నీ పాదములను శరణుజొచ్చిన దేవతలకు, బ్రాహ్మణులకు, గోవులకు, నిరపరాధులగు ప్రాణులకు భయమును కలిగించుచున్నాడు. ॥ 22 ॥

శ్లో ॥ ఆగస్కృద్భయకృద్దుష్కృదస్మద్రాద్ధవరోఽసురః ।
అన్వేషన్నప్రతిరథో లోకానటతి కంటకః ॥ 23

టీ:- ఆగస్కృదితి. ఆగస్కృత్ వృథైవాపరాధ ఆరోపకః. తత్పరిహారాయ ప్రవృత్తౌ భయకృత్. భీతం జ్ఞాత్వా దుష్కృత్. అర్థప్రాణాది హర్తా. అస్మత్తో రాద్ధో లబ్ధో వరో యేన. అన్వేషన్ ప్రతిరథమవలోకయన్. అప్రతిరథః ప్రతిపక్షశూన్యః. 23

ఈ రాక్షసుడు మేమిచ్చిన వరములను పొందెను. మీ శరణాగతులకు, గోబ్రాహ్మణులకు, నిరపరాధులకు హానిని, భయమును, దుఃఖమును కలిగించుచున్నాడు. సాటిలేని లోకకంటకుడైనాడు. తన్నెదిరించు వీరుని కొరకు వెదకుచు తిరుగుచున్నాడు. ॥ 23 ॥

శ్లో ॥ మైనం మాయావినం దృప్తం నిరంకుశమసత్తమమ్ ।
ఆక్రీడ బాలవద్దేవ యదాశీవిషముత్థితమ్ ॥ 24

టీ:- ఏవమితి. యద్యస్మాదేవం భూతోఽయం తస్మాదేనం మాక్రీడ. హే దేవయథా ఉత్థితం క్షుభితమ్. అశీవిషం సర్పం బాలః పుచ్ఛాకర్షాదినా క్రీడయతి. తద్వత్. 24

ఓ దేవా వీడు మాయావి, గర్విష్ఠి, నిరంకుశుడు. బాలుడు పడగవిప్పిన పాముతో ఆడినట్లు నీవు వీనితో ఎక్కువ సేపు క్రీడింపవద్దు. (24)

శ్లో ॥ న యావదేష వర్ధేత స్వాం వేళాం ప్రాప్య దారుణః ।
స్వాం దేవమాయామాస్థాయ తావజ్జహ్యఘమచ్యుత ॥ 25

టీ:- నేతి. స్వా మాసురీం. హే దేవ! స్వాం మాయాం. అఘం పాపరూపం. ॥ 25 ॥

ఓ దేవా! భయంకరుడగు ఈ హిరణ్యాక్షుడు తమది అయిన అసురవేళలో(సంధ్యాకాలము) మిక్కిలి బలవంతుడగును. అట్లు కాకముందే నీ మాయా శక్తిని ప్రకటించి పాపరూపుడగు వీనిని సంహరించుము. ॥ 25 ॥





శ్లో ॥ ఏషా ఘోరతమా సంధ్యా లోకఛంబట్కరీ ప్రభో ।
ఉపసర్పతి సర్వాత్మన్ సురాణాం జయమావహ ॥ 26

టీ:- వేళామేవాహ-ఏషేతి. లోకానాం ఛంబట్కరీ వినాశకరీ ఛంబ డిత్యవయం వినాశే వర్తతే. ॥ 26 ॥

ప్రభూ! లోకసంహారకారకము, ఘోరతమముయగు సంధ్యా కాలము సమీపించుచున్నది. ఇపుడు దేవతలకు జయమును సమకూర్పుము. (ఛం, ఫట్ అనే అవ్యయము వినాశము అనే అర్థమున ప్రయోగింపబడును.) ॥ 26 ॥

శ్లో ॥ అధునైషోఽభిజిన్నామ యోగో మౌహూర్తికో హ్యగాత్ ।
శివాయ నృస్త్వం సుహృదామాశు నిస్తర దుస్తరమ్ ॥ 27

టీ:- అధునేతి. అభిజిన్మధ్యాహ్నః. స ఏవ మౌహూర్తికో యోగః సన్ ముహూర్తః శుభదః కాలః. అగాద్గతప్రాయః. అతో యావ న్ముహూర్త శేషోఽస్తి. తావదేవాశు హత్వా. దుస్తరమేనం. నిస్తర జహి. ॥ 27 ॥

దేవా! ఈ సమయములో అభిజిత్తు అను మంగళముహూర్తము ఉన్నది. (అభిజిత్తు సూర్యోదయము నుండి నాల్గవ లగ్నము, మధ్యాహ్న కాలము) అందువలన ఇపుడు నీ భక్తుల క్షేమము కొరకు ఈ అభిజిన్ముహూర్తశేషముననే దుర్జయుడగు రాక్షసుని సంహరింపుము. 27

శ్లో ॥ దిష్ట్యా త్వాం విహితం మృత్యుమయమాసాదితస్స్వయమ్।
విక్రమ్యైనం మృధే హత్వా లోకానాధేహి శర్మణి ॥ 28

టీ:- ద్విష్ట్యేతి. త్వాం మృత్యుం. త్వయైవ శాపానుగ్రహకాలే. విహితం నిర్మితం. ఆసాదితః ప్రాప్తః శర్మణి సుఖే ఆధేహి ఆస్థాపయ. ॥ 28 ॥

ఓ దేవా శాపానుగ్రహకాలమున వీనికి నీవే మృత్యుస్వరూపముగ నిర్ణయింపబడితివి. కాలవశాన ఇప్పుడీ రాక్షసుడు నిన్నే చేరినాడు. అందువలన బలమును చూపి వీనిని చంపుము. లోకములకు సుఖమును కలిగించుము. ॥ 28 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే, హిరణ్యాక్షవధే అష్టాదశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు

ఏకోనవింశో౾ధ్యాయః

శ్లో॥ ఊనవింశే విరించ్యాది ప్రార్థితేన మహామృధే ।
వరాహేణ హిరణాక్ష్యవధశ్లాఘ్యో౾ను వర్ణ్యతే ॥

మైత్రేయ ఉవాచ

శ్లో॥ అవధార్య విరించస్య నిర్వ్యళీకామృతం వచః ।
ప్రహస్య ప్రేమగర్భేణ తదపాంగేన సో౾గ్రహీత్ ॥ 1

టీ:- అవధార్యేతి. నిర్వ్యళీకం చ తదమృతం చ. పాఠాంతరే. నిష్కపటాభిప్రాయం చ తదృతం చ. కాలాత్మనో౾పి మమ ముహూర్త బలం ఉపదిశతీతి. ప్రహస్య. అపాంగావలోకనేనైవ. స్వీకృతవాన్. 1

శ్లో॥ తతస్సపత్నం ముఖతశ్చరం తమకుతో భయమ్ ।
జఘానోత్పత్య గదయా హనావసురమక్షజః ॥ 2

టీ:- తత ఇతి. ముఖతో౾భిముఖే. హనౌ కపోలస్యాధోభాగే. అక్షజః బ్రహ్మణః ఘ్రాణేంద్రియాదావిర్భూతః. ॥ 2 ॥

పద్దెనిమిదవ అధ్యాయము సమాప్తము

19 వ అధ్యాయము

ఈ పందొమ్మిదవ అధ్యాయమున దేవతల ప్రార్థననుసరించి వరాహభగవానుడు మహాయుద్ధములో హిరణ్యాక్షుని వధించుట అను విషయము వర్ణింపబడినది.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను

బ్రహ్మయొక్క నిష్కపటములు, అమృతమువంటి మాటలు విని వరాహదేవుడు నవ్వెను. (కాలస్వరూపుడనగు నాకే ముహూర్త విషయము చెప్పుచున్నాడని నవ్వుట). ప్రేమతో నిండిన కటాక్షముతో బ్రహ్మను చూచి ఆయన మాటను అంగీకరించెను. 1

బ్రహ్మదేవుని ఘ్రాణేంద్రియమునుండి పుట్టిన వరాహ-భగవానుడు తన ఎదుటనే హిరణ్యాక్షుడు తిరుగుతూ యుద్ధము చేయుచుండుటను చూచెను. అపుడా శ్రీహరి పైకెగిరి తనశత్రువగు రాక్షసుని దౌడపై గదతో కొట్టెను. 2

శ్లో ॥ సా హతా తేన గదయా విహతా భగవత్కరాత్ ।
విఘూర్ణితాఽపతద్రేజే తదద్భుతమివాభవత్ ॥ 3

టీ:- సేతి. సాస్వ గదయా తేన హతా తతో విహతా విచ్యుతా సతీ. విఘూర్ణితా భూత్వా అపతత్ రేజే చ. తత్ భగవత్కరాత్పతనమ్. యద్వా - తత్పదస్యావృత్త్యా రేజే ఇత్యనేనాపి సంబంధః. తద్దైత్యస్య పౌరుషం రేజ ఇతి. ॥ 3 ॥

హిరణ్యాక్షుడు తన గదతో భగవంతుని గదను కొట్టగా అది గిరగిర తిరిగెను. భగవానుని చేతినుండి జారిపడి ప్రకాశించెను. హిరణ్యాక్షుని పరాక్రమము శోభిల్లెను. అట్లగుట అక్కడున్న వారందరికి ఆశ్చర్యము కలిగించెను. ॥ 3 ॥

శ్లో ॥ స తదా లబ్ధతీర్థోఽపి న బబాధే నిరాయుధమ్ ।
మానయన్ స మృధే ధర్మం విష్వక్సేనం ప్రకోపయన్ ॥ 4

టీ:- సఇతి. లబ్ధతీర్థో లబ్ధావసరః. స చ నబబాధే. వేగేన న ప్రాహరత్. స మానయన్ బభూవేతి వాక్యభేదాత్స ఇత్యస్యాపౌనరుక్త్యం. 4

భగవానునిచేతిలో అస్త్రములేని ఆ సమయాన అవకాశ-మున్నను హిరణ్యాక్షుడు యుద్ధ ధర్మమును గౌరవించి గదను ప్రయోగించలేదు. (వాక్య భేదమునుసరించి సః అని రెండుమార్లు ప్రయోగింప బడినను పునరుక్తి కాదు.) భగవానుడు తిరిగి అస్త్రధారి యగుటకు అవకాశమిచ్చెను. శ్రీహరికి క్రోధము కలిగించుటయే హిరణ్యాక్షుని ఉద్దేశ్యము. ॥ 4 ॥

శ్లో ॥ గదాయామపవిద్ధాయాం హాహాకారే వినిర్గతే ।
(మాభైష్టేతి సురానుక్త్వా భగవాన్ సమవస్థితః) ।
మానయామాస తద్ధర్మం సునాభం చాస్మరద్విభుః ॥ 5

వరాహభగవానుని చేతినుండి గద జారిపోగానే దేవతలు హాహాకారములు చేసిరి. శ్రీహరి, హిరణ్యాక్షుని యుద్ధధర్మమును ప్రశంసించెను. సుదర్శన చక్రమును స్మరించెను. ॥ 5 ॥

శ్లో ॥ తం వ్యగ్రచక్రం దితిపుత్రాధమేన
స్వపార్షదముఖ్యేన విషజ్జమానమ్ ।
చిత్రావాచోऽతద్విదాం ఖేచరాణాం
తత్రస్మాసన్ స్వస్తి తేऽముం జహీతి ॥ 6

టీ:- తమితి. వ్యగ్రం ససంభ్రమం చక్రం యస్య. విషజ్యమానం విశేషేణ సంగం ప్రాప్నువంతం ప్రతి. అతద్విదాం తత్ప్రభావమజా - నతాం. ఆసమంతాదాసన్ స్మ జాతాః. ॥ 5-6 ॥

సుదర్శనచక్రము భగవానునిచేతిలో తిరుగుచుండెను. భగవానుడు మాత్రము తనకు ముఖ్యపార్షదుడు, దైత్యాధముడునగు హిరణ్యాక్షునితో యుద్ధక్రీడను చేయుచుండెను. అపుడు ఆకాశము నుండి యుద్ధమును చూచుచున్న దేవతలు భగవానుని మహిమ తెలియనివారై, "నీకు జయమగు గాక! వీనిని సంహరింపుము" అని అనేక రకములుగా పలుకుచుండిరి. ॥ 6 ॥

శ్లో ॥ స తం నిశామ్యాత్త రథాంగమగ్రతో
వ్యవస్థితం పద్మపలాశలోచనమ్ ।
విలోక్య చామర్షపరిప్లుతేంద్రియో
రుషా స్వదంతచ్ఛదమాదశచ్ఛ్వసన్ ॥ 7

టీ:- సఇతి. స దైత్యస్తమాత్తచక్రం. నిశామ్య దృష్ట్వా అగ్రతో వ్యవస్థితం చ విలోక్య. అమర్షేణ క్రోధేన. పరిప్లుతాని క్షుభితానీంద్రియాణి యస్య సః. అదశత్ దష్టవాన్. ॥ 7 ॥

హిరణ్యాక్షుడు, పద్మపత్రనేత్రుడగు భగవానుడు చక్రమును చేతబట్టి తనఎదుట నిలిచియుండుటను చూచెను. ఆ రాక్షసులు అవయవములన్నియు భయంకరమగు క్రోధముచే వణుకుచుండెను. పెద్దనిట్టూర్పులు విడుచుచు దంతములతో తన పెదవులను కొఱుకు చుండెను. ॥ 7 ॥

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

శ్లో ॥ కరాళ దంష్ట్రశ్చక్షుర్భ్యాం సంచక్షాణో దహన్నివ ।
అభిప్లుత్య స్వగదయా హతోఽసీత్యహనద్ధరిమ్ ॥ 8

టీ:- కరాళేతి. చక్షుర్భ్యాం దహన్నివ. సంచక్షాణః పశ్యన్ ఇవేతి. వస్తుతః క్రోధాభావమాహ-హతోఽసి జ్ఞాతోఽసీతి వాస్తవార్థః.॥8॥

భయంకరమగు కోరలుగల హిరణ్యాక్షుడు ఎఱ్రని కన్నులతో, దహించుచున్నాడాయన్నట్లు చూస్తూ భగవానుని పైకి ఎగిరి, "ఇదిగో చచ్చితివి" అంటూ తనగదతో కొట్టెను. (వాస్తమునకు క్రోధభావముతో "నీవు నన్ను గుర్తించినావు" అని హిరణ్యాక్షుని అంతర్భావము) క్రోధాభావమును చెప్పుచున్నాడు. హతోసి - చచ్చితివి అని అన్నప్పటికి, నేను నిన్ను గుర్తించినాను. లేదా నీవు నాచే గుర్తించబడ్డావు అని వాస్తవార్థము. ॥ 8 ॥

శ్లో ॥ పదా సవ్యేన తాం సాధో భగవాన్ యజ్ఞసూకరః ।
లీలయా మిషతశ్శత్రోః ప్రాహరద్వాతరం హసమ్ ॥ 9

టీ:- పదేతి. వాతరం హసం వాయువేగామ్. ॥ 9 ॥

ఓ విదురా! యజ్ఞవరాహభగవానుడు వాయువేగము గలిగిన ఆ గదను తన శత్రువు చూచుచుండగనే తన ఎడమ కాలితో అవలీలగా క్రిందపడవేసెను. ॥ 9 ॥

శ్లో ॥ ఆహ చాయుధమాధత్స్వ ఘటస్వ త్వం జిగీషసి ।
ఇత్యుక్తః స తదా భూయస్తాడయన్ వ్యనదద్ భృశమ్ ॥ 10

టీ:- ఆహేతి. ఘటస్వ ఉద్యమం కురు. యతస్త్వం జేతుమిచ్ఛసి. 10

"నీవు జయింపగోరుచున్నావు. కనుక ఆయుధమును తీసికొని మరల ప్రయత్నించుము." అని వరాహభగవానుడు హిరణ్యాక్షునితో పలికెను. ఆ రాక్షసుడు మరల కొట్టుచూ బిగ్గరగా గర్జించెను. 10

శ్లో ॥ తాం స ఆపతతీం వీక్ష్య భగవాన్ సమవస్థితః ।
జగ్రాహ లీలయా ప్రాప్తం గరుత్మానివ పన్నగీమ్ ॥ 11

తన పైకి వచ్చుచున్న ఆ గదను చూచి భగవానుడు, ఎదుటికి వచ్చిన ఆడపామును గరుత్మంతుడు విలాసముగ పట్టుకొన్నట్లు పట్టుకొనెను. ॥ 11 ॥

శ్లో ॥ స్వపౌరుషే ప్రతిహతే హతమానో మహాసురః ।
నైచ్ఛద్గదాం దీయమానాం హరిణా విగతప్రభః ॥ 12

టీ:- స్వేతి. హతో మానో గర్వో యస్య సః. ॥ 11-12 ॥

తన పరాక్రమము విఫలముకాగా, ఆ మహారాక్షసుని (గర్వము) అభిమానము దెబ్బతినెను. వాని ముఖములో కాంతి తగ్గెను. శ్రీహరి ఇచ్చే గదను స్వీకరించుటకు ఇష్టపడలేదు. ॥ 12 ॥

శ్లో ॥ జగ్రాహ త్రిశిఖం శూలం జ్వలజ్జ్వలనలోలుపమ్ ।
యజ్ఞాయ ధృతరూపాయ విప్రాయాభిచరన్యథా ॥ 13

టీ:-- జగ్రాహేతి. జ్వలన్ యో జ్వలనః. తద్వల్లోలుపం. సంగ్రసనవ్యగ్రం. యజ్ఞాయ విష్ణుమాలక్ష్య. అకార్యకరత్వే దృష్టాంతః. విప్రముద్దిశ్య అభిచరన్. అభిచారం కుర్వన్ యథా. ॥ 13 ॥

బ్రాహ్మణుని సంహరించుటకై దుష్టమానవుడు అభిచారకర్మకు పూనుకొనినట్లు హిరణ్యాక్షుడు త్రిశూలము పట్టుకొని వరాహ భగవానునిపై ప్రయోగించెను. దాని కొనలు మండుచు ముందుకు ఉరుకుచున్నావా యన్నట్లుండెను. (బ్రాహ్మణునిపై ప్రయోగించిన అభిచారకర్మ నిష్ఫలమగును. అట్లే రాక్షసప్రయత్నము విఫలమని అభిప్రాయము.) ॥ 13 ॥

శ్లో ॥ తదోజసా దైత్యమహాభటార్పితం
చకాసదంతః ఖ ఉదీర్ణదీధితి ।
చక్రేణ చిచ్ఛేద నిశాతనేమినా
హరిర్యథా తార్క్ష్యపతత్రముజ్ఝితమ్ ॥ 14

మహావీరుడగు హిరణ్యాక్షుడు విసిరిన త్రిశూలము ఆకాశమున కాంతులు గ్రక్కుతూ తీక్షణముగా ప్రకాశించుచుండెను. అమృత కలశమును తెచ్చేవేళ గరుత్మంతునిపై ఇంద్రుడు వజ్రాయుధమును

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- తదితి. అంతః ఖే ఆకాశమధ్యే. చకాసత్ప్రకాశమానమ్. ఉదీర్ణా ఉత్కటా దీధితిర్దీప్తిః యస్య. నిశాతనేమినా శితధారేణ. హరిః. ఇంద్రో యథా. తార్క్ష్యస్య పతత్త్రం ఉజ్ఝితం చిచ్ఛేద. పురా ఖలు దేవాన్ నిర్జిత్య అమృతకలశం నయతా గరుడేన ఇంద్రప్రయుక్తస్య వజ్రస్య అమోఘస్య. మానం దాతుం పిచ్ఛమేకం త్యక్తం తద్యథా ఇంద్రశ్చిచ్ఛేద. ఛిన్నం చ తత్. యథా ఖే ప్రకాశతే. తద్వద్ప్రకాశమానమిత్యభి సంబంధః (14)

ప్రయోగించెను. వజ్రాయుధము అమోఘము. ఆ వజ్రాయుధమును గౌరవింపదలచిన గరుడుడు తన రెక్కను ఒకదానిని విడిచెను. వజ్రాయుధము ఆ రెక్కను ముక్కలు చేసెను. అట్లే వరాహ భగవానుడు తన చక్రముతో రాక్షసుడు ప్రయోగించిన త్రిశూలమును విరుగగొట్టెను. ॥14॥

శ్లో ॥ వృక్ణే స్వశూలే బహుధాఽరిణా హరేః
ప్రత్యేత్య విస్తీర్ణమురో విభూతిమత్ ।
ప్రవృద్ధరోషస్స కఠోరముష్టినా
నదన్ ప్రహృత్యాంతరధీయతాసురః ॥ 15

టీ:- వృక్ణ ఇతి. అరాస్సంత్యస్యేతి అరిచక్రం. తేన బహుధా వృక్ణే ఛిన్నే సతి ప్రత్యేత్య అభిముఖమాగత్య. హరేః ఉరో వక్షః ప్రహృత్య. 15

వరాహభగవానుని చక్రము రాక్షసుని త్రిశూలమును ముక్కలు ముక్కలు చేసెను. అందుకు హిరణ్యాక్షుడు పెరుగుచున్న కోపము గలవాడయి భగవానుని ఎదుటకు వచ్చి, లక్ష్మీదేవికి ఆశ్రయమైన, విశాలమైన వక్షఃస్థలమునందు తన కఠినమైన పిడికిలితో గుద్దెను. తరువాత గర్జించి మాయమయ్యెను. ॥ 15 ॥

శ్లో ॥ తేనేత్థమాహతః క్షత్తర్భగవానాది సూకరః ।
నాకంపత మనాక్క్వాపి స్రజా హత ఇవ ద్విపః ॥ 16

టీ:- తేనేతి. మనాగీషత్. నాకంపత. క్వాప్యంగే. ॥ 16 ॥

ఓ విదురా! ఆదివరాహదేవుని హిరణ్యాక్షుడీవిధముగా కొట్టగా ఆ శ్రీహరి పూలమాలచే కొట్టబడిన ఏనుగు వలె నుండెను. దేహములో ఏ మాత్రము మార్పు రాలేదు. ఏ మాత్రము చలించలేదు. ॥ 16 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ అథోరుధాసృజన్మాయాం యోగమాయేశ్వరే హరౌ ।
యాం విలోక్య ప్రజాస్త్రస్తా మేనిరేఽస్యోప సంయమమ్ ॥17

టీ:- అథేతి. అస్య జగతః. ఉపసంయమం ప్రళయం. ॥ 17 ॥

తరువాత ఆ రాక్షసుడు యోగమాయకు అధిపతియగు వరాహ భగవంతునిపై రకరకములైన మాయలను ప్రయోగించెను. ఆ మాయలను చూచిన ప్రజలు జగత్తునకు ప్రళయము రాబోవుచున్నదని భావించిరి. ॥ 17 ॥

శ్లో ॥ ప్రవవుర్వాయవశ్చండాస్తమః పాంసవమైరయన్ ।
దిగ్భ్యో నిపేతుర్గ్రావాణః క్షేపణైః ప్రహితా ఇవ ॥ 18

టీ:- ప్రవవురితి. పాంసుకృతం తమశ్చ ప్రేరితవంతః. క్షేపణైర్యంత్రైః (18)

వెంటనే ప్రబలమైన గాలులు వీచినవి. ఆ గాలులచే లేచిన దుమ్ముచేత దిక్కులన్నియు చీకటిమయములైనవి. క్షిపణి యంత్రములచే (వేగముగా, శక్తివంతముగా విసిరే యంత్రము) విసిరి వేయబడుచున్నట్లు నాలుగు దిక్కులా రాళ్ళు కురిసినవి. ॥ 18 ॥

శ్లో ॥ ద్యౌర్నష్టభగణా భ్రౌఘైః సవిద్యుత్స్తనయిత్నుభిః ।
వర్షద్భిః పూయ కేశా సృగ్విణ్మూత్రాస్థీని చాసకృత్ ॥ 19

టీ:- ద్యౌరితి. నష్టో భగణో నక్షత్రసమూహో యస్యాం సా. అనేన దైత్యబలాతిరేకాద్బ్రహ్మదత్తముహూర్తాతిక్రమోఽవగమ్యతే. అహ్ని నక్షత్రాణామసంభవాత్. ॥ 19 ॥

ఆకాశము ఉరుములతో గూడిన మేఘముల గుంపులతో నిండియుండెను. నక్షత్రసమూహములు కనపబడకుండెను. ఆ మేఘముల నుండి పలుమార్లు చీము, వెంట్రుకలు, రక్తము, మలమూత్రములు, ఎముకలు కురియుచుండెను. నక్షత్రములు కానరాకుండుట చేత, రాక్షస బలము పెరుగుటచేత, అసురవేళ (సంధ్యాసమయము) సమీపించినట్లును, బ్రహ్మ తెలిపిన ముహూర్తము దాటిపోయినట్లు తోచెను. ॥ 19 ॥

శ్లో ॥ గిరయః ప్రత్యదృశ్యంత నానాయుధముచో౽నఘ ।
దిగ్వాససో యాతుధాన్యః శూలిన్యో ముక్తమూర్ధజాః ॥ 20

టీ:- గిరయఇతి. నానాయుధాని విముంచంతీతి తథా. యాతుధాన్యశ్చ ప్రదృశ్యంత. ॥ 20 ॥

ఓ పాపరహితుడవైన విదురా! పర్వతములు నానావిధములగు ఆయుధములను వర్షించుచుండెను (ప్రయోగించుచుండెను). రాక్షస స్త్రీలు దిగంబరులై జుట్టు విరబోసుకొని కనిపించిరి. ॥ 20 ॥

శ్లో ॥ బహుభిర్యక్ష రక్షోభిః పత్త్యశ్వరథ కుంజరైః ।
ఆతతాయిభిరుత్సృష్టా హింస్రా వాచో౽తివైశసాః ॥ 21

టీ:- బహుభిరితి. ఛింధి భింధీత్యేవం భూతాః. అతివైశసాః అత్యుగ్రా. వాచ ఉత్సృష్టా ఇత్యేవమత్ర వాక్యసమాప్తిః. ॥ 21 ॥

అసంఖ్యాకములగు కాల్బలము, అశ్వదళము, గజదళము, యక్షులు, రాక్షసులు "చంపుము,నరుకుము" అనుచు మిక్కిలి క్రూరమైన, హింసాయుతములైన మాటలు పలుకసాగిరి. ॥ 21 ॥

శ్లో ॥ ప్రాదుష్కృతానాం మాయానామాసురీణాం వినాశయత్ ।
సుదర్శనాస్త్రం భగవాన్ ప్రాయుఙ్క్త దయితం త్రిపాత్ ॥ 22

టీ:- ప్రాదుష్కృతానామితి. ప్రకటితా మాయా వినాశయత్ వినాశనమితి పాఠే. యథా శ్రుతైవ షష్ఠీ. త్రిపాత్ త్రీణి సవనాని పాదా యస్య. యజ్ఞమూర్తిరిత్యర్థః. శ్రు.'త్రయోస్య పాదా'ఇతి శ్రుతేః (22)

భగవానుడు తపస్సు, సత్యము, దయ అనెడి మూడు పాదములు గల ధర్మస్వరూపుడు. ("త్రయోస్య పాదా" అనే వేద వచనము ప్రకారము) యజ్ఞస్వరూపుడు. ఇట్టి వరాహభగవానుడు హిరణ్యాక్షుడు ప్రకటించిన మాయను నాశనము చేయుటకు గాను తనకు ప్రియమైన సుదర్శనచక్రమును ప్రయోగించెను. ॥ 22 ॥

శ్లో ॥ తదాదితేః సమభవత్సహసా హృది వేపథుః ।
స్మరంత్యా భర్తురాదేశం స్తనాచ్చాసృక్ ప్రసుస్రువే ॥ 23

టీ:- తదేతి. భర్తురాదేశం. త్వపుత్రౌ భగవాన్ హనిష్యతీత్యేవం భూతమ్. 23

అప్పుడు తన భర్తయగు కశ్యపుడు చెప్పిన మాటలు దితి స్మరించెను. శ్రీనారాయణుడు నీ కుమారులనిరువురిని సంహరించును అనే మాటలు గుర్తుకురాగానే ఆమె హృదయములో వణుకు పుట్టి స్తనముల నుండి రక్తము స్రవించెను. ॥ 23 ॥

శ్లో ॥ వినష్టాసు స్వమాయాసు భూయశ్చావ్రజ్య కేశవమ్ ।
రుషోపగూహమానోఽముం దదృశేఽవస్థితం బహిః ॥ 24

టీ:- వినష్టాస్వితి. ఉపగూహమానః బాహ్వోరంతరే నిధాయ సంఘట్టయన్. ॥ 24 ॥

తనమాయాజాలము నశించుట జూచి హిరణ్యాక్షుడు భగవానుని వద్దకు వెళ్ళెను. మిక్కిలి కోపముతో వరాహభగవానుని తన కౌగిటిలో బంధించి నలిపివేయవలెనని ప్రయత్నించెను. కాని ఆ శ్రీహరి వాని కౌగిలి బయటనే కన్పించెను. ॥ 24 ॥

శ్లో ॥ తం ముష్టిభిర్వినిఘ్నంతం వజ్రసారైరధోక్షజః ।
కరేణ కర్ణమూలేఽహన్ యథా త్వాష్ట్రం మరుత్పతిః ॥ 25

టీ:- తమితి. అహన్ జఘాన. త్వాష్ట్రం వృత్రం. మరుత్పతిరింద్రః (25)

హిరణ్యాక్షుడు వజ్రము వంటి కఠినమైన పిడికిలితో వరాహదేవుని గట్టిగా కొట్టుచుండెను. ఇంద్రుడు వృత్రాసురుని కొట్టినట్లు భగవానుడు తన చేతితో హిరణ్యాక్షుని కణతపై కొట్టెను. ॥ 25 ॥

శ్లో ॥ స ఆహతో విశ్వజితాహ్యవజ్ఞయా
పరిభ్రమద్గాత్ర ఉదస్త లోచనః ।
విశీర్ణబాహ్వంఘ్రి శిరోధరోఽపతత్
యథా నగేంద్రో లులితో నభస్వతా ॥ 26

టీ:- సఇతి. పరితోభ్రమద్గాత్రం శరీరం యస్య సః. ఉదస్తే బహిర్నిర్గతే లోచనే యస్య సః. విశీర్ణాః బాహ్వాదయో యస్య. నగేంద్రో మహాద్రుమః లులితః ఉన్మూలితః. నభస్వతా వాయునా. ॥ 26 ॥

వరాహ భగవానుడు హిరణ్యాక్షుని ఈ విధముగా ఉపేక్షా భావముతో కొట్టినంత మాత్రముననే వాని శరీరము గిరగిర తిరుగ సాగెను. కన్నులు బయటకు వచ్చెను. వాని కాళ్ళు, చేతులు బలహీన ములయ్యెను(శిథిలమయ్యెను). జుట్టు చెల్లాచెదురయ్యెను. ఆ రాక్షసుడు తుఫాను చేత పెకిలించివేయబడ్డ మహావృక్షము వలె నేలపై కూలెను. ॥ 26 ॥

శ్లో ॥ క్షితౌ శయానం తమకుంఠవర్చసం
కరాళ దంష్ట్రం పరిదష్టదచ్ఛదమ్ ।
అజాదయో వీక్ష్య శశంసురాగతా
అహో ఇమాం కోనుఽలభేత సంస్థితి ॥ 27

టీ:- క్షితావితి. సంస్థితిం మృత్యుమ్. ॥ 27 ॥

మొక్కవోని తేజస్సుగలవాడు, భయంకరములైన వాడికోరలు గలవాడు, దంతములతో పెదవిని కొఱుకుచున్నవాడు అయిన హిరణ్యాక్షుని అక్కడకు వచ్చినబ్రహ్మాది దేవతలు చూచిరి. "ఆహా! ఏమి ఆశ్చర్యము. ఇట్టి మరణము ఎవరికి లభించును?" అని పొగడసాగిరి. ॥ 27 ॥

శ్లో ॥ యం యోగినో యోగ సమాధినా రహో
ధ్యాయంతి లింగాదసతో ముముక్షయా ।
తస్యైష దైత్య ఋషభః పదా హతో
ముఖం ప్రపశ్యంస్తనుముత్ససర్జ హ ॥ 28

యోగులు అసత్యమైన, లింగశరీరము నుండి విముక్తిని కోరువారై యోగసమాధినవలంబించి ఏకాంతమున శ్రీవిష్ణు భగవానుని ధ్యానించెదరు. అట్టి విష్ణుభగవానుడే స్వయముగా తన కాలితో దైత్యశ్రేష్ఠుడగు హిరణ్యాక్షుని తన్నగా వాడు ఆ దేవదేవుని ముఖము

టీ:- యమితి. అసతః ఆరోపితాత్ లింగాచ్ఛరీరాత్. మోక్తుమిచ్ఛయా. వరాహస్య పూర్వపాదయోరేవ కరత్వాత్. కరేణ నిహన్నితి. పదా హత ఇతి వా అవిరుద్ధం. ॥ 28- 29 ॥

శ్లో ॥ ఏతౌ తౌ పార్షదావస్య శాపాద్యాతావసద్గతిమ్ ।
పునః కతిపయైః స్థానం ప్రపత్స్యేతేహ జన్మభిః ॥ 29

దేవా ఊచుః

శ్లో ॥ నమోనమస్తేఽఖిల యజ్ఞతంతవే
స్థితౌ గృహీతామల సత్త్వమూర్తయే ।
దిష్ట్యాహతోఽయం జగతామరుంతుదః
త్వత్పాదభక్త్యా వయమీశ నిర్వృతాః ॥ 30

టీ:- నమోనమఇతి. అఖిలయజ్ఞానాం తంతవే అతివిస్తారకాయ కారణాయేతి వా. అరుంతుదః మర్మభేత్తా. ॥ 30 ॥

చూస్తూ ప్రాణములు విడిచెను. యోగులు మరణకాలమున భగవంతుని స్మరణను కోరుకొందురు. వీడు సాక్షాత్ భగవంతుని చూస్తూ భగవంతుని చేత మరణించెను కదా! వీడెంతటి అదృష్టవంతుడో కదా! పోయిన శ్లోకములలో చేయితో కణత మీద కొట్టినట్లు చెప్పబడినది. ఇప్పుడు కాలితో తన్నినట్లు చెప్పబడినది. వరాహము యొక్క నాల్గు కాళ్ళతో ముందటి రెండు కాళ్ళు చేతులే. కనుక ఏ విరోధభావము లేదు. 28

ఈ హిరణ్యాక్ష హిరణ్యకశిపులిరువురు భగవానుని పార్షదులుగా నుండిన జయ విజయులే. బ్రాహ్మణ శాపముచే రాక్షస జన్మను పొందినారు. వారు ఇట్టి కొన్ని జన్మల తరువాత మరల తమ స్థానమును పొందుదురు. ॥ 29 ॥

దేవతలు ఇట్లు పలికిరి

ఓ దేవా! నీవు సర్వయజ్ఞములకు కారణుడవైయున్నావు. నీవు లోక సంరక్షణకై రజస్తమోగుణములు లేని శుద్ధసత్త్వమయమగు అవతారములను స్వీకరించితివి. నీకు అనేక నమస్కారములు. జగత్కంటకుడైన ఈ హిరణ్యాక్షుడు నీ చేత సంహరింపబడినాడు. మేము నీ పాదపద్మముల యందు భక్తి కలిగి పరమశాంతిని

పొందినాము.॥ 30 ॥

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఏవం హిరణ్యాక్షమసహ్యవిక్రమం
సం సాదయిత్వా హరిరాదిసూకరః ।
జగామ లోకం స్వమఖండితోత్సవం
సమీడితః పుష్కరవిష్టరాదిభిః ॥ 31

టీ:- ఏవమితి. సంసాదయిత్వా హత్వేత్యర్థః. పుష్కరవిష్టరాదిభిః బ్రహ్మాదిభిస్సంస్తుతః. ॥ 31 ॥

మైత్రేయుడు ఇట్లు పలికెను

ఓ విదురా! సహింపరాని పరాక్రమము గల హిరణ్యాక్షుని ఆదివరాహరూపియగు శ్రీహరి ఇట్లు సంహరించెను. కమలాసనుడగు బ్రహ్మ మొదలగువారు ఆయనను చక్కగా స్తుతించిరి. అపుడాయన నిరంతరోత్సవము గల తన లోకమగు వైకుంఠమునకు వెళ్ళెను. 31

శ్లో॥ మయా యథాఽనూక్తమవాది తే హరేః
కృతావతారస్య సుమిత్ర చేష్టితమ్ ।
యథా హిరణ్యాక్ష ఉదార విక్రమో
మహామృధే క్రీడనవన్నిరాకృతః ॥ 32

టీ:- మయేతి. యథానూక్తం గురూక్తిమనతిక్రమ్య. మయా అవాది. తే తవ కథితమ్. హే సుమిత్ర విదుర యథా యేన ప్రకారేణ. ॥ 32॥

ఓ విదురా! విష్ణు భగవానుడు, మహాపరాక్రమవంతుడగు హిరణ్యాక్షునితో, గొప్ప యుద్ధముచేసి ఆటబొమ్మను ఆడించినట్లు ఆడించి పడగొట్టి సంహరించెను. ఆ లీలలను నేను మా గురువులు చెప్పిన దానినతిక్రమించకుండగ నీకు వివరించితిని. ॥ 32 ॥

సూత ఉవాచ

శ్లో॥ ఇతి కౌషారవాఖ్యాతామాశ్రుత్య భగవత్కథామ్ ।
క్షత్తానందంపరం లేభే మహాభాగవతో ద్విజ ॥ 33

టీ:- ఇతీతి. హే ద్విజ శౌనక. ॥ 33 ॥

సూతుడు ఇట్లు పలికెను

ఈ విధముగా మైత్రేయమహర్షి శ్రీహరి (భగవానుని) గాథను వర్ణించి చెప్పగా, భగవద్భక్తుడగు విదురుడు విని గొప్పఆనందమును

శ్లో ॥ అన్యేషాం పుణ్యశ్లోకానాముద్దామయశసాం సతామ్ ।
ఉపశ్రుత్య భవేన్మోదః శ్రీవత్సాంకస్య కిం పునః ॥ 34

టీ:- అన్యేషామితి. అన్యేషాం కథాముపశ్రుత్య భక్తిమాత్రేణాసౌ పశూనామపి సులభః. అన్యథా దేవానామపి దుర్లభ ఇతి. ॥ 34 ॥

శ్లో ॥ యో గజేంద్రం ఝషగ్రస్తం ధ్యాయంతం చరణాంబుజమ్ ।
క్రోశంతీనాం కరేణూనాం కృచ్ఛ్రతోఽ మోచయద్ద్రుతమ్ ॥ 35

శ్లో ॥ తం సుఖారాధ్యమృజుభిరనన్య శరణైర్నృభిః ।
కృతజ్ఞః కో న సేవేత దురారాధ్యమసాధుభిః ॥ 36

టీ:- తత్ర శ్రీభగవత్కథాశ్రవణే కస్యానందో న స్యాదిత్యాహ- ద్వాభ్యాం. యఇతి. ఝషః గ్రాహః. తేన పాదగ్రస్తం క్రోశంతీనాం కరేణూనామితి కృపాళుత్వముక్తం సంకటాదమోచయత్. ॥ 36 ॥

పొందెను. ॥ 33 ॥

ప్రఖ్యాత కీర్తిగల ధర్మజాదుల యొక్క, పుణ్యశ్లోకులైన భక్తుల యొక్క కథలను విన్నప్పుడే గొప్పఆనందము కలుగుచుండగా శ్రీవత్సము గుర్తుగాగల శ్రీహరిగాథను విన్నప్పుడు మహదానందము కలుగుట ఏమి ఆశ్చర్యము? ॥ 34 ॥

గజేంద్రుని మొసలి పట్టుకున్నప్పుడు ఆడఏనుగులు ఆక్రోశించెను. అప్పుడు ఆ గజేంద్రుడు శ్రీహరి పాదపద్మములను ధ్యానించగా శ్రీహరి వెంటనే ఆ ఏనుగును ఆపదనుండి విడిపించెను. భక్తియున్న మాత్రముననే పశువులను కూడా సులభముగా భగవంతుడ నుగ్రహించును. ఆ భక్తి లేనిచో దేవతలకు కూడా దుర్లభుడు అని 34,35 శ్లోకముల అభిప్రాయము. ఆడ ఏనుగులు ఏడ్చినంత మాత్రముననే రక్షించడం భగవంతుని కృపాళుత్వము. ॥ 35 ॥

అనన్యశరణులకు, ఋజుస్వభావులకు భగవానుడు విష్ణుదేవుడు సులభుడు, కాని కపట చిత్తులకు, దుష్టులకు ఆ దేవదేవుని ఆరా- ధించుట, ప్రసన్నుని చేసికొనుట అసంభవము. ఇట్టి భగవానుని దయాళుత్వము తెలిసిన ఏవ్యక్తి భగవానుని సేవింపకుండా ఉంటాడు?

శ్లో ॥ యో వై హిరణ్యాక్షవధం మహాద్భుతం
విక్రీడితం కారణసూకరాత్మనః ।
శృణోతి గాయత్యనుమోదతేంజసా
విముచ్యతే బ్రహ్మవధాదపి ద్విజాః ॥ 37

టీ:- యఇతి. కారణేన పృథివ్యుద్ధరణాదినా సూకరరూపస్య. హరేః (37)

శ్లో ॥ ఏతన్మహాపుణ్యమలం పవిత్రం
ధన్యం యశస్యం పదమాయురాశిషామ్ ।
ప్రాణేంద్రియాణాం యుధి శౌర్యవర్ధనం
నారాయణోఽంతే గతిరంగ శృణ్వతామ్ ॥ 38

టీ:- ఏతదితి. ఏతద్ధరేర్విక్రీడితం శృణ్వతామ్. అంతే శ్రీనారాయణో గతిర్భవతి. మహాపుణ్యం స్వర్గాదిఫలప్రదం అలం పవిత్రమ్. అతిశయేన శోధకం ధన్యం ధనావహమ్. యశస్యం కీర్తికరమ్. ఆయుషశ్చ ఆశిషాం చ పదం స్థానం పరిత్రాణం వా ప్రాణినామింద్రియాణాం చ పదమ్ అంగ హే విదుర. ॥ 38 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
హిరణ్యాక్ష వధోనామ ఏకోనవింశోఽధ్యాయః

(36)

ఓ మహర్షులారా! పృథివినుద్ధరించుటకై వరాహరూపధారి యగు విష్ణుభగవానుడు మహాద్భుతముగా హిరణ్యాక్షుని వధించెను. ఈ అత్యద్భుతకథను ఎవడు వింటాడో, గానము చేస్తాడో, అను మోదించి ప్రోత్సహిస్తాడో వాడు బ్రహ్మహత్య మొదలగు మహాపాపముల నుండి కూడా వెంటనే విముక్తుడవుతాడు. ॥ 37 ॥

ఓ విదురా! గొప్ప పుణ్యప్రదమైన ఈ గాథను వినువారు పవిత్రులగుదురు. ధనము, కీర్తి, ఆయుర్దాయమును పొందుదురు. వారి కోరికలు తీరును. ఆ గాథను విన్నవారికి యుద్ధ కాలములో (ప్రాణములు, ఇంద్రియములు) పరాక్రమము వృద్ధి యగును. దీనిని విన్నవారు మరణానంతరము నారాయణుని ఆశ్రయమును పొందుదురు. ॥ 38 ॥

వరాహజన్మ మొదలగు వానిని వర్ణించిన కారణముగా సృష్టి ప్రకరణము చెప్పే విషయములో వ్యవధానము ఏర్పడినది.

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు

వింశో౽ ధ్యాయః

శ్లో ॥ వింశే వరాహజన్మాది వ్యవధానాదథాదితః ।
సర్గో౽నుస్మర్యతే వక్తుమన్వయం ప్రస్తుతం మనోః ॥

శౌనక ఉవాచ

శ్లో ॥ మహీం ప్రతిష్ఠామధ్యస్య సౌతే స్వాయంభువో మనుః ।
కాన్యన్వతిష్ఠద్ద్వారాణి మార్గాయావరజన్మనామ్ ॥ 1

టీ:- మహీమితి. ప్రతిష్ఠాం స్థానం, అధ్యాస్య ప్రాప్య. సౌతే సూతస్య రోమహర్షణస్య పుత్ర. అవరం అర్వాచీనం. జన్మ యేషాం తేషాం ఈశ్వరే లీనానాం. మార్గాయ నిర్గమాయ. కానిచిద్ద్వారాణి కృతవాన్. అర్వాచీనాన్ ప్రాణినః. కైరుపాయైః సృష్టవానిత్యర్థః. ॥ 1 ॥

శ్లో ॥ క్షత్తా మహాభాగవతః కృష్ణస్యైకాంతికః సుహృత్ ।
యస్తత్యాజాగ్రజం కృష్ణే సాపత్యమఘవానితి ॥ 2

టీ:- విదుర మైత్రేయ సంవాదేనైవ ఏతత్ జ్ఞాస్యత ఇతి తమేవ సంవాదం. ప్రష్టుమాహ-పంచభిః క్షత్తేతి. శ్రీకృష్ణసుహృత్త్వే హేతుః. యఇతి. దుర్యోధనాదిభిరపత్యైస్సహితం. అగ్రజం ధృతరాష్ట్రం. అఘవాన్ కృతాపరాధ ఇతిహేతోః. శ్రీకృష్ణోక్తమంత్రానాదరాత్. యస్తత్యాజ. 2

ఇరువదియవ అధ్యాయము ప్రారంభము

20 వ అధ్యాయము

ఈ ఇరువదియవ అధ్యాయమున మళ్ళీ మనువంశము చెప్పబడుచున్నది.

శౌనక మహర్షి ఇట్లు పలికెను

ఓ సూతమహర్షీ! స్వాయంభువ మనువుకు సర్వజన నివాస స్థానమగు భూమి లభించిన తరువాత ఆయన పుట్టబోయే ప్రాణుల సృష్టికై ఏ విధానము అవలంబించెను. ॥ 1 ॥

విదురుడు గొప్ప భగవద్భక్తుడు. కృష్ణునికి పరమప్రేమ పాత్రుడగు స్నేహితుడు. తన అన్నగారు ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని విషయంలో తప్పుచేసినాడనే కారణముతో దుర్యోధనాదులతో సహా అందరిని విడిచి వెళ్ళిపోయాడు. (కృష్ణుని రాయబారమును అంగీకరించలేదనే తప్పు.) ॥ 2 ॥

శ్లో ॥ ద్వైపాయనాదనవరో మహిత్వే తస్య దేహజః ।
సర్వాత్మనా శ్రితః కృష్ణం తత్పరాంశ్చాప్యనువ్రతః ॥ 3

టీ:- ద్వైపాయనాదితి. అనవరః అన్యూనః.మహత్వే మహిమని.3

విదురుడు గొప్పదనములో తనతండ్రియగు ద్వైపాయన మహర్షికి తీసిపోడు (తక్కువయినవాడు కాదు). ఆయన సర్వప్రకారము - లుగా శ్రీకృష్ణుని శరణుజొచ్చినవాడు. కృష్ణ భక్తులను సేవించేవాడు. 3

శ్లో ॥ కిమన్వపృచ్ఛన్మైత్రేయం విరజాస్తీర్థసేవయా ।
ఉపగమ్య కుశావర్త ఆసీనం తత్త్వవిత్తమమ్ ॥ 4

టీ:- కిమితి. కుశావర్తే గంగాద్వారే యత్కిమపృపృచ్ఛత్. ॥ 4 ॥

పుణ్యతీర్థములను సేవించుట ద్వారా పాపములను తొలగించు కొనిన విదురుడు హరిద్వారములో, తత్త్వవేత్తలలో శ్రేష్ఠుడగు మైత్రేయమహర్షిని సమీపించి ఏమి ప్రశ్నించెను? ॥ 4 ॥

శ్లో ॥ తయోః సంవదతోః సూత ప్రవృత్తా హ్యమలాః కథాః ।
ఆపో గాంగా ఇవాఘఘ్నీర్హరేః పాదాంబుజాశ్రయాః ॥ 5

టీ:- కిం తవేతి చేత్తత్రాహ- తయోరితి. అఘఘ్నీరఘఘ్న్యో నూనం కథాః హేసూత ప్రవృత్తాః ॥ 5 ॥

ఓ సూత మహర్షీ! ఆ విదుర మైత్రేయులిద్దరి సంభాషణలో శ్రీకృష్ణుని పాదపద్మములకు సంబంధించిన పవిత్రములగు కథలు ప్రస్తావింపబడినవి. ఆ కథలు విష్ణుపాదోద్భవమైన గంగాజలముల వలె జీవుల పాపములను కడిగివేయును. ॥ 5 ॥

శ్లో ॥ తా నః కీర్తయ భద్రం తే కీర్త్న్యోదారకర్మణః ।
రసజ్ఞః కో ను తృప్యేత హరిలీలామృతం పిబన్ ॥ 6

టీ:- తా ఇతి. కీర్త్న్యాని కీర్తనార్హాణి ఉదారాణి కర్మాణి యస్య శ్రీహరేః ॥ 6 ॥

ఓ సూతుడా! నీకు శుభము కలుగుగాక! మాకు కీర్తన యోగ్యములగు, ఉదారకర్మలు గల శ్రీహరి పవిత్రకథలను వినిపింపుము. శ్రీహరి లీలామృతమును పానము చేయుచూ రసజ్ఞుడెవడు తృప్తి

శ్లో ॥ ఏవముగ్రశ్రవాః పృష్ట ఋషిభిర్నైమిషాయనైః ।
భగవత్యర్పితాధ్యాత్మస్తానాహ శ్రూయతామితి ॥ 7

టీ:- ఏవమితి. ఏవమితి వ్యాసవాక్యం. ఉగ్రశ్రవాః రోమహర్షణస్య పుత్రః. నైమిషమయనమాశ్రయో యేషాం తైః. అర్పితం అధ్యాత్మం మనో యేన సః. ॥ 7 ॥

సూత ఉవాచ

శ్లో ॥ హరేర్ధృత క్రోడతనోః స్వమాయయా
నిశమ్య గోరుద్ధరణం రసాతలాత్ ।
లీలాం హిరణ్యాక్షమవజ్ఞయా హతం
సంజాతహర్షో మునిమాహ భారతః ॥ 8

టీ:- హరేరితి. గోరుద్ధరణం వసుధోద్ధరణమ్. లీలాం హిరణ్యాక్షం చావజ్ఞయా హతం. నిశమ్య. భారతః విదురః. ॥ 8 ॥

విదుర ఉవాచ

శ్లో ॥ ప్రజాపతిపతిః సృష్ట్వా ప్రజాసర్గే ప్రజాపతీన్ ।
కిమారభత మే బ్రహ్మన్ ప్రబ్రూహ్యవ్యక్తమార్గవిత్ ॥ 9

చెందును? ॥ 6 ॥

ఈ శ్లోకములో ఏవం అనునది వ్యాసమహర్షి వాక్యము. నైమిశారణ్యవాసులగు ఋషులిట్లు హరికథలను వినగోరగా రోమహర్షణపుత్రుడగు ఉగ్రశ్రవసూతుడు భగవానునుయందు మనస్సు నిలిపి, శౌనకాది ఋషులారా! వినవలిసినదని ఇట్లు పలికెను. 7

సూత మహర్షి ఇట్లు పలికెను

శ్రీహరి తన మాయాశక్తిచే వరాహరూపమును ధరించి పాతాళము నుండి ధరణిని పైకితీసి, హిరణ్యాక్షుని తేలికగా సంహరించెను. భరత వంశీయుడగు విదురుడు ఈ లీలను విని సంతోషించి, మైత్రేయ మహర్షితో నిట్లనెను. ॥ 8 ॥

విదురుడిట్లు పలికెను

ఓ మైత్రేయమహర్షీ! నీవు అవ్యక్త మార్గములు (పరోక్ష

టీ:- ప్రజాపతిరితి. యస్మాత్త్వమవ్యక్తమార్గవిత్. బ్రహ్మణో వా విశేషణం. ॥ 9 ॥

శ్లో ॥ యే మరీచ్యాదయో విప్రాః యస్తు స్వాయంభువో మనుః ।
తే వై బ్రహ్మణ ఆదేశాత్కథమేతదభావయన్ ॥ 10

టీ:- యఇతి. ఏతత్ జగత్. అభావయన్ ఉత్పాదయామాసుః. 10

శ్లో ॥ స ద్వితీయాః కిమసృజన్ స్వతంత్రా ఉత కర్మసు ।
ఆహోస్విత్సంహతాః సర్వ ఇదం స్మ సమకల్పయన్ ॥ 11

టీ:- స ద్వితీయా ఇతి. సద్వితీయాస్సభార్యాః స్వతంత్రా భార్యానపేక్షాః. కర్మసు ప్రజాసర్గాదిషు. సంహతాః పరస్పరానపేక్షాః. ఇదం జగత్. ॥ 11 ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ దైవేన దుర్వితర్క్యేణ పరేణానిమిషేణ చ ।
జాతక్షోభాద్భగవతో మహానాసీద్గుణత్రయాత్ ॥ 12

విషయములను) కూడా తెలిసినవాడవు. (భగవద్విషయములను తెలిసినవాడవు) ప్రజాపతులకు తండ్రి అయిన బ్రహ్మదేవుడు ప్రజాసృష్టి యందు నిమగ్నుడైనవాడై ప్రజాపతులను సృష్టించిన పిదప ఏ పని చేయసాగెను? దయయుంచి నాకావిషయమును వివరించవలసినది. 9

బ్రహ్మదేవుని ఆదేశముననుసరించి మరీచి మున్నగు మహర్షులు, స్వాయంభువమనువు ఈ జగత్తును ఏ విధముగా సృష్టించిరి. ॥ 10 ॥

వారు భార్యలతో కూడినవారై సృష్టిచేసిరా? లేక స్వతంత్రముగ (భార్య అపేక్ష లేకుండా) సృష్టి చేసిరా? లేక అందరు కలిసి ఈ జగత్తును సృష్టించిరా? ॥ 11 ॥

బ్రహ్మ ఏమిచేసినాడనే ప్రశ్నకు సమాధానముగా దక్షాదులను సృష్టించినాడని సమాధానము చెప్పుటకుగాను ఈ ఏడు శ్లోకముల

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- బ్రహ్మో కిమారభతేతి ప్రశ్నస్య. దక్షాదీన్ సృష్టవానిత్యుత్తరం వక్తుం పూర్వోక్తాం సృష్టిమనుస్మారయతి-సప్తభిః. దైవేనేతి. మన్వాది ప్రశ్నానాం తు ఉత్తరాధ్యాయమారభ్య ఉత్తరం భవిష్యతి. దుర్వితర్క్యేణ దైవేన జీవాదృష్టేన. పరేణ ప్రకృత్యధిష్ఠాత్రా మహాపురుషేణ అనిమిషేణ కాలేన హేతునా చ. భగవతో నిర్వికారాత్ జాతక్షోభం యద్గుణత్రయం ప్రధానం. తస్మాన్మహానాసీత్. తదుక్తం సాత్త్వతతంత్రే. శ్లో. విష్ణోస్తు త్రీణి రూపాని పురుషాఖ్యాన్యదో విదుః, ప్రథమం మహతస్సృష్టిః ద్వితీయం త్వండసంస్థితమ్, తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వా విముచ్యత. ఇతి. 12

శ్లో ॥ రజఃప్రధానాన్మహతస్త్రిలింగో దైవచోదితాత్ ।
జాతః ససర్జ భూతాదిర్వియదాదీని పంచశః ॥ 13

టీ:- రజ ఇతి. మహతో జాతో భూతాదిరహంకారః. త్రిలింగః త్రిగుణః. రజః ప్రధానాదితి. స్వతః సత్త్వప్రధానస్యాపి మహతః అహంకారోత్పత్తికాలే కార్యానురూపం రజఃప్రధానత్వం భవతీతి భావః పంచశః పంచతన్మాత్రాణి. మహాభూతాని జ్ఞానేంద్రియాణి. కర్మేంద్రి

ద్వారా పూర్వోక్తమయిన సృష్టిని గుర్తుచేయుచున్నాడు. మన్వాదులు ఏమి చేసినారనే ప్రశ్నకు సమాధానము తరువాతి అధ్యాయములలో ఉండగలదు. జీవుల కర్మగతి ఊహించుటకు శక్యముకాదు. ప్రకృతి సత్త్వరజస్తమ స్వరూపమైనది. దీనికే ప్రధానమనియు పేరు. ఈ ప్రకృతి నిర్వికారస్థితిలో యుండెను. 1.జీవుని అదృష్టము, 2.ప్రకృతికి అధిష్ఠాతయగు మహాపురుషుడు, 3.కాలము అనే మూడింటిచే ప్రకృతి సంక్షోభము చెంది దాని నుండి "మహత్తత్త్వము" ఏర్పడినది. సాత్త్వతతంత్రమునందు ఇట్లున్నది.

శ్లో. విష్ణోస్తు త్రీణి రూపాని పురుషాఖ్యాన్యదోవిదుః ।
ప్రథమం మహతస్సృష్టిః ద్వితీయం త్వండసంస్థితమ్ ।
తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వావిముచ్యత ॥ ఇందులో భగవంతుని మొదటి సృష్టి "మహత్తు" అని తెలుపబడినది. ॥ 12 ॥

భగవంతుని ప్రేరణచే "మహత్తు" నుండి అహంకారము పుట్టెను. ఈ అహంకారము సాత్త్వికాహంకారము, రాజసాహంకారము, తామసాహంకారము అను మూడు విధములుగా నుండును ఈ అహంకారము నుండియే 1.శబ్దాది పంచతన్మాత్రలు, 2.పృథివ్యాది పంచమహాభూతములు, 3.నేత్రాది పంచ జ్ఞానేంద్రియములు, 4.వాగాది పంచ కర్మేంద్రియములు, 5.ఇంద్రియాధిష్ఠాన దేవతలు

యాణి తత్తద్దేవతాశ్చేతి పంచ పంచశో వర్గగః. ససర్జేత్యర్థః. 13

ఐదుగురు జన్మించిరి. మహత్తత్త్వము స్వయముగ సత్త్వగుణ ప్రధానమైనను అహంకారము పుట్టుకాలమున కార్యానురూపమగు రజః ప్రధానమగును. ॥ 13 ॥

శ్లో ॥ తాని చైకైకశః స్రష్టుమసమర్థాని భౌతికమ్ ।
సంహత్య దైవయోగేన హైమమండమథాసృజన్ ॥ 14

టీ:- తానీతి. భౌతికం హైమమండం. ఏకైకశః ప్రత్యేకం స్రష్టుమ-సమర్థాని సంతి. సంహత్య ససృజుః. ॥ 14 ॥

అవి విడివిడిగా జగత్తునుసృష్టించలేకపోయినవి. భగవంతుని శక్తిచే ఒకదానితోనొకటికలిసిభౌతికమగుఅండమునుసృష్టించినవి. 14

శ్లో ॥ సోஉశయిష్టాబ్ధి సలిలే అండకోశోనిరాత్మకః ।
సాగ్రం వై వర్షసాహస్రమన్వవాత్సీత్తమీశ్వరః ॥ 15

టీ:- స ఇతి. అన్వవాత్సీదధిష్ఠితవాన్. ॥ 15 ॥

ఆ బ్రహ్మాండము సముద్రజలములలో వెయ్యి సంవత్సరముల కాలము చేతనము లేకుండా ఉండెను. పిమ్మట ఈశ్వరుడు ఆ అండకోశమునందు ప్రవేశించెను. ॥ 15 ॥

శ్లో ॥ తస్య నాభేరభూత్పద్మం సహస్రార్కోరుదీధితి ।
సర్వజీవనికాయౌకో యత్ర స్వయమభూత్స్వరాట్ ॥ 16

టీ:- యస్యేతి. సహస్రార్కాణామివ ఉరుర్దీధితిర్యస్య తత్. సర్వజీవని - కాయానాం ఓకః స్థానం పద్మమ్. స్వరాట్ బ్రహ్మా. ॥ 16 ॥

ఆ భగవానుని నాభినుండి వేయి సూర్యులతో సమానమైన గొప్పకాంతిగల పద్మము ఉత్పన్నమయ్యెను. ఆ పద్మము సకల జీవులకు నివాసస్థానము. దాని నుండియే బ్రహ్మదేవుడు ఆవిర్భవించెను. 16

శ్లో ॥ సోఽనువిష్టో భగవతా యః శేతే సలిలాశయే ।
లోకసంస్థాం యథాపూర్వం నిర్మమే సంస్థయా స్వయా ॥17

టీ:- సఇతి. యః సలిలాశయే గర్భోదకస్యాంతః శేతే. తేన భగవతాను - విష్టోఽధిష్ఠితస్సన్. సః స్వరాట్. స్వయా సంస్థయా. నామరూపాది - క్రమేణ. ॥ 17 ॥

ప్రళయ జలములలో శయనించే నారాయణుడు బ్రహ్మదేవుని లోకరచనకై ప్రేరేపించెను. ఆ బ్రహ్మ పూర్వకల్పములో నున్నట్లుగానే నామరూపాత్మకమగు లోకములను సృష్టించెను. ॥ 17 ॥

శ్లో ॥ ససర్జ ఛాయయాఽవిద్యాం పంచపర్వాణమగ్రతః ।
తామిస్రమంధతామిస్రం తమో మోహో మహాతమః ॥ 18

టీ:- ససర్జేతి. ఛాయా ప్రభాప్రతియోగినీ తయా అబుద్ధ్వేత్యర్థః. యస్త్వబుద్ధికృతః ప్రభోః ఇత్యుక్తత్వాత్. మహాతమ ఇతి మహామోహః స్వరూపమాత్రవివక్షయా మోహ ఇతి ప్రథమప్రయోగః. ॥ 18 ॥

బ్రహ్మ మొదట ప్రభాప్రతియోగినియగు (తన) ఛాయ(నీడ లేక అజ్ఞానము) నుండి తామిస్రము, అంధతామిస్రము, తమస్సు, మోహము, మహాతమస్సు అనే అయిదు అవిద్యలను సృష్టించెను. 18

శ్లో ॥ విససర్జాత్మనః కాయం నాభినందంస్తమోమయమ్ ।
జగృహుర్యక్ష రక్షాంసి రాత్రిం క్షుత్తృట్సముద్భవాం ॥ 19

టీ:- తదేవం పూర్వోక్తాం సాధారణాం సృష్టిమనూద్య. కేనచిద్విశేషేణ అసాధారణం సృష్టిమాహ-విససర్జేత్యాదినా యావదధ్యాయ పరిసమాప్తి.

గతంలో చెప్పిన సాధారణ సృష్టిని ప్రస్తావించిన పిదప అసాధారణ సృష్టిని ఈ శ్లోకము మొదలుకొని అధ్యాయ పరిసమాప్తి వరకు చెప్పుచున్నాడు. బ్రహ్మ అజ్ఞాన ప్రధానమగు (తమస్సుప్రధాన మగు) తన శరీరమును ఇష్టపడలేదు. దానిని విడిచిపెట్టెను. ఆ బ్రహ్మ

తద్విసృష్టం కాయం రాత్రిరూపం. తతఏవ జాతాని యక్షరక్షాంసి జగృహుః. క్షుత్తృషోః సముద్భవో యస్యాం తామ్. అత్ర చ. శ్రు. "యాస్య సా తనూరాసీత్. తామపాహత. సా తమిస్రాభవత్" ఇత్యాది శ్రుతిరనుసంధేయా. ॥ 19 ॥

విడిచిన శరీరమే రాత్రి యయ్యెను. రాత్రి ఆకలిదప్పుల పుట్టుక కలదయ్యెను. ఆ రాత్రిని యక్షులు, రాక్షసులు స్వీకరించిరి. "యాస్య సా తనూరాసీత్. తామపాహత. సా తమిస్రాభవత్" అనే వేదవాక్కును ఇక్కడ అనుసంధానించుకొనవలెను. ॥ 19 ॥

శ్లో ॥ క్షుత్తృడ్భ్యాముపసృష్టాస్తే తం జగ్ధుమభిదుద్రువుః ।
మా రక్షతైనం జక్షధ్వమిత్యూచుః క్షుత్తృడర్దితాః ॥ 20

టీ:- క్షుదితి. ఉపసృష్టా అభిభూతాః. జగ్ధుమత్తుం భక్షయితుం. యతో వయం క్షుత్తృడ్భ్యామర్దితాః అత ఏనం పితేతి కృపయా మా రక్షతేత్యేకే. అన్యే తు జక్షధ్వం భక్షయతేత్యబ్రువన్. జక్ష భక్షహననయోరితి ధాతుః (20)

ఆ యక్ష రాక్షసులు ఆకలిదప్పులకు తట్టుకోలేనివారైరి. బ్రహ్మనే తినుటకు ఆయనవైపు పరుగెత్తిరి. అందులో కొందరు ఈయన మన తండ్రియైనను మనమాకలి దప్పులతోనున్నందును రక్షింప పనిలేదు అనిరి. వారు రాక్షసులైరి. మరికొందరు "తినండి, తినండి" అనిరి వారు యక్షులైరి. ("జక్ష భక్షహననయోః" అని ధాతువు.). ॥ 20 ॥

శ్లో ॥ దేవస్తానాహ సంవిగ్నో మా మాం జక్షత రక్షత ।
అహో మే యక్ష రక్షాంసి ప్రజా యూయం బభూవిథ ॥ 21

టీ:- దేవఇతి. దేవోఽబ్రహ్మ సంవిగ్నో భీతస్సన్. మాం మా జక్షత న భక్షయత కింతు రక్షత. అహో హే యక్ష రక్షాంసి. యూయం మే మమ ప్రజాః పుత్రాః బభూవిథ జాతాః స్థ. ఏవముగ్రస్వభావాః. యక్ష

బ్రహ్మ భయపడినవాడై వారితో ఇట్లనెను. ఓ యక్షరాక్షసులారా! మీరు నా సంతానము. నన్ను తినకండి. నన్ను రక్షించండి. (నా సంతానమనుటలో క్రూరులైన సంతానము పుట్టితిరని భావము) రక్షించకండి అన్నవారు రాక్షసులైరి. భక్షించండి అన్నవారు యక్షులైరి. పశువులలో, మానవులలో కూడా ఈ స్వభావము ఉండును. ఈ

రక్షాంసి జాతా ఇత్యర్థః. తత్ర యే జక్షధ్వమిత్యూచుః తే యక్షాః. యే తు తం మారక్షతేతి తే రాక్షసా ఇతి జ్ఞేయమ్. ఏతచ్చ తిర్యగాది మానవ సర్గస్యాప్యుపలక్షణమ్. ॥ 21 ॥

స్వభావము కలవారే యక్ష రాక్షసులని తెలియవలెను. ॥ 21 ॥

శ్లో ॥ దేవతాః ప్రభయా యా యా దీవ్యన్ప్రముఖతోఽసృజత్ ।
తేఽహార్షుర్దేవయంతో విసృష్టాం తాం ప్రభామహః ॥ 22

టీ:- దేవతాఇతి. ప్రభయా దీవ్యన్ ద్యోతమానాః. యా యా దేవతాః ద్యుతిమత్యః సాత్త్వికృస్తాస్తాః. ప్రముఖతః ప్రాధాన్యేనాసృజత్. తే దేవాః దేవతా ఇతి స్త్రీత్వేన నిర్దిష్టానామప్యర్థమాత్రవివక్షయా త ఇతి పుంస్త్వేన ప్రతినిర్దేశః. ఏవం యక్షరక్షాంసీత్యత్రాపి విజ్ఞేయం. తేన విసృష్టాం త్యక్తాం ప్రభాం అహః దివసరూపాం సతీం దేవయంతః క్రీడయంతః . అహార్షుః జగృహుః. ॥ 22 ॥

బ్రహ్మ తన కాంతిచే ప్రకాశిస్తూ దేవతలను సృష్టించెను. అట్లు సృష్టింపబడిన ఆ యా దేవతలు బ్రహ్మదేవుడు విడిచిపెట్టిన పగటి దినము నందలి కాంతితో క్రీడిస్తూ దానిని (ఆ కాంతిని) స్వీకరించిరి. ఆ యా దేవతలు పగటియందలి కాంతిని స్వీకరించిరని యర్థము. దేవతాః, యా, యా అని స్త్రీవాచక శబ్దములు ప్రయోగింపబడెను. లింగ వివక్షలేదని తెలియజేయుటకై "తే" అను శబ్దము ప్రయోగింపబడినది. దేవతలలో స్త్రీ, పురుషులిరువురూ పగటి రూపములోనున్న కాంతిని స్వీకరించిరని యర్థము. ॥ 22 ॥

శ్లో ॥ దేవోఽదేవాన్ జఘనతః సృజతి స్మాతిలోలుపాన్ ।
త ఏనం లోలుపతయా మైథునాయాభిపేదిరే ॥ 23

టీ:- అదేవానితి పద విభాగః. శ్రు. 'స జఘనాదసురాన సృజత' ఇతి శ్రుతిః. అతిలోలుపాన్ స్త్రీలంపటాన్. అభిపేదిరే ప్రాప్తాః. 23

బ్రహ్మ తన నడుము భాగమునుండి మిక్కిలి భోగలాలసులైన అసురులను (అదేవతలను) సృష్టించెను. వారు అతిగా స్త్రీలోలురు. మైథునము కోరినవారై బ్రహ్మదేవుడివైపు పరుగిడిరి. ॥ 23 ॥

శ్లో ॥ తతో హసన్ స భగవానసురైర్నిరపత్రపైః ।
అన్వీయమానస్తరసా క్రుద్ధో భీతః పరాపతత్ ॥ 24

టీ:- తత ఇతి. పరాపతత్ అపలాయత. ॥ 24 ॥

అప్పుడు బ్రహ్మవారిని చూచి నవ్వుకొనెను. కాని ఆ రాక్షసులు సిగ్గులేనివారై తరుముచుండగా బ్రహ్మ కోపించి, భయపడి పారిపోయెను. 24

శ్లో ॥ స ఉపవ్రజ్య వరదం ప్రపన్నార్తిహరం హరిమ్ ।
అనుగ్రహాయ భక్తానామనురూపాత్మదర్శనమ్ ॥ 25

టీ:- స ఇతి. భక్తేచ్ఛానురూపమాత్మానం దర్శయతీతి తథా అము - పవ్రజ్య. ॥ 25 ॥

శ్రీహరి శరణాగతులకు వరములనిచ్చేవాడు. శరణాగతులైన భక్తుల దుఃఖమును తొలగించేవాడు. ఆ భక్తుల కొఱకు వారి భావనకు తగిన రూపములో ప్రత్యక్షమయ్యేవాడు భగవంతుడు. అలాంటి భగవానుని దగ్గరకు వెళ్ళి తన సమస్యను చెప్పుకొనెను. ॥ 25 ॥

శ్లో ॥ పాహి మాం పరమాత్మంస్తే ప్రేషణేనాసృజం ప్రజాః ।
తా ఇమా యభితుం పాపా ఉపాక్రామంతి మాం ప్రభో ॥26

టీ:- పాహీతి ద్వాభ్యాం ప్రార్థితవాన్. యభితుం మైథునేన ధర్షయితుం. ॥ 26 ॥

(బ్రహ్మ ఈ రెండు శ్లోకముల ద్వారా తనను రక్షింపవలసినదిగా ప్రార్థించుచున్నాడు) ఓ పరమాత్మా! నీ ప్రేరణ చేతనే ప్రాణులను సృష్టించితిని. ఈ పాపులు నా చేతనే సృష్టింపబడి నన్ను భోగించుటకు తరుముచున్నారు. నన్ను రక్షించుము. ॥ 26 ॥

శ్లో ॥ త్వమేకః కిల లోకానాం క్లిష్టానాం క్లేశనాశనః ।
త్వమేకః క్లేశదస్తేషామనాసన్నపదాం తవ ॥ 27

టీ:- త్వమితి. లోకానాం జనానాం. తవ అనాసన్నౌ అనాశ్రితౌ పాదౌ యైస్తేషాం. ॥ 27 ॥

కష్టములలో నున్న ప్రజల క్లేశములను పోగొట్టేవాడవు నీవొక్కడవే సుమా! నీ పాదములను ఆశ్రయించని వారికి, వారి వారి కర్మానుగుణముగా క్లేశములను కలిగించువాడవు కూడా నీవొకడవే సుమా! 27

శ్లో ॥ సోఽవధార్యాస్య కార్పణ్యం వివిక్తాధ్యాత్మదర్శనః ।
విముంచాత్మతనుం ఘోరామిత్యుక్తో విముమోచ హ ॥ 28

టీ:- సఇతి. వివిక్తమసందిగ్ధం అధ్యాత్మదర్శనం పరచిత్తజ్ఞానం యస్య శ్రీహరేః. ఘోరాం కామకశ్మలాం స్వతనుం విముంచేత్యుక్తవానితి శేషః ఇత్యుక్తశ్చ బ్రహ్మా తాం తనుం విముమోచ. సర్వత్ర తనుత్యాగో నామ తత్తన్మనోభావత్యాగో వివక్షితః. గ్రహణం చ తత్తద్భావాపత్తిరితి ద్రష్టవ్యం. శ్రు. "సాహోరాత్రయోస్సంధిరభవది" తి శ్రుతేః. సా చ తేన విసృష్టా తనుః సాయంతనీ సంధ్యా బభూవ సా చ కామోద్రేకవేళా అసురాశ్చ రాజసత్త్వాత్ స్త్రీలంపటాః. ॥ 28 ॥

శ్రీహరికి ఇతరుల మనస్సులలోని అభిప్రాయములు, భావములు సుస్పష్టముగా తెలియును. ఆయన బ్రహ్మదేవుని దైన్యమును తెలిసికొనెను. "బ్రహ్మదేవా! ఈ కామకశ్మలమైన శరీరమును విడువుము" అనే శ్రీహరి మాటననుసరించి బ్రహ్మ ఆ దేహమును విడిచెను. (శరీరమును త్యజించుట అనగా ఆ యా మనోగత భావములను వదలుట యనియు, శరీరము గ్రహించుట అనగా ఆ యా భావములను గ్రహించుట యని తెలియవలెను.) బ్రహ్మ విడిచిన శరీరము సాయంసంధ్యగా ఏర్పడినది. "సాఽహోరాత్రయోః సన్ధిరభవత్" అని శ్రుతి వాక్యము. అది కామోద్రేక సమయము. రాక్షసులు రాజసగుణముచే స్త్రీలంపటులుగా నుండిరి. ॥ 28 ॥

శ్లో ॥ తాం క్వణచ్చరణాంభోజాం మదవిహ్వలలోచనామ్ ।
కాంచీకలాప విలసద్దుకూలచ్ఛన్న రోధసమ్ ॥ 29

టీ:- అతస్తాం సంధ్యామేవ స్త్రియం కల్పయిత్వా తే సంమోహం ప్రాప్తా ఇత్యాహ-తామిత్యాదినా త్రిభిః. నూపురాభ్యాంక్వణతీ చరణాం-భోజే యస్యాః మదేన విహ్వలే లోచనే యస్యాస్సా కాంచీ కలాపేన విలసద్దుకూలం.తేన ఛన్నం రోధః కటితటం యస్యాస్తామ్. 29

అందుకొరకు సంధ్యాకాలమునే స్త్రీమూర్తిగా కల్పించగా వారు సంమోహమును పొందిరి. ఈ విషయము 'తామితి' మొదలైన మూడు శ్లోకముల ద్వారా చెప్పబడినది. ఆ స్త్రీమూర్తి మత్తుతోనిండి చంచలమైన కన్నులు కలదిగా నుండెను. పద్మములవంటి పాదములు కలిగి యుండి నడుచునప్పుడు ఆ కాలి అందెలు గలగలలాడుచుండెను. ఆమె నడుముకు చక్కటి దుకూలము కప్పబడి యుండెను. ఆ దుకూలమునకు మొలనూలు సరములు శోభను చేకూర్చుచుండెను. ॥ 29 ॥

శ్లో ॥ అన్యోన్య శ్లేషయోత్తుంగ నిరంతరపయోధరామ్ ।
సునాసాం సుద్విజాం స్నిగ్ధ హాస లీలావలోకనామ్ ॥ 30

టీ:- అన్యోన్యేతి. అన్యోన్యశ్లేషణేన ఉపమర్దేన హేతునా. ఉత్తుంగౌ నిరంతరౌ పయోధరౌ యస్యాః. సుద్విజాం సుదతీం. స్నిగ్ధో హాసో లీలావలోకనం యస్యాస్సా. ॥ 30 ॥

ఆ సంధ్యాసుందరి యొక్క స్తనములు ఒకదానితో నొకటి ఒత్తుకొని ఎత్తుగా అంతరములేనివిగా నుండెను. ఆమె చూపులు ప్రేమతో నిండి చిరునవ్వుతో విలాసముగా నుండెను. చక్కని ముక్కుగల ఆమె సుందరమైన పలువరుస కలిగి యుండెను. ॥ 30 ॥

శ్లో ॥ గూహంతీం వ్రీడయాత్మానం నీలాలకవరూథినీమ్ ।
ఉపలభ్యాసురా ధర్మ సర్వే సంముముహుః స్త్రియమ్ ॥ 31

ధర్మమునెఱిగిన ఓ విదురా! ఆమె సిగ్గుపడుచున్నదై కొంగుతో శరీరమును కప్పుకొనుచుండెను. దట్టమైన నల్లని కురులు కలదై యుండెను. అట్టి అందమైన స్త్రీని చూచి రాక్షసులు పూర్తిగా మోహమును పొందిరి. ॥ 31 ॥

శ్లో ॥ అహో రూప మహో ధైర్య మహో అస్యా నవం వయః ।
మధ్యే కామయమానానామకామేవ విసర్పతి ॥ 32

టీ:- గూహంతీమితి. గూహంతీం వస్త్రాంచలేనావృణ్వానామ్ నీలానా మలకానాం వరూథః స్తోమో యస్యాః విద్యతే తాం. హే ధర్మవిదుర తాదృశీం స్త్రియం ఉపలభ్య మత్వా. సంమూఢానాం విభావనాక్రమ-మాహ - అహు ఇతి. ॥ 31-32 ॥

(సంమూఢులైన వారి భావన చెప్పబడుచున్నది). ఆహా! ఈ సుందరిది ఏమి రూపము. ఆహా ఏమి ధైర్యము. ఎంతటి నవ యౌవనమో సుమా! కామికులైన మన మధ్యలో కామమేలేని దానివలె తిరుగుచున్నది. ॥ 32 ॥

శ్లో॥ వితర్కయంతో బహుధా తాం సంధ్యాం ప్రమదాకృతిమ్ ।
అభిసంభావ్య విస్రంభాత్పర్య పృచ్ఛన్ కుమేధసః ॥ 33

టీ:- వితర్కయంత ఇతి. అభిసంభావ్య సత్కృత్య. విస్రంభాత్ ప్రణయాత్. కుబుద్ధయః తే తాం పప్రచ్ఛుః. ॥ 33 ॥

కుబుద్ధులగు ఆ రాక్షసులు స్త్రీరూపములో నున్న సంధ్యను గూర్చి అనేక విధములుగా ఊహించుకోసాగిరి. వారామెకు చక్కగా మర్యాదలుచేసి చనువుతో ఇట్లడిగిరి. ॥ 33 ॥

శ్లో॥ కాసి కస్యాసి రంభోరు కోవార్థస్తేఽత్ర భామిని ।
రూప ద్రవిణ పణ్యేన దుర్భగాన్నో విబాధసే ॥ 34

టీ:- తే తాం పప్రచ్ఛుః కాసీత్యాదిత్రిభిః. కాసి జాత్యా. కా త్వం? కస్య వా కన్యా? హే భామిని కోపనే. రూపమేవ ద్రవిణం అనర్ఘం వస్తు. తదేవ పణ్యం క్రయార్థం. తేన తదసమర్పణేన నో విబాధసే. 34

(కాసి మొదలగు ఈ మూడు శ్లోకముల ద్వారా ఆమెను ప్రశ్నించుచున్నారు.) ఓ సుందరీ! నీవెవరు? ఎవరి దానవు? ఇక్కడ నీకేమి పని? అమూల్యమైన నీ రూపసంపదతో రూపము విషయములో అభాగ్యులమగు మమ్ము మిక్కలి బాధించుచున్నావు. ॥ 34 ॥

శ్లో॥ యావా కా చిత్త్వమబలే దిష్ట్యా సందర్శనం తవ ।
ఉత్సునోషీక్షమాణానాం కందుకక్రీడయా మనః ॥ 35

టీ:- యేతి. కిం జాతికులాది ప్రశ్నేన. యా వా కా వా చిద్భవతు దిష్ట్యైవం తావద్భద్రం జాతం. యత్తవ దర్శనం నామ. కింతు కేవలం నః మనః ఉత్సునోషి విమథ్నాసి. ॥ 35 ॥

ఓ అబలా! నీవెరివైన మాకేమి? నీ జాతి కులాది ప్రశ్నలు మాకెందుకు? నీ దర్శనము మాకు కలిగినది. అదే మాకు గొప్ప అదృష్టము. నీవు బంతితో ఆడుచూ, నిన్ను చూచుచున్న మా మనస్సులను కలచివేయుచున్నావు. ॥ 35 ॥

శ్లో ॥ నైకత్ర తే జయతి శాలిని పాదపద్మం
ఘ్నంత్యా ముహుః కరతలేన పతత్పతంగమ్ ।
మధ్యం విషీదతి బృహత్ స్తనభారభీతం
శ్రాంతా చ దృష్టిరమలస్సుశిఖాసమూహః ॥ 36

టీ:– క్షుభితచిత్తానాం వాక్యం. నైకత్రేతి. హే శాలిని శ్లాఘ్యే. ఏకత్ర న జయతి న స్థిరీభవతి. యద్వా –నైకత్ర అనేకగతివిలాసేషు జయతి సర్వోత్కర్షేణ వర్తతే. పతత్పతంగం ఉచ్చలంతం కందుకం. బృహతో–ర్మహతోః స్తనయోర్భారాద్భీతం. తవ కృశం మధ్యం. విషీదతి శ్రామ్యతి. శ్రాంతా మందమేవ ప్రసరతి. సుశిఖాసమూహః. శోభనః కేశకలావః పాఠాంతరే. సుశిఖాః శోభనకేశాన్వికీర్యమాణాన్ సమూహం బధానేతి. అత్ర చాస్తం గచ్ఛన్ సూర్య ఏవ పతత్పతంగః. మేఘవిచ్ఛేదో మధ్య –విషాదః. తారకారూపా దృష్టిః, తమ ఏవ కేశా ఇత్యూహ్యం. ॥ 36 ॥

కలచివేయబడ్డ మనస్సు గల రాక్షసుల మాటలివి. ఓ సుందరీ! పైకి ఎగిరిపడుచున్న బంతిని నీవు అరచేతితో మాటి మాటికి కొట్టుచున్నావు. అప్పుడు నీ పద్మముల వంటి పాదములు ఒకచోట నిలుచుట లేదు. నీ స్తనముల భారమునకు భయపడుచున్నదా యన్నట్లు నీ నడుము మిక్కిలి శ్రమపడుచున్నది (సన్నబడినదని యర్థము). అందమైన కేశసమూహము కలిగియున్నావు. సుశిఖాః. పాఠాంతర–ములో సంధ్యా సుందరి వర్ణన ఇట్లున్నది. అందముగా విప్పారి యుండిన వెంట్రుకల చక్కటి బంధనము(జడ). ఇక్కడ అస్తంగత సూర్యుడే ఎగిరి పడుచున్న బంతి, మేఘములు విడిపోవడమే మధ్య విషాదము (నడుము సన్నబడుట). నక్షత్ర రూపమైనదే శాంతమైన చూపు. చీకటే వెంట్రుకలు అని ఊహింపనగును. 36

శ్లో ॥ ఇతి సాయంతనీం సంధ్యామసురాః ప్రమదాయతీమ్ ।
ప్రలోభయంతీం జగృహుర్మత్వా మూఢధియః స్త్రియమ్ ॥ 37

టీ:– ఇతీతి. ప్రమదేవ ఆచరంతీం స్త్రియం మత్వా జగృహుః. 37

మూఢబుద్ధులగు ఆ అసురులు ఈ విధముగా సాయంకాల సంధ్యను స్త్రీగా కల్పనచేసి ప్రలోభులైరి. ఆమెను స్త్రీరత్నముగ భావించి స్వీకరించిరి. ॥ 37 ॥

శ్లో ॥ ప్రహస్య భావగంభీరం జిఘ్రన్త్యాత్మానమాత్మనా ।
కాంత్యా ససర్జ భగవాన్ గంధర్వాప్సరసాం గణాన్ ॥ 38

టీ:- ప్రహస్యేతి. ప్రహస్యాత్మానమాత్మనా జిఘ్రన్త్యా. కాంత్యా సౌందర్యేణ. ప్రహసన్ ఆత్మావఘ్రాణం చ సౌందర్యానుభవచాతుర్య వికారః. ॥ 38 ॥

శ్లో ॥ విససర్జ తనుం తాం వై జ్యోత్స్నాం కాంతిమతీం ప్రియామ్ ।
త ఏవ చాదదుః ప్రీత్యా విశ్వావసు పురోగమాః ॥ 39

టీ:- విససర్జేతి. జ్యోత్స్నాం చంద్రికారూపామ్. త ఏవ గంధర్వాది గణాః. విశ్వావసుః పురోగమో ముఖ్యో యేషు గణేషు. ॥ 39 ॥

శ్లో ॥ సృష్ట్వా భూత పిశాచాంశ్చ భగవానాత్మతంద్రిణా ।
దిగ్వాససో ముక్తకేశాన్వీక్ష్య చామీలయద్దృశౌ ॥ 40

టీ:- సృష్ట్వేతి. ఆత్మనస్తంద్రిణా ఆలస్యేన. సృష్ట్వా తాంశ్చ నగ్నాన్ ముక్తకేశాన్ వీక్ష్య. నేత్రే నిమీలితవాన్. ॥ 40 ॥

బ్రహ్మదేవుడు భావగంభీరములు స్పష్టమగునట్లు నవ్వెను. ఆయన స్వరూపము, తన సౌందర్యమును తానే ఆస్వాదించుచున్నదా అన్నట్లుండెను. ఆయన తననుండి గంధర్వ గణములను, అప్సరసల గణములను సృష్టించెను. ॥ 38 ॥

పిదప బ్రహ్మ సౌందర్యముతో గూడిన ఆ శరీరమును కూడా విడిచిపెట్టెను. ఆ విడిచిన శరీరమే వెన్నెలయయ్యెను. ఆ వెన్నెల రూపానయున్న దానిని విశ్వావసువు మొదలగు గంధర్వులు ప్రేమతో స్వీకరించిరి. ॥ 39 ॥

బ్రహ్మదేవుడు తన అలసత్వము(మందత్వము) నుండి భూత పిశాచములను సృష్టించెను. ఆ భూత పిశాచములు దిగంబరముగా జుట్టు విరబోసుకొని యుండగా చూచి బ్రహ్మ కళ్ళు మూసుకొనెను. 40

శ్లో ॥ జగృహుస్తద్విసృష్టాంతాం జృంభణాఖ్యాం తనుం ప్రభోః ।
నిద్రామింద్రియవిక్లేదో యయా భూతేషు దృశ్యతే ।
యేనోచ్ఛిష్టాన్ ధర్షయంతి తమున్మాదం ప్రచక్షతే ॥ 41

టీ:- జగృహురితి. ఇంద్రియాణాం విక్లేదః స్రావో యయా. తాం నిద్రాం ప్రచక్షతే. యేనేంద్రియ విక్లేదేన హేతునా. ఉచ్ఛిష్టాంశ్చ సతః ధర్షయంతి. భ్రాంతాన్ కుర్వంతి. తం భూతాది గణం ఉన్మాదం ప్రచక్షతే. ఏవం తంద్రాజృంభికానిద్రోన్మాద హేతుత్వేన భూతాదీనాం తనూనాం చ చాతుర్విధ్యముక్తం ॥ 41 ॥

బ్రహ్మదేవుడు "ఆవులింత"ను విడిచిపెట్టెను. ఆ "ఆవులింత"ను భూత పిశాచములు గ్రహించినవి. అదియే ఇంద్రియములకు వివశతను కూర్చే నిద్ర అయినది. జనులు అపవిత్రులై యున్నప్పుడు భూతాదులు వారిని ఆవేశించి మోహితులను చేయును. అదియే ఉన్మాదము. ఈ ఉన్మాదము కూడా బ్రహ్మదేవుడు విడిచిన శరీర ధర్మమే. ఈ విధముగా 1.తంద్రీ (సోమరితనము, ఆలస్యము లేక అలసత్వము) 2.ఆవులింత, 3.నిద్ర, 4.ఉన్మాదము అని భూత పిశాచముల శరీరములు నాల్గు విధములు. ॥ 41 ॥

శ్లో ॥ ఊర్జస్వంతం మన్యమాన ఆత్మానం భగవానజః ।
సాధ్యాన్ గణాన్ పితృగణాన్ పరోక్షేణాసృజత్ప్రభుః ॥ 42

టీ:- ఊర్జస్వంతం అన్నమదంతం. సాధ్యానితి. పరోక్షేణ అదృశ్య రూపేణ. ॥ 42 ॥

పిమ్మట భగవంతుడైన బ్రహ్మ తనను బలవంతునిగా భావించి అదృశ్య రూపముతో సాధ్యులను (దేవతలను), పితృగణములను సృష్టించెను. ॥ 42 ॥

శ్లో ॥ త ఆత్మసర్గం తం కాయం పితరః ప్రతిపేదిరే ।
సాధ్యేభ్యశ్చ పితృభ్యశ్చ కవయో

టీ:- ఆత్మనస్సర్గో యస్మాత్తమ్. సాధ్యేభ్యఇతి. యత్ యేన కాయేన సంప్రదానత్వ నిమిత్తేన కవయః కర్మ కోవిదాః. సాధ్యేభ్యః పితృభ్యశ్చ పితృరూపేభ్యః వితన్వతే శ్రాద్ధాదినా హవ్యం కవ్యం చ దదతి. 43

ఆ సాధ్యులు, పితృదేవతలు తమకు జన్మనిచ్చిన ఆ యదృశ్య శరీరమును స్వీకరించిరి. కర్మ కోవిదులైన విద్వాంసులు దీనిని నిమిత్తముగా జేసికొనియే పితరులకు కవ్యములను, సాధ్యులకు

శ్లో ॥ సిద్ధాన్ విద్యాధరాంశ్చైవ తిరోధానేన సోఽసృజత్ ।
తేభ్యోఽదదాత్త మాత్మానమంతర్ధానాఖ్య మద్భుతమ్ ॥ 44

టీ:- తిరోధానేన దృశ్యత్వే. సత్యప్యంతర్ధారశక్త్యా తేభ్య ఇతి. తమప్యంతర్ధాన శక్తిం ॥ 44 ॥

శ్లో ॥ సకిన్నరాన్కింపురుషాన్ ప్రత్యాత్మ్యేనా సృజత్ ప్రభుః ।
మానయన్నాత్మనాత్మానమాత్మాభాసం విలోకయన్ ॥ 45

టీ:- ప్రత్యాత్మనా ప్రతిబింబేన. మానయన్నితి. ఆత్మాభాసం ప్రతిబింబం ఆత్మనా. ఆత్మనః మానో నామ. ప్రతిబింబ దర్శనః సుందరస్య శిరః కంపాదిచేష్టా. మిథునీభూయేతి. అతఏవ తత్సృష్టానాం మిథః సంమానేన నిత్యం మిథునీ భావః. 45

శ్లో ॥ తే తు తం జగృహూరూపంత్యక్తం యత్పరమేష్ఠినా ।
మిథునీభూయ గాయంతస్తమేవోషసి కర్మభిః ॥ 46 ॥

టీ:- తత్స్వప్రతిబింబ రూపం కర్మభిః తత్పరాక్రమానువర్ణనైః ॥ 46 ॥

హవ్యములను ఇచ్చుచున్నారు. ॥ 43 ॥

బ్రహ్మ తన అంతర్ధానశక్తితో సిద్ధులను విద్యాధరులను సృష్టించెను. వారికి అద్భుతమగు ఆ అంతర్ధాన శక్తిని ఇచ్చెను. 44

బ్రహ్మ తన ప్రతిబింబమును చూచి తనను తానే చాలా సుందరుడుగా భావించుకొని దానిచేత కిన్నరులను కింపురుషులను సృష్టించెను. అందుకే అలా సృష్టించబడిన కిన్నర కింపురుషులకు లేని (మిథ్యా) సన్మానము(గౌరవము)తో ఎల్లప్పుడు మిథునీభావము (జంట కూడే లక్షణము) ఎక్కువ. మనస్సులోని భావములు, శిరః కంపాదులు మొదలగు చేష్టల ద్వారా ప్రతిబింబించునట్లు, బ్రహ్మ మనోభావములే కిన్నర కింపురుషులకు లేని (మిథ్యా) మిథునీభావమును కలిగించినవి. ॥ 45 ॥

బ్రహ్మ విడిచిపెట్టిన ఆయన ప్రతిబింబ శరీరమును వారు గ్రహించిరి. అందువలననే కిన్నర కింపురుషులు జంటలుగా ఏర్పడి బ్రహ్మదేవుని పరాక్రమమును గానము చేయుచుందురు. ॥ 46 ॥

శ్లో ॥ దేహేన వై భోగవతా శయానో బహుచింతయా ।
సర్గేఽనుపచితే క్రోధాదుత్ససర్జ హ తద్వపుః ॥ 47

టీ:- భోగః ఆభోగో విస్తారః. పాదాది ప్రసరణం తద్వతా దేహేన. సర్గ ఇతి. అనుపచితే వృద్ధిమప్రాప్తే తద్భోగం క్రోధాదియుక్తమ్. అముతః అముష్మాత్ దేహాత్. ॥ 47 ॥

బ్రహ్మ సృష్టివిస్తారము చెందకుండుటచే పలువిధములుగా చింతించెను. కాళ్ళు చేతులను చాచి పడుకొనెను. పిమ్మట కోపము వచ్చినవాడై ఆ శరీరమును వదిలిపెట్టెను. ॥ 47 ॥

శ్లో ॥ యేఽహీయంతాముతః కేశా అహయస్తేంగ జజ్ఞిరే ।
సర్పాః ప్రసర్పతః క్రూరా నాగా భోగోరుకంధరాః ॥ 48

టీ:- యే కేశాః. అహీయంత ప్రచ్యుతాః. తే అహయో జాతాః సర్పా ఇతి. ప్రసర్పతః పాదాద్యాకుంచనైః ప్రచలతః అముష్మాత్సర్పాః అత ఏవ అగా న భవంతీతి నాగాః. అతి వేగవంత ఇత్యర్థః. భోగవతో జాతత్వాత్ భోగేన ఫణేన ఉర్వీ విస్తీర్ణా కంధరా యేషాం. సర్వే చ తత్క్రోధ యోగా త్క్రూరాః. తేషాం చావాంతరజాతిభేదాః. సర్పసిద్ధాంతే ప్రసిద్ధాః॥ 48 ॥

ఓ విదురా! ఈ దేహము నుండి జారిపడిన కేశములు పాములుగా పుట్టెను. పాదములు, చేతులు మున్నగునవి క్రూర విష సర్పములైనవి. ఇవి పాదాదులు ముడుచుకొని నడుచుట వలన "న అగాః" అనునర్థములో "నాగాః" అయినది. పడగలచే విస్తరించిన మెడలుగలవి త్రాచు పాములైనవి.(భోగము గలది భోగి). బ్రహ్మదేవుడు కోపముతో విడిచిన శరీరము నుండి ఏర్పడినందున ఇవన్నియు కోపముగలిగి, క్రూర స్వభావము కలవయ్యెను. ॥ 48 ॥

శ్లో ॥ స ఆత్మానం మన్యమానః కృతకృత్యమివాత్మభూః ।
తదా మనూన్ ససర్జాంతే మనసా లోకభావనాన్ ॥ 49

టీ:- యదా మన్యమానోऽభూత్. తదేతి. తదా మనూన్ ససర్జ. 49

బ్రహ్మ తనను కృతకృత్యుడిగా భావించుకొనెను. అప్పుడు ఆయన మనస్సు ద్వారా సర్వప్రజావృద్ధికై లోకములను పాలించే మనువులను సృష్టించెను. ॥ 49 ॥

శ్లో ॥ తేభ్యః సోऽత్యసృజత్ స్వీయం పురం పురుషమాత్మవాన్ ।
తాన్ దృష్ట్వా యే పురా సృష్టాః ప్రశశంసుః ప్రజాపతిమ్ ॥50

టీ:- తేభ్యః స్వీయం పురుషాకారం పురం దేహం వ్యసృజత్ దదౌ. తానితి. తాన్ మనూన్. ॥ 50 ॥

సమష్టిజీవుడై అందరకు ఆశ్రయుడైన బ్రహ్మ, పురుషాకారము లోనున్న తన దేహమును మనువులకు విడిచిపెట్టెను. మనవులకన్నా ముందు (పూర్వము) సృషించబడిన దేవతలు మొదలగు వారు మనువులను చూచి బ్రహ్మదేవుని పొగడిరి. ॥ 50 ॥

శ్లో ॥ అహో ఏతజ్జగత్స్రష్టః సుకృతం బత తే కృతమ్ ।
ప్రతిష్ఠితాః క్రియా యస్మిన్ సాకమన్నమదామహే ॥ 51

టీ:- తే త్వయా కృతం పుణ్యం. సుకృతత్వమాహుః - ప్రతిష్ఠితాఇతి. యస్మిన్మనుసర్గే. క్రియా అగ్నిహోత్రాద్యాః. అతో యస్మిన్ సర్వే వయం సాకం సహ అన్నం హవిర్భాగాది. అదామ భక్షయామ. హే బ్రహ్మన్. ॥ 51 ॥

ఓ బ్రహ్మదేవుడా! మన్వాదులను సృష్టించుట వలన నీవు చేసిన ఈ సృష్టి చాలా బాగున్నది. దీని వలన అగ్నిహోత్రాది కార్యములు ప్రతిష్ఠితములైనవి. వాటివలన మేమందరము కలిసి హవిర్భాగములు భక్షించెదము. ॥ 51 ॥

శ్లో ॥ తపసా విద్యయా యుక్తో యోగేన సుసమాధినా ।
ఋషీనృషిర్హృషీకేశః ససర్జాభిమతః ప్రజాః ॥ 52

టీ:- మనుసృష్టిముక్త్వా ఋషీణాం సృష్టిమాహ. తపసేతి విద్యా ఉపాసనా. తయా చ యోగోఽత్ర ఆసనాదిః. తేన చ సుసమాధిః వైరాగ్యైశ్వర్యాదియుక్తః సమాధిః తేన చ. యుక్తః. ఋషీనితి. హృషీకేశః స్వవశేంద్రియస్సన్. ఋషిః బ్రహ్మా ఋషీన్ ప్రజాస్ససర్జ. 52

బ్రహ్మ చేసిన మనువుల (శరీర) సృష్టిని చెప్పిన పిదప ఋషుల (మానసిక)సృష్టిని చెప్పుచున్నాడు. బ్రహ్మ ఇంద్రియములను జయించిన - వాడు. మొదటి ఋషి అయి తపస్సుచేత, ఉపాసనతోను, వైరాగ్యైశ్వ-ర్యాదులతోను(సమాధితో), యోగముతోను (ఆసనాదులతోను) కూడిన-వాడై ప్రియమైన సంతానమును (ఋషులను) సృష్టించెను. 52

శ్లో ॥ తేభ్యశ్చైకైకశః స్వస్య దేహస్యాంశమదాదజః ।
యత్తత్సమాధియోగర్ధి తపో విద్యా విరక్తిమత్ ॥ 53

టీ:- కింతద్దేహం యస్యాంశమదాదిత్యత ఆహ - యదితి. సమాధిశ్చ యోగశ్చ బుద్ధిశ్చ ఐశ్వర్యం చ తపశ్చ విద్యా చ విరక్తిశ్చ విద్యంతే యస్మిన్ తత్. 53

(బ్రహ్మదేవుని దేహమేమిటి? ఆయన ఏ యే అంశముల నిచ్చినాడు? అనే విషయము చెప్పుచున్నాడు) బ్రహ్మదేవుని దేహము సమాధి, యోగము(ఆసనాద్యంష్టాంగ యోగము), అణిమాద్యష్టసిద్ధులు, తపస్సు, ఉపాసన(విద్య), వైరాగ్యము అనే వాటితో కూడియుండును ఆయన ఒక్కొక్క అంశమును ఒక్కొక్క మహర్షికి ఇచ్చెను. ॥ 53 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
వింశతితమోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఇరువదియవ అధ్యాయము సమాప్తము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

### ఏకవింశోఽధ్యాయః

శ్లో ॥ ఏకవింశే తపో విద్యా తోషితేన తు విష్ణునా ।
కర్దమస్య మనోః పుత్ర్యా వివాహ ఘటనోచ్యతే ॥

విదుర ఉవాచ

శ్లో ॥ స్వాయంభువస్య చ మనోర్వంశః పరమసమ్మతః ।
కథ్యతాం భగవన్ యత్ర మైథునేనైధిరే ప్రజాః ॥ 1

టీ:- స్వాయంభువస్యేతి. ఏధిరే ఏధాం చక్రిరే. ॥ 1 ॥

శ్లో ॥ ప్రియవ్రతోత్తానపాదౌ సుతౌ స్వాయంభువస్య వై ।
యథా ధర్మం జుగుపతుః సప్తద్వీపవతీం మహీమ్ ॥ 2

టీ:- ప్రియవ్రతేతి. ధర్మం మహీం చ యథా జుగపతుః రరక్షతుః. తన్మే వదేతి తృతీయేనాన్వయః. ॥ 2 ॥

శ్లో ॥ తస్య వై దుహితా బ్రహ్మన్ దేవహూతీతి విశ్రుతా ।
పత్నీ ప్రజాపతేరుక్తా కర్దమస్య త్వయానఘ ॥ 3

టీ:- తస్యేతి. తస్య మనోః. ॥ 3 ॥

### 21 వ అధ్యాయము.

(ఈ ఇరువది యొకటవ అధ్యాయమున మను పుత్రికయగు దేవహూతితో కర్దమునికి జరిగిన వివాహము వర్ణింపబడినది.)

విదురుడు ఇట్లు పలికెను

ఓ పూజ్యుడైన మైత్రేయా! స్వాయంభువవంశమును సత్పురుషులు, మహాత్ములు కూడా ఆదరింతురు. స్త్రీ పురుష సంయోగ రూపముగా (మైథున ధర్మము) ఆ వంశము ఎట్లు పెరిగి పెద్దది అయినదో వివరించి చెప్పుము. ॥ 1 ॥

స్వాయంభువ మనువు యొక్క కుమారులు ఇద్దరు. ఒకడు ప్రియవ్రతుడు. మరియొకడు ఉత్తానపాదుడు. వారివురు ఈ సప్త ద్వీపములతో కూడి యున్న భూమండలమును ధర్మము తప్పకుండా పరిపాలించిరి. తస్యాం స వై అనే మూడవ శ్లోకముతో అన్వయము.॥2॥

ఓ మహాత్మా! స్వాయంభువమనువునకు "దేవహూతి" యని ఒక బిడ్డయుండెననియు, ఆమె కర్దమప్రజాపతి యొక్క భార్యయనియు మీరు చెప్పియుంటిరి. ॥ 3 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ తస్యాం స వై మహాయోగీ యుక్తాయాం యోగలక్షణైః ।
ససర్జ కతిధా వీర్యం తన్మేశుశ్రూషవే వద ॥ 4

టీ:- తస్యామితి. యోగస్య లక్షణైర్యమాదిభిర్యుక్తాయామ్. కతిధా వీర్యం ససర్జ. కతి పుత్రానుత్పాదయామాసేత్యర్థః. ॥ 4 ॥

మహాయోగి అయిన కర్దముడు యోగలక్షణములతో కూడి యున్న దేవహూతియందు ఎంత మంది సంతానమును కనెను? నేను ఈ విషయమును వినగోరుచున్నాను. దయచేసి చెప్పవలసినది. 4

శ్లో ॥ రుచిర్యో భగవాన్ బ్రహ్మన్ దక్షో వా బ్రహ్మణస్సుతః ।
యథా ససర్జ భూతాని లబ్ధ్వా భార్యాం చ మానవీమ్ ॥ 5

టీ:- రుచిరితి. మానవీం మనోః కన్యామాకూతిం చ ప్రసూతిం చ భార్యాం లబ్ధ్వా. యథా భూతాని ససర్జ తచ్చ వదేతి చకారస్యార్థః. ।5

ఓ మహర్షీ! మనువు కుమార్తెయైన ఆకూతిని రుచిప్రజాపతి వివాహమాడెను. బ్రహ్మపుత్రుడగు దక్షుడు, ప్రసూతిని భార్యగా పొందెను. ఈ రెండు జంటలు ప్రాణులను సృష్టించిన విధము తెలియ జేయుడు. ॥ 5 ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ ప్రజాస్సృజేతి భగవాన్ కర్దమో బ్రహ్మణోదితః ।
సరస్వత్యాం తపస్తేపే సహస్రాణాం సమాదశ ॥ 6

టీ:- ప్రజాఇతి. సహస్రాణాం సమాః దశ-దశ సహస్రాణి సంవత్సరా నిత్యర్థః. ॥ 6 ॥

మైత్రేయుడు ఇట్లు పలికెను

బ్రహ్మ ప్రజలను సృష్టించవలసినదిగా పూజ్యుడగు కర్దముని కోరెను. ఆయన (కర్దముడు) పదివేల సంవత్సరములు సరస్వతీనదీ తీరమందు తపస్సు చేసెను. ॥ 6 ॥

శ్లో ॥ తతస్సమాధి యుక్తేన క్రియాయోగేన కర్దమః ।
సంప్రపేదే హరిం భక్త్యా ప్రపన్న వరదాశుషమ్ ॥ 7

టీ:- తతఇతి. తతస్తస్మింస్తపసి క్రియాయోగేన పూజా ప్రకారేణ. సంప్రపేదే సిషేవే. ప్రపన్నేభ్యో భక్తేభ్యో వరదాతారం. ॥ 7 ॥

ఆ తపస్సులో కర్దముడు సమాధియుక్తుడై,(చిత్తైకాగ్రము కల వాడై), పూజా విధానము ద్వారా, శరణాగతులకు వరములనిచ్చే శ్రీహరిని భక్తితో ఆరాధించెను. ॥ 7 ॥

శ్లో ॥ తావత్ప్రసన్నో భగవాన్ పుష్కరాక్షః కృతే యుగే ।
దర్శయామాస తం క్షత్తః శాబ్దం బ్రహ్మ దధద్వపుః ॥ 8

టీ:- తావదితి. శబ్దైకవేద్యం యద్బ్రహ్మ తన్మయం వపుః దధత్ తం ప్రత్యాత్మానం దర్శయామాస. ॥ 8 ॥

ఓ విదురా! కర్దముడు ఇట్లు కృతయుగమున తపస్సు చేయగా, శ్రీహరి శబ్దబ్రహ్మమయమైన రూపమును దాల్చి దర్శనమిచ్చెను. 8

శ్లో ॥ స తం విరజమర్కాభం సితపద్మోత్పలస్రజమ్ ।
స్నిగ్ధ నీలాలక వ్రాత వక్త్రాబ్జం విరజోంబరమ్ ॥ 9

టీ:- స ఇతి. స కర్దమస్తం ఖే౽వస్థితం దృష్ట్వా మూర్ధ్నా క్షితావపతత్. గీర్భిశ్చాభ్యగృణాదితి చతుర్థేనాన్వయః. పద్మోత్పలే దినరాత్రివికాసే. సితానాం. పద్మానాం. ఉత్పలానాం చ స్రగ్యస్య తం. స్నిగ్ధాః నీలాశ్చ యే అలకాః. తేషాం వ్రాతః వక్త్రాబ్జే యస్య. ॥ 9 ॥

ఆకాశములోనున్న శ్రీహరిని చూచి కర్దముడు నేలపై సాష్టాంగ నమస్కారము చేసెను. ఇక్కడి నుండి నాల్గవ శ్లోకము జాత హర్షో...(శ్లోక సంఖ్య 12) లో నున్న గీర్భిశ్చాభ్యగృణన్ తో అన్వయము. ఇది కర్దమునకు దర్శనమిచ్చిన శ్రీహరి వర్ణన. ఆ శ్రీహరి సూర్యుని వలె నిర్మలముగా ప్రకాశించుచుండెను. ఆయన తెల్లని పద్మములు మరియు నల్లని కలువలతో కూడియున్న మాలను ధరించెను. ఆయన ముఖ - పద్మము దట్టమైన నల్లని కేశ సముదాయముతో నుండెను. గొప్ప

శ్లో॥ కిరీటినం కుండలినం శంఖ చక్ర గదా ధరమ్ ।
శ్వేతోత్పల క్రీడనకం మనస్స్పర్శస్మితేక్షణమ్ ॥ 10

టీ:- కిరీటినమితి. శ్వేతోత్పలం క్రీడనకం యస్య. మనస్స్పర్శం మనస్యానందజనకం స్మితం ఈక్షణం చ యస్య. తమ్. ॥ 10 ॥

శ్లో॥ విన్యస్య చరణాంభోజమంసదేశే గరుత్మతః ।
దృష్ట్వా ఖేఽవస్థితం వక్షశ్శ్రియం కౌస్తుభకంధరమ్ ॥ 11

టీ:- విన్యస్యేతి. వక్షసి శ్రీర్యస్య కౌస్తుభం కంధరాయాం యస్య. 11

శ్లో॥ జాత హర్షో ఽపతన్మూర్ధ్నా క్షితౌ లబ్ధమనోరథః ।
గీర్భిస్త్వభ్యగృణాత్ప్రీతి స్వభావాత్మా కృతాంజలిః ॥ 12

టీ:- జాతేతి. ప్రీతిరేవ స్వభావః స్వతస్సిద్ధో ధర్మో యస్య తథా విధ ఆత్మా మనో యస్య. ॥ 12 ॥

కిరీటమును ధరించి కుండలములతో ప్రకాశించుచుండెను. స్వచ్ఛమగు వస్త్రములను ధరించియుండెను. ఈ రకముగా శోభిల్లుతున్న శ్రీహరి కర్దమునకు దర్శనమిచ్చెను. 9

కిరీటములను ధరించినవాడును, కుండలములు కలవాడును, శంఖచక్రగదాధరుడును, తెల్లకలువతో విలాసముగా ఆడుచున్న వాడును, చూపులతో, చిరునవ్వులతో మనస్సుకు ఆనందమును కలిగించువాడును యగు శ్రీహరిని కర్దముడు దర్శించెను. 10

ఆకాశములో గరుత్మంతునిభుజములపై పద్మములవంటి పాదములనుంచినవాడును, మెడలో కౌస్తుభమణిని ధరించిన వాడును, వక్షఃస్థలముపై లక్ష్మీదేవి కలవాడును యగు శ్రీహరిని కర్దముడు దర్శించెను. ॥ 11 ॥

కర్దమునికి తన కోరిక తీరుటచే సంతోషము కలిగెను. ఆయన ప్రేమయే స్వభావముగా గల హృదయము గలవాడు, ధర్మవిధిని ఎరిగిన వాడు కనుక స్వతహాగా, శ్రీహరిని దర్శించగానే నేలపై సాష్టాంగ నమస్కారము చేసి, చేతులు జోడించి స్తుతించెను. ॥ 12 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

కర్దమ ఉవాచ

శ్లో ॥ జుష్టం బతాద్యాఖిలసత్త్వరాశేః
సాంసిధ్యమక్ష్ణోస్తవ దర్శనాన్నః ।
యద్దర్శనం జన్మభిరీడ్య సద్భిః
ఆశాసతే యోగినో రూఢయోగాః ॥ 13

టీ:- త్వామృతే పరమానందం ధిగస్యవరకాముకమ్, తథాపి కృపణం మానుగృహాణ వరదానతః. జుష్టమితి. బతేతి హర్షే. హే ఈడ్య, నోఽస్మాభిః. సమగ్రసత్త్వనిధేః తవ. దర్శనాదద్య అక్ష్ణోస్సాంసిద్ధ్యం సాఫల్యం. జుష్టం సేవితం. త్వద్దర్శనమేవ మహాఫల మిత్యుపపాదయతి. యస్య తవ దర్శనం సద్భిరుత్తరోత్తర మాపాదితప్రకర్షైః సంపాదితప్రకర్షైః జన్మభీ రూఢో విరూతో యోగో యైస్తేఽపి. ॥ 13 ॥

శ్లో ॥ యే మాయయా తే హతమేధసస్త్వత్
పాదారవిందం భవసింధుపోతమ్ ।
ఉపాసతే కామలవాయ తేషాం
రాసీశ కామాన్నిరయేఽపి యే స్యుః ॥ 14

టీ:- సకామ భక్తాన్ విగర్హయన్నాహ- య ఇతి. హేఈశ, నిరయేఽపి స్యుస్తేషాం. కామానాం లవాయ. యే త్వన్మాయయా నష్టబుద్ధయః త ఏవోపాసతే. త్వం తు తేషాం తాన్ కామానపి రాసి దదాసి. ॥ 14॥

కర్దమ ఋషి పలుకుచున్నాడు

పొగడదగిన ఓ శ్రీహరీ! ఆహా! సంపూర్ణ సత్త్వగుణ నిధానమయిన నీ దర్శనముతో నా కన్నులు సఫలమైనవి. యోగసిద్ధులు అనేక జన్మలలో గొప్పపుణ్యము చేసి ఆ పుణ్య ఫలముగా నిన్ను దర్శించుటకు ప్రార్థింతురు.

శ్లో. త్వామృతే పరమానందం ధిగస్యవరకాముకమ్ ।
తథాపి కృపణం మానుగృహాణ వరదానతః. ॥
అను శ్లోకము ఈ సందర్భముగా స్మరణీయము. ॥ 13 ॥

సకామ భక్తులను గర్హించుచు చెప్పుచున్నాడు. ఓ ఈశ్వరా! నీ మాయచేత బుద్ధిని కోల్పోయిన జనులు సంసార సముద్రమును దాటుటకు నావవంటిదగు నీ పాదపద్మమును చిన్న చిన్న కోరికలకై సేవించుచున్నారు. నీవు వారి ఆ చిన్న కోరికలను తీర్చుచున్నావు. ఈ కోరికలు నరకములో నైనను తీరును. (వీటికోసం నిన్నాశ్రయించ అవసరంలేదు) 14

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ తథా స చాహం పరివోఢు కామః
సమానశీలాం గృహమేధ ధేనుమ్ ।
ఉపేయివాన్మూలమశేష మూలమ్
దురాశయః కామదుఘాంఘ్రిపస్య ॥ 15

టీ:- యః సకామాన్నిందామి సోఽహమపి తాదృశఏవేత్యాహ-తథేతి. గృహమేధః గృహాశ్రమః. తత్ర ధేనుం త్రివర్గ దోగ్ధ్రీం భార్యాం. పరివోఢుకామః పరిణేతుమిచ్ఛన్. కామదుఘాంఘ్రిపస్య కల్పద్రుమస్య తవ. మూలం అంఘ్రిం. ఉపేయివాన్ ఉపగతోఽస్మి. నను కామాద్యర్థం. అన్యత్ కిమప్యుపాస్యతాం- న. యతోఽశేష పురుషార్థ మూలమేతదేవ. 15

సకామోపాసనను నిందిస్తూ తాను కూడా అలాంటి వాడినేనని చెప్పుచున్నాడు. నేను కూడా అలాంటి కామకలుషిత చిత్తము గల వాడను. నా స్వభావమునకు దగినదియు, ధర్మార్థకామములనిచ్చే విషయంలో కామధేనువు లాంటిదియునగు భార్య కొరకై నీ పాద మూలమును ఆశ్రయించినాను. నీ పాదమూలము భక్తుల కోరికలను తీర్చే కల్పవృక్షము. సమస్త పురుషార్థములకు మూలము. ॥ 15 ॥

శ్లో ॥ ప్రజాపతేస్తే వచసాధీశ తంత్యా
లోకః కిలాయం కామహతోఽనుబద్ధః ।
అహం చ లోకానుగతో వహామి
బలిం చ శుక్లాఽనిమిషాయ తుభ్యమ్ ॥ 16

టీ:- నను తర్హి ముక్త్యర్థమేవ కిం న భజసి. అనధికారాదిత్యాహ - ప్రజాపతేరితి. హే అధీశ యస్త్వం ప్రజాపతిః.తస్య తవ వచసా తంత్యా అయం కామహతో లోకః. పశువద్బద్ధః. హే శుక్ల శద్ధధర్మమూర్తే.

అయినప్పుడు ముక్తికొఱకే ఎందుకుపాసించలేదనే ప్రశ్నకు అనధికారమనే కారణమును తెల్పుచున్నాడు. ఓ దేవా! ప్రజా పాలకుడవగు నీవు నీ ఉపదేశమనే త్రాటిచే (వేదమనే త్రాటిచే) బంధించినావు. ఈ లోకము కామనచే పీడింపబడుతూ పశువువలె బంధింపబడినది. ఓ సత్త్వమూర్తీ! నేను కూడా లోకము తీరుగా కామగతుడనయి కాలస్వరూపుడవైన నిన్ను భార్యార్థమై పూజాదులతో ఆరాధించుచున్నాను. ఈ శ్లోకములోని "చ" శబ్దము లోకుల తీరు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

అహం చ కిల లోకానుగతః అతస్తుభ్యం బలిం వహామి. కర్మమయీాం త్వదాజ్ఞామనువర్తే అనిమిషాయ కాలాత్మనే. తదర్థం భార్యాం చేచ్ఛామీతి చకారస్యార్థః. న కేవలం లోకానుగతో వహామి. కింతు ఋణ త్రయాపాకరణార్థమితి కిలేత్యుక్తమ్. ॥ 16 ॥

ధర్మ,అర్థ, కామములు పొందుటకు అనే భావమును తెలియుచేయుచున్నది. "కిల" శబ్దము లోకానుసర్గమునకు మాత్రమేగాక ఋణత్రయ విముక్తి కొరకు గూడా యని తెలుపుచున్నది. ॥ 16 ॥

శ్లో ॥ లోకాంశ్చ లోకానుగతాన్పశూంశ్చ
హిత్వా శ్రితాస్తే చరణాతపత్రమ్ ।
పరస్పరం త్వద్గుణవాదశీధు
పీయూష నిర్యాపిత దేహధర్మాః ॥ 17

టీ:- అనిమిషాయేత్యనేన కాలాత్మకాత్త్వత్తో భీతస్సన్ కర్మకరో - మీత్యుక్తం. ఏతత్తు భయం త్వద్భక్తానాం నాస్తీత్యాహ - ద్వాభ్యాం. లోకానితి. లోకాన్ కామాదిభూతాన్. తాననుసృతాన్ పశూంశ్చ. వివేకే సత్యపి. పునః కర్మజడాన్ మాదృశాన్ హిత్వా అనాదృత్య. తే తవ చరణరూపమాతపత్రమాశ్రితాః. తానేవాహ - త్వద్గుణానాం వాదః కథా తదేవ సీధు. సంసారక్లేశ విస్మారకత్వాత్. పీయూషం జరా మరణ నివర్తకత్వాత్. రుచికరత్వాచ్చ. తేన నిర్యాపితాః విలోపితాః. దేహధర్మాః క్షుత్పిపాసాదయో యైస్తేషామిత్యుత్తరేణాన్వయః 17

'అనిమిషాయ' అనే మాటతో కాలస్వరూపుడవైన నీకు భయపడి కర్మచేయుచున్నానని భావము. ఈ రకమైన భయము నీ భక్తులకు లేదని ఈ రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు. భక్తులైనవారు కామపరులైన జనులను మరియు వారిననుసరించేవారిని (అనుయా- యులను) లెక్కచేయరు. వారు (భక్తులు) పరస్పరము నీ గుణకథా - మృతమును త్రాగుట ద్వారా ఆకలిదప్పులు జరామరణములు, సంసార - క్లేశములు మొదలగు దేహధర్మములు లేనివారుగా నుందురు. నీ కథామృతము మత్తెక్కించేదిగాయుంటూ లోకధర్మమును మరిపించును. వివేకము న్నప్పటికిని కర్మజడులైన వారిని (నా వంటి) నిరాదరించి ఎవరైతే నీ చల్లని పాదములనే గొడుగును ఆశ్రయిస్తారో, అట్టి భక్తులను గురించే 'ఏషాం' అని తరువాతి శ్లోకముతో అన్వయించి చెప్పుచున్నాడు. 17

శ్లో ॥ న తేఽజరాక్ష భ్రమిరాయురేషాం
త్రయోదశారంత్రిశతం షష్టిపర్వ ।
షణ్నేమ్యనంతచ్ఛది యత్త్రినాభి
కరాళ స్రోతో జగదాచ్ఛిద్య ధావత్ ॥ 18

టీ:- నేతి. తవ యత్త్రినాభి కాలచక్రం. తజ్జగదాచ్ఛిద్య ఆకృష్య. ధావదపి. తేషాం త్వద్భక్తానాం. ఆయురాచ్ఛిద్య ధావన్న భవతి. కథం భూతం. అజరం అక్షరం యద్బ్రహ్మ. తస్మిన్నక్షరరూపే భ్రమిః భ్రమణమ్. భ్రమదితి వక్తవ్యే. అతి భ్రమణ శీలత్వాదుపచారేణ భ్రమిరిత్యభేదనిర్దేశః అధికమాసేన సహ త్రయోదశమాసాః అరా యస్య తత్. త్రిశతం షష్టిశ్చాహోరాత్రాణి పర్వాణి యస్య. శత శబ్దే విభక్తేరలుగార్షః. షడృతవో నేమయో యస్య. అనంతాః క్షణలవాదయః ఛదాః పత్రాణి యస్య పత్రాకారా ధారా యస్య సంతీతి. త్రీణి చాతుర్మాస్యాని. నాభయ ఆధారభూతాని వలయాని యస్య. కరాళస్రోతస్తీవ్ర వేగం. ఏతైర్విశేషణైరేవ సంవత్సరాత్మకం చక్రముక్తమితి ద్రష్టవ్యమ్. ॥ 18 ॥

సంవత్సరమనే నీ కాలచక్రము పరబ్రహ్మ (అజరము) అనే ఇరుసు నందు నిరంతరము తిరుగుచుండును. ఈ కాలచక్రమునందు అధిక మాసముతో కలిసి పదమూడు మాసములు అనే ఆకులుండును. ఋతువులు అనే ఆరు పరిధులు (కమ్మీలు లేక అంచులు) ఉండును. ఆ కాలచక్రముపై క్షణములు, నిమిషములు, అహోరాత్రములు, అయనములు, మున్నగు లెక్కలేనన్ని పత్రములు చెక్కబడి ఉండును. నాల్గునెలల కాలము (ఎండకాలము, వానాకాలము, చలికాలము) అనే కాలఖండములు ఈ కాలచక్రము నందలి నాభులు. (ప్రధానా - ధారములు). దీని వేగము తీవ్రమైనది. ప్రపంచమంతటిని తనవైపు లాగుకొని పరుగెత్తును. కాని నీ భక్తుల ఆయుర్దాయమును మాత్రము (కాలము) వ్యర్థము చేయజాలదు. అనగా వ్యర్థ కాలక్షేప ముండదు. భగవత్సేవలో వారి కాలము గడచునని భావము. 18

శ్లో ॥ ఏకః స్వయం సన్ జగతస్సిసృక్షయా
ద్వితీయయాత్మన్నధి యోగమాయయా ।
సృజ స్యదః పాసి పునర్గ్రసిష్యసే
యథోర్ణనాభిర్భగవన్ స్వశక్తిభిః ॥ 19

ఓ భగవానుడా! సృష్టికి పూర్వము నీవు స్వయముగ ఒక్కడవే యున్నావు. నీకు సృష్టి చేయవలెననే కోరిక కలిగెను. యోగమాయకు నీవే అధిష్ఠానమవు. యోగమాయ నీకంటె వేరు కాదు. యోగమాయ

టీ:- నను నిరుపాధిముదాసీనం మాం కిం యాచసే తథాపి మాయయా విశ్వసృష్ట్యాదికర్తృత్వాత్త్వమేవ యాచ్య ఇత్యాహ- ఏక ఇతి. స్వయమేక ఏవ సన్నపి ఆత్మన్యధికృతయా. యోగమాయయా హేతు భూతయా యాః స్వీకృతాస్స్వశక్తయః. సత్త్వాద్యాః తాభిః. అదో విశ్వం స్వవ్యతిరిక్త సాధనాపేక్షత్వే దృష్టాంతః-యథేతి. ॥ 19 ॥

సత్త్వరజస్తమో గుణాత్మకమైనది. సాలెపురుగు తన గూడును తానే ఏర్పరచి తానే తొలగించునట్లు ఈ జగత్తును సృష్టించి పాలించి తిరిగి నీవే ప్రళయకాలములో నశింపజేయుచున్నావు. ॥ 19 ॥

శ్లో ॥ నైతద్బతాధీశ పదం తవేప్సితం
యన్మాయయా నస్తనుషే భూతసూక్ష్మమ్ ।
అనుగ్రహాయాస్త్వపి యర్హి మాయయా
లసత్తులస్యా భగవాన్విలక్షితః ॥ 20

టీ:- యద్యపి మాయికత్వాత్త్వద్భక్తేభ్యో విషయసుఖం దాతుం నేచ్ఛసి. తథాప్యస్మదభిప్రాయానుసారేణ తత్సంపాదయేత్యాహ-నేతి. హే అధీశనోఽస్మాకం భజతాం భూతసూక్ష్మరూప పదం శబ్దాది విషయ సుఖం మాయయా తనుషే విస్తారయసీతి యదేతత్. తత్తవేప్సితం న భవతి. తథాప్యస్మదనుగ్రహాయాస్తు. ఋణ త్రయాపక్రమణానంతరమేవ. అపవర్గాయ భవత్విత్యర్థః. యర్హి యతః. మాయయా పరిచ్ఛిన్నఇవ లసంత్యా తులస్యా యుక్తస్త్వం విలక్షితోఽపి. ఏవం భూతస్య తవ దర్శనం యతో భుక్తి ముక్తి ప్రదమిత్యర్థః. ॥ 20 ॥

నీ భక్తులకు మాయామయమైన విషయసుఖమును ఇచ్చుట నీకు సమ్మతము కాదు. అయినప్పటికి మా అభిప్రాయము ప్రకారము ఆ కోరికలను తీర్చుమని చెప్పుచున్నాడు. ఓ పరమేశ్వరా! నీవు మాయచే నావంటి భక్తుల కొఱకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాత్మకమగు భూతసూక్ష్మమును(విషయ సుఖములను) విస్తరింపజేసినావు. కాని అది నీకు ఇష్టము కాదు. అయినను మా వంటి సకామోపాసకుల కొరకై భోగజాలమును అనుగ్రహింపుము. దేవ, ఋషి, పితృ ఋణానంతరము మాకు మోక్షమును కలుగునట్లు అనుగ్రహించుము. ఎందుకనగా మేము తులసీమాలావిభూషితమైన నీ విగ్రహమును దర్శించుచున్నాము. అది భుక్తిని, ముక్తిని కూడా కలుగజేయగలదు. 20

శ్లో ॥ తం త్వాఽనుభూత్యోపరతక్రియార్థం
స్వమాయయావర్తిత లోకతంత్రమ్ ।
నమామ్యభీక్ష్ణం నమనీయపాద
సరోజమల్పీయసి కామవర్షమ్ ॥ 21

టీ:- తమితి తం త్వాం భుక్తిముక్తిప్రదం నమామి. ముక్తి ప్రదత్వే హేతుః అనుభూత్యా జ్ఞానేన, ఉపరతః క్రియార్థః కర్మఫలభోగో యస్మిన్. భోగప్రదత్వేఽపి హేతుః. స్వాధీనయా మాయయా. ఆవర్తితం లోక తంత్రం విశ్వోపకరణం యేన. అతస్సకామైః నిష్కామైశ్చ. నమనీయం పాదసరోజం యస్య. తమ్. అల్పీయసి సకామే పుంసి భజనే వా కామాన్ వర్షతీతి తథా తమ్. ॥ 21 ॥

దేవా! నీవు భుక్తిని మరియు ముక్తిని కూడా ఇచ్చేవాడివి. ఆత్మ స్వరూపుడవగు నీకు సంబంధించిన జ్ఞానము కలుగగానే (ఆత్మజ్ఞానము కలుగగానే) కర్మఫలములననుభవించవలెననే అపేక్ష తొలగును. నిన్నాశ్రయించుట వలన అట్టి ఆత్మజ్ఞానము కలుగును. ఈ రకముగా నీవు భుక్తి ప్రదుడవు. కర్మఫలములను అనుభవించిన తరువాత వాటి పట్ల విరక్తి చెంది, ఆత్మజ్ఞానమును అనుభూతి చెందిన వారికి ముక్తిని ఇస్తున్నావు. నీ మాయకు లోబడి లోకధర్మములను అనుసరిస్తున్న వారికి భోగములను ఇస్తున్నావు. ఇట్లు ముక్తిని, భుక్తిని కోరే ఇరువురి చేతను నమస్కరింపదగిన నీ పాదపద్మములకు మాటి మాటికి నమస్కరించుచున్నాను. అల్పమైన కోరికలను కోరే పురుషుల కోరికలను కూడా తీర్చుచున్న నీకు నమస్కారము. ॥ 21 ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఇత్యవ్యలీకం ప్రణుతోఽబ్జనాభ
స్తమాబభాషే వచసామృతేన ।
సువర్ణ పక్షోపరి రోచమానః
ప్రేమస్మితోద్వీక్షణవిభ్రమద్భ్రూః ॥ ॥22

టీ:- ఇతీతి. అమృతేన సుఖకరేణ. ప్రేమస్మితాభ్యాముద్వీక్షణేన. విభ్రమంతీ భ్రూర్యస్య సః. ॥ 22 ॥

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను

గరుత్మంతుని రెక్కలపై ప్రకాశించుచున్న పద్మనాభుని, నిష్కపటముగా కర్దముడు స్తుతించెను. భగవానుడు చిరునవ్వు నవ్వుతూ, అనుగ్రహించుచూ, కనుబొమ్మలను కదిలిస్తూ ప్రేమతో కూడిన అమృతము వంటి మాటలతో ఇట్లు పలికెను. ॥ 22 ॥

శ్రీభగవానువాచ

శ్లో॥ విదిత్వా తవ చైత్యం మే పురైవ సమయోజి తత్ ।
యదర్థమాత్మ నియమైస్త్వయైవాహం సమర్చితః ॥ 23

టీ:- విదిత్వేతి. చైత్యం హార్దం భావం. మే మయా. సమయోజి. సంఘటితమ్. యదర్థమేవాహం సమర్చి తస్తత్. ॥ 23 ॥

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను

ఓ కర్దముడా! నీ మనోగత అభిప్రాయము నాకు తెలియును. నీవు దేనికొరకైతే ఆత్మనియమము ద్వారా నన్ను చక్కగా ఉపాసించివో, దానిని పూర్వమే చక్కగా ఏర్పాటు చేసియుంచినాను. ॥ 23 ॥

శ్లో॥ న వై జాతుమృషైవ స్యాత్ప్రజాధ్యక్ష మదర్హణమ్ ।
భవద్విధేష్వతితరాం మయి సంగృభితాత్మనామ్ ॥ 24

టీ:- నేతి. మయి సంగృభితః సంగృహీత ఏకాగ్రీకృతః ఆత్మా చిత్తం యైస్తేషాం యన్మదర్హణం. త్వాదృశేషు అతితరాం సర్వథా. మృషా నిష్ఫలం న స్యాత్. 24

ఓ ప్రజాపతీ! నా యందు ఏకాగ్రచిత్తముతో పూజించే వారి అర్చన ఎప్పుడూ వ్యర్థము కాదు. నీ వంటి ముఖ్యులైన భక్తుల సేవ అసలే (ఎప్పుడూ) వ్యర్థము కాదు. ॥ 24 ॥

శ్లో॥ ప్రజాపతిసుతః సమ్రాణ్మనుర్విఖ్యాతమంగళః ।
బ్రహ్మావర్తం యోఽధివసన్ శాస్తిసప్తార్ణవాం మహీమ్ ॥25

టీ:- ప్రజాపతీతి. విఖ్యాత మంగళమభ్యుదయః సదాచారాది లక్షణాద్యుదయో యస్య. 25

బ్రహ్మదేవుని పుత్రుడైన స్వాయంభువమనువు చక్రవర్తియై ఏడు సముద్రములతో కూడియున్న భూమండలమును పరిపాలించు చున్నాడు. ఆయన రాజధాని బ్రహ్మావర్తము. ఆ మనువు మంగళకర మైన తన సదాచారముతో లోక విఖ్యాతుడై యున్నాడు. ॥ 25 ॥

శ్లో ॥ స చేహ విప్ర రాజర్షిర్మహిష్యా శతరూపయా ।
ఆయాస్యతి దిదృక్షుస్త్వాం పరశ్వో ధర్మకోవిదః ॥ 26

టీ:- స ఇతి. హే విప్ర. మహిష్యా సహ. ॥ 26-27 ॥

శ్లో ॥ ఆత్మజామసితాపాంగీం వయశ్శీల గుణాన్వితామ్ ।
మృగయంతీం పతిం దాస్యత్యనురూపాయ తే ప్రభో ॥ 27

శ్లో ॥ సమాహితం తే హృదయం యత్రేమాన్పరివత్సరాన్ ।
సా త్వాం బ్రహ్మన్నృపవధూః కామమాశు భజిష్యతి ॥ 28

టీ:- సమాహితమితి. యత్ర యస్యాం భార్యాయాం సమాహితం అభిసంధానేన స్థితం నృపవధూః రాజకన్యా సా భజిష్యతి. ॥ 28 ॥

శ్లో ॥ యాత ఆత్మభృతం వీర్యం నవధా ప్రసవిష్యతి ।
వీర్యే త్వదీయే ఋషయ ఆధాస్యంత్యంజసాత్మనః ॥ 29

టీ:- వీర్యఇతి. తే వీర్యమాత్మని భృతం ధృతం యా ప్రసవిష్యతి. వీర్యే ప్రసూతాసు కన్యాసు అంజసా ఆత్మనః పుత్రాన్ ఆధాస్యంతి. 29

ఓ మహర్షీ! ధర్మము తెలిసినవాడూ, రాజర్షీ అయిన స్వాయంభువమనువు తన భార్యయగు శతరూపాదేవితో కూడినవాడై ఎల్లుండి ఇక్కడకు రాగలడు. ఆయన నిన్ను చూడగోరుచున్నాడు. 26

ఓ ప్రజాపతీ! ఆ స్వాయంభువమనువు యొక్క కూతురు నల్లని కన్నులు కలది. చక్కని వయస్సు, గుణము, శీలము కలది. తనకు దగిన భర్త కొరకై అన్వేషించుచున్నది. అట్టి తన కూతురును స్వాయంభువమనువు నీకు అప్పగించును. ॥ 27 ॥

ఓ మహర్షీ! బహు సంవత్సరముల నుండి నీ మనస్సు భార్యను పొందవలెననే కోరికతో (స్థిరముగా) నుండెను. ఆ భార్యా రూపములో రాజకన్య తొందరలోనే నిన్ను చేరి సేవించగలదు. ॥ 28 ॥

ఆ రాజకన్యక నీ వీర్యమును తన గర్భమున ధరించి తొమ్మండుగురు కన్యలను కనగలదు. ఆ తొమ్మండుగురు కన్యలు మహర్షులకు భార్యలై సంతానమును పొందగలరు. ॥ 29 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ త్వం చ సమ్యగనుష్ఠాయ నిదేశం మ ఉశత్తమః ।
మయి తీర్థీకృతాశేషక్రియార్థో మాం ప్రపత్స్యసే ॥ 30

టీ:- నిదేశం ఆజ్ఞామ్ ఉశత్తమః శుద్ధసత్త్వః. మయీతి. తీర్థం పాత్రం. తేన దానం లక్ష్యతే. మయి సమర్పిత సర్వకర్మఫల ఇత్యర్థః. ॥ 30॥

నీవు శుద్ధసత్త్వము గలవాడవు. నా ఆజ్ఞను చక్కగా పాలించి నా యందే(నాకే) సమస్త కర్మఫలములను సమర్పించి నన్నే పొంద గలవు. ॥ 30 ॥

శ్లో॥ కృత్వా దయాం చ జీవేషు దత్త్వా చాభయమాత్మవాన్ ।
మయ్యాత్మానం సహ జగద్ద్రక్ష్యస్యాత్మని చాపి మామ్ ॥ 31

టీ:- గార్హస్థ్యేన దయాం కృత్వా. సన్న్యాసేనాభయం దత్త్వా. మయీతి. మయి ఆత్మానం జగచ్చ సహ ఏకీభూతం ద్రక్ష్యసి. ॥31॥

నీవు గృహస్థాశ్రమమును స్వీకరించి సమస్త ప్రాణులపట్ల దయను చూపి, తరువాత జితేంద్రియుడవై సన్న్యాసాశ్రమమును స్వీకరించి అన్ని జీవులకు అభయమునిచ్చి, నీతో సహా ఈ సమస్తమైన జగత్తును నీలోన చూడగలవు. నీలోన జగత్తుతో సహా నన్ను దర్శించ గలవు. ॥ 31 ॥

శ్లో॥ అహం చ స్వాంశకలయా త్వద్వీర్యేణ మహామునే ।
తవ క్షేత్రే దేవహూత్యాం ప్రణేష్యే తత్త్వసంహితామ్ ॥ 32

టీ:- తవేతి. తద్వీర్యేణ సహ. దేవహూత్యాం అవతీర్యేతిశేషః.॥32॥

ఓ మహామునీ! నేను నీ భార్యయగు దేవహూతియందు(నీ తపః ప్రభావముతో, ఆ తపః ఫలితముగా ఏర్పడే వీర్యముతో, (కీర్తితో) నా అంశకళతో అవతరించగలను. శుద్ధ ఆత్మతత్త్వమును (సాంఖ్య యోగమును) బోధించగలను. ॥ 32 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

మైత్రేయ ఉవాచ.

శ్లో ॥ ఏవం తమనుభాష్యాథ భగవాన్ ప్రత్యగక్షజః ।
జగామ బిందుసరసః సరస్వత్యా పరిశ్రితాత్ ॥ 33

టీ:- ప్రత్యగ్భూతేషు అక్షేషు. జాయతే ఆవిర్భవతీతి. ప్రత్యగక్షజః .జగామేతి. సరస్వత్యా నద్యా పరివేష్టితాత్. ॥33॥

శ్రీహరిభగవానుడు ఇంద్రియములు అంతర్ముఖములైనప్పుడు మాత్రమే దర్శనమిచ్చును. బిందుసరోవరము సరస్వతీ నది చేత చుట్టబడియున్నది. (సరస్వతీ నదీ తీరమున యున్నదని భావము). భగవానుడు కర్దమమునితో ఈ విధముగా సంభాషించి బిందు సరస్సు నుండి వెళ్ళిపోయెను. ॥ 33 ॥

శ్లో ॥ నిరీక్షతస్తస్య యయావశేష
సిద్ధేశ్వరాభిష్టుత సిద్ధమార్గః ।
ఆకర్ణయన్ పత్రరథేంద్ర పక్షైః
ఉచ్చారితం స్తోమముదీర్ణసామ ॥ 34

టీ:- నిరీక్షతఇతి. అశేషైర్మంత్రాదిసిద్ధేశ్వరైరభిష్టుతః. సిద్ధమార్గో వైకుంఠమార్గో యస్య సః. యద్వా - అశేషసిద్ధేశ్వరాభిషుటతశ్చాసౌ. సిద్ధైర్మృగ్యత ఇతి సిద్ధమార్గశ్చ స యయౌ. పత్రరథేంద్రో గరుడః. తస్య పక్షైరుదీర్ణమభివ్యక్తం సామ ఆకర్ణయన్. శ్రు.'బృహద్రథంతరే పక్షౌ'ఇతి శ్రుతేః. ఉచ్చారితం స్తోమం చ సామాధార భూతానామృచాం సముదాయం శృణ్వన్. శ్రు. "స్తోమ ఆత్మా" ఇతి శ్రుతేః. సమాసపాఠే. ఉచ్చారితస్తోమః స్తోత్రీయసముదాయో యస్య సామ్న ఇతి. ॥ 34 ॥

ఆ వైకుంఠమార్గము సిద్ధ పురుషులందరిలో శ్రేష్ఠులైనవారిచే కొనియాడబడే గొప్పమార్గము. తపస్సు, మంత్రము సిద్ధించిన మహాత్ములు నడిచే సిద్ధమార్గము. కర్దముడు చూచుచుండగా బిందు సరోవరము నుండి శ్రీహరి వెళ్ళెను. గరుత్మంతుని రెక్కల కదలికలచే ఏర్పడిన సామగాన శబ్దమును, స్తోత్ర సముదాయమును వినుచు వైకుంఠమార్గమున శ్రీహరి వెళ్ళెను. ॥ 34 ॥

శ్లో ॥ అథ సంప్రస్థితే శుక్లే కర్దమో భగవానృషిః ।
ఆస్తే స్మ బిందుసరసి తం కాలం ప్రతిపాలయన్ ॥ 35

టీ:- అథేతి. తం కాలం పరశ్వ ఇత్యుక్తం ప్రతీక్షమాణః. ॥ 35 ॥

శ్రీహరి తన లోకమునకు వెళ్లినపిదప పూజ్యుడగు కర్దమ మహర్షి మనుచక్రవర్తి రాకకై ఎదురుచూచు బిందుసరస్సు తీరమున నివసింపసాగెను. ॥ 35 ॥

శ్లో ॥ మనుః స్యందనమాస్థాయ శాతకౌంభపరిచ్ఛదమ్ ।
ఆరోప్య స్వాం దుహితరం సభార్యః పర్యటన్మహీమ్ ॥ 36

టీ:- మనురితి. శాతకౌంభాః సౌవర్ణాః పరికరాః యస్మిన్ తం. రథమాస్థాయ. దుహితరం చారోప్య. వరాన్వేషణార్థం పర్యటన్. 36

మనుచక్రవర్తి బంగారు అలంకారములతో కూడియున్న రథముపై తన కూతురును కూర్చుండబెట్టుకొని భార్యయగు శతరూపతో కలిసి వరాన్వేషణకై పర్యటించుచుండెను. ॥ 36 ॥

శ్లో ॥ తస్మిన్ సుధన్వన్నహని భగవాన్ యత్సమాదిశత్ ।
ఉపాయాదాశ్రమపదం మునేః శాంతవ్రతస్య తత్. ॥ 37

టీ:- తస్మిన్నితి. హే సుధన్వన్ విదుర. యత్ అహః. ॥ 37

ఓ విదురా! కర్దమమహర్షి శాంతవ్రతుడై తన ఆశ్రమము నందుండెను. భగవానుడు నిర్దేశించిననాటికే మనుచక్రవర్తి బిందు సరోవర తీరానగల కర్దముని ఆశ్రమమునకు చేరుకొనెను. ॥ 37 ॥

శ్లో ॥ యస్మిన్ భగవతో నేత్రాన్న్యపతన్నశ్రుబిందవః ।
కృపయా సంపరీతస్య ప్రపన్నేఽర్పితయా భృశమ్ ॥ 38

అట్టి ఆశ్రమమున ప్రవేశించినంతమాత్రముననే పరమా - నందము కలుగునని తెల్పుటకుగాను "యస్మిన్" అనే శ్లోకముతో

టీ:- తత్ర్రవేశమాత్రేణ పరమానందం ప్రాప్త ఇతి దర్శయితుం ఆశ్రమం వర్ణయతి సప్తభిః - యస్మిన్నితి. ప్రపన్నే కర్దమే. ॥ 38 ॥

శ్లో ॥ తద్వై బిందుసరో నామ సరస్వత్యా పరిప్లుతమ్ ।
పుణ్యం శివామృతజలం మహర్షిగణసేవితమ్ ॥ 39

టీ:- తదితి. శివం అరోగం. అమృతవత్స్వాదు జలం యస్మిన్. 39

శ్లో ॥ పుణ్యద్రుమ లతాజాలైః కూజత్పుణ్యమృగద్విజైః ।
సర్వర్తు ఫల పుష్పాఢ్యం వనరాజిశ్రియాన్వితమ్ ॥ 40

టీ:- పుణ్యేతి. కూజంతః పుణ్యాః మృగాః ద్విజాశ్చ యేషు తైః. పుణ్యద్రుమలతానాం. జాలైః సమూహైర్యుక్తం. ॥ 40 ॥

శ్లో ॥ మత్తద్విజ గణైర్ఘుష్టం మత్తభ్రమరవిభ్రమమ్ ।
మత్తబర్హి నటాటోపమాహ్వయన్మత్త కోకిలమ్ ॥ 41

టీ:- మత్తేతి. ఘుష్టం నాదితం. మత్త భ్రమరాణాం విభ్రమః వినోదో యస్మిన్. మత్త బర్హిణ ఏవ నటాః తేషామాటోపో నృత్త సంభ్రమో యస్మిన్. ఆహ్వయంతో మిథో మత్తాః కోకిలాః యస్మిన్. ॥ 41 ॥

మొదలుకొని ఏడు శ్లోకములలో ఆశ్రమమును వర్ణించినాడు. శరణాగతుడైన కర్దముని చూడగానే నిండుదయతో కూడిన భగవానుని కన్నుల నుండి నీటి బిందువులు ఆ ఆశ్రమమున పడినవి. 38

ఆ సరస్సు సరస్వతీనదిచే చుట్టబడి ఉన్నదని అర్థము. ఆ సరస్సు మహర్షిగణములతో సేవింపబడుచుండును. ఆ సరస్సులోని జలములు ఆరోగ్యప్రదములై అమృతతుల్యములై యుండును. పుణ్యప్రదమైన ఆ సరస్సు బిందుసరోవరముగా ప్రఖ్యాతిగాంచినది. 39

ఆ బిందుసరోవర ప్రాంతము పవిత్రములగు చెట్లు, తీగల గుంపులతో నిండియుండెను. పవిత్రములగు మృగములతో, పక్షుల కూతలతో ఆహ్లాదముగా నుండెను. అడవిచెట్ల శోభతో, అన్ని ఋతువుల ఫల పుష్పములతో చక్కగా నుండెను. ॥ 40 ॥

ఆ బిందుసరోవర ప్రాంతము మదించిన తుమ్మెదల విలాసములతోను, మదించిన పక్షుల గుంపుల కిల కిలలతోను, మదించి పురివిప్పి చేయు నెమళ్ళ నాట్యములతో మిక్కిలి శోభాయమానముగా నుండెను. మదించిన కోయిలలు తమ ధ్వనులతో ఆహ్వానించుచుండెను. 41

శ్లో ॥ కదంబ చంపకాశోక కరంజవకుళాసనైః ।
కుంద మందార కుటజైశ్చూతపోతైరలంకృతమ్ ॥ 42

టీ:- కదంబేతి. కదంబాదిభిర్వృక్షైరలంకృతమ్. ॥ 42 ॥

ఆ కర్దముని ఆశ్రమము కడిమి, చంపకము, అశోకము, పొగడ, వేగి అనే చెట్లతోను, మల్లె, మందారము మొక్కలతోను లేత మామిళ్ళ- తోను అలంకరింపబడినట్లుండెను. ॥ 42 ॥

శ్లో ॥ కారండవైః ప్లవైర్హంసైః కురరైర్జలకుక్కుటైః ।
సారసైశ్చక్రవాకైశ్చ చకోరైర్వల్గుకూజితమ్ ॥ 43

టీ:- కారండవైరితి. కారండవాదిభిః పక్షిగణైః వల్గు యథా భవతి తథా కూజితం. ॥ 43 ॥

కర్దమముని ఆశ్రమమున కన్నెలేళ్ళు, బాతులు, హంసలు, కురరములు, నీటికోళ్ళు, బెగ్గురుపక్షులు, చక్రవాకములు, చకోరపక్షులు మనోహరముగా కూయుచుండెను. ॥ 43 ॥

శ్లో ॥ తథైవ హరిణైః క్రోడైః శ్వావిద్గవయకుంజరైః ।
గోపుచ్ఛైర్హరిభిర్మర్కైర్నకులైర్నాభిభిర్వృతమ్ ॥ 44

టీ:- తథేతి. హరిణాదిభిర్మృగైర్వృతం. తత్ర క్రోడస్సూకరః శ్వావిత్ శల్యకః. మర్కో మర్కటః. తద్విశేషాః గోపుచ్ఛాః. హరిః వానరః సింహో వా. నాభిః కస్తూరీ మృగః. ॥ 44 ॥

ఆ కర్దమముని ఆశ్రమప్రాంతము లేళ్ళు, ముళ్ళపందులు (ఏదుపందులు), గవయమృగములు, ఏనుగులు, కొండముచ్చులు, హరులు (హరి అనగా సింహము, లేదా కోతి), ముంగీసలు, కస్తూరీ- మృగములు మున్నగు జంతువులచేత నిండియున్నది. ॥ 44 ॥

శ్లో ॥ ప్రవిశ్య తత్తీర్థవరమాది రాజః సహాత్మజః ।
దదర్శ మునిమాసీనం తస్మిన్ హుతహుతాశనమ్ ॥ 45

టీ:- ప్రవిశ్యేతి. హుతః హుతాశనః బ్రహ్మచారియోగ్యో యేన తం. 45

ఆదిరాజగు మనువు తన కుమార్తెతో కూడినవాడై గొప్ప పుణ్య క్షేత్రమైన కర్దమముని ఆశ్రమమునకు వెళ్ళెను. బ్రహ్మచర్యాశ్రమ యోగ్యమైన అగ్నులను వ్రేల్చి విశ్రాంతిగా యున్న కర్దమమునిని మనువు

శ్లో ॥ విద్యోతమానం వపుషా తపస్యుగ్రయుజా చిరమ్ ।
నాతిక్షామం భగవతః స్నిగ్ధాపాంగావలోకనాత్ ।
తద్వ్యాహృతామృతకలా పీయూష శ్రవణేన చ ॥ 46

టీ:- విద్యోతమానమితి. ఉగ్రో యుక్ యోగో యస్య తేన. వపుషా విద్యోతమానం తస్య భగవతః వ్యాహృతం భాషణమేవ అమృతకలా. అమృతమయస్య చంద్రస్య కళా తన్మయం పీయూషం. తస్య శ్రవణేన చ. నాతిక్షామం. తపసా కృశం సంతమప్యకృశం. ॥ 46 ॥

శ్లో ॥ ప్రాంశుం పద్మ పలాశాక్షం జటిలం చీరవాససమ్ ।
ఉపసంసృత్య మలినం యథార్హణమసంస్కృతమ్ ॥ 47

టీ:- ప్రాంశుమితి. ప్రాంశుమున్నతమ్. ఉపసంసృత్య సమీపం గత్వా మలినం దదర్శేతి పూర్వైవ క్రియా. అర్హ్యతేఽనేనేత్యర్హణం. మహారత్నం తత్ అసంస్కృతం అనిర్ణిక్తం యథా మలినం దృశ్యతే తద్వత్. ॥47 ॥

శ్లో ॥ అథోటజముపాయాతం నృదేవం ప్రణతం పురః ।
సపర్యయా ప్రత్యగృహ్ణాత్ప్రతి నంద్యానురూపయా ॥ 48

చూచెను. ॥ 45 ॥

చిరకాలము ఉగ్రమయిన తపస్సు చేయుట వలన కర్దముని శరీరము నుండి గొప్ప తేజస్సు వెలువడుచుండెను. భగవంతుడు కర్దముని ప్రేమతో నిండిన కడగంటిచూపుతో చూచెను. చంద్రుని వెన్నెల వంటి అమృతమయమైన శ్రీహరి మాటలను కర్దముడు వినెను. ఈ కారణములచేత కర్దముడు చిరకాల తపస్సు చేయుటచేత నిజముగా కృశించిన వాడైనను కృశించినట్లు కనబడులేదు. ॥ 46 ॥

ఆ ముని పొడవైనవాడు. ఆయన కన్నులు పద్మపత్రములవలె విశాలముగ నుండెను. వెంద్రుకలు జడలు కట్టియుండెను. ఆతడు నార వస్త్రములను ధరించి యుండెను. సానపెట్టని రత్నము మలినముగ నుండును. కర్దమముడు సానపెట్టని రత్నమువలె నుండెను. ఈ రకముగానున్న కర్దమముని మనువు దర్శించెను. 47

మనువు ఋషిశ్రేష్ఠుడగు కర్దముని పర్ణశాలకు చేరుకొనెను. కర్దముని పాదములకు నమస్కరించెను. కర్దమముడు మహారాజును

శ్లో ॥ గృహీతార్హణమాసీనం సంయతం ప్రీణయన్ మునిః ।
స్మరన్ భగవదాదేశమిత్యాహ శ్లక్ష్ణయా గిరా ॥ 49

టీ:- అథేతి. ఉటజం పర్ణశాలాం ప్రాప్తం పురః పాదసమీపే ప్రణతం. ఆశీర్భిరభినంద్య. సపర్యయా పూజయా. ప్రత్యగృహ్ణాత్ సత్కృతవాన్. 48-49

శ్లో ॥ నూనం చంక్రమణం దేవ సతాం సంరక్షణాయ తే ।
వధాయ చాసతాం యస్త్వం హరేశ్శక్తిర్హి పాలినీ ॥ 50

టీ:- నూనమితి. తే చంక్రమణం పర్యటనం. హి యస్మాత్.॥50 ॥

శ్లో ॥ యోఽర్కేంద్వగ్నీంద్రవాయూనాం యమధర్మప్రచేతసామ్ ।
రూపాణి స్థాన ఆధత్సే తస్మై శుక్లాయ తే నమః ॥ 51

టీ:- మనుస్తం శ్రీవిష్ణుం ప్రణమితి. యఇతి. స్థానే తత్కార్యావసరే. శుక్లాయ శ్రీవిష్ణవే. ॥ 51 ॥

ఆశీర్వచనములతో అభినందించి, సపర్యలతో సత్కరించెను. ॥ 48 ॥

కర్దమముని సత్కారమును మనుమహారాజు స్వీకరించి కూర్చుండెను. ముని చెప్పుచున్న మాటలను శ్రద్ధగా వినుచుండెను. కర్దముడు భగవానుని ఆదేశమును స్మరించి మధురముగా మాట్లాడు చుండగా మనువు మిక్కిలి సంతోషించెను. ॥ 49 ॥

రాజర్షివైన ఓ దేవా! నీ పర్యటన సత్పురుషులను సంరక్షించుటకుగాను దుష్టులను శిక్షించుటకుగాను ఉద్దేశింపబడినది. శ్రీహరియొక్క పాలనశక్తి నీ రూపములో నున్నది కదా! ॥ 50 ॥

ఓ మనుచక్రవర్తీ! ఆ యా అవసరములను బట్టి నీవు సూర్య, చంద్ర, అగ్ని, ఇంద్ర, వాయు, యమ, వరుణ రూపములను ధరించు చున్నావు. నీవు శుద్ధసత్త్వమూర్తియగు విష్ణుస్వరూపుడవు. అట్టి నీకు నమస్కారము. ॥ 51 ॥

శ్లో ॥ న యదా రథమాస్థాయ జైత్రం మణిగణార్పితమ్ ।
విస్ఫూర్జచ్చండ కోదండో రథేన త్రాసయన్నఘాన్ ॥ 52

టీ:- నయదేత్యాది పంచానామయమర్థః. యద్యపి ధర్మ రక్షార్థం సర్వతః పర్యటతస్తవ. ప్రసంగాదప్యాగమనం సంభవతి తథాపి విశేషకార్యం చేదస్తి తత్కథ్యతామితి. నేతి. జైత్రం జయప్రదం. మణిగణాః అర్పితాః యస్మిన్ తం. రథామారుహ్య. త్వం యదా భువో మండలం న పర్యటసి. తదా సేతవో భిద్యేరన్ ఇతి త్రయాణామన్వయః. విస్ఫూర్జత్ నాదం కుర్వత్. చండం కోదండం యస్య సః. ॥ 52 ॥

(న యదేతి...మొదలగు అయిదు శ్లోకములలో ఈ అర్థమున్నది. ధర్మరక్షణార్థమే సర్వత్రా పర్యటిస్తూ ఇచ్చటికి నీవు వచ్చిననూ, మీ రాకలో ఏదైనా విశేషకార్యమున్నట్లయితే తెలుపగలరు.) ఓ రాజా! మణిగణఖచితమైన, జయప్రదమైన రథమునెక్కి, భయంకరముగ ధ్వనించుచున్న ధనుస్సును చేతబట్టి సంచరించుచూ దుర్మార్గులను భయపెట్టుచున్నావు. ॥ 52 ॥

శ్లో ॥ స్వసైన్యచరణక్షుణ్ణం వేపయన్మండలం భువః ।
వికర్షన్ బృహతీం సేనాం పర్యటస్యంశుమానివ ॥ 53

టీ:- స్వేతి. స్వసైన్యస్య చరణైః క్షుణ్ణం సంఘట్టితమ్. ॥ 53 ॥

ఓ రాజా! నీ సైన్యము నడుచుటచే భూమండలము కంపించుచున్నది. నీవు పెద్ద సైన్యమును నడిపించుచూ సూర్యుని వలె ప్రకాశించుచున్నావు. ॥ 53 ॥

శ్లో ॥ తదైవ సేతవః సర్వే వర్ణాశ్రమనిబంధనాః ।
భగవద్రచితా రాజన్ భిద్యేరన్ బత దస్యుభిః ॥ 54

టీ:- వర్ణాశ్రమాణాం నిబంధనం యైః బత అహో. 54

ఓ రాజా! నీవీ విధముగా పర్యటింపకున్నచో భగవన్నిర్మిత ములగు వర్ణాశ్రమ ధర్మనిబంధనలన్నియు దుర్మార్గులచే పాడుచేయ బడును సుమా! ॥ 54 ॥

శ్లో ॥ అధర్మశ్చ సమేధేత లోలుపైర్వ్యంకుశైర్నృభిః ।
శయానే త్వయి లోకోఽయం దస్యుగ్రస్తో వినంక్ష్యతి ॥ 55

టీ:- అధర్మ ఇతి. నిరంకుశైర్నృభిః. నిమిత్త భూతైః శయానే నిశ్చలే. 55

ఓ రాజా! నీవు నిశ్చింతగా నున్నచో ఈ లోకములో అధర్మము వర్ధిల్లును. లోకులు భోగలాలసులై నిరంకుశులగుదురు. దుర్మార్గులచేత ఈ లోకము నశించును. ॥ 55 ॥

శ్లో ॥ అథాపి పృచ్ఛే త్వాం వీర యదర్థం త్వమిహాగతః ।
తద్వయం నిర్వ్యలీకేన ప్రతిపద్యామహే హృదా ॥ 56

టీ:- అథాపీతి. నిర్వ్యలీకేన సహర్షేణ. ప్రతిపద్యామహే స్వీకుర్మహే. (56)

ఓ వీరుడా! అయినప్పటికిని అడుగుచున్నాను. నీవు ఇచ్చటికి ఎందుకు వచ్చితివి. నీ కోరికను (ప్రయోజనమును) సంతోషముగా నెరవేర్చెదను. ॥ 56 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
ఏకవింశతితమోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఇరువది ఒకటవ అధ్యాయము సమాప్తము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ద్వావింశోఽధ్యాయః

శ్లో ॥ ద్వావింశే కర్దమాయాదాద్యథారాష్ట్రం హి విష్ణునా ।
మనుర్దుహితం దేవహూతిమిత్యుపవర్ణ్యతే ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఏవమావిష్కృతాశేషగుణకర్మోదయో మునిమ్ ।
సవ్రీడ ఇవ తం సమ్రాడుపారతమువాచ హ ॥ 1

టీ:- ఏవమితి. ఏవమావిష్కృతః. అభిష్టుతః అశేషానాం గుణానాం కర్మణాం చ. ఉదయః ఉత్కర్షో యస్య సః. సమ్రాట్ మనుః. సవ్రీడ ఇవ స్వకీర్తిశ్రవణాత్. ప్రత్యాఖ్యానశంకయా వా తం మునిమువాచ. ఉపాతరం నివృత్తినిరతం. ॥ 1 ॥

మనురువాచ

శ్లో ॥ బ్రహ్మాసృజత్స్వముఖతో యుష్మానాత్మపరీప్సయా ।
ఛందోమయ స్తపో విద్యా యోగ యుక్తానలంపటాన్ ॥ 2

టీ:- మదీయా కన్యా త్వయా పరిణేయేతి విజ్ఞాపయిష్యన్ యుష్మదస్మత్సంబంధస్తావదీశ్వరేణైవ పూర్వమేవ ఘటిత ఇత్యాహ - బ్రహ్మేతి. సార్ధ ద్వాభ్యాం. ఆత్మనః పరీప్సయా పర్యాప్తుమిచ్ఛయా. ఛందోమయ-

22 వ అధ్యాయము.

ఈ ఇరువది రెండవ అధ్యాయమున విష్ణువు యొక్క ఆదేశానుసారముగా స్వాయంభువమనువు తన కూతురైన దేవహూతిని కర్దమునకిచ్చి వివాహము చేయుట వర్ణింపబడినది.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను

ఈ విధముగా కర్దమమహర్షి మనుచక్రవర్తి యొక్క గుణముల, కర్మల యొక్క ఉత్కర్షను(గొప్పదనమును) వర్ణించి తన మాటలను ఆపెను. స్వాయంభువమనువు తన ప్రశంసను వినుట వలన సిగ్గు పడినవాడై ఆయనతో ఇట్లనెను. ॥ 1 ॥

మనువు ఇట్లు పలికెను

(నా కూతురును నీకిచ్చి వివాహము చేయగోరుచున్నానని విజ్ఞప్తి చేయబోవుచున్నవాడై మీకు, మాకు సంబంధము(మన సంబంధము) ఈశ్వరునిచేత పూర్వమే ఏర్పరుచబడినదని చెప్పు-చున్నాడు) మహాత్మా, వేదమూర్తియగు బ్రహ్మ తన స్వరూపమును లోకములో వ్యాపింపజేయవలెనను కోరికతో బ్రాహ్మణులను సృష్టించెను.

స్యాత్మనః పర్యాప్తిః పాలనం. వేదప్రవర్తనం తస్యేచ్ఛయా యుష్మాన్ బ్రాహ్మణాన్ ॥ 2 ॥

తపస్సు, విద్య, మరియు యోగములతో కూడి యుండి భోగములందు ఆసక్తి లేని వారగు బ్రాహ్మణులను బ్రహ్మ తన ముఖము నుండి సృష్టించెను. 2

శ్లో ॥ తత్త్రాణాయాసృజచ్చాస్మాన్ దోః సహస్రాత్సహస్రపాత్ ।
హృదయం తస్య హి బ్రహ్మ క్షత్ర మంగం ప్రచక్షతే ॥ 3

టీ:- తదితి. తత్త్రాణాయ బ్రాహ్మణ పాలనాయ. బ్రహ్మ బ్రాహ్మణ జాతిః క్షత్రం క్షత్రియ జాతిః. ॥ 3 ॥

అనంతపాదములుగల విరాట్పురుషుడు బ్రాహ్మణులను రక్షించుటకై వేలకొలది బాహువులనుండి క్షత్రియులైన మమ్ము సృష్టించెను. అందుకే బ్రాహ్మణులు విరాట్ పురుషునకు హృదయమనియు క్షత్రియులు భుజములనియు చెప్పుచున్నారు. 3

శ్లో ॥ అతో హ్యన్యోన్యమాత్మానం బ్రహ్మ క్షత్రం చ రక్షతః ।
రక్షతి స్మావ్యయో దేవః స యః సదసదాత్మకః ॥ 4

టీ:- అత ఇతి. ఏవం స దేవ ఏవ రక్షతి స్మ. కోఽసౌ. యః సదసదాత్మకః సర్వాత్మకః. తథాప్యవ్యయో నిర్వికారః. ॥ 4 ॥

అందువలన బ్రాహ్మణులు క్షత్రియులు తమను తాము రక్షించుకొనుచు, పరస్పరము ఒకరినొకరు రక్షించుకొనుచున్నారు. తపో బలముచే బ్రాహ్మలు, భుజబలముచే క్షత్రియులు రక్షించుచున్నారు. కాని వాస్తవముగా కార్యకారణస్వరూపుడు, అవినాశి, నిర్వికారుడు అయిన ఆ శ్రీహరియే అందరినీ రక్షించుచున్నాడు. 4

శ్లో ॥ తవ సందర్శనాదేవ చ్ఛిన్నా మే సర్వసంశయాః ।
యత్స్వయం భగవాన్ ప్రీత్యా ధర్మమాహ రిరక్షిషోః ॥ 5

టీ:- తం విజ్ఞాపయితుమేవ తద్దర్శనాదికమభినందతి - త్రిభిః. తవేతి. రిరక్షిషోః రక్షితుమిచ్ఛోః. ॥ 5 ॥

(తవేతి మొదలగు మూడు శ్లోకముల ద్వారా తన అభిప్రాయమును విన్నవించుటకుగాను కర్దముని అభినందించుచున్నాడు) ఓ దేవా! నిన్ను చూచినంతనే నా సందేహములన్నియు తొలగినవి. క్షాత్రధర్మమునందు కోరికగల నాకు నీవు క్షత్రియ ధర్మములను ప్రేమతో


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో ॥ దిష్ట్యా మే భగవాన్ దృష్టో దుర్దర్శ్యోయోఽకృతాత్మనామ్ ।
దిష్ట్యా పాదరజః స్పృష్టం శీర్ష్ణా మే భవతశ్శివమ్ ॥ 6

టీ:- దిష్ట్యేతి. అకృతాత్మనాం అవశీకృతచిత్తానాం. ॥ 6 ॥

శ్లో ॥ దిష్ట్యా త్వయానుశిష్టోఽహం కృతశ్చానుగ్రహో మహాన్ ।
అపావృతైః కర్ణరంధ్రైర్జుష్టా దిష్ట్యో శతీర్గిరః ॥ 7

టీ:- దిష్ట్యేతి. అనుగ్రహః. అనుశాసనాదిరూప ఏవ, ఉశతీః ఉశత్యః 7

శ్లో ॥ స భవాన్ దుహితృ స్స్నేహపరిక్లిష్టాత్మనో మమ ।
శ్రోతుమర్హసి దీనస్య శ్రావితం కృపయా మునే ॥ 8

టీ:- విజ్ఞాపయతి -సప్తభిః. స ఇతి. దుహితుః స్నేహేన పరిక్లిష్టః ఆత్మా యస్య. శ్రావితం విజ్ఞాపనమ్. ॥ 8 ॥

శ్లో ॥ ప్రియవ్రతోత్తానపదోః స్వసేయం దుహితా మమ ।
అన్విచ్ఛతి పతిం యుక్తం వయశ్శీల గుణాదిభిః ॥ 9

టీ:- ప్రియవ్రతేతి. ప్రియవ్రతోత్తానపదోః స్వసేతి. పుత్రికాకరణ శంకా నిరస్తా. మమ కన్యేతి క్షత్రకన్యా. తవ యోగ్యేతి దర్శితమ్. 9

బోధించినావు. ॥ 5 ॥

మనస్సును జయించనివారికి నీవు కనబడవు. అట్టి నీవు అదృష్టము వలన నాకు కనబడితివి. అదృష్టము వలననే నేను నీ పాదధూళిని శిరస్సుపై ధరించగలిగితిని. ॥ 6 ॥

నా యదృష్టము వలననే నాపై గొప్ప దయజూపి నాకు రాజ-ధర్మములనుపదేశించితివి. దైవవశముచేత చెవులార మనోహరములగు నీ పవిత్రములగు మాటలను వింటిని. ॥ 7 ॥

(స భవాన్ మొదలగు ఏడు శ్లోకములతో విజ్ఞాపనము చేయుచున్నాడు) ఓ మహర్షీ! అట్టి నీవు నా విజ్ఞాపనమును దయతో వినవలసినది. నేను కూతురుయందలి ప్రేమచేత కలత చెందిన మనస్సుగల వాడను, దీనుడను. ॥ 8 ॥

ఈమె ప్రియవ్రతుడు, ఉత్తానపాదుల చెల్లెలు.(ఇట్లు చెప్పుట తనకు కూతురుతో బాటు కుమారులు కలరని తెలుపుట) నా కూతురు. (సుక్షత్రియ కన్యక, యోగ్యురాలని చెప్పుట) ఈమె వయస్సు, శీలము,

శ్లో ॥ యదా తు భవతః శీల శ్రుత రూప వయో గుణాన్ ।
అశృణోన్నారదాదేషా త్వయ్యాసీత్కృతనిశ్చయా ॥ 10

టీ॥ ఏషా దేవహూతిః. ॥10 ॥

గుణములలో తనకు తగిన భర్తను పొందగోరుచున్నది. ॥9 ॥

నారదుడు చెప్పుచుండగా దేవహూతి, నీ విద్య, రూపము, వయస్సు, గుణములు మొదలగు వాటిని గురించి వినియున్నది. అప్పటినుండి నిన్నే భర్తగా పొందాలనే నిశ్చయ బుద్ధితో నున్నది. 10

శ్లో ॥ తత్రప్రతీచ్ఛ ద్విజాగ్ర్యేమాం శ్రద్ధయోపహృతాం మయా ।
సర్వాత్మనాఽనురూపాం తే గృహమేథిషు కర్మసు ॥ 11

టీ:- తదితి. ప్రతీచ్ఛ స్వీకురు. ॥ 11 ॥

ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా! నేను ఈ కన్యను శ్రద్ధతో నిచ్చుచున్నాను. గృహస్థాశ్రమ కర్మలయందు అన్ని విధములుగా ఈమె నీకు తగినది. కావున ఈమెను స్వీకరించవలసినది. ॥ 11 ॥

శ్లో ॥ ఉద్యతస్య హి కామస్య ప్రతివాదో న శస్యతే ।
అపి నిర్ముక్తసంగస్య కామరక్తస్య కిం పునః ॥ 12 ॥

టీ:- ఉద్యతస్యేతి. ఉద్యతస్య స్వతః ప్రాప్తస్య విషయస్య. ప్రతివాదః ప్రత్యాఖ్యానమ్. ॥ 12 ॥

స్వతస్సిద్ధముగా ప్రాప్తించిన భోగమును(కామమును) నిరాకరించుట విరక్తునికైననూ తగదు. కామాసక్తుని విషయము వేరుగా చెప్పునదేమి? ॥ 12 ॥

శ్లో ॥ య ఉద్యతమనాదృత్య కీనాశమభియాచతే ।
క్షీయతే తద్యశః స్ఫీతం మానశ్చావజ్ఞయా హతః ॥ 13 ॥

టీ:- య ఇతి. కీనాశం కృపణమ్. అవజ్ఞయా పరావమానేన. 13

ఎవడైతే తనంతతానుగా లభించిన భోగమును కాదని తరువాత కృపణుని(లుబ్ధుని) యాచించునో అట్టి వ్యక్తి ఒకవేళ గొప్పకీర్తిగల వాడైననూ ఆయన కీర్తి నశించును. లభించినదానిని అవమానించుటచే

శ్లో॥ అహం త్వాऽశ్రుణవం విద్వన్ వివాహార్థం సముద్యతమ్ ।
అతస్త్వముపకుర్వాణః ప్రత్తాం పుత్రిగృహాణ మే ॥ 14

టీ:- అహమితి. యస్య సావధి బ్రహ్మచర్యం. స ఉపకుర్వాణః. మే ప్రత్తాం మయా దత్తాం. ॥ 14 ॥

ఋషిరువాచ

శ్లో॥ బాఢముద్వోఢుకామోऽహమప్రత్తా చ తవాత్మజా ।
ఆవయోరనురూపోऽసావాద్యో వైవాహికో విధిః ॥ 15

టీ:- బాఢమితి. అప్రత్తా చేతి మయ్యేవ కృతనిశ్చయత్వాత్ కస్మైచిత్ప్రతిశ్రుతా చ న భవతీత్యర్థః. ఆద్యః ప్రథమః. తతః పూర్వం వివాహాభావాత్. ముఖ్య ఇతి వా. ॥ 15 ॥

శ్లో॥ కామః సభూయాన్నరదేవ తేऽస్యాః
పుత్ర్యాః సమామ్నాయవిధౌ ప్రతీతః ।
క ఏవ తే తనయాం నాద్రియేత
స్వయైవ కాంత్యా క్షిపతీమివ శ్రియమ్ ॥ 16 ॥

ఆతని అభిమానము కూడా నష్టమగును. ॥ 13 ॥

ఓ విద్వాంసుడా!నీవు వివాహము చేసికొనబోవుచున్నావని విన్నాను. కనుక నేనిచ్చే ఈ కన్యను స్వీకరింపుము. వివాహకాలమే గడువుగా గల బ్రహ్మచర్యాశ్రమము కలవాడవు నీవు. (జీవితాంత బ్రహ్మచారివి కాదని భావము) నా కూతురుని వివాహమాడి గృహస్థుడవు కావలసినది. ॥ 14 ॥

కర్దమఋషి ఇట్లు పలికెను

నిజమే. నేను వివాహము చేసుకోగోరుచున్నాను. నీ కూతురు అప్రత్తా. అప్రత్తా యనగా మరియొకనితో వివాహము నిశ్చయముగాని కన్య. కనుక మా ఇద్దరి పరిణయము బ్రాహ్మవివాహ పద్ధతితో యోగ్యముగా నుండును.(పలు రకములైన వివాహపద్ధతులలో మొదటిది బ్రాహ్మవివాహము. పెద్దలచే నిశ్చయించబడి పలువురి సమక్షములో జరిగే పెండ్లి.) ॥ 15 ॥

ఓ మహారాజా! గృహ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం మయా పత్యా.... మంత్రములు ప్రసిద్ధములు గదా! నీ కూతురు వేదోక్తమగు వివాహవిధానముతో వివాహమాడ గోరుచున్నది. ఆమె కోరిక తీరుగాక! ఈ నీ కన్యక తన శరీరకాంతిచేత అలంకారములచేత ప్రకాశిస్తూ

టీ:- కామ ఇతి. భూయాద్భవేత్. ప్రతీతః. శ్రు. "గృహ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాస" ఇతి మంత్ర ప్రసిద్ధః. స్వయా అంగకాంత్యైవ. శ్రియం భూషణాది శోభామ్. 16

లక్ష్మీదేవివలె నున్నది. ఇట్టి కన్యను ఎవరు కాదనగలరు. 16

శ్లో ॥ యాం హర్మ్యపృష్ఠే క్వణదంఘ్రిశోభాం
విక్రీడతీం కందుకవిహ్వలాక్షీమ్ ।
విశ్వావసుర్న్యపతత్స్వాద్విమానాత్
విలోక్య సమ్మోహ విమూఢచేతాః ॥ 17 ॥

ఈమె రాజప్రాసాదము పైభాగమునందు బంతితో ఆడుచుండగా ఆమె పాదములనూపురములు చక్కటి ధ్వని చేయుచుండెను. ఆకాశమున సంచరించుచున్న గంధర్వుడు ఈమె సౌందర్యమును చూచి సమ్మోహితుడై స్పృహకోల్పోయి క్రిందబడెను. ॥ 17 ॥

టీ:- యామితి. యాం విలోక్య న్యపతత్. సమ్మోహనేన విమూఢం వ్యాకులం చేతశ్చిత్తం యస్య సః. క్వణద్భ్యామంఘ్రిభ్యాం శోభా యస్యాః (17)

శ్లో ॥ తాం ప్రార్థయంతీం లలనాలలామమ్
ఆసేవిత శ్రీచరణైరదృష్టామ్ ।
వత్సాం మనోరుచ్చపదస్స్వసారమ్
కో నానుమన్యేత బుధోభియాతామ్ ॥ 18 ॥

ఈ దేవహూతి స్త్రీలకే అలంకారమైనట్టిది. లక్ష్మీదేవి చరణసేవ చేయనివారు ఈమెను చూడలేరు. స్వాయంభువమనువుకు ముద్దుబిడ్డ. ఉత్తానపాదుని సోదరి. స్వయముగా వరించివచ్చినది. ఇన్ని గొప్ప లక్షణములు గల ఈమెను తెలివిగలవాడెవడూ నిరాకరింపడు. 18

టీ:- తామితి. తాం లలనానాం లలామాం భూషణభూతామ్. ఆసేవితౌ శ్రియశ్చరణౌ యైస్తైః. అదృష్టాం ద్రష్టుమప్యయోగ్యామ్. ఉచ్చపదః ఉత్తానపాదస్య. అభియాతాం స్వయం ప్రాప్తాం. ॥ 18 ॥

శ్లో ॥ అతో భజిష్యే సమయేన సాధ్వీమ్
యావత్తేజో బిభృయాదాత్మనో మే ।
అతో ధర్మాన్ పారమహంస్య ముఖ్యాన్
శుక్ల ప్రోక్తాన్ బహుమన్యే ఽ విహింస్రాన్ ॥ 19 ॥

టీ:- అత ఇతి. భజిష్యే స్వీకరిష్యే. 'యావదపత్యోత్పత్తిస్తావద్గార్హస్థ్యం తతః పరం సన్న్యాస' ఇతి భాషా బంధ సమయః. తం సమయమేవాహ - యావదాత్మనో మమ తేజో గర్భం బిభృయాత్. యద్వా మమాత్మనో దేహాత్ చ్యుతం తేజో వీర్యం బిభృయాదితి. అతః పరం పారమహంస్యం జ్ఞానం. తస్మిన్ముఖ్యాన్ శుక్లేన శ్రీవిష్ణునా. సాక్షాత్ప్రకర్షేణోక్తాన్. అవిహింస్రాన్ హింసారహితాన్ శమాదీన్. బహు యథా భవత్యేవ మనుష్ఠేయాన్మన్యే. ॥ 19 ॥

ఈ సాధ్విని ఒక నియమము(షరతు) మేరకు స్వీకరించెదను. మాకు పుత్రుడు కలుగువరకు గృహస్థాశ్రమములో ఉండెదను. తరువాత సన్న్యాసాశ్రమమును స్వీకరించెదను. నా తేజస్సును ఈమె ఎంతవరకు ధరించునో అంతవరకు గృహస్థాశ్రమములో ఉందును. (సంతానమగువరకు) సాక్షాత్తు విష్ణువుతో చెప్పబడినది, పారమహంస జ్ఞానముతో కూడినది, హింసా రహితమైది, శమదమాదులతో కూడనది సన్న్యాసము. అట్టి సన్న్యాసాశ్రమమును నేను అనుష్ఠించెదను.॥19॥

శ్లో ॥ యతోఽ భవద్విశ్వమిదం విచిత్రం
సంస్థాస్యతే యత్ర చ వావ తిష్ఠతే ।
ప్రజాపతీనాం పతిరేష మహ్యాం
పరం ప్రమాణం భగవాననంతః ॥ 20 ॥

టీ:- నను తవ పితుః ప్రజాపతేరాజ్ఞా సృష్టావేవ న సన్న్యాసే తత్రాహ- యత ఇతి. సంస్థాస్యతే ప్రళయం యాస్యతి. వా వేతి ఏవార్థే.

(ప్రజాసృష్టి చేయుమని మీ తండ్రిగారయిన బ్రహ్మదేవుని ఆజ్ఞ. సన్న్యాసము కాదు. అనే ఈ విషయమును ప్రస్తావించుచున్నాడు) ఈ ప్రపంచము విచిత్రమైనది. అనంతుడగు భగవంతునిచే సృష్టించబడి, ఆయనయందే నిలిచి, ఆయనయందే విలీనము కాగలదు. ప్రజాపతులకు కూడా ప్రభువగు ఆ అనంతభగవానుడే నాకీ విషయములో ప్రమాణము. ॥ 20 ॥

ఋణత్రయాపాకరణానంతరం. సన్న్యాస ఏవ మాదృశానాం. భగవతోక్తఇత్యర్థః. ॥ 20 ॥

మైత్రేయ ఉవాచ

శ్లో॥ స ఉగ్రధన్వన్నియదేవాబభాష
ఆసీచ్చ తూష్ణీమరవిందనాభమ్ ।
ధియోపగృహ్ణన్ స్మితశోభితేన
ముఖేన చేతో లులుభే దేవహూత్యాః ॥ 21 ॥

టీ:- స ఇతి. హే ఉగ్రధన్వన్విదుర. లులుభే మునేర్ముఖేన. ప్రలోభ్యతే స్మ. యద్వా-ముఖేన ప్రలోభితవాన్. ॥ 21 ॥

మైత్రేయుడు చెప్పుచున్నాడు

ఓ విదురా! ఆ కర్దముడు ఇంతమాత్రమే మాట్లాడి ఊరు - కుండెను. విష్ణుమూర్తిని మనస్సులో ధ్యానించుచుండెను. చిరునవ్వుతో శోభిల్లే ఆయన ముఖము దేవహూతి మనస్సును దోచుకొనెను. 21

శ్లో॥ సోఽనుజ్ఞాత్వా వ్యవసితం మహిష్యా దుహితుః స్ఫుటమ్ ।
తస్మై గుణగణాఢ్యాయ దదౌ తుల్యాం ప్రహర్షితః ॥ 22 ॥

టీ:- స ఇతి. స మనుః అన్వంతరం. మహిష్యాశ్శతరూపాయాః. దుహితు ర్దేవహూత్యాశ్చ. వ్యవసితం నిశ్చయం జ్ఞాత్వా. ॥ 22 ॥

ఆ స్వాయంభువమనువు తన భార్య, కుమార్తెల నిశ్చయమును స్పష్టముగా తెలిసికొని చాలా సంతోషించెను. సద్గుణసంపన్నుడైన కర్దమునకు సమాన గుణగణములు గల దేవహూతిని ఇచ్చెను. 22

శ్లో॥ శతరూపా మహారాజ్ఞీ పారిబర్హాన్ మహాధనాన్ ।
దంపత్యోః పర్యదాత్ప్రీత్యా భూషావాసః పరిచ్ఛదాన్ ॥ 23

టీ:- శతరూపేతి. పారిబర్హాన్ వివాహకాలే ప్రదేయాన్ భూషాః భూషణాని వాసాంసి చ. పరిచ్ఛదాన్ గృహోపకరణాని చ. ॥ 23 ॥

మహారాణియగు శతరూపాదేవి ఆ నూతనదంపతులకు మిక్కిలి విలువైన వస్త్రములను, ఆభరణములను, గృహోపకరణములను పెళ్ళి కానుకగా నిచ్చెను. ॥ 23 ॥

శ్లో॥ ప్రత్తాం దుహితరం సమ్రాట్సదృక్షాయ గతవ్యథః ।
ఉపగూహ్య చ బాహుభ్యామౌత్కంఠ్యోన్మథితాశయః ॥ 24 ॥

టీ:- ప్రత్తామితి. ప్రత్తాం దత్తామ్ సదృక్షాయ సదృశాయ. గతా వ్యథా చింతా యస్య సః. ఔత్కంఠ్యేన ఉన్మథితః క్షుభితః ఆశయో యస్య. 24

కూతురును యోగ్యుడగు వరునకు ఇచ్చి వివాహము చేయడముతో మనుచక్రవర్తికి చింత తొలిగెను. కాని, కూతురు యొక్క విరహముచే వ్యాకులమైన మనస్సు గలవాడై రెండు చేతులతో తన పుత్రికను కౌగిలించుకొనెను. ॥ 24 ॥

శ్లో॥ అశక్నువంస్తద్విరహమ్ ముంచన్ బాష్పకలాం ముహుః ।
ఆసించదంబ వత్సేతి నేత్రోదైర్దుహితుః శిఖాః ॥ 25 ॥

టీ:- అశక్నువన్నితి. తస్యాః, విరహం సోఢుం. హే అంబ హే వత్సే అతి బ్రువన్. సంధిరార్షః. శిఖాః కేశానసించత్. ॥ 25-26 ॥

మనువు తన కూతురు విరహమును సహించ లేకపోయెను. మాటి మాటికీ కన్నీరు కార్చుచూ దేవహూతి యొక్క వెంట్రుకలను తడుపు చుండెను. ఓ అమ్మా! ఓ వత్సా! అని పిలుచుచూ బాధపడు చుండెను. 25

శ్లో॥ ఆమంత్ర్య తం మునివరమనుజ్ఞాతః సహానుగః ।
ప్రతస్థే రథమారుహ్య సభార్యః స్వపురం నృపః ॥ 26 ॥

మనువు కర్దమముని వద్ద సెలవు తీసికొని భార్య, అనుచరులు

శ్లో ॥ ఉభయోర్ఋషికుల్యాయాః సరస్వత్యాః సురోధసోః ।
ఋషీణాముపశాంతానాం పశ్యన్నాశ్రమసంపదః ॥ 27

టీ:- ఉభయోరితి. ఋషికుల్యాయాః ఋషికులసహితాః. ఉభయోస్సురోధసోః శోభనతటయోః. ॥ 27 ॥

శ్లో ॥ తమాయాంతమభిప్రేత్య బ్రహ్మావర్తాత్ప్రజాః పతిమ్ ।
గీతసంస్తుతివాదిత్రైః ప్రత్యుదీయుః ప్రహర్షితాః ॥ 28 ॥

టీ:- తమితి. అభిప్రేత్య జ్ఞాత్వా బ్రహ్మావర్తాద్దేశాత్. ప్రజాః పతిం ప్రత్యుపజగ్ముః. ॥ 28 ॥

శ్లో ॥ బర్హిష్మతీ నామ పురీ సర్వసంపత్సమన్వితా ।
న్యపతన్ యత్ర రోమాణి యజ్ఞస్యాంగం విధున్వతః29 ॥

టీ:- కోఽసౌ బ్రహ్మావర్త ఇత్యపేక్షాయామాహ- బర్హిష్మతీతి. యత్ర బర్హిష్మతీనామ పురీతి సాఽపి కుత్ర. యత్ర యజ్ఞస్య యజ్ఞవరాహస్య. రోమాణి న్యపతన్నితి. యత్రేతి సర్వత్ర సంబధ్యతే. ॥ 29 ॥

తన వెంటరాగా తన నగరమునకు బయలుదేరెను. ॥ 26 ॥

ఆ సరస్వతీ నది యొక్క రెండుతీరములందును ఋషులు ఆశ్రమముల నేర్పరచుకొని తపస్సు చేయుచుందురు. వారు నదిని సేవించుచుందరు. అందమైన ఆ ఆశ్రమముల శోభను తిలకిస్తూ మనుచక్రవర్తి వెళ్ళెను. ॥ 27 ॥

ఆ మనుచక్రవర్తి వచ్చుచున్నాడనే విషయము తెలిసి ప్రజలు గొప్పసంతోషమును పొందిరి. తమ దేశమగు 'బ్రహ్మావర్తము' నుండి బయలుదేరి గీతములు, స్తోత్రములు, వాద్యములతో ఆయనకు ఎదురేగిరి. ॥ 28 ॥

(బ్రహ్మావర్తదేశమేది? అనే విషయము తెల్పుచున్నాడు బర్హిష్మతీ నగరమున్న ప్రదేశము బ్రహ్మావర్తము. ఆ నగరమెక్కడ?) యజ్ఞ వరాహస్వామి తన శరీరమును విదల్చగా రోమములు ఎచ్చట పడినవో అదే బర్హిష్మతీ నగరము, అది సర్వ సంపదలతో కూడినది. ॥ 29 ॥

శ్లో ॥ కుశా కశాస్త ఏవాసన్ శశ్వద్ధరిత వర్చసః ।
ఋషయో యైః పరాభావ్య యజ్ఞఘ్నాన్ యజ్ఞమీజిరే ॥ 30 ॥

టీ:- బర్హిష్మతీనామేతి నిరుక్తం బ్రువన్ ప్రసంగాద్దేశస్య శ్రేష్ఠమాహ – ద్వాభ్యాం. కుశేతి. కుశాః కాశాశ్చాసన్. శశ్వత్ నిత్యం హరితం వర్చ వర్ణో యేషామ్. యైర్యజ్ఞఘ్నాన్ రాక్షసాదీన్. పరాభావ్య పరాభవం నీత్వా యజ్ఞం విష్ణుమ్. ॥ 30 ॥

('బర్హిష్మతీ' నిరుక్తము ఈ రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు.) ఆ యజ్ఞవరాహస్వామి రోమములే, ఎల్లప్పుడూ ఆకుపచ్చగా నుండే దర్భలు, రెల్లు గడ్డిగా అయినవి. మహర్షులు ఈ కుశ, కాశలతోనే యజ్ఞ విఘ్న కర్తలగు రాక్షసులను తరిమికొట్టిరి. యజ్ఞము చేసి శ్రీహరిని ఆరాధించిరి. ॥ 30 ॥

శ్లో ॥ కుశకాశమయం బర్హిరాస్తీర్య భగవాన్మనుః ।
అయజద్యజ్ఞ పురుషం లబ్ధా స్థానం యతో భువమ్ ॥ 31 ॥

టీ:- కుశేతి. యజ్ఞపురుషం విష్ణుం యత ఇతి యత్ర అయజత్. భువః స్థానం. లబ్ధేతి తృన్ప్రత్యయాంతమ్ లబ్ధవాన్ సన్నిత్యర్థః, యతో లబ్ధవాన్. తం యజ్ఞ పురుషమితి వా. ఏతేన స్వర్గాదపి భూమిః శ్రేష్ఠా. తత్రాపి తత్ స్థానం శ్రేష్ఠమిత్యుక్తం భవతి. ॥ 31 ॥

'లబ్ధా అనునది తృన్ ప్రత్యయాంతము. యజ్ఞవరాహస్వామి నుండి భూమిని పొందిన స్థానమనికాని, యజ్ఞవరాహస్వామిని దర్శించినస్థానమనికాని యర్థము. భూమి స్వర్గము కన్నా గొప్పది. అందులో ఆ ప్రదేశము ఇంకా గొప్పది. భగవానుడి నుండి మనువు భూమండలమును పొంది, దర్భలచేత, రెల్లుచేత చేయబడిన ఆసనము పరచి యజ్ఞపురుషుడైన శ్రీహరిని ఆరాధించెను. ॥ 31 ॥

శ్లో ॥ బర్హిష్మతీం నామ విభుర్యాం నిర్విశ్య సమావసత్ ।
తస్యాం ప్రవిష్టో భవనం తాపత్రయ వినాశనమ్ ॥ 32

టీ:- ప్రస్తుతమాహ–బర్హిష్మతీమితి. యాం బర్హిష్మతీం నామ పురీం

(పూర్వము నివసించిన బర్హిష్మతీ నగరమునే చేరి తన భవనములో ప్రవేశించి భోగములను అనుభవించినాడని అన్వయము.) బర్హిష్మతీ నగరమునందలి, తాపత్రయములను పోగొట్టే తన భవనము లోనికి

సమావసత్. పూర్వం యథాస్యాముషితః. తస్యాం నిర్విశ్య భవనం ప్రవిష్టస్సన్. భోగాన్ బుభుజ ఇత్యుత్తరేణాన్వయః. ॥ 32 ॥

మనుచక్రవర్తి ప్రవేశించెను. ॥ 32 ॥

శ్లో ॥ స భార్యః సప్రజః కామాన్బుభుజేన్యావిరోధతః ।
సంగీయమానసత్కీర్తిః సస్త్రీభిః సురగాయకైః ।
ప్రత్యూషేష్వనుబద్ధేన హృదా శ్రుణ్వన్హరేః కథాః ॥ 33

టీ:- స భార్య ఇతి. అన్యేషాం ధర్మాదీనామవిరోధేన. ప్రత్యూషేషు ఉషస్సు. సంగీయమానా సత్కీర్తిర్యస్య సః. తథాపి స్వయం శ్రీహరేరేవ కథాః శ్రుణ్వన్ భోగాన్ బుభుజే. ॥ 33 ॥

ఆ చక్రవర్తి బర్హిష్మతీపురములో భార్యాపిల్లలతో ధర్మము, అర్థము, మోక్షములకు ఆటంకములేని విధముగా కామములను (భోగములను) అనుభవించుచుండెను. ఆయన కీర్తిని అప్సరసలు, గంధర్వులు కీర్తించేవారు. అయినప్పటికి ఆయన ప్రాతఃకాలముల యందు నిండైన భక్తితో శ్రీహరిగాథలను వినుచుండెడివాడు. 33

శ్లో ॥ నిష్ణాతం యోగమాయాసు మునిం స్వాయంభువం మనుమ్ ।
యథా భ్రంశయితుం భోగా న శేకుర్భగవత్పరమ్ ॥ 34

టీ:- నిష్ణాతమితి. యోగమాయాసు ఐచ్ఛిక భోగరచనాసు. యత్ యతః అభ్రంశయితుం. ఈషదపి భ్రంశయితుం అభిభాషితుమ్. ॥34

ఈ విధముగా స్వాయంభువమనువు ఐహికభోగములను ఏర్పరచుకొని అనుభవించుటలో నిష్ణాతుడైనను భగవత్పరాయణుడైన ఆతనిని, భోగములు కొంచమైనను, చలింపజేయజాలకపోయెను. 34

శ్లో ॥ అయాతయామాస్తస్యాసన్ యా మాః స్వాంతరయాపనాః ।
శ్రుణ్వతో ధ్యాయతో విష్ణోః కుర్వతో బ్రువతః కథాః ॥ 35

ఆ మనువు నిరంతరము విష్ణుకథలను వినుచు విష్ణువును

టీ:- అయాతయామాఇతి. యాతో యామో యస్య పక్వాన్నస్య తద్గతసారం భవతి. అతోఽన్యదపి గౌణ్యా వృత్త్యా గతసారం యాతయామమిత్యుచ్యతే. అయాతయామాః అగతసారాః ఆసన్. స్వాంతరం తదీయం మన్వంతరం యాపయంతి గమయంతి యే యామాః కాలావయవాః. కుర్వతః స్వవాక్యైరుపనిబధ్నతః. ॥ 35 ॥

ధ్యానించుచు, విష్ణుసేవ చేయుచు విష్ణుకథలను చెప్పుచు తన మన్వంతరకాలమును గడిపెను. ఆయన ఏ ఒక్క యామము(జాము) సారహీనముగా గడపలేదు. క్షణము వ్యర్థము కానీయక విష్ణుసేవతో నిండుగా మన్వంతరకాలము గడిపెను. ॥ 35 ॥

శ్లో॥ స ఏవం స్వాంతరం నిన్యే యుగానామేకసప్తతిమ్ ।
వాసుదేవ ప్రసంగేన పరిభూతగతి త్రయః ॥ 36

టీ:- సఇతి. పరిభూతం గతి త్రయం. జాగరణాది సాత్త్వికాది వా యేన సః. ॥ 36 ॥

ఈ విధముగా మనువు, జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే మూడు అవస్థలకు మరియు సత్త్వరజస్తమో గుణములకు అతీతమైన స్థితిని పొంది, విష్ణుసేవతో డెబ్బది యొక్క మహాయుగములకాలపరిమితితో కూడిన తన మన్వంతరకాలమును గడిపెను. (కృత, త్రేత, ద్వాపర, కలియుగముల మొత్తము ఒక మహాయుగము). ॥ 36 ॥

శ్లో॥ శారీరా మానసా దివ్యా వైయాసే యే చ మానుషాః ।
భౌతికాశ్చ కథం క్లేశా బాధంతే హరిసంశ్రయమ్ ॥ 37

టీ:- శారీరా ఇతి. దివ్యా అంతరిక్షాః. మానుషాః శత్రు ప్రభవాః. భౌతికాః శీతోష్ణాదిప్రభవాః. వైయాసే విదుర. ॥ 37 ॥

వ్యాసపుత్రుడవైన ఓ విదురా! జ్వరాది ఆధ్యాత్మిక క్లేశములు, శత్రుభవాది ఆధిదైవిక క్లేశములు, శీతోష్ణాది ఆధిభౌతిక క్లేశములు శ్రీహరిని ఆశ్రయించిన వారిని ఎట్లు బాధించును? బాధింపవు.॥37॥

శ్లో ॥ యః పృష్టో మునిభిః ప్రాహ ధర్మాన్నానా విధాన్ శుభాన్ ।
నృణాం వర్ణాశ్రమాణాం చ సర్వభూతహితః సదా ॥ 38

టీ:- తస్య జ్ఞానాతిశయమాహ-యఇతి. నృణాం సాధారణధర్మం. 38

శ్లో ॥ ఏతత్త ఆదిరాజస్య మనోశ్చరితమద్భుతమ్ ।
వర్ణితం వర్ణనీయస్య తదపత్యోదయం శ్రుణు ॥ 39

టీ:- ఏతదితి. తస్య యదపత్యం దేవహూతిః. తస్యా ఉదయం ప్రభావం శ్రుణ్వితి. ॥ 39 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
ద్వావింశతితమోఽధ్యాయః

(మనువు యొక్క జ్ఞాన విశేషమును చెప్పుచున్నాడు) మనువు ఎల్లప్పుడు సకల ప్రాణుల మేలు కోరేవాడు. మునుల ప్రశ్నకు జవాబుగా మానవులందరికీ సంబంధించిన సామాన్య ధర్మములు, వర్ణాశ్రమ ధర్మములు ఇతరములైన అనేక ధర్మములను బోధించినాడు. మనువు బోధించిన ఈ ధర్మములు శుభప్రదములైనవి. 38

మనువు మొట్టమొదటి రాజు. ఆయన అద్భుత చరిత్రను వర్ణించిచెప్పినాను. ఇప్పుడు ఆయన కూతురగు దేవహూతి యొక్క మహిమను చెప్పెదను. వినుము. ॥ 39 ॥

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఇరువది రెండవ అధ్యాయము సమాప్తము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



త్రయోవింశోఽధ్యాయః

శ్లో ॥ త్రయోవింశే తపో యోగనిర్మితే సర్వసంపది ।
విమానే కామగే చిత్రా తయోరీతిరుదీర్యతే ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ పితృభ్యాం ప్రస్థితే సాధ్వీ పతిమింగితకోవిదా ।
నిత్యం పర్యచరత్ప్రీత్యా భవానీవ భవం ప్రభుమ్ ॥ 1

శ్లో ॥ విస్రంభేణాత్మ శౌచేన గౌరవేణ దమేన చ ।
శుశ్రూషయా సౌహృదేన వాచా మధురయా చ భో ॥ 2 ॥

టీ:- పితృభ్యామితి. ప్రస్థితే గమనే కృతే సతి. ॥ 1-2 ॥

శ్లో ॥ విసృజ్య కామం దంభం చ ద్వేషం లోభమఘం మదమ్ ।
అప్రమత్తోద్యతా నిత్యం తేజీయాంసమతోషయత్ ॥ 3 ॥

టీ:- విసృజ్యేతి. దంభం కాపట్యమ్ అఘం నిషిద్ధాచరణమ్. తేజీయాంసం అతితేజస్వినమ్. ॥ 3 ॥

23 వ అధ్యాయము

ఈ ఇరువదిమూడవ అధ్యాయములో, తపః ప్రభావముచే నిర్మింపబడినదియు, సర్వసంపదలతో కూడినదియు, కామగమనము గలదియునగు విమానములో కర్దమ దేవహూతుల విహారము, వారి రతిక్రీడలు మొదలగు అంశములు వర్ణింపబడినవి.

మైత్రేయుడు ఇట్లు పలికెను

తల్లిదండ్రులు వెళ్ళిన పిదప దేవహూతి తన భర్తకు మిక్కిలి ప్రేమతో పరిచర్యలు చేసెను. ఆమె(దేవహూతి) పరమపతివ్రత. భర్త మనస్సెరిగినది. పార్వతి శంకరుని సేవించినట్లు తన భర్తను సేవించినది. ॥ 1,2 ॥

ఓ విదురా! ఆ దేవహూతి చనువు, అంతఃకరణశుద్ధి, ఆదరము, ఇంద్రియ జయము, సేవ, ప్రేమ, మధురభాషణ అనే సద్గుణములు కలిగి భర్తను సేవించెను. కామము, దంభము, ద్వేషము, లోభము, పాపము (నిషిద్ధమైన పనులను ఆచరింపకుండుట) గర్వము, మొదలగు దుర్గుణములను విడిచిపెట్టెను. తేజశ్శాలియగు కర్దముని ప్రయత్న

శ్లో ॥ స వై దేవర్షివర్యస్తాం మానవీం సమనువ్రతామ్ ।
దైవాద్గరీయసః పత్యురాశాసానాం మహాశిషః ॥ 4

టీ:- సఇతి. దైవాద్గరీయసో. దైవాదపి గురుతరాత్. దైవమన్యథా కర్తుం సమర్థాదిత్యర్థః. ॥ 4 ॥

శ్లో ॥ కాలేన భూయసా క్షామాం కర్శితాం వ్రతచర్యయా ।
ప్రేమగద్గదయా వాచా పీడతః కృపయాబ్రవీత్ ॥ 5

టీ:- కాలేనేతి. వ్రతచర్యయా కర్శితాం. తత్రాం భూయసా కాలేన అతి క్షమామిత్యర్థః. ॥ 5 ॥

కర్దమ ఉవాచ

శ్లో ॥ తుష్టోఽహమద్య తవ మానవి మానదాయాః
శుశ్రూషయా పరమయా పరయా చ భక్త్యా ।
యో దేహినామయమతీవ సుహృత్స్వదేహో
నావేక్షితః సముచితః క్షపితుం మదర్థే ॥ 6 ॥

టీ:- తుష్ట ఇతి. సుహృత్ప్రియః. మదర్థే క్షపితుం క్షపయితుం. నావేక్షితః న గణితః. సముచితః శ్లాఘ్యోఽపి మత్సేవాసక్తయా ఉపేక్షిత ఇత్యర్థః.॥ 6 ॥

పూర్వకముగా తన సేవలతో సంతోషపెట్టెను. ॥ 3 ॥

దైవము అన్యథా కర్తుం సమర్థుడు(అనగా మరియొక విధముగా చేయుటకు కూడా సమర్థుడు.) అట్టి దైవముకంటెను గొప్పవాడగు తన భర్తను, మనుచక్రవర్తి కూతురగు దేవహూతి సేవించుచుండెను. చిరకాలము వ్రతానుష్ఠానము చేయుటచే ఆమె కృశించి క్లేశమును పొందుచుండెను. ఇట్టి దేవహూతిని చూచి కర్దముడు దుఃఖమును పొందినవాడై ప్రేమతో బొంగురుపోయిన కంఠముతో ఇట్లనెను. 4,5

కర్దముడు ఇట్లు పలికెను

ఓ మనుచక్రవర్తి కూతురా! నీవు నన్ను సేవించిన తీరు, నీవు చేసే గొప్ప మర్యాద నాకు సంతోషమును కలిగించినవి. ముఖ్యముగా నీ భక్తికి సంతోషించినాను. ప్రాణులందరికి దేహము ప్రియమైనది. అట్టి (పొగడదగిన) నీ దేహమును నా సేవలో ఉపేక్షించి కృశింపజేసినావు. ॥ 6 ॥

శ్లో ॥ యే మే స్వధర్మనిరతస్య తపస్సమాధి
విద్యాత్మ యోగ విజితా భగవత్ప్రసాదాః ।
తానేవ తే మదనుసేవనయావరుద్ధాన్
దృష్టిం ప్రపశ్య వితరామ్యభయా న శోకాన్ ॥ 7

టీ:- యఇతి. తపశ్చ సమాధిశ్చ విద్యా ఉపాసనా చ. తాసు య ఆత్మయోగం చిత్తైకాగ్ర్యం తేన విజితాః ప్రాప్తాః భగవత్ప్రసాదాః దివిజాః భోగాః తానేవ. తే మదనుసేవయా. అవరుద్ధాన్. త్వయాపి సేవ మానయా వశీకృతాన్. ప్రపశ్య తే తవ దివ్యాం దృష్టిం వితరామి. యయా దృష్ట్యా ద్రక్ష్యసి. ॥ 7 ॥

నేను స్వధర్మనిరతుడనై యున్నాను. తపస్సు, ధ్యానము, ఉపాసనలచేత భగవదనుగ్రహమును పొందినాను. ఆ కారణాన నాకు మహిమలు కలిగినవి. ఆ మహిమల(విభూతుల) వలన భోగానుభవము లందు, భయము శోకము ఉండవు. నాకు చేసిన సేవాప్రభావముచే ఆ మహిమలు నీకు కూడా వశమైనవి. నేను నీకు దివ్యదృష్టి నిచ్చెదను. ఆ దివ్యదృష్టి ద్వారా ఆ విభూతులను (మహిమలను) చూడుము. 7

శ్లో ॥ అన్యే పునర్భగవతో భ్రువ ఉద్విజృంభ
విభ్రంశితార్థ రచనాః కిమురుక్రమస్య ।
సిద్ధాసి భుంక్ష్వ విభవాన్నిజ ధర్మ దోహాన్
దివ్యాన్నరైర్దురధిగాన్నృప విక్రియాభిః ॥ 8

టీ:- అన్య ఇతి. అన్యే పునర్భోగాః కిం న కిమపి. అతితుచ్ఛా ఇత్యర్థః . తత్ర హేతుః. భగవతః ఉరుక్రమస్య. యా భ్రూః. తస్యాః ఉద్విజృంభః వక్రీభావః. తేన విభ్రంశితాః. అర్థరచనాః మనోరథాః యేషు. తే నిజధర్మేణ పాతివ్రత్యేన. దుహ్యంత ఇతి తథా తాన్. దురధిగాన్

ఇతర భోగములెన్నియున్ననూ అవి శ్రీహరి యొక్క కను బొమ్మలు ముడిపడినంతనే నశించును. కనుక ఆ భోగములు నీకు తుచ్ఛములు. నీవు సిద్ధురాలవు. నీ పాతివ్రత్య మహిమచే నీకు దివ్య భోగములు సమకూరును. మేము రాజులము, ధనికులము అని విర్రవీగే మానవులు నీవనుభవింపనున్న దివ్య భోగములను పొంద-జాలరు. 8

దుష్ప్రాపాన్. నృపా వయమితి యాః విక్రియాః. తత్తద్భోగ వికృతయః తాభిః. ॥ 8 ॥

శ్లో ॥ ఏవం బ్రువాణమబలాఖిల యోగమాయా
విద్యా విచక్షణమవేక్ష్య గతాధిరాసీత్ ।
సంప్రశ్రయ ప్రణయ విహ్వలయా గిరేషత్
వ్రీడావలోక విలసద్ధసితాననాహ ॥ 9

టీ:- ఏవమితి. అఖిలా యోగమాయాశ్చ. విద్యాశ్చ తత్తదుపాసనాః తాసు. విచక్షణం నిపుణం ఏవం బ్రువాణం పతిం వీక్ష్య గతాధిర్నిశ్చింతా జాతా. సంప్రశ్రయో వినయః. ప్రణయః ప్రేమ. తాభ్యాం విహ్వలా గద్గదా తయా గిరా ఈషద్వ్రీడాసహితో యోఽవలోకస్తేన. విలసద్వికసితం. హసితం జాతహాసం చాననం యస్యాస్సా. ఆహ జగాద. 9

కర్దముడు సమస్తమైన యోగశక్తులయందు విద్యలయందు నిపుణుడు. ఈ విధముగా కర్దముడు మాటలాడుచుండగా అమాయకురాలైన దేవహూతి మనస్సులోని చింత తొలగిపోయెను. వినయము, ప్రేమతో నిండిన ఆమె కంఠము బొంగురు పోయెను. కొంచెము సిగ్గుపడుచున్న ముఖముకలదై ఇట్లు పలికెను. ॥ 9 ॥

దేవహూతిరువాచ

శ్లో ॥ రాద్ధం బత ద్విజవృషైతదమోఘ యోగ
మాయాధిపే త్వయి విభౌ తదవైమి భర్తః ।
యస్తేఽభ్యధాయి సమయః సకృదంగసంగో
భూయాద్గరీయసి గుణః ప్రసవః సతీనామ్ ॥ 10

దేవహూతి ఇట్లు పలికెను

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! స్వామీ! మీకు అమోఘమగు యోగశక్తులు గలవు. మీరు త్రిగుణాత్మకమయిన మాయకు అధిపతులు. మీరు చెప్పినదంతయు సత్యమే. సందేహములేదు. పుత్రోత్పత్తివరకు "నేను

టీ:- రాద్ధమితి. బతేతి హర్షే. ద్విజవృష ద్విజశ్రేష్ఠ హే భర్తః. త్వయ్యేతత్సర్వం రాద్ధం సిద్ధమేవ. తత్ అహం అవైమి జానామి. కింతు. యస్తే త్వయా సమయోఽభిహితః స తావద్భూయాత్. సకృదితి గర్భసంభవమాత్రపర్యంత ఇత్యర్థః. యస్మాద్గరీయసి శ్రేష్ఠే. భర్తరి హేతుభూతే. స్త్రీణాం ప్రసవో గుణః. మహాన్ సమాసపాఠే గరీయసి పత్యౌ సతి సతీనాం యతో గుణప్రసవః గుణవిస్తారో భవతి. అతః పుత్రోత్పత్త్యా మమ గుణవిస్తారే జాతే పశ్చాత్త్వదుక్తం సర్వం భవత్వితి ఇతి భావః. ॥ 10 ॥

శ్లో ॥ తత్రేతికృత్యముపశిక్ష యథోపదేశం
యేనైష మే కర్శితోఽతిరిరంసయాత్మా ।
సిద్ధ్యేత తే కృతమనోభవధర్షితాయాః
దీనస్తదీశ భవనం సదృశం విచక్ష్వ ॥ 11

టీ:- అంగసంగార్థం చ ప్రథమమితికర్తవ్యతాం సంపాదయేత్యాహ - తత్రేతి. హే ఈశ, తత్ర అంగసంగే ఇతికృత్యం సాధనం యథోపదేశం కామశాస్త్రానుసారేణ ఉపశిక్ష సంజానీహి. ఉపకల్పయేత్యర్థః. యేన సాధనేన. అభ్యంగ భోజన పానాదినా అతీవ రంతుమిచ్ఛయా. కర్శితో దీనశ్చ. మమైష ఆత్మా దేహః. సిద్ధ్యేత రతిసమర్థో భవేత్. కథం భూతాయాః. తే త్వయైవ. కృతః క్షోభితః యో మనోభవః మన్మథః.

గృహస్థ ధర్మమునవలంబింతు" నని నియమము (సమయము) నేర్పరచితిరి. వివాహ కాలమున చెప్పిన విషయమిప్పుడు నెరవేర్చ గలరు. గొప్ప భర్త ద్వారా గొప్పసంతానము పొందుటయే స్త్రీకి గొప్ప-లాభము. (శ్రేష్ఠులైన మీ ద్వారా పొందే సంతానముతో నాకు ఉత్తమోత్తమయిన ప్రయోజనము నెరవేరునని భావము.) తరువాత అంతా మీరు చెప్పినట్లే జరుగగలదు. ॥ 10 ॥

అంగసంగము (రతి) కొఱకు ముందుగా సౌకర్యములను, సాధన సామగ్రి సంపాదించుమని చెప్పుచున్నది.) ఓ స్వామీ! కామ శాస్త్రానుసారము మన విహారమునకు కావలసిన సౌకర్యములను ఏర్పరచుము. కామశాస్త్రమును బోధించుము (ఉపశిక్ష). నేను మన్మథ పీడితురాలనై అధికముగా రమించవలెననే కోరికగలదానను. కృశించిన దేహముగల దీనురాలను. అభ్యంగన భోజన పానాదుల చేత ఈ దేహము రతిక్రీడకు అనువగునట్లు అనుగ్రహింపుము. మన విహారము నకు, భోగమునకు తగిన భవనమును నిర్మింపుము. ॥ 11 ॥

తేన ధర్షితాయాః. తత్ అనురూపం భవనం చ. విచక్ష్వ వితర్కయ. విచారయేతి యావత్. 11

వైత్రేయ ఉవాచ

శ్లో ॥ ప్రియాయాః ప్రియమన్విచ్ఛన్ కర్దమో యోగమాస్థితః ।
విమానం కామగం క్షత్తస్తర్హ్యే వావిరచీకరత్ ॥ 12

టీ:- ప్రియాయా ఇతి. తర్హి తత్ క్షణమేవ ఆవిరచీకరత్. ఆవిర్భావయాం బభూవ. 12

శ్లో ॥ సర్వకామదుఘం దివ్యం సర్వరత్న సమన్వితమ్ ।
సర్వర్ధ్యుపచయోదర్కం మణిస్తంభైరుపస్కృతమ్ ॥ 13

టీ:- తదేవ విశినష్టి-నవభిః. సర్వేతి. సర్వైః రత్నాదిభిస్సమన్వితమ్. సర్వర్ధీనాం సర్వ సంపదాం. య ఉపచయః తస్య. ఉదర్కః ఉత్తరోత్తరాభి వృద్ధిర్యస్మిన్ తత్. ఉపస్కృతం శోభితం. ॥ 13 ॥

శ్లో ॥ దివ్యోపకరణోపేతం సర్వకాలసుఖావహమ్ ।
పట్టికాభిః పతాకాభిర్విచిత్రాభిరలంకృతమ్ ॥ 14 ॥

మైత్రేయుడు ఇట్లు పలికెను

ఓ విదురా! కర్దముడు తన ప్రియురాలికి ప్రియము చేయగోరిన - వాడై అప్పటికప్పుడు తన యోగశక్తిచేత కామగమనముగల విమానమును నిర్మించెను. ॥ 12 ॥

(ఆ విమానము సమస్తమైన కోరికలను తీర్చునట్టిదనుచు తొమ్మిది శ్లోకములతో వర్ణించుచున్నాడు) ఆ దివ్యవిమానము కోరికలన్నింటినీ తీర్చును. వివిధములైన రత్నములచే కూడుకొన్నది. దానిలో సంపదలన్నియు ఉత్తరోత్తరాభివృద్ధి చెందు గొప్పదనము గలది. మణి స్తంభములచే అలంకరింపబడినది. కర్దముడు అట్టి దివ్య విమానమును నిర్మించెను.॥13॥

ఆ విమానము దివ్యమగు సాధనములతో గూడినది. ఎల్లప్పుడు

టీ:- దివ్యేతి. ఉపకరణం పరికరః. పట్టికాః అల్ప విస్తార పట్ట వస్త్ర విశేషాః. పతాకాః విస్తృతాః తాభిః. ॥ 14 ॥

సుఖము నిచ్చునది. పట్టికలతో, పతాకములతో చక్కగా అలంకరింపబడినది. (తక్కువ విస్తారముగలది పట్టిక, ఎక్కువ విస్తారముకలది పతాకము(జెండా)). ఈ రకమైన దివ్య విమానమును కర్దముడు నిర్మించెను. ॥ 14 ॥

శ్లో ॥ స్రగ్భిర్విచిత్ర మాల్యాభిర్మంజుశింజత్షడంఘ్రిభిః ।
దుకూల క్షౌమకౌశేయైర్నానావస్త్రైర్విరాజితమ్ ॥ 15

టీ:- స్రగ్భిరితి. విచిత్రాణి మాల్యాని పుష్పాణి యాసు. మంజు యథా భవతి ఏవం శింజంతః కూజంతః షడంఘ్రయో యాసు తాభిః స్రగ్భిః (15)

ఆ విమానము విచిత్రములైన పూలమాలలతోను, మధురముగా ధ్వని చేయుచున్న తుమ్మెదలతోను, పట్టువస్త్రము, జిలుగు వస్త్రము మొదలగు రకరకములైన వస్త్రములతో గూడి యుండెను. ॥ 15 ॥

శ్లో ॥ ఉపర్యుపరి విన్యస్త నిలయేషు పృథక్పృథక్ ।
క్లిప్తైః కశిపుభిః కాంతం పర్యంక వ్యజనాసనైః ॥ 16

ఆ విమానములో ఒకదానిపై ఒకటి అంతస్తులు నిర్మింపబడి యున్నవి. వాటిలో మెత్తలు, శయ్యలు, గాలి వీచే సాధనములు, ఆసనములు మున్నగు సామాగ్రి యుండెను. వీటిన్నింటిచే ఆ భవనము అందముగా అలంకరింపబడి యుండెను. 16

శ్లో ॥ తత్ర తత్ర వినిక్షిప్త నానా శిల్పోపశోభితమ్ ।
మహామరకత స్థల్యా జుష్టం విద్రుమవేదిభిః ॥ 17

టీ:- ఉపరీతి. ఉపర్యుపరి విరచిత గృహేషు. కశిపుభిః శయ్యాభిః కాంతం కమనీయం. పర్యంకాదిభిశ్చ కాంతం. ॥ 17 ॥

ఆ దివ్యభవనములో అక్కడక్కడ రకరకములైన శిల్పములుండెను. అందు మరకత మణులచే ఏర్పరుచబడిన ప్రదేశములు, పగడములతో నిర్మితములైన అరుగులుండెను. 17

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో ॥ ద్వాస్సు విద్రుమ దేహళ్యా భాతం వజ్ర కవాటవత్ ।
శిఖరేష్వింద్ర నీలేషు హైమ కుంభైరధిశ్రితం ॥ 18

టీ:- ద్వార్ష్వితి. ద్వాస్సు ద్వారేషు విద్రుమ నిర్మితా దేహళ్యా. ఉదుంబరః తయా భాతం శోభితం. వజ్రఖచిత కవాట యుక్తం ఇంద్ర నీలమయేషు శిఖరేషు ప్రాసాదాగ్ర భాగేషు. ॥ 18 ॥

ఆ దివ్యభవనమునందు ద్వారముల యొక్క కడపలు పగడములతో నిర్మితములైనవి. వజ్రములతో చేయబడిన ద్వారములు కలవు. ఇంద్రనీల మణులతో నిర్మింపబడిన భవనాగ్రముల యందు బంగారు కలశములు కలవు. 18

శ్లో ॥ చక్షుష్మత్పద్మ రాగాగ్ర్యైర్వజ్ర భిత్తిషు నిర్మితైః ।
జుష్టం విచిత్ర వైతానైర్మహార్హైర్హేమ తోరణైః ॥ 19

టీ:- చక్షుష్మదితి. చక్షుష్మంత ఇవ యే పద్మరాగాగ్ర్యాః తైః. యద్వా చక్షుష్మదివకైః. విచిత్రైర్వైతానైర్వితాన సమూహైః. ॥ 19 ॥

ఆ భవనములో వజ్రనిర్మితములైన గోడలయందు కెంపులు పొదగబడినవి. ఆ కెంపులు విమానముయొక్క కన్నుల వలెనున్నవి. విచిత్రములైన వితానములు (చాందినీలు) కలవు. బంగారు తోరణములు కలవు. 19

శ్లో ॥ హంస పారావత వ్రాతైస్తత్ర తత్ర నికూజితమ్ ।
కృత్రిమాన్మన్యమానైః స్వానధిరుహ్యావరుహ్య చ ॥ 20

టీ:- హంసేతి. కృత్రిమానపి హంసాన్. స్వాన్ స్వ జాతీయాన్. మన్యమానైః. తత్ర తత్రాధిరుహ్య వికూజితమ్. ॥ 20 ॥

ఆ భవనములో కృత్రిమములైన పక్షులు కలవు. (పక్షుల బొమ్మలు) వాటిని చూచి తమ జాతి పక్షులేయని తలచి హంసలు, పావురములు వాటి మీది మీదికి పాకుచూ గట్టిగా కూయుచున్నవి. 20

శ్లో ॥ విహారస్థాన విశ్రామ సంవేశ ప్రాంగణాజిరైః ।
యథోపజోషం రచితైర్విస్మాపనమివాత్మనః ॥ 21

టీ:- విహారేతి. విహారస్థానం క్రీడాప్రదేశః. విశ్రామః శయన గృహం. సంవేశః ఉపభోగస్థానం. ప్రాంగణం గృహోద్బహిః.అజిరం ప్రాకారాద్బహిః. యథోపజోషం యథా సుఖం ఆత్మనః స్వస్య మాయావినోఽపి విస్మయజనకమివ. ॥ 21 ॥

ఆ భవనములో చాలా సౌకర్యవంతమైన విహారస్థలములు, విశ్రాంతి గదులు, శయనాగారములు, వాకిళ్ళు, గచ్చులు మున్నగునవి కలవు. వాటిని చూచి, స్వయముగా కర్దముడే ఆశ్చర్యపోవునట్లుండెను. 21

శ్లో ॥ ఈదృగ్గృహం తత్పశ్యంతీం నాతి ప్రీతేన చేతసా ।
సర్వభూతాశయాఽభిజ్ఞః ప్రావోచత్కర్దమః స్వయమ్ ॥ 22

టీ:- ఈదృగితి. నాతిప్రీతేన మలిన దేహత్వాత్పరిచారికాభావాచ్చ. 22

ఇట్టి దివ్యభవనమును చూచి దేవహూతి అంతగా సంతోష పడలేదు. తన దేహము మలినముగా ఉండుట వలన, పరిచారికలు లేనందున ఆమె ఎక్కువ సంతోషపడలేదు. కర్దముడు సకల ప్రాణుల మనస్సులలోని విషయము తెలిసిన వాడు కనక, స్వయముగా ఆమెతో ఇట్లు మాట్లాడసాగెను. ॥ 22 ॥

శ్లో ॥ నిమజ్జ్యాస్మిన్ హ్రదేభీరు విమానమిదమారుహ ।
ఇదం శుక్లకృతం తీర్థమాశిషాం యాపకం నృణామ్ ॥ 23

టీ:-- నిమజ్జేతి. అస్మిన్ హ్రదే బిందుసరసి. ఆరుహ అధిరోహ. శుక్లేన శ్రీవిష్ణునా. కృతం అనందాశ్రు నిపాతనేన. యాపకం ప్రాపకం.॥ 23

భయస్వభావము గలదానా! ఈ బిందుసరోవరములో మునిగి (స్నానము చేసి) ఈ విమానము నెక్కుము. ఈ సరస్సు శ్రీహరి యొక్క ఆనందబాష్పములతో ఏర్పడినది. దీని యందు స్నానము చేసిన మానవులకు సమస్తమైన కోరికలు తీరును. ॥ 23 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ సా తద్భర్తుః సమాదాయ వచః కువలయేక్షణా ।
సరజం బిభ్రతీ వాసో వేణీ భూతాంశ్చ మూర్ధజాన్ ॥ 24

టీ:- సేతి. సమాదాయ ఆదృత్య. సరజం మలినీ భూతం. వేణీ భూతాన్ జటిలాన్. ॥ 24 ॥

శ్లో ॥ అంగం చ మలపంకేన సంఛన్నం శబలస్తనమ్ ।
ఆవివేశ సరస్వత్యాః సరః శివ జలాశయమ్ ॥ 25

టీ:- అంగమితి. శబలౌ వివర్ణౌ స్తనౌ యస్మిన్ తత్. సరస్వత్యాః శివాని జలాని ఆశేరతే యస్మిన్. శివాః జలాశయాః జలచరాయస్మిన్నితి వా. 25

శ్లో ॥ సాంతస్సరసి వేశ్మస్థాః శతాని దశ కన్యకాః ।
సర్వాః కిశోర వయసో దదర్శోత్పల గంధయః ॥ 26

టీ:- సా తత్ర నిమగ్నా సతీ విస్మయం దదర్శ. తమాహ- సాంతః సరసి ఇతి దశభిః. . ఉత్పల గంధయః కమలా గంధీః. ॥ 26 ॥

ఆ కలువ కన్నులు గల దేవహూతి భర్తయొక్క మాటలను అంగీకరించినది. ఆమె కట్టిన చీర మలినముగ నుండెను. ఆమె జుట్టు జడలు గట్టియుండెను. శరీరము దుమ్ముతో యుండెను. ఆమె స్తనములు వివర్ణములై యుండెను. ఇట్లున్న దేవహూతి సరస్వతీ నదీ తటమునందున్న బిందుసరోవరములో ప్రవేశించెను. ఆ బిందు సరోవరము పవిత్రమైన సరస్వతీ నదీ జలములతో కూడి యుండెను. (లేక జలచరములతో కూడి యుండెను.) ॥ 24-25 ॥

(ఆమె సరోవరములో మునిగినప్పుడు పొందిన విస్మయమును పది శ్లోకములతో వర్ణించుచున్నాడు). ఆ దేవహూతి సరోవరములోని నీళ్ళలో మునిగి వేయి మంది కన్యలను చూచినది. ఆ వేయిమంది కిశోరావస్థలో (నవయవ్వనము లో) నుండిరి. వారందరు కలువ పూల వాసనవంటి సువాసనగల వారు. 26

శ్లో ॥ తాం దృష్ట్వా సహసోత్థాయ ప్రోచుః ప్రాంజలయః స్త్రియః ।
వయం కర్మకరీస్తుభ్యం శాధి నః కరవామ కిమ్ ॥ 27

టీ:- తామితి. తుభ్యం తవ కర్మకరీః పరిచారికా వయం. అస్మానాజ్ఞాపయేతి. స్త్రియః ప్రోచుః. ॥ 27 ॥

ఆ కన్యలు దేవహూతిని చూచి వెంటనే నిలబడి చేతులు జోడించి నమస్కరించి ఇట్లనిరి. "మేమంతా నీ సేవకురాండ్రము. మేమేమి చేయవలెనో ఆజ్ఞాపించండి." ॥ 27 ॥

శ్లో ॥ స్నానేన తాం మహార్హేణ స్నాపయిత్వా మనస్వినీమ్ ।
దుకూలే నిర్మలే నూత్నే దదురస్యై చ మానదాః ॥ 28

ఆ స్త్రీలు యజమానురాలికి చక్కగా మర్యాదచేసే స్వభావము కలవారు. వారు స్నానయోగ్యములైన తైలాదులచేత మానవతియైన దేవహూతిని స్నానము చేయించి, నూతనమైన, స్వచ్ఛమైన పట్టు వస్త్రముల నిచ్చిరి. ॥ 28 ॥

శ్లో ॥ భూషణాని పరార్ధ్యాని వరీయాంసి ద్యుమంతి చ ।
అన్నం సర్వ గుణోపేతం పానం చైవామృతాసవమ్ ॥ 29

టీ:- స్నానేనేతి. తతశ్చ స్నానేన స్నాన యోగ్యాసన గంధ తైలాదినా. భూషణానీతి. పరార్ధ్యాని ఉత్కృష్టాని. వరీయాంసి తత్ప్రియాణి. ద్యుమంతి దీప్తిమంతి చ పానం పేయమ్. అమృతం స్వాదు ఆసవం మాదకమ్. 28,29

వారు ఆమెకు అమూల్యములైన కాంతి వంతములైన శ్రేష్ఠములైన ఆభరణముల నిచ్చిరి. రుచికరమైన అన్ని పదార్థములతో కూడిన భోజనము పెట్టిరి. అమృతము వంటి పానీయమును ఇచ్చిరి. 29

శ్లో ॥ అథా దర్శే స్వమాత్మానం స్రగ్విణం విరజాంబరమ్ ।
విరజం కృత స్వస్త్యయనం కన్యాభిర్బహుమానితమ్ ॥ 30 ॥

(ఈ నాలుగు శ్లోకములతో ఆమె అద్దములో చూచుకొనిన

టీ:- అథేతి. ఆదర్శే స్వాత్మానం దదర్శేతి శేషః. ఆత్మానం విశినష్టి- చతుర్భిః. కృతం స్వస్త్యయనం మంగళం యస్య. పుంస్త్వం ఆత్మన్ శబ్ద సామానాధికరణ్యాత్. ॥ 30 ॥

శ్లో ॥ స్నాతం కృత శిరస్స్నానం సర్వాభరణ భూషితమ్ ।
నిష్కగ్రీవం వలయినం కూజత్కాంచన నూపురమ్ ॥ 31

టీ:- స్నాతమితి. విరజమిత్యస్య ప్రపంచః. స్నాతముద్వర్త్య క్షాళితమ్ కృతం శిరస్స్నాన మభ్యంగో యేన తం. భూషితత్వమేవాహ - నిష్కం పదకం గ్రీవాయాం యస్య. 31

శ్లో ॥ శ్రోణ్యోరధ్యస్తయా కాంచ్యా కాంచన్యా బహురత్నయా ।
హారేణ చ మహార్హేణ రుచకేన విభూషితమ్ ॥ 32

టీ:- శ్రోణ్యోరితి. బహూని రత్నాని యస్యాం తయా. రుచకేన మంగళద్రవ్యేణ కుంకుమాదినా. తదుక్తం విశ్వప్రకాశే.ని.“రుచకం మంగళ ద్రవ్యే గ్రీవాభరణదంతయో”రితి. ॥ 32 ॥

సౌందర్యము వర్ణింపబడినది.) అప్పుడు దేవహూతి అద్దములో తనను తాను చూచుకొనెను. ఆమె చక్కటి మాలను, స్వచ్ఛమగు వస్త్రములు, నిర్మలమైన, మంగళ ప్రదములైన ఆభరణములును, మంగళాలంకార ములను ధరించి యుండెను. కన్యలు సేవించుచుండిరి. ఇట్టి తనను అద్దములో చూచుకొనెను. ॥ 30 ॥

ఆ దేవహూతి శిరస్స్నానము (అభ్యంగన స్నానము) చేసెను. అన్ని ఆభరణములను ధరించెను. చక్కగా అలంకరించుకొనెను. ఆమె మెడలో పతకమును ధరించెను. చేతులకు కంకణములు కలవు. పాదములందు బంగారు అందెలు గణగణ శబ్దము చేయుచుండెను. (ఇట్టి తన రూపమును అద్దములో చూచుకొన్నది.) ॥ 31 ।

।

దేవహూతి నడుమునందు అనేక రత్నములు పొదగిన బంగారు మొలత్రాడును,(వడ్డాణమును) గొప్పరత్నములచే కూడిన హారమును ధరించెను. శరీరము కుంకుమాది మంగళ ద్రవ్యములతో అలంకరింప బడియుండెను. (‘రుచకం మంగళద్రవ్యే గ్రీవాభరణ దంతయోః’ అని ‘విశ్వప్రకాశము’నందు కలదు. రుచకం అనగా మంగళ ద్రవ్యము). 32

శ్లో ॥ సుభ్రువా సుదతా శ్లక్ష్ణస్నిగ్ధాపాంగేన చక్షుషా ।
పద్మకోశస్పృధానీలైరలకైశ్చ లసన్ముఖమ్ ॥ 33

టీ:- సుభ్రువేతి. సుదతా సుభ్రువా చక్షుషేతి చ జాతావేక వచనాని. ఏతైర్లసచ్ఛోభమానం ముఖం యస్య తం. కథం భూతేన చక్షుషా. శ్లక్ష్ణః మనోహరః స్నిగ్ధో పాంగో నేత్రప్రాంతో యస్య తేన. పద్మకోశేన స్పర్ధత ఇతి పద్మకోశస్పృత్ తేన. ॥ 33 ॥

దేవహూతి అందమగు పలువరుసతో, అందమగు కను - బొమ్మలతో, చక్కని ప్రేమతో గూడిన కడగంటి చూపులతో, నల్లని వెంద్రుకలతో వెలుగొందే ముఖమును చూచుకొనెను. (సుదతా, సుభ్రువా, చక్షుషా అనునవి ఏకవచన శబ్దములైనను అన్వయమున బహు వచనార్థము. ) ॥ 33 ॥

శ్లో ॥ యదా సస్మార ఋషభమృషీణాం దయితం పతిమ్ ।
తత్ర చాస్తే సహ స్త్రీభిర్యత్రాస్తే స ప్రజాపతిః ॥ 34

టీ:- యదేతి. దృష్ట్వా చ యదా పతిం సస్మార తదా యత్రాసౌ తత్రైవ స్వయమప్యాస్తే. ॥ 34 ॥

దేవహూతి ఈ రకమైన తన రూపమును చూచుకొని ఋషి శ్రేష్ఠుడును తన భర్తయునగు కర్దమమునిని స్మరించెను. వెంటనే ఆ కన్యలతోబాటు కర్దమఋషియున్న స్థలమునకు చేరెను. ॥ 34 ॥

శ్లో ॥ భర్తుః పురస్తాదాత్మానం స్త్రీ సహస్రవృతం తదా ।
నిశామ్య తద్యోగగతిం సంశయం ప్రత్యపద్యత ॥ 35

టీ:- భర్తురితి. ఆత్మానం నిశామ్య దృష్ట్వా తాం చ తస్య యోగ గతిం. యోగ ప్రభావం చ దృష్ట్వా సంశయం కిమిదమితి విస్మయం. 35

వేయిమంది స్త్రీలతో కూడి భర్త యెదుట నిలిచిన దేవహూతి తన భర్త యొక్క యోగశక్తికి మిక్కిలి విస్మయపడెను. (సంశయమే విస్మయము) (ఇదంతా ఏమిటని సంశయము). ॥ 35 ॥

శ్లో ॥ స తాం కృతమలస్నానాం విభ్రాజంతీమపూర్వవత్ ।
ఆత్మనో బిభ్రతీం రూపం సంవీతరుచిరస్తనీమ్ ॥ 36

టీ:- సఇతి. సః మునిః వివాహాత్ప్రాక్. యదాత్మనో రూపం. తదేవ పునః బిభ్రతీమ్. సంవీతౌ ప్రావృతౌ. రుచిరౌ స్తనౌ యస్యాస్తామ్ పాఠాంతరే తు రూపవిశేషమ్. ॥ 36 ॥

శ్లో ॥ విద్యాధరీ సహస్రేణ సేవ్యమానాం సువాససమ్ ।
జాతభావో విమానం తదారోహ యదమిత్రహన్ ॥ 37 ॥

టీ:- విద్యాధరీతి. శోభనే వాససీ యస్యాస్తాం. అతః జాతో భావః ప్రేమా యస్య. హే అమిత్రహన్ జితకామ. ॥ 37 ॥

శ్లో ॥ తస్మిన్నలుప్త మహిమా ప్రియయాఽనురక్తో
విద్యాధరీభిరుపచీర్ణ వపుర్విమానే ।
బభ్రాజ ఉత్కచకుముద్గణవానపీచ్యః
తారాభిరావృత ఇవోడుపతిర్నభస్థః ॥ 38 ॥

టీ:- తస్మిన్నితి. తస్మిన్విమానే మునిర్బభ్రాజే. నలుప్తో మహిమా స్వాతంత్ర్యం యస్య. ఉపచీర్ణం శుశ్రూషితం వపుర్యస్య. వికసిత కుముద గణవాన్. అపీచ్యోఽతి సుందరః పూర్ణచంద్ర ఇవ మునిః, నభ ఇవ

కామాది శత్రువులను జయించిన ఓ విదురా! దేవహూతి స్నానముచేసి అత్యంత నిర్మలముగా నుండుటను కర్దముడు చూచెను. వివాహమునకు పూర్వమున్న రూపమే మళ్ళీ కనిపించెను. కానీ మిక్కిలి శోభాయమానముగా నుండెను. చక్కని వక్షఃస్థలము చుట్టూ చీరను కప్పుకొని యుండెను. ఆమె చుట్టూ వేయిమంది విద్యాధరస్త్రీలు చేరి సేవించుచుండిరి. ఆమెను చూచిన వెంటనే కర్దమమునిలో ప్రేమ పుట్టెను. అప్పుడు ఆమెను విమానములో ఎక్కించెను. ॥ 36-37 ॥

కర్దముడు దేవహూతియందు అనురక్తుడైయున్నను ఆయనకు మనస్సు మరియు ఇంద్రియ జయము నందు కొరతరాలేదు. విద్యాధర స్త్రీలు ఆయనను సేవించుచుండిరి. ఆయన ఆకాశములో చుక్కల మధ్య నున్న చంద్రునివలె ప్రకాశించెను. (చంద్రుడు కలువలను వికసింపజేయును.) ఇచట పూర్ణచంద్రునివలె కర్దముడు, ఆకాశమువలె విమానము, నక్షత్రములవలె విద్యాధరస్త్రీలు, ఆ స్త్రీల కన్నులు

విమానం, తారా ఇవ తాస్స్త్రియః. కుముదానీవ తాసాం నేత్రాణీతి జ్ఞేయం. 38

కలువలవలె ఉండెను. ॥ 38 ॥

శ్లో ॥ తేనాష్టలోకపవిహారకులాచలేంద్ర
ద్రోణీష్వనంగ సఖ మారుత సౌభగాసు ।
సిద్ధైర్నుతో ద్యుధునిపాత శివస్వనాసు
రేమే చిరం ధనదవల్లలనావరూథీ ॥ 39

టీ:- తేనేతి. తేన విమానేన. అష్టలోకపానామింద్రాదీనాం. విహారో యస్మిన్. కులాచలేంద్రే మేరౌ. తస్య ద్రోణీషు దరీషు. అనంగస్య సఖా యో మారుతః శీతః సుగంధః మందో యోఽనిలః తేన సౌభగం సౌందర్యం యాసు. సిద్ధైర్నుతః స్తుతస్సన్. ద్యుధునిః గంగా. తస్యాః పాతేన శివః స్వనో యాసు. తాసు రేమే. లలనావరూథీ. స్త్రీరత్న-సమూహవాన్. 39

సిద్ధులచే స్తుతింపబడే ఆ కర్దముడు, విద్యాధర స్త్రీలు సేవించుచుండగా చిరకాలము ఆ విమానములో సుఖించెను. మన్మథుని మిత్రుడగు వాయువు హాయిగొల్పుచుండగా, పై నుండి గంగానది జలపాతముచే మంగళకర ధ్వనులు వినిపించుచుండగా, అష్ట దిక్పాలకులు విహరించే మేరుపర్వత బిలములయందు, కుబేరుని వలె సుఖించెను. ॥ 39 ॥

శ్లో ॥ వైశ్రంభకే స్వరసనే నందనే పుష్పభద్రకే ।
మానసే చైత్రరథ్యే చ స రేమే రామయా తతః ॥ 40

టీ:- వైస్రంభక ఇతి. వైస్రంభకాదిషు దేవోద్యానేషు. మానసే చ సరసి రతః ప్రీతస్సన్. ॥ 40 ॥

ఈ విధముగా కర్దముడు తన భార్యతోగూడి వైశ్రంభకము, సురసనము, నందనము, పుష్పభద్రకము, చైత్రరథము అనే దేవోద్యానముల యందు క్రీడించెను. మానససరోవరము నందును

శ్లో ॥ భ్రాజిష్ణునా విమానేన కామగేన మహీయసా ।
వైమానికానత్యశేత చరన్ లోకాన్ యథాఽనిలః ॥ 41

టీ:- భ్రాజిష్ణునేతి. భ్రాజిష్ణునా కామగేన విమానేన అత్యశేత అతిక్రమ్య స్థితః. ॥ 41 ॥

శ్లో ॥ కిం దురాపాదనం తేషాం పుంసాముద్దామచేతసామ్ ।
యైరాశ్రితస్తీర్థపదశ్చరణో వ్యసనాత్యయః ॥ 42

టీ:- కిమితి. ఉద్దామచేతసాం ధీరాణాం. వ్యసనం సంసారః. తస్య అత్యయో యస్మాత్. ॥ 42 ॥

శ్లో ॥ ప్రేక్షయిత్వా భువో గోళం పత్న్యై యావాన్ స్వసంస్థయా ।
బహ్వాశ్చర్యం మహాయోగీ స్వాశ్రమాయ న్యవర్తత ॥ 43

టీ:- ప్రేక్షయిత్వేతి. ప్రేక్షయిత్వా దర్శయిత్వా. గోళం మండలం. స్వసంస్థయా ద్వీపవర్షాది రచనయా యావాన్ తావంతమ్. బహూన్యా-శ్చర్యాణి యస్మిన్ తమ్. ॥ 43 ॥

రమించెను. ॥ 40 ॥

కాంతిమంతముగను, కామగమనమును గల గొప్పవిమానము నందు కూర్చుండి లోకములో వాయువు స్వేచ్ఛగా సంచరించునట్లు సంచరిస్తూ దేవతలను కూడా దాటిపోయెను. (దేవతల కన్నా గొప్ప వైభవమునను అనుభవించెను.) ॥ 41 ॥

ఎవరైతే (సంసార) కష్టముల నుండి గట్టెక్కించే శ్రీహరి పాద పద్మములను శరణు పొందుతారో వారు ధైర్యముతో కూడిన మనస్సు గలవారౌతారు. అలాంటి పురుషులకు సాధింపరానిదేదీ యుండదు. (కర్దమునకు ఈ భోగములు సుసాధ్యములే అనుట.) ॥ 42 ॥

ఈ రకముగా మహాయోగి అయిన కర్దముడు తన భార్యకు, అనేక ద్వీపములు, అనేక వర్షములు(దేశములు) గలిగి విచిత్ర రచనతో గూడిన భూమండలమునంతయూ చూపించి తన ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. ॥ 43 ॥


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో ॥ విభజ్య నవధాత్మానం మానవీం సురతోత్సుకామ్ ।
రామాం నిరమయన్ రేమే వర్షపూగాన్ ముహూర్తవత్ ॥44

టీ:- విభజ్యేతి. నవధా విభజ్య. నవభేదేనాత్మానం కృత్వా. ॥ 44,45॥

ఆ కర్దముడు తనను తాను తొమ్మిది రూపములుగా విభజించుకొనెను. మిక్కిలి రతి సుఖము నభిలషించుచున్న దేవహూతిని ఆనందిపజేయుచు, ఆమెతో అనేక సంవత్సరములు ఒక ముహూర్త కాలము వలె గడిపెను. (తొమ్మిది రూపములుగా విభజించుకొనుట తొమ్మండు గురు సంతానమును పొందుట కొరకు. వారు ఆయా గుణప్రధానులై ఏర్పడుటకొరకు.) ॥ 44 ॥

శ్లో ॥ తస్మిన్ విమాన ఉత్కృష్టాం శయ్యాం రతికరీం శ్రితా ।
న చాబుధ్యత తం కాలం పత్యా ఽపీచ్యేన సంగతా ॥ 45 ॥

దేవహూతి ఆ విమానములో అధికమగు రతిసుఖమును కలిగించే శయ్యను అధిష్ఠించినదై అతిసుందరుడైన తన భర్తతో ఉండెను. ఆమెకు ఎంత కాలము గడచినదో తెలియలేదు. ॥ 45 ॥

శ్లో ॥ ఏవం యోగానుభవేన దంపత్యో రమమాణయోః ।
శతం వ్యతీయుః శరదః కామలాలసయోర్మనాక్ ॥ 46

టీ:- ఏవమితి. శరదస్సంవత్సరాః. మనాగీషదివ వ్యతీయుః. 46

ఈ విధముగా దేవహూతి కర్దము లిరువురు యోగశక్తిచే కామలాలసులై రమించుచుండగా వంద సంవత్సరములు స్వల్ప కాలము వలె గడచిపోయెను. ॥ 46 ॥

శ్లో ॥ తస్యామాధత్త రేతస్తాం భావయన్నాత్మనాత్మవిత్ ।
నోధా విధాయ రూపం స్వం సర్వ సంకల్పవిద్విభుః ॥ 47

కర్దముడు ఆత్మజ్ఞాని. అందరి, అన్ని సంకల్పములు తెలిసిన వాడు. ఆ దేవహూతి యొక్క బహుసంతానాపేక్షను తెలిసికొనెను.

టీ:- తస్యామితి. ఆత్మనా స్వదేహార్థరూపేణ అతిప్రీత్యా భావయన్. తథా సతి సదపత్యం భవేదితి. నోధా నవధా. సర్వసంకల్పవిదితి. తస్యాః బహ్వపత్య సంకల్పం జానన్నిత్యర్థః. విభుః తథా కర్తుం సమర్థశ్చ. ఆత్మవిదితి చ. తస్యామనాసక్తత్వాత్ స్త్రియో జాతా ఇతి భావః. శ్లో. 'పుమాన్ పుంసోధికే శుక్లే స్త్రీ భవత్యధికే స్త్రియా' ఇతి స్మృతేః. ॥47॥

ఆమె సంకల్పమును నెరవేర్చగల సమర్థుడగు కర్దముడు తన భార్యయగు దేవహూతిని తన శరీరార్థ భాగముగా భావించెను. తనను తాను తొమ్మిది రూపములుగా చేసికొని దేవహూతియందు రేతస్సు నుంచెను. భార్యను తన రూపముగా భావించుటచే సత్సంతానము కలుగును. ఆమె అభిప్రాయముననుసరించి స్త్రీసంతానము కొరకై సంకల్పించెను. 'పుమాన్ పుంసోధికే శుక్లే స్త్రీభవత్యధికే స్త్రియా' అని స్మృతివాక్యము. గర్భాధాన సమయములో పురుషుడు అధిక కోరిక కల వాడయితే పురుష సంతానము, స్త్రీ అధిక కోరిక కలదయితే స్త్రీ సంతానము కలుగును. (శుక్లాధిక్యము వలన పురుష సంతానము, శోణితాధిక్యము వలన స్త్రీ సంతానము కలుగును.) ॥ 47 ॥

శ్లో ॥ అతః సా సుషువే సద్యో దేవహూతిః స్త్రియః ప్రజాః ।
సర్వాస్తాశ్చారు సర్వాంగ్యో లోహితోత్పల గంధయః ॥ 48 ॥

టీ:- తత ఇతి. తతః అనంతరమేవ. సద్యః ఏకస్మిన్నేవాహని. చారూణి సర్వాణ్యంగాని యాసాం. ॥ 48 ॥

ఆ దేవహూతి తరువాత ఒకేరోజు తొమ్మండుగురు స్త్రీ సంతానమును కనెను. ఆ పుట్టిన పిల్లలు సర్వాంగ సౌందర్యము గలవారు, ఎర్రకలువల సుగంధము కలవారుగా ఉండిరి. ॥ 48 ॥

శ్లో ॥ పతిం సా ప్రవ్రజిష్యంతం తదాలక్ష్యోశతీ సతీ ।
స్మయమానా విక్లబేన హృదయేన విదూయతా ॥ 49

అప్పుడు సన్న్యాసము స్వీకరించబోయే భర్తను దేవహూతి చూచెను. ఆమె ముఖమునందు చిరునవ్వు కనిపించుచుండెను. కాని

టీ:- పతిమితి. ప్రవ్రజిష్యంతం ఆలక్ష్య వితర్క్యస్మయమానా బహిః అంతస్తు విక్లబేన వ్యాకులితేన. విదూయతా సంతప్యమానేన. హృదా ఉవాచేత్యుత్తరేణాన్వయః. ॥ 49 ॥

శ్లో ॥ లిఖంత్యధోముఖీ భూమిం పదా నఖమణిశ్రియా ।
ఉవాచ లలితాం వాచం నిరుధ్యాశ్రుకలాం శనైః ॥ 50

టీ:- లిఖంతీతి. నఖా ఏవ మణయః తైః శ్రీః శోభా యస్య తేన పదా. భువం లిఖంతీతి దురంతచింతాయా లక్షణం. ॥ 50 ॥

దేవహూతి రువాచ

శ్లో ॥ సర్వం తద్భగవాన్మహ్యముపోవాహ ప్రతి శ్రుతమ్ ।
అథాపి మే ప్రపన్నాయా అభయం దాతుమర్హసి ॥ 51

టీ:- సర్వమితి. ఉపోవాహ సంపాదితవాన్. అభయమితి భావినో దైన్యాత్సంసారాద్యద్భయం తన్నివర్తతేత్యర్థః. ॥ 51 ॥

శ్లో ॥ బ్రహ్మన్ దుహితృభిస్తుభ్యం విమృగ్యాః పతయస్సమాః ।
కశ్చిత్స్యాన్మే విశోకాయ త్వయి ప్రవ్రజితే వనమ్ ॥ 52

హృదయము కల్లోలితమై యుండెను. దుఃఖమయమై యుండెను. ఆమె క్రిందికి చూస్తూ, అపారమైన చింతతో, మణుల వంటి గోళ్ళ గల పాదముతో భూమిపై వ్రాస్తూ నెమ్మదిగా భర్తతో ఇట్లనెను. 49,50

దేవహూతి ఇట్లు పలికెను

భగవన్! మీరు చేసిన ప్రతిజ్ఞప్రకారము నాకు సర్వమును సమకూర్చితిరి. అయినప్పటికి నేను మిమ్ము శరణువేడుచున్నాను. కనుక మీరు నాకు అభయప్రదానము చేయవలసినది. (దైన్యము, సంసారము అనే రెండు భయములు తొలగునట్లు చేయవలసినది.)51

ఓ మహర్షీ! ఈ కన్యలకు తగిన యోగ్యతగల వరులను

టీ:- తత్ర దైన్యం నివేదయతి- బ్రహ్మన్నితి. తుభ్యం తవ. దుహితృభిః స్వతుమేవ ఆత్మనస్సమాః యోగ్యాః. పతయో విమృగ్యా ఇతి దైన్యం ప్రాప్తమ్. సంసారభయమురరీకృత్యాహ - కశ్చిదితి విశోకాయ జ్ఞానోపదేశాయ. పుత్రీభిః ఋణానపాకరణాత్. కించిత్కాలం త్వదవస్థానేన. బ్రహ్మవిత్పుత్రః కశ్చిత్కిం స్యాదిత్యర్థః. ॥ 52 ॥

అన్వేషింపవలెను. మీరు సన్యసించిన పిదప నా దుఃఖమును పోగొట్టే ఒక కుమారుడు కావలెను. దేవహూతి తన దైన్యమును ప్రకటించుచున్నది. 'కశ్చిత్' అనే శబ్దప్రయోగము సంసారము నుండి దూరము కాగోరుట. 'విశోకాయ' జ్ఞానోపదేశ సామర్థ్యము గల పుత్రుని కోరుట. మీరు కొంత కాలముండి వరులన్వేషించుట, బ్రహ్మజ్ఞానియైన పుత్రుని అందించుట చేయవలసినదని అభిప్రాయము. ॥ 52 ॥

శ్లో ॥ ఏతావతాऽలం కాలేన వ్యతిక్రాంతేన మే విభో ।
ఇంద్రియార్థ ప్రసంగేన పరిత్యక్తపరాత్మనః ॥ 53

టీ:- నను విషయాన్ భుంక్ష్వ కిం బ్రహ్మవిద్యయేతి చేత్తత్రాహ- ఏతావతేతి. ఏతావతాऽలం. పూర్యతామ్. పరిత్యక్తః పరః ఆత్మా యయా తస్యా మమ. ॥ 53 ॥

(విషయ సుఖములననుభవించిన పిదప బ్రహ్మవిద్య ఏమిటను మాటకు సమాధానము.) ప్రభో! ఇంద్రియములకు విషయ సంబంధముచే కలుగు ఆసక్తి చేతనే (విషయ సుఖములననుభవించుట చేతనే) నా కాలమంతయు గడచినది. ఒక్కమారు కూడా పరమాత్మను స్మరింపలేదు. విస్మరించినాను. ॥ 53 ॥

శ్లో ॥ ఇంద్రియార్థేషు సజ్జంత్యా ప్రసంగస్త్వయి మే కృతః ।
అజానంత్యా పరం భావం తథాऽప్యస్త్వభయాయ మే ॥ 54

టీ:- సా స్వకృతమనుశోచంత్యాహ-చతుర్భిః. ఇంద్రియార్థేష్వితి. మే మయా. పరం భావం త్వం బ్రహ్మవిదితి. ॥ 54 ॥

(తను చేసిన దానికి విచారిస్తూ ఈ నాలుగు శ్లోకములతో తన అభిప్రాయమును చెప్పుచున్నది.) మీ ప్రభావము తెలియక నేను ఇంద్రియ భోగములందాసక్తి గలదాననై మీ యందు అనురాగము కలదానినయినాను. మీతో సంగము నెరపినాను. అయినప్పటికి నాకు సంసార భయము తొలగుగాక. ॥ 54 ॥

శ్లో ॥ సంగో యః సంసృతేర్హేతురసత్సు విహితో౽ధియా ।
స ఏవ సాధుషు కృతో నిస్సంగత్వాయ కల్పతే ॥ 55

టీ:- ప్రసంగః కథమభయాయాస్తు తత్రాహ-సంగ ఇతి. అధియా అజ్ఞానేన. ॥ 55 ॥

(అభయమెట్లు సమకూర్చునో చెప్పబడుచున్నది). దేవా! అజ్ఞానమువలన దుష్టులతో చేసిన సాంగత్యము సంసార బంధములను తెచ్చిపెట్టును. అదే సాంగత్యము సత్పురుషులతో చేసిన సంసార నివృత్తికి కారణమగును. ॥ 55 ॥

శ్లో ॥ నేహ యత్కర్మ ధర్మాయ న విరాగాయ కల్పతే ।
న తీర్థపదసేవాయై జీవన్నపి మృతో హి సః ॥ 56

టీ:-- నేతి. స్వభావతః ప్రవృత్తం. యస్య కర్మ ధర్మార్థం న కల్పతే ధర్మాభిముఖం న భవేత్ తత్రాపి నిష్కామధర్మ ద్వారా విరాగాయ న కల్పతే. తద్ద్వారా చ తీర్థపదస్య శ్రీహరేః సేవాయై సేవార్థం న పర్యవస్యేదిత్యర్థః. ॥ 56 ॥

ఈ సంసారములో ఎవని కర్మలు ధర్మము కొరకు కావో, ఏ ధర్మము వైరాగ్యమును కలుగజేయదో, ఏ వైరాగ్యము భగవంతుని సేవను కలిగించదో వాడు జీవించినను మరణించిన వానితో సమానము. ధర్మమాచరింపవలెను. ఆ ధర్మము వైరాగ్యమును కలిగించ వలెను. వైరాగ్యము భగవత్సేవగా పరిణమించవలెనని అర్థము. 56

శ్లో ॥ సాహం భగవతో నూనం వంచితా మాయయా దృఢమ్ ।
యత్త్వాం విముక్తిదం ప్రాప్య న ముముక్షేయ బంధనాత్ ॥57

టీ:- సేతి. న ముముక్షేయ మోక్తుమిచ్ఛాం కృతవత్యస్మి. ॥ 57 ॥

నిశ్చయముగా నేను భగవంతుని దృఢమైన మాయచే వంచింపబడితిని. ఎట్లనగా ముక్తినివ్వగలిగిన మిమ్ము పొంది కూడా నేను సంసార బంధమునుండి మోక్షమును పొందలేకపోతిని. 57

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
కపిలోపాఖ్యానే త్రయోవింశతితమో౽ధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు

చతుర్వింశోఽధ్యాయః

శ్లో ॥ చతుర్వింశే తతో జన్మ కపిలస్యాహ తత్పితుః ।
ప్రవ్రజ్యాంత మనుజ్ఞాప్య ఋణత్రయ విమోక్షతః ॥

శ్రీమైత్రేయ ఉవాచ

శ్లో ॥ నిర్వేదవాదినీమేవం మనోర్దుహితరం మునిః ।
దయాళుః శాలినీమాహ శుక్లాభివ్యాహృతం స్మరన్ ॥ 1

టీ:- నిర్వేదేతి. శాలినీం శ్లాఘ్యామ్ శుక్లేన శ్రీవిష్ణునా. అభివ్యాహృతం. సహోహం స్వాంశకలయా ఇత్యాది. ॥ 1 ॥

ఋషిరువాచ

శ్లో ॥ మా ఖిదో రాజపుత్రీత్థమాత్మానం ప్రత్యనిందితే ।
భగవాంస్తేఽక్షరో గర్భమదూరాత్సం ప్రపత్స్యతే ॥ 2

టీ:- మాఖిద ఇతి. ఇత్థం మా ఖిదః ఖేదం మాకార్షీః. ఆత్మానం ప్రత్యహం భాగ్యహీనేతి. అదూరాచ్ఛీఘ్రం. ॥ 2 ॥

ఇరువది మూడవ అధ్యాయము సమాప్తము

24 వ అధ్యాయము

ఈ ఇరువదినాల్గవ అధ్యాయమున కపిల జననము, కర్దమ మహర్షి కపిలుని అనుమతితో సన్యాసమును స్వీకరించుట, కర్దముడు ఋణత్రయము నుండి విముక్తుడగుట మున్నగు విషయములు వర్ణింపబడినవి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను

ఈ విధముగా దేవహూతి వైరాగ్య యుక్తములగు, పొగడదగిన మాటలను పలుకగా కర్దముడు విని, శ్రీహరిభగవానుని 'సహోహం స్వాంశకలయా' మొదలగు మాటలను స్మరించి దయగలవాడై ఆమెతో ఇట్లనెను. ॥ 1 ॥

కర్దమఋషి ఇట్లు పలికెను

దోషరహితురాలవైన ఓ రాజపుత్రీ! ఈ విధముగా నిన్ను నీవు అదృష్టహీనురాలనని భావించి దుఃఖించకుము. నీ గర్భములో అచిర-కాలములోనే అవినాశియైన శ్రీహరి ప్రవేశించగలడు. ॥ 2 ॥

శ్లో ॥ ధృతవ్రతాసి భద్రం తే దమేన నియమేన చ ।
తపో ద్రవిణ దానైశ్చ శ్రద్ధయా చేశ్వరం భజ ॥ 3

టీ:- ధృతేతి. దమేన ఇంద్రియసంయమేన. నియమేన స్వధర్మేణ. తపాంసి ద్రవిణ దానాని చ తైశ్చ. ॥ 3 ॥

నీవు వ్రతముల నాచరించిన దానవు. నీకు శుభమగు గాక! ఇంద్రియనిగ్రహముతో, స్వధర్మాచరణతో, తపస్సుతో ద్రవ్యదానముతో, శ్రద్ధతో భగవంతుని ఆరాధించుము. ॥ 3 ॥

శ్లో ॥ స త్వయారాధితః శుక్లో వితన్వన్మామకం యశః ।
ఛేత్తా తే హృదయగ్రంథిమౌదర్యో బ్రహ్మభావనః ॥ 4

టీ:- సఇతి. హృదయ గ్రంథిం. చిత్ జడాత్మకం అహంకారలక్షణం బంధం. ఛేత్తా ఛేత్స్యతి. ఔదర్యః పుత్రస్సన్. బ్రహ్మ భావయతి ఉపదిశతీతి తథా. 4

నీచే ఆరాధించబడిన శ్రీహరి నీ లోని అహంకార లక్షణముతో గూడిన అజ్ఞానమనే హృదయ గ్రంథిని నశింపజేయును. నా కీర్తిని విస్తరింపజేయుచు నీకు పుత్రుడై పుట్టును. బ్రహ్మజ్ఞానమును - పదేశించును. 4

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ దేవహూత్యపి సందేశం గౌరవేణ ప్రజాపతేః ।
సమ్యక్ శ్రద్ధాయ పురుషం కుటాస్థమభజద్గురుమ్ ॥ 5

టీ:- దేవహూతీతి. శ్రద్ధాయ విశ్వస్య. ॥ 5 ॥

మైత్రేయమహర్షి ఇట్లు పలికెను

దేవహూతి కూడా కర్దమప్రజాపతి యొక్క సందేశమును (ఉపదేశమును) శ్రద్ధగా విన్నది. నిండుగా విశ్వసించినది. నిర్వికారుడు, జగద్గురువు అయిన శ్రీహరిని సేవించినది. ॥ 5 ॥

శ్లో ॥ తస్యాం బహుతిథే కాలే భగవాన్మధుసూదనః ।
కార్దమం వీర్యమాపన్నో జజ్ఞేఽ గ్నిరివ దారుణి ॥ 6

ఇట్లు చాలాకాలము గడిచిన పిమ్మట మధుసూదనడు కర్దమ-ఋషి వీర్యము వలన దేవహూతి యందు, కట్టెయందు అగ్నివలె

టీ:- తస్యామితి. బహుతిథే బహుతరే కాలే. అతిక్రాంతే సతి. కార్దమం కర్దమసంబంధి. ॥ 6 ॥

జన్మించెను. ॥ 6 ॥

శ్లో ॥ అవాదయంస్తదా వ్యోమ్ని వాదిత్రాణి ఘనాఘనాః ।
గాయంతి తం స్మ గంధర్వా నృత్యంత్యప్సరసో ముదా ॥ 7

టీ:- అవాదయన్నితి. ఘనాఘనా ఇత్యేకం పదం. వర్షంతో మేఘాః గాంతి స్మ నృత్యంతి స్మ. ॥ 7 ॥

అపుడు ఆకాశములో మేఘములు వర్షించినవి. వాద్యములు మ్రోగినవి. ఆ శ్రీహరిని స్తుతిస్తూ గంధర్వులు గానముచేసిరి. అప్సరసలు మహదానందముతో నాట్యముచేసిరి. ('ఘనాఘన' అనునది ఒకేపదము). ॥ 7 ॥

శ్లో ॥ పేతుః సుమనసో దివ్యాః ఖేచరైరపవర్జితాః ।
ప్రసేదుశ్చ దిశః సర్వా అంభాంసి చ మనాంసి చ ॥ 8

టీ:- పేతురితి. అపవర్జితాః ముక్తాః. ॥ 8 ॥

ఆకాశమున సంచరించే దేవతలు దివ్యములగు పుష్పములను కురిపించిరి. దిక్కులన్నియు నిర్మలములయినవి. జలాశయములు, సకల - ప్రాణుల మనస్సులు ప్రసన్నములైనవి. ॥ 8 ॥

శ్లో ॥ తత్కర్దమాశ్రమపదం సరస్వత్యా పరిశ్రితమ్ ।
స్వయంభూస్సాకమృషి భిర్మరీచ్యాదిభిరభ్యయాత్ ॥ 9

టీ:- తదితి. పరిశ్రితం పరివేష్టితం. ॥ 9 ॥

సరస్వతీనదిచే చుట్టబడిన కర్దమముని ఆశ్రమమునకు బ్రహ్మ-దేవుడు మరీచిమొదలగు మహర్షులతో కలిసి వచ్చెను. 9

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో ॥ భగవంతం పరం బ్రహ్మ సత్త్వేనాంశేన శత్రుహన్ ।
తత్త్వసంఖ్యానవిజ్ఞప్త్యై జాతం విద్వానజః స్వరాట్ ॥ 10

టీ:- ఆగత్య కిం కృతవాన్ తదాహ - ద్వాభ్యాం భగవంతమితి. తత్త్వానాం సంఖ్యానం యస్మిన్ తస్య సాంఖ్యస్య విజ్ఞప్త్యై విశేషేణ జ్ఞాపనాయ భగవంతం జాతం. విద్వాన్ అజో బ్రహ్మ స్వరాట్ స్వతస్సిద్ధ జ్ఞానః. ॥ 10 ॥

శ్లో ॥ సభాజయన్ విశుద్ధేన చేతసా తచ్చికీర్షితమ్ ।
ప్రహృష్యమాణైరసుభిః కర్దమం చేదమభ్యధాత్ ॥ 11

టీ:- సభాజయన్నితి. తస్య చకీర్షితం. సభాజయన్. పూజయన్ ప్రహృష్యమాణైః అసుభిరింద్రియైరుపలక్షితః. కర్దమం చేదమభ్యధాదితి ద్వయోరన్వయః. చకారాద్దేవహూతిం చ. ॥ 11 ॥

బ్రహ్మోవాచ

శ్లో ॥ త్వయా మేఽపచితిస్తాత కల్పితా నిర్వ్యలీకతః ।
యన్మే సంజగృహే వాక్యం భవాన్ మానద మానయన్ ॥12

టీ:- తత్ర త్వయేత్యాది పంచభిః కర్దమం ప్రత్యాహ. త్వయేతి.

(బ్రహ్మ వచ్చి ఏమిచేసినాడో ఈ రెండు శ్లోకములో చెప్పబడు చున్నది). జితేంద్రియుడవగు ఓ విదురా! స్వతస్సిద్ధజ్ఞాన సంపన్నుడగు, సత్త్వగుణప్రధానుడగు శ్రీహరిభగవానుడు స్వయముగా, సాంఖ్య శాస్త్రమునుపదేశించుటకై తన సత్త్వాంశతో జన్మించినాడని బ్రహ్మ దేవుడు తెలిసికొనెను. బ్రహ్మ, ప్రసన్నమైన ఇంద్రియములు గలవాడై, పరిశుద్ధమగు మనస్సు గలవాడై భగవానుని సంకల్పమును అభినందించుచూ దేవహూతి కర్దములతో నిట్లనెను. ॥ 10-11 ॥

బ్రహ్మదేవుడు ఇట్లు పలికెను

(త్వయా మొదలగు ఈ అయిదు శ్లోకములలో బ్రహ్మ కర్దమునితో మాట్లాడుచున్నాడు.) ఓ కర్దమా! నీవు నిష్కపటముతోను గౌరవముతోను నా ఉపదేశమును పాలించితివి. నీవు నన్ను చక్కగా

అపచితిః పూజా కృతా. యద్యస్మాత్. నిర్వ్యళీకతః నిష్కపటం సమ్యగ్గృహీతవాన్. ॥ 12 ॥

పూజించితివి. ॥ 12

శ్లో ॥ ఏతావత్యేవ శుశ్రూషా కార్యా పితరి పుత్రకైః ।
బాఢమిత్యనుమన్యేత గౌరవేణ గురోర్వచః ॥ 13

టీ:- ఏతావతీతి. అనుమన్యతేతి. యత్. ఏతావత్యేవ. ॥ 13 ॥

పుత్రుడు తండ్రి మాటను అంగీకరించి శిరసావహించవలెను. “మీ ఆజ్ఞను పాలింతును” అంటూ ఆదరపూర్వకముగా స్వీకరించుటయే తండ్రికి సేవచేయుట యగును. ॥ 13 ॥

శ్లో ॥ ఇమా దుహితరః సభ్య తవ వత్స సుమధ్యమాః ।
సర్గమేతం ప్రభావైః స్వైర్బృంహయిష్యంత్యనేకధా ॥ 14

టీ:- ఇమా ఇతి. అనేకధా. ప్రభావైర్వంశైః. బృంహయిష్యంతి వర్ధయిష్యంతి. ॥ 14 ॥

కుమారా! నీవు సభ్యత తెలిసినవాడవు. ఈ సుందరులైన కన్యలు తమ వంశముల ద్వారా ఈ సృష్టిని బహువిధములుగా వర్ధిల్లజేయ గలరు. ॥ 14 ॥

శ్లో ॥ అతస్త్వమృషిముఖ్యేభ్యో యథాశీలం యథారుచి ।
ఆత్మజాః పరిదేహ్యద్య విస్తృణీహి యశో భువి ॥ 15

టీ:- అత ఇతి. ఋషిముఖ్యేభ్యః మరీచ్యాదిభ్యః. ॥ 15 ॥

అందువలన ఈ మరీచ్యాది ఋషులకు వారివారి స్వభావము, అభిరుచులననుసరించి నీ కన్యకలనిచ్చి ఇప్పుడు వివాహము చేయుము. నీ కీర్తిని ఈ భూమండలమంతా విస్తరింప జేయుము. 15

శ్లో॥ వేదాహమాద్యం పురుషమవతీర్ణం స్వ మాయయా ।
భూతానాం శేవధిం దేహం బిభ్రాణం కపిలం మునే ॥16

టీ:- పుత్రస్తు సాక్షాదీశ్వర ఇత్యాహ - వేదేతి. శేవధిం నిధిం సర్వాభీష్టదమ్. ॥ 16 ॥

ఓ మహర్షీ! సమస్తమైన జీవుల కోరికలన్నీ తీర్చుటలో నిధి ఆ శ్రీహరి పరమాత్మ. ఆయన తన మాయచేత దేహమును ధరించి కపిలుడుగా అవతరించినాడని నాకు తెలుసు. ॥ 16 ॥

శ్లో॥ జ్ఞాన విజ్ఞానయోగేన కర్మణాముద్ధరన్ జటాః ।
హిరణ్యకేశః పద్మాక్షః పద్మముద్రాపదాంబుజః ॥ 17

టీ:- దేవహూతిం ప్రత్యాహ - త్రిభిః. జ్ఞానేతి. జ్ఞానంశాస్త్రోక్తం విజ్ఞానమపరోక్షం చ తే ఏవ యోగః ఉపాయః. తేన కర్మణాం జటాః మూలాని వాసనాః ఉద్ధరిష్యన్ ఉత్పాటయిష్యన్. పద్మముద్రాయుక్తం పదాంబుజం యస్య. ॥ 17 ॥

శ్లో॥ ఏష మానవి తే గర్భం ప్రవిష్టః కైటభార్దనః ।
అవిద్యాసంశయగ్రంథిం ఛిత్వా గాం విచరిష్యతి ॥ 18

టీ:- ఏష ఇతి. హే మానవి. అవిద్యా స్వరూపాజ్ఞానమ్. సంశయః మిథ్యాజ్ఞానమ్. తన్మయం తవ హృదయగ్రంథిమ్. ॥ 18 ॥

(ఈ మూడు శ్లోకములు దేవహూతిని ఉద్దేశించి చెప్పుచున్నాడు.) ఓ మనుపుత్రీ! నీకు జన్మించిన కపిలుడు శాస్త్రజన్యమగు జ్ఞానము, అపరోక్ష జ్ఞానము (అనుభవ జ్ఞానము) అనే రెండు ఉపాయములచేత (యోగము చేత) కర్మల యొక్క వాసనామూలములను పెకిలించగలడు. కపిలుడు నీ గర్భమున ప్రవేశించి, పరమాత్మ స్వరూపము తెలియకుండుట చేత ఏర్పడే సంశయములనే చిక్కుముడులను (హృదయ గ్రంథులను) విప్పగలడు. పద్మనేత్రుడు, పద్మరేఖలు పాదములందు గల ఆ మహాత్ముడు జ్ఞాన భాస్కరుడై భూమండలమున సంచరించగలడు. ॥ 17-18 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ అయం సిద్ధగణాధీశః సాంఖ్యాచార్యైః సుసంమతః ।
లోకే కపిల ఇత్యాఖ్యాం గంతా తే కీర్తి వర్ధనః ॥ 19

టీ:- అయమితి. సుసమ్మతః సుపూజజితస్సన్. గంతా ప్రాప్స్యతి. 19

నీ పుత్రుడు సిద్ధగణములకు అధీశుడు అగును. సాంఖ్యా - చార్యులచే పూజింపబడును. కపిలుడనే పేరుతో సుప్రసిద్ధుడగును. నీ కీర్తి పెంపొందించును. ॥ 19 ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ తావాశ్వాస్య జగత్స్రష్టా కుమారైః సహ నారదః ।
హంసో హంసేన యానేన త్రిధామ పరమం య యౌ ॥ 20

టీ:- తావితి. కుమారైః సహేతి శేషః. సహ నారదో నారదసహితశ్చ. మరీచ్యాదీన్ వివాహార్థమవస్థాప్య నైష్ఠికైరేతైః. పంచభిస్సహితః. హంసో బ్రహ్మ యయౌ. త్రిధామ తృతీయం ధామ స్వర్గః. తస్య పరమాం కాష్ఠాం సత్యలోకమ్. ॥ 20 ॥

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను

సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు ఈ విధముగా దేవహూతి కర్దములకు నచ్చచెప్పెను. మరీచ్యాది ఋషులను వివాహము కొఱకై అచటనే ఉంచి, సనకాదులు, నారదుడు మొత్తం ఐదుగురితో కలిసి తను త్రిధామమైన బ్రహ్మలోకము (సత్యలోకము)నకు వెళ్ళెను. 20

శ్లో ॥ గతే శతధృతౌ క్షత్తః కర్దమస్తేన చోదితః ।
యథోదితం స్వదుహితౄః ప్రాదాద్విశ్వసృజాం తతః ॥ 21

ఓ విదురా! బ్రహ్మదేవుడు వెళ్ళిన తరువాత కర్దముడు ఆయన ఆజ్ఞానుసారము తన కుమార్తెలను మరీచాది ప్రజాపతులకు ఇచ్చి వివాహము చేసెను. ॥ 21 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో ॥ మరీచయే కలాం ప్రాదాదనసూయా మథాత్రయే ।
శ్రద్ధామంగిరసేఽయచ్ఛత్పులస్త్యాయ హవిర్భువమ్ ॥ 22

టీ:- గత ఇతి. శతధృతౌ బ్రహ్మణి. ॥ 21,22 ॥

కర్దముడు తన కుమార్తెలైన కళను మరీచికి; అనసూయను అత్రికి; శ్రద్ధను అంగిరసనకు; హవిర్భువను పులస్త్యునకు ఇచ్చి వివాహము చేసెను. ॥ 22 ॥

శ్లో ॥ పులహాయ గతిం యుక్తాం క్రతవే చ క్రియాం సతీమ్ ।
ఖ్యాతిం చ భృగవేఽయచ్ఛద్వసిష్ఠాయాప్యరుంధతీమ్ ॥ 23

టీ:- పులహాయేతి. యుక్తాం యోగ్యాం. అయచ్ఛత్ అదాత్. 23

కర్దముడు యోగ్యురాలైన 'గతి'ని లహునకు, సాధ్వియగు 'క్రియ'ను క్రతువునకు, 'ఖ్యాతి'ని భృగువునకు, అరుంధతిని వసిష్ఠునకు ఇచ్చి వివాహము చేసెను. ॥ 23 ॥

శ్లో ॥ అథర్వణే ఽదదాచ్ఛాంతిం యయా యజ్ఞో వితన్యతే ।
విప్రర్షభాన్ కృతోద్వాహాన్ సదారాన్ సమలాలయత్ ॥ 24

టీ:- అథర్వణఇతి. వితన్యతే సమృద్ధః క్రియతే. శాంతిం శాంత్యధిష్ఠాత్రీం దేవతామిత్యర్థః. సమలాలయత్ సంతోషితవాన్. 24

శాంతిచేతనే యజ్ఞము సాఫల్యమునందును. అట్టి 'శాంతి' యనుపేరుగల కన్యను కర్దముడు 'అథర్వు'నకిచ్చెను. వివాహములైన పిమ్మట కర్దముడు నూతన దంపతులను(భార్యలతో కూడియున్న మహర్షులను) బహుమానాదులతో సంతోషపరచెను. ॥ 24 ॥

శ్లో ॥ తతస్త ఋషయః క్షత్తః కృతదారా నిమంత్ర్య తమ్ ।
ప్రాతిష్ఠన్నంది మాపన్నాః స్వం స్వమాశ్రమమండలమ్ ॥25

ఓ విదురా! తరువాత ఆ మరీచ్యాది మహర్షులు భార్యలతో కూడినవారై కర్దముని వద్ద సెలవు తీసికొని తమ తమ ఆశ్రమములకు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- తత ఇతి. నిమంత్ర్య పృష్ట్వా. నందిం హర్షం ప్రాపాః సంతః ॥ 25 ॥

శ్లో॥ స చావతీర్ణం త్రియుగమాజ్ఞాయ విబుధర్షభమ్ ।
వివిక్త ఉపసంగమ్య ప్రణమ్య సమభాషత ॥ 26

టీ:- స ఇతి. స చ మునిః. త్రియుగం శ్రీవిష్ణుమ్. వివిక్తే రహసి. 26

శ్లో॥ అహో పాపచ్యమానానాం నిరయే స్వైరమంగళైః ।
కాలేన భూయసా నూనం ప్రసీదంతీ హ దేవతాః ॥ 27

టీ:- అహో ఇతి. పాపచ్యమానానామ్. భృశం దహ్యమానానామ్. నిరయే సంసారే. స్వీయైరమంగళైః పాపైః. ॥ 27 ॥

శ్లో॥ బహుజన్మ విపక్వేన సమ్యగ్యోగసమాధినా ।
ద్రష్టుం యాతంతే యతయః శూన్యాగారేషు యత్పదమ్ ॥28

వెళ్ళిరి. ॥ 25 ॥

కర్దముడు తనకు శ్రీహరి పుత్రుడిగా అవతరించినాడని గ్రహించెను. ఆ శ్రీహరి దేవశ్రేష్ఠుడు త్రియుగుడు.(మూడు యుగములలో మాత్రమే దర్శనమిచ్చువాడని అర్థము. ఈశ్వరభావము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అనేవి ఆరు. అనగా మూడు జంటలు అనగా త్రియుగము. ఇవి కలవాడు త్రియుగుడు.). ఏకాంతములో కర్దముడు కపిలుని వద్దకు వెళ్ళి నమస్కరించి ఇట్లు మాట్లాడెను. ॥ 26 ॥

ఆహా! జనులు తమ అమంగళములగు పాపములచే ఈ ప్రపంచములో(సంసారములో) మిక్కిలిగా పీడింపబడుచున్నారు. ఎంతో కాలమైన పిమ్మటనే దేవతలు ప్రసన్నులగుదురు. ॥ 27 ॥

(సర్వదేవతలు ఎందువలన సంతోషింతురో తెలిసినది. ఈ రెండు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- కుతః సర్వా దేవతాః ప్రసన్నాఇతి జ్ఞాతమ్. అలభ్యలాభాదిత్యాహ ద్వాభ్యాం బహుజన్మేతి. బహుజన్మసు. విపక్వేన సుసిద్ధేన. సమ్యగ్యోగో భక్తియోగః. తస్మిన్ సమాధిరైకాగ్ర్యం తేన శూన్యాగారేషు వివిక్త స్థానేషు. యస్య తవ పదమ్. ॥ 28 ॥

శ్లోకములతో అలభ్య లాభమును చెప్పుచున్నాడు.) యోగులకు మరియు సాధకులకు అనేక జన్మలలో (సుసిద్ధపరచుకొనిన) అభ్యసించిన, (సాధన చేసిన) భక్తి యోగ ప్రభావముచేత మనస్సుకు దృఢమైన ఏకాగ్రత లభించును. సాధకులు నిర్జనప్రదేశములలో దృఢచిత్తముతో శ్రీహరి యొక్క దర్శనము కొఱకు ప్రయత్నింతురు.॥28॥

శ్లో॥ స ఏవ భగవానద్య హేళనం న గణయ్య నః ।
గృహేషు జాతో గ్రామ్యాణాం యః స్వానాం పక్షపోషణః ॥29

టీ:- స ఇతి. హేళనం స్వావజ్ఞాం లాఘవం. నగణయ్య అగణయిత్వా. ఉచితమేవ తవైవదిత్యాహ-యస్త్వం. స్వానాం భక్తానాం పక్షం పుష్ణాసీతి తథా సః. ॥ 29 ॥

అట్టి భగవానుడు తన భక్తుల పక్షమునే సమర్థించును. తాను చులకనయగుదునేమో అని తలచడు. గ్రామీణులమగు(వివేకము లేని వారమగు) మా ఇంటిలో ఈనాడు భగవంతుడు అవతరించినాడు. 29

శ్లో॥ స్వీయం వాక్యమృతం కర్తుమవతీర్ణోఽసి మే గృహే ।
చికీర్షుర్భగవాన్ జ్ఞానం భక్తానాం మానవర్ధనః ॥ 30

టీ:- ఏతత్ప్రపంచయతి-ద్వాభ్యాం. స్వీయమితి. స్వయమేవావతీర్ణోఽసి స్వీయం వాక్యం. తవ పుత్రో భవిష్యామీతి. యత్తత్సత్యం కర్తుమ్. జ్ఞానం జ్ఞానసాధనం సాంఖ్యం చ చికీర్షుస్సన్. ॥ 30 ॥

(ఈ రెండు శ్లోకములతో దీనినే విస్తరించి చెప్పుచున్నాడు). "స్వయముగా నీకు కుమారుడనై పుడతాను" అని పల్కిన మాటలను సత్యము చేయుటకు నా గృహములో అవతరించితివి. జ్ఞానమును, జ్ఞానసాధనమగు సాంఖ్యమును వర్ధిల్లజేయగోరి నా గృహమున జన్మించితివి. నీవు భక్తుల గౌరవమును పెంపొందించేవాడవు.॥30 ॥

శ్లో ॥ తాన్యేవ తేఽభిరూపాణి రూపాణి భగవంస్తవ ।
యాని యాని చ రోచంతే స్వజనానామరూపిణః ॥ 31

టీ:- తానీతి. యాని తవ అలౌకికాని చతుర్భుజాది రూపాణి తాన్యేవ తేఽభి రూపాణి యోగ్యాని యాని చ స్వజనానాం స్వభక్తానాం రోచంతే మనుష్యరూపాణి తాన్యపి తే రోచంతీత్యర్థః. అరూపిణః ప్రాకృత రూపాది రహితస్య. ॥ 31 ॥

దేవా! అలౌకికములైన చతుర్భుజాది ఏ రూపములైతే కలవో ఆ రూపములే మీకు యోగ్యములు. మీరు ప్రాకృత రూపరహితులు. కాని భక్తులకు ఇష్టమైన మానవ సదృశ రూపములను పొందుచున్నారు. (ధరిస్తున్నారు) ఈ రూపములు కూడా మీకు ఇష్టమే. ॥ 31 ॥

శ్లో ॥ త్వాం సూరిభిస్తత్త్వబుభుత్సయాద్ధా
సదాభివాదార్హణ పాదపీఠమ్ ।
ఐశ్వర్య వైరాగ్య యశోఽవబోధ
వీర్య శ్రియాం పూర్తమహం ప్రపద్యే ॥ 32

టీ:- త్వామితి. అభివాదార్హం పాదపీఠం యస్య. తమైశ్వర్యాదిభిః పూర్తం పూర్ణమ్. ॥ 32 ॥

నీ పాదపీఠము తత్త్వస్వరూపమును తెలియగోరే వారికి గొప్ప ఆశ్రయము. వారు సదా నీ పాదపీఠమునకు నమస్కరింతురు. నీలో 1.ఈశ్వర భావము, 2.వైరాగ్యము, 3.యశస్సు, 4.జ్ఞానము, 5. వీర్యము, 6.శ్రీ అనే ఆరు గుణములు నిండుగానున్నవి. నేను నిన్ను శరణు వేడుచున్నాను. ॥ 32 ॥

శ్లో ॥ పరం ప్రధానం పురుషం మహాంతం
కాలం కవిం త్రివృతం లోకపాలమ్ ।
ఆత్మానుభూత్యాఽనుగత ప్రపంచం
స్వచ్ఛంద శక్తిం కపిలం ప్రపద్యే ॥ 33

(శ్రీహరి యొక్క ఐశ్వర్యాదికములను వివరించుచున్నాడు.) దేవా! నీవు పరమేశ్వరుడవు. (ప్రకృతికి అతీతుడవు). ప్రకృతికి ఆధారభూతమైన ప్రధాన పురుష స్వరూపుడవు. మహత్తత్త్వస్వరూపుడవు.

టీ:- ఐశ్వర్యాదికం వివృణ్వన్నాహ-పరమితి. పరం పరమేశ్వరం. తత్రహేతుః. స్వచ్ఛందాః స్వాధీనాః శక్తయో యస్య. తాఏవాహ-ప్రధానం ప్రకృతి రూపం. పురుషం తదధిష్ఠాతారం. మహాంతం మహత్తత్త్వ రూపం. కాలం తేషాం క్షోభకం. త్రివృతం అహంకార రూపం. లోకాత్మకం ఇంద్రియాది రూపం తత్పాలకం చ.తదేవం మాయయా. ప్రధానాదిరూపతాముక్త్వా చిచ్ఛక్త్యా నిష్ప్రపంచతామాహ -ఆత్మానుభూత్యా చిచ్ఛక్త్యా అనుగతః స్వస్మిన్ లీనః ప్రపంచో యస్య తం. కవిం సర్వజ్ఞమ్ ప్రధానాద్యావిర్భావలయసాక్షిణమిత్యర్థః.॥33॥

శ్లో ॥ ఆస్మాభిపృచ్ఛేఽద్యపతిం ప్రజానాం
త్వయాఽవతీర్ణర్ణ ఉతాప్తకామః ।
పరివ్రజత్ పదవీమాస్థితోఽహం
చరిష్యే త్వాం హృది యుంజన్ విశోకః ॥ 34

టీ:- సన్న్యాసానుజ్ఞాం ప్రార్థయతే-ఆస్మేతి. ఆప్మాభిపృచ్ఛే. యత్కించి దభిపృచ్ఛామీత్యర్థః. త్వయా పుత్రరూపేణ అవతీర్ణాని నివృత్తాని ఋణాని దైవాదిరూపాణి యస్య సః. ఆప్తకామశ్చాహం పరివ్రజాం సన్న్యాసినాం. పదవీం మార్గం ఆశ్రితస్సన్ త్వాం యుంజన్ స్మరన్ విచరిష్యామి. ॥ 34 ॥

కాలస్వరూపుడవు. త్రివిధ అహంకారస్వరూపములోనున్న లోకములు నీవే. సర్వజ్ఞుడవు. సృష్టి స్థితి లయములకు సాక్షీభూతుడవు. నీవు నీ చైతన్యశక్తిచేత లోకస్వరూపుడవుగా నున్నావు. ఆ లోకములను నీలో విలీనము చేసికొనుచున్నావు. అట్టి కపిల దేవుడవైన నిన్ను శరణు-వేడుచున్నాను. ॥ 33 ॥

(సన్న్యాసమునకు అనుజ్ఞను వేడుచున్నాడు).

నీవు ప్రాణులన్నింటికీ ప్రభుడవు. నీవు అవతరించుటచే నా మూడుఋణములు తీరినవి. నాకు సమస్తమైన కోరికలు నెరవేరినవి. ఇప్పుడు నీ అనుమతిని వేడుచున్నాను. సన్న్యాసాశ్రమును స్వీకరించిన వాడనై నిన్నే మనస్సులో ధ్యానిస్తూ శోకరహితుడనై సంచరించగలను. ॥34॥



శ్రీభగవానువాచ

శ్లో ॥ మయా ప్రోక్తం హి లోకస్య ప్రమాణం సత్యలౌకికే ।
అథాజని మయా తుభ్యం యదవోచమృతం మునే ॥ 35

టీ:- అహం తావత్ జ్ఞానోపదేశాయైవ. త్వద్గృహే అవతీర్ణః అతస్తవ గృహే వసతోఽపి. ముక్తిః సులభైవ. యద్యవశ్యం గంతవ్యమేవేత్యాగ్రహః. తథాపి మామేవానుస్మరన్ గచ్ఛేత్యాహ - షడ్భిః. మయేతి. సత్యే వైదికే లౌకికే చ కృత్యే. స్వోక్తస్య ప్రామాణ్యం నిర్దిశతి. యత్ యస్మాత్. తుభ్యం తవ పుత్రో భవామీత్యవోచమ్. అథ అత ఏవ తదృతం సత్యం యథా భవతి తథా. అజని జన్మ స్వీకృతమ్. 35

శ్రీ భగవానుడిట్లు పలుకుచున్నాడు

(ఓ మహర్షీ! నేను తత్త్వజ్ఞానోపదేశము చేయుటకొఱకై మీ ఇంట పుట్టినాను. అందువలన నీవు ఇంటిలో యుండినను ముక్తిని పొందుట సులభమే. ఒకవేళ పట్టుదలగలిగియుండి వెళ్ళినను నన్నే స్మరింపుము అనే అభిప్రాయమును ఆరు శ్లోకములతో చెప్పుచున్నాడు) నేను చెప్పిన వైదిక, లౌకిక కర్మలు రెండును మానవునకు ప్రమాణమే. నేను నీకు పుత్రుడిగా జన్మింతునని చెప్పిన మాట సత్యమగునట్లు ఇప్పుడు నీకు కొడుకుగా పుట్టినాను. ॥ 35 ॥

శ్లో ॥ ఏతన్మే జన్మ లోకేఽస్మిన్ ముముక్షూణాం దురాశయాత్ ।
ప్రసంఖ్యానాయ తత్త్వానాం సమ్మతాయాత్మదర్శనే ॥ 36

టీ:- ఏతదితి. దురాశయాల్లింగాత్ ముముక్షూణాం మునీనాం. ఆత్మదర్శనే సమ్మతాయ. తత్త్వానాం ప్రసంఖ్యానాయ. విద్ధీత్యుత్తరస్యానుషంగః. ॥ 36 ॥

(లింగశరీరము నుండి కాపాడుటకును, ఆత్మదర్శనములో ఉపయుక్త విషయములను విశేషముగా బోధించుట కొఱకే నా జన్మ. 'విద్ధి' అనే తరువాతి శ్లోకములోని క్రియాపదముతో అన్వయము.) ఈ లోకమున ముముక్షువులను కలుషితమగు లింగ దేహమునుండి కాపాడుటకు మఱియు ఆత్మదర్శనమునకు అవసర మయ్యే జ్ఞానమును స్పష్టముగా వివరించి చెప్పుటకే నా ఈ జన్మ యని తెలిసికొనుము. 36

శ్లో ॥ ఏష ఆత్మపథో వ్యక్తో నష్టః కాలేన భూయసా ।
తం ప్రవర్తయితుం దేహమిమం విద్ధి మయా భృతమ్ ॥ 37

టీ:- నను అయమాత్మజ్ఞానమార్గః. పూర్వసిద్ధఏవ నేదానీమపూర్వవత్ ప్రవర్తనీయస్తత్రాహ-ఏష ఇతి. అవ్యక్తస్సూక్ష్మః. ఆత్మపథః ఆత్మజ్ఞాన మార్గః. ॥ 37 ॥

ఆత్మజ్ఞానము సూక్ష్మమైనది. కాలప్రవాహములో నష్టమయినది. (లేకుండాపోయినది) మోక్షమార్గమును (జ్ఞానమార్గమును) లోకములో మరల ప్రవర్తిల్ల జేయుటకే నేను జన్మించినానని తెలిసికొనుము.॥37॥

శ్లో ॥ గచ్ఛ కామం మయాఽఽపృష్టో మయి సన్న్యస్తకర్మణా ।
జిత్వా సుదుర్జయం మృత్యుమమృతత్వాయ మాం భజ ॥38

టీ:- గచ్ఛేతి. కామం యథేచ్ఛమ్ ఆపృష్టః అనుజ్ఞాతః యద్వా యథా త్వం మాం సంతుష్టవాన్ తథా అత్ర స్థాతుం మయాపి త్వమాపృష్ట ఇత్యర్థః. మయి సన్న్యస్తేన సమర్పితేన కర్మణా. శ్రు. "అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే" ఇతి శ్రుతేః.॥38॥

నీవు నన్నడిగినట్లుగా నీ ఇచ్ఛయుండిన స్థలమునకు వెళ్ళుటకు అనుజ్ఞనిచ్చినాను. కర్మలన్నింటిని నాయందు(నాకు) సమర్పించుము. జయింప శక్యముకాని మృత్యువును జయించి మోక్షమును పొందుటకు గాను నన్ను భజింపుము. "అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే" అనే శ్రుతి వాక్యము స్మరణీయము. ॥ 38 ॥

శ్లో ॥ మామాత్మానం స్వయం జ్యోతిః సర్వభూత గుహాశయమ్ ।
ఆత్మన్యేవాత్మనా వీక్ష విశోకోఽభయమృచ్ఛసి ॥ 39

టీ:- మామితి. తతశ్చ మాం పరమాత్మానం. స్వాత్మన్యేవ ఆత్మనా

నేను స్వయంప్రకాశ స్వరూపుడను. సమస్త ప్రాణుల బుద్ధి గుహలలో నివసించేవాడిని(సర్వభూతాంతర్యామిని). నీవు నీ ద్వారా నన్ను ఆత్మస్వరూపుడిగా దర్శించుము. అట్లుచేసిన సర్వసంతాప

మనసా. అన్వీక్షమాణః అభయం మోక్షం ప్రాప్స్యసి. తేన మద్భజనేన మామాత్మన్యేవ స్వాత్మన్యేవ. ఆత్మనా మనసా. అన్వీక్షన్ సాక్షాత్కుర్వన్ విశోకః విగతః శోకః శోకహేతుమత్ప్రాప్తి విరోధి ప్రాచీనం కర్మ యస్య సః. అభయం న విద్యతే భయం సంసారో యస్మాత్తం మామృచ్ఛసి ప్రాప్స్యసి. కథం భూతం మాం. ఆత్మానం జీవాంతరాత్మానం. స్వయం ప్రకాశం. సర్వభూతానాం గుహాయాం హృదయకుహరే శయానమ్. 39

రహితుడవై భయములేని మోక్షమును పొందెదవు. ॥ 39 ॥

శ్లో ॥ మాత్రే ఆధ్యాత్మికీం విద్యాం శమనీం సర్వకర్మణామ్ ।
వితరిష్యే యయా చాసౌ భయం చాతితరిష్యతి ॥ 40

టీ:- మాత్రే దేవహూత్యై. శమనీం ఉన్మూలినీం. భయం అతిశయేన తరిష్యతి. పరమానందం ప్రాప్స్యతీతి చకారార్థః. ॥ 40 ॥

తల్లియగు దేవహూతికి ఆత్మతత్త్వమును ప్రకాశింపజేసే విద్యను బోధించగలను. దానివలన ఆమె సర్వకర్మల నుండి (సంసారమునుండి) తొలగగలదు. (తరించగలదు) పరమానందము పొందగలదు. ॥ 40॥

శ్రీమైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఏవం సముదితస్తేన కపిలేన ప్రజాపతిః ।
దక్షిణీకృత్య తం ప్రీతో వనమేవ జగామ హ ॥ 41

టీ:- ఏవమితి. సముదితః సమ్యగుక్తః సన్. తం ప్రదక్షిణీకృత్య. 41

మైత్రేయుడు ఇట్లు పలికెను

ఈ విధముగా కపిలుడు అనుమతించగా, కర్దమప్రజాపతి సంతోషించి ప్రదక్షిణము చేసి అడవికి వెళ్ళెను. ॥ 41 ॥

శ్లో ॥ వ్రతం స ఆస్థితో మౌనమాత్మైక శరణో మునిః ।
నిస్సంగో వ్యచరత్ క్షోణీమనగ్నిరనికేతనః ॥ 42

టీ:- వ్రతమితి. మనీనాం వ్రతం మౌనమ్ అహింసాది లక్షణం. 42

కర్దమముని మననశీలుడగుచు, మౌనము పాటించుచు అహింసాదివ్రతనిష్ఠుడై యుండెను. ఆత్మను మాత్రమే ఆశ్రయించిన వాడైయుండెను. సంసారము నందలి బంధమును వదలించుకొనెను. సన్న్యాసియైనందున స్థిర నివాసము లేనివాడై అగ్నిహోత్రములను పరిత్యజించి భూమండలమున సంచరించుచుండెను. ॥ 42 ॥

శ్లో ॥ మనో బ్రహ్మణి యుంజానో యత్తత్సదసతః పరమ్ ।
గుణావభాసే విగుణ ఏకభక్త్యానుభావితే ॥ 43

టీ:- మన ఇతి. సదసతోః పరం యత్. తత్ తస్మిన్ బ్రహ్మణి. గుణావభాసకే నిర్గుణే. ఏకభక్త్యా అవ్యభిచారిణ్యా భక్త్యా. అనుభవితే అపరోక్షీకృతే. ॥ 43 ॥

పరబ్రహ్మ కార్యకారణములకు అతీతమైనది. సత్త్వరజస్తమో గుణములను ప్రకాశింపజేయునది. గుణరహితమైనది. అవ్యభిచారిణీ భక్తితోనే (అనన్యభక్తితోనే) ప్రత్యక్షమగునది. ఈ రకమైన పరబ్రహ్మ యందు కర్దముడు మనస్సును నిలిపెను. ॥ 43 ॥

శ్లో ॥ నిరహంకృతిర్నిర్మమశ్చ నిర్ద్వంద్వః సమదృక్ స్వదృక్ ।
ప్రత్యక్ ప్రశాంతధీర్ధీరః ప్రశాంతోర్మిరివోదధిః ॥ 44

టీ:- నిరహంకృదితి. అతో దేహాదిష్వహంకారాదిరహితః అత ఏవ నిర్ద్వంద్వః శీతోష్ణాద్యనాకులః. సమదృగ్భేదాగ్రాహకః కింతు స్వదృక్ స్వయమేవ పశ్యన్. ప్రత్యక్ప్రవణా ప్రశాంతా విక్షేపరహితా చ ధీర్యస్య. 44

కర్దముడు బ్రహ్మసాక్షాత్కారము పొందినందువలన (అతః అను పదము ఈ అర్థమును సూచించుచున్నది.) దేహాదులలో అహంకార రహితుడుగా నుండెను. అందుకే శీతోష్ణములను సహించుచు నిర్ద్వంద్వు - డుగా నుండెను. భేదదృష్టి లేనివాడయ్యెను. కాని తన స్వరూపమునే (ఆత్మస్వరూపమైన తననే) చూచుచుండెను. అహంకార మమకార ములు లేనివాడయ్యెను. ఆత్మానాత్మ వివేకముగల వాడయ్యెను. తరంగములు లేని సముద్రమువలె ప్రశాంతముగా గంభీరముగా

శ్లో ॥ వాసుదేవే భగవతి సర్వజ్ఞే ప్రత్యగాత్మని ।
పరేణ భక్తిభావేన లబ్ధాత్మా ముక్త బంధనః ॥ 45

టీ:- తదేవం త్రిభిః కల్పితోపాధి నివృత్తి ముక్త్వా పరమేశ్వర పదప్రాప్తి మాహ-త్రిభిః. వాసుదేవ ఇతి. ప్రతీచో జీవస్యాత్మని. లబ్ధః ఆత్మా చిత్తం యేన. యతః ముక్తం బంధనమజ్ఞానం యస్య. 45

శ్లో ॥ ఆత్మానం సర్వభూతేషు భగవంతమవస్థితమ్ ।
అపశ్యత్సర్వ భూతాని భగవత్యపి చాత్మని ॥ 46

టీ:- లబ్ధాత్మతామేవాహ - ఆత్మానమితి. ॥ 46 ॥

శ్లో ॥ ఇచ్ఛాద్వేష విహీనేన సర్వత్ర సమచేతసా ।
భగవద్భక్తియోగేన ప్రాప్తా భాగవతీ గతిః ॥ 47

టీ:- ఇచ్ఛేతి. తదేవం తేన భాగవతీ గతిః ప్రాప్తా. పాఠాంతరే స ఏవ తాం భాగవతీం గతిం ప్రాప్త ఇతి. ॥ 47 ॥

ఇతిశ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
కపిలోపాఖ్యానే చతుర్వింశతితమో౨ ధ్యాయః

నుండెను. ॥ 44 ॥

(ఇట్లు కల్పిత ఉపాధి నివృత్తిని చెప్పిన పిమ్మట పరమేశ్వర పద ప్రాప్తిని ఈ మూడుశ్లోకములలో చెప్పుచున్నాడు) కర్దముడు పరమ భక్తిభావముతో, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి అయిన వాసుదేవుని- యందు స్థిరముగా చిత్తమును నిలిపెను. సమస్త బంధనముల నుండి ముక్తుడయ్యెను. 45

(ఆత్మజ్ఞానమును పొందినాడని చెప్పుచున్నాడు). సమస్త ప్రాణులలో పరమాత్మయే ఆత్మస్వరూపముగానున్నాడనియు, ఆత్మస్వరూపుడగు పరమాత్మ యందు(తన యందు) సమస్త ప్రాణులున్నట్లును కర్దముడు చూచినాడు. అనగా కర్దముడు "సర్వత్ర పరమాత్మను చూచే" గొప్ప స్థితిని పొందినాడు. ॥ 46 ॥

కర్దమునికి రాగద్వేషములు లేవు. సమదృష్టితో అంతటా భగవానుడినే చూచుచుండెను. గొప్ప భగవద్భక్తి గలవాడై "పరమ భాగవత స్థితిని" పొందెను.('స ఏవ తాం గతిం ప్రాప్త' అను పాఠాంతరము కలదు.) ॥ 47 ॥

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు



ఇరువది నాల్గవ అధ్యాయము సమాప్తము

25 వ అధ్యాయము

పంచవింశోఽధ్యాయః

కపిల దేవహూతి సంవాదారంభః

శ్లో ॥ పంచవింశే జనన్యా తు పృష్టో బంధ విమోచనమ్ ।
ఆదావాహ పరం భక్తిలక్షణం కపిలః సుతః ॥

శ్లో ॥ కపిలేనార్పితా మాత్రే గూఢభావ నియంత్రితా ।
యోగమాణిక్య మంజూషా స్ఫుటముద్ఘాట్యతేఽధునా ॥

ఈ ఇరువదిఅయిదవ అధ్యాయమున కపిలుడు తల్లికి సర్వ బంధముల నుండి విడిపించు భక్తిలక్షణములను బోధించినాడు. భక్తియోగమనే మణులతో పొదగిన పెట్టె యందున్న రహస్యములైన (మిక్కిలివిలువైన) రత్నములను దేవహూతికి ఇచ్చుట అనే అంశములు వర్ణింపబడినవి.

శౌనక ఉవాచ

శ్లో ॥ కపిలస్తత్త్వసంఖ్యాతా భగవానాత్మ మాయయా ।
జాతః స్వయమజః సాక్షాదాత్మ ప్రజ్ఞప్తయే నృణామ్ ॥ 1

టీ:- శ్రీహరిం శరణం ప్రాప్తోఽస్మి. ఉక్తానువాదపూర్వకం కాపిలం యోగం పృచ్ఛతి-త్రిభిః. కపిల ఇతి. తత్త్వానాం సంఖ్యాతా గణకః. సాంఖ్య ప్రవర్తక ఇత్యర్థః. అత ఏవ స్వయం జాతః. ఆత్మప్రజ్ఞప్తయే. ఆత్మతత్త్వజ్ఞాపనాయ. ॥ 1 ॥

శౌనకుడు ఇట్లు పలికెను

(ఈ మూడు శ్లోకములతో శౌనకుడు, గతంలో ప్రస్తావించిన కపిల సంబంధమైన యోగమును అడుగుచున్నాడు.)

ఓ సూతుడా! కపిలుడు తత్త్వసంఖ్యాత. తత్త్వములను లెక్కించే వాడు. సాంఖ్యశాస్త్రమును ప్రవర్తిల్ల జేసినవాడు. ఆత్మతత్త్వ ప్రచారము చేయుటకై తన మాయాశక్తి ప్రభావముతో, స్వీయ సంకల్పముతో పుట్టుకలేని శ్రీహరి స్వయముగా కపిలుడుగా పుట్టినాడు. ॥ 1 ॥

శ్లో ॥ న హ్యస్య వర్ష్మణః పుంసాం వరిష్ఠః సర్వ యోగినామ్ ।
విశ్రుతౌ శ్రుతదేవస్య భూరి తృప్యంతి మేఽసవః ॥ 2

నేను భగవానుని కథలను ఎన్నింటినో విన్నాను. అయినప్పటికి

టీ:- నహీతి. పుంసా మ్మధ్యే వర్ష్మణః వృద్ధస్య ఉత్తమస్యేత్యర్థః. సర్వయోగినాం మధ్యే వరిష్ఠః. వరస్య భావో వరిమా. భవితృప్రధానో ఽయం నిర్దేశః. వరిష్ఠస్యేత్యర్థః. యద్వా వరీయస్త్వాదిత్యర్థః. విశ్రుతౌ కీర్తౌ. అసవ ఇంద్రియాణి భూరి అలం న తృప్యంతి. శ్రుతేన శ్రవణేన దీవ్యతి ద్యోతత ఇతి తథా తస్య. యద్వా, భూరి బహుశః. శ్రుతో దేవో యేన తస్యాపి మే అసవ ఇతి సంబంధః. 2

మానవులలో ఉత్తముడు, అనుభవజ్ఞుడు (వృద్ధుడు), యోగులలో వరిష్ఠుడు అయిన కపిలదేవుని కీర్తిని ఎంతవిన్నా నా ఇంద్రియములకు తృప్తి కలుగుట లేదు. ॥ 2 ॥

శ్లో ॥ యద్యద్విధత్తే భగవాన్ స్వచ్ఛందాత్మాత్మ మాయయా ।
తాని మే శ్రద్దధానస్య కీర్తన్యాన్యనుకీర్తయ ॥ 3

టీ:- యదితి. స్వానాం ఛందేన ఇచ్ఛయా. ఆత్మా దేహో యస్య సః యద్యత్కర్మ విధత్తే తాని కర్మాణి కీర్తనార్హాణి అనుకీర్తయ. ॥ 3 ॥

కపిలుడు స్వచ్ఛందాత్మ అనగా తన మనుష్యుల (భక్తుల) యొక్క కోరికననుసరించి అవతారము స్వీకరించేవాడు. తన మాయాశక్తి చేత దేహధారి యగును. ఆయన చేసిన కార్యములన్నియు కీర్తింపదగినవి. శ్రద్ధాళువునగు నాకు ఆయన లీలలను వివరించి చెప్పుము. ॥ 3 ॥

శ్రీసూత ఉవాచ

శ్లో ॥ ద్వైపాయనసఖస్త్వేవం మైత్రేయో భగవాంస్తథా ।
ప్రాహేదం విదురం ప్రీత ఆన్వీక్షిక్యాం ప్రచోదితః ॥ 4

టీ:- ద్వైపాయనేతి. యదా త్వం మాం ప్రచోదయస్యేవం ప్రచోదితః సన్. తథా తత్ప్రశ్నానుసారేణ. ఆన్వీక్షక్యామాత్మవిద్యాయామ్. 4

సూతుడు ఈ విధముగా పలికెను

మైత్రేయమహర్షి వ్యాసునికి మిత్రుడు. పూజ్యుడు. నీవు నన్ను ప్రేరేపించినట్లుగనే విదురుడు మైత్రేయమహర్షిని బ్రహ్మవిద్యను బోధించుటకై ప్రేరేపించెను. సంతోషించిన మైత్రేయుడు ప్రశ్నానుసారముగా ఇట్లు చెప్పెను. ॥ 4 ॥

శ్రీమైత్రేయ ఉవాచ

శ్లో ॥ పితరి ప్రస్థితేఽరణ్యం మాతుః ప్రియచికీర్షయా ।
తస్మిన్ బిందుసరేఽవాత్సీద్భగవాన్ కపిలః కిల ॥ 5

టీ:- పితరీతి. బిందుసరే బిందుసరసి అత్రాదంతత్వమార్షం. 5

మైత్రేయుడు ఇట్లు పలికెను

తన తండ్రియగు కర్దముడు అడవికి వెళ్ళిన తరువాత కపిలుడు తన తల్లి దేవహూతికి ప్రియమును చేయగోరినవాడై బిందుసరోవరము నందు ఉండెను. (ఇచట అదంతము ఆర్షము.) ॥ 5 ॥

శ్లో ॥ తమాసీనమకర్మాణం తత్త్వమార్గాగ్ర దర్శనమ్ ।
స్వసుతం దేవహూత్యాహ ధాతుస్సంస్మరతీ వచః ॥ 6

టీ:- తమితి. తత్త్వమార్గస్య అగ్రం పారం దర్శయతీతి తథా తమ్. శ్లో."ఏష మానవి తే గర్భం ప్రవిష్ట" ఇత్యాది ధాతుర్వచః. ॥ 6 ॥

కపిలుడు జ్ఞానమార్గముయొక్క చివరలను చూచినవాడు. అనగా తత్త్వశాస్త్ర నిష్ణాతుడని అర్థము. దేవహూతి ఒకనాడు బ్రహ్మ దేవుని 'ఏష మానవి తే గర్భం ప్రవిష్టః కైటభార్దనః' అనే మాటలను స్మరించి, తన కుమారుడగు కపిలునితో ఇట్లనెను. 6

దేవహూతిరువాచ

శ్లో ॥ నిర్విణ్ణా నితరాం భూమన్న సదింద్రియతర్షణాత్ ।
యేన సంభావ్యమానేన ప్రపన్నాంఽధం తమః ప్రభో ॥ 7

టీ:- నిర్విణ్ణేతి. అసతామింద్రియాణాం తర్పణాత్ విషయాభిలాషాత్. నిర్విణ్ణా శ్రాంతాస్మి. యేన సంభావ్యమానేన పూర్యమాణేన. ॥ 7 ॥

దేవహూతి ఇట్లు పలికెను

ఓ పరబ్రహ్మస్వరూపా! దుష్టమగు ఇంద్రియములను సంతోష-పెట్టుటలో(విషయేంద్రియ సంయోగానందములో) మిక్కిలి అలసి పోయితిని. ఖేదమును పొందితిని. దానివలన నేను అజ్ఞానాంధకార-ములో (సంసారములో) పడియున్నాను. ॥ 7 ॥

శ్లో ॥ తస్య త్వం తమసోఽన్ధస్య దుష్పారస్యాద్య పారగమ్ ।
సచ్చక్షుర్జన్మనామంతే లబ్ధం మే త్వదనుగ్రహాత్ ॥ 8

టీ:- తస్యేతి. పారం గమయతీతి పారగః త్వమేవ. శ్రేష్ఠం చక్షుర్మే మయా లబ్ధం. త్వదనుగ్రహాత్. జన్మనామంతే భావ్యే సతి. ॥ 8 ॥

దేవా! నీవు దాటరాని గాఢమైన అజ్ఞానమనే చీకటిని దాటించువాడవు. అనేక జన్మల తరువాత నేడు నీ అనుగ్రహము వలన జ్ఞానదాతగా నీవు నాకు లభించితివి. (పారం గమయతీతి పారగః ఒడ్డునకు చేర్పించేవాడు. ॥ 8 ॥

శ్లో ॥ య ఆద్యో భగవాన్ పుంసామీశ్వరో వై భవాన్ కిల ।
లోకస్య తమసాంధస్య చక్షుః సూర్య ఇవోదితః ॥ 9

టీ:- తత్ప్రపంచయతి - యఇతి. స భగవాన్. చక్షూరూపస్సూర్యః ఉదితో యథా. ॥ 9 ॥

(అదే విషయమును వివరించుచున్నాడు). సకలజీవులకు ప్రభువువు, ఆదిపురుషుడవు, భగవానుడవు నీవే. సూర్యుడు ఉదయించి చీకటిని ఎలా తొలగిస్తాడో అలానే నీవు అవతరించి జనుల అజ్ఞానమనే చీకటిని తొలగిస్తావు. 9

శ్లో ॥ అథ మే దేవ సంమోహమపాక్రష్టుం త్వమర్హసి ।
యోఽవగ్రహోఽహం మమేతీత్యేతస్మిన్ యోజితస్త్వయా॥10

టీ:- అథేతి. అపాక్రష్టుమపనేతుమ్. కోఽసౌ మోహస్తమాహ - ఏతస్మిన్ దేహాదౌ త్వయైవ యోజితః. యోహం మమేత్యవగ్రహః ఆగ్రహః ద్వితీయ ఇతి శబ్దః తత్కార్యరాగాదిగ్రహణార్థః. ॥ 10 ॥

ఓ దేవా! ఈ దేహము నందు నేను నాది అనే అహంకార, మమకారములను నీవే ఏర్పరచినావు. ఇట్టి నా మోహమును నీవే తొలగించగలవు. ॥ 10 ॥

శ్లో ॥ తం త్వాం గతాహం శరణం శరణ్యం
స్వభృత్య సంసారతరోః కుఠారమ్ ।
జిజ్ఞాసయాఽహం ప్రకృతేః పూరుషస్య
నమామి సద్ధర్మవిదాం వరిష్ఠమ్ ॥ 11

టీ:- తమితి. ప్రకృతేః పురుషస్య చ జిజ్ఞాసయా త్వామహం శరణం గతా సతీ నమామీత్యన్వయః. కుఠారం ఛేత్తారం. ॥ 11 ॥

నీవు సద్ధర్మమైన మోక్షధర్మము తెలిసిన వారిలో శ్రేష్ఠుడవు, సంసారమనే వృక్షమును ఛేదించుటకు గొడ్డలివంటివాడవు, శరణు వేడదగినవాడవు. అట్టి నిన్ను, నేను ప్రకృతి పురుషుల స్వరూపమును తెలియగోరుచూ, శరణువేడి, నమస్కరిస్తున్నాను. 11

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఇతి స్వమాతుర్నిరవద్యమీప్సితం
నిశమ్య పుంసామపవర్గవర్ధనమ్ ।
ధియాఽభినంద్యాత్మవతాం సతాం గతిః
బభాష ఈషత్స్మిత శోభితాననః ॥ 12

టీ:- ఇతీతి. అపవర్గవర్ధనం మోక్షే రతిజనకమ్. ఈషత్ స్మితేన శోభిత మాననం యస్య. ॥ 12 ॥

మైత్రేయుడు ఇట్లు పలికెను

ఓ విదురా! ఈ విధముగా దేవహూతి తన కోరికను వెల్లడించెను. మానవులకు మోక్షమునందు ప్రీతిని వర్ధిల్లజేయు తల్లి యొక్క కోరికను, ఆత్మవేత్తయు, సత్పురుషులకు గతియైన కపిలుడు విని, ఆమెను మనస్సులోనే అభినందించి, చిరునవ్వుతో గూడిన ముఖము గలవాడై ఇట్లు పలికెను. ॥ 12 ॥

శ్రీభగవానువాచ

శ్లో॥ యోగ ఆధ్యాత్మికః పుంసామతో నిశ్శ్రేయసాయ మే ।
అత్యంతోపరతిర్యత్ర దుఃఖస్య చ సుఖస్య చ ॥ 13

టీ:- యోగ ఇతి. ఆధ్యాత్మిక అధ్యాత్మనిష్ఠః. యత్ర యస్మిన్. 13

కపిల భగవానుడు ఇట్లు పలికెను

మానవునకు మోక్షమును ఇవ్వగలిగినది, ఆధ్యాత్మయోగము (ఆత్మనిష్ఠ) ఒకటియే యని నా అభిప్రాయము. ఇది కల్యాణమునకు ముఖ్యసాధనము. దీనితో సుఖ దుఃఖముల నివృత్తియగును. ॥ 13 ॥

శ్లో॥ తమిమం తే ప్రవక్ష్యామి యమవోచం పురాఽనఘే ।
ఋషీణాం శ్రోతుకామానాం యోగం సర్వాంగనైపుణమ్ ॥14

।టీ:- తమితి. తం యోగం. సర్వేషామంగానాం నైపుణం నైపుణ్యం. ఐకాగ్ర్యం యస్మిన్ తం. ॥ 14 ॥

ఓ పుణ్యాత్మురాలా! పూర్వము ఋషులు అన్ని యోగములలో శ్రేష్ఠమైనది, దేనిచేతనైతే ఏకాగ్రత సాధించబడునో దానిని వినగోరిరి. నేను వారికి చెప్పితిని. ఆ విషయమునే నేడు నీకు చెప్పెదను. ॥14॥

శ్లో॥ చేతః ఖల్వస్య బంధాయ ముక్తయే చాత్మనో మతమ్ ।
గుణేషు సక్తం బంధాయ రక్తం వా పుంసి ముక్తయే ॥ 15

టీ:- తత్ర సర్వాంగ నైపుణ్యం చిత్త సంయమాధీనమితి దర్శయన్నాహ -చేత ఇతి. అస్యాత్మనో జీవస్య గుణేషు విషయేషు. పుంసి పరమేశ్వరే. వా శబ్దస్తు చ శబ్దార్థే. ॥ 15 ॥

(మనస్సును స్వాధీనపరచుకోవడమే సర్వాంగనైపుణ్యమని చెప్పుచున్నాడు.) విషయములందు ఆసక్తమైన మనస్సు బంధనమునకు కారణమగుచున్నది. అదే మనస్సు పరమాత్మయందు ఆసక్తమైనచో మోక్షమునకు కారణమగుచున్నది. ॥ 15 ॥

శ్లో ॥ అహం మమాభిమానోత్థైః కామ లోభాదిభిర్మలైః ।
వీతం యదా మనః శుద్ధమదుఃఖ మసుఖం సమమ్ ॥ 16

టీ:- యథా చిత్తసంయమే పురుషార్థసిద్ధిస్తం దర్శయతి త్రిభిః - అహమితి. మలైర్వీతం విరహితం యథా శుద్ధం మనో భవతి. మనశ్శుద్ధేర్జ్ఞాపకమాహ - అదుఃఖమితి. ॥ 16 ॥

శ్లో ॥ తదా పురుష ఆత్మానం కేవలం ప్రకృతేః పరమ్ ।
నిరంతరం స్వయంజ్యోతిరణిమానమఖండితమ్ ॥ 17

టీ:- తథేతి. నిరంతరం నిర్భేదమ్ అణిమానం సూక్ష్మమ్. అఖండిత మపరిచ్ఛిన్నమ్. ॥ 17 ॥

శ్లో ॥ జ్ఞాన వైరాగ్యయుక్తేన భక్తియుక్తేన చాత్మనా ।
పరిపశ్యత్యుదాసీనం ప్రకృతిం చ హతౌజసమ్ ॥ 18

శ్లో ॥ న యుజ్యమానయా భక్త్యా భగవత్యఖిలాత్మని ।
సదృశోఽస్తి శివః పంథా యోగినాం బ్రహ్మసిద్ధయే ॥ 19

(ఈ మూడు శ్లోకములలో మనోనిగ్రహముతో పురుషార్థసిద్ధి ఏ విధముగా కలుగుతుందో స్పష్టపరుచుచున్నాడు.) కామ, లోభాదులు, నేను, నాది అనే అభిమానమునుండి పుడతాయి. ఎప్పుడు నేను, నాది అనే వికారములనుండి మనస్సు దూరమవుతుందో అప్పుడే మనస్సు సుఖ దుఃఖములనుండి విడివడి, సమ అవస్థను పొంది, శుద్ధమవుతుంది. ॥ 16 ॥

ఆత్మ ప్రకృతికంటె ఇతరమైనది, అద్వయమైనది, అపరిచ్ఛిన్న మైనది, స్వయంప్రకాశమైనది, సూక్ష్మమైనది, లోపల, బయట అనే భేదము లేనిది. మఱియు సుఖ దుఃఖ శూన్యమైనది. జీవుడు భక్తి-యుక్తమైన జ్ఞాన వైరాగ్యములతో ఆత్మానుభవమును పొందును. అప్పుడు ప్రకృతి (మాయ) యొక్క బలము క్షీణించినదని తెలిసికొనును. 17,18

(శుద్ధమైన మనస్సుతో, భగవంతుని యందు భక్తిభావము కలిగి యుండుటయే అంతరంగ సాధనమని చెప్పుచున్నాడు.) యోగులు

టీ:- జ్ఞానేతి. హతౌజసం క్షీణబలం. ॥ 18-19 ॥

శ్లో ॥ ప్రసంగమజరం పాశమాత్మనః కవయో విదుః ।
స ఏవ సాధుషు కృతో మోక్షద్వార మపావృతమ్ ॥ 20

టీ:- అస్య సర్వస్యాపి సత్సంగౌ మూలమిత్యాహ - ప్రసంగమితి. అపావృతం నిరావరణం. ॥ 20 ॥

శ్లో ॥ తితిక్షవః కారుణికాః సుహృదః సర్వ దేహినామ్ ।
అజాత శత్రవః శాంతాః సాధవః సాధుభూషణాః ॥ 21

శ్లో ॥ మయ్యనన్యేన భావేన భక్తిం కుర్వంతి యే దృఢామ్ ।
మత్కృతే త్యక్త కర్మాణస్త్యక్త స్వజన బాంధవాః ॥ 22

టీ:- సాధునాం లక్షణమాహ-చతుర్భిః. తితిక్షవ ఇతి. సాధవః శాస్త్రామవర్తినః. సాధుశీలం తదేవ భూషణం యేషామ్. ॥ 21-22

బ్రహ్మప్రాప్తి కొఱకు, సకల ప్రాణులయందు ఆత్మస్వరూపుడుగా నున్న భగవంతునియందు భక్తి కలిగి యుండవలెను. దీనితో సమానమగు ఇంకొక మార్గములేదు. (మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ అనే శంకరుల మాట స్మరణీయము.) ॥ 19 ॥

(దీనికంతటికీ సత్సంగమే ప్రధాన హేతువు.) మానవునకు సంసారమునందు ఆసక్తి (ప్రసంగము) యున్నచో అది దృఢ పాశ మగునని పండితులు చెప్పుచున్నారు. ఆ ఆసక్తియే సత్పురుషుల యందు ఏర్పడినచో మోక్ష ద్వారము తెరువబడును. 20

(ఈ నాలుగు శ్లోకములతో సాధువుల లక్షణములు చెప్పు-చున్నాడు) సాధువులు శాస్త్రములందు చెప్పబడినట్లు నడుచుకుందురు. సాధువులకు సహన గుణముండును, సకలప్రాణులయందు దయగలిగి యుందురు, ఉపకారశీలురైన మిత్రులుగా, శత్రువులేలేనివారు, శాంత స్వభావులుగా ఉందురు. మంచి స్వభావమే వారికి అలంకారము. 21

సాధువులు ఇతరభావనలేని(అనన్యభావము) ఏకముఖమైన భావనతో నా యందు దృఢమైన భక్తి కలిగియుందురు. నా కొఱకు సమస్తమైన కర్మలను, స్వజనులను, బంధువులను కూడా వదులు-

శ్లో ॥ మదాశ్రయాః కథా మృష్టాః శృణ్వంతి కథయంతి చ ।
తపంతి వివిధాస్తాపా నైతాన్మద్గతచేతసః ॥ 23

టీ:- మదాశ్రయేతి. ఏతాన్ ఉక్తలక్షణాన్మద్భక్తాన్. తాపా ఆధ్యాత్మికాదయో. న తపంతి న వ్యథయంతి. కుతః. మద్గతం చేతో యేషాం తాన్. ॥ 23 ॥

శ్లో ॥ త ఏతే సాధవస్సాధ్వి సర్వసంగవివర్జితాః ।
సంగస్తేష్వథ తే ప్రార్థ్యః సంగ దోషహరా హి తే ॥ 24

టీ:- త ఇతి. యే తాపైర్నాభిభూయంతే తే సాధవ ఇత్యర్థః. ॥24॥

శ్లో ॥ సతాం ప్రసంగాన్మమ వీర్య సంవిదో
భవంతి హృత్కర్ణ రసాయనాః కథాః ।
తజ్జోషణాదాశ్వపవర్గ వర్త్మని
శ్రద్ధా రతిర్భక్తిరనుక్రమిష్యతి ॥ 25

టీ:- సత్సంగస్య భక్త్యంగతాముపపాదయతి - సతామితి. వీర్యస్య సమ్యగ్వేదనం యాసు తా. వీర్యసంవిదః. హృత్కర్ణయోః రసాయనాః సుఖదాః. తాసాం జోషణాత్సేవనాత్. అపవర్గః అవిద్యానివృత్తిః. వర్త్మ యస్మిన్ శ్రీహరౌ. ప్రథమం శ్రద్ధా. తతో రతిః. తతో భక్తిః. అనుక్రమిష్యతి క్రమేణ భవిష్యతీత్యర్థః. ॥ 25 ॥

కుందురు. ॥ 22 ॥

ఈ శ్లోకములలో చెప్పిన లక్షణములుగల సాధువులను ఆధ్యాత్మికాది దుఃఖములు పీడింపవు. ఎందుకనగా వారు నన్నే ఆశ్రయించుచున్నారు. పవిత్రములగు నా కథలను వినుచుందురు. నా కథలనే చెప్పుచుందురు. నా యందే తమ మనస్సును ఏకాగ్ర పరచుదురు. ॥ 23 ॥

ఓ పతివ్రతా! (ఎవరైతే తాపములకు గురికారో వారు సాధువులు) సమస్తమైన సంగములను (ఆసక్తులను) విడిచిపెట్టినవారే సాధువులు. అలాంటి సాధువులసంగము ప్రార్థింపదగినది (కోరదగినది). సాధువులు సంసార సంగ దోషమును పోగొట్టెదరు. 24

(సత్సంగము వలన కలిగే భక్తి అంగముల ప్రతిపాదన.) సత్పురుషుల (సాధువుల) సంగము చేసినచో నా పరాక్రమము యొక్క యథార్థ జ్ఞానము కలుగును. ఈ యథార్థ జ్ఞానమువలన నా గాథలను వినుట సంభవించును. ఈ కథాశ్రవణము వలన మోక్ష మార్గమునందు శ్రద్ధ, ప్రేమ, భక్తి క్రమముగా వికసించును. భగవత్కథా శ్రవణము వలన అవిద్యానివృత్తి ద్వారా శ్రీహరియందు మొదట శ్రద్ధ, ఆ పైన రతి అటు పిమ్మట భక్తి పెంపొందునని తాత్పర్యము. 25

శ్లో ॥ భక్త్యా పుమాన్ జాతవిరాగ ఐంద్రియాత్
దృష్ట శ్రుతాన్మద్రచనాను చింతయా ।
చిత్తస్య యత్తో గ్రహణే యోగయుక్తో
యతిష్యతే ఋజుభిర్యోగమార్గైః ॥ 26

టీ:– తతః కిమత ఆహ – భక్త్యేతి. మమ రచనా యా సృష్ట్యాదిలీలా. తస్యాః అనుచింతయా భక్తిః తయా ఐంద్రియాత్ ఇంద్రియోద్భవాత్సుఖాత్. జాతవిరాగస్సన్. దృష్టశ్రుతాత్. ఐహికాముష్మికాత్. తతో యత్త ఉద్యుక్తస్సన్. చిత్తస్య గ్రహణే యతిష్యతే. ఋజుభిర్భక్తిప్రధానత్వాదనాయాసైః. ॥ 26 ॥

మానవుడు నా రచనను (సృష్టిలీలలను) స్మరించుట వలన, వినుటవలన నాయందు భక్తి కలుగును. అదెట్లనగా నా కథాశ్రవణము వలన మొదట ఇహ లోక, పరలోక ఇంద్రియసుఖములందు విరక్తి పుట్టును. మనో నిగ్రహమునకు ప్రయత్నింప మొదలిడును. ఆ పిమ్మట భక్తి ప్రధానమైన అనాయాస యోగమార్గమును అలవడును. 26

శ్లో ॥ ఆసేవయాయం ప్రకృతేర్గుణానాం
జ్ఞానేన వైరాగ్య విజృంభితేన ।
యోగేన మయ్యర్పితయా చ భక్త్యా
మాం ప్రత్యగాత్మానమిహావరుంధే ॥ 27

టీ:– ఆసేవయేతి. తదేవం ప్రకృతేర్గుణానాం. ఆసేవయా జ్ఞానాదిభిర్భక్త్యా చాయం జీవః. ఇహైవ దేహే. మామేవావరుంధే ప్రాప్నోతి. 27

విషయభోగములు సత్త్వ రజస్తమోగుణాత్మకమైన ప్రకృతికి సంబంధించినవి. ఈ విషయభోగములను సేవింపకుండవలెను. జ్ఞానమునకు వైరాగ్యము గట్టిగా తోడుకావలెను. యోగసాధన గట్టిగా చేయవలెను. భగవంతుడనయిన నా యందే మనస్సును అర్పించవలెను. ఇట్లు చేసిన మానవుడు ఈ దేహమునందే అంతరాత్మ స్వరూపుడనయిన నన్ను పొందును. ॥ 27 ॥

దేవహూతిరువాచ

శ్లో॥ కాచిత్త్వయ్యుచితా భక్తిః కీదృశీ మమ గోచరా ।
యయా పదం తే నిర్వాణమంజసాన్వాశ్నవా అహమ్ ॥ 28

దేవహూతి ఇట్లు పలికెను

మోక్షమును పొందుటకు యోగ్యమైన భక్తి ఎట్టిది? స్త్రీనైన నాకు తగిన భక్తి స్వరూపమేది? ఏ రకమైన భక్తిచేత నేను తేలికగా శోకరహితమైన నీ స్వరూపమును పొందగలుగుదును? ॥ 28 ॥

శ్లో॥ యో యోగో భగవద్బాణో నిర్మాణాత్మంస్త్వయోదితః ।
కీదృశః కతి చాంగాని యతస్తత్త్వావబోధనమ్ ॥ 29

నిరతిశయానందమే స్వరూపముగా గలవాడా! నీవు గతంలో బోధించిన యోగము (భక్తియోగము) బాణము వలె భగవానునే లక్ష్యముగా జేసి సాధింపబడునది. ఆ భక్తి ఏ రకమైనది? ఎట్టిది? భక్తి యొక్క అంగములెన్ని? ॥ 29 ॥

టీ:- కాచిదితి. కాచిదితి కాస్విదిత్యర్థః. ఉచితా యోగ్యా. తత్రాపి మమ స్త్రియాః కీదృశీ గోచరా యోగ్యా. నిర్వాణం మోక్షాత్మకం తవ పదం స్వరూపం అన్వశ్నువై అనంతరమేవ సర్వాత్మనా ప్రాప్స్యామి. అంజసా త్వితి పాఠే అహంత్వితి సంబంధః. భగవద్బాణో యో భగవంతం లక్షీకరోతీత్యర్థః. యతో యస్మాద్యోగాత్. ॥ 28-29 ॥

శ్లో॥ తదేతన్మే విజానీహి యథాహం మందధీర్హరే ।
సుఖం బుధ్యేయ దుర్బోధం యేషాభవదనుగ్రహాత్ ॥ 30

శ్రీహరీ! నేను స్త్రీని. మందబుద్ధిగలదానను. ఈ యోగమును నాకు విశేషముగా తెలియజెప్పుము. వివరముగా బోధించుము. ఈ యోగము కష్టముచే తెలియదగినదే అయినను నీ అనుగ్రహము వలన నాకు సుఖముగా తెలియగలదు. ॥ 30 ॥

టీ:- తదితి. విజానీహి విశేషేణ జ్ఞాపయ. సుఖం అనాయాసేన. 30

శ్రీమైత్రేయ ఉవాచ

శ్లో ॥ విదిత్వార్థం కపిలో మాతురిత్థం
జాతస్నేహో యత్ర తన్వాభిజాతః ।
తత్త్వామ్నాయం యత్ప్రవదంతి సాంఖ్యం
ప్రోవాచ వై భక్తివితానయోగమ్ ॥ 31

టీ:- విదిత్వేతి. ఇత్థం మాతురర్థం ప్రయోజనం విదిత్వా. జాత-స్నేహత్వే హేతుః. యత్ర యస్యాం తన్వా దేహేన అభిజాతః ఆవిర్భూతః తత్త్వాన్యామ్నాయంతే అనుక్రమిష్యంతే యస్మిన్. కిం తత్. యత్సాంఖ్యం ప్రవదంతి. తత్ప్రోవాచ. భక్తివితానం చ యోగం చ.॥31 ॥

మైత్రేయమహర్షి ఇట్లు పలికెను

కపిలునకు తల్లియొక్క అభిప్రాయము తెలిసెను. ఆమె శరీరము నుండి జన్మించిన వాడైనందున ఆమె యందు స్నేహము (మాతృభక్తి) కలిగెను. తత్త్వములను నిరూపించుట ద్వారా ఆత్మ స్వరూప ప్రకాశకమైనది సాంఖ్యము అని పెద్దలు చెప్పుదురు. అట్టి సాంఖ్యమును, భక్తియొక్క విస్తారమును మరియు యోగమును కపిలుడు తల్లికి బోధించెను. 31

శ్రీభగవానువాచ

శ్లో ॥ దేవానాం గుణ లింగానామానుశ్రవిక కర్మణామ్ ।
సత్త్వ ఏవైక మనసో వృత్తిః స్వాభావికీ తు యా ॥ 32

టీ:- కాచిత్త్వయ్యుచితా భక్తిరితి పృష్టస్తాముత్తమాం భక్తిం లక్షయతి-ద్వాభ్యాం. దేవానామితి. గుణాః విషయాః లింగ్యంతే జ్ఞాయంతే యైస్తేషాం. దేవానాం. ద్యోతనాత్మకానామింద్రియానాం. తదధిష్ఠాతౄణాం వా సత్త్వే సత్త్వమూర్తౌ హరావేవ యా వృత్తిః. సా భక్తిః

శ్రీభగవానుడు ఇట్లు పలికెను

(నీ యందు ఉంచవలసిన భక్తి ఎట్టిదనే తల్లి ప్రశ్నను లక్ష్యముగా చేసికొని మాట్లాడుచున్నాడు.) భగవంతునియందు మాత్రమే లగ్నమైన మనస్సుగల మానవుని ఇంద్రియములన్నియు గురూక్తమైన, వేదోక్తములైన కర్మలయందు మాత్రమే ప్రవర్తిల్లును. ఇంద్రియములన్నియు ఏ కోరికలు లేకుండా, స్వతస్సిద్ధముగా, సత్త్వస్వరూపియగు శ్రీహరి యందు ప్రవర్తిల్లుటనే భగవద్భక్తి యందురు. భుజించిన అన్నమును

సిద్ధేర్ముక్తేపిగరీయసీత్యుత్తరేణాన్వయః. కథంభూతా భక్తిః. అనిమిత్తా నిష్కామా. స్వాభావికీ అయత్న సిద్ధా. తేషామేవం విధవృత్తౌ హేతుమాహ –గురోరుచ్చా రణమను శ్రూయత ఇత్యనుశ్రవో వేదః. తద్విహిత మనుశ్రవికం. తదేవ కర్మ యేషామ్. అత ఏవ ఏకమేక రూపం. అవికృతం మనో యస్య పుంసశ్శుద్ధసత్త్వస్యేత్యర్థః. ॥ 32 ॥

శ్లో॥ అనిమిత్తా భాగవతీ భక్తిః సిద్ధేర్గరీయసీ ।
జరయత్యాశు యా కోశం నిగీర్ణమనలో యథా ॥ 33

టీ:– ముక్తిశ్చ ప్రాసంగికీ భవత్యేవేత్యాహ– యా భక్తిః. కోశం లింగం శరీరం. జరయతి. స్వప్రయత్నం వినైవ సిద్ధౌ దష్టాంతః. నిగీర్ణం భుక్తమన్నం అనలో జాఠరో యథా జరయతీతి. 33

శ్లో॥ నైకాత్మతాం మే స్పృహయంతి కేచిత్
మత్పాదసేవాభిరతా మదీహాః ।
యోఽన్యోన్యతో భాగవతాః ప్రసంజ్య
సభాజయంతే మమ పౌరుషాణి ॥ 34 ॥

టీ:– భక్తేర్గరిష్ఠత్వమేవోపపాదయతి పంచభిః. నైకేనాత్మతామితి.

జఠరాగ్ని జీర్ణము చేసినట్లు భగవంతునియందు లగ్నమైన మనస్సుగల మానవుని యొక్క లింగశరీరమును భక్తి నశింపజేయును. అన్నము జీర్ణమగు టకు స్వప్రయతమ్రు అక్కరలేదు. కర్మసంస్కారములుగల లింగ శరీరము నశించుటకు స్వప్రయత్నము అక్కరలేదు. ॥ 32,33॥

(ఈ అయిదు శ్లోకములతో భక్తియొక్క మహిమ ఉపపాదించ డమైనది) నా పాదసేవచేయుట యందే ప్రీతిగలవారు, నా సంతోషము కొరకే పనులు చేయువారు. నా సాయుజ్య మోక్షమును కోరుకొందురు. వారు కలిసినప్పుడు నా పౌరుషయుక్త లీలలను (పరాక్రమ కార్యములను) కొనియాడెదరు. ॥ 34 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఏకాత్మతాం సాయుజ్యం మోక్షమ్. మదర్థమీహా క్రియా యేషాం. ప్రసజ్యాసక్తిం కృత్వా. పౌరుషాణి వీర్యాణి. ॥ 34 ॥

శ్లో ॥ పశ్యంతి మే రుచిరాణ్యంబ సంతః
ప్రసన్నవక్త్రారుణలోచనాని ।
రూపాణి దివ్యాని వరప్రదాని
సాకం వాచం స్పృహణీయాం వదంతి ॥ 35

టీ:- పశ్యంతీతి. ప్రసన్నాని వక్త్రాణి అరుణాని లోచనాని యేషాం తైః మద్రూపైః. సాకం సహ. నిత్యం పరమేశ్వరానుభవసుఖం భక్తావధికమితి భావః. ॥ 35 ॥

ఓ తల్లీ! భక్తులు, మనోహరములు, ప్రసన్నములు, అరుణనేత్ర యుక్త ముఖములు, వరదాయకములు, దివ్యములు అగు నా రూపములను దర్శింతురు. నాతో ప్రేమపూర్వకముగా సంభాషించెదరు. వారికి ముక్తికంటెను నిత్యపరమేశ్వరానుభవ సుఖమే అధికము. 35

శ్లో ॥ తైర్దర్శనీయావయవైరుదార
విలాసహాసేక్షితవామసూక్తైః ।
హృతాత్మనో హృతప్రాణాంశ్చ భక్తి
రనిచ్ఛతో గతిమణ్వీం ప్రయుఙ్క్తే ॥ 36

టీ:- ఆత్మానందస్త్వవశ్యం భవతీత్యాహ-తైరితి. దర్శనీయాః మనోజ్ఞాః మనోహరాః అవయవాః ముఖనేత్రాదయో యేషు తైః. హృతః ఆత్మా

(ఆత్మానందము తప్పనిసరిగా కలుగునని చెప్పుచున్నాడు)

భగవంతుడు చూడదగిన ముఖ, నేత్రాది మనోహరములైన అవయవములు గలవాడు. ఉదారములైన మందహాసములు, విలాసములు, మధురభాషణలు గలవాడు. వీటిచేత భక్తుల మనస్సులు అపహరింపబడును. (మిక్కిలి ఆకర్షితములగునని భావము) అట్టి భక్తులు కోరకపోయినను భక్తియే వారికి మోక్షమును తెచ్చిపెట్టును. ॥ 36 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

చిత్తం యేషామ్. హృతాః ఆకృష్టాః ప్రాణాః ఇంద్రియాణి చ యేషాం తాన్. భజతః. అనిచ్ఛతః ఇచ్ఛాహీనానపి. అణ్వీం గతిం ముక్తిం ప్రయుఙ్క్తే ప్రాపయతి. కైః సాధనైః హృతాత్మనః ఉదారైర్విలాసాదిభిః. తత్ర విలాసో లీలా. వామం మనోహరం. సూక్తమ్ మధురభాషణమ్. 36

శ్లో॥ అథో విభూతిం మమ మాయా వినస్తామ్
ఐశ్వర్యమష్టాంగమను ప్రవృత్తమ్ ।
శ్రియం భగవతీం వా స్పృహయంతి భద్రామ్
పరస్య మే తేఽశ్నువతే తు లోకే ॥ 37

టీ:- విభూత్యాదికం చ తత్రాధికమిత్యాహ-అథో ఇతి. అథో అవిద్యా నివృత్త్యనంతరం విభూతిం సత్యలోకాదిగతాం భోగసంపత్తిం అణిమాద్యష్టాంగమైశ్వర్యం అనుప్రవృత్తం భక్తిమను స్వత ఏవ ప్రాప్తమపి భాగవతీం చ శ్రియం వైకుంఠస్థాం సంపత్తిమద్యాపి న స్పృహయంతి. తే యద్యపి న స్పృహయంతీత్యర్థః తథాపి లోకే వైకుంఠే అశ్నువతే తు ప్రాప్నువంత్యేవ. 37

(భగవద్విభూతియే గొప్పయని చెప్పుచున్నాడు). అవిద్య తొలగిన పిమ్మట భక్తులు మాయాధిపతినైన నా సత్యాదిలోక సంపత్తిని గాని భక్తిననుసరించి స్వయముగా ప్రాప్తించే అణిమాది అష్టసిద్ధులను గాని కోరరు. లేదా వైకుంఠలోకములోని భగవంతునికి చెందిన ఐశ్వర్యమును కూడా కోరరు. కాని వారు ఇవేవీ కోరకుండినను భాగవత సంబంధమైన, భద్రమైన, దుఃఖ సంబంధములేని సమస్త మహిమలను పొందుదురు. (కోరకున్ననూ అన్నీ సమకూరునని భావము.) ॥37॥

శ్లో ॥ న కర్హిచిన్మత్పరాః శాంతరూపే
నంక్ష్యంతి నో మే ౬ నిమిషో లేఢి హేతిః ।
యేషామహం ప్రియ ఆత్మా సుతశ్చ
సఖా గురుః సుహృదో దైవమిష్టమ్ ॥ 38

టీ:- నన్వేవం తర్హి లోకత్వావిశేషాత్ స్వర్గాదివద్భోక్తృభోగ్యానాం కదాచిద్వినాశస్స్యాత్తత్రాహ. నేతి. హే శాంతరూపే యద్వా శాంతం శుద్ధసత్త్వం తద్రూపే శ్రీవైకుంఠే మత్పరాః కదాచిదపి న నంక్ష్యంతి భోగహీనా న భవంతి. అనిమిషో మే హేతిః. మదీయం కాలచక్రం చ. నో లేఢి తాన్నగ్రసతి. తత్ర హేతుః యేషామితి. సుత ఇవ స్నేహ విషయః, సఖేవ విశ్వాసాస్పదమ్. గురురివ హితోపదేష్టా. సుహృదివ హితకారీ. ఇష్టం దైవమివ పూజ్యః. ఏవం స్వభావేన యే మాం భజంతి తాన్మదీయం కాలచక్రం న గ్రసతీత్యర్థః. ॥ 38 ॥

ఓ శాంతరూపుడా! ఎవరైతే నన్ను మాత్రమే ప్రియుడిగా భావింతురో (నా విషయంలో ప్రేమగా ప్రవర్తింతురో) ఆత్మగా తలతురో, పుత్రునియందువలె స్నేహమునెరపెదరో, సఖుడివలె విశ్వసించెదరో, గురువువలె హితమును బోధింతురో, స్నేహితునివలె హితకారిగా నుందురో, ఇష్టదైవమునువలె పూజింతురో, వారు నా వైకుంఠ ధామములో నివసింతురు. వైకుంఠధామము శాంతిమయమైనది. వీరు ఏ కాలమునందును నశింపరు. నా ఆయుధమగు కాలము వారిని గ్రసించదు. (మ్రింగదు, నశింపచేయదు) ॥ 38 ॥

శ్లో ॥ ఇమం లోకం తథైవాముమాత్మానముభయాయినమ్ ।
ఆత్మానమను యే చేహ యే రాయః పశవో గృహాః ॥ 39

టీ:- ఏవంభూతాం తు ముక్తిం ఏకాంతభక్తేభ్యో దదామీత్యాహ - ద్వాభ్యాం. ఇమమితి. ఉభయాయినం లోకద్వయయాయినం ఆత్మానం

(నా యందు ఇలాంటి భావముగల ఏకాంతభక్తులకు 'ముక్తి' నిచ్చెదనని ఈ రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు.) లింగశరీరము ఇహలోకమునందు పరలోకమునందు వెంటనుండునది. ఈ రెండు లోకములందును వెంటనుండే ఈ లింగదేహము వాసనామయమైనది.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

సోపాధికం పరమాత్మానమను యే పుత్ర మిత్ర కళత్రాదయః యే చ పశ్వాదయః రాయః ధనాని చ. ॥ 39 ॥

శ్లో ॥ విసృజ్య సర్వానన్యాంశ్చ మామేవం విశ్వతోముఖమ్ ।
భజంత్యనన్యయా భక్త్యా తాన్మృత్యోరతిపారయే ॥ 40

టీ:- విసృజ్యేతి. అన్యాంశ్చ పరిగ్రహాన్. మృత్యోస్సంసారాత్. అతి పారయే అతితారయామి. ॥ 40 ॥

శ్లో ॥ నాన్యత్ర మద్భగవతః ప్రధానపురుషేశ్వరాత్ ।
ఆత్మనః సర్వభూతానాం భయం తీవ్రం నివర్తతే ॥ 41

టీ:- అభక్తానాం తు న కథంచిదపి మోక్ష ఇత్యాహ- నేతి. మద్భగవతోఽన్యత్ర భగవతో మత్తో వినా. సర్వభూతానాం ఆత్మనః. భగవదాది విశేషణత్రయేణ సామర్థ్యం నిరపేక్షత్వం హితకారిత్వం చోక్తం. 41

శ్లో ॥ మద్భయాద్వాతి వాతోఽయం సూర్యస్తపతి మద్భయాత్ ।
వర్షతీంద్రో దహత్యగ్నిర్మృత్యుశ్చరతి మద్భయాత్ ॥ 42 ॥

పుత్ర, కళత్రాదులు, ధనము, పశువులు, అట్లే గృహసంబంధమైన సమస్త పదార్థములు అన్నియు దేహము సంబంధమైనవి. ఎవరైతే లింగదేహమును, దేహసంబంధమైన వాటిని మఱియు ఇతర వస్తుజాలమును వదలి నన్నే అనన్యభక్తితో అన్నిరకములుగా సేవిస్తారో వారిని మృత్యురూప సంసారము నుండి దాటించెదను. ॥39-40 ॥

(భక్తులు కానివారికి ఏ విధముగను మోక్షము లభించదని చెప్పుచున్నాడు) నేను 1.భగవానుడను (సామర్థ్యము), 2.ప్రధాన పురుషేశ్వరుడను (నిరపేక్షిత్వము), 3.సమస్త ప్రాణుల యొక్క ఆత్మస్వరూపుడను (హితకారిత్వము). ఈ మూడు లక్షణములు గలవాడను నా కంటె ఇతరమును ఆశ్రయించిన వారికెవరికి కూడా మృత్యురూపమైన ఈ సంసారభయమును తొలగదు. ॥ 41 ॥

ఈ శ్లోకమున తన ఐశ్వర్యము(అధికారము)ను స్పష్టపరచు చున్నాడు. గాలి నా భయమువలననే వీచుచున్నది. నా భయము

టీ:- ఐశ్వర్యం స్ఫుటయతి. మదితి. శ్రుతిశ్చ. "భీషాస్మాద్వాతః పవతే. భీషోదేతి సూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ. మృత్యుర్ధావతి పంచమ" ఇతి. ॥ 42 ॥

వలననే సూర్యుడు తపించుచున్నాడు (వెలుగుచున్నాడు). నా భయము వలననే ఇంద్రుడు వర్షములు కురిపించుచున్నాడు. మృత్యువు నా భయము వలననే ప్రవర్తిల్లును. "భీషాస్మాద్వాతః పవతే. భీషోదేతి సూర్యః. భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ. మృత్యుర్ధావతి పంచమ" ఇతి. అనే శ్రుతి వాక్యములు ఈ విషయమునే చెప్పినవి. ॥ 42 ॥

శ్లో ॥ జ్ఞాన వైరాగ్య యుక్తేన భక్తి యోగేన యోగినః ।
క్షేమాయ పాదమూలం మే ప్రవిశంత్యకుతోభయమ్ ॥ 43

టీ:- మద్భజనాదేవ మోక్ష ఇత్యత్ర సదాచారం ప్రమాణయతి - జ్ఞానేతి. ॥ 43 ॥

(నన్ను సేవించుట వలననే మోక్షమంటూ ప్రమాణీకరించుచున్నాడు.) యోగులు క్షేమరూపమైన మోక్షమును పొందుట కొఱకై జ్ఞానవైరాగ్యములతో గూడిన నా పాదపద్మముల నాశ్రయింతురు. వారికి సమస్తమైన భయములు తొలగిపోవును. ॥ 43 ॥

శ్లో ॥ ఏతావానేవ లోకేஉస్మిన్ పుంసాం నిశ్శ్రేయసోదయః ।
తీవ్రేణ భక్తియోగేన మనో మయ్యర్పితం స్థిరం ॥ 44

టీ:- ఉపసంహరతి - ఏతావానితి. మయ్యర్పితం సన్మనః స్థిరం భవతీతి యత్. ఏతావానేన తస్మాద్భజనాదేవ మోక్ష ఇతి. ॥ 44 ॥

(ఈశ్లోకముతో విషయమునుఉపసంహరించుచున్నాడు.)ఈ లోకములోని మానవులకు నిశ్శ్రేయసము (కల్యాణము) లభించవలెనన్న తీవ్రమైన భక్తియోగము చేత నా యందే మనస్సును స్థిరపరచవలెను. 44

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
కపిలోపాఖ్యానే పంచవింశతితమోஉధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు

షడ్వింశోஉధ్యాయః

శ్లో ॥ షడ్వింశే పుంప్రకృత్యోஉస్తు వివేకాయోపవర్ణ్యతే ।
సాంఖ్యేన సర్వభావానాం జన్మలక్షణం భేదతః ॥

శ్లో ॥ ధాత్రా పుత్రాయ యత్ప్రోక్తం క్షత్త్రే మిత్రాసుతేన యత్ ।
మాత్రే సాంఖ్యం తదధ్యాత్మం ప్రాధాన్యేనాహ తత్త్వవిత్ ॥

కపిల ఉవాచ

శ్లో ॥ అథ తే సంప్రవక్ష్యామి తత్త్వానాం లక్షణం పృథక్ ।
యద్విదిత్వా విముచ్యేత పురుషః ప్రాకృతైర్గుణైః ॥ 1

టీ:- తత్త్వామ్నాయం యత్ప్రవదంతి సాంఖ్యమిత్యత్ర సాంఖ్యం భక్తియోగశ్చేతి ద్వయముపక్షిప్తమ్. తత్ర భక్తిముక్తా. ఇదానీం సాంఖ్యమాహ - అథేతి. 1

శ్లో ॥ జ్ఞానం నిశ్శ్రేయసార్థాయ పురుషస్యాత్మదర్శనమ్ ।
యదాహుర్వర్ణయే తత్తే హృదయగ్రంథి భేదనమ్ ॥ 2

టీ:- నను ముక్తిరాత్మజ్ఞానాదేవ. నతు తత్త్వలక్షణ విజ్ఞానాత్.

ఇరువది ఐదవ అధ్యాయము సమాప్తము

26 వ అధ్యాయము

ఈ ఇరువదిఆరవ అధ్యాయమున కపిలుడు దేవహూతికి ప్రకృతి పురుషుల తత్త్వజ్ఞానము కొరకై సాంఖ్యయోగమును, మహత్తు మొదలగు తత్త్వముల ఉత్పత్తిని వివరించి చెప్పినాడు. బ్రహ్మ నారదునకు, మైత్రేయుడు విదురనకు, ఏ యోగమునైతే చెప్పినాడో, ఆ 'సాంఖ్యయోగము' కపిలుడు దేవహూతికి బోధించినాడు.

కపిల భగవానుడు ఇట్లు పలికెను

ఇప్పుడు నేను తత్త్వలక్షణములను గూర్చి విడివిడిగా చెప్పెదను. దీనిని తెలిసికొనినచో పురుషుడు ప్రకృతి గుణముల నుండి విముక్తుడగును. ॥ 1 ॥

ముక్తి ఆత్మజ్ఞానము వలననే సిద్ధించును. కేవలము లక్షణ తెలియడము వలన కాదు. 'తమేవ విదిత్వాஉతిమృత్యుముపేతి' అని శ్రుతి చెప్పుచున్నది. తత్త్వలక్షణములు విశుద్ధముగా విడివిడిగా

శ్రు."తమేవ విదిత్వాఽతిమృత్యుమేతీ"తి శ్రుతేరత ఆహ – జ్ఞానమితి. ఆత్మదర్శనరూపం జ్ఞానం అతఏవ హృదయగ్రంథి భేదనం అహంకార నివర్తకం నిశ్శ్రేయసప్రయోజనాయ యదాహుః తత్తే వర్ణయామి. తత్త్వలక్షణ జ్ఞానాదేవ వివిక్తాత్మజ్ఞానంభవతీతి భావః. ॥ 2 ॥

తెలియుట వలననే ఆత్మజ్ఞానము కలుగునని భావము. 'తత్త్వామ్నాయం యత్ప్రవదంతి సాంఖ్యం' అంటూ 1.సాంఖ్యము, 2.భక్తి, 3.యోగము అని మూడింటిని ప్రతిపాదించినాడు. అందులో 'భక్తి'ని గత అధ్యాయములో చెప్పి ప్రస్తుత అధ్యాయములో సాంఖ్యము వివరించుచున్నాడు. ఆత్మదర్శన రూపమైన జ్ఞానమే పురుషుని మోక్షమునకు కారణమగును. ఈ జ్ఞానము వలననే అహంకారరూపమైన హృదయగ్రంథి విడిపోవు–నని పండితులు చెప్పుచున్నారు. ఇట్టి జ్ఞానమును నీకు వివరించి చెప్పెదను. ॥ 2 ॥

శ్లో ॥ అనాదిరాత్మా పురుషో నిర్గుణః ప్రకృతేః పరః ।
ప్రత్యక్ ధామా స్వయంజ్యోతిర్విశ్వం యేన సమన్వితమ్ ॥3

టీ:– తత్ర పురుషం లక్షయతి–అనాదిరితి. ఆత్మైవ పురుషః కోఽసావాత్మా? ప్రత్యక్ప్రతిలోం ధామ స్ఫూర్తిర్యస్య. క్షణిక పక్షం వ్యావర్తయతి–అనాదిరితి. సంసారిత్వ పక్షం వ్యావర్తయతి – ప్రకృతేః పరః అన్యోఽసంగః. జ్ఞానాది గుణకత్వం వారయతి నిర్గుణః. మీమాంసకాద్యభి–మతజ్ఞా విషయత్వం వారయతి–స్వయంజ్యోతిః. అనేనైవ ప్రాభాకరాభి–మతం జ్ఞానాధారత్వేన స్ఫురణమపి నిరస్తమ్. స్వయం జ్యోతిస్త్వే హేతుః.విశ్వం యేన సమన్వితం. ప్రకాశత ఇతి శేషః. ఏతైరేవహేతుభిః పురుషస్య ప్రకృతేః పరత్వమపి నిరస్తమితి సిద్ధం. ॥ 3 ॥

(అనాదియని పురుషుడి గురించి చెప్పుచున్నాడు) ఆత్మ ఎవరు అనగా, ఆత్మయే పురుషుడు. జన్మరహితమైనది కనుక అనాది. క్షణిక–జ్ఞానసంతతి. ప్రకృతికన్నా ఇతరమైనది. అంతఃకరణము నందు స్ఫురించునది. సంగములేనిది. నిర్గుణమైనది. స్వయముగా ప్రకాశించునది. ఈ ప్రపంచమంతా ఆత్మచైతన్యము చేతనే ప్రకాశించుచున్నది. 3

శ్లో ॥ స ఏష ప్రకృతిం సూక్ష్మాం దైవీం గుణమయీం విభుః ।
యదృచ్ఛయైవోపగతామభ్యపద్యత లీలయా ॥ 4

టీ:- తత్రావరణ విక్షేప శక్తిభేదేన ప్రకృతిర్ద్వివిధా తత్రావరణశక్త్యా సైవ జీవోపాధిరవిద్యా. విక్షేపశక్త్యా సైవ మాయా పరమేశ్వరీ. పురుషశ్చ జీవేశ్వరరూపేణ ద్వివిధః. తత్ర యః ప్రకృత్యవివేకేన సంసరతి స జీవః . యస్తు ప్రకృతిం వశీకృత్య విశ్వసృష్ట్యాది కరోతి సః ఈశ్వరః. తత్ర ప్రకృత్యవివేకేన జీవస్య సంసార ప్రకారమాహ - పంచభిః. స ఇతి. సూక్ష్మామవ్యక్తాం దైవీం దేవస్య విష్ణోశ్శక్తిం లీలయా ఉపగతాం యదృచ్ఛయైవాభ్యపద్యతేత్యన్వయః. 4

(ఇక్కడ 'ఆవరణ','విక్షేపము' అనే శక్తి భేదముచేత ప్రకృతి రెండు విధములు. ఆవరణ శక్తిచేత ప్రకృతే జీవఉపాధి కలిగి 'అవిద్య' అని పిలువబడుతుంది. విక్షేపశక్తిచేత ప్రకృతి 'పరమేశ్వరీ' అని పిలువబడుతుంది.) పురుషుడు 'జీవ' 'ఈశ్వర' భేదముచే రెండు విధములు. ఎవడైతే ప్రకృతి జ్ఞానములేక ప్రవర్తిల్లుచున్నాడో అతడు 'జీవుడు'. ఎవడైతే ప్రకృతిని వశపరచుకొని ప్రపంచ సృష్ట్యాది పనులను చేయుచున్నాడో అతడు 'ఈశ్వరుడు'. ప్రకృతి వివేకము చేత జీవుడి సంసార ప్రకారమును ఈ అయిదు శ్లోకములలో వివరించు చున్నాడు. సర్వవ్యాపకుడైన ఆ పురుషుడు తన కోరిక చేత మాత్రమే సంప్రాప్తమైన తన మాయా శక్తిని లీలగా స్వీకరించెను. ఈ మాయ సత్త్వ రజస్తమోగుణాత్మకమైన జగత్తునకు కారణమగుటచేత సూక్ష్మము. ॥4॥

శ్లో ॥ గుణైర్విచిత్రాః సృజతీం సరూపాః ప్రకృతిం ప్రజాః ।
విలోక్య ముముహే సద్యః స ఇహ జ్ఞాన గూహయా ॥ 5

టీ:- తస్య లీలామాహ-గుణైరితి. జ్ఞానం గూహయతి ఆవృణోతీతి జ్ఞానగూహా తయా. తథా చ శ్రుతిః. "అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపామ్, అజోహ్యేకో జుషమాణోనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజో౭న్య" ఇతి. ముముహే ఆత్మానం విస్మృతవాన్. ॥ 5 ॥

(ఆ ప్రకృతి లీలలను చెప్పుచున్నాడు).

ప్రకృతి తన సత్త్వాది గుణముల ద్వారా తనతో సమానమైన రూపముగల వివిధ ప్రాణులను సృష్టించెను. ఈ సృష్టిని చూచి పురుషుడు ఆ మాయ యొక్క ఆవరణశక్తిచే తన స్వరూపమును విస్మరించెను. ॥ 5 ॥

శ్లో ॥ ఏవం పరాభిధ్యానేన కర్తృత్వం ప్రకృతేః పుమాన్ ।
కర్మసు క్రియమాణేషు గుణైరాత్మని మన్యతే ॥ 6

టీ:- ఏవమితి. పరాభిధ్యానం ప్రకృత్యధ్యాసః తేన. ప్రకృతేః గుణైః కర్మసు క్రియమాణేషు కర్తృత్వమాత్మని మన్యతే. ॥ 6 ॥

ఈ విధముగా తన కంటె భిన్నమైన ప్రకృతిని తన స్వరూపముగా భావించుచున్నాడు. మానవుడు ప్రకృతియొక్క గుణములద్వారా జరుగు పనులయందు తనను కర్తగా భావించుచున్నాడు. 'అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపాం, 'అజో హ్యేకో జుషమాణోనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్య' అనే శ్రుతి స్మరణీయము. ॥ 6 ॥

శ్లో ॥ తదస్య సంసృతిర్బంధః పారతంత్ర్యం చ తత్కృతమ్ ।
భవత్యకర్తురీశస్య సాక్షిణో నిర్వృతాత్మనః ॥ 7

టీ:- తదితి. తదిదం కర్తృత్వమననమేవ. అస్య పురుషస్య. సాక్షి మాత్ర త్వాత్. అకర్తురేవ సతః కర్మభిర్బంధః. ఈశ్వరస్యాప రతంత్ర స్యైవ కర్మ బంధకృతం భోగే పారతంత్ర్యం నిర్వృతాత్మనః. సుఖాత్మకస్యైవ సంసృతిః జన్మమృత్యుప్రవాహః. ప్రకృత్యవివేక కృతమేతత్సర్వం భవతీత్యర్థః. ॥7॥

పురుషుడు అకర్త, స్వతంత్రుడు, సాక్షి, ఆనంద స్వరూపుడు. కాని కర్తృత్వమననముచేత జనన మరణరూప సంసారము కలుగుచున్నది. పారతంత్ర్యమును పొందుచున్నాడు. (అకర్తయయ్యును బంధనమున చిక్కుబడుచున్నాడు. స్వతంత్రుడయ్యును పరతంత్రు డగుచున్నాడు. ఆనందస్వరూపుడయ్యును జననమరణరూప సంసార బాధలనందుచున్నాడు. అన్నింటికీ కర్తృత్వ మననమే కారణము.) 7

శ్లో ॥ కార్య కారణ కర్తృత్వే కారణం ప్రకృతిం విదుః ।
భోక్తృత్వే సుఖ దుఃఖానాం పురుషం ప్రకృతేః పరమ్ ॥ 8

కార్యకారణ కర్తృత్వములు:-దేహము కార్యము, ఇంద్రియములు కారణము, ఇంద్రియాధిష్ఠదేవతలు కర్త. ఈ మూడింటికిని కారణముగా

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- నను చైతన్యస్య సామానాధికరణ్యేనైవ కర్తృత్వాదిప్రతీతేఃస్వస్యైవ తదంగీక్రియతాం నేత్యాహ-కార్యేతి. కార్యం శరీరం, కారణమింద్రియమ్, కర్తా దేవతావర్గః, తద్భావాపత్తౌ పురుషస్య ప్రకృతిం కారణం విదుః కూటస్థస్య స్వతో వికారాభావత్ప్రకృతిపరిణామభూత దేహాద్యహంకార కృతమేవ కర్తృత్వాదికమిత్యర్థః. 'భోక్తృత్వే తు పురుషం కారణం విదుః' తి. ఇత్యస్యాయం భావః యద్యప్యహంకారగతమేవ కర్తృత్వాదికం భోక్తృత్వం చ తథాపి వికారస్య జడావసానత్వాదుపాధి ప్రాధాన్యం భోగస్య చిదవసానత్వాదుపహితప్రాధాన్యమితి. 8

ప్రకృతినే పేర్కొనుచున్నారు. కూటస్థమగు ఆత్మ నిర్వికారుడు. నిరుపాధికుడు. ఈ దేహాదులు ప్రకృతియొక్క పరిణామ భూతములు. పురుషుడు ప్రకృతికంటె భిన్నుడు. అయినప్పటికి ప్రకృతియొక్క ప్రాధాన్యత చేత సుఖ దుఃఖాదుల యొక్క అనుభవమునకు పురుషుడే కారణమని చెప్పుదురు. ॥ 8 ॥

దేవహూతిరువాచ

శ్లో ॥ ప్రకృతేః పురుషస్యాపి లక్షణం పురుషోత్తమ ।
బ్రూహి కారణయోరస్య సదసచ్చ యదాత్మకమ్ ॥ 9

టీ:- తదేవం సంసారిణం పురుషం తద్ధేతుం ప్రకృతిం చ జ్ఞాత్వా ఇదానీం జగత్కారణమీశ్వరం ప్రకృతిం చ పృచ్ఛతి-ప్రకృతేరితి. అస్య విశ్వస్య సదసచ్చ స్థూలం సూక్ష్మం చ కార్యం యదాత్మకం తయోః ప్రకృతి పురుషయోః. ॥ 9 ॥

దేవహూతి ఇట్లు పలికెను

ఓ పురుషోత్తమా! (ఇట్లు పురుషుని యొక్క సంసారమును, దానికి కారణమగు ప్రకృతిని తెలిసికొని ఇప్పుడు ఈ ప్రపంచమునకు కారణమైన ఈశ్వరుని గురించి ప్రకృతిని గుఱించి అడుగుచున్నది.) ఈ జగత్తు సత్ అసత్ ఆత్మకమైనది. స్థూల సూక్ష్మ రూపాత్మకమైనది. ఈ జగన్నిర్మాణమునకు ప్రకృతి పురుషులే హేతువు. అట్టి ప్రకృతి పురుషుల లక్షణమును వివరించి చెప్పుము. ॥ 9 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



శ్రీ భగవానువాచ

శ్లో ॥ యత్తత్త్రిగుణమవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్ ।
ప్రధానం ప్రకృతిం ప్రాహురవిశేషం విశేషవత్ ॥ 10

టీ:- తత్ర ప్రకృతిం లక్షయతి- యదితి. యత్తత్ప్రధానం తదేవ ప్రకృతిం ప్రాహుః. కిం తత్ప్రధానం, స్వతోఽవిశేషం. విశేషవత్ విశేషాణామాశ్రయః తర్హి కిం బ్రహ్మ, న త్రిగుణమ్ కిం మహత్తత్వాది న అవ్యక్తమకార్యమ్ కిం కాలాది, న సదసదాత్మకం కార్యకారణరూపమ్ జీవః ప్రకృతిః న నిత్యం. ॥ 10 ॥

శ్లో ॥ పంచభిః పంచభిర్బ్రహ్మ చతుర్భిర్దశభిస్తథా ।
ఏతచ్చతుర్వింశతికం గణం ప్రాధానికం విదుః ॥ 11

టీ:- అన్యేషాం తత్త్వానాం లక్షణం వక్తుం తాని గణయతి - పంచభిరితి. సంఖ్యాభేదేనైతచ్చతుర్వింశతికం. ఏతాని చతుర్వింశతిర్యస్మిన్ గణే తం గణం ప్రాధానికం ప్రధానకార్యాత్మకం బ్రహ్మ విదుః. 11 ।

శ్రీకపిల భగవానుడు ఇట్లు పలికెను

('ప్రకృతి వివరణ') ఏది 'ప్రధానమో' అదియే ప్రకృతి. ఆ ప్రకృతి సత్త్వ రజస్తమస్సులనే త్రిగుణములతో కూడినది. అవ్యక్తమైనది (సూక్ష్మమైనది). నిత్యమైనది, కార్యకారణ రూపాత్మకమైనది. నిర్విశేషమై యుండియు విశేష ధర్మములకు ఆశ్రయమగుచున్నది. ఈ లక్షణములు గల ప్రకృతియే 'ప్రధానము'. ప్రళయకాలమున కనిపించకుండా యుండి కారణరూపమున నిత్యమై యుండుట వలన దీనిపేరు 'అవ్యక్తము'. మహదాది విశేషములకు ఆశ్రయమగుట వలన 'ప్రధానము'. కార్యకారణస్వరూప మహదాదుల యందు అనుగత స్వరూపమగుట వలన 'ప్రకృతి'. ॥ 10 ॥

ఇతర తత్త్వముల యొక్క లక్షణములను చెప్పుటకుగాను వాటిని లెక్కించుచున్నాడు. ఇరువది నాల్గు తత్త్వములతో కూడినది ప్రధానకార్యాత్మకమైన గణమని బ్రహ్మవిదులు చెప్పుచున్నారు. పంచభూతములు:- పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము. పంచతన్మాత్రలు:- గంధ, రస, రూప, స్పర్శ, శబ్ద తన్మాత్రలు. నాల్గుఅంతఃకరణములు:- మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. పదిఇంద్రియములు:- చర్మము,కన్ను,చెవి,నాలుక,ముక్కు మఱియు

శ్లో ॥ మహాభూతాని పంచైవ భూరాపోఽగ్నిర్మరున్నభః ।
తన్మాత్రాణి చ తావంతి గంధాదీని చ తాని మే ॥ 12

టీ:- ఏతద్వివృణోతి-త్రిభిః మహాభూతానీతి. తావంతి పంచైవ. ॥12,13॥

శ్లో ॥ ఇంద్రియాణి దశ శ్రోత్రం త్వక్ దృక్ రసన నాసికాః ।
వాక్కరౌ చరణౌ మేఢ్రం పాయుర్దశమ ఉచ్యతే ॥ 13

శ్లో ॥ మనో బుద్ధిరహంకారశ్చిత్తమిత్యంతరాత్మకమ్ ।
చతుర్ధా లక్ష్యతే భేదో వృత్త్యా లక్షణ రూపయా ॥ 14

టీ:- మన ఇతి. అంతరాత్మకం అంతఃకరణమ్ లక్షణరూపయా వ్యవచ్ఛేదికయా. ॥ 14 ॥

శ్లో ॥ ఏతావానేవ సంఖ్యాతో బ్రహ్మణః సగుణస్య హ ।
సన్నివేశో మయా ప్రోక్తో యః కాలః పంచవింశకః ॥ 15

వాక్కు,పాణి,పాద,పాయువు, ఉపస్థలు. మొత్తము ఇరువదినాల్గు.11

(ఈ ఇరువది నాల్గు తత్త్వములను ఈ మూడు శ్లోకములతో వివరించుచున్నాడు.) భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనేవి పంచభూతములు. గంధము, రసము, రూపము, స్పర్శ, శబ్దము అనేవి తన్మాత్రలు. ॥ 12 ॥

కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము, వాక్కు, చేయి, పాదము, పాయువు, ఉపస్థ అనేవి పదిఇంద్రియములు. ॥ 13 ॥

అంతఃకరణము వికారములను బట్టి (భిన్నవృత్తులను నుసరించి) నాలుగు రకములు. 1.మనస్సు, ఇది సంకల్పమైనది 2.బుద్ధి, నిశ్చయాత్మకమైనది. 3.అహంకారము, నేను అనే వృత్తితో ఉండేది. 4.చిత్తము స్మృతి రూపములో నుండేది. ॥ 14 ॥

తల్లీ! నేను ఈ విధముగా సగుణబ్రహ్మ యొక్క సన్నివేశ స్థానమును ఈ ఇరువదినాల్గు తత్త్వములుగా లెక్కించితిని. దీనినే

టీ:- ఏతావానేవేతి. యావాన్మయా ప్రోక్త ఏతావానేవ సంఖ్యాతో గణితః తత్త్వజ్ఞైః.కాలే తు మతద్వయమాహ-యః కాలః స పంచవింశకః అల్పార్థే కప్రత్యయః. ప్రకృతేరేవావస్థావిశేష ఇత్యర్థః. ॥ 15 ॥

శ్లో ॥ ప్రభావం పౌరుషం ప్రాహుః కాలమేకే యతో భయమ్ ।
అహంకార విమూఢస్య కర్తుః ప్రకృతిమీయుషః ॥ 16

టీ:- ఏకే తు పౌరుషం పురుషస్యేశ్వరస్య ప్రభావం విక్రమం కాలమాహుః. తమేవ కాలం ద్వేధా లక్షయతి-ప్రభావమితి. యతో భయం భవతి. కస్య ప్రకృతిమీయుషః ప్రాప్తస్య. అత ఏవ దేహేఽహం-కారేణ విమూఢస్య కర్తుర్జీవస్య. అనేన సంహారకత్వేన లక్షితః. ॥16 ॥

శ్లో ॥ ప్రకృతేర్గుణసామ్యస్య నిర్విశేషస్య మానవి ।
చేష్టా యతః సభగవాన్ కాల ఇత్యుపలక్షితః ॥ 17

టీ:- సృష్టిహేతుత్వేన లక్షయతి--ప్రకృతేరితి. 17

ఇతరులగు తత్త్వజ్ఞులు లెక్కించి, కాలముతో కలిసి ఇరువదిఐదు తత్త్వములని రెండవ మతమును చెప్పిరి. ప్రకృతి యొక్క అవస్థా విశేషము.'పంచవింశకః'లోని కప్రత్యయము అల్పార్థమును సూచించు చున్నది. ॥ 15 ॥

కొందరు పురుషుని పరాక్రమమునే 'కాలము' అనుచున్నారు. ఆ కాలమును రెండు విధములుగా తలచుచున్నారు. 1.సంహారకత్వము, 2.సృష్టించు లక్షణము. జీవుడు అవిద్యచే ప్రకృతితో తాదాత్మ్యము పొందుచున్నాడు. గుణములచే చేయబడు కర్మలకు తానే కర్తనని భావించుచున్నాడు. అట్టి జీవునకు కాలము వలన భయము కలుగుచున్నది. దీనితో సంహారకత్వము ఉద్దేశింపబడినది. ॥ 16 ॥

(సృష్టిహేతుత్వమును ఉద్దేశించి చెప్పుచున్నాడు) ఓ మనుపుత్రికా సృష్టికి పూర్వము ప్రకృతి యందు సత్త్వరజస్తమో గుణముల సామ్యావస్థ నెలకొని యుండెను. ఇదే నిర్విశేష ప్రకృతి. ఎవరి ప్రేరణచేత ఈ సామ్యావస్థ (ప్రకృతి)లో 'కదలిక' కలిగినో ఆ పురుషునే "కాలము" అనే పేరుతో పిలుచుచున్నారు. ॥ 17 ॥

శ్లో ॥ అంతః పురుషరూపేణ కాలరూపేణ యో బహిః ।
సమన్వేత్యేష సత్త్వానాం భగవానాత్మ మాయయా ॥ 18

టీ:- కోఽసౌ భవాన్ తమాహ-అంతరితి. అంతః సర్వప్రాణినాం యః పురుషరూపేణ నియంతృత్వేన సమన్వేతి సమ్యక్ తద్వికారరహిత ఏవ అనుస్యూతో వర్తతే. బహిశ్చ కాలరూపేణైవ భగవాన్. యద్వా యః పురుష ఇతి ప్రసిద్ధః కాలః సపంచవింశః. ఏతే తు పురుషస్య ప్రభావం కాలమాహుః. ప్రభావస్యైవ లక్షణం యత ఇతి. పురుషస్యైవ కాలత్వే హేతుః. ప్రకృతేరితి. ఉభయధా వివక్షాయాం హేతుః. అంతరితి. శేషం సమానమ్. తదేవం ప్రకృతేశ్చతుర్వింశతిభేదాః జీవేశ్వరయోశ్చైక్య వివక్షాయాం పంచవింశతితత్త్వాని భవంతి. తయోర్భేదవివక్షాయా చ షడ్వింశతిర్భవంతి. ॥ 18 ॥

(గత శ్లోకములో చెప్పబడిన కాలపురుష భగవానుడెవరు?-- దానివివరణ) భగవానుడు ప్రాణులలోపల పురుషుడిగా నున్నాడు. వికారరహితముగా మాలలో దారములాగా వ్యాపించినాడు. ఆతడే బయట కాలరూపములో నున్నాడు. ఎవడైతే పురుషుడిగా ప్రసిద్ధుడో, ఆతడే ఇరువది అయిదవ తత్త్వమైన 'కాలము'. పురుషుడగుటయే కాలతత్త్వమునకు కారణము. కాలమును 1.సంహారకత్వము, 2.సృష్టి చేయులక్షణము అని రెండుగా విభజించినపుడు తత్త్వముల సంఖ్య ఇరువదియారు. ॥ 19 ॥

శ్లో ॥ దైవాత్ క్షుభిత ధర్మిణ్యాం స్వస్యాం యోనౌ పరః పుమాన్ ।
ఆధత్త వీర్యం సాఽసూత మహత్తత్త్వం హిరణ్మయమ్ ॥19

టీ:- ఇదానీం తత్త్వానాముత్పత్తిపూర్వకం లక్షణాన్యాహ- 'దైవాదిత్యాదినా ఏతాన్యసహంత్యే' త్యతః ప్రాక్తనేన గ్రంథేన. తత్ర చిత్తస్యోత్పత్తి పూర్వకం లక్షణమాహ-చతుర్భిః. దైనాదితి. దైవాత్ జీవాదృష్టాత్ క్షుభితా ధర్మా గుణా యస్యాః. యోనౌ అభివ్యక్తిస్థానే ప్రకృతౌ. వీర్యం చిచ్ఛక్తిమ్.

(ఇప్పుడు తత్త్వముల ఉత్పత్తి పూర్వకమైన లక్షణములను చెప్పుచున్నాడు.) ప్రకృతి క్షుభితధర్మము కలది. అనగా మార్పు చెందే (కదలికగల) ధర్మము కలది. జీవులందరికినిఉత్పత్తి స్థానము ప్రకృతి. జీవుని అదృష్టము వలన పరమపురుషుడు తన ఉత్పత్తి స్థానమగు ప్రకృతి యందు (మాయయందు) తన చైతన్యశక్తిని ఉంచెను. అపుడు ఆ ప్రకృతి నుండి(మాయనుండి) తేజోమయమైన 'మహత్తత్త్వము'

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

సా ప్రకృతిర్మహత్తత్త్వమసూత. మహతః స్వరూపమాహ – హిరణ్మయం ప్రకాశబహుళమ్. ॥ 19 ॥

పుట్టినది. ॥ 19 ॥

శ్లో ॥ విశ్వమాత్మగతం వ్యంజన్ కూటస్థో జగదంకురః ।
స్వతేజసాఽపిబత్తీవ్రమాత్మ ప్రస్వాపనం తమః ॥ 20 ॥

టీ:– మహత్తత్త్వస్వరూపమాహ–విశ్వమితి. విశ్వమహంకారాది ప్రపంచమ్. ఆత్మగతం స్వస్మిన్ సూక్ష్మ రూపేణ స్వస్మిన్ స్థితం వ్యంజన్ ప్రకటయన్. మహాన్ తీవ్రం ప్రళయ కాలీనం తమోఽపిబాత్. కూటస్థః లయ విక్షేపశూన్యః. కథంభూతం తమః ఆత్మానం ప్రస్వాపయతి ప్రచ్ఛాదయతీతి తథా. యత్పూర్వం ప్రళయసమయే మహాంతం ప్రకృతౌ విలాపయామాసేత్యర్థః. ॥ 20 ॥

(మహత్తత్త్వ స్వరూపమును చెప్పుచున్నాడు). మహత్తత్త్వము విశేషముగా ప్రకాశించునది. నిర్వికారమైనది. జగత్తునకు అంకుర మైనది. అహంకారాది ప్రపంచమును తనయందే సూక్ష్మరూపముగా కలిగియున్నట్టిది. లయము విక్షేపము లేనిది. ఇట్టి మహత్తత్త్వము ప్రపంచమును ప్రకటింపజేయుచుండెను. తన స్వరూపమును కప్పివేసే ప్రళయకాల అంధకారమును మహత్తత్త్వము తన కాంతిచే త్రాగెను. తొలగించెను. ॥ 20 ॥

శ్లో ॥ యత్తత్సత్త్వగుణం స్వచ్ఛం శాంతం భగవతః పదమ్ ।
యదాహుర్వాసుదేవాఖ్యం చిత్తం తన్మహదాత్మకమ్ ॥ 21 ॥

టీ:– ప్రసంగాచ్చతుర్వ్యూహోపాసనామాహ – యదితి సర్వాగమ ప్రసిద్ధత్వమాహ – స్వచ్ఛం విశదం. శాంతం రాగాదిరహితమ్ భగవతః ఉపలబ్ధి స్థానమ్. అత ఏవ వాసుదేవాఖ్యం యదాహుః. అయమర్థః. అధిభూతరూపేణ తస్యైవ మహానితి సంజ్ఞా. అధ్యాత్మరూపేణ చిత్తమితి.

ప్రసంగవశముగా చతుర్వ్యూహోపాసనను చెప్పుచున్నాడు.

'చిత్తము' శాస్త్రప్రసిద్ధిగాంచినది. స్వచ్ఛమైనది. శాంతమైనది. సత్త్వగుణమయమైనది. భగవానుని కనుగొనే స్థానము. ఈ చిత్తమే మహత్తత్త్వము. దీనినే 'వాసుదేవుడు' అని పండితులు పిలుచు చున్నారు.

అంతఃకరణము అధిష్ఠాత ఉపాస్యదేవుడు

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఉపాస్యరూపేణ వాసుదేవ ఇతి. అధిష్ఠాతా తు తస్య క్షేత్రజ్ఞః. ఏవమహంకారే సంకర్షణ ఉపాస్యః రుద్రోఽధిష్ఠాతా మనస్యనిరుద్ధ ఉపాస్యః చంద్రోఽధిష్ఠాతా బుద్ధౌ ప్రద్యుమ్న ఉపాస్యః. బ్రహ్మాధిష్ఠాతేతి జ్ఞాతవ్యమ్. ॥ 21 ॥

| | | | |
|---|---|---|---|
| 1. | చిత్తము | క్షేత్రజ్ఞుడు | వాసుదేవుడు |
| 2. | అహంకారము | రుద్రుడు | సంకర్షణుడు |
| 3. | బుద్ధి | బ్రహ్మ | ప్రద్యుమ్నుడు |
| 4. | మనస్సు | చంద్రుడు | అనిరుద్ధుడు ॥ 21॥ |

శ్లో ॥ స్వచ్ఛత్వమవికారిత్వం శాంతత్వమితి చేతసః ।
వృత్తిభిర్లక్షణం ప్రోక్తం యథాఽపాం ప్రకృతిః పరా ॥ 22

టీ:- స్వచ్ఛత్వమితి. స్వచ్ఛత్వం భగవద్బింబ గ్రాహిత్వమ్ అవికారిత్వం లయ విక్షేపాది రాహిత్యమ్ అపాం ప్రకృతిః ఫేన తరంగాదిరహితావస్థా. పరా భూసంసర్గాత్ప్రాక్తనీ సా యథా మధురా స్వచ్ఛా శాంతా చ తదదిత్యర్థః. ॥22॥

'చిత్తము' స్వతస్సిద్ధముగా 'స్వచ్ఛ'మైనది. భగవద్బింబ గ్రాహిత్వము వలన స్వచ్ఛత. లయ విక్షేపాదులు లేనందు వలన వికారములు లేనిది. శాంతముగా నుండునది. భూమితో కలియ నప్పుడు మధురముగా, చల్లగా, స్వచ్ఛముగా నుండే 'నీరు'వంటిది. (నురుగు, అలలు, బురద లేని నీటి లాంటిది.) ఇట్లు లక్షణములు చిత్తమునకు కలవు. ॥ 22 ॥

శ్లో ॥ మహత్తత్త్వాద్వికుర్వాణాద్భగవద్వీర్య సంభవాత్ ।
క్రియాశక్తిరహంకార స్త్రివిధః సమపద్యత ॥ 23

టీ:- అహంకారస్యోత్పత్తిపూర్వకం లక్షణమాహ - మహత్తత్త్వాదితి చతుర్భిః. క్రియాసు శక్తిర్యస్య సః క్రియాశక్తిః. ॥ 23 ॥

(అహంకారము యొక్క ఉత్పత్తిని, లక్షణములను ఈ నాలుగు శ్లోకములలో చెప్పుచున్నాడు.) భగవానుని చిచ్ఛక్తిచే(చైతన్యశక్తిచే) మహత్తత్త్వము ఉదయించినది. ఆ మహత్తత్త్వము వికారము చెంది అహంకారము పుట్టెను. ఈ అహంకారము వైకారిక, తైజస, తామసిక అనే త్రివిధ క్రియాశక్తి సంపన్నమైనది. వైకారికము అనగా సత్త్వము.

శ్లో ॥ వైకారికస్తైజసశ్చ తామసశ్చ యతో భవః ।
మనసశ్చేంద్రియాణాం చ భూతానాం మహతామపి ॥ 24 ॥

టీ:- త్రైవిధ్యమేవాహ - వైకారికఇతి. యతః తస్య కార్యమాహ - యస్మాన్మనఆదీనాం సంభవః ఉత్పత్తిః. ॥ 24 ॥

శ్లో ॥ సహస్ర శిరసం సాక్షాద్యమనంతం ప్రచక్షతే ।
సంకర్షణాఖ్యం పురుషం భూతేంద్రియ మనోమయమ్ ॥25

టీ:- తస్మిన్నుపాస్యవ్యూహమాహ - సహస్రశిరసమితి. 25

శ్లో ॥ కర్తృత్వం కరణత్వం చ కార్యత్వం చేతి లక్షణమ్ ।
శాంతఘోర విమూఢత్వ మితి వా స్యాదహంకృతేః ॥ 26

టీ:- లక్షణమాహ - కర్తృత్వమితి. కర్తృత్వం దేవతారూపేణ. కరణత్వమింద్రియరూపేణ. కార్యత్వం భూతరూపేణ శాంతత్వాదికం తు తత్కారణ గుణత్రయరూపేణ. ॥ 26 ॥

తైజస అనగా రజస్సు. తామసిక అనగా తమస్సు. ఈ త్రివిధ గుణయుత అహంకారము నుండి మనస్సు, ఇంద్రియములు, పంచమహాభూతములు పుట్టినవి. ॥23,24॥

పంచభూతములు, ఇంద్రియములు, మనస్సు అనే రూపములో ఉండే అహంకారమునే మహర్షులు అనంతుడు అని పిలుచుచున్నారు. వేల కొలది శిరస్సులు గల ఈ అనంతునకే సంకర్షణుడు అని పేరు. 25

ఈ అహంకారమునకు దేవతారూపములో కర్తృత్వము, ఇంద్రియరూపములో కరణత్వము, పంచభూతములరూపములో కార్యత్వము ఉన్నవి. సత్త్వాది గుణసంబంధముచే వరుసగా శాంతత్వము, ఘోరత్వము, విమూఢత్వము అనే లక్షణములు ఏర్పడుచున్నవి. శాంతత్త్వము ప్రసన్నతను కలిగియుండును. ఘోరత్వము విక్షేపము లేదా చాంచల్యమును విమూఢత్వము మోహమును కలిగించును. 26

శ్లో ॥ వైకారికాద్వికుర్వాణాన్మనస్తత్త్వమజాయత ।
యత్సంకల్ప వికల్పాభ్యాం వర్తతే కామసంభవః ॥ 27

టీ:- మనస ఉత్పత్తి పూర్వకం లక్షణమాహ-ద్వాభ్యాం. వైకారికాదితి. సంకల్పశ్చింతనమ్. వికల్పో విశేషేణ చింతనమ్. యస్య మనసః సంకల్ప వికల్పాభ్యాం కామసంభవో వర్తత ఇతి. కామరూపా వృత్తిర్లక్షణత్వేనోక్తా. న తు ప్రద్యుమ్నవ్యూహోత్పత్తిః. తస్య సంకల్పాది-కార్యత్వాభావాత్. ఉపాస్యవ్యూహస్య చానిరుద్ధస్యోక్తేః 27

శ్లో ॥ యద్విదుర్ హ్యనిరుద్ధాఖ్యం హృషీకాణామధీశ్వరమ్ ।
శారదేందీవరశ్యామం సంరాధ్యం యోగిభిః శనైః ॥ 28

టీ:- యదితి. శారదం శరత్కాలీనం ఇందీవరం నీలోత్పలం తదివ శ్యామం యచ్ఛనైః సంరాధ్యం వశీకర్తుం యోగ్యం, దుర్గ్రహత్వాత్. 28

శ్లో ॥ తైజసాత్తు వికుర్వాణాద్బుద్ధితత్త్వమభూత్సతి ।
ద్రవ్యస్ఫురణ విజ్ఞానమింద్రియాణామనుగ్రహః ॥ 29

టీ:- బుద్ధేరుత్పత్తిపూర్వకం లక్షణమాహ-ద్వాభ్యాం తైజసాదితి. హే సతి ద్రవ్యస్య పృథివ్యాదేః. బాహ్యస్య స్ఫురణరూపం విజ్ఞానం యస్మాత్త

(మనస్సు యొక్క ఉత్పత్తి, లక్షణములను ఈ రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు.) సాత్త్వికాహంకారము వికారముచెంది మనస్సు పుట్టును. ఆ సంకల్ప వికల్పముల నుండి కామము పుట్టును. సంకల్ప మనగా విషయచింతన. వికల్పమనగా విశేషచింతనము. ఈ మనస్సునకు ఉపాస్యదైవము అనిరుద్ధుడే. ॥ 27 ॥

ఈ మనస్తత్త్వమే ఇంద్రియాధిష్ఠాతయైన 'అనిరుద్ధుడ'నే పేరుతో ప్రసిద్ధిగాంచినది. శరత్కాలమందలి కలువవలె నలుపురంగుగల అనిరుద్ధుని యోగులు మెల్ల మెల్లగా వశము చేసికొని ఆరాధింతురు. గ్రహించుటకు సులభము కాని వాడగుటచే మెల్ల మెల్లగా వశము చేసికొందురు. ॥ 28 ॥

(బుద్ధి యొక్క ఉత్పత్తి, దాని లక్షణములను రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు.) ఓ పతివ్రతా! తైజసాహంకారము వికారము చెంది బుద్ధితత్త్వము పుట్టెను. ద్రవ్యములు స్ఫురించుట, వాటి విజ్ఞానము కలుగుట, ఇంద్రియవ్యాపారములందు సహాయపడుట "బుద్ధి" యొక్క

త్తధా విషయప్రకాశహేతోః జ్ఞానాఖ్యస్య. పరిణామ విశేషస్యోపాదాన మిత్యర్థః. ద్రవ్య స్ఫురణరూపం విజ్ఞానమితి చిత్తవ్యావృత్త్యర్థముక్తమ్. ఇంద్రియాణామనుగ్రహ ఇతి సవికల్పజ్ఞానే. హృషీకాణామధీశ్వరమితి యదుక్తం తత్తు నిర్వికల్పజ్ఞానే. ॥ 29 ॥

శ్లో॥ సంశయో౽థ విపర్యాసో నిశ్చయః స్మృతి రేవ చ ।
స్వాప ఇత్యుచ్యతే బుద్ధేర్లక్షణం వృత్తితః పృథక్ ॥ 30

టీ:- ద్రవ్యస్ఫురణస్యైవ ప్రపంచః సశయాదిః. విపర్యాసో మిథ్యాజ్ఞానమ్ నిశ్చయః ప్రమాణ జ్ఞానమ్. స్వప్నో నిద్రా. 'ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రాస్మృతయః' ఇతి పాతంజలోక్తేః. ॥30 ॥

శ్లో॥ తైజసానీంద్రియాణ్యేవ క్రియాజ్ఞానవిభాగశః ।
ప్రాణస్య హి క్రియాశక్తిర్బుద్ధేర్విజ్ఞానశక్తితా ॥ 31

టీ:- ఇంద్రియాణాముత్పత్తిమాహ-తైజసానీతి. తైజసాని తైజసాహం కారాజ్జాతాని. జ్ఞానేంద్రియాణాం వైకారికత్వశంకా నివృత్త్యర్థమేవకారః క్రియాజ్ఞానవిభాగశః. ద్వివిధాన్యపీంద్రియాణి. తైజసాన్యేవేత్యర్థః. తత్ర హేతుః. ప్రాణస్యేతి. హి యస్మాత్ప్రాణస్య క్రియాశక్తేః బుద్ధేశ్చ విజ్ఞాన వృత్తి. ॥ 29 ॥

1.సంశయము అనగా ఒకే వస్తువునందు వివిధరకములైన జ్ఞానము కలుగుట, 2.విపర్యాసము అనగా విపరీత జ్ఞానము(మిథ్యా జ్ఞానము) అనగా ఒకదానిని మరియొకటిగా భావించుట, 3. నిశ్చయము అనగా ఖచ్చితమైన జ్ఞానము, 4.స్మరణము, 5.నిద్ర అనే ఈ అయిదు బుద్ధియొక్క వేరువేరు లక్షణములు. ఈ బుద్ధి లక్షణముకే 'ప్రద్యుమ్నుడు' అని పేరు. ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రాస్మృతయః అని పతంజలి మాట. ॥ 30 ॥

(ఇంద్రియముల ఉత్పత్తిని చెప్పుచున్నాడు). క్రియ, జ్ఞానము, అనే విభాగమువలన ఇంద్రియములు రెండు రకములు. క్రియనుబట్టి కర్మేంద్రియములు, జ్ఞానమునుబట్టి జ్ఞానేంద్రియములు. ఈ కర్మ, జ్ఞానేంద్రియములు పది కూడా తైజసాహంకారము నుండి పుట్టినవే. వైకారికము కాదని స్పష్టపరచుట 'ఏవ' శబ్దప్రయోజనము. రెండు రకముల ఇంద్రియములు తైజసములేయనుట. కారణమేమనగా క్రియ

శక్తితా. అతః ప్రాణస్య తైజసత్వాత్ తత్క్రియాశక్తితామమింద్రియాణాం తైజసత్వమ్. తథా బుద్ధేస్తైజసత్వాత్. తదీయ జ్ఞానశక్తిమతా-మపీంద్రియాణాం. తైజసత్వమిత్యర్థః. 31 ॥

ప్రాణశక్తి. జ్ఞానము బుద్ధిశక్తి. ప్రాణము మరియు బుద్ధి కూడా తైజసములే. అందువలన కర్మ జ్ఞానేంద్రియములు రెండును తైజసములే. 31

శ్లో ॥ తామసాచ్చ వికుర్వాణాద్భగవద్వీర్యచోదితాత్ ।
శబ్దమాత్రమభూత్తస్మాన్నభః శ్రోత్రం తు శబ్దగమ్ ॥ 32

టీ:- తన్మాత్రోత్పత్తిపూర్వక మాకాశాది మహా భూతోత్పత్తిం తల్లక్షణం చాహ- పంచదశభిః తామసాదితి. శ్రోత్రం తు శబ్దమిత్యాదిభిః. విషయోత్ప త్యనంతరం. తత్సంబంధిమాత్రం కథ్యతే. న తూత్పత్తిః. ప్రాగేవోత్పన్నత్యాత్. శబ్దం గచ్ఛతి ప్రాప్నోతీతి శబ్దగమ్. 32

తన్మాత్రల ఉత్పత్తి, ఆకాశము మొదలగు మహాభూతముల ఉత్పత్తి వాటి లక్షణములను ఈ అయిదు శ్లోకములతో చెప్పుచున్నాడు. భగవంతుని చేతనశక్తి ద్వారా(భగవంతుని వీర్యము) ప్రేరణ పొంది తామసాహంకారము వికారము చెందగా "శబ్దతన్మాత్ర" ఏర్పడినది. దాని నుండి ఆకాశము, మఱియు శబ్దగ్రాహకమగు శ్రోత్రేంద్రియము ఏర్పడినది. ముందుగా 'విషయము' యొక్క ఉత్పత్తిని చెప్పి తరువాత తత్సంబంధమగు అంశమును చెప్పుచున్నాడు. 32

శ్లో ॥ అర్థాశ్రయత్వం శబ్దస్య ద్రష్టుర్లింగత్వమేవ చ ।
తన్మాత్రత్వం చ నభసో లక్షణం కవయో విదుః ॥ 33

టీ:- శబ్దలక్షణమాహ - అర్థాశ్రయత్వమితి. అర్థాశ్రత్వమర్థ వాచకత్వమ్. ద్రష్టృలింగత్వం. కుడ్యాద్యంతరితస్య వక్తుర్జ్ఞాపకత్వం. తదుక్తం. "లింగం యద్ద్రష్టృదృశ్యయో"రితి. నభసస్తన్మాత్రత్వం. సూక్ష్మత్వం శబ్దస్య లక్షణమిత్యన్వయః. 33

(శబ్దము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు.) శబ్దము అర్థమును ప్రకాశింపజేయును, వక్తను గుర్తింపజేయును. అనగా చాటుగాయుండి మాట్లాడినను శబ్దముద్వారా వక్తను గుర్తించ వచ్చును. శబ్దము ఆకాశమునకు తన్మాత్ర. ఈ లక్షణములు గలది శబ్దము అని పండితులు చెప్పుదురు. ॥ 33 ॥

శ్లో ॥ భూతానాం ఛిద్రదాతృత్వం బహిరంతరమేవ చ ।
ప్రాణేంద్రియాత్మధిష్ణ్యత్వం నభసో వృత్తిలక్షణమ్ ॥ 34

టీ:- భూతానామితి. ఛిద్రదాతృత్వం అవకాశదాదృత్వం. బహిరంతర వ్యవహారాస్పదత్వం. ఆత్మా మనః ప్రాణాదీనాం ధిష్ణ్యత్వమాశ్రయత్వమ్. నాడ్యాదిభి శ్చిద్రరూపేణ వృత్తిః కార్యమేవ లక్షణం వృత్తిలక్షణం. ఏవ-ముత్తరత్రా ప్యేకైకేన శ్లోకేన. తన్మాత్ర మహాభూతయోరుత్పత్తిః. ద్వితీయేన తన్మాత్ర లక్షణం, తృతీయేన మహాభూతలక్షణమిత్యనుసంధేయమ్. 34

(ఆకాశము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు). ఆకాశము పదార్థములన్నింటిని తనయందు ఉండే అవకాశమునిచ్చును. అన్నింటి లోపలను వ్యాపించి యుండును. అనగా లోపల, బయట కూడా ఆకాశము వ్యాపించియుండును. నాడులలోపలి రంధ్రములరూపములో ఆకాశము వ్యాపించి ప్రాణమునకు, ఇంద్రియములకు, మనస్సుకు ఆశ్రయమగుచున్నది. ఇవే ఆకాశముయొక్క లక్షణములు. 34

శ్లో ॥ నభసః శబ్దతన్మాత్రాత్కాలగత్యా వికుర్వతః ।
స్పర్శోఽభవత్తతో వాయుస్త్వక్ స్పర్శస్య చ సంగ్రహః ॥ 35

టీ:- నభస ఇతి. కా సా త్వక్ ? స్పర్శస్య సంగ్రహః. సమ్యక్గ్రహణం యయా పుంస్త్వం నియతలింగత్వాత్. యద్వా - స్పర్శస్య సంగ్ర - హస్తతో భవతీతి శేషః. శబ్దతన్మాత్రాదితి తన్మాత్రాణాముత్తరో - త్తరాన్వయార్థముక్తం. 35

సూచన:- (ఈ విధముగా తరువాత వచ్చే 1.మొదటి శ్లోకములో తన్మాత్ర, మహాభూతముల ఉత్పత్తి, 2. రెండవ శ్లోకములో ఆ తన్మాత్ర లక్షణము, 3.మూడవ శ్లోకములో మహాభూత లక్షణము ఉన్నట్లు తెలియనగును.) శబ్దతన్మాత్ర నుండి ఆకాశము పుట్టినది. కాలగతిచేత వికారము చెందిన ఆకాశము నుండి స్పర్శతన్మాత్ర పుట్టినది. స్పర్శ - తన్మాత్ర నుండి వాయువు పుట్టినది. చర్మము స్పర్శను గ్రహించే ఇంద్రియము. స్పర్శ సుఖమునునుభవింప జేయునది. శబ్ద తన్మాత్ర నుండి ఆకాశమనే మహాభూతమేర్పడినట్లే తరువాత తన్మాత్ర నుండి మహాభూతోత్పత్తి ఏర్పడునని అన్వయము. ॥ 35 ॥

శ్లో ॥ మృదుత్వం కఠినత్వం చ శైత్యముష్ణత్వమేవ చ ।
ఏతత్ స్పర్శస్య స్పర్శత్వం తన్మాత్రత్వం నభస్వతః ॥ 36

టీ:- స్పర్శలక్షణమాహ - మృదుత్వమితి. స్పర్శత్వం స్వరూప లక్షణ మిత్యర్థః. నభస్వతో వాయోః. తన్మాత్రత్వం చ. 36

(స్పర్శ లక్షణమును చెప్పుచున్నాడు). మృదుత్వము, కఠినత్వము, చల్లదనము, వేడిదనము అనునవి స్పర్శ యొక్క స్వరూప లక్షణములు. మఱియు వాయువునకు తన్మాత్రయగుట ఈ స్పర్శకు లక్షణములు. 36

శ్లో ॥ చాలనం వ్యూహనం ప్రాప్తిర్నేతృత్వం ద్రవ్యశబ్దయోః ।
సర్వేంద్రియాణామాత్మత్వం వాయోః కర్మాభిలక్షణమ్ ॥ 37

టీ:- చాలనమితి. చాలనం వృక్షాశాఖాదేః వ్యూహనం మేళనం తృణాదేః. ప్రాప్తిస్సంయోగః. ద్రవ్యస్య గంధవతోః ఘ్రాణం ప్రతి. తథా శైత్యాదిమతః స్పర్శనం ప్రతి. శబ్దస్య శ్రోత్రం ప్రతి నేతృత్వం సర్వేంద్రి యాణామాత్మత్వముపోద్బలకత్వం. కర్మణా కార్యేణ అభిలక్షణం. భావే ల్యుట్. కర్మైవాభిలక్షణమితి విగ్రహే తు కరణే. 37,38

చెట్లకొమ్మలను కదిలించుట, గడ్డిమొదలగువాటిని కలుపుట, వాసనతో కూడిన వస్తువును ముక్కుకు చేర్చుట, చలి, వేడిలతో గూడిన వస్తువులను చర్మము దగ్గరకు చేర్చుట, శబ్దమును చెవివద్దకు చేర్చుట వాయువు యొక్క పని. ఇంద్రియములకు కార్యశక్తిని కల్పించుట కూడా వాయువు పని. ॥ 37 ॥

శ్లో ॥ వాయోశ్చ స్పర్శతన్మాత్రాద్రూపం దైవేరితాదభూత్ ।
సముత్థితం తతస్తేజశ్చక్షూ రూపోపలంభనమ్ ॥ 38

స్పర్శతన్మాత్రగా గల వాయువు కాలప్రేరణచే వికారము చెందగా దాని నుండి(వాయువునుండి) రూపతన్మాత్ర ఏర్పడినది. రూపతన్మాత్ర నుండి అగ్ని మహాభూతము పుట్టినది. నేత్రేంద్రియము కూడా పుట్టినది.

శ్లో ॥ ద్రవ్యాకృతిత్వం గుణతా వ్యక్తిసంస్థాత్వమేవ చ ।
తేజస్త్వం తేజసః సాధ్వి రూపమాత్రస్య వృత్తయః ॥ 39

టీ:- ద్రవ్యాకృతిత్వమితి. ద్రవ్యాకృతిత్వం ద్రవ్యస్యాకారసమర్పకత్వం. గుణతా ద్రవ్యోపసర్జనత్వేన ప్రతీతిః శబ్దస్య తు స్వాతంత్ర్యేదైవ ప్రతీతిః అప్రత్యక్ష ద్రవ్యస్థస్పర్శాదేరపి. స్వాతంత్ర్యేణైవ ప్రతీతిః. రూపస్య తు నైవమితి తస్యాయం విశేషః ఉక్తః. వ్యక్తి సంస్థాత్వం వ్యక్తేర్ద్రవ్యస్య యా సంస్థా సన్నివేశః. సైవ సంస్థా యస్య. తత్పరిణామతయా ప్రతీతి-రిత్యర్థః. తేజసస్తేజస్త్వమసాధారణత్వం. 39

శ్లో ॥ ద్యోతనం పచనం పానమదనం హిమమర్దనమ్ ।
తేజసో వృత్తయస్త్వేతాః శోషణం క్షుత్తృడేవ చ ॥ 40

టీ:- ద్యోతనమితి. ద్యోతనం ప్రకాశనం. పచనం తండులాదేః. క్షుత్తృట్ అశనా పిపాసా చ తద్ద్వారేణ పానమదనం చ. 40

శ్లో ॥ రూపమాత్రాద్వికుర్వాణాత్తేజసో దైవచోదితాత్ ।
రసమాత్రమభూత్తస్మాదంభో జిహ్వా రసగ్రహః ॥ 41

ఈ నేత్రము రూపమును గ్రహించే ఇంద్రియము. ॥ 38 ॥

ఓ పతివ్రతా! పదార్థములకు ఆకారమును ఏర్పరచుట (రూపమునేర్పరచుట), ద్రవ్యములకు గుణమై భాసిల్లుట, పదార్థమునకు ఎంతటి పరిణామమున్నదో అంతటి పరిణామముతో వెల్లడియగుట, అగ్నికి స్వరూపమైయుండుట రూపతన్మాత్ర యొక్క లక్షణములు. 39

ప్రకాశించుట, ఆహారపదార్థములను వండుట, కాల్చుట, నీటిని త్రాగుట, తినుట, చలిని పోగొట్టుట, ఎండింపజేయుట అనేవి అగ్ని యొక్క వృత్తులు. ॥ 40 ॥

రూపము తన్మాత్రగా గల అగ్ని దైవప్రేరితమై వికారమును పొందెను. ఆ అగ్ని నుండి రసతన్మాత్ర ఏర్పడెను. మరియు నాలుక

టీ:- రూపమాత్రాదితి. జిహ్వా రసనేంద్రియం రసో గృహ్యతేఽనయేతి రసగ్రహః. యద్వా రసగ్రహస్తతో భవతీతి శేషః. 41

ఏర్పడెను. నాలుక రసమును గ్రహించును. ॥ 41 ॥

శ్లో ॥ కషాయో మధురస్తిక్తః కట్వమ్ల ఇతి నైకధా ।
భౌతికానాం వికారేణ రస ఏకో విభిద్యతే ॥ 42

టీ:- కషాయ ఇతి. కషాయాదిషు లవణోఽపి ద్రష్టవ్యః. భౌతికానాం సాంసర్గిక ద్రవ్యాణాం. య ఏకో మధుర ఏవ సన్. ఏవమనేకధా. భిద్యతే స రస ఇత్యర్థః. 42

రసము ఒక్కటియే. మధురమైనది. కాని భౌతికపదార్థముల కలయికచే వగరు, తీపి, చేదు, కారము, పులుపు, ఉప్పు మొదలగు అనేక విధములగుచున్నది. ॥ 42 ॥

శ్లో ॥ క్లేదనం పిండనం తృప్తిః ప్రాణనాప్యాయనౌదనమ్ ।
తాపాపనోదో భూయస్త్వమంభసో వృత్తయస్త్విమాః ॥ 43

టీ:- క్లేదనమితి. క్లేదనమార్ద్రీకరణం. పిండనం మృదాదేః పిండీకరణం. తృప్తిః తృప్తిదాతృత్వం. ప్రాణనం జీవనం."ఆపోమయః ప్రాణ" ఇతి స్మృతేః. ఆప్యాయనం తద్వైక్లబ్య నివర్తనం. ఓదనం మృదూకరణం. అదనమితి పాఠేఽపి స ఏవార్థః. భూయస్త్వం కూపాదా వుద్ధృతస్యాపి పునః పునరుద్గమః. ॥ 43 ॥

తడుపుట, మట్టి మొదలగువానిని ముద్దగాచేయుట, బ్రతికించుట, దప్పిక తీర్చుట, పదార్థములను మెత్తగా చేయుట, వేడిని పోగొట్టుట, భూమి నుండి 'ఊట'ల రూపములో అధికముగా లభించుట (ఊరుట) అనేవి నీటి లక్షణములు. ॥ 43 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ రసమాత్రా ద్వికుర్వాణాదంభసో దైవ చోదితాత్ ।
గంధమాత్ర మభూత్తస్మాత్పృథ్వీ ఘ్రాణస్తు గంధగః ॥ 44

టీ:- రసమాత్రాదితి. గంధం గోగంధం ప్రాప్నోతీతి. ॥ 44 ॥

రసము తన్మాత్రగా గల నీరు దైవప్రేరణచే వికారము చెంది గంధతన్మాత్ర ఏర్పడినది. దానినుండి భూమి మరియు ముక్కు పుట్టినవి. ముక్కు, గంధమును (వాసనను) గ్రహించే ఇంద్రియము. ॥ 44 ॥

శ్లో ॥ కరంభపూతిసౌ రభ్య శాంతో గ్రామ్లాదిభిః పృథక్ ।
ద్రవ్యావయవ వైషమ్యాద్గంధ ఏకో విభిద్యతే ॥ 45

టీ:- కరంభేతి. కరంభో మిశ్ర గంధః. యథా వ్యంజనాదీనాం హింగ్వాది సంస్కారైః. పూతిః దుర్గంధః. సౌరభ్యం కర్పూరాదేః. శాంతః శత పత్రాదేః. ఉగ్రః లశునాదేః. ఆమ్లః పర్యుషిత చిత్రాన్నాదేః. సంసర్గిణాం ద్రవ్యావయవానాం వైషమ్యాద్య ఏవం విభిద్యతే స గంధ ఇత్యర్థః.॥ 45 ॥

కరంభము అనగా మిశ్రగంధము (ఆహార పదార్థము లందు ఇంగువ మొదలగు వాని కలయికచే ఏర్పడునది.) పూతి అనగా దుర్గంధము (చెడు వాసన), సౌరభ్యము అనగా సువాసన(కర్పూరాదుల యందుండునది), పద్మము మొదలగు వాటి యందుండునది శాంత గంధము, ఉల్లిపాయ, వెల్లిపాయ, ఇంగువ మొదలగు పదార్థముల లోని తీవ్ర గంధము, చింతపండు మున్నగువాని యందలి ఆమ్ల గంధము (పుల్లని వాసన) ఇవన్నియు ద్రవ్యభాగముల ఎక్కువ తక్కువలచే గంధమునందు ఏర్పడే భేదములు. కాని స్వతస్సిద్ధముగా గంధము ఒకటే. 45

శ్లో ॥ భావనం బ్రహ్మణః స్థానం ధారణం సద్విశేషణమ్ ।
సర్వసత్త్వగుణోద్భేదః పృథివీవృత్తిలక్షణమ్ ॥ 46

టీ:- భావనమితి. బ్రహ్మణో భావనం ప్రతిమాదిరూపేణ సాకార -

1.ప్రతిమాది రూపములలో భగవంతుని సాకారభావనకు ఆశ్రయమగుట, 2.జలము మొదలగు వాటిని వేరుచేసి ఇతరాపేక్ష లేకుండానే తాను స్థిరముగా యుండుట, 3.నీరు మొదలగువాటికి ఆధారమగుట, 4.ఆకాశమును వేరు చేసినట్లు కనిపించుట, అనగా

తాపాదనం. స్థానం జలాదివిలక్షణ త్రయాశ్రయాంతరనైరపేక్ష్యేణ స్థితిః . ధారణం జలాద్యాధారత్వం సతామాకాశాదీనాం విశేషణమవచ్ఛేద-కత్వం సర్వేషాం సత్త్వానాం ప్రానిణాం తద్గుణానాం చ పుంస్త్వాదీనాం. ఉద్భేదః పరిణామవిశేషైః ప్రకటీకరణమ్. ॥ 46 ॥

శ్లో ॥ నభో గుణవిశేషోఽర్థో యస్య తచ్ఛ్రోత్రముచ్యతే ।
వాయోర్గుణ విశేషోఽర్థో యస్య తత్స్పర్శనం విదుః ॥ 47

టీ:- శ్రోత్రాదీనాం శబ్దాదిగ్రాహకత్వ ముక్తం తేషాం చ లక్షణం తదేవేత్యాహ-పంచభిః శ్లోకార్ధైః. నభ ఇతి. నభసో గుణవిశేషః శబ్దో యస్యార్థో విషయః ॥ 47,48 ॥

శ్లో ॥ తేజో గుణవిశేషోఽర్థో యస్య తచ్చక్షురుచ్యతే ।
అంభో గుణవిశేషోఽర్థో యస్య తద్రసనం విదుః ।
భూమేర్గుణవిశేషోఽర్థో యస్య స ఘ్రాణ ఉచ్యతే ॥ 48

శ్లో ॥ పరస్య దృశ్యతే ధర్మో హ్యపరస్మిన్ సమన్వయాత్ ।
అతో విశేషో భావానాం భూమావేవోపలక్ష్యతే ॥ 49 ॥

ఇది ఘటాకాశము, ఇది మఠాకాశము అని వేరు పరచుటకు ఆధారమగుట, 5.సమస్త ప్రాణుల యందు స్త్రీ, పురుషాది భేదములు వెల్లడి చేయుట అనేవి భూమి యొక్క వృత్తులు (లక్షణములు) ॥46॥

(శ్రోత్రాదుల యొక్క శబ్దాది గ్రాహకత్వ లక్షణములను ఈ ఒకటిన్నర శ్లోకముతో చెప్పుచున్నాడు). ఆకాశము యొక్క విశేష గుణము శబ్దము. దానిని గ్రహించే ఇంద్రియము చెవి. గాలి యొక్క విశేషగుణము స్పర్శ. దానిని గ్రహించే ఇంద్రియము చర్మము (స్పర్శేంద్రియము). ॥ 47 ॥

అగ్నికి విశేషగుణము రూపము. దానిని గ్రహించేది కన్ను. నీటికి విశేషగుణము రసము. దానిని గ్రహించేది నాలుక. భూమికి విశేష గుణము గంధము. దానిని గ్రహించేది ముక్కు. ॥ 48 ॥

పరస్పర సంబంధమువలన కారణము యొక్క విశేష-గుణములు కార్యమునందు కనిపించును. అందుకు ఆకాశాదులైన నాలుగు భూతముల విశేషగుణములు ఒక్క పృథివి యందు మాత్రమే లభించును.

టీ:- గుణవిశేష శబ్దవ్యావృత్తమర్థం దర్శయతి-పరస్యేతి. పరస్య కారణస్య ఆకాశాదేః ధర్మః శబ్దాదిః. అపరస్మిన్ కార్యే వాయ్వాదౌ. కారణాన్వయాద్దృశ్యతే. అతో భావానామాకాశాదీనాం విశేషో గుణః సర్వోఽపి శబ్దాదిః భూమావేవోపలభ్యతే. చతుర్ణాం తత్రాన్వయాత్. జలాదిషు యథా స్వయమేవ నసర్వః. ఆకాశే త్వన్యాన్వయాభావాదేక ఏవ. ॥ 49 ॥

వివరణ:- గుణవిశేషముల సంబంధమును చూపుచున్నాడు. ఆకాశాదుల గుణ విశేషములు వాయువు మొదలగువాని యందు కలియుచున్నవి. అందుకుగాను భూమి యందు మాత్రమే గంధ గుణములతోబాటు శబ్ద, స్పర్శ, రూప, రస లక్షణములుండును. ఆకాశమునందు ఒక్క శబ్ద గుణము మాత్రమే ఉండును. గాలి యందు శబ్ద, స్పర్శ గుణములు; అగ్ని యందు శబ్ద, స్పర్శ, రూప గుణములు; జలము నందు శబ్ద, స్పర్శ, రూప, రసగుణము లుండును. ॥ 49 ॥

(ఈ విధముగా కారణోత్పత్తిని వివరించిన పిదప మూడున్నర శ్లోకములలో కార్యోత్పత్తిని చెప్పుచున్నాడు.) మహత్తు, అహంకారము, పంచభూతములు ఇవి ఏడు, ఇవి ఒకదానితో నొకటి కలియకుండ విడివిడిగా నుండెను. జగత్కారణమగు భగవానుడు 1.కాలము, 2.కర్మ, 3.గుణములు అనువాటితో గూడినవాడై వాటిలో ప్రవేశించెను. 50

శ్లో ॥ ఏతాన్యసంహత్య యదా మహదాదీని సప్త వై ।
కాలకర్మ గుణోపేతో జగదాది రుపావిశత్ ॥ 50

టీ:- ఏవం కారణోత్పత్తిముక్త్వా కార్యోత్పత్తిమాహ-సార్ధై స్త్రిభిః. ఏతానీతి. ఏతాన్యసంహత్యామిళిత్వా యదా స్థితాని తదా జగదాది రీశ్వరః. ప్రావిశత్ సప్తేతి చ ప్రాధాన్యాభిప్రాయేణోక్తం. ప్రవేశస్తు సర్వేష్వపి వివక్షితఏవ. ॥ 50 ॥

శ్లో ॥ తతస్తేనానువిద్ధేభ్యో యుక్తేభ్యోఽండమచేతనమ్ ।
ఉత్థితం పురుషో యస్మాదుదతిష్ఠదసౌ విరాట్ ॥ 51

పిమ్మట భగవానుడు ప్రవేశించుటతో ఈ ఏడు తత్త్వములలో సంక్షోభము కలిగెను. అవి ఒకదానితోనొకటి కలిసినవి. వాటియన్నింటి

టీ:- తత ఇతి. అనువిద్ధేభ్యః క్షుభితేభ్యః. యస్మాదండాత్. అసౌ విరాట్పురుష ఉదతిష్ఠత్. ॥ 51 ॥

నుండి అచేతనమైన(కదలికలేని) ఒక 'అండము' పుట్టెను. ఆ అండము నుండి 'విరాట్‌పురుషుడు' ఉదయించినాడు. ॥ 51 ॥

శ్లో ॥ ఏతదండం విశేషాఖ్యం క్రమవృద్ధైర్దశోత్తరైః ।
తోయాదిభిః పరీవృత్తం ప్రధానేనావృతైర్బహిః ।
యత్ర లోకవితానోऽయం రూపం భగవతో హరేః ॥ 52

టీ:- ఏతదితి. క్రమవృద్ధైః పూర్వస్మాద్దశగుణాధికైః. తోయాదిభిః. పృథివ్యావరణస్యాండకటాహత్వేన. అండశబ్దేన గృహీతత్వాత్తోయా దీనామేవావరణత్వ ముక్తం. యత్రాండే. లోకాత్మకోऽయం విరాట్ భగవతో రూపమితి పురుషాభేదాభిప్రాయేణ. ॥ 52 ॥

(ఇది భగవంతుని రూపము. పరమపురుషుడికి ఈ అండము నకు భేదములేదని అభిప్రాయము.) అండము పేరు విశేషము. ఈ అండము బయటిభాగము ప్రకృతిచే ఆవరింపబడియున్నది. దీని చుట్టూ పదిరెట్లు నీరూ, దాని చుట్టూ పదిరెట్లు తేజస్సూ, దాని చుట్టూ పదిరెట్లు ఆకాశము వ్యాపించియున్నవి. ఈ ఆవరణములన్నింటికి బయట ప్రకృతి ఆవరించి యున్నది. దీని యందు లోకముల విస్తారము కలదు. ఈ విస్తారము పరమపురుషుడైన శ్రీహరి యొక్క రూపమే. 52

శ్లో ॥ హిరణ్మయాదండకోశా దుత్థాయ సలిలేశయాత్ ।
తమావిశ్య మహాదేవో బహుధా నిర్బిభేద ఖమ్ ॥ 53

టీ:- తస్మిన్నధ్యాత్మాది విభాగమాహ - నవభిః హిరణ్మయాదితి. ఉత్థాయ ఔదాసీన్యం విహాయ. తమావిశ్య అధిష్ఠాయ మహాంశ్చాసౌ దేవశ్చ. ఖం ఛిద్రమ్. ॥ 53 ॥

(దానియందు అధ్యాత్మాది విభాగమును తొమ్మిది శ్లోకములలో చెప్పుచున్నాడు.) నీటి యందున్న ఈ తేజోమయమైన అండము నుండి ఆ విరాట్ పురుషుడు పైకి లేచి ఉదాసీనమును వదలివాడై ఆ అండము నందే ప్రవేశించెను. దానికి అనేక రంధ్రములను చేసెను. ॥ 53 ॥

శ్లో ॥ నిరభిద్యతాస్య ప్రథమం ముఖం వాణీ తతోఽభవత్ ।
వాణ్యా వహ్నిరథో నాసే ప్రాణతో ఘ్రాణ ఏతయోః ॥ 54

టీ:- నిరభిద్యతేతి. వాణ్యా సహ వహ్నిరభవత్ ప్రావిశత్. నాసే నిరభిత్యేతాం. ప్రాణతః ప్రాణేనానుస్యూతస్సన్ ఘ్రాణః ఏతయోః నాసికయోః. అభవదిత్యనుషంగః. ॥ 54 ॥

ముందుగా విరాట్పురుషునకు నోరు విడివడెను (ప్రకటమయ్యెను). దాని నుండి వాగింద్రియము మఱియు వాక్కుకు అధిష్ఠాతయయిన 'అగ్ని' ప్రకటమయ్యెను. తరువాత ముక్కు పుటములు (నాసికా రంధ్రములు) ఏర్పడెను. వాటి నుండి ప్రాణవాయువుతో గూడిన ఘ్రాణేంద్రియము ఏర్పడెను. ॥ 54 ॥

శ్లో ॥ ఘ్రాణాద్వాయురభిద్యేతామక్షిణీ చక్షురేతయోః ।
తస్మాత్సూర్యోన్యభిద్యేతాం కర్ణౌ శ్రోత్రం తతో దిశః ॥ 55

టీ:- ఘ్రాణాదితి. ఘ్రాణానంతరం వాయుశ్చ. ప్రాణత ఇతి విశేషణం సర్వేంద్రియేష్విత్యపి ద్రష్టవ్యం. న్యభిద్యేతామన్వభిద్యేతామితి పాఠద్వయేఽప్యేక ఏవార్థః. తతో దిశః ప్రావిశన్ ॥ 55 ॥

ఘ్రాణేంద్రియము తరువాత దానికధిష్ఠాతయగు 'వాయువు' ఉత్పన్నమయ్యెను. తరువాత కన్నులు ప్రకటమయ్యెను. వాటి యందు చక్షురింద్రియము, నేత్రాధిష్ఠానమగు 'సూర్యుడు' ప్రకటమయ్యెను. ఆ పిమ్మట చెవులు విడివడెను. శ్రోత్రేంద్రియము దానికధిష్ఠాతయగు 'దిగ్దేవతలు' పుట్టిరి. ॥ 55 ॥

శ్లో ॥ నిర్బిభేద విరాజస్త్వగ్రోమశ్మశ్ర్వాదయస్తతః ।
తత ఓషధయశ్చాసన్ శిశ్నం నిర్బిభిదే తతః ॥ 56 ॥

టీ:- నిర్బిభేదేతి. ఆదిశబ్దేన కేశః. ॥ 56,57॥

తరువాత విరాట్పురుషునకు చర్మము ఏర్పడెను. ఆ చర్మము నుండి రోమములు, మీసము, గడ్డము మొదలగు వెంద్రుకలు ఏర్పడినవి. చర్మమునకు అధిష్ఠానదేవతయగు ఓషధులు, తరువాత జననేంద్రియము ఏర్పడెను. ॥ 56 ॥

శ్లో ॥ రేతస్తస్మాదాప ఆసన్ నిరభిద్యత వై గుదమ్ ।
గుదాదపానోఽపానాచ్చ మృత్యుర్లోక భయంకరః ॥ 57 ॥

దాని నుండి (జననేంద్రియము నుండి) రేతస్సు (వీర్యము), అభిమానదేవతయగు జలము (ఆపోదేవుడు) పుట్టెను. తరువాత విసర్జనేంద్రియము(గుదము) పుట్టినది. ఆ గుదము నుండి అపానము, లోక భయంకరమైన మృత్యువు పుట్టెను. ॥ 57 ॥

శ్లో ॥ హస్తౌ చ నిరభిద్యేతాం బలం తాభ్యాం తతస్స్వరాట్ ।
పాదౌ చ నిరభిద్యేతాం గతిస్తాభ్యాం తతో హరిః ॥ 58

టీ:- స్వరాడింద్రః. హరిర్విష్ణుః. ॥58॥

తరువాత చేతులు ప్రకటమైనవి. ఆ చేతులయందు 'బలము' అనే కర్మేంద్రియము ఏర్పడెను. పిమ్మట చేతులకు అధిష్ఠానమగు ఇంద్రుడు ప్రకటమయ్యెను. ఆ తరువాత పాదములు ఏర్పడెను. వాటినుండి 'గమనము' అనే ఇంద్రియము, దానికి అధిష్ఠానమగు 'విష్ణువు' ప్రకటమయ్యెను. ॥ 58 ॥

శ్లో ॥ నాడ్యోఽస్య నిరభిద్యంత తాభ్యో లోహితమా భృతమ్ ।
నద్యస్తతః సమభవన్నుదరం నిరభిద్యత ॥ 59

టీ:- ఆభృతం జాతమ్. ॥ 59,60 ॥

విరాట్ పురుషునకు 'నాడులు' ప్రకటమయ్యెను. వాటియందు 'రక్తము' పుట్టెను. ఆ రక్తమునుండి నదులు దేవతా రూపములుగ వెల్లడియయ్యెను. ఆ పిమ్మట ఆయనకు ఉదరము ఏర్పడెను. ॥ 59 ॥

శ్లో ॥ క్షుత్పిపాసే తతః స్యాతాం సముద్రస్త్వేతయోరభూత్ ।
అథాస్య హృదయం భిన్నం హృదయాన్మన ఉత్థితమ్ ॥ 60

పిదప విరాట్పురుషునకు ఆకలి దప్పికలు ఏర్పడెను. ఉదరము యొక్క అభిమానదేవతయగు 'సముద్రము' ప్రకటమయ్యెను. పిమ్మట ఆయనకు హృదయము పుట్టి దాని నుండి మనస్సు ఏర్పడెను. 60

శ్లో ॥ మనసశ్చంద్రమా జాతో బుద్ధిర్బుద్ధేర్గిరాం పతిః ।
అహంకారస్తతో రుద్రశ్చిత్తం చైత్త్యస్తతోఽభవత్ ॥ 61 ॥

టీ:- మనస ఇతి. బుద్ధ్యాదిషు హృదయమేవాధిష్ఠానమ్. గిరాం పతిర్బ్రహ్మా. చైత్త్యః క్షేత్రజ్ఞః. ॥ 61 ॥

మనస్సు ఏర్పడిన పిదప మనస్సునకు దేవతయగు చంద్రుడు ప్రకటమయ్యెను. తరువాత హృదయము నుండి బుద్ధి ఏర్పడెను. ఆ బుద్ధి నుండి బుద్ధికి దేవతయగు బ్రహ్మ ప్రకటమయ్యెను. ఆ తరువాత అహంకారము దానికి దేవతయగు రుద్రుడు పుట్టిరి. పిమ్మట 'చిత్తము' ఏర్పడి 'చిత్త' అభిమాన దేవత క్షేత్రజ్ఞుడు ఏర్పడెను. మనస్సు, బుద్ధి చిత్తము, అహంకారమనే వీటికి హృదయమే అధిష్ఠానము. ॥ 61 ॥

శ్లో ॥ ఏతే హ్యభ్యుత్థితా దేవా నైవాస్యోత్థాపనేఽశకన్ ।
పునరావివిశుః ఖాని తముత్థాపయితుం క్రమాత్ ॥ 62 ॥

(ఈ తొమ్మిది శ్లోములతో అన్వయ వ్యతిరేక పద్ధతుల ద్వారా స్పష్టపరచుటకుగాను క్షేత్రజ్ఞుడిలో అన్నింటి ప్రవేశమును మళ్ళీ చెప్పుచున్నాడు.) ఈ దేవతలందరు ప్రకటమైనప్పటికి విరాట్పురుషుని పైకి లేపుటకు సమర్థులు కాలేకపోయిరి. అప్పుడు వారు మరల ఆయనను లేపుటకు తమ తమ స్థానములలో ప్రవేశించిరి. ॥ 62 ॥

శ్లో ॥ వహ్నిర్వాచా ముఖం భేజే నోదతిష్ఠత్తదా విరాట్ ।
ఘ్రాణేన నాసికే వాయుర్నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 63 ॥

టీ:- అన్వయవ్యతిరేకాభ్యాం క్షేత్రజ్ఞం వివేక్తుం సర్వేషాం పునః ప్రవేశమాహ- ఏత ఇత్యాది నవభిః. ॥ 62 - 70 ॥

అగ్ని వాక్కుతో సహా ముఖమునందు ప్రవేశించెను. కాని విరాట్పురుషుడు లేవలేదు. వాయువు ఘ్రాణేంద్రియముతో సహా ముక్కు పుటములందు ప్రవేశించెను. అయిననూ విరాట్ పురుషుడు లేవలేదు. ॥63 ॥

శ్లో ॥ అక్షిణీ చక్షుషాదిత్యో నోదతిష్ఠత్తదా విరాట్ ।
శ్రోత్రేణ కర్ణౌ చ దిశో నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 64

సూర్యుడు చక్షురింద్రియముతో పాటు నేత్రముల లోనికి ప్రవేశించెను. అయిననూ విరాట్పురుషుడు లేవలేదు. దిగ్దేవత శ్రవణేంద్రియమైన చెవులలో ప్రవేశించెను. అప్పుడు కూడా విరాట్పురుషుడు లేవలేదు. ॥ 64 ॥

శ్లో ॥ త్వచం రోమభిరోషధ్యో నోదతిష్ఠత్తదా విరాట్ ।
రేతసా శిశ్నమాపస్తు నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 65 ॥

ఓషధిదేవతలు రోమములతో గూడ చర్మమున(త్వక్కున) ప్రవేశించిరి. కాని విరాట్పురుషుడు లేవలేదు. పిమ్మట జలము వీర్యముతో గూడ మర్మావయవమందు ప్రవేశించెను. అయిననూ విరాట్పురుషుడు లేవలేదు. ॥ 65 ॥

శ్లో ॥ గుదం మృత్యురపానేన నోదతిష్ఠత్తదా విరాట్ ।
విష్ణుర్గత్యైవ చరణౌ నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 66

మృత్యువు అపానవాయువుతో కలిసి గుదమున ప్రవేశించెను. అయిననూ విరాట్పురుషుడు లేవలేదు. విష్ణువు గతిశక్తితో గూడ పాదముల లోనికి ప్రవేశించెను. అయినప్పటికి విరాట్పురుషుడు లేవలేదు. ॥ 66 ॥

శ్లో ॥ హస్తావింద్రో బలేనైవ నోదతిష్ఠత్తదా విరాట్ ।
నాడీర్నద్యో లోహితేన నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 67

ఇంద్రుడు బలముతో రెండు చేతులయందు ప్రవేశించెను. అయిననూ విరాట్పురుషుడు లేవలేదు. నదులన్నియు రక్తములో గూడి నాడులందు ప్రవేశించినవి. అయినను విరాట్పురుషుడు లేవలేదు. 67

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ క్షుత్తృడ్భ్యాముదరం సింధుర్నోదతిష్ఠత్తదా విరాట్ ।
హృదయం మనసా చంద్రో నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 68 ॥

సముద్రము ఆకలి దప్పికలతోగూడి ఉదరము లోనికి ప్రవేశించెను. అయిననూ విరాట్పురుషుడు లేవలేదు. చంద్రుడు మనస్సుతో గూడి హృదయమున ప్రవేశించెను. అయినప్పటికి విరాట్పురుషుడు లేవలేదు. ॥ 68 ॥

శ్లో ॥ బుద్ధ్యా బ్రహ్మాపి హృదయం నోదతిష్ఠత్తదా విరాట్ ।
రుద్రోఽభిమత్యా హృదయం నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 69

బ్రహ్మ బుద్ధితోగూడి హృదయమున ప్రవేశించెను. అయిననూ విరాట్ పురుషుడు లేవలేదు. రుద్రుడు అభిమానముతో గూడ హృదయమున ప్రవేశించెను. అప్పటికిని విరాట్పురుషుడు లేవలేదు. 69

శ్లో ॥ చిత్తేన హృదయం చైత్యః క్షేత్రజ్ఞః ప్రావిశద్యదా ।
విరాట్ తదైవ పురుషః సలిలాదుదతిష్ఠత ॥ 70

చిత్తమున కధిష్ఠాత క్షేత్రజ్ఞుడు అంతర్యామి, ఇతడు చిత్తముతో గూడి హృదయమున ప్రవేశించెను. అప్పుడే విరాట్పురుషుడు నీటి నుండి లేచెను. ॥ 70 ॥

టీ:- చిత్తేనేతి. ఏతేషాం ప్రవేశాన్వయ వ్యతిరేకాభ్యాం క్షేత్రజ్ఞో వివిక్తః ఏవం స్వతస్సేంద్రియాణాం దేవానాముత్థాపనాశక్తిమభిధాయ. 70

శ్లో ॥ యథా ప్రసుప్తం పురుషం ప్రాణేంద్రియమనోధియః ।
ప్రభవంతి వినా యేన నోత్థాపయితుమోజసా ॥ 71 ॥

(విరాడ్దేహము- వ్యష్టి దేహముల సంబంధమును దృష్టాంతము ద్వారా చూపుచు సంఖ్యానుకథనము యొక్క ప్రయోజనమును రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు.) లోకములో (ప్రాణములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగునవి చిత్తమునకు అధిష్ఠాత అయిన

టీ:- విరాడ్దేహస్య వ్యష్టిదేహం దృష్టాంతత్వేన దర్శయన్ సాంఖ్యాను కథనస్య ప్రయోజనమాహ-ద్వాభ్యాం యథేతి. యథా పురుషం పురుషాకారం దేహం. ప్రాణాదయో జడాః సుప్తమవస్థాంతరమాపన్నం. యత్తాదాత్మ్యాధ్యాసమంతరేణ. నోత్తాపయితుం ప్రభవంతి. ॥ 71 ॥

శ్లో ॥ తమస్మిన్ ప్రత్యగాత్మానం ధియా యోగప్రవృత్తయా ।
భక్త్యా విరక్త్యా జ్ఞానేన వివిచ్యాత్మని చింతయేత్ ॥ 72

టీ:- ప్రథమం పరమేశ్వరే భక్తిః. తతోఽన్యత్ర విరక్తిః. తతో యోగ ప్రవృత్తాధీరేకాగ్ర చిత్తం. తతో యత్ జ్ఞానం తేన ప్రత్యగాత్మానం క్షేత్రజ్ఞం. అస్మిన్నాత్మని కార్యకారణసంఘాతే వివిచ్య చింతయేత్. 72

శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
కపిలోపాఖ్యానే తత్త్వసమామ్నాయే
షడ్వింశతితమోఽధ్యాయః

క్షేత్రజ్ఞుడి యొక్క సహాయము లేకుండా నిద్రపోతున్న మనిషిని లేపజాలవు. అట్లే క్షేత్రజ్ఞుడైన పరమాత్మ లేకుండా విరాట్ పురుషుని ఆ యా దేవతలు లేపలేకపోయిరి. ॥ 71 ॥

ముందుగా మానవుడు పరమేశ్వరుని యందు భక్తిని చేయవలెను. తరువాత భగవంతుని కన్నా ఇతరమైన సంసారాదుల యందు విరక్తిని కలిగియుండవలెను. ఆ తరువాత యోగముచేత బుద్ధిని ఏకాగ్రపరచ వలెను. ఆ ఏకాగ్రబుద్ధితో లభించిన జ్ఞానము ద్వారా ఈ శరీరమునందే ప్రత్యగాత్మరూపములోనున్న క్షేత్రజ్ఞుడిని కార్యకారణ వివేచన ద్వారా (పరమేశ్వరుడిని) తెలిసికొనవలెను. 72

అని శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఇరువది ఆరవ అధ్యాయము సమాప్తము

సప్తవింశోஉధ్యాయః

శ్లో॥ సప్తవింశే తతస్సమ్యక్ బహుసాధన యోగతః ।
పుం ప్రకృత్యోర్వివేకేన మోక్షరీతిర్నిరూప్యతే ॥

శ్రీభగవానుచ

శ్లో॥ ప్రకృతిస్థోஉపి పురుషో నాజ్యతే ప్రాకృతైర్గుణైః ।
అవికారాదకర్తృత్వాన్నిర్గుణత్వాజ్జలార్కవత్ ॥ 1

టీ:- వివేకజ్ఞానేన మోక్షముపపాదయితుం, శుద్ధస్యైవ పురుషస్య పూర్వోక్తం ప్రకృత్యవివేకతః. సంసారమనుస్మారయతి త్రిభిః-ప్రకృతిస్థ ఇతి. ప్రకృతిస్థోஉపి దేహస్థోஉపి. నాజ్యతే న లిప్యతే. ప్రాకృతైర్గుణైః తత్కృతైః సుఖదుఃఖాదిభిః నిర్గుణత్వాదకర్తృత్వం. తతః అవికారిత్వం. 1

శ్లో॥ స ఏష యర్హి ప్రకృతేర్గుణేష్వభి విషజ్జతే ।
అహంకార విమూఢాత్మా కర్తాస్మీత్యభిమన్యతే ॥ 2

టీ:- తర్హి కథమస్మిన్ కర్తృత్వాది ప్రతీతిస్తత్రాహ - స ఇతి. ప్రకృతేరవిద్యాయాః. గుణేషు సత్త్వాదిషు యదా హి విషజ్జతే. తాదాత్మ్యాధ్యాస నూప్నోతి. తదా అహంకారేణ తత్కార్యేణ. విమూఢాత్మా కర్తృత్వ

27 వ అధ్యాయము

ఈ ఇరువది ఏడవ అధ్యాయములో అనేక సమ్యక్ సాధనల చేత యోగముచేత ప్రకృతి పురుష వివేకమువలన మోక్షము లభించునని నిరూపించడమైనది.

శ్రీ కపిల భగవానుడిట్లు పలికెను

ఓ తల్లీ! నీటిలో ప్రతిబింబించే సూర్యుడికి ఆ నీటి యొక్క చల్లదనము, చంచలత్వము మొదలగు వాటిలో సంబంధముండదు. అట్లే ప్రకృతికార్యమైన ఈ దేహములో ఉన్నప్పటికి పురుషుడికి ప్రకృతి గుణములతో సంబంధము లేదు. పురుషుడు తన యొక్క నిర్గుణత్వము వలన (అకర్తృత్వము వలన), అవికారత్వము వలన ప్రకృతి లక్షణములైన సుఖ దుఃఖాదులతో గాని, పుణ్య పాపములతో గాని లేపనము (సంబంధము) పొందదు. ॥ 1 ॥

(కర్తృత్వమును పొందే విధమును చెప్పుచున్నాడు)ఎప్పుడైతే ప్రకృతి యొక్క అవిద్యా గుణములైన సత్త్వాదుల వలన మోహింపబడిన బుద్ధిగలవాడై, అహంకారము చేత దాని కార్యములందు ఆసక్తి గలవాడై కర్తృత్వమును తనయందు ఆరోపించుకొనునో అప్పుడు లోహిత కాంతి స్ఫటికము నందు (ఉపాధి) భాసించునట్లు, విమూఢాత్ముడు కర్తృత్వ ప్రతీతిని ('నేను కర్తను' అనే అభిమానమును) పొందును. 2

మాత్మన్యారోపయతి. తత్రానాదిరాత్మన్యవిద్యా ధ్యాసః. అహమధ్యాసస్తు ఆధునికః కర్తృత్వాధ్యాసస్తు స్ఫటిక లౌహిత్యవత్సోపాధిక ఇతి. 2

శ్లో ॥ తేన సంసార పదవీమదశోఽభ్యేత్య నిర్వృతః ।
ప్రాసంగికైః కర్మదోషైః సదసన్మిశ్ర యోనిషు ॥ 3

టీ:- తేనేతి. అనిర్వృతస్సన్. ప్రాసంగికైః ప్రకృతి సంగకృతైః. కర్మభిర్ధర్మాధర్మైఃదోషైశ్చ రాగద్వేషాధిభిః. సదసన్మిశ్రయోనిషు దేవతిర్యఙ్నరాదిషు. సంసారపదవీం ప్రాప్నోతి. ॥ 3 ॥

శ్లో ॥ అర్థేహ్యవిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ।
ధ్యాయతో విషయానస్య స్వప్నేఽనర్థాగమో యథా ॥ 4

టీ:- నను తర్హి వాస్తవత్వాత్సంసృతేః కిం తన్నివృత్తిప్రయాసేన తత్రాహ-అర్థ ఇతి. సంసృతిరూపే అర్థే. వస్తుతః అవిద్యమానేఽపి. సంసృతిః ప్రతిభాసమాన జ్ఞానం వినా. స్వత ఏవ నివర్తతే. అవిద్యాది దోషబలేన విషయానుధ్యాయిత్వాదిత్యర్థః. ॥ 4 ॥

'నేను కర్తను' అనే ఈ అభిమానము కారణముగా, ప్రకృతి సంబంధమైన దేహము మొదలగు వాటిచేత చేయబడిన ధర్మాధర్మ కర్మలు, రాగద్వేషాదులవలన పుణ్య పాప రూపములగు ఫలములకు భోక్తయగును. ఆ పుణ్య పాపముల కర్మల దోషముల వలన సుఖమును కోల్పోవును. ఉత్తమాధమములైన దేవ, మానవ, పశు, పక్ష్యాది జన్మలు పొంది సంసార చక్రములో పరిభ్రమించును. ॥ 3 ॥

స్వప్నమునందు భయశోకాదులను మనమనుభవిస్తున్నాము. నిజానికి ఆ భయశోకాదులు సత్యము కాదు. విషయములను చింతించు జీవుడు దానియందు ఆసక్తుడై యుండును. అవాస్తవమైన వస్తువు లన్నియు అవిద్యా కారణంగా వాస్తవములే అని తోచును. భ్రమ కల్పించును. జనన మరణాదులు మిథ్యయైనను అవిద్య కారణము వలన వాటియందు జీవుడు తిరుగాడుట తప్పడంలేదు. ॥ 4 ॥

శ్లో ॥ అత ఏవ శనైశ్చిత్తం ప్రసక్తమసతాం పథి ।
భక్తియోగేన తీవ్రేణ విరక్త్యా చ నయేద్వశమ్ ॥ 5 ॥

టీ:- యతో విషయాధ్యాసోఽనర్థహేతుః. అతో మనో నియంతవ్య మిత్యాహ - అతఏవేతి. అసతామింద్రియానాం పథి విషయ మార్గే తీవ్రేణ దృఢేన. విరక్త్యా చ తీవ్రయా. ॥ 5 ॥

(విషయములను ధ్యానించుట అనర్థహేతువైనందువలన మనస్సునే నియంత్రించవలెనని చెప్పుచున్నాడు.) ఇంద్రియముల మార్గము దుష్టమైనది. విషయములయందు గట్టిగా చిక్కుకున్న మనస్సును భక్తియోగముచేతను, తీవ్ర వైరాగ్యముచేతను నెమ్మదిగా వశము లోనికి తెచ్చుకొనవలెను. ॥ 5 ॥

శ్లో ॥ యమాదిభిర్యోగమార్గైరభ్యసన్ శ్రద్ధయాన్వితః ।
మయి భావేన సత్యేన మత్కథా శ్రవణేన చ ॥ 6

టీ:- భక్తి విరక్త్యోః తీవ్రత్వే కారణాని వర్ణయన్ జ్ఞానేన మోక్ష ప్రకారమాహ -షడ్భిః. యమాదిభిరితి. యమాదిభిర్యోగమార్గైః చిత్త మభ్యసన్ పునః పునరేకాగ్రీకుర్వన్ ఆత్మానముపలభ్య సర్వానుస్యూత మద్వయం పరమాత్మానం ప్రతిపద్యత ఇతి షష్ఠేనాన్వయః. సత్యేన నిష్కపటేన. భావేన ప్రేమ్ణా. ॥ 6 ॥

తీవ్రమైన భక్తివిరక్తులే జ్ఞానసిద్ధికి కారణములని వర్ణిస్తూ జ్ఞానముచేత మోక్షమును పొందే ప్రకారమును ఈ ఆరు శ్లోకములతో వర్ణించుచున్నాడు. యమాది యోగమార్గముల ద్వారా చిత్తస్వాధీన - మును అభ్యసిస్తూ మళ్ళీ మళ్ళీ మనస్సును ఏకాగ్రపరచవలెను. అప్పుడు అన్నింటిలో నిండియున్న అద్వయమైన 'పరమాత్మ'ను (ప్రతిపద్యత) దర్శించును అని ఆరవశ్లోకముతో అన్వయము. సాధకుడు శ్రద్ధా పూర్వకముగా యమాది యోగసాధనలను చేస్తూ, నా యందు నిష్కపట మైన ప్రేమ కలిగియుండుట చేత, నా గాథలను వినుటచేత పరిపూర్ణుడనగు నన్ను పొందును. ॥ 6 ॥

శ్లో ॥ సర్వభూతసమత్వేన నిర్వైరేణాప్రసంగతః ।
బ్రహ్మచర్యేణ మౌనేన స్వధర్మేణ బలీయసా ॥ 7 ॥

సాధకుడు సర్వభూతములయందు సమదృష్టి కలిగియుండ- వలెను. వైరభావమును తొలగించు కొనవలెను. సంసారమునందలి

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- సర్వేతి. అప్రసంగతః సంగత్యాగేన. బలీయసా ఈశ్వరార్పితేన. ॥7॥

సంగమును త్యజించ వలెను. బ్రహ్మచర్యమును పాటించవలెను. గృహస్థుడైనచో ధార్మికమైన ఏకపత్నీవ్రతమును పాటించవలెను. బ్రహ్మభావమును మననము చేయుచున్నవాడై యుండవలెను. మితభాషియై, స్వధర్మమును, (ఈశ్వరార్పితము చేసర్తా) అనుష్ఠించవలెను. ఈ విధముగా ప్రవర్తించుట చేత పరిపూర్ణుడనగు నన్ను పొందును. ॥ 7 ॥

శ్లో ॥ యదృచ్ఛయోపలబ్ధేన సంతుష్టో మితభుఙ్మునిః ।
వివిక్తశరణః శాంతో మైత్రః కరుణ ఆత్మవాన్ ॥ 8

టీ:- యదృచ్ఛయేతి. వివిక్తశరణః ఏకాంతవాసీ. ॥ 8 ॥

సాధకుడు ప్రారబ్ధ వశముగా లభించిన దానితో సంతోషముగా నుండవలెను. మితముగా భుజించవలెను. మననశీలుడైయుండ వలెను. ఏకాంతముగా నివసించవలెను. స్నేహశీలత కలిగియుండ వలెను. దయగలవాడై యుండవలెను. ధీరుడైయుండవలెను. ఇట్లుండుట చేత పరిపూర్ణుడగు నన్ను పొందును. ॥ 8 ॥

శ్లో ॥ సానుబంధే చ దేహేఽస్మిన్నకుర్వన్నసదాగ్రహమ్ ।
జ్ఞానేన దృష్టతత్త్వేన ప్రకృతేః పురుషస్య చ ॥ 9 ॥

టీ:-- సానుబంధఇతి. అసదాగ్రహం అహంమమతాం. ప్రకృతేః పురుషస్య చ దృష్టం తత్త్వం యేన తేన జ్ఞానేన. ॥ 9 ॥

ప్రకృతి పురుషుల వాస్తవిక స్వరూపమును అనుభవమునకు తెచ్చుకున్న కారణముగా స్త్రీ (ప్రకృతి) పురుషాదుల యందుగాని, ఈ దేహమునందుగాని, 'నేను-నాది' అనెడి మిథ్యాభినివేశము (అసత్యమైన అభిమానము) చేయడు. ॥ 9 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ నివృత్తబుద్ధ్యవస్థానో దూరీభూతాన్యదర్శనః ।
ఉపలభ్యాత్మనాత్మానం చక్షుషేవార్కమాత్మదృక్ ॥ 10

టీ:- నివృత్తేతి. నివృత్తాని బుద్ధ్యవస్థానాని జాగ్రదాదీని యస్య సః. అత ఏవ దూరీభూతం అన్య దర్శనం యస్య సః. ఆత్మనా అహంకారావచ్ఛిన్నేన ఆత్మానం శుద్ధముపలభ్య. ఏకస్యైవావచ్ఛేదానవచ్ఛేదాభ్యాం కరణకర్మత్వే చ దృష్టాంతమాహ-చక్షుషా చక్షురవచిఛన్నేన. అర్కేణ. గగనస్థమర్కమివ. ఏవమాత్మదృక్ శుద్ధమాత్మానం పశ్యన్. ॥ 10 ॥

సాధకుడు జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే అవస్థలు బుద్ధివే కాని ఆత్మకు సంబంధములేదని తెలిసికొనును. పరమాత్మకంటె ఇతరమైనదేదీ లేదని తెలిసికొనును. సూర్యుడు కంటికి అధిష్ఠానదేవత. అయినప్పటికిని ఆ కంటితోనే సూర్యుని చూచుచున్నాడు. అట్లే సర్వాంతర్యామియైన పరమాత్మచే చైతన్యము నొందిన శుద్ధాంతఃకరణముతో ఆ పరమాత్మను పొందుచున్నాడు. ఆత్మనిష్ఠగల వాడగుచున్నాడు. ॥10॥

శ్లో ॥ ముక్తలింగం సదాభాసమసతి ప్రతిపద్యతే ।
సతో బంధుమసచ్చక్షుః సర్వానుస్యూతమద్వయమ్ ॥ 11

టీ:- ముక్తలింగమితి. ముక్తలింగం నిరుపాధికం అసతిమిథ్యాభూతే అహంకారే సదాభాసం సద్రూపేణావభాసమానం బ్రహ్మ ప్రాప్నోతి. శుద్ధస్య జీవ స్వరూపాద్విశేషమాహ-సతః కారణస్య ప్రధానస్య బంధుమధిష్ఠానం అసతః కార్యస్య చక్షురివ ప్రకాశం. సర్వేషు కార్యేషు కారణేషు చానుస్యూతం. అద్వయం పరిపూర్ణమ్. ॥ 11 ॥

ఈ జీవుడు నిరుపాధికము, సద్రూపము అయిన సర్వాంతర్యామి యొక్క లింగస్వరూపము. (జీవుడు, సర్వాంతర్యామియైన సత్ చిత్ ఆనందములోని 'సత్' యొక్క ప్రతిఫలనమే) తన ఉపాధిని వదలిన జీవుడు 'సత్' కంటె భిన్నుడు కాడు. మిథ్యాభూతమైన ఈ జగత్తున అంతటా వ్యాపించునది, అన్నింటినీ ప్రకాశింపజేయునది పరిపూర్ణ పరబ్రహ్మమే. 11

శ్లో ॥ యథా జలస్థ ఆభాసః స్థలస్థేనావదృశ్యతే ।
స్వాభాసేన యథా సూర్యో జలస్థేన దివి స్థితః ॥ 12

టీ:- అహంకారోపహితేన శుద్ధబ్రహ్మ ప్రతిపత్తిం సదృష్టాంతమాహ- యథేతి. జలే స్థితః ఆభాసః సూర్య ప్రతిబింబః. యథా గృహాంతర్వర్తిభిత్తౌ స్ఫురతి. తథా గృహకోణస్థితైః పురుషైః భిత్త్యాదౌ స్థలే స్థితేన స్వాభాసేన సూర్య ప్రతిబింబేన యథా ప్రథమం జలస్థ ఆభాసోఽవదృశ్యతే లక్ష్యతేవ గగనస్థస్య గృహమధ్యే ప్రతిబింబాయోగాత్. చార్థే తథా శబ్దః. యథా చేత్యర్థః. యథా చ జలస్థితత్వేన. దివిస్థితస్సూర్యో లక్ష్యతే. 12

శ్లో ॥ ఏవం త్రివృదహంకారో భూతేంద్రియమనోమయైః ।
స్వాభాసైర్లక్షితోఽనేన సదాభాసేన సత్యదృక్ ॥ 13

టీ:- ఏవమితి.ఏవం భూతేంద్రియ మనోమయైః. దేహేంద్రియ మనోభిరవిచ్ఛిన్నైః స్వాభాసైరాత్మప్రతిబింబైః త్రివృత్త్రిగుణోఽహంకారఃసతః బ్రహ్మణః ఆభాసో యస్మిన్ తేన రూపేణ లక్షితః. అహంకార స్థాభాసం వినా విషయాభాసానుత్పత్తేః. అనేన చాహంకారేణ సదా భాసవతా సత్యదృక్ పరమాత్మజ్ఞప్తిరూప ఆత్మా లక్షిత ఇత్యర్థః. 13

నీటియందు ప్రకాశిస్తున్న సూర్యుని కాంతి ప్రతిఫలించి, ఇంటి గోడపై పడును. దానిని చూచిన మనిషి గోడపై ప్రకాశిస్తున్న కాంతికి నీటిలోని సూర్యుడు కారణమని గ్రహించును. నీటిలోని సూర్యుడికి ఆకాశము నందలి సూర్యుడు కారణమని గ్రహించగల్గును. అట్లే దేహము ఇంద్రియములు అంతఃకరణమునందు చైతన్యము కనిపించు -చున్నది. ఈ చైతన్యమునకు కారణము త్రిగుణాత్మకము, అహంకార యుక్తము అగు 'జీవుడు' కారణమని తోచును. పరిశీలించి, విచారించి చూడగా 'జీవుని' చైతన్యశక్తికి కారణము అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమే కారణమని దర్శించును. తాను ఆ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపమని తెలిసికొనును. ॥ 12,13 ॥

 

శ్లో ॥ భూతసూక్ష్మేంద్రియ మనోబుద్ధ్యాదిష్విహ నిద్రయా ।
లీనేష్వసత్సు యస్తత్ర వినిద్రో నిరహంక్రియః ॥ 14

టీ:- ఇదానీం సుషుప్తి సాక్షిత్వేన శుద్ధాత్మప్రతిపత్తి మనుభవతో దర్శయతి – త్రిభిః. భూతేతి. భూతాదిషు అసతి అసత్తుల్యే అవ్యాకృతే నిద్రయా విలీనేషు సత్సు యస్తత్ర తదా వినిద్రో నిరహంక్రియః తమాత్మానం ప్రతిపద్యత ఇతి తృతీయేనాన్వయః. ॥ 14 ॥

(ఈ మూడు శ్లోకములలో సుషుప్తి అవస్థ సాక్షిగా శుద్ధాత్మ ప్రతిపత్తిగ అనుభవమునుచూపుచున్నాడు.) నిద్రావస్థలో సూక్ష్మ భూతములు (తన్మాత్రలు) ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదల గునవి అసత్ ప్రకృతి (అవ్యాకృతము) యందు విలీనమగును. కాని ఆత్మ చైతన్యము నిద్రింపదు. ఆ ఆత్మచైతన్యము అహంకార శూన్యా వస్థను ప్రకాశింపజేయును. మూడవ శ్లోకములోని 'ప్రతిపద్యతే' (తెలియుచున్నాడు) అనే క్రియా పదముతో అన్వయము. ॥ 14 ॥

శ్లో ॥ మన్యమానస్తదాత్మానమనష్టో నష్టవన్మృషా ।
నష్టేఽహంకరణే ద్రష్టా నష్టవిత్త ఇవాతురః ॥ 15

టీ:- నను యది తదా వినిద్రోఽసావస్తి తర్హి జాగ్రత్స్వప్నయోరివ స్ఫుటః కిన్నావభాసతే తత్రాహ – మన్యమాన ఇతి. పూర్వం స ద్రష్టా అతో ద్రష్టృత్వేన. సవికల్పకతయా స్ఫుటం ప్రతీతిః. సుషుప్తౌ తు. భూతాదేరహంకారవిషయస్య లీనత్వాత్ తద్విషయేఽహంకారే నష్టే సతి స్వయమనష్టోపి మృషైవాత్మానం నష్టవన్మన్యమానో యః. అన్యనాశే అన్యస్య నష్టతుల్యత్వే దృష్టాంతః. నష్ట విత్తో యథా ఆతురో వివశః. నష్టవద్భవతీత్యర్థః. ॥ 15 ॥

(జాగ్రత్ స్వప్నముల యందు ఆత్మచైతన్యము స్పష్టముగా కనిపించుచున్నది. సుషుప్తియందు ఎందుకు కనిపించుట లేదో చెప్పుచున్నాడు.) ఆత్మ జాగ్రదవస్థయందు సర్వమునకు ద్రష్టవలె భాసించును. సుషుప్తిలో దేహములోని పంచభూతములు లీనము కావడముచేత తన ఉపాధిభూతమైన అహంకారము నశింపగా తానే నష్టమైనట్లు తలచి మిక్కిలి వ్యథచెందును. ధనమును కోల్పోయిన వ్యక్తి తానే నశించినట్లు బాధపడును. అట్లే జీవుడు సుషుప్తిలో తన ఉనికిని కోల్పోయినట్లు తలచును. ॥ 15 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ ఏవం ప్రత్యవమృశ్యాసావాత్మానం ప్రతిపద్యతే ।
సాహంకారస్య ద్రవ్యస్య యోఽవస్థానమనుగ్రహః ॥ 16

టీ:- నను సుషుప్తావపి కించిదనుభూయతే, మైవం సుఖమహమ స్వాప్సం. న కించిదవేదిషమితి. విశేషజ్ఞానం వినా కేవలస్వాత్మనః ప్రతిసంధానాదిత్యాహ-ఏవమితి. నను ప్రతిసంధానే సాహంకారస్య ప్రతీతేః తత్రాహ-కథం నిరహంక్రియత్వం. సాహంకారస్య ద్రవ్యస్య కార్యకారణసంఘాతస్య. అనుగ్రహః ప్రకాశః. అవస్థానమధిష్ఠానం. ద్రవ్యవిశేషణతయా అహంకారస్యాపి దృశ్యత్వాత్. తద్ద్రష్టా ఆత్మా. తద్వ్యతిరిక్తః. పరమాత్మానమిత్యన్వయః. ॥ 16 ॥

(సుషుప్తియందు ఏమియు తెలియకుండును. "సుఖముగా నిద్రించితిని. నాకేమియు తెలియలేదు". అనే విశేష జ్ఞానము మాత్రమే కలిగియుండును. ఈ శ్లోకములో కేవలము ఆత్మయొక్క ప్రతి సంధానమును చెప్పుచున్నాడు). దేహము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అహంకారము అనేవి ఆత్మచైతన్యము వలననే ప్రకాశము పొందుచున్నవి. వివేకి అయినవాడు బాగా విమర్శ చేసి ఆ పరమాత్మను పొందును. ॥ 16 ॥

దేవహూతిరువాచ

శ్లో ॥ పురుషం ప్రకృతిర్బ్రహ్మన్న విముంచతి కర్హిచిత్ ।
అన్యోన్యాపాశ్రయత్వాచ్చ నిత్యత్వాదనయోః ప్రభో ॥ 17

టీ:- భక్తివిరక్తిభ్యాం సత్యపి వివేకే ప్రకృతి పురుషయోః పరస్పర-త్యాగాభావాత్కథం ముక్తిరితి పృచ్ఛతి చతుర్భిః పురుషమితి. పురుష-వ్యతిరేకేణ. ప్రకృతేః స్వరూపలాభాభావాత్ ప్రకృతి వ్యతిరేకేణ పురుషస్యాభివ్యక్త్యభావాదిత్యన్యోన్యాపాశ్రయత్వాన్నిత్యత్వాచ్చ పురుషం ప్రకృతిః కదాచిన్న విముంచతీత్యర్థః. ॥ 17 ॥

దేవహూతి ఇట్లు పలికెను.

(ఈ నాలుగు శ్లోకములలో భక్తి విరక్తులున్నప్పటికీ ప్రకృతి పురుషులయొక్క పరస్పరత్యాగము లేకున్న ఎడల ముక్తి ఎట్లు కలుగునని ప్రశ్నించుచున్నది.) ఓ ప్రభూ! ఈ ప్రకృతి పురుషులు ఒకదానినొకటి ఆశ్రయించి ఉండేవి. ఇవి నిత్యములైనవి. అందువలన ఈ ప్రకృతి పురుషుని ఎప్పుడును విడిచియుండదు. ॥ 17 ॥

శ్లో ॥ యథా గంధస్య భూమేశ్చ న భావో వ్యతిరేకతః ।
అపాం రసస్య చ యథా తథా బుద్ధేః పరస్య చ ॥ 18

టీ:- వ్యతిరేకాభావమాత్రే దృష్టాంతః యథేతి. యథా వ్యతిరేకతో భావః సత్తా నాస్తి. గంధస్య కదాచిదపక్షయ దర్శనాద్దృష్టాంతాంతరమాహ - అపామితి. బుద్ధేః ప్రకృతేః పరస్య పురుషస్య చ. ॥ 18 ॥

(విడివిడిగా నుండ జాలవనుటకు దృష్టాంతము).

భూమి, గంధము విడివిడిగా నుండజాలవు. నీరు, రసము అనువాటికి విడివిడిగా ఉనికి లేదు. అట్లే బుద్ధి, పురుషుడు(ప్రకృతి పురుషులు) ఒక దానిని విడిచి మరియొకటి ఉండజాలవు. విడివిడిగా సత్తాలేదు. ॥ 18 ॥

శ్లో ॥ అకర్తుః కర్మబంధోఽయం పురుషస్య యదాశ్రయః ।
గుణేషు సత్సు ప్రకృతేః కైవల్యం తేష్వతః కథమ్ ॥ 19

టీ:- తతః కిమత ఆహ - అకర్తురితి. యే గుణా ఆశ్రయో యస్య సః. తేషు ప్రకృతేర్గుణేషు సత్సు పురుషస్య కైవల్యం కథం. ॥ 19 ॥

పురుషుడు అకర్త. అయినప్పటికి ప్రకృతిగుణముల యందు తాదాత్మ్యము చేత పురుషునకు కర్మబంధము కలుగుచున్నది. అలాంటి ప్రకృతి గుణములైన సత్త్వరజస్తమోగుణములు స్థిరమైయుండగా పురుషునకు కేవలభావము (కైవల్యము) ఎట్లు సంభవమగును.॥19॥

శ్లో ॥ క్వచిత్తత్త్వావమర్శేన నివృత్తం భయముల్బణమ్ ।
అనివృత్త నిమిత్తత్వాత్పునః ప్రత్యవతిష్ఠతే ॥ 20

టీ:- అత ఏవ క్వచిన్నివృత్తప్రాయస్యాపి సంసార భయస్య పునరుద్భవో దృశ్యత ఇత్యాహ - క్వచిదితి. 20

(అందుకే సంసారభయము తొలగినట్లనిపించినను మళ్ళీ సంభవమగునని చెప్పుట.) ఒకప్పుడు పురుషునకు తత్త్వ విమర్శచేత అత్యుగ్రమగు సంసారభయము తొలగినను, దానికి కారణములు తొలగక పోవుట వలన మళ్ళీ అదే సంసారభయము సంప్రాప్తమగును. ॥20॥

శ్రీభగవానువాచ

శ్లో ॥ అనిమిత్తనిమిత్తేన స్వధర్మేణామలాత్మనా ।
తీవ్రయా మయి భక్త్యా చ శ్రుతసంభృతయా చిరమ్ ॥ 21

టీ:- ప్రకృతి సంబంధమాత్రం బంధ హేతుః కింతు గుణ బుద్ధ్యా తదాసక్తిః తన్నివృత్తౌ చ సత్యాం మోక్షో ఘటతే. క్వచిదుద్భిదవస్తు సాధనవైకల్యాదిత్యభిప్రేత్య సాధనాతిశయం కథయన్ పరిహరతి త్రిభిః - అనిమిత్తేతి. నిమిత్తం ఫలం. తన్నిమిత్తం ప్రవర్తకం యస్మిన్ తన్నాస్తి తేన నిష్కామేణ స్వధర్మేణ, అమలాత్మనా నిర్మలేన మనసా. శ్రుతేన కథా శ్రవణేన. సంభృతయా పుష్టయా. 21

శ్లో ॥ జ్ఞానేన దృష్టతత్త్వేన వైరాగ్యేణ బలీయసా ।
తపోయుక్తేన యోగేన తీవ్రేణాత్మసమాధినా ॥ 22

శ్లో ॥ ప్రకృతిః పురుషస్యేహ దహ్యమానా త్వహర్నిశమ్ ।
తిరోభవిత్రీ శనకైరగ్నేర్యోనిరివారణిః ॥ 23

టీ:- ప్రకృతిరితి. దమ్యమానా అభిభూయమానా తిరోహితా భవతి. ॥22,23॥

శ్రీభగవానుడు ఇట్లు పలికెను.

(ఒకప్పుడు సాధనలో సంభవించే లోపములను తొలగింపగోరి సాధన యొక్క అతిశయమును చెప్పుచున్నాడు.) నిర్మలమైన మనస్సుతో, ఫలాపేక్ష రహితముగా స్వధర్మమునాచరింపవలెను. నా యందు తీవ్రమైన భక్తి కలిగియుండవలెను. చిరకాలము నా కథలను వినవలెను. ప్రకృతి పురుషుల యథార్థ స్వరూపమును విచారణ చేత తెలిసికొనవలెను. తీవ్రమైన వైరాగ్యము కలిగి యుండవలెను. వ్రత నియమములను పాటించవలెను. నిరంతర ధ్యానాభ్యాసము చేయవలెను. చిత్తైకాగ్రత కలిగి యుండవలెను. ఈ రకమైన సాధనచేత ఈ జన్మలోనే అవిద్య మెల్లమెల్లగా మాయమగును. కట్టె యందలి అగ్ని క్రమముగా కట్టెను దహించినట్లు పురుషుడిన ఆశ్రయించి ఉన్న ప్రకృతి(అవిద్య) క్రమముగా నశించును. ॥ 21-23 ॥

శ్లో ॥ భుక్తభోగా పరిత్యక్తా దృష్టదోషా చ నిత్యశః ।
నేశ్వరస్యాశుభం దత్తే స్వే మహిమ్ని స్థితస్య చ ॥ 24

టీ:- ఏవం చ సతి పునరుద్భవోనాస్తీత్యాహ - భుక్తేతి. భుక్తో భోగో యస్యాః. నిత్యశః సదా దృష్టో దోషో యస్యాః. అత ఏవ పరిత్యక్తా సతీశ్వరస్యాపరతంత్రస్య స్వే మహిమ్ని స్థితస్య స్వానందం ప్రాప్తస్య. 24

శ్లో ॥ యథా హ్యప్రతిబుద్ధస్య ప్రస్వాపో బహ్వనర్థభృత్ ।
స ఏవ ప్రతిబుద్ధస్య న వై మోహాయ కల్పతే ॥ 25

టీ:- అవివేకావస్థాయాం అనర్థహేతురపి వివేకానంతరం న భవతీతి సదృష్టాంతమాహ-ద్వాభ్యాం యథేతి. ప్రస్వాపః స్వప్నః. బహూన - నర్థాన్ బిభర్తి పుష్ణాతీతి తథా. ప్రతిబుద్ధస్య సంస్కారవశేన స్ఫురన్నపి. 25

శ్లో ॥ ఏవం విదితతత్త్వస్య ప్రకృతిర్మయి మానసమ్ ।
యుంజతో నాపకురుత ఆత్మారామస్య కర్హిచిత్ ॥ 26

(ఇట్లుండగా మళ్ళీ ఉద్భవించుట లేదని చెప్పుచున్నాడు). భోగములననుభవించిన పురుషుడు ఆ భోగముల యందలి(ప్రకృతి యందలి) దోషములను ఎల్లప్పుడూ దర్శించును. ఆ ప్రకృతి యందు లీనము కాకుండా యుండును. స్వతంత్రుడు, బంధముక్తుడు అయిన ఆ పురుషునికి ఈశ్వరతంత్రమైన అనగా ఈశ్వరాజ్ఞానువర్తియైన ప్రకృతి ఏ రకమైన అశుభమును కలిగించజాలదు. సంసారము నందు పడవేయజాలదని అర్థము. ॥ 24 ॥

(అవివేకావస్థలోనున్న అనర్థహేతువు, వివేకము కలిగిన పిమ్మట యుండదని దృష్టాంతపూర్వకముగా ఈ రెండు శ్లోకములతో చెప్పు చున్నాడు.) కలగనుచున్న వానికి ఆ కలలో చోర, వ్యాఘ్ర, సర్పాదుల వలని అనర్థములు ఏర్పడును. అనేకములగు ఆపదలు కలిగి భయము దుఃఖము కలుగును. ఆ వ్యక్తి నిద్రలేచిన పిదప కల యందలి అనర్థము లకు దుఃఖపడడు, మోహము చెందదు. మిథ్యగా భావించును. అదే విధముగా అవివేక దశలో ఉన్న అనర్థ హేతువులు, వివేకము కలిగిన తరువాత ఉండవు.॥25 ॥

ఈ ప్రకారముగా ఎవరైతే ప్రకృతిపురుషుల స్వరూపమును తెలిసి, తత్త్వజ్ఞానమును పొంది నిరంతరము నాయందే మనస్సును

టీ:- ఏవమితి. విదితం తత్త్వం యేన. తస్య ప్రకృతిర్నాపకురుతే అపకారం న కరోతి. ॥ 26 ॥

శ్లో ॥ యద్దైవమధ్యాత్మరతః కాలేన బహుజన్మనా ।
సర్వత్ర జాత వైరాగ్య ఆబ్రహ్మ భువనాన్మునిః ॥ 27

టీ:- ఉపసంహరతి త్రిభిః - యథేతి. బహూని జన్మాని యస్మిన్ కాలే, తేన కాలేన ॥ 27 ॥

శ్లో ॥ మద్భక్తః ప్రతిబుద్ధార్థో మత్ప్రసాదేన భూయసా ।
నిఃశ్రేయసం స్వసంస్థానం కైవల్యాఖ్యం మదాశ్రయమ్ ॥ 28

టీ:- మద్భక్త ఇతి. ప్రతిబుద్ధార్థః విదితాత్మతత్త్వః. కైవల్యాఖ్యం స్వసంస్థానం దేహాదివ్యతిరిక్తం స్వరూపం మదాశ్రయం నిశ్శ్రేయసం నిరతిశయానందమ్. ॥ 28 ॥

శ్లో ॥ ప్రాప్నోతీ హాంజసా ధీరః స్వదృశా చ్ఛిన్నసంశయః ।
యద్గత్వా న నివర్తేత యోగీ లింగాద్వినిర్గమే ॥ 29

నిలుపుతారో, అట్టి ఆత్మారామునికి (తనయందు తాను రమించువానిని) ప్రకృతి ఏమియు అపకారము చేయజాలదు. ॥ 26 ॥

(ఈ మూడు శ్లోకముల ద్వారా విషయమును ఉపసంహరించు చున్నాడు). ఈ రకముగా మనుష్యుడు అనేక జన్మలలో, చాలాకాలము వరకు మననశీలుడై ఆత్మనిష్ఠగల వాడుగా ఉండవలెను. అప్పుడు ఆ మునికి బ్రహ్మలోక పర్యంతము గల అన్ని రకముల భోగముల యందు వైరాగ్యము ఏర్పడును. ॥ 27 ॥

ధైర్యవంతుడైన నా భక్తుడు నా యొక్క గొప్పకృపచేత తత్త్వ జ్ఞానమును పొందుతాడు ఆత్మానుభవము ద్వారా సమస్త సంశయములు తొలగినవాడౌతాడు. మరియు లింగదేహము తొలగగా, కేవలము నన్నాశ్రయించినవాడగుటచే తన స్వ స్వరూపమైన 'కైవల్యము' అనే పేరు గల నిరతిశయానందదాయకమైన పదమును (నిశ్శ్రేయసమును) సహజముగానే పొందుతాడు. ఆతడు ఆ పదమును చేరి తిరిగిరాడు. (తిరిగి జన్మించదు) ॥ 28,29 ॥

టీ:- ప్రాప్నోతీతి. స్వదృశా ఆత్మజ్ఞానేన ఛిన్నాః సంశయాః మిథ్యా-జ్ఞానాని యస్య సః. లింగాద్వినిర్గమే లింగశరీరనాశే సతీత్యర్థః. 29

శ్లో ॥ యదా న యోగోపచితాసు చేతో
మాయాసు సిద్ధస్య విషజ్జతేఽంబ ।
అనన్యహేతుష్వథ మే గతిః స్యాత్
ఆత్యంతికీ యత్ర న మృత్యుహాసః ॥ 30 ॥

టీ:- యదేతి. తదా తు అణిమాదిసిద్ధయోఽంతరాయ రూపా భవంతి. తాసు యోగేనోపచితాసు సమృద్ధాసు న యోగాదన్యో హేతు-ర్యాసాం తాసు యదా సిద్ధస్య చేతో న విషజ్జతే. అంబ హే మాతః. అథ తదా అంతమతి క్రాంతో యోఽహం తత్సంబంధినీ. యత్ర యస్యాం గతౌ మృత్యోః హాసో భవతి విషక్తౌ తు సిద్ధోఽపి మయా వశీకృత ఇతి. మృత్యోర్హాసో గర్వో భవతీత్యర్థః. ॥ 30 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
సప్తవింశతితమోఽ ధ్యాయః

అమ్మా! అణిమాది సిద్ధులు ప్రాప్తించుటకు యోగము కన్నా ఇతర మార్గము లేదు. ఇట్టి యోగ సిద్ధులు సిద్ధపురుషుని ఎదుట ప్రకటమగును. ఆ సిద్ధులయందు ఆసక్తుడు కానంతవరకు ఆతనికి మృత్యుభయము లేదు.(ఆ సిద్ధులయందాసక్తుడైనచో తిరిగి పతన మగునని భావము). అతడు పరమపురుషార్థమగు, అవినాశియగు మోక్షపదమును పొంది నాలో లీనమగును. ॥ 30 ॥

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఇరువది ఏడవ అధ్యాయము సమాప్తము

అష్టావింశోఽధ్యాయః

శ్లో ॥ అష్టావింశే తతోఽష్టాంగ యోగేన ధ్యానశోభినా ।
సర్వోపాధి వినిర్ముక్తం స్వరూపజ్ఞానమీర్యతే ॥

శ్లో ॥ భక్తిం సంక్షేపతః ప్రోచ్య సాంఖ్యమాఖ్యాయ విస్తృతమ్ ।
అథాహ వైష్ణవం యోగమష్టాంగం కపిలో హరిః ॥

శ్రీభగవానువాచ

శ్లో ॥ యోగస్య లక్షణం వక్ష్యే సబీజస్య నృపాత్మజే ।
మనో యేనైవ విధినా ప్రసన్నం యాతి సత్పథమ్ ॥ 1

టీ:- యోగస్యేతి. సబీజస్య సాలంబనస్య ప్రసన్నం సత్. ॥ 1 ॥

శ్లో ॥ స్వధర్మాచరణం శక్త్యా విధర్మాచ్చ నివర్తనమ్ ।
దైవాల్లబ్ధేన సంతోష ఆత్మవిచ్చరణార్చనమ్ ॥ 2

టీ:- తత్ర యమనియమానాహ - త్రిభిరక్షరద్వయాధికైః. స్వేతి. స్వశక్త్యా ధర్మాచరణం. ॥ 2 ॥

28 వ అధ్యాయము

ఈ ఇరువది ఎనిమిదవ అధ్యాయమున ధ్యానముచేత శోభిల్లే అష్టాంగయోగము, దాని ద్వారా సర్వోపాధుల నుండి విముక్తిని కలిగించే స్వరూపజ్ఞానము కీర్తింపబడినది. కపిలదేవుడు సాంఖ్యమును విపుల ముగ వర్ణించి సంక్షేపముగ భక్తియోగమును కీర్తించెను.

కపిల భగవానుడిట్లు పలికెను

ఓ మనుచక్రవర్తి కూతురువగు దేవహూతీ! ఇప్పుడు నేను సబీజయోగ లక్షణమును చెప్పుచున్నాను. ఈ యోగమును అనుష్ఠించినచో మనస్సు ప్రసన్నమై సద్గతిని పొందుదురు. సబీజ యోగమునకే స్వావలంబన యోగమనియు పేరు కలదు. (ఆలంబనతో కూడిన, కారణముతో కూడిన యోగమని అర్థము.) ॥ 1 ॥

(ఈ మూడుశ్లోకములపైన రెండు అక్షరముల ద్వారా 'యమ' 'నియమము'లను చెప్పుచున్నాడు.) యథాశక్తిగా శాస్త్రవిహితమైన స్వధర్మమును ఆచరించుట, పరధర్మమును పరిత్యజించుట, ప్రారబ్ధ-వశముగా లభించిన దానితో సంతోషముగా యుండుట, ఆత్మజ్ఞానము గలవారి పాదములను పూజించుట. ॥ 2 ॥

శ్లో ॥ గ్రామ్యధర్మ నివృత్తిశ్చ మోక్షధర్మరతిస్తథా ।
మితమేధ్యాదనం శశ్వద్వివిక్త క్షేమసేవనమ్ ॥ 3

టీ:- గ్రామ్యధర్మేతి. గ్రామ్యస్త్రైవర్గికో ధర్మః. తస్మాన్నివృత్తిః. మితం చ తన్మేధ్యం శుద్ధం చ తస్యాదనం. తత్ర మితం నామ స్మృ. శ్లో."ద్వౌ భాగౌ పూరయేదన్నైస్తోయేనైకం ప్రపూరయేత్, మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయే" దితి. స్మృతి ప్రసిద్ధం. వివిక్తం విజనం క్షేమం నిర్బాధం తస్య స్థానస్య సేవనమ్. ॥ 3 ॥

విషయవాసనలను పెంచే కర్మలకు దూరముగా నుండుట, అనగా ధర్మార్థ కామములనే త్రైవర్గికమును వదలి నాల్గవది యగు మోక్ష ధర్మమునందు ఆసక్తి కలిగి యుండుట, పవిత్రమైన ఆహారమును మితముగా భుజించుట, (మితమనగా నాలుగు పాళ్ళలో రెండు పాళ్ళు ఆహారముతో నింపుట, ఒకపాలు నీటితో నింపుట, ఒకపాలు వాయు సంచారము కొఱకు శూన్యముగా నుంచుట), ఎల్లప్పుడు క్షేమకరమైన, బాధలులేని, భయములేని, ఏకాంత స్థలములో నుండుట. ॥ 3 ॥

శ్లో ॥ అహింసా సత్యమస్తేయం యావదర్థ పరిగ్రహః ।
బ్రహ్మచర్యం తపః శౌచం స్వాధ్యాయః పురుషార్చనమ్ ॥ 4

టీ:- అహింసేతి. యావతార్థః ప్రయోజనం తావన్మాత్రస్య పరిగ్రహః ॥4॥

ప్రాణులకు హింసను కలిగించకుండుట, సత్యమునే పలుకుట, ఇతరుల ద్రవ్యమును అపహరించకుండుట, దేహ నిర్వహణకు (కుటుంబ యజమానియైనచో కుటుంబ నిర్వహణకు) పరిమితమైన వస్తుజాలమును సేకరించుట, బ్రహ్మచర్యమును పాటించుట, తపస్సు చేయుట, శౌచము అనగా దేహము మఱియు మనస్సును శుభ్రముగా నుంచుట, శాస్త్రములను అధ్యయనము చేయుట, భక్తితో భగవంతుని పూజించుట. 4

శ్లో ॥ మౌనం సదాసనజయస్థైర్యం ప్రాణజయః శనైః ।
ప్రత్యాహారశ్చేంద్రియాణాం విషయాన్ మనసా హృది ॥ 5

(ఈ మూడు శ్లోకములలో 'ఆసనము' మొదలగు అంగములను చెప్పుచున్నాడు.) మౌనము (వాక్కును నిగ్రహించుట, ఆలోచనలను

టీ:- ఆసనాదీన్యంగాన్యాహ - త్రిభిః. మౌనమితి. సదా ఆసనస్య జయేన స్థైర్యం. ॥ 5 ॥

నిగ్రహించుట); ఆసనములను అభ్యసించి స్థిరముగా కూర్చొనగల్గుట; ప్రాణాయామము చేయుటద్వారా మెల్ల మెల్లగా శ్వాసను జయించుట; ప్రత్యాహారము, అనగా మనస్సుతో ఇంద్రియములను విషయభోగముల నుండి తొలగించి హృదయమున నిలుపుట. ॥ 5 ॥

శ్లో ॥ స్వధిష్ణ్యానామేకదేశే మనసా ప్రాణధారణమ్ ।
వైకుంఠలీలాభిధ్యానం సమాధానం తథాత్మనః ॥ 6

టీ:- స్వధిష్ణ్యమితి. స్వధిష్ణ్యానాం ప్రాణస్థానాం మూలాధారాదీనాం మధ్యే ఏకస్మిన్ దేశే మనసా సహ ప్రాణస్య ధారణం ధారణా ఆత్మనో మనసఃసమాధానం ఆత్మాకారతా. ॥ 6 ॥

మూలాధారము మొదలగు ఏదో ఒక స్థానము నందు మనస్సు-తోసహా ప్రాణములను స్థిరముగా నిలిపి యుంచుట, నిరంతరము భగవంతుని లీలలను స్మరించుట, మనస్సులోని సంకల్ప వికల్పము లను తొలగించి ఆత్మాకారముగా చేయుట. ॥ 6 ॥

శ్లో ॥ ఏతైరన్యైశ్చ పథిభిర్మనో దుష్టమసత్పథమ్ ।
బుద్ధ్యా యుంజీత శనకైర్జితప్రాణో హ్యతంద్రితః ॥ 7

టీ:- ఏతైరితి. అన్యైశ్చ వ్రత దానాదిభిః. పథిభిరుపాయైః. ॥ 7 ॥

దీనితోబాటు వ్రతదానాది ఇతర ఉపాయములను చేబట్టవలెను. సోమరితనము వీడవలెను. సావధానముగా ప్రాణములను జయించ వలెను. చెడు మార్గమున నడిచే స్వభావముగలది, దుష్టము అయిన మనస్సును బుద్ధి ద్వారా నెమ్మదిగా ఏకాగ్రపరచి పరమాత్మ ధ్యానము నందుంచవలెను. ॥ 7 ॥



శ్లో ॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య విజితాసన ఆసనమ్ ।
తస్మిన్ స్వస్తిక ఆసీనో ఋజుకాయః సమభ్యసేత్ ॥ 8

టీ:- ఆసనాదీని ప్రపంచయతి యావదధ్యాయ పరిసమాప్తి. శుచా వితి. ఆసనం కుశాజినచేలోత్తరం ప్రతిష్ఠాప్య స్వస్తికే స్వస్తికాసనే యథా సుఖమితి వా. సమభ్యసేత్ సమ్యగభ్యసేత్. ప్రాణమితి శేషః. శ్లో."ఊరూ జంఘాంతరాధాయ పాదాగ్రే జానుమధ్యగే, యోగినో యదవస్థానం స్వస్తికం తద్విదుర్బుధాః". ॥ 8 ॥

శ్లో ॥ ప్రాణస్య శోధయేన్మార్గం పూరకుంభక రేచకైః ।
ప్రతికూలేన వా చిత్తం యథా స్థిరమచంచలమ్ ॥ 9

టీ:- ప్రాణస్యేతి. బాహ్యవాయోరంతః ప్రవేశనం పూరకః. ప్రవేశితస్య నిరోధేన ధారణం కుంభకః. ధృతస్య బహిర్నిస్సారణం రేచకః ప్రతి కూలేన వా రేచక కుంభక పూరకైః. యద్వా ఇడయా ౨ ౨ పూర్య పింగళయా రేచనం పింగళయా ౨ ౨ పూర్య ఇడయా రేచనం ఇత్యేవం ప్రతికూలేన. వా శబ్దశ్చార్థే. స్థిరం సత్. పునరప్యచంచలం యథా భవతి తథా శోధయేత్. ॥ 9 ॥

(ఆసనము మొదలగు వాటిని ఈ శ్లోకము మొదలుకొని అధ్యాయ సమాప్తి వరకు వివరించి చెప్పుచున్నాడు.) పవిత్రమైన స్థానమునందు కుశ, మృగచర్మ, వస్త్రములతో గూడిన ఆసనమును ఏర్పరచుకోవలెను. ఆసనమును జయింపవలెను. ఒక యోగాసనము నందు కొంతసేపు స్థిరముగా కూర్చుండగలుగుటయే ఆసన జయము. శరీరమును చక్కగా (నిటారుగా) యుండునట్లు కూర్చుండవలెను. స్వస్తికాసనమున సుఖముగా కూర్చుండి ప్రాణాయామమును అభ్యాసము చేయవలెను. పాదాగ్రములను తొడలు, పిక్కల లోపలి నుండి రానిస్తూ మోకాళ్ళ మధ్య ఉంచవలెను. ఇట్లు కూర్చుండుట "స్వస్తికాసనము" యొక్క లక్షణమని పండితుల అభిప్రాయము. ॥8॥

బయట గాలిని లోపలికి పీల్చుట పూరకము. లోపలనే గాలిని నిలుపుట కుంభకము. లోపలిగాలిని బయటకు వదలుట రేచకము. పూరక, కుంభక, రేచకముల ద్వారా లేదా రేచక, కుంభక, పూరకముల ద్వారా ప్రాణమార్గమును శోధించవలెను. ముక్కు యొక్క కుడి-రంధ్రముతో గాలిని పీల్చి ఎడమ రంధ్రముతో వదలవలెను. ఎడమ రంధ్రముతో పీల్చి కుడి రంధ్రముతో వదలవలెను. మనస్సు అచంచలముగా, స్థిరముగా యుండునట్లు శోధింపవలెను. ॥ 9 ॥



ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ మనోఽచిరాత్స్యాద్విరజం జితశ్వాసస్య యోగినః ।
వాయ్వగ్నిభ్యాం యథా లోహంధ్మాతం త్యజతి వై మలమ్ ॥10

టీ:- మన ఇతి. ధ్మాతం సుతప్తమిత్యర్థః. లోహం సువర్ణం యథా మలంత్యజతి మనోవిరజంస్యాత్. తతశ్చాచంచలం స్యాదితి భావః10

శ్లో ॥ ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషాన్ ।
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్ ॥ 11

టీ:- ప్రాణాయామాదీనాం చ సమాధౌ ద్వారకార్యాణ్యాహ - ప్రాణాయామైరితి. దోషాన్ వాత పిత్త శ్లేష్మాదీన్. సంసర్గాన్ విషయ సంసర్గాన్ అనీశ్వరాన్ రాగాదీన్. వాయునా సహ మనసః స్థిరీకరణం ధారణా. స్థిరస్య వృత్తి సంపత్తిః ధ్యానం. వృత్తి నిరోధః సమాధిరితి భేదః. ॥ 11 ॥

శ్లో ॥ యదా మనః స్వవిరజం యోగేన సుసమాహితమ్ ।
కాష్ఠాం భగవతో ధ్యాయేత్స్వనాసాగ్రావలోకనః ॥ 12

టీ:- యదేతి. సుసమాహితం స్థిరం జాతం. కాష్ఠాం కళాం. మూర్తి మిత్యర్థః. స్వనాసాగ్రే అవలోకనం యస్య సః. స ఏతచ్చ లయవిక్షేపయోః పరిహారాయ ధ్యేయమ్. ॥ 12 ॥

అగ్నిచేత బాగా కాల్చబడిన బంగారముపైకి వాయువును ప్రసరింపజేసిన అది తనలోని మాలిన్యమును కోల్పోవును. అట్లే యోగి ప్రాణాయామముచే ప్రాణవాయువును జయించి తన మనస్సులోని మాలిన్యమును తొలగించు కొనగలుగును. మనోచాంచల్యము తొలగునని భావము. 10

(సమాధి అవస్థను పొందుటకు ప్రాణాయామాదులు చేయు పనులను చెప్పుచున్నాడు.) ప్రాణాయామము ద్వారా వాత శ్లేష్మాది దోషములు తొలగును. ధారణ ద్వారా పాపములు నశించును. (వాయువుతో సహా మనస్సు స్థిరముగా యుంచుట ధారణ), ప్రత్యాహారము ద్వారా విషయసంసర్గ జనితమగు దోషములు నశించును. ధ్యానముద్వారా రాగాది దోషములు దగ్ధమగును. నిరంతరముగా స్థిరపడిన వృత్తి ధ్యానము. వృత్తి నిరోధమునకు సమాధియని పేరు. ॥ 11 ॥

(లయ విక్షేపముల పరిహారముకొఱకు చెప్పుచున్నాడు.) యోగాభ్యాసము చేయగా చేయగా చిత్తము నిర్మలము ఏకాగ్రము అగును. అప్పుడు సాధకుడు తన ముక్కుకొనను చూచుచున్నాడా యన్నట్లు మనస్సును ఏకాగ్రముచేసి భగవానుని మూర్తిని ధ్యానించ-వలెను. ॥12 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ ప్రసన్నవదనాంభోజం పద్మ గర్భారుణేక్షణమ్ ।
నీలోత్పల దల శ్యామం శంఖ చక్ర గదాధరమ్ ॥ 13

టీ:- ధ్యేయం హరిమాహ - సప్తభిః ప్రసన్నేతి. ప్రసన్నం వదనాంభోజం యస్య తం ధ్యాయేదితి షష్ఠేనాన్వయః. పద్మ గర్భవదరుణే ఈక్షణే నేత్రే యస్య. నీలోత్పలదళవత్ శ్యామం.॥ 13 ॥

శ్లో ॥ లసత్పంకజ కింజల్క పీత కౌశేయ వాససమ్ ।
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభా ముక్త కంధరమ్ ॥ 14

టీ:- లసదితి. లసత్పంకజస్య కింజల్కవత్. పీతే కౌశేయవాససీ యస్య. శ్రీవత్సలాంఛనం వక్షసి యస్య. భ్రాజత్కౌస్తుభేన ఆముక్తా సంశ్లిష్టా కంధరా యస్య. ॥ 14 ॥

శ్లో ॥ మత్తద్విరేఫకలయా పరీతం వనమాలయా ।
పరార్థ్యహార వలయ కిరీటాంగద నూపురమ్ ॥ 15

టీ:- మత్తేతి. మత్తద్విరేఫాణాం కలో మధురో ధ్వనిర్యస్యాం తయా. వనమాలయా పరీతం వ్యాప్తమ్. పరార్థ్యాని అమూల్యాని హారాదీని యస్య. ॥ 15 ॥

ఈ ఏడు శ్లోకములలో 'ధ్యేయము' అయిన శ్రీహరి వర్ణన కలదు. ఆరవ శ్లోకములోని ధ్యాయేత్ అనే క్రియా పదముతో అన్వయము. శ్రీహరియొక్క ముఖము పద్మమువలె నుండును. ప్రసన్నముగా నుండును. ఆయన నల్లని కలువ రేకుల వంటి శ్యామల వర్ణము కలిగియుండును. ఆయన శంఖము, చక్రము, గదలను ధరించి యుండును. ఇట్టి భగవానుని మూర్తిని ధ్యానించవలెను. 13

పద్మపు పుప్పొడివలె పచ్చగా ప్రకాశించే పట్టువస్త్రముగలవాడు, వక్షఃస్థలముపై "శ్రీవత్సము" అనే గుర్తు గలవాడు, మెడలో కౌస్తుభ మణితో ప్రకాశించేవాడు అయిన శ్రీహరిని ధ్యానింపవలెను. 14

శ్రీహరి, మధురమైన ధ్వనిగల, మదించిన తుమ్మెదలచే వ్యాపించిన వనమాలను ధరించి యుండును. ఆ శ్రీహరి హారములు, కంకణములు, కిరీటములు, భుజకీర్తులు, నుపూరములు మొదలగు ఆభరణములతో విరాజిల్లుచుండును. ఈ రకముగా శోభిల్లుచున్న శ్రీహరిని ధ్యానించవలెను. ॥ 15 ॥

శ్లో ॥ కాంచీగుణోల్లసచ్ఛ్రోణిం హృదయాంభోజవిష్టరమ్ ।
దర్శనీయతమం శాంతం మనో నయన వర్ధనమ్ ॥ 16 ॥

టీ:- కాంచీతి. కాంచీగుణేన ఉల్లసంతీ శ్రోణీ యస్య తం భక్తానాం హృదయాంభోజమేవ విష్టరమాసనం యస్య. భక్తానాం మనోనయనాని వర్ధయతి హర్షయతీతి తథా. ॥ 16 ॥

శ్రీహరి యొక్క కటిప్రదేశము మొలతాడుచే ప్రకాశించు చుండును. ఆ దేవదేవుడు భక్తుల హృదయపద్మములే నివాసముగా గలవాడు, శాంతమైన రూపముగలవాడు, మిక్కిలి అందగాడు, భక్తుల మనోనేత్రములకు ఆనందమును పెంపొందించేవాడు. ఈ రకమైన శ్రీహరి యొక్క సుందరమూర్తిని ధ్యానింపవలెను. ॥ 16 ॥

శ్లో ॥ అపీచ్యదర్శనం శశ్వత్సర్వలోక నమస్కృతమ్ ।
సంతం వయసి కైశోరే భృత్యానుగ్రహకాతరమ్ ॥ 17

టీ:- అపీచ్యేతి. అపీచ్యమతిసుందరం భక్తవిషయం దర్శనం యస్య. కైశోరే తారుణ్యే వయసి సంతం స్థితం. భృత్యానామనుగ్రహే కాతరం వ్యగ్రమ్. 17

శ్రీహరి సుందరమగు దర్శనముగలవాడు. సర్వలోకములచే నమస్కరింపబడేవాడు. కైశోరావస్థయందుఉన్నవాడు, భక్తులను అనుగ్రహించుటకు తొందరపడేవాడు. ఈ రకమైన శ్రీహరి యొక్క సుందరమూర్తిని ధ్యానింపవలెను. ॥ 17 ॥

శ్లో ॥ కీర్తన్యతీర్థయశసం పుణ్యశ్లోకయశస్కరమ్ ।
ధ్యాయేద్దేవం సమగ్రాంగం యావన్న చ్యవతే మనః ॥ 18

టీ:- కీర్తన్యమితి. కీర్తన్యం కీర్తనార్హం తీర్థభూతం యశో యస్య. పుణ్యశ్లోకాః బలి భీష్మ ప్రముఖాః తేషాం యశస్కరం. సమగ్రాణ్యంగాని యస్మిన్. న చ్యవతే నాపయాతి న పర్యేతి వా. ॥ 18 ॥

శ్రీహరి కీర్తింపదగినవాడు, సర్వదోషములను పోగొట్టే యశస్సు గలవాడు, పుణ్యశ్లోకులైన బలి, భీష్ముడు మున్నగు వారికి కీర్తిని తెచ్చిపెట్టేవాడు. ఇట్టి శ్రీహరియొక్క నిండైన మూర్తిని మనస్సు స్థిరముగా నిలబడినంతవరకు ధ్యానించవలెను. ॥ 18 ॥

శ్లో ॥ స్థితం వ్రజంతమాసీనం శయానం వా గుహాశయమ్ ।
ప్రేక్షణీయేహితం ధ్యాయేచ్ఛుద్ధభావేన చేతసా ॥ 19

టీ:- స్థితమితి. ప్రేక్షణీయమీహితం లీలా యస్య తం. ॥ 19 ॥

భగవల్లీలలు దర్శనీయములైనవి (చూడదగినవి). సాధకుడు తన కోరికననుసరించి భగవంతుని యొక్క నిలబడి యున్న, కూర్చుని యున్న, నడుచుచున్న, పరుండియున్న, రూపముగా ధ్యానించవచ్చును. లేదా సర్వాంతర్యామిగా ధ్యానింపవచ్చును. శుద్ధమగు భావనతో కూడిన మనస్సుతో శ్రీహరిని ధ్యానించవలెను. ॥ 19 ॥

శ్లో ॥ తస్మిన్ లబ్ధపదం చిత్తం సర్వావయవ సంస్థితమ్ ।
విలక్ష్యైకత్ర సంయుజ్యాదంగే భగవతో మునిః ॥ 20

టీ:- తదేవం సమగ్రధ్యానముక్త్వా ఏకైకావయవ ధ్యానమాహ- తస్మిన్నితి. తస్మిన్ లబ్ధం పదం స్థితిర్యేన తచ్చిత్తం విలక్ష్య విశేషేణ లక్షీకృత్య. ఏకైకస్మిన్నంగ ఇత్యర్థః. ॥ 20 ॥

(ఈ విధముగా సమగ్రధ్యానమును చెప్పిన పిమ్మట ఒక్కొక్క అవయవ ధ్యానమును చెప్పుచున్నాడు.) ఆ శ్రీహరియొక్క సర్వా-వయవములందు మనస్సు చక్కగా లగ్నమైనట్లు గమనించిన తరువాత, మననశీలుడగు సాధకుడు ఒక్కొక్క అంగముపై విశేషముగా మనస్సును ఏకాగ్రపరచవలెను. ॥ 20 ॥

శ్లో ॥ సంచింతయేద్భగవతశ్చరణారవిందం
వజ్రాంకుశ ధ్వజ సరోరుహ లాంఛనాఢ్యమ్ ।
ఉత్తుంగ రక్త విలసన్నఖ చక్రవాల
జ్యోత్స్నాభిరాహతమహద్ధృదయాన్ధకారమ్ ॥ 21

టీ:- తదేవ పాదాదిక్రమేణాహ-త్రయోదశభిః. సంచింతయేదితి.

(ఈ పదమూడు శ్లోకములలో భగవంతుని ఒక్కొక్క అంగ వర్ణన కలదు.) భగవంతుని చరణకమలముల యందు ధ్వజము, వజ్రము, అంకుశము, పద్మము అనే చిహ్నములుండును. ఆ మహాత్ముని గోళ్ళు ఎత్తుగా ఉంటూ ఎఱ్ఱని గుండ్రని కాంతులీనుచుండును. ఆ గోళ్ళ కాంతులు ధ్యానము చేసే మహాత్ముల హృదయములలోని అంధకారమును (అసామర్థ్యమును) తరిమివేయును. ఈ రకముగానున్న శ్రీహరి

సమ్యక్ చింతయేత్. పాదతలే రేఖాత్మకాని వజ్రాదీని లాంఛనాని తైః ఆఢ్యం యుక్తం. ఉత్తుంగాశ్చ రక్తాశ్చ విలసంతో నఖాః తేషాం చక్రవాళం మండలం తస్య జోత్స్నాభిః. ఆహతో మహతాం ధ్యాతౄణాం హృదయే అంధకారో యేన ఏతచ్చ సర్వముపాదేయ విశేషణం ధ్యేయత్వేనైవోచ్యతే. ॥ 21 ॥

చరణారవిందములను ధ్యానించవలెను. ॥ 21 ॥

శ్లో॥ యచ్ఛౌచనిః సృత సరిత్ప్రవరోదకేన
తీర్థేన మూర్ధ్న్యధి కృతేన శివః శివోఽభూత్ ।
ధ్యాతుర్మనః శమల శైల నిసృష్ట వజ్రం
ధ్యాయేచ్చిరం భగవతశ్చరణారవిందమ్ ॥ 22

టీ:- యదితి. కించ యస్య శౌచేన క్షాళనేన నిస్సృతాయాః సరిత్ప్రవరాయాః గంగాయాః ఉదకేన తీర్థేన సంసారతారకేణ మూర్ధ్న్యధికృతేన ధృతేన శివోఽపి శివోఽభూత్. అత్యధికం పుఖం ప్రాపేత్యర్థః. ధ్యాతుర్మనసి యః శమలశైలః పాపపర్వతః. తస్మిన్నిసృష్టం క్షిప్తం వజ్రమివ యత్ యద్వా శమలశైలే నిసృష్టం స్వలాంఛనరూపం వజ్రం యేన తత్. 22

శ్రీహరి భగవానుని పాదములు కడుగగా బయల్వెడలిన నీరు గంగానది అయినది. ఆ గంగానది సంసారతారకమైన తీర్థమయినది. ఆ గంగను శిరస్సున ధరించినందువలననే శంకరుడు 'శివుడు' (మంగళస్వరూపుడు) అయినాడు. తనను ధ్యానించు వారి మనస్సులలోని మాలిన్యము (పర్వతమువలెనున్న) పైన ప్రయోగింపబడిన వజ్రాయుధము వలె శ్రీహరి పాదపద్మము వినియోగపడును. అట్టి శ్రీహరిపాదపద్మములను ధ్యానింపవలెను. ॥ 22 ॥

శ్లో ॥ జానుద్వయం జలజలోచనయా జనన్యా
లక్ష్మ్యాఽఖిలస్య సురవన్దితయా విధాతుః ।
ఊర్వోర్నిధాయ కరపల్లవ రోచిషా యత్
సంలాలితం హృది విభోరభవస్య కుర్యాత్ ॥ 23

టీ:- జానుద్వయమితి. విభోర్జానుద్వయం తత్పర్యంతం జంఘా ద్వయం. అఖిలస్య విధాతుః బ్రహ్మణః జనన్యా లక్ష్మ్యా సంలాలితం స్పర్శచాతుర్యేణ సంసేవితం. సంసారిత్వమివ ప్రతీతం వారయతి - అభవస్యేతి. హృది కుర్యాత్ ధ్యాయేత్. ॥ 23 ॥

శ్లో ॥ ఊరూ సుపర్ణ భుజయోరధి శోభమానౌ
ఓజోనిధీ అతసికాకుసుమావభాసౌ ।
వ్యాలంబిపీతవరవాససి వర్తమాన
కాంచీకలాప పరిరంభి నితంబబింబమ్ ॥ 24

టీ:- ఊరూ ఇతి. సుపర్ణస్య భుజయోః స్కంధయోః. అధి ఉపరి. ఓజసో బలస్య నిధీ ఆధారౌ. అతసికాయాః కుసుమవత్ కాంత్యాఽవ-భాస మానౌ. వ్యాలంబి ఆగుల్ఫం లంబమానం యత్పీతాంబరం వాసః. తస్మిన్ వర్తమానో యః కాంచీకలాస్తేన పరిరంభః సంశ్లేషో విద్యతే

లక్ష్మీదేవి పద్మముల వంటి కన్నులుకలది. సకల లోకములకు సృష్టికర్త అయిన బ్రహ్మకు తల్లి, దేవతలచే నమస్కరింపబడునది, ఇట్టి లక్ష్మీదేవి శ్రీహరి దేవుని మోకాళ్ళను తన తొడలపై నుంచుకొని చిగురు టాకులవలె ప్రకాశించే చేతులతో పిక్కలనుండి మోకాళ్ళ వరకు ఒత్తుచుండును. తన స్పర్శ చాతుర్యముచేత సేవచేయుచుండును. శ్రీహరి జన్మలేనివాడు ('అభవస్య' అనే శబ్దప్రయోగము సంసారిత్వము లేదని చెప్పుచున్నది.) సంసారభయమును పోగొట్టేవాడు. శ్రీహరి యొక్క ఇట్టి మోకాళ్ళను ధ్యానించవలెను. ॥ 23 ॥

(ఈ శ్లోకములో శ్రీహరి ఊరువులను నితంబప్రదేశమును వర్ణించుచున్నాడు.) శ్రీహరి ఊరువులు గరుడుని భుజస్కంధములపై శోభిల్లుచుండును. బలమునకు ఆధారములైనవి, ఆశ్రయములైనవి. అతసీ పుష్పపు కాంతులతో శోభిల్లునట్టివి. ఆయన ధరించే గొప్ప పీతాంబరము మణికట్ల వరకు వ్యాపించియుండును. ఆయన నితంబము బంగారు మొలత్రాడుతో గూడినదై యుండును. ఈ రకమైన భగవానుని ఊరువులను, నితంబమును ధ్యానించవలెను. 24

యస్య తత్. విభోర్నితంబబింబం చ హృది కుర్యాదితి పూర్వేణాన్వయః (24)

శ్లో ॥ నాభిహ్రదం భువనకోశ గుహోదరస్థం
యత్రాత్మయోనిధిషణాఖిలలోకపద్మమ్ ।
వ్యూఢం హరిన్మణివృషస్తనయోరముష్య
ధ్యాయేద్ద్వయం విశదహారమయూఖగౌరమ్ ॥ 25

టీ:- నాభీతి. అముష్య శ్రీహరేః. నాభిహ్రదం ధ్యాయేత్. కథంభూతం భువనానాం కోశస్య సమూహస్య గుహాధిష్ఠానం యదుదరం తత్ర స్థితం యత్ర నాభి హ్రదే ఆత్మయోనేః బ్రహ్మణో ధిషణం ధిష్ణ్యమధిష్ఠానం అఖిలోకాత్మకం పద్మం వ్యూఢం వ్యుత్థితం తథా హరిన్మణివృషౌ మరకతమణి శ్రేష్ఠౌ తావివ యౌ స్తనౌ తయోర్ద్వయం ధ్యాయేత్. విశదహారాణాం మయూఖైః గౌరం శ్వేతమ్. ॥ 25 ॥

శ్లో ॥ వక్షోఽధివాసమృషభస్య మహావిభూతేః
పుంసాం మనోనయననిర్వృతిమాదధానమ్ ।
కంఠం చ కౌస్తుభమణేరధిభూషణార్థం
కుర్యాన్మనస్యఖిలలోకనమస్కృతస్య ॥ 26

భగవానుని ఉదరమధ్యమందున్న లోతైన నాభి సకల భువనములకు ఆశ్రయమైనది. ఆ నాభినుండే సకల లోకముల రూపములోనున్న పద్మము ఆవిర్భవించెను. ఆ పద్మమునుండే బ్రహ్మ ఉదయించినాడు. ఆ శ్రీహరి స్తనద్వయము శ్రేష్ఠమైన మరకతమణులను పోలియుండును. ఛాతిభాగమందు వ్రేలాడే హారముల కాంతులచే ఆ స్తనములు తెలుపు రంగుతో కనిపించుచున్నవి. ఇట్టి నాభి ప్రదేశమును, స్తనములను ధ్యానించవలెను. ॥ 25 ॥

శ్రీహరి సకల లోకములకు నమస్కరింపదగినవాడు. ఆయన వక్షఃస్థలము మహాలక్ష్మికి నివాసస్థలము. ధ్యానించువాని మనస్సుకు, కళ్ళకు కూడా ఆనందమును కలిగించువాడు. ఆయన తన కంఠము నందు 'కౌస్తుభమణి'ని ధరించును. ఆయన వక్షఃస్థలము ఆ కౌస్తుభ

టీ:- వక్షఇతి. ఋషభస్య శ్రేష్ఠస్య మహావిభూతేః మహాలక్ష్మ్యాః అధివాసం స్థానం యస్య వక్షః కంఠం చ మనసి కుర్యాత్. ధ్యాయేత్, కథంభూతం కంఠం. కౌస్తుభమణిర్యో భూషణార్థం ధృతః. తస్యాప్యధికం భూషణమర్థః ప్రయోజనం యస్య. కౌస్తుభమణిమేవ స్వయం అలం కుర్వంతమిత్యర్థః. పుంసాం స్మర్తౄణాం ద్రష్టౄణాం చ మనోనయనా-నాం నిర్వృతిమాదధానమిత్యుభయోర్విశేషణమ్. 26

మణికే శోభను తెచ్చిపెట్టుచున్నది. శ్రీహరి యొక్క ఇట్టి వక్షఃస్థలమును, కంఠదేశమును ధ్యానించవలెను. ॥ 26 ॥

శ్లో ॥ బాహూంశ్చ మందరగిరేః పరివర్తనేన
నిర్ణిక్తబాహువలయానధిలోకపాలాన్ ।
సంచింతయేద్దశశతారమసహ్యతేజః
శంఖం చ తత్కరసరోరుహ రాజహంసమ్ ॥ 27

టీ:- బాహూనితి. నిర్ణిక్తాని ఉజ్జ్వలీకృతాని. బాహువలయాని అంగదా యేషు అధిశ్రితాః లోకపాలాః యేషు తాన్. దశశతారం చక్రం న సహ్యో తేజో యస్య. కర సరోరుహే రాజహంసమివ. ॥ 27 ॥

మందరపర్వతమును గిరగిర త్రిప్పుటవలన ఆ బాహువుల యందున్న కంకణములకు, భుజకీర్తులకు మెరుగుపెట్టినట్లైనది. ఆ సమయాన ఎక్కువ శోభిల్లినవని భావము. లోకపాలకులందరు ఈ శ్రీహరి భుజములనే ఆశ్రయించి యున్నారు. శ్రీహరి ధరించే సుదర్శన చక్రము సహింపరాని తేజస్సు కలది. ఆయన 'శంఖము' శ్రీహరి యొక్క చేయి అనే సరస్సు నందు రాజహంసవలె ప్రకాశిస్తున్నది సాధకుడు శ్రీహరి యొక్క బాహువులను, చేతులలో ప్రకాశించే చక్రమును, శంఖమును కూడా ధ్యానించవలెను. ॥ 27 ॥

శ్లో ॥ కౌమోదకీం భగవతో దయితాం స్మరేత
దిగ్ధామరాతిభటశోణిత కర్దమేన ।
మాలాం మధువ్రతవరూథగిరోపఘుష్టామ్
చైత్త్యస్య తత్త్వమమలం మణిమస్య కంఠే ॥ 28

శత్రువీరుల రక్తపుబురదచేత పూయబడినది ఆ శ్రీహరి "కౌమోదకీ" గద. ఈ గద శ్రీహరికి మిక్కిలి ప్రియమైనది. ఆయన కంఠము నందలి వనమాల చుట్టూ తుమ్మెదల గుంపులు ఝంకార నాదమును చేయుచుండును.

టీ:- కౌమోదకీమితి. కౌమోదకీం గదాం. అరాతయో యే భటాః యోద్ధారస్తేషాం శోణితమేవ కర్దమః తేన దిగ్ధాం లిప్తాం. అస్య కంఠే మాలాం మణిం చ స్మరేత్. మధువ్రతానాం వరూధస్య గిరా ఉపఘుష్టాం నాదితాం చైత్యస్య జీవస్య తత్త్వం. తదుక్తం వైష్ణవే శ్లో."ఆత్మానమస్య జగతో నిర్లేపమగుణామలమ్. బిభర్తి కౌస్తుభమణిం స్వరూపం భగవాన్ హరి" రితి. ॥ 28 ॥

శ్లో. ఆత్మానమస్య జగతో నిర్లేపమగుణామలమ్ ।
బిభర్తి కౌస్తుభమణిం స్వరూపం భగవాన్ హరి ॥

అని వైష్ణవగ్రంథములో పేర్కొన్నట్లు ఆయన మెడలోని కౌస్తుభమణి జీవుని జీవతత్త్వమే. సాధకుడు శ్రీహరి యొక్క గదను, మాలను, మణిని స్మరింపవలెను. ॥ 28 ॥

శ్లో ॥ భృత్యానుకంపిత ధియేహ గృహీతమూర్తేః
సంచింతయేద్భగవతో వదనారవిందమ్ ।
యద్విస్ఫురన్మకరకుండల వల్గితేన
విద్యోతితామల కపోలముదారనాసమ్ ॥ 29

టీ:- భృత్యేతి. భృత్యేష్వనుకంపితా కృతానుకంపా యాధీః తయా గృహీతా మూర్తిర్యేన తస్య. విస్ఫురంతీ యే మకరకుండలే తయోర్వ-లితేన ప్రచలితేన. విద్యోతితావమలౌ కపోలౌ యస్మిన్ తత్. ఉదారా ఉన్నతా నాసా నాసికా యస్మిన్ తత్. ॥ 29 ॥

శ్రీహరి కేవలము భక్తులను అనుగ్రహింపవలెననెడి కోరికతోనే సాకారమూర్తిగా అవతరించును. ఆయన ముఖపద్మము ఎత్తైన నాసికతో (ముక్కుతో) శోభిల్లుచున్నది. కదలాడే మకర కుండలముల కాంతులతో ఆయన చెక్కిళ్ళు మిక్కిలి ప్రకాశించుచున్నవి. ఇలా శోభాయమానముగానున్న దేవదేవుని ముఖారవిందమును ధ్యానించవలెను. ॥ 29 ॥



శ్లో ॥ యచ్ఛ్రీనికేతమలిభిః పరిసేవ్యమానం
భూత్యా స్వయా కుటిలకుంతల వృంద జుష్టమ్ ।
మీనద్వయాశ్రయమధిక్షిపదబ్జనేత్రమ్
ధ్యాయేన్మనోమయమతంద్రిత ఉల్లసద్భ్రు ॥ 30

టీ:- యదితి. యచ్చ స్వయా భూత్యా శోభయా అళిభిః పరిషేవ్యమానం మీనద్వయాశ్రయం చ శ్రీనికేతనం పద్మం అధిక్షిపద్వర్తతే తత్ ధ్యాయేత్. తత్ర కుంతలైరళీనామధిక్షేపః. నేత్రద్వయేన మీన ద్వయస్యేతి ద్రష్టవ్యం. అబ్జే ఇవ నేత్రే యస్మిన్నిత్యుపమానాంతరం. ఉల్లసంత్యౌ భ్రువౌ యస్మిన్ తత్. మనోమయం మనస్యావిర్భవం తత్. 30

శ్రీహరిముఖము సౌందర్యమునకు నిధానము. వంకరగానున్న ముంగురలతోడను, పద్మపత్రములవంటి కన్నులతోను, అందమగు కనుబొమ్మలతోను ప్రకాశించుచున్నది. తుమ్మెదలచే సేవింపబడుతూ, మీనద్వయముచే ఆశ్రయింప బడిన పద్మకోశమును శ్రీహరి ముఖము తిరస్కరించుచున్నది. శ్రీహరి నేత్రద్వయము పద్మకోశము యొక్క మీనద్వయమును అధిక్షేపించుచున్నది. శ్రీహరి ముంగురులు పద్మ కోశమును ఆశ్రయించియున్న తుమ్మెదలను తిరస్కరించుచున్నవి.॥30॥

శ్లో ॥ తస్యావలోకమధికం కృపయాతిఘోర
తాపత్రయోపశమనాయ నిసృష్టమక్ష్ణోః ।
స్నిగ్ధస్మితానుగుణితం విపులప్రసాదమ్
ధ్యాయేచ్చిరం వితత భావనయా గుహాయామ్ ॥ 31

టీ:- తస్యేతి. కృపయా అధికం ఇత్యర్థః. అక్షిభ్యాం నిసృష్టం ప్రయుక్తం స్నిగ్ధస్మితేన అనుగుణితం సంపృక్తం. విపులః ప్రసాదో యస్మిన్. గుహాయాం హృది. ॥ 31 ॥

శ్రీహరి భగవానుని నేత్రములనుండి అధికమగు దయతో గూడిన చూపులు ప్రసరించుచుండును. ఆ చూపులు అతి ఘోరమైన ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనే తాపత్రయములను చల్లార్చును. స్నేహాతిశయము, చిరునవ్వులతో గూడియుండును. ఆ చూపులలో అనుగ్రహాతిశయము ఉండును. సాధకుడు శ్రీహరి యొక్క ఇట్టి దయావలోకనములను తన బుద్ధిగుహ యందు భక్తి భావముతో చిరకాలము ధ్యానించవలెను. ॥ 31 ॥

శ్లో ॥ హాసం హరేరవనతాఖిలలోక తీవ్ర
శోకాశ్రుసాగర విశోషణమత్యుదారమ్ ।
సమ్మోహనాయ రచితం నిజమాయయాస్య
భ్రూమండలం మునికృతే మకరధ్వజస్య ॥ 32

టీ:- హాసమితి. అవనతాః యే అఖిలలోకాస్తేషాం తీవ్రశోకేన యాన్య-శ్రూణి తేషాం సాగరం విశోషయతీతి తథా తం శ్రీహరేర్హాసం అస్య అత్యుదారం భ్రూమండలం చ ధ్యాయేత్. కథంభూతం నిజమాయయా మకరధ్వజస్యాపి సంమోహనాయ రచితం. మునికృతే మనీనాముప-కారాయ. మునీనాం సంమోహనే ప్రవృత్తం, కామమేవ మోక్షయితు-మిత్యర్థః. ॥ 32 ॥

శ్రీహరి యొక్క చిరునవ్వును వర్ణించుచున్నాడు. తనను శరణు జొచ్చిన సమస్త ప్రజల శోకము వలన వెలువడే కన్నీటి సముద్రమును ఎండింపజేయునది శ్రీహరి చిరునవ్వు ఆయన నవ్వు మిక్కిలి ఆనంద దాయకము. శ్రీహరి తన మాయ చేత కనుబొమ్మలను నిర్మించినాడు. మునుల ఉపయోగము కొఱకైనదియు, మునుల తపస్సుకు ఆటంకమైన మన్మథుని గర్వమునణచునదియునైన శ్రీహరి కనుబొమ్మల వలయ మును ధ్యానించవలెను. ॥ 32 ॥

శ్లో ॥ ధ్యానాయనం ప్రహసితం బహులాధరోష్ఠ
భాసారుణాయిత తనుద్విజకుందపఙ్క్తి ।
ధ్యాయేత్స్వదేహకుహరేఽవసితస్య విష్ణోః
భక్త్యార్ద్రయార్పితమనా న పృథగ్దిదృక్షేత్ ॥ 33

టీ:- మందహాసధ్యానముక్త్వా స్ఫుటహాసధ్యానమాహ- ధ్యానాయన మితి. శ్రీవిష్ణోః ప్రహసితముచ్చైర్హసితం ధ్యాయేత్. కీదృశం ధ్యానాయనం అతిసుందరతయా ప్రయత్నం వినైవ ధ్యానస్య విషయభూతం. సౌందర్యమేవాహ-బహులయా అధికయా అధరోష్ఠస్య భాసా కాంత్యా

(చిరునవ్వు వర్ణన పిదప ఈ శ్లోకములో శ్రీహరి స్పష్టమైన నవ్వును వర్ణించుచున్నాడు.) శ్రీహరి వస్తుతః ధ్యానించ తగినవాడు. ఆయన స్పష్టముగా నవ్వినపుడు క్రింది పెదవి యొక్క ఎఱ్ఱని కాంతి ఆయన దంత పంక్తిపై పడును. ఆయన దంతములు చిన్నవిగా మల్లెమొగ్గవలె నుండి అధరోష్ఠకాంతిచే ప్రకాశించుచుండును. సాధకుడు ప్రేమరసముతో నిండిన మనస్సును శ్రీహరికి సమర్పించ వలెను. ధ్యానములో శ్రీహరికన్నా ఇతరమును చూడగోరరాదు. (మనస్సును చలింపజేయరాదనుట). ॥ 33 ॥

అరుణీభూతాః తనవః సూక్ష్మాః ద్విజాఏవ కుందకుట్మలాని తేషాం పంక్తిః స్ఫురతి యస్మిన్ తత్. స్వదభ్రకుహరే హృదయాకాశే. అవసితస్య జాతస్య ప్రేమరసేన ఆర్ద్రయా భక్త్యా తస్మిన్నేవార్పితమనాస్సన్ పృథక్ తద్వ్యతిరిక్తం ద్రష్టుం నేచ్ఛేత్. చిత్తం న విచాలయే దిత్యర్థః. ॥ 33 ॥

శ్లో ॥ ఏవం హరౌ భగవతి ప్రతిలబ్ధభావో
భక్త్యా ద్రవద్ధృదయ ఉత్పులకః ప్రమోదాత్ ।
ఔత్కంఠ్యబాష్పకలయా ముహురర్ద్యమానః
తచ్చాపి చిత్తబడిశం శనకైర్వియుఙ్క్తే ॥ 34

టీ:- సమాధిమాహ-ద్వాభ్యాం. ఏవమితి. నిర్బీజస్సబీజశ్చేతి ద్వివిధో యోగః. తత్ర నిర్బీజయోగే. శ్లో."యతో యతో నిశ్చలతి మనశ్చంచల మస్థిరమ్, తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేది"తి. గీతా సూక్తమార్గేణ క్రియమాణోఽపి దుష్కరస్సమాధిః. సబీజే తు సుకరః. తత్రాహ-పరమానందమూర్తౌ శ్రీహరౌ ధ్యాయమానే అయత్నత ఏవ చిత్తోపరమో భవతి. తదుక్తం హృతాత్మనో హృత ప్రాణాంశ్చ భక్తిరనిచ్ఛతో మే గతిమణ్వీం ప్రయుంక్తఇతి. అతః స ఏవోపక్షిప్త యోగస్య లక్షణం వక్ష్యే. సబీజస్యేతి. తదేవ అయత్నసిద్ధత్వమేవ దర్శయతి-ఏవం ధ్యానమార్గేణ హరౌ ప్రతిలబ్ధో భావః ప్రేమా యేన సః. ఔత్కంఠ్య

(ఈ రెండు శ్లోకములతో సమాధిని చెప్పుచున్నాడు. యోగము సబీజము, నిర్బీజము అని రెండు విధములు, నిర్బీజయోగము నందు "యతో యతో నిశ్చలతి మనశ్చంచలమస్థిరమ్। తతస్తతో నియమ్యైత ఆత్మన్యేవ వశం నయేది" అను గీతావాక్యము ప్రకారము. నికడలేని మనస్సును ప్రాపంచిక విషయముల నుండి మరల్చి పరమాత్మయందు నిలుప వలెను. ఇలా ఇది దుష్కరయోగము. సబీజము సుకరము. ఈ సాలంబన యోగము నందు పరమానందమూర్తి, ధ్యానించదగినవాడగు శ్రీహరి యందు చిత్తము అయత్నముగానే ఉపరమించును. 'హృతాత్మనో హృతప్రాణాంశ్చ భక్తిరనిచ్ఛతో మే గతిమణ్వీం ప్రయుంక్తే' అని చెప్పబడి యున్నది కదా! సాధకుడు ప్రారంభించిన సబీజయోగ లక్షణమును చెప్పుచున్నాడు. ఈ సబీజయోగము యొక్క అయత్న సిద్ధిత్వమును నిరూపించుచున్నాడు. అది ధారణలోకి పరిణమించుచున్నదని అర్థము) శ్రీహరి భగవానుని యందు సాధకునికి ఇట్టి ప్రేమాతిశయము

ప్రవృత్తయా అశ్రుకలయా చ ముహురర్ద్యమానః ఆనందసంప్లవే నిమజ్జమానః. దుర్గ్రహస్య భగవతో గ్రహణే బడిశం మత్స్యబంధనమివ ఉపాయభూతం చిత్తమపి. ధ్యేయాద్వియుఙ్క్తే. తద్ధారణే శిథిలప్రయత్నో భవతీత్యర్థః. ॥ 34 ॥

శ్లో ॥ ముక్తాశ్రయం యర్హి నిర్విషయం విరక్తమ్
నిర్వాణమృచ్ఛతి మనః సహసా యథాఽర్చిః ।
ఆత్మానమత్ర పురుషోఽవ్యవధానమేకమ్
అన్వీక్షతే ప్రతినివృత్తగుణప్రవాహః ॥ 35

టీ:- ముక్తాశ్రయమితి. యర్హి యదా. ఏవం నిర్విషయం భవతి. అత ఏవ ముక్తాశ్రయం చ. ధ్యేయ సంబంధం వినా ధ్యాతురవస్థానా సంభవాత్. న చ పూర్వవత్ శబ్దాది విషయత్వాత్. యతస్తత్ర విరక్తం పరమానందానుభవేన. అతో నిర్వాణం లయమృచ్ఛతి. వృత్తిరూపతాం పరిత్యజ్య బ్రహ్మాకారేణ పరిణమత ఇత్యర్థః. యథా అర్చిర్జ్వాలాదీపః ఆశ్రయవిషయాపగమే మహాభూతజ్యోతీరూపేణ పరిణమతే తద్వత్.

కలిగినప్పుడు అతని చిత్తము భక్తిచే ద్రవించిపోవును. ఆనందముతో వాని శరీరము గగుర్పాటు చెందును. అతిశయించిన సంతోషముతో కన్నీరుకారి శరీరము పలుమార్లు తడిసిపోవును. చేపలుపట్టే గాలము చేపను ఆకర్షించినట్లు ఇంతవరకు సాధకుని మనస్సు శ్రీహరిని ఆకర్షించినది. సాధకుడు శ్రీహరిని తనవైపు ఆకర్షించుటకు సాధనముగా ఉపయోగించిన తన చిత్తమును(మనస్సును) మెల్లమెల్లగా ధ్యేయము నుండి ఉపసంహరించును (తొలగించును). ॥ 34 ॥

ఎప్పుడైతే 'మనస్సు' 1.ఆశ్రయము, 2.విషయము, 3.రాగము అనే వాటినుండి తొలగుతుందో అప్పుడు బ్రహ్మాకారమౌతుంది. మనస్సునకు శబ్దాది విషయములు ఆశ్రయములు. ఇవి తొలగుటయే ముక్తాశ్రయము. సాధకుడు తన మనస్సునకు ఇంతవరకు భగవద్విషయములందు ఆశ్రయము కల్పించినాడు. అందువలన ఇతర విషయములందు మనస్సు 'విరక్తి' చెందినది. క్రమముగా మనస్సు 'ధ్యేయ' వస్తువు నుండి తొలగి ఆశ్రయములేనిదగుచున్నది. పూర్వము వలె శబ్దాదివిషయములతో సంబంధములేనిదవుతుంది. ఎందుకనగా భగవద్విషయములనాశ్రయించుట వలన ఇతర విషయముల యందు 'విరక్తి' చెంది మనస్సు పరమానందమును పొందుచున్నది. దీపము చమరు అయిపోయినప్పుడు తన కారణరూపమగు తేజస్తత్త్వమునందు

అత్రాస్యాం దశాయాం అవ్యవధానం ధ్యాతృధ్యేయవిభాగశూన్యం. ఏకమఖండితం ఆత్మానమనుగతమీక్షతే. అత్ర హేతుః-ప్రతినివృత్తః అపగతః గుణప్రవాహః దేహాద్యుపాధిర్యస్య. ॥ 35 ॥

లీనమగుచున్నది కదా! అట్లే ఈ అవస్థలో జీవుడు గుణప్రవాహ రూపమైన దేహాది ఉపాధులు తొలగిపోయిన కారణముగా 'ధ్యాత' 'ధ్యేయము' అనే విభాగములు లేని అఖండమైన పరమాత్మనే అంతటా దర్శిస్తాడు. ॥ 35 ॥

శ్లో ॥ సోఽప్యేతయా చరమయా మనసో నివృత్త్యా
తస్మిన్మహిమ్న్యవసితః సుఖ దుఃఖ బాహ్యే ।
హేతుత్వమప్యసతి కర్తరి దుఃఖయోర్యత్
స్వాత్మన్ విధత్త ఉపలబ్ధపరాత్మకాష్ఠః ॥ 36

టీ:- న చ సుప్తోత్థిత ఇవ పునస్సంసరతీత్యాహ-స ఇతి. సోఽపి చ పురుషః తస్మిన్మహిమ్ని బ్రహ్మరూపే అవసితః అవసానం నిష్ఠాం ప్రాప్తః. కయా. మనసో నివృత్త్యా చరమయా అవిద్యారహితయేతి సుషుప్తాద్విశేషః. తత్ర హ్యవిద్యాస్తి నత్విదానీం. అత్ర హేతుః ఏతయా యోగాభ్యాసకృతయేత్యర్థః. నన్వేవమపి సుఖ దుఃఖయోరాత్మధర్మత్వే కుతో బ్రహ్మైక్యం తత్రాహ-సుఖ దుఃఖయోర్బాహ్యే. తత్ర హేతుః. సుఖ దుఃఖయోర్హేతుత్వం భోక్తృత్వం. యత్పూర్వమా సీత్. తదప్యసతి అవిద్యాకృతే కర్తరి అహంకారే విధత్తే. తన్నిష్ఠత్వమేవ పశ్యతీత్యర్థః. యతః ఉపలబ్ధపరాత్మకాష్ఠః అపరోక్షీకృతాత్మతత్త్వః. ॥ 36 ॥

నిద్రనుండి మేల్కొనిన వ్యక్తివలె మళ్ళీ సంసరణ(కదలిక) యుండదని చెప్పుచున్నాడు. జ్ఞాని అయినవాడు 1.మనస్సు నివృత్తి చెందుటచేత, 2.ఆత్మ యందు లీనమగుటచేత, 3.అవిద్య తొలగుట చేత తన ఆత్మస్వరూపము నందు (బ్రహ్మస్వరూపమునందు) నిష్ఠను కలిగియుండును. సుషుప్తి కన్నా విశేష స్థితిని పొందును. అప్పుడు అవిద్య యుండెను. ఆ అవిద్యచే సుఖ దుఃఖములకు తానే భోక్తనని భావించేవాడు. ఇప్పుడు అవిద్యతొలగుటచేత సుఖ దుఃఖానుభవమునకు 'భోక్తృత్వ'మే కారణమని తెలిసికొనును. యోగాభ్యాసము వలన మనోనివృత్తి అయినందున ఇప్పుడు తాను భోక్త కాదనియు, అహంకారమే భోక్తయనియు, ఆ అహంకారము కూడ మిథ్యయే యనియు తెలుసుకొనును. అపరోక్షానుభూతిని పొందును. 36



శ్లో ॥ దేహం చ తం న చరమః స్థితముత్థితం వా
సిద్ధో విపశ్యతి యతోఽధ్యగమత్స్వరూపమ్ ।
దైవాదుపేతమథ దైవవశాదపేతమ్
వాసో యథా పరికృతం మదిరామదాంధః ॥ 37

టీ:- తస్య జీవన్ముక్తిమాహ- దేహం చేతి ద్వాభ్యాం. దేహమితి. చకారోఽప్యర్థే. చరమ ఉక్త లక్షణ సిద్ధో దేహమపి న విపశ్యతి. కుతః సుఖ దుఃఖే. ఆసనాదుత్థితముత్థాయ తత్రైవస్థితం తతః స్థానాదపేతం తతో దైవవశాత్పునరప్యుపేతం వా న విపశ్యతి. యతః స్వరూపం ప్రాప్తః. తతో దేహోత్స్వరూపమధ్యగమత్ తం దేహమితి వా. సతోఽప్యననుసంధానే దృష్టాంతః. వాసః పరికృతం కటితటే పరివేష్టితం స్థితం గతం వా మదిరామదేనాంధో యథా న పశ్యతి. ॥ 37 ॥

(ఈ రెండు శ్లోకములలో సాధకుని జీవన్ముక్తిత్వమును చెప్పుచున్నాడు) మద్యము సేవించినవాడు మత్తుడై తన నడుముకు వస్త్రమున్నదా? లేదా అని కూడా తెలియజాలడు. అట్లే చరమావస్థను పొందిన సిద్ధుడు(ఉత్తమలక్షణముగల సిద్ధుడు) కూడా తన దేహము కూర్చుండుటనుగాని, నిలుచుండుటనుగాని, ఎచ్చటికైన వెళ్ళుటను గాని, తిరిగివచ్చుటను గాని తెలియజాలడు. జ్ఞాని స్వస్వరూపమును పొందినందువలన, దేహాత్మభావము తొలగినందువలన దానిని పట్టించుకోడు. ॥ 37 ॥

శ్లో ॥ దేహోఽపి దైవ వశగః ఖలు కర్మ యావత్
స్వారంభకం ప్రతిసమీక్షత ఏవ సాసుః ।
తం సప్రపంచమధిరూఢ సమాధియోగః
స్వాప్నం పునర్న భజతే ప్రతిబుద్ధవస్తుః ॥ 38

టీ:- నను తర్హి కథం దేహస్య ప్రవృత్తినివృత్తీ జీవనం వా తత్రాహ-

(అయినప్పుడు దేహమునకు ప్రవృత్తి నివృత్తి జీవనము ఎట్లో చెప్పుచున్నాడు) పూర్వజన్మలలో చేసిన పుణ్య పాపముల వలన ఏర్పడిన కర్మ ఈ జన్మకు కారణమయినది. ఇంద్రియములతో, పంచప్రాణములతో కూడియున్న ఈ దేహము ప్రారబ్ధకర్మ పూర్తిగా అనుభవించేవరకు నిలిచియే యుండును.(జీవించియే యుండును). ఆత్మజ్ఞానము నందు స్థిరముగానున్న యోగి(సమాధి వరకు ధ్యానసాధన చేసిన యోగి)

దేహ ఇతి. దైవం పూర్వసంస్కారః. తద్వశేన గచ్ఛన్ యావత్స్వారంభకం కర్మాస్తి తావత్ప్రతిసమీక్షతే జీవత్యేవ. సాసుః సేంద్రియః. నను తర్హి తస్మిన్ పునస్సంగస్స్యాత్తత్రాహ–తం దేహం స్వప్నదేహాదితుల్యం సప్రపంచం పుత్రాదిసహితం పునర్న భజతే అహంమమేతి నాభిమన్యతే అధిరూఢః ప్రాప్తః సమాధి పర్యంతో యోగో యేన. అత ఏవ ప్రతిబుద్ధం వస్తు ఆత్మతత్త్వం యేన సః. ॥ 38 ॥

ధనము, బంధువులు మొదలగువాటితోనున్న ఈ ప్రపంచమును కలలో చూచుచున్నట్లుగా భావించును. కర్తృత్వ భోక్తృత్వ భావములు లేనందున ఆతడు మళ్ళీ దేహమును పొందడు. ॥ 38 ॥

శ్లో ॥ యథా పుత్రాచ్చ విత్తాచ్చ పృథఙ్మర్త్యః ప్రతీయతే ।
అప్యాత్మత్వేనాభిమతాద్దేహాదేః పురుషస్తథా ॥ 39

టీ:– ప్రతిబోధ ప్రకారమాహ–షడ్భిః. యథేతి. అతిస్నేహవశాదాత్మ–తత్వేన అభిమతాదపి పుత్రాదేః. మర్త్యః పుత్రాదిః. పురుషః. దేహాదేః ద్రష్టా. ॥ 39 ॥

(ఈ ఆరు శ్లోకములతో వివేక ప్రకారమును చెప్పుచున్నాడు). మానవుడు అతి స్నేహమువలన పుత్రునియందు, ధనముయందు తానే అవి అనే భావన కలిగి యుండును. (పుత్రాదులను ఆత్మస్వరూప ముగా భావించును). కాని ఆలోచించి చూచినచో భిన్నముగా తోచును. అట్లే ఈ దేహము ఆత్మస్వరూపమనే భ్రమ కలిగిననూ వాస్తవముగా ఆత్మ, దేహాదుల కంటె భిన్నమైనది. ॥ 39 ॥

శ్లో ॥ యథోల్ముకాద్విస్ఫులింగాద్ధూమాద్వాపి స్వసంభవాత్ ।
అప్యాత్మత్వేనాభిమతాద్యథాగ్నిః పృథగుల్ముకాత్ ॥ 40

టీ:– పృథగవస్థానాభావేఽపి భేదం సదృష్టాంతమాహ–యథేతి. యథోల్ముకాదిదానీం జ్వలతః కాష్ఠాత్. స్వసంభవాదగ్నేస్సంభూతాత్.

(వేరువేరు అవస్థలు లేనప్పటికి భేదమును దృష్టాంత పూర్వక ముగా చెప్పుచున్నాడు.) మండే కట్టె యొక్క మంట, మంట ఆరిపోయి నప్పటికి ఉండే నిప్పు, మిణుగురులు, పొగ, ఇవన్నియు నిప్పునుండి పుట్టినవే. ఇవన్నియు అగ్నిగనే లెక్కింపబడుచున్ననూ వాస్తవముగా అగ్ని వీటన్నింటి కంటే వేరుగానున్నది. ॥ 40 ॥

విస్ఫులింగాదేః. ఆత్మత్వేన అగ్నేః స్వరూపత్వేన అభిమతాదపి అత్యంతా- వివేకినోఽపి ధూమేఽపృగ్న్యభిమానోఽస్తి. ఉల్ముకాత్పూర్వసిద్ధాదపి తద్దాహకః ప్రకాశకశ్చాగ్నిః పృథగేవ. ॥ 40 ॥

శ్లో ॥ భూతేంద్రియాంతఃకరణాత్ప్రధానాజ్జీవసంజ్ఞితాత్ ।
ఆత్మా తథా పృథగ్ద్రష్టా భగవాన్ బ్రహ్మసంజ్ఞితః ॥ 41

టీ:- భూతేతి. ఏవం భూతాదేః ద్రష్టా. తేభ్యః పృథక్. తస్మాదపి జీవ సంజ్ఞితాత్ బ్రహ్మ సంజ్ఞితః పృథక్. తథా ప్రధానాదపి తత్ప్రవర్తకో భగవాన్ పృథగిత్యర్థః. ॥ 41 ॥

అదే విధముగా భూత, ఇంద్రియ, అంతఃకరణముల కంటె వాటిని దర్శించే ఆత్మచైతన్యము వేరుగా ఉన్నది. అట్లే 'బ్రహ్మ' అని పిలువబడే పరమాత్మ, ప్రకృతి గుణబద్ధుడైన జీవుడి కంటె భిన్నుడు. 41

శ్లో ॥ సర్వభూతేషు చాత్మానం సర్వ భూతానిచాత్మని ।
ఈక్షేతానన్యభావేన భూతేష్వివ తదాత్మతామ్ ॥ 42

టీ:- ఉపాధితో వివేకముక్త్వా తస్యైక్యమాహ - సర్వేతి. సర్వభూతేషు చతుర్విధేషు. తదాత్మతాం మహాభూతాత్మతామ్. ॥ 42 ॥

ఉపాధిగతమైన వివేకమును చెప్పి, దాని ఐక్యతను చెప్పు- చున్నాడు. జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజములనే నాలుగు రకములైన ప్రాణులు గూడా పంచభూతాత్మకములే. ఈ సమస్త ప్రాణులలో పరమాత్మను చూడవలెను. అట్లే తనయందు సమస్త ప్రాణులను అనన్యభావముతో చూడవలెను. ఆత్మరూపుడగు తాను సకల పదార్థముల యందు వ్యాపించి యున్నట్లు తెలియవలెను. 42

శ్లో ॥ స్వ యోనిషు యథా జ్యోతిరేకం నానా ప్రతీయతే ।
యోనీనాం గుణవైషమ్యాత్తథాత్మా ప్రకృతౌ స్థితః ॥ 43

టీ:- ధర్మభేదస్యాప్యౌపాధికతాం సదృష్టాంతమాహ - స్వేతి. స్వ యోనిషు కాష్ఠేషు. జ్యోతిరగ్నిః గుణవైషమ్యాత్ దీర్ఘ హ్రస్వాది భేదాత్. ప్రకృతౌ దేహే. ॥ 43 ॥

(ధర్మభేదముతో బాటు ఉపాధిలక్షణమును దృష్టాంత పూర్వకముగా చెప్పుచున్నాడు). ఒక్కటే అగ్ని తనకు ఆశ్రయమైన కట్టెల పొట్టి, పొడవు మున్నగు భేదములచే భిన్న భిన్న ఆకారములతో కనిపించును. అట్లే ఒకే ఆత్మ అభివ్యక్తమయ్యే ప్రకృతి కార్యములగు వివిధములైన దేహాదు యందు గుణ భేదముల కారణముగా వేరు వేరుగా భాసించు చున్నది. ॥ 43 ॥

శ్లో ॥ తస్మాదిమాం స్వాం ప్రకృతిం దైవీం సదసదాత్మికామ్ ।
దుర్విభావ్యాం పరాభావ్య స్వరూపేణావతిష్ఠతే ॥ 44

టీ:- తస్మాదితి. స్వప్రకృతిం స్వాంశస్య జీవస్య బంధహేతుం దైవీం దేవస్య శ్రీవిష్ణోశ్శక్తిం పరాభావ్య తత్ప్రసాదేనైవ జిత్వా స్వరూపేణ బ్రహ్మత్వేనావతిష్ఠతే. ॥ 44 ॥

అందువలన శ్రీహరి యొక్క మాయాశక్తియైన ప్రకృతిని ఆయన అనుగ్రహముతోనే జయించవలెను. ఈ ప్రకృతి కార్యకారణరూపముగా పరిణమించి జీవుని మోహింపజేయును. జీవుని బంధనమునకు కారణమగును. కావున భక్తుడు శ్రీహరి అనుగ్రహముతో ప్రకృతిని త్రోసిపుచ్చి తన ఆత్మ స్వరూపము నందు నిలిచియుండును. ॥ 44 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
కపిలోపాఖ్యానే సాధనానుష్ఠానం
నామాష్టావింశతితమోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ఇరువది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము

ఏకోనత్రింశోऽధ్యాయః

శ్లో ॥ ఏకోనత్రింశకే భక్తియోగస్తు బహుధోచ్యతే ।
కాలస్య చ బలం ఘోర సంస్కృతేశ్చ విరక్తయే ॥

దేవహూతిరువాచ

శ్లో ॥ లక్షణం మహదాదీనాం ప్రకృతేః పురుషస్య చ ।
స్వరూపం లక్ష్యతేऽమీషాం యేన తత్పారమార్థికమ్ ॥ 1

టీ:- ఉక్తానువాదపూర్వకం. భక్తిమార్గభేదాన్ పృచ్ఛతి ద్వాభ్యాం- లక్షణమితి. లక్షణం మహదాదీనాం యథాసాంఖ్యేషు తథా కథితం యేన లక్షణేవ. తత్పారమార్థికం పరస్పర వివిక్తమిత్యర్థః. పరస్పరావిరుద్ధ మితి. ॥ 1 ॥

శ్లో ॥ యథా సాంఖ్యేషు కథితం యన్మూలం తత్ప్రచక్షతే ।
భక్తియోగస్య మే మార్గం బ్రూహి విస్తరశః ప్రభో ॥ 2

టీ:- యథేతి. యో యోగో భక్తియోగః మూలం ప్రయోజనం యస్య తత్ యన్మూలం. తత్కథితమ్. తస్య భక్తియోగస్య మార్గం ప్రకారం విస్తరతో మే బ్రూహి. ॥ 2 ॥

29 వ అధ్యాయము

ఈ ఇరువది తొమ్మిదవ అధ్యాయమున పలుభేదములతో గూడిన వైరాగ్యము కలిగించుటకు కాలముయొక్క బలము, ఘోరమైన సంసారగతి వర్ణింపబడినది.

దేవహూతి ఇట్లు పలికెను

(ఈ రెండు శ్లోకములతో గతంలో చెప్పబడిన విషయమును పురస్కరించుకొని భక్తి మార్గభేదములను అడుగుచున్నది.) ఓ ప్రభూ! మహదాది లక్షణములను, ప్రకృతి పురుషుల లక్షణములను, సాంఖ్య శాస్త్రములోనున్న విధముగ నాకు చెప్పితివి. వీటి ద్వారా మహదాదుల వాస్తవిక స్వరూపమును విడివిడిగా తెలిసికొనవచ్చును. దేనికి భక్తియోగమే ప్రయోజనమని చెప్పబడినదో ఆ యోగము నాకు చెప్పియున్నావు. ఇప్పుడు ఆ భక్తి యోగము యొక్క మార్గమును వివరముగ చెప్పవలసినది. ॥ 1-2 ॥

శ్లో ॥ విరాగో యేన పురుషో భగవన్ సర్వతో భవేత్ ।
ఆచక్ష్వ జీవలోకస్య వివిధా మమ సంసృతీః ॥ 3

టీ:- విరాగ ఇతి. యేన సంసృతీనామాఖ్యానేన. వీతరాగో భవేత్. 3

ఓ భగవానుడా! జీవుల యొక్క జనన మరణ రూపమైన వివిధ సంసారగతులను నాకు వివరింపుము. ఈ వర్ణనను వినుట వలన జీవుడు సంపూర్ణ వైరాగ్యమును పొందగలడు. ॥ 3 ॥

శ్లో ॥ కాలస్యేశ్వరరూపస్య పరేషాం చ పరస్య తే ।
స్వరూపం బత కుర్వంతి యద్ధేతోః కుశలం జనాః ॥ 4

టీ:- కాలస్యేతి. ఈశ్వరరూపస్య మహాప్రభావస్య తే త్వదాత్మకస్య. యద్ధేతోర్యద్భయాత్. కుశలం పుణ్యం కుర్వంతి. ॥ 4 ॥

నీవు బ్రహ్మాది దేవతలనుకూడా శాసించేవాడివి. అట్టి నీ స్వరూపమే 'కాలము'. ఈ కాలమునకు భయపడే జనులు పుణ్య కార్యములను చేయుచున్నారు. మహిమాన్వితముయైన కాలస్వరూపమును నాకు చెప్పుము. ॥ 4 ॥

శ్లో ॥ లోకస్య మిథ్యాభిమతేరచక్షుషః
చిరం ప్రసుప్తస్య తమస్యనాశ్రయే ।
శ్రాంతస్య కర్మస్వనువిద్ధయా ధియా
త్వమావిరాసీః కిల యోగభాస్కరః ॥ 5

టీ:- లోకస్యేతి. అచక్షుషః అజ్ఞస్య. అతో మిథ్యాభూతే దేహాదౌ అభిమతిరహంకారో యస్య. అతః కర్మసు అనుబద్ధయా ఆసక్తయా ధియా శ్రాంతస్య. అత ఏవ అనాశ్రయే అపారే తమసి సంసారే చిరం ప్రసుప్తస్య లోకస్య ప్రబోధాయ, త్వం యోగప్రకాశకో భాస్కరః కిలావిర్భూతోఽసి. ॥ 5 ॥

మానవుడు జ్ఞానములేనివాడై మిథ్యారూపములగు దేహాదుల యందు ఆత్మాభిమానము(నేను అనే అహంకారము) కలిగియున్నాడు. ఆ కారణముగా సంసారమనే చీకటిలో చిరకాలము నిద్రించుచున్నాడు. కర్మయందు ఆసక్తమైన బుద్ధిచేత మిక్కిలి అలసియున్నాడు. అజ్ఞానమనే చీకటిని (సంసారము) తొలగించే జ్ఞానభ్కారుడవుగా నీవు అవతరించి-తివి. యోగప్రకాశకుడవై ప్రబోధము కొరకై అవతరించితివి. ॥ 5 ॥

శ్రీమైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఇతి మాతుర్వచః శ్లక్ష్ణం ప్రతినంద్య మహామునిః ।
ఆబభాషే కురుశ్రేష్ఠ ప్రీతస్తాం కరుణార్ద్రితః ॥ 6 ॥

టీ:- ఇతీతి. శ్లక్ష్ణం సుందరం. ॥ 6 ॥

మైత్రేయుడు ఇట్లు పలికెను

కురువంశశ్రేష్ఠుడవగు ఓ విదురా! తల్లిపలికిన ఈ సుందరమైన (మధురమైన) మాటలను విని కపిలమహర్షి సంతోషించెను. ఆయన హృదయము కరుణతో ద్రవించెను. తల్లిని అభినందించి ఇట్లు పలికెను. ॥ 6 ॥

శ్రీభగవానువాచ.

శ్లో ॥ భక్తియోగో బహువిధో మార్గైర్భామిని భావ్యతే ।
స్వభావగుణమార్గేణ పుంసాం భావో విభిద్యతే ॥ 7

టీ:- భక్తియోగ ఇతి. మార్గైః ప్రకారవిశేషైః. తానేవాహ -స్వభావ- భూతా యే గుణాః తేషాం మార్గేణ వృత్తిభేదేన. భావోఽభిప్రాయః ఫల సంకల్పభేదాద్భక్తి భేద ఇత్యర్థః. ॥ 7 ॥

ఓ తల్లీ! సాధకుల భావములననుసరించి భక్తియోగము అనేక విధములుగా నున్నది. సాధకుల స్వభావము, గుణములలో భేదముండుటచే మనుష్యుల యొక్క అభిప్రాయములలో కూడా విభిన్నత కన్పించుచున్నది. ॥ 7 ॥

శ్లో ॥ అభిసంధాయ యో హింసాం దంభం మాత్సర్యమేవ చ ।
సంరంభీ భిన్నదృగ్భావం మయి కుర్యాత్స తామసః ॥ 8

టీ:- అభిసంధాయేతి. అభిసంధాయ సంకల్ప్య. సంరంభీ క్రోధీ. భిన్నదృక్ భేదదర్శీ. యో భావం భక్తిం కుర్యాత్ స త్రివిధోఽపి తామసః ॥ 8 ॥

భేదబుద్ధిగలవాడు, కోపస్వభావముగలవాడు 1.హింస, 2. దంభము, 3. మాత్సర్యము భావములతో సంకల్పపూర్వకముగా భక్తి చేసినచో అది తామసభక్తి అని పిలువబడును. హింస, దంభము, మాత్సర్యములతో ఏ ఒక స్వభావముండినను అది తామస భక్తియే. 8

శ్లో ॥ విషయానభిసంధాయ యశ ఐశ్వర్యమేవ వా ।
అర్చ్యాదావర్చయేద్యో మాం పృథగ్భావః స రాజసః ॥ 9

టీ:- విషయానితి. పృథగ్భావః భేదదర్శీ. ॥ 9 ॥

శ్లో ॥ కర్మనిర్హారముద్దిశ్య పరస్మిన్వా తదర్పణమ్ ।
యజేద్యష్టవ్యమితి వా పృథగ్భావః స సాత్త్వికః ॥ 10

టీ:- కర్మనిర్హారమితి. కర్మనిర్హరం పాపక్షయం. పరస్మిన్ పరమేశ్వరే. తదర్పణం కర్మార్పణం, భగవత్ప్రీతిముద్దిశ్యేత్యర్థః. యష్టవ్యమితి విధిసిద్ధిముద్దిశ్యేత్యర్థః. భేదదర్శిత్వమర్చ్యాదావర్చనం చ త్రిష్వపి సమానం. తదేవం తామసాదిభక్తిషు. త్రయస్త్రయో భేదాః. తాసు యథోత్తరం శ్రైష్ఠ్యం. ఏవం చ శ్రవణకీర్తనాదయో నవాపి ప్రత్యేకం నవ భేదాః. తదేవం సగుణా భక్తిరేకాశీతిభేదా. నిర్గుణా భక్తిరేకవిధైవ. 10

శ్లో ॥ మద్గుణ శ్రుతిమాత్రేణ మయి సర్వ గుహాశయే ।
మనోగతిరవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ ॥ 12

ఎవడైతే భేదదృష్టి కలిగి యుండి, ఇంద్రియభోగములను, కీర్తిని, సంపదలను పొందగోరుతాడో అతడు రాజసభక్తుడు. ఆతడు ప్రతిమ మొదలగువాటి యందు నన్ను ఆరాధించును. ॥ 9 ॥

పాపక్షయము కొరకు చేయునది, పరమేశ్వరుని కొరకు చేసినది, పరమేశ్వరార్పణము చేసినది అనగా భగవత్ప్రీత్యర్థము చేయు భక్తి, శాస్త్రములలో చెప్పినందున చేయు భక్తి సాత్త్విక భక్తియనబడును. భేదదృష్టి, ప్రతిమాదులయందు భక్తిచేయుట, భక్తిచేయుట అనే ఈ మూడు తామస, రాజసిక, సాత్త్విక భక్తులందు సమానమే. వీటిలో తామసభక్తి కన్నా రాజసభక్తి, రాజసభక్తి కన్నా సాత్త్విక భక్తి శ్రేష్ఠమైనది. ఈ రకముగా శ్రవణకీర్తనాది నవవిధభక్తులలో ఒక్కొక్కటి తామస, రాజస, సాత్త్విక భేదములలోనుండును. శ్రవణ కీర్తనాదులలో ఒక్కొక్కటి తొమ్మిది తొమ్మిది విధములుగా నుండి మొత్తము ఎనభై ఒక్క విధములైన భక్తి భేదములేర్పడును. నిర్గుణ భక్తి ఒకే విధము, భేదములేనిది. ॥10॥

(నిర్గుణ భక్తి ఒకేరకము. దానిని చెప్పుచున్నాడు)

గంగాప్రవాహము అఖండముగా సముద్రములో కలిసే విధముగా, నా గుణములను విన్నంతమాత్రమున, తైలధారవలె

టీ:- తామాహ - ద్వాభ్యాం మద్గుణేతి. మనోగతిరితి యా భక్తిః సా నిర్గుణస్య భక్తియోగస్య లక్షణమిత్యన్వయః ॥11

శ్లో ॥ లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్ ।
అహైతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే ॥ 12

టీ:- లక్షణమితి. లక్షణం స్వరూపం. అవిచ్ఛిన్నా సంతతా. అహైతుకీ ఫలానుసంధాన శూన్యా. అవ్యవహితా భేదదర్శనరహితా చ. మద్గుణ శ్రవణమాత్రేణ. మయి శ్రీపురుషోత్తమే. ॥ 12 ॥

శ్లో ॥ సాలోక్య సార్ష్టిసామీప్య సారూప్యైకత్వమప్యుత ।
దీయమానం న గృహ్ణంతి వినా మత్సేవనం జనాః ॥ 13

టీ:- భక్తానాం నిష్కామతాం. కైముత్యన్యాయేనాహ-సాలోక్యేతి. సాలోక్యం మయా సహ ఏకస్మిన్ లోకే వాసం. సార్ష్టిం సమానైశ్వర్యం. సామీప్యం నికటవర్తిత్వం. సారూప్యం సమానరూపతాం. ఏకత్వం సాయుజ్యం. ఉత అపి దీయమానమపి న గృహ్ణంతి. కుతః మత్సేవనం వినా తత్కామేనేత్యర్థః. ॥ 13 ॥

అవిచ్ఛిన్నముగా సర్వాంతర్యామియైన నాయందు భక్తుని మనస్సు సంచరించును. నేను సకలప్రాణుల బుద్ధిగుహయందు సాక్షిరూపముగా నుందును. భక్తుడు ఏ కోరికను కోరకుండా నా యందు అనన్యముగా భక్తి చేయును. ఈ రకమైన భక్తికి నిర్గుణభక్తియని పేరు. ॥ 11-12॥

నిష్కామభక్తులు కేవలము నా సేవయందు ప్రీతి కలిగి యుందురు. 1. సాలోక్యము = భగవంతుని లోకమున నివసించుట 2. సార్ష్టి = భగవానునితో సమానమైన ఐశ్వర్యభోగము. 3. సారూప్యము = భగవానుని వంటి రూపము. 4. సాయుజ్యము = భగవానునితో లీనమగుట, ఏకత్వమును పొందుట. పై నాలుగు రకములైన ముక్తులను ఇచ్చినను వారు స్వీకరింపరు. నా సేవను మాత్రమే కోరుదురు. ॥ 13 ॥

శ్లో ॥ స ఏవ భక్తియోగాఖ్య ఆత్యంతిక ఉదాహృతః ।
యేనాతివ్రజ్య త్రిగుణం మద్భావాయోపపద్యతే ॥ 14

టీ:- కిమితి తర్హి భజంతే? భక్తియోగస్యైవ పరమఫలత్వాదిత్యాహ- సఇతి. నను త్రైగుణ్యం హిత్వా బ్రహ్మప్రాప్తిః పరమఫలం ప్రసిద్ధం. సత్యం. తత్తు భక్తానామానుషంగికమిత్యాహ - యేనేతి. యేన భక్తి-యోగేన. మద్భావాయ బ్రహ్మత్వాయ. ॥ 14 ॥

అట్లైనచో ఎందుకు భజించుదురంటే, ఈ రకమైన నిర్గుణ భక్తియోగమే పరమ ఫలమునిచ్చునని చెప్పబడినది. సత్త్వ రజస్తమో గుణాలను అతిక్రమించి పరమఫలము (బ్రహ్మత్వమును) పొందుదురు. (14)

శ్లో ॥ నిషేవితానిమిత్తేన స్వధర్మేణ మహీయసా ।
క్రియాయోగేన శస్తేన నాతిహింస్రేణ నిత్యశః ॥ 15

టీ:- ఏవంభూతాయాః భక్తేః సాధనాన్యాహ- పంచభిః. నిషేవితేతి. నిషేవితేన సమ్యగనుష్ఠితేన. అనిమిత్తేన ఫలాభిసంధిరహితేన స్వధర్మేణ నిత్యనైమిత్తికేన. మహీయసా శ్రద్ధాదియుక్తేన. క్రియాయోగేన పాంచరాత్రాద్యుక్తపూజాప్రకారేణ. శస్తేన నిష్కామేన. మామభ్యేతీతి పంచమేనాన్వయః. ॥ 15 ॥

శ్లో ॥ మద్ధిష్ణ్య దర్శన స్పర్శా పూజాస్తుత్యభివందనైః ।
భూతేషు మద్భావనయా సత్త్వేనాసంగమేన చ ॥ 16

(ఈ అయిదు శ్లోకములలో భక్తిసాధనములను చెప్పుచున్నాడు.) 1.నిష్కామ భావముతో, శ్రద్ధాపూర్వకముగా తన నిత్య, నైమిత్తిక కర్మలను ఆచరించవలెను. 2. హింసకు తావులేని ప్రశస్తమైన క్రియా యోగమును అనుష్ఠించవలెను. 3.నా మూర్తిని దర్శించుట, స్పృశించుట, పాంచరాత్రాదులందు చెప్పబడిన ప్రకారముగా పూజించుట, స్తోత్రము చేయుట, నమస్కరించుట చేయవలెను, 4.సర్వ ప్రాణుల యందు నేనే యున్నట్లు భావించవలెను, 5. ధైర్యమును, వైరాగ్యమును అవలంబించవలెను, 6. మహాపురుషులను సన్మానించ వలెను, 7.దీనులఎడ దయగలిగి యుండవలెను, 8. తనతో సమానమైన వారిపట్ల మిత్రత్వమును పాటించవలెను, 9.యమ, నియమములను పాటించవలెను.(అహింస,సత్యము,అస్తేయము, బ్రహ్మచర్యము,

శ్లో ॥ మహతాం బహుమానేన దీనానామనుకంపయా ।
మైత్ర్యా చైవాత్మతుల్యేషు శమేన నియమేన చ ॥ 17

టీ:- మదితి. మద్ధిష్ణ్యం మత్ప్రతిమాది తస్య దర్శనాదిభిః. సత్త్వేన ధైర్యేణ. అసంగమేన వైరాగ్యేణ. ॥ 16-17 ॥

శ్లో ॥ ఆధ్యాత్మికానుశ్రవణాన్నామసంకీర్తనా చ్చమే ।
ఆర్జవేనార్యసంగేన నిరహంక్రియయా తథా ॥ 18

టీ:- ఆధ్యాత్మికేతి. ఆర్జవేన అకౌటిల్యేన. ॥ 18 ॥

శ్లో ॥ మద్ధర్మిణో గుణైరేతైః పరిసంశుద్ధ ఆశయః ।
పురుషస్యాంజసాఽభ్యేతి శ్రుతమాత్రగుణం హి మామ్ ॥19

టీ:- మద్ధర్మిణ ఇతి. మద్ధర్మిణః భగవద్ధర్మానుష్ఠాతుః పురుషస్య ఆశయః చిత్తమ్. ॥ 19 ॥

శ్లో ॥ యథా వాత రథో ఘ్రాణమావృఙ్క్తే గంధ ఆశయాత్ ।
ఏవం యోగరతం చేత ఆత్మానమవికారి యత్ ॥ 20 ॥

అపరిగ్రహము అనునవి యమములు, నియమము అనగా శౌచము, సంతుష్టి, తపస్సు, స్వాధ్యాయము ఈశ్వరశరణాగతి). 10.సత్పురుషులగు గురువులవద్ద అధ్యాత్మశాస్త్రమును శ్రవణము చేయవలెను. 11.భగవంతుడనైన నా నామములను కీర్తించవలెను, 12.ఆర్జవము (కుటిలత్వము లేకపోవడము) (సరళత్వము) కలిగి యుండవలెను. 13.సత్పురుషుల సహవాసము చేయవలెను. 14. అహంకారమును త్యజించవలెను. 15. నాకు సంబంధించిన భాగవత ధర్మమును అనుష్ఠించవలెను. ఈ భక్తి సాధనలను చేసినవానికి మనస్సు శుద్ధమై నా గుణములను విన్నంత మాత్రముననే తేలికగా నా యందు (మనస్సు) లగ్నమగును. ॥ 15-19 ॥

(ప్రయత్నం లేకుండానే ప్రాప్తించుటననుటకు దృష్టాంతము)

పుష్పాదుల యొక్క గంధము (వాసన) వాటి ప్రయత్నము లేకుండానే

టీ:- ప్రయత్నం వినైవ ప్రాప్తౌ దృష్టాంతః. యథేతి. వాతో రథః ప్రాపకో యస్య గంధస్య. ఆశయాత్ స్థానాత్, పుష్పాదేః. ఆవృఙ్క్తే ఆత్మసాత్కరోతి. అవికారి శుద్ధం. సమం వా యచ్చేతః చిత్తం. ॥20॥

తామున్న చోటినుండి గాలిద్వారా ముక్కును చేరును. అట్లే భక్తి యోగము చేత పరిశుద్ధమైన మనస్సు (రాగము ద్వేషము లేని మనస్సు) అప్రయత్నముగనే భగవానుని పొందును. ॥ 20 ॥

శ్లో ॥ అహం సర్వేషు భూతేషు భూతాత్మాఽవస్థితః సదా ।
తమవజ్ఞాయ మాం మర్త్యః కురుతేఽర్చావిడంబనమ్ ॥ 21

టీ:- చిత్తశుద్ధిశ్చ సర్వభూతాత్మదృష్ట్యైవ భవతీతి వక్తుం కేవల-ప్రతిమాదినిష్ఠాం నిందన్నాహ - సప్తభిః అహమితి. అర్చైవ విడంబన మనుకరణం. అర్చాయాం పూజా విడంబనమితి. ॥ 21 ॥

(ఈ ఏడు శ్లోకములతో, సమస్త ప్రాణులలో నేను ఉన్నట్లు చూచుటచేతనే చిత్తశుద్ధి ఏర్పడుననియు, కేవల ప్రతిమాదులందలి నిష్ఠను నిందిస్తూ చెప్పుచున్నాడు). నేను సర్వప్రాణుల యందు ఎల్లప్పుడు ఆత్మరూపుడనై నిలిచియుందును. ఇట్టి దశలో మానవుడు ప్రాణులను అనాదరిస్తూ నా అర్చన పేరిట అపహాస్యము చేయు చున్నాడు. ॥ 21 ॥

శ్లో ॥ యో మాం సర్వేషు భూతేషు సంతమాత్మానమీశ్వరమ్ ।
హిత్వార్చాం భజతే మౌఢ్యాద్భస్మన్యేవ జుహోతి సః ॥ 22

నేను సమస్త భూతములలో పరమాత్మ స్వరూపుడుగ నున్నాను. సమస్త ప్రాణులకు ఈశ్వరుడను. ఇట్టి నన్ను ఉపేక్షించి మూఢ బుద్ధితో, కేవలము అర్చామూర్తిగా పూజించుట బూడిదలో హోమము చేయుటయే యగును. ॥ 22 ॥

శ్లో ॥ ద్విషతః పరకాయే మాం మానినో భిన్నదర్శినః ।
భూతేషు బద్ధ వైరస్య న మనః శాంతిమృచ్ఛతి ॥ 23

ఇతరుల శరీరమందును వ్యాపించియున్న నన్ను ద్వేషించే వారికి, గర్వముతోకూడుకున్న వారికి, భేదదృష్టి గలవారికి, ఇతర ప్రాణులయందు బద్ధవైరము గలవారికి మనశ్శాంతి లభించదు. 23

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



టీ:- అవజ్ఞోపేక్షాద్వేష నిందాః క్రమేణ చతుర్భిర్నిషిధ్యంతే. య ఇతి. హిత్వా ఉపేక్ష్య. ॥ 22-23 ॥

శ్లో ॥ అహముచ్చావచైర్ద్రవ్యైః క్రియయోత్పన్నయాఽనఘే ।
నైవ తుష్యేఽర్చితోఽర్చాయాం భూత గ్రామావమానినః॥24

టీ:- అహమితి. ద్రవ్యైరుత్పన్నయా క్రియయా. భూతగ్రామావమానినః తన్నిందకస్య. ॥ 24 ॥

ఓ పాపరహితురాలా! ఇతరులను (సర్వ భూతములను) అవమానించేవాడు, రకరకములైన విలువైన ద్రవ్యములతో విధి విధానముగా, అనేక ప్రకారములుగా నా అర్చామూర్తిని పూజించిననూ నేను ప్రసన్నుడను కాను. (ఎవ్వరినీ అవమానించరాదు. ప్రతి ఒక్కరినీ దైవస్వరూపముగా భావించవలెనని అర్థము.) ॥ 24 ॥

శ్లో ॥ అర్చాదావర్చయేత్తావదీశ్వరం మాం స్వకర్మకృత్ ।
యావన్న వేద స్వహృది సర్వభూతేష్వవస్థితమ్ ॥ 25

టీ:- తర్హి కిమర్చాదావర్చనమనర్థకమేవ? నేత్యాహ - అర్చాదావితి. సర్వభూతేష్వవస్థితం మాం స్వహృది యావన్న వేద. స్వకర్మ కృత్ స్వకర్మావిరోధేన యథావకాశం అనేన కర్మనిష్ఠాయా అపి స ఏవావధిరిత్యుక్తం భవతి. ॥ 25 ॥

(అయినప్పుడు అర్చామూర్తులను పూజించుట వ్యర్థమేనా? కాదని చెప్పుచున్నాడు.) ఎవరైతే తన కర్తవ్యము ఆచరిస్తూనే (యథావకాశముగా) సర్వభూతములలో నున్న పరమాత్మయే తనలో కూడా నున్నాడని ఎంతవరకు తెలియజాలడో అంతవరకు నన్ను అర్చామూర్తి రూపముగా పూజించవలెను. ॥ 25 ॥

శ్లో ॥ ఆత్మనశ్చ పరస్యాపి యః కరోత్యంతరోదరమ్ ।
తస్య భిన్నదృశో మృత్యుర్విదధే భయముల్బణమ్ ॥ 26

మానవుడు తనకు, ఇతరులకు మధ్య ఏ మాత్రము (స్వల్పమైన) భేదమును పాటించినా, అతనికి నేను మృత్యురూపుడనుగా తీవ్రమైన భయమును కలిగించెదను. ॥ 26 ॥

టీ:- ఆత్మన ఇతి. అంతరా అంతరం భేదమ్. ఉత్ అపి. అరమల్పమ్. అల్పమపి భేదం యః పశ్యతీత్యర్థః. యద్వా. అంతరా మధ్యే. ఉదరం శరీరం. మృత్యురహం తస్య భయం విదధే కరోమి. ॥ 26 ॥

శ్లో ॥ అథ మాం సర్వభూతేషు భూతాత్మానం కృతాలయమ్ ।
అర్హయేద్దానమానాభ్యాం మైత్ర్యాஉభిన్నేన చక్షుషా ॥ 27

నన్ను సమస్తప్రాణులలో నివసించేవాడిగను, సర్వాంతర్యామిగను భావించవలెను. నా పరమాత్మ స్వరూపమును పూజింపవలెను. సర్వప్రాణులయందు సమదృష్టి కలిగియుండి దాన, మాన, మిత్రుత్వములతో నన్ను పూజించవలెను. ॥ 27 ॥

టీ:- అథేతి. అథ అతః. సర్వభూతేషు కృతాలయం కృతావాసం. తత్ర హేతుః. భూతానామాత్మానం అంతర్యామిణం. అభిన్నేన చక్షుషా సమదర్శనేన. ॥ 27 ॥

శ్లో ॥ జీవాః శ్రేష్ఠాహ్యజీవానాం తతః ప్రాణ భృతః శుభే ।
తతః సచిత్తాః ప్రవరాస్తతశ్చేంద్రియవృత్తయః ॥ 28

ఓ శుభస్వరూపులారా! (ఈ ఆరున్నర శ్లోకములతో ఏవి ఒకదాని కన్నా ఒకటి ఎక్కువ గౌరవింపదగినవో తారతమ్య పూర్వకముగా చెప్పుచున్నాడు.) ప్రాణములేని రాళ్ళు మొదలగు వాటి కంటె ప్రాణ వృత్తులుగల చెట్లు మొదలగునవి శ్రేష్ఠమైనవి. వీటికంటె శ్వాస పీల్చే ప్రాణులు శ్రేష్ఠమైనవి. వీటి కంటె మనస్సుగల ప్రాణులు శ్రేష్ఠమైనవి. వీటికంటె ఇంద్రియవ్యాపారము గలవి శ్రేష్ఠమైనవి. ॥ 28 ॥

టీ:- తత్రాపి యథోత్తరం మానాద్యతిశయః కర్తవ్య ఇతి వక్తుం తారతమ్యమాహ-సార్ధైష్షడ్భిః జీవా ఇతి. అజీవానాం అచేతనానాం అచేతనేభ్యః. తతస్తేష్వపి ప్రాణభృతః ప్రాణవృత్తిమంతః. సచిత్తాః జ్ఞానవంతః. ఇంద్రియాణాం వృత్తయో యేషు తే. ॥28॥

శ్లో ॥ తత్రాపి స్పర్శవేదిభ్యః ప్రవరా రసవేదినః ।
తేభ్యో గంధవిదః శ్రేష్ఠాస్తతః శబ్దవిదో వరాః ॥ 29

టీ:- తత్రాపీతి. తత్రాపి స్పర్శ వేదిభ్యః ప్రవరాః రస వేదినః. ఇంద్రియ -వృత్తయో వృక్షాణామపి సూక్ష్మాః సంత్యేవ. తథాహి మహాభారతే మోక్షధర్మేషు శ్లో."తస్మాజ్జిఘ్రంతిపాదపాః. తస్మాత్పశ్యంతి పాదపా" ఇత్యాది. ప్రసిద్ధా తు స్పర్శనేంద్రియవృత్తిరేవ. అతస్తేభ్యః. స్పర్శవేదిభ్యః రసవేదినో మత్స్యాదయః శ్రేష్ఠాః. గంధవిదో భ్రమరాదయః. శబ్దవిదః సర్పాదయః. ॥ 29 ॥

వాటి యందు కూడ కేవల స్పర్శజ్ఞానము గల్గిన చెట్ల కంటె రసజ్ఞానము కల్గిన చేపలు మొదలగునవి శ్రేష్ఠములు. వాటి కంటె వాసనను గ్రహించే తుమ్మెదలు మొదలగునవి శ్రేష్ఠములు. వాటికంటె శబ్దమును కూడా గ్రహించే సర్పాదులు శ్రేష్ఠమైనవి. ॥ 29 ॥

శ్లో ॥ రూపభేదవిదస్తత్ర తతశ్చోభయతోదతః ।
తేషాం బహుపదాః శ్రేష్ఠాశ్చతుష్పాదస్తతో ద్విపాత్ ॥ 30

టీ:- రూపేతి. రూపభేదవిదః కాకాదయః ఉభయతో దంతా యేషాం తే అశ్వాదయః. అపాదేభ్యస్తేభ్యో బహుపదః. తేభ్యశ్చతుష్పాద ఇత్యర్థః తతో ద్విపాన్మనుష్యః. ॥ 30 ॥

వాటికంటె రూపభేదమును కూడా గ్రహించే కాకులు మొదలగునవి శ్రేష్ఠములు. వాటికన్న క్రింద,పైన కూడా దంతములు గల గుఱ్ఱములు మొదలగునవి ఉత్తమమైనవి. కాళ్ళులేని వాటి కంటె చాలా కాళ్ళు (పాదములు) గలవి శ్రేష్ఠములు. వాటికంటె నాలుగు పాదములు గల జంతువులు ఉత్తమము. వాటికంటె రెండు కాళ్ళుగల మానవుడు గొప్పవాడు. ॥ 30 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



శ్లో ॥ తతో వర్ణాశ్చ చత్వారస్తేషాం బ్రాహ్మణ ఉత్తమః ।
బ్రాహ్మణేష్వపి వేదజ్ఞో హ్యర్థజ్ఞోఽభ్యధికస్తతః ॥ 31

టీ:- తత ఇతి. తతస్తేషు వర్ణాః. ॥ 31 ॥

మానవులలో నాలుగు వర్ణముల వారు(బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్య, శూద్ర) గొప్పవారు. ఈ నాలుగు వర్ణములలో బ్రాహ్మణులు గొప్పవారు. బ్రాహ్మణులలో కూడా వేదము తెలిసినవారు గొప్పవారు. వారిలో కూడా వేదార్థము తెలిసినవారు ఇంకా గొప్పవారు. ॥ 31 ॥

శ్లో ॥ అర్థజ్ఞాత్సంశయచ్ఛేత్తా తతః శ్రేయాన్ స్వకర్మకృత్ ।
ముక్తసంగస్తతో భూయాన్నదోగ్ధా ధర్మమాత్మనః ॥ 32

టీ:- అర్థజ్ఞాదితి. సంశయచ్ఛేత్తా మీమాంసకః. తతోఽతి కేవలాత్స్వకర్మకృత్. ముక్తసంగస్య లక్షణం ఆత్మనో ధర్మమర్థం చ న దోగ్ధా. నిష్కామ ఇత్యర్థః. ॥ 32 ॥

వేదార్థము తెలిసిన వారికంటె కూడా, సంశయములను తొలగించే మీమాంసకులు గొప్పవారు. వారికంటెను వేదోక్తమైన స్వధర్మమును (వేదోక్తమైన కర్మానుష్ఠానమును) ఆచరించేవాడు గొప్పవాడు. అతని కన్నను కర్మఫలాసక్తిని విడిచినవాడు గొప్పవాడు. 32

శ్లో ॥ తస్మాన్మయ్యర్పితాశేషక్రియార్థాత్మా నిరంతరః ।
మయ్యర్పితాత్మనః పుంసో మయి సన్న్యస్తకర్మణః ।
న పశ్యామి పరం భూతమకర్తుః సమదర్శనాత్ ॥ 33

టీ:- తస్మాదితి. సమర్పితాః అశేషాః క్రియాః. అర్థాః తత్ఫలాని ఆత్మా దేహశ్చ యేన. అతఏవ నిరంతరః అవ్యవహితః. నేతి. అకర్తుః కర్తృత్వాభిమానశూన్యాత్. ॥ 33 ॥

వానికంటెను తన సమస్త కర్మలను, వాని ఫలములను, శరీరమును కూడా నాకే అర్పించి, భేదభావము లేకుండా యుండేవాడు గొప్పవాడు. ఈ రకముగా నాయందే మనస్సును, కర్మలను కూడా సమర్పించిన కర్తృత్వాభిమాన రహితుడు, సమదర్శియయిన మానవుని కంటె గొప్పవ్యక్తి నాకు కనిపించుట లేదు. ॥ 33 ॥

శ్లో ॥ మనసైతాని భూతాని ప్రణమేద్బహు మానయన్ ।
ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి ॥ 34

టీ:- జీవానాం కలయా పరికలనేన అంతర్యామితయా ప్రవిష్ట ఇతి దృష్ట్వేత్యర్థః. ॥ 34 ॥

ఈ సమస్తప్రాణులలో భగవానుడైన శ్రీహరియే జీవ రూపములో నున్నాడు. కనుక సమస్త ప్రాణులను గొప్పగా ఆదరిస్తూ మనస్సులో వాటికి నమస్కరించవలెను. ॥ 34 ॥

శ్లో ॥ భక్తియోగశ్చ యోగశ్చ మయా మానవ్యుదీరితః ।
తయోరేకతరేణైవ పురుషః పురుషం వ్రజేత్ ॥ 35

టీ:- ఉక్తం భక్తియోగం పూర్వోక్తేనాష్టాంగయోగేన సహోపసంహరతి భక్తియోగశ్చేతి- హే మానవీతి. పురుషం పరమేశ్వరం. ॥ 35 ॥

(గతములో చెప్పిన అష్టాంగయోగముతో సహా ఇప్పుడు చెప్పిన భక్తియోగమును ఉపసంహరించుచున్నాడు.) ఓ మనుచక్రవర్తి కూతురా! నీకు నేను భక్తియోగమును, అష్టాంగయోగమును కూడా చెప్పినాను. ఈ రెండింటిలో ఏ ఒక్క యోగమును అవలంబించిననూ మానవుడు ఆ పరమపురుషుని పొందును. ॥ 35 ॥

శ్లో ॥ ఏతద్భగవతో రూపం బ్రహ్మణః పరమాత్మనః ।
పరం ప్రధానం పురుషం దైవం కర్మవిచేష్టితమ్ ॥ 36

టీ:- యదన్యత్పృష్టం జీవస్య సంసృతీః కాలస్య స్వరూపం చాచక్ష్వేతి తదాహ సార్ధేన. ఏతత్ సర్వనియంతృ యద్భగవతో రూపం.కీదృశం ప్రధానపురుషాత్మకం పరం తద్వ్యతిరిక్తం చ ఏతదేవ దైవమిత్యభిధీయతే. కీదృశం. కర్మణాం విచేష్టితం నానా సంసృతి లక్షణం యస్మాత్తత్. దైవప్రేరిత కర్మకృతాః సంసృతయోఽపి విచిత్రా ఇత్యర్థః. ॥ 36 ॥

(నీవడిగిన ఇంకో విషయమైన జీవుని సంసారగతిని, కాల స్వరూపమును చెప్పుచున్నాను. వినవలసినది.) ఈ ప్రపంచమంతయు భగవంతుడైన పరబ్రహ్మ (పరమాత్ముని) యొక్క రూపమే. 1.ప్రకృతి 2.ప్రకృతికికన్నా భిన్నమైనవాడైన పురుషుడు. 3.నానా వివిధములైన కర్మఫలముగా ఉండే అదృష్టరూపమైన 'దైవము'. ఈ మూడుకూడా భగవంతుని రూపములే. ॥ 36 ॥

శ్లో ॥ రూపభేదాస్పదం దివ్యం కాల ఇత్యభిధీయతే ।
భూతానాం మహదాదీనాం యతో భిన్నదృశాం భయమ్ ॥37

టీ:- ఏతదేవ భగవతో రూపం. కాలఇతి చాభిధీయతే. కీదృశం రూపం. రూపభేదస్య వస్తూనామన్యథాత్వస్య ఆస్పదం ఆశ్రయః కారణముక్తం హి. కాలాద్గుణవ్యతికరాదితి వక్ష్యతి చ – గుణవ్యతికరః కాల ఇతి. దివ్యం అత్యద్భుత ప్రభావం. యావత్సమాప్తి. భూతానామితి. మహదాదీనాం తత్తదభిమానినాం జీవానామ్. ॥ 37 ॥

(భగవంతుని రూపమే 'కాలము'గా చెప్పబడుచున్నది). 'కాలాద్గుణ వ్యతికరః','గుణవ్యతికరః' అని చెప్పబడినట్లు సత్త్వరజస్తమో గుణ మిశ్రణముచేతనే ఈ ప్రపంచమునందలి వివిధ నామ రూపాత్మక-మైన వస్తుజాలము, జీవజాలము ఏర్పడుచున్నది. ఇలా ఏర్పడుటకు కారణమైన భగవంతుని అద్భుత ప్రభావమునకే 'కాలము' అని పేరు. మహత్తు మొదలగు తత్త్వములు, వాటి అభిమాన దేవతలతో సహా భేదదృష్టిగల సమస్త ప్రాణులు ఈ కాలమునకు భయపడుచుందురు. ॥ 37 ॥

శ్లో ॥ యోఽంతః ప్రవిశ్య భూతాని భూతైరత్త్యఖిలాశ్రయః ।
స విష్ణ్వాఖ్యోఽధియజ్ఞోఽసౌ కాలః కలయతాం ప్రభుః ॥38

టీ:- భయహేతుత్వమేవాహ-య ఇతి. భూతైరేవ భూతాన్యత్తిసంహ-రతి. అధిజ్ఞో యజ్ఞఫలదాతా. కలయతాం వశీకుర్వతామ్. ॥ 38-40।

(భయమునకు కారణము చెప్పుచున్నాడు) కాలము సమస్తమునకు ఆశ్రయమైనది. కాలమే ప్రాణుల లోపల ప్రవేశించి పంచ భూతములద్వారానే ప్రాణులను నశింపజేయును. ఇతరులను వశము చేసికొనిన వారిని కూడ కాలము శాసించును. యజ్ఞఫల ప్రదాత యగు విష్ణువే కాలము. ॥ 38 ॥

శ్లో ॥ న చాస్య కశ్చిద్దయితో న ద్వేష్యో న చ బాంధవః ।
ఆవిశత్యప్రమత్తోఽసౌ ప్రమత్తం జనమంతకృత్ ॥ 39 ॥

ఈ కాలమునకు ఒకడు ప్రియుడు అని కాని, ఒకడు ద్వేషి యని కాని యుండదు. కాలమునకు బంధువులు లేరు. అందరినీ సంహరించును. సర్వమును నశింపజేసే ఈ కాలము అప్రమత్తముగా నుండును. విషయాసక్తులై ప్రమత్తులైయున్న వారిలో ప్రవేశించి వారిని నశింపజేయును. ॥ 39 ॥

శ్లో ॥ యద్భయాద్వాతి వాతోఽయం సూర్యస్తపతి యద్భయాత్ ।
యద్భయాద్వర్షతే దేవో భగణో భాతి యద్భయాత్ ॥ 40

కాలరూపమున్న నున్న భగవానుని భయము వలననే గాలి వీచుచున్నది. సూర్యుడు ప్రకాశించుచున్నాడు. ఇంద్రుడు వర్షములు కురియించుచున్నాడు. నక్షత్రములు ప్రకాశించుచున్నవి. ॥ 40 ॥

శ్లో ॥ యద్వనస్పతయో భీతా లతాశ్చౌషధిభిః సహ ।
స్వే స్వే కాలేఽభిగృహ్ణంతి పుష్పాణి చ ఫలాని చ ॥ 41

టీ:- యదితి. యత్ యస్మాద్భీతాః. ॥ 41 ॥

చెట్లు, తీగలు, ఓషధులు కూడా కాల స్వరూపుని భయము వలననే తమ తమ కాలముననుసరించి పూలు, పండ్లను ధరించు చున్నవి. ॥ 41 ॥

శ్లో ॥ స్రవంతి సరితో భీతా నోత్సర్పత్యుదధిర్యతః ।
అగ్నిరింధే సహగిరిర్భూర్న మజ్జతి యద్భయాత్ ॥ 42

టీ:- యతో భీతాః సరితః స్రవంతి. అగ్నిరితి. ఇంధే దీప్యతే సహ-గిరిభిర్భూః. ॥ 42 ॥

ఈ కాలమునకు భయపడియే నదులు ప్రవహించుచున్నవి. సముద్రము తన మర్యాదను అతిక్రమింపకున్నది. (చెలియ కట్ట దాటి రాకున్నది) దీని భయము వలననే అగ్ని ప్రజ్వరిల్లుచున్నది. మరియు ఈ కాలము యొక్క భయము వలననే పర్వతములతో కూడిన భూమి నీట మునగకుండా ఉన్నది. ॥42॥

శ్లో ॥ నభో దదాతి శ్వసతాం మార్గం యన్నియమాదదః ।
లోకం స్వదేహం తనుతే మహాన్ సప్తభిరావృతమ్ ॥ 43

టీ:- అధో నభః. యన్నియమాత్ యస్యాజ్ఞయా. మహాన్ మహత్తత్త్వం అంకురాత్మకం స్వదేహం లోకత్వేన తనుతే విస్తారయతి. 43

ఈ కాలము యొక్క ఆజ్ఞమేరకే ఆకాశము ప్రాణుల యొక్క శ్వాసక్రియకు అవకాశమిచ్చుచున్నది. మఱియు మహత్తత్త్వము కూడ కాలమునకు లోబడియే అహంకారరూపమైన శరీరమును ఏడు ఆవరణలతో కూడిన బ్రహ్మాండమురూపములో విస్తరింపజేయుచున్నది. ॥ 43 ॥

శ్లో ॥ గుణాభిమానినో దేవాః సర్గాదిష్వస్య యద్భయాత్ ।
వర్తంతేఽనుయుగం యేషాం వశ ఏతచ్చరాచరమ్ ॥ 44

టీ:- గుణాభిమానినో గుణ నియంతారః. దేవాః బ్రహ్మాదయః. అస్య విశ్వస్య. సర్గాదిషు ప్రవర్తంతే. అనుయుగం వారం వారమిత్యర్థః ॥45 ॥

స్థావర జంగమాత్మమగు ఈ ప్రపంచము విష్ణువు మొదలగు దేవతలవశములో నున్నది. ఆ దేవతలు సత్త్వరజస్తమో గుణములకు అభిమానులు. కాలస్వరూప భగవానునికి భయపడియే ప్రతి కల్పము నందు ఈ జగత్తును సృష్టించుట, స్థితి యందుచుట, లయమొనర్చుట అనే కార్యములను చేయుచున్నారు. ॥ 44 ॥

శ్లో ॥ సోఽనంతోఽంతకరః కాలోఽనాదిరాదికృదవ్యయః ।
జనం జనేన జనయన్మారయన్మృత్యునాంతకమ్ ॥ 45

టీ:- స ఇతి. జనేన పిత్రాదినా జనం పుత్రాదిం జనయన్ ఆదికృత్. మృత్యునాంతతకమపి మారయన్ అంతకరః స్వయం త్వనాదిరనంతోఽవ్యయశ్చ ॥ 45 ॥

ఈ కాలము అంతములేనిదైననూ సర్వమునకు అంతమును కలిగించును. ఇది ప్రారంభమునకు అవకాశమిచ్చునది. వికారము లేనిది. తల్లిదండ్రుల రూపములో సంతానమును కలిగింప జేయునది ఈ కాలమే. అంతకుడైన యమధర్మరాజాదులను (క్రూరజంతువులను) కూడ ఈ కాలము మరణింపజేయును. ॥ 45 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే, కపిలోపాఖ్యానే ఏకోనత్రింశత్తమోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు ఇరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము

త్రింశోఽధ్యాయః

శ్లో॥ త్రింశే తు కాయకాంతాది లాలనాకులచేతసామ్ ।
కామినాం తామసీ పాపాదధోగతిరుదీర్యతే ॥

శ్రీకపిల ఉవాచ

శ్లో॥ తస్యై తస్య జనో నూనం నాయం వేదోరువిక్రమమ్ ।
కాల్యమానోఽపి బలినో వాయోరివ ఘనావళిః ॥ 1

టీ:- కాలప్రభావ వర్ణనపూర్వకం. వైరాగ్యాయ విచిత్ర కర్మకృతాం సంసృతిం అధ్యాయత్రయేణ ప్రపంచయతి - తస్యేతి. తస్యైతస్య బలినః కాలస్య. బలినేతి వా పాఠః. కాల్యమానః. విచాల్యమానోఽపి. వాయోర్విక్రమం యథా మేఘపఙ్క్తిః న వేద తద్వత్. ॥ 1 ॥

శ్లో॥ యం యమర్థముపాదత్తే దుఃఖేన సుఖహేతవే ।
తం తం ధునోతి భగవాన్ పుమాన్ శోచతి యత్కృతే ॥ 2

టీ:- విక్రమమేవాహ - యం యమితి. యం యమర్థం దుఃఖేన ప్రయాసేన. ఉపాదత్తే ఆపాదయతి. తం తం భగవాన్ కాలః. ధునోతి వినాశయతి. యత్కృతే యన్నిమిత్తం. శోకహేతుః. ॥ 2 ॥

30 వ అధ్యాయము

తన శరీరమును, భార్య పుత్రాదులను పోషించుటకై వ్యాకుల చిత్తముగలవాడు, కాముకుడు పొందే అధోగతి ఈ ముప్పదియవ అధ్యాయమున వర్ణింపబడినది.

శ్రీకపిల భగవానుడు ఇట్లు పలికెను

ఓ జననీ! వాయువు ద్వారా ఎగురగొట్టబడిన మేఘములు ఆ వాయువు యొక్క పరాక్రమమును తెలియజాలవు. అట్లే కాల ప్రభావముచే సంసారములో గిరగిరా తిరుగుచున్న జీవుడు ఆ కాలము యొక్క పరాక్రమమును తెలిసికొనజాలడు. ॥ 1 ॥

(కాలము యొక్క విక్రమమును చెప్పుచున్నాడు). మానవుడు బహు ప్రయాసపడి ఏయే వస్తుజాలమును సంపాదించుచున్నాడో ఆ యా సమస్త వస్తుజాలమును కాలరూపభగవానుడు వినాశము చేయుచున్నాడు. ఆ నశించు వస్తుజాలము కొఱకు మానవుడు మిక్కిలి దుఃఖించుచున్నాడు. ॥ 2 ॥

శ్లో ॥ యదధ్రువస్య దేహస్య సానుబంధస్య దుర్మతిః ।
ధ్రువాణి మన్యతే మోహాద్గృహ క్షేత్ర వసూని చ ॥ 3

టీ:- శోకే హేతుః. యదితి. యత్ యస్మాత్ సానుబంధస్య కళత్రాది-సహితస్య దేహస్య సంబంధీని గృహాదీని. వసు ద్రవ్యం. అనుక్తసముచ్చ-యార్థ శ్చకారః. ॥ 3 ॥

(శోకమునకు కారణము) దుర్మతియైన మానవుడు అజ్ఞానము వలన తన దేహమును, బంధువులను శాశ్వతములనుకొనును. కాని ఇవి అశాశ్వతములు. మిక్కిలి అనుబంధమున్న కారణముగా ఇల్లు, క్షేత్రము (పొలము), ధనము మొదలగు అశాశ్వతములను శాశ్వతములుగా భావించి దుఃఖపడుచున్నాడు. ('చ'కారము ఈ శ్లోకములో చెప్పబడని వస్తువులను కూడా సూచించుచున్నది.) ॥ 3 ॥

శ్లో ॥ జంతుర్వై భవ ఏతస్మిన్ యాం యాం యోనిమనువ్రజేత్ ।
తస్యాం తస్యాం న లభతే నిర్వృతిం న విరజ్యతే ॥ 4

టీ:- దుర్మతిత్వం దర్శయన్ దుఃఖం ప్రపంచయతి - జంతురిత్యాది చతుర్దశభిః. ॥ 4 ॥

(ఈ పదునాలుగు శ్లోకములతో దుర్మతిత్వము చూపుచూ దుఃఖమును వివరించుచున్నాడు.) ఈ సృష్టిలో జీవుడు, మనుష్యుడు మొదలగు ఏ యే యోనులందు జన్మించినను ఆ యా యోనుల-యందే సుఖము అనుభవించుచున్నట్లుగా భావించును. అందువలన వైరాగ్యమును పొందుటలేదు. ॥ 4 ॥

శ్లో ॥ నరకస్థోఽపి దేహం వై న పుమాంస్త్యక్తుమిచ్ఛతి ।
నారక్యాం నిర్వృతౌ సత్యాం దేవమాయా విమోహితః ॥ 5

టీ:- నరకస్థ ఇతి. నారక్యాం నరకాహారాదిభిర్జాతాయాం. ॥ 5 ॥

జీవుడు తన కర్మవశముచేత నరకలోకమునకు వెళ్ళినను భగవంతుని మాయచేత మోహింపబడినవాడై ఆ నరకమును వదులుటకు ఎంతమాత్రము ఇష్టపడడు. అచట లభించే కొద్దిపాటి ఆహారసుఖమును పొందుచు బహు దుఃఖప్రదమైన ఆ లోకములోనే సుఖమును పొందుచున్నాననుకొనును. ॥ 5 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ ఆత్మజాయా సుతాగార పశు ద్రవిణ బంధుషు ।
నిరూఢమూల హృదయమాత్మానం బహుమన్యతే ॥ 6

టీ:- ఆత్మేతి. నిరూఢమూలం ప్రసృతమనోరథం హృదయం యస్య. బహుమన్యతే కృతార్థోఽహమితి శ్లాఘతే. ॥ 6 ॥

మానవుడు తన దేహము, భార్య, కొడుకులు, ఇల్లు, పశువులు, ధనము, బంధువులు మొదలగువాటియందు గట్టిగా మనస్సును నిల్పును. ఎప్పటికప్పుడు క్రొత్త కోరికలు పుట్టుచుండగా తనకు తాను కృతార్థుడైనట్లుగా భావించును. ॥ 6 ॥

శ్లో ॥ దందహ్యమాన సర్వాంగ ఏషాముద్వహనాధినా ।
కరోత్యవిరతం మూఢో దురితాని దురాశయః ॥ 7

టీ:- దందహ్యమానేతి. ఉద్వహనాధినా పోషణాది చింతయా.॥7 ॥

భార్యాపుత్రాదులను, ఇతరములైన వాటిని పోషించే చింతతో మిక్కిలి తాపముతో గూడిన శరీరముగలవాడై, మూఢుడై, దుష్టచిత్తము గలవాడై నిరంతరము పాపములు చేయుచుండును. ॥ 7 ॥

శ్లో ॥ ఆక్షిప్తాత్మేంద్రియః స్త్రీణామసతీనాం చ మాయయా ।
రహో రచితయాలాపైః శిశూనాం కలభాషిణామ్ ॥ 8

టీ:- దురాశయత్వమేవాహ-ఆక్షిప్తేతి. ఆక్షిప్తః ఆత్మా ఇంద్రియాణి చ యస్య కయా. అసతీనాం పుంశ్చలీనామపి రహసి రచితయా సంభోగాదిరూపయా. మధురభాషిణాం శిశూనాం ఆలాపైశ్చ. సుఖవన్మన్యత ఇత్యుత్తరేణాన్వయః. ॥ 8 ॥

(దురాశయత్వమును చెప్పుచున్నాడు.)

మానవుడు చెడుస్త్రీలు చేసే మాయలకు గురియగును. చిన్నపిల్లల మధురములైన పలుకులకు ఆకర్షింపబడిన మనస్సు గలవాడగును. కపటకార్యములతో గూడిన దుఃఖము ప్రధానముగాగల గృహకార్యములను జాగ్రత్తగా నిర్వహించును. దుఃఖమును పోగొట్టే ప్రయత్నము చేయుచు, దానినే సుఖమని భ్రాంతిపడును. ॥ 8-9 ॥

శ్లో ॥ గృహేషు కూట ధర్మేషు దుఃఖ తంత్రేష్వతంద్రితః ।
కుర్వన్ దుఃఖప్రతీకారం సుఖవన్మన్యతే గృహీ ॥ 9

టీ:- గృహేష్వితి. కూటాః విత్త శాఠ్యాది బహుళాః ధర్మాః యేషు దుఃఖప్రధానేషు. ॥ 9 ॥

శ్లో ॥ అర్థైరాపాదితైర్గుర్వ్యా హింసయేతస్తతశ్చ తాన్ ।
పుష్ణాతి యేషాం పోషేణ శేషభుగ్యాత్యధః స్వయమ్ ॥ 10

టీ:- అర్థైరితి. యేషాం పోషణేన అధో యాతి తాన్ పుష్ణాతి. శేష-భుగితి భోగోఽపి తస్య దుర్లభ ఇత్యర్థః. ॥ 10 ॥

శ్లో ॥ వార్తాయాం లుప్యమానాయామారబ్ధాయాం పునః పునః ।
లోభాభిభూతో నిస్సత్త్వః పరార్థే కురుతే స్పృహామ్ ॥ 11

టీ:- వార్తాయామితి. వార్తాయాం జీవికాయాం. నిస్సత్వః దుర్బలః అశక్తః. పరార్థే పరస్వే. ॥ 11 ॥

అక్కడ ఇక్కడ (అంతట) హింసచేసి సంపాదించిన ద్రవ్యముతో భార్యాపుత్రాదులను పోషించును. వారు అనుభవించగా మిగిలిన దానిని తాను అనుభవించును.(భోగము కూడా దుర్లభము) ఈ విధముగా ఇతరులను పోషించుటకు చేసిన పాపము వలన తాను స్వయముగా నరకమును పొందును. (నరకమునకు పోవును)॥10 ॥

ఒకప్పుడు ఎంత ప్రయత్నించినను జీవనాధారము(జీవిక) లోపించును. జీవనాధారము కొరవడగా(తక్కువకాగా) లోభమునకు తల ఒగ్గును. శక్తి లేని వాడగును. ఈ పరిస్థితులలో ఇతరుల ధనము యందు ఆశపడును. ॥ 11 ॥

శ్లో ॥ కుటుంబ భరణా కల్పో మంద భాగ్యో వృథోద్యమః ।
శ్రియా విహీనః కృపణో ధ్యాయన్ శ్వసితి మూఢధీః ॥ 12

టీ:- కుటుంబేతి. అకల్యః అసమర్థః. ॥ 12 ॥

కుటుంబమును పోషించుటయందు అసమర్థుడగును. భాగ్యహీనుడగును. చేసెడి ప్రయత్నములు వ్యర్థమగుచుండును. సంపదలేనివాడగును. దీనుడై, మూఢుడై నిట్టూర్పు విడుచుచుండును. ॥ 12 ॥

శ్లో ॥ ఏవం స్వభరణాకల్పం తత్కళత్రాదయస్తథా ।
నాద్రియంతే యథా పూర్వం కీనాశా ఇవ గోజరమ్ ॥ 13

టీ:- ఏవమితి. పూర్వం యథా ఆద్రియంతే తథా ఆదరం న కుర్వంతి. కీనాశాః కృపణాః కృషీవలాః. గోజరం వృద్ధం బలీవర్దం. 13

ఈ విధముగా తనను తాను పోషించుకోలేనప్పుడు, ముసలి ఎద్దును దుష్టులైన వ్యవసాయదారులు ఆదరించనట్లు. తన భార్యాపిల్లలే (కుటుంబమువారే) పూర్వము ఆదరించినట్లుగా ఆదరించరు.॥13 ॥

శ్లో ॥ తత్రాప్యజాత నిర్వేదో భ్రియమాణః స్వయం భృతైః ।
జరయోపాత్త వైరూప్యో మరణాభిముఖో గృహే ॥ 14

టీ:- తత్రేతి. భ్రియమాణః పుష్యమాణః. ॥ 14 ॥

ఈ పరిస్థితిలో కూడా వైరాగ్యము ఉదయించదు. ఇప్పటి వరకు భార్యా పిల్లలను పోషించిన తాను ఇప్పుడు అదే భార్యా పిల్లలచే పోషింప బడుచుండును. ముసలితనము చేత దేహము వికృతాకారమగును. మరణమునకు ఎదురు చూస్తూ ఇంట్లో నుండును. ॥14 ॥

శ్లో ॥ ఆస్తేఽవమత్యోపన్యస్తం గృహపాల ఇవాహరన్ ।
ఆమయావ్య ప్రదీప్తాగ్నిరల్పాహారోఽల్ప చేష్టితః ॥ 15

టీ:- ఆస్త ఇతి. అవమత్యా అవజ్ఞయా ఉపన్యస్తం సమీపే ప్రక్షిప్తం గృహపాలః శ్వేవ. ఆహరన్ భుంజానః. ఆమయావీ రోగీ. ॥ 15 ॥

భార్యాపిల్లలు కుక్కకు ఆహారము వేసినట్లుగా, అవమాన-పరుస్తూ తన ముందు పడేసిన ఆహారమును తినును. అజీర్ణవ్యాధితో జఠరాగ్ని పనిచేయదు. అల్పాహారియై, చేష్టలుడిగినవాడై రోగముతో బాధపడుచూ ఒకేచోట పడి యుండును. ॥ 15 ॥

శ్లో ॥ వాయునోత్క్రమతోత్తారః కఫసంరుద్ధనాడికః ।
కాస శ్వాస కృతాయాసః కంఠే ఘుర ఘురాయతే ॥ 16

టీ:- వాయునేతి. ఉత్తారః బహిర్నిర్గతనేత్రః. కఫేన సంరుద్ధాః నాడయః మార్గభూతాః యస్య. తేన కాసశ్వాసాభ్యాం కృతః ఆయాసో యస్య. ఘుర ఘుర ఇతి శబ్దం కరోతి. ॥ 16 ॥

వృద్ధాప్యంతో ఆసన్నమరణుడై బాధపడుతున్న ఆ జీవికి ఊపిరి పైకితన్నును (ఎగదన్నును). కనుగ్రుడ్లు బయటకు వచ్చును. కఫము నాడులను మూసివేయును. దగ్గు, శ్వాస ఆయాసము కలిగించును. కంఠము నందు ఘుర ఘుర శబ్దము మొదలగును. ॥ 16 ॥

శ్లో ॥ శయానః పరిశోచద్భిః పరివీతః స్వబంధుభిః ।
వాచ్యమానోఽపి న బ్రూతే కాలపాశవశంగతః ॥ 17

టీ:- శయాన ఇతి. పరివీతః పరివేష్టితః. వాచ్యమానః సంబోధ్య బంధో, తాతేత్యాహూయమానః. ॥ 17 ॥

ఆతడు పడుకొని యుండగా చుట్టూ బంధువులు సన్నిహితులు చేరి ఏడ్చుచుందురు. కాల పాశమునకు చిక్కిన అతడు, కొడుకు నాన్నా! నాన్నా! అని పిలుచుచున్నను పలుకజాలడు. ॥ 17 ॥

శ్లో ॥ ఏవం కుటుంబ భరణే వ్యాపృతాత్మాఽజితేంద్రియః ।
మ్రియతే రుదతాం స్వానామురువేదనయాస్తధీః ॥ 18

టీ:-- ఏవమితి. అస్తధీః నష్టమతిః. ॥ 18 ॥

కుటుంబ పోషణ యందే పూర్తిగా మనస్సును లగ్నము చేయుట చేత ఇంతవరకు ఇంద్రియములను జయించలేదు. ఇప్పుడు బంధువు లందరూ ఏడ్చుచుండగా గొప్పబాధననుభవించును. బుద్ధిశక్తి నశించగా మరణించును. ॥ 18 ॥

శ్లో ॥ యమదూతౌ తదా ప్రాప్తౌ భీమౌ సరభసేక్షణౌ ।
స దృష్ట్వా త్రస్త హృదయః శకృన్మూత్రం విముంచతి ॥ 19

టీ:- మృతస్య పుణ్య పాపాభ్యాం ద్వే గతీ. తత్ర పాపగతిమాహ-యావదధ్యాయ పరిసమాప్తి. యమదూతావితి. సరభసం స క్రోధమీక్షణం యయోస్తౌ దృష్ట్వా. ॥ 19 ॥

(మరణించే వారికి పుణ్యమార్గము, పాపమార్గము అని రెండు త్రోవలుండును. అధ్యాయసమాప్తి వరకు పాపుల మార్గమును చెప్పుచున్నాడు). మరణ సమయములో అతనికి యమదూతలు కనబడుదురు. వారు భయంకరాకారము కలిగి, మిక్కిలి కోపముతో చూచుచుందురు. అట్టి యమదూతలను చూచి, మనస్సులో మిక్కిలి భయపడి మలమూత్రములను వదులును. ॥19

శ్లో ॥ యాతనాదేహమావృత్య పాశైర్బద్ధ్వా గళే బలాత్ ।
నయతో దీర్ఘమధ్వానం దండ్యం రాజభటా యథా ॥ 20

టీ:- యాతనేతి. ఆవృత్య నిరుధ్య. ॥ 20 ॥

ఆ యమభటులు జీవునికి యాతనాదేహమును ధరింపజేసి ఆ దేహమును కట్టివేయుదురు. మెడను గట్టిగా త్రాళ్ళతో కట్టి శిక్షార్హుడైన అపరాధిని రాజభటులు తీసుకవెళ్ళినట్లు యమమార్గము నందు నడిపించెదరు. ॥ 20 ॥

శ్లో ॥ తయోర్నిర్భిన్నహృదయస్తర్జనైర్జాతవేపథుః ।
పథి శ్వభిర్భక్ష్యమాణ ఆర్తోఽఘం స్వమనుస్మరన్ ॥ 21

టీ:- తయోరితి. తయోః తర్జనైః నిర్భిన్నం హృదయం యస్య. ఆర్తస్సన్ సంశ్చలతీతి ద్వితీయేనాన్వయః. ॥ 21 ॥

యమభటులు బెదిరించుచుండగా గుండె పగులును. వణుకు పుట్టును, దారిలో కుక్కలు కరచుచుండును. అప్పుడు ఆ జీవునకు తాను చేసిన పాపములన్నియు గుర్తుకు వచ్చును. దుఃఖిస్తూ ఆ మార్గమున నడచును. ('చలతి' అనే రాబోయే క్రియాపదముతో అన్వయము). ॥ 21 ॥

శ్లో ॥ క్షుత్తృట్పరీతోఽర్కదవానలానిలైః
సంతప్యమానః పథి తప్తవాలుకే ।
కృచ్ఛ్రేణ పృష్ఠే కశయా చ తాడితః
చలత్యశక్తోఽపి నిరాశ్రమోదకే ॥ 22

టీ:- క్షుదితి. క్షుత్తృడ్భ్యాం పరీతః వ్యాప్తః. తప్తాః వాలుకాః యస్మిన్ నిర్గతః ఆశ్రమో విశ్రామస్థానముదకం చ యస్మిన్. ॥ 22 ॥

ఆ జీవునకు ఆకలి దప్పికలు కలుగును (వ్యాపించును). తీక్ష్ణమైన ఎండచేత, దావానలము చేత మిక్కిలి వేడిగాలుల చేత పీడింపబడును. బాగా కాలుచున్న ఇసుకలో నడుచును. త్రాగుటకు నీళ్ళుండవు. విశ్రాంతి స్థలముండదు. యమదూతలు కొరడాలతో కొట్టుచుందురు. ఇన్ని బాధలతో అతికష్టముగా యమమార్గమున నడుచును. ॥ 22 ॥

శ్లో ॥ తత్ర తత్ర పతన్ శ్రాంతో మూర్ఛితః పునరుత్థితః ।
పథా పాపీయసా నీతస్తమసా యమసాదనమ్ ॥ 23

టీ:- తత్ర తత్రేతి. యమసాదనం నీతో భవతీత్యర్థః. ॥ 23 ॥

ఆ జీవుడు మిక్కిలి అలసినవాడై బహుకష్టముగా నడచుచు మూర్ఛిల్లిను. మరల లేచి పాపులకు తగినదియు, చిమ్మచీకటితో కూడినదియునగు ఆ యమమార్గమున యమదూతలు నడిపించుచుండగా యమపురికి వెళ్ళును. ॥ 23 ॥

శ్లో ॥ యోజనానాం సహస్రాణి నవతిం నవ చాధ్వనః ।
త్రిభిర్ముహూర్తైర్ద్వాభ్యాం వా నీతః ప్రాప్నోతి యాతనాః ॥ 24

టీ:- తత్రైవ విశేషమాహ-యోజనానామితి. అధ్వనః సంబంధినాం యోజనానాం నవతిం నవ చ సహస్రాణి పాపాధిక్యే ద్వాభ్యాం వా నీతః సన్. ॥ 24 ॥

(అచ్చటి విశేషమును చెప్పుచున్నాడు). యమలోకమార్గము తొంభైతొమ్మిదివేల యోజనముల దూరముండును. ఇంతటి దూరమును రెండు మూడు మహూర్తములలోనే తీసుకవెళ్ళెదరు. అచ్చట ఆ జీవి యాతనలను అనుభవించును. (పాపాధిక్యము గల వాడిని రెండే ముహూర్తములలో తీసుకపోయెదరని అభిప్రాయము కావచ్చును.)24

శ్లో ॥ ఆదీపనం స్వగాత్రాణాం వేష్టయిత్వోల్ముకాదిభిః ।
ఆత్మమాంసాదనం క్వాపి స్వకృత్తం పరతోఽపి వా ॥ 25

టీ:- యాతనాస్సంక్షేపతో దర్శయతి - చతుర్భిః. ఆదీపనమితి. ఆదీపనం ప్రజ్వలనం ప్రాప్నోతి. స్వేన కృత్తమన్యేన వా కృత్తం ఛిన్నం యత్స్వమాంసం తస్య భక్షణమిత్యర్థః. ॥ 25 ॥

(ఈ నాలుగు శ్లోకములతో యాతనలను సంక్షేపముగా చెప్పుచున్నాడు). యమదూతలు జీవుని చుట్టూ కట్టెల నుంచి ఆ కట్టెలను కాల్చెదరు. ఒకప్పుడు అతని చేతనే అతని శరీరమును కోయించి తినిపించెదరు. మరొకప్పుడు ఇతరులు కోసిన తన శరీర మాంసమును తినిపించెదరు. ॥ 25 ॥

శ్లో ॥ జీవతశ్చాంత్రాభ్యుద్ధారః శ్వగృధ్రైర్యమసాదనే ।
సర్ప వృశ్చిక దంశాద్యైర్దశద్భిశ్చాత్మవైశసమ్ ॥ 26

టీ:- జీవత ఇతి. ఆత్మనో వైశసం పీడామ్. ॥ 26 ॥

ఆ యమపురియందు యాతనా దేహము బ్రతికియుండగనే కుక్కలు గ్రద్దలు ప్రేగులను పీకివేయును. పాములు, తేళ్ళు అడవి-ఈగలు కరచుచుండగా చాలా బాధ గలుగుచుండును. ॥ 26 ॥

శ్లో ॥ కృంతనం చావయవశో గజాదిభ్యో భిదాపనమ్ ।
పాతనం గిరి శృంగేభ్యో రోధనం చాంబుగర్తయోః ॥ 27

టీ:- కృంతనమితి. భిదాపనం భేద ప్రాపణమ్. ॥ 27 ॥

ఆ యాతనా శరీరమును ఏ అవయవమునకు ఆ అవయ-వముగా కోసెదరు. ఏనుగు మున్నగు వాటిచేత త్రొక్కించి శరీరమును నుజ్జునుజ్జు చేయించెదరు. పర్వతశిఖరముల నుండి క్రిందికి త్రోయించెదరు, నీటిగుంటయందు ముంచి నొక్కియుంచెదరు.॥ 27॥

శ్లో ॥ యాస్తామిస్రాంధతామిస్రా రౌరవాద్యాశ్చ యాతనాః ।
భుజ్క్తే నరో వా నారీ వా మిథః సంగేన నిర్మితాః ॥ 28

ఈ చెప్పబడిన యాతనలతోబాటు తామిస్రము, అంధతామిస్రము అనే నరకములనుకూడా అనుభవింతురు. స్త్రీగాని, పురుషుడుగాని అక్రమముగా ప్రవర్తించినచో ఈ నరకములను అనుభవించెదరు.॥28

శ్లో ॥ అత్రైవ నరకః స్వర్గ ఇతి మాతః ప్రచక్షతే ।
యా యాతనా వై నారక్యస్తా ఇహాప్యుపలక్షితాః ॥ 29

టీ:- న చైదసంభావితం అత్రాపి దృశ్యమానత్వాదిత్యాహ - అత్రై వేత్యాదినా. ॥ 28-29 ॥

(విచారించగా ఈ రకమైన నరకయాతనలు ఇక్కడ కూడా కనిపించుచున్నవని చెప్పుచున్నాడు) అమ్మా! స్వర్గము, నరకము కూడా ఇచ్చటనే (భూలోకములోనే) ఉన్నవని కొందరు చెప్పుచున్నారు. ఎందుకనగా ప్రాణులు స్వర్గసుఖములతో సమానమైన సుఖములను, నరకయాతనలతో సమానమైన కష్టములను అనుభవించుట మనము కంటినిండా చూచుచున్నాము కదా! ॥29 ॥

శ్లో ॥ ఏవం కుటుంబం బిభ్రాణ ఉదరంభర ఏవ వా ।
విసృజ్యేహోభయం ప్రేత్య భుఙ్క్తే తత్ఫలమీదృశమ్ ॥ 30

టీ:- ఉభయం కుటుంబం స్వం దేహం చ. 30

(పాపార్జితమైన ధనమును చాలామంది అనుభవిస్తుంటారు. కానీ కర్త మాత్రమే నరకమునకు వెళ్ళుతాడని చెప్పుచున్నాడు.) ఈ విధముగా అనేక కష్టములననుభవించి తన కుటుంబమును పోషించువాడు లేదా కేవలము తన పొట్ట నింపుకునే వాడు మరణము తరువాత తన కుటుంబమును, శరీరమును కూడా ఇక్కడ విడిచిపెట్టి తాను చేసిన పాపముల ఫలమును ఈ రకమైన నరకముల రూపముతో అనుభవించును. ॥ 30 ॥

శ్లో॥ ఏకః ప్రపద్యతే ఉ_ధ్వాంతం హిత్వేదం స్వకళేబరమ్ ।
కుశలేతర పాథేయో భూతద్రోహేణ యద్భృతమ్ ॥ 31

టీ:- పాపార్జితం ధనం. భుజంతే బహవః. కర్తైవ తు నరకం

ఇతర ప్రాణులకు ద్రోహము చేయుట ద్వారా ఈ దేహమును పోషించువాడు, అట్లు పోషింపబడిన తన శరీరమును ఇచ్చటనే విడిచిపెట్టి ఒంటరిగా నరకమునకు వెళ్ళును. నరకమార్గమున తాను చేసిన పాపఫలమును అనుభవించును. ॥ 31 ॥

యాతీత్యాహ- ఏక ఇతి. భూతద్రోహేణ. యద్భృతం. తత్ స్థూలం స్వకళేబరం ఇహైవ హిత్వా. కుశలాదితరం పాపం తదేవ పాథేయం పథిభోజ్యం యస్య. 31

శ్లో ॥ దైవేనాసాదితం తస్య శమలం నిరయే పుమాన్ ।
భుఙ్క్తే కుటుంబపోషస్య హృతవిత్త ఇవాతురః ॥ 32

టీ:- నను పాపమపి విహాయ గచ్ఛతు తత్రాహ - దైవేనేతి. తస్య కుటుంబపోషస్య శమలం పాపం దైవేన ఈశ్వరేణ ప్రాపితం భుఙ్క్తే32

(పాపమును కూడా వదిలిపెట్టియే అచ్చటకు వెళ్ళవలెనని చెప్పుచున్నాడు.) మానవుడు తన కుటుంబపోషణము కొఱకై, ఉదర పూరణ కొఱకై ఏ అన్యాయమును చేయునో, దాని ఫలమును దైవము నరకమునందు అనుభవింపజేయును. అప్పుడు తన సర్వస్వమును కోల్పోయిన మనిషివలె పీడననుభవించును. ॥ 32 ॥

శ్లో ॥ కేవలేన హ్యధర్మేణ కుటుంబభరణోత్సుకః ।
యాతి జీవోఽంధతామిస్రం చరమం తమసః పదమ్ ॥ 33

టీ:- నను కుటుంబ పోషణం విహితమేవ తత్రాహ - కేవలేనేతి. తమసో నరకస్య. చరమం పదం స్థానం. ॥ 33 ॥

(ధర్మమార్గములో కుటుంబ పోషణము నిశ్చయముగా విహితమే యని చెప్పుచున్నాడు) తన కుటుంబపోషణ కొఱకై అధర్మ మార్గమును ఎంచుకున్నవాడు మాత్రమే నరకము యొక్క అంతిమ స్థానమగు 'అంధతామిస్రము'ను పొందును. ॥ 33 ॥

శ్లో ॥ అధస్తాన్నరలోకస్య యావతీర్యాతనాదయః ।
క్రమశః సమనుక్రమ్య పునరత్రావ్రజేచ్ఛుచిః ॥ 34

టీ:- పునర్మనుష్య శరీరప్రాప్తి ప్రకారమాహ-నరలోకస్య మనుష్య దేహస్య ప్రాప్తేః అధస్తాదర్వాక్ యావత్యో యాతనాః. అధశ్శబ్దేన శ్వ-సూకరాది యోనయశ్చ. యాస్తాః స్సర్వాః క్రమేణ సంప్రాప్య ప్రభోగేన క్షీణపాపః శుచిస్సన్ అత్ర పునర్నరత్వం ప్రాప్నోతీత్యర్థః. ॥ 34 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే,
కపిలోపాఖ్యానే కర్మవిపాకోనామ త్రింశత్తమోఽధ్యాయః

(తిరిగి మనుష్య శరీరమును పొందు ప్రకారమును చెప్పుచున్నాడు) మనుష్య జన్మలో పాపములను చేసిన మానవుడు మనుష్య లోకము కన్నా నికృష్టములైన కుక్క, పంది మొదలగు యోనుల యందు జన్మించును. నరకయాతనలననుభవించును. యాతనలననుభవించు-టచే క్రమముగా పాపము క్షీణించి, శుచియై తిరిగి మానవ శరీరమును పొందును. ॥ 34 ॥

అని శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ముప్పదియవ అధ్యాయము సమాప్తము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఏకత్రింశోఽధ్యాయః

శ్లో ॥ ఏకత్రింశే విమిశ్రైస్తు పుణ్యపాపైరిహాంతరా ।
మనుష్యయోని సంప్రాప్తిర్వర్ణ్యతే రాజసీ గతిః ॥

శ్రీ భగవానువాచ

శ్లో ॥ కర్మణా దైవనేత్రేణ జంతుర్దేహోపపత్తయే ।
స్త్రియాః ప్రవిష్ట ఉదరం పుంసోరేతః కణాశ్రయః ॥ 1

టీ:- పునరత్రాప్రజేదిత్యుక్తం తదేవ విశేషతో దర్శయతి - కర్మణేతి. కర్మణా పూర్వకృతేన. దైవమీశ్వరః తదేవ నేత్రం నేతృ ప్రవర్తకం యస్య తేన. ప్రవిష్టో భవతి. ॥ 1 ॥

శ్లో ॥ కలిలం త్వేకరాత్రేణ పంచరాత్రేణ బుద్బుదమ్ ।
దశాహే న తు కర్కంధూః పేశ్యండం వా తతః పరమ్ ॥ 2

టీ:- కలిలమితి. కలిలం శుక్లశోణితమిశ్రితం భవతి. బుద్బుదం వర్తులాకారమ్. కర్కంధుర్బదరీఫలం తదాకారం కించిత్కఠినం. పేశీ మాంసపిండాకారమ్. అండం వా యోన్యంతరే. ॥ 2 ॥

31 వ అధ్యాయము

ఈ ముప్పదియొకటవ అధ్యాయమున పాపపుణ్యముల మిశ్రమము చేత మానవజన్మమును పొందుట యనే రాజసికగతి వర్ణింపబడుచున్నది.

శ్రీ భగవానుడు పలికెను

(మళ్ళీ మానవ జన్మను పొందు విధమును విశేషముగా వర్ణించుచున్నాడు.) కపిల భగవానుడిట్లు పలికెను. జీవుడు పూర్వకర్మానుసారముగా దైవముచే ప్రేరితుడై మానవజన్మను పొందబోతూ ఒకానొక పురుషుని వీర్యకణమును ఆశ్రయించును. ఆ వీర్యకణము ద్వారా స్త్రీ యొక్క ఉదరమున ప్రవేశించును. ॥ 1 ॥

ఆ రేతఃకణము శోణితముతో కలిసి ఒకరాత్రి కాలము ఒక కణరూపములో నుండును. అయిదురోజులలో గుండ్రని బుడగ రూపమును ధరించును. పదిరోజులలో రేగిపండువలె పెరిగి గట్టిపడును. అటుపిమ్మట మాంసపు ముద్దగా తయారగును. ॥ 2 ॥

శ్లో ॥ మాసేన తు శిరో ద్వాభ్యాం బాహ్వంఘ్ర్యాద్యంగ విగ్రహః ।
నఖ రోమాస్థి చర్మాణి లింగచ్ఛిద్రోద్భవస్త్రిభిః ॥ 3

టీ:- మాసేనేతి. బాహ్వంఘ్ర్యాదీనామంగానాం విగ్రహో విభాగః. లింగం చ ఛిద్రాణి చ తేషాముద్భవః. ॥ 3 ॥

శ్లో ॥ చతుర్భిర్ధాతవః సప్త పంచభిః క్షుత్తృడుద్భవః ।
షడ్భిర్జరాయుణా వీతః కుక్షౌ భ్రామ్యతి దక్షిణే ॥ 4

టీ:- చతుర్భిరితి. జరాయుణా గర్భవేష్టనేన వీతః ప్రావృతః. 4

శ్లో ॥ మాతుర్జగ్ధాన్నపానాద్యైరేధద్ధాతురసంమతే ।
శేతే విణ్మూత్రయోర్గర్తే సజంతుర్జంతు సంభవే ॥ 5

టీ:- మాతురితి. మాతుర్జగ్ధేన భక్షితేనాన్నేనపానాద్యైశ్చ ఏధమానాః ధాతవో యస్య. జంతూనాం సంభవో యస్మిన్ తస్మిన్ అసంమతే గర్తే శేతే. తథా చ మార్కండేయపురాణే శ్లో."నాడీచాప్యాయనీ నామ నాభ్యాం తస్య నిబధ్యతే, స్త్రీణాం తథాంత్రసుషిరే సా నిబద్ధోపజాయతే, క్రమంతే భుక్తపీతాని స్త్రీణాం గర్భోదరే తథా, తైరాప్యాయితదేహోఽసౌ జంతుర్వృద్ధిముపైతి హీ"తి. ॥ 5 ॥

ఒక నెలలో తల ఏర్పడును. రెండునెలలు పూర్తి అయ్యేవరకు చేతులు, కాళ్ళు మొదలగు అవయములు ఏర్పడి స్పష్టమగును. మూడు నెలలలో గోళ్ళు, రోమములు, ఎముకలు, చర్మము ఏర్పడును. స్త్రీ, పురుష విభాగ సంబంధమైన ఛిద్రములు ఏర్పడును. ॥ 3 ॥

నాలుగు నెలలలో ఏడు ధాతువులు ఏర్పడును. (అవి 1.చర్మము, 2.మాంసము, 3.రక్తము, 4.మేధస్సు 5.మజ్జ, 6.ఎముకలు, 7.శుక్రము) అయిదు నెలలలో ఆకలి దప్పులు పుట్టును. ఆరవమాసములో జరాయువు(మావి) చేత చుట్టబడును. కడుపులో కుడి ప్రక్కన తిరుగుచుండును. ॥ 4 ॥

ఆ జీవుని ధాతువులు తల్లి స్వీకరించే ఆహారము, నీరు మొదలగు వాటిచేత వర్ధిల్లును. సుఖకరముకాని అసమ్మతమైన మల మూత్రములకు నెలవైన చోట పడియుండును. అచట క్రిములు పుట్టుచు కుట్టుచు బాధించుచుండును.

శ్లో ॥ నాడీచాప్యాయనీ ..... జంతుర్వృద్ధిముపైతి హీ ॥

అనే మార్కండేయ పురాణవాక్యములు ఈ విషయమునే స్పష్ట పరచుచున్నవి. స్త్రీ స్వీకరించే ఆహారము నాభి రంధ్రము ద్వారా శిశువును చేరి ఆ శిశువు వృద్ధియగును. ॥ 5 ॥

శ్లో ॥ క్రిమిభిః క్షత సర్వాంగః సౌకుమార్యాత్ప్రతిక్షణమ్ ।
మూర్ఛామాప్నోత్యురుక్లేశస్తత్రత్యైః క్షుధితైర్ముహుః ॥ 6

టీ:- క్రిమిభిరితి. తత్రత్యైః క్రిమిభిః ఖాదద్భిః. సౌకుమార్యాత్కోమ-లత్వేన. క్షతాని సర్వాణ్యంగాని యస్య సః. ॥ 6 ॥

అచ్చట ఉండే ఆకలిగొనియున్న క్రిములు సుకుమారమైన ఆ జీవుని దేహము యొక్క సర్వాంగములను మాటి మాటికి కుట్టుచుండును. ఆ జీవుడు ప్రతిక్షణము నొప్పిని అనుభవిస్తూ మూర్ఛను కూడా పొందును. ॥ 6 ॥

శ్లో ॥ కటు తీక్ష్ణోష్ణ లవణ క్షారామ్లాదిభిరుల్బణైః ।
మాతృ భుక్తైరుపస్పృష్టః సర్వాంగోత్థితవేదనః ॥ 7

టీ:- కట్వితి. ఉల్బణైర్దుస్సహైః సర్వేష్వంగేషు ఉత్థితా వేదనా యస్య. ఆస్తే ఇత్యుత్తరేణాన్వయః. ॥ 7 ॥

తల్లి తినే ఆహారములోని దుస్సహమైన బాధను కలిగించే కారము, ఉప్పు, పులుపు మొదలగు పదార్థములచే శిశువు హింసింపబడును. ఈ పదార్థములు శిశువు యొక్క సర్వావయములను తాకుటచే భరింపరాని వేదనననుభవించును. (రాబోయే శ్లోకములోని 'ఆస్తే' అనే క్రియాపదముతో అన్వయము.) ॥ 7 ॥

శ్లో ॥ ఉల్బేన సంవృతస్తస్మిన్నంత్రైశ్చ బహిరావృతః ।
ఆస్తే కృత్వా శిరః కుక్షౌ భుగ్న పృష్ఠ శిరోధరః ।
అకల్పః స్వాంగచేష్టాయాం శకుంత ఇవ పంజరే ॥ 8

టీ:- ఉల్బేనేతి. ఉల్బేన జరాయుణా. భుగ్నం కుటిలీభూతం పృష్ఠం శిరోధరా గ్రీవా చ యస్య సః. ॥ 8 ॥

తల్లి గర్భములో జీవుడు మావిచేత (జరాయువు చేత) చుట్టబడియుండును. దాని బయట ప్రేవులు చుట్టుకొనియుండును. నడుము, మెడ వంగి యుండును. పంజరమునందలి పక్షివలె తన అవయవములను కదలించుటకు అసమర్థడగును. ॥ 8 ॥

శ్లో ॥ తత్ర లబ్ధస్మృతిర్దైవాత్కర్మ జన్మ శతోద్భవమ్ ।
స్మరన్దీర్ఘమనుచ్ఛ్వాసం శర్మ కిం నామ విందతే ॥ 9

టీ:- తత్రేతి. దైవాత్పూర్వకర్మవశాత్. లబ్ధా స్మృతిర్యేన సః. దీర్ఘం దురంతం అనుచ్ఛ్వాసం యథా భవతి తథా తత్ర స్థితః సన్. 9

శ్లో ॥ ఆరభ్య సప్తమాన్మాసా ల్లబ్ధ బోధోఽపి వేపితః ।
నైకత్రాస్తే సూతివాతైర్విష్ఠాభూరివ సోదరః ॥ 10

టీ:- ఆరభ్యేతి. సూతి హేతుభిర్వాతైః వేపితః. సోదరస్సమానోదర-జన్మా. విష్ఠాభూః క్రిమిరివ. ॥ 10 ॥

శ్లో ॥ నాథమాన ఋషిర్భీతః సప్తవధ్రిః కృతాంజలిః ।
స్తువీత తం విక్లవయా వాచా యేనోదరేఽర్పితః ॥ 11

టీ:- నాథమాన ఇతి. నాథమానో యాచమానః. ఉపతప్యమాన ఇతి వా ఋషిః దేహాత్మదర్శీ. భీతః పునర్గర్భవాసాత్. సప్త వధ్రయో బంధన భూతాః ధాతవో యస్య సః విక్లబయా వ్యాకులయా. ॥ 11 ॥

పూర్వకర్మవశముగా (దైవవశమున) పూర్వ స్మృతి కలుగును. వందల జన్మలలో చేసిన శుభాశుభకర్మను స్మరించుచు, చాలాసేపు శ్వాసపీల్చుటకు బాధపడుచుండును. ఇట్లున్న జీవి ఏమి సుఖమును పొందును? ॥ 9 ॥

ఏడవమాసములో 'స్మృతి'ని పొందును. ప్రసూతివాయువుచే ఇటు అటు కదలిక గలవాడగును. ఆ ఉదరములోనే పుట్టిన క్రిములవలె ఒకచోట స్థిరముగా నుండజాలడు. ॥ 10 ॥

ఏడుధాతువులచే ఏర్పడియున్న ఆ జీవుడు దేహతత్త్వము, ఆత్మతత్త్వము తెలిసిన ఋషియై భగవత్కృపను యాచించును. ఏ భగవానుడు తనను తల్లి గర్భములో నుంచినాడో ఆ భగవంతుని చేతులు జోడించి దీనస్వరముతో స్తుతించును. 11

జీవఉవాచ

శ్లో ॥ తస్యోపపన్నమవితుం జగదిచ్ఛయాత్త
నానాతనోర్భువి లసచ్చరణారవిందమ్ ।
సోఽహం వ్రజామి శరణం న కుతోభయం మే
యేనేదృశీ గతిరదర్శ్యసతోఽనురూపా ॥ 12

టీ:- తస్యేతి. ఉపపన్నం జగత్ రక్షితుం స్వేచ్ఛయా గృహీతనానా-మూర్తేర్భగవతఃచరణారవిందం అకుతోభయం సోఽహం శరణం వ్రజామి. భువి లసదితి శ్రీకృష్ణావతారాద్యభిప్రాయేణ. అసతో మేఽనురూపా యోగ్యా యేనేదృశీ గర్భవాసరూప లక్షణా గతిర్దర్శితా తస్య. ॥ 12 ॥

జీవుడు పలుకుచున్నాడు

భగవానుడు తనను శరణుజొచ్చిన వారిని మరియు ఈ సమస్తమైన జగత్తును రక్షించుటకై శ్రీకృష్ణాది అనేక రూపములను ధరించి, భూమిపై ఉంచిన, అభయప్రదములైన ఆయన చరణార విందములను నేను శరణుజొచ్చుచున్నాను. నాలాంటి అధమునకు తగిన గర్భవాసాది ఈ శిక్షను భగవానుడు తగినట్లుగానే విధించినాడు. ॥12॥

శ్లో ॥ యస్త్వత్ర బద్ధ ఇవ కర్మభిరావృతాత్మా
భూతేంద్రియాశయ మయీమవలంబ్య మాయామ్ ।
ఆస్తే విశుద్ధమ వికారమఖండబోధమ్
ఆతప్యమాన హృదయేఽవసితం నమామి ॥ 13

టీ:- నను కోఽసౌ? యం శరణం వ్రజసి, కో వా తవ తస్య చ విశేషః? యేన సేవ్యసేవకత్వమిత్యపేక్షాయామాహ - య ఇతి. అత్ర

(నీవు శరణు పొందే అతనెవరు? నీకు ఆయనకు గల విశేషము లేవి? దేనివలన సేవ్య సేవకత్వములు ఏర్పడుచున్నవి? అనే విషయములు ఈ శ్లోకము ద్వారా తెలియజెప్పుచున్నాడు.) నేను ఈ మాతృగర్భమునందు దేహ, ఇంద్రియ అంతఃకరణరూపముగా మాయను ఆశ్రయించి ఉన్నాను. ఈ మాయను ఆశ్రయించి పుణ్య పాప కర్మలచే ఆచ్ఛాదింపబడినవాడనై బద్ధుడనై ఉన్నాను. పరితాప మును పొందుచున్న నా హృదయమున భగవానుడు స్ఫురించు

మాతుర్దేహే భూతేంద్రియాశయమయీం దేహాకారపరిణతాం మాయామవలంబ్య ఆశ్రిత్య కర్మభిరావృతస్వరూప ఇవ బద్ధ ఇవ చ య ఆస్తే సోఽహమ్ యస్తు అత్రైవాస్తే తం నమామి. కథంభూత-మిత్యపేక్షాయాం తు శబ్దోక్తం విశేషం దర్శయతి. ఆతప్యమానే హృదయేఽవసితం ప్రతీతమేమప్యవికారం. కుతః. విశుద్ధం నిరుపాధిం. తత్కుతః. అఖండో బోధో యస్య తం. ॥ 13 ॥

చున్నాడు. ఆ భగవానుడు ఉపాధి సంబంధము లేనివాడగుట వలన అవికారుడు మరియు అఖండ బోధస్వరూపుడగుటవలన 'అవికారుడు', అట్టి భగవానునకు నమస్కరించుచున్నాను. ('తు' అనే శబ్దము జీవుడు ఏర్పడిన విధమును స్పష్టపరచుటకు ఉద్దేశించి ప్రయోగింపబడినది)13

శ్లో ॥ యః పంచభూత రచితే రహితః శరీరే
ఛన్నోఽయథేంద్రియ గుణార్థ చిదాత్మకోఽహమ్ ।
తేనావికుంఠ మహిమానమృషిం తమేనం
వందే పరం ప్రకృతి పూరుషయోః పుమాంసమ్ ॥ 14

టీ:-- నను త్వమపి వస్తుతః శుద్ధఏవ శ్రు."అసంగో హ్యయం పురుష" ఇత్యాది శ్రుతేః. తత్కథం యువయోరయం విశేషస్తత్రాహ-య ఇతి. యః పంచభిర్భూతైః రచితే శరీరే అయథామిథ్యైవ ఛన్నః. న వస్తుతః యతస్తేన శరీరేణ రహితః అసంగః. అతః యథైవేంద్రియగుణార్థ చిదాత్మకః ఇంద్రియాణి చ గుణాశ్చ అర్థాశ్చ చిదాభాసశ్చ తదాత్మకః సోఽహం తం వందే. కథంభూతం. తేన శరీరేణ అవికుంఠో మహిమా యస్య తం. అవకుంఠేతి పాఠేఽపి అవసన్నం కుంఠనమావరణం

("అసంగోహ్యాయ పురుష"మున్నగు శ్రుతి వాక్యముల ప్రకారము పరమాత్ముడు వస్తుతః శుద్ధ స్వరూపుడు. అతనిలో గల ఈ విశేషములను చెప్పుచున్నాడు.") ప్రకృతి సత్త్వ రజస్తమో గుణాత్మకమైనది. ప్రకృతి యొక్క కార్యములగు పంచభూతములచే ఏర్పడినది ఈ శరీరము. వాస్తవముగా నాకు ఈ దేహముతోగాని, ఇంద్రియములతోగాని, శబ్దాది విషయములతోగాని, చిదాభాసయగు అహంకారముతో గాని సంబంధము లేదు. కాని సంబంధము భాసించుటచే వాటికి కట్టుబడి యున్నాను. పరమాత్ముడు మొక్కవోని మహిమగల వాడు. సర్వజ్ఞుడు. పరమపురుషుడు. ప్రకృతి పురుషులకు అతీతమైనవాడు. అట్టి పురుషోత్తమునకు నమస్కరించుచున్నాను. ॥ 14 ॥

యస్య స మహిమా యస్యేత్యర్థః. తత్ర హేతుః- ప్రకృతి పురుషయోః పరం నియంతారం. కుతః. ఋషిం సర్వజ్ఞం. విద్యాశక్తిమిత్యర్థః. విద్యావిద్యాకృతో విశేష ఇతి భావః. ॥ 14 ॥

శ్లో ॥ యన్మాయయోరుగుణకర్మ నిబంధనేఽస్మిన్
సాంసారికే పథి చరంస్తదభిశ్రమేణ ।
నష్టస్మృతిః పునరయం ప్రవృణీత లోకం
యుక్త్యా కయా మహదనుగ్రహమంతరేణ ॥ 15

టీ:- నను జ్ఞానేనాయం బంధో నివర్తిష్యతే కిం పరమేశ్వరవందనేన! తత్రాహ-యదితి. యస్య మాయయా నష్ట స్మృతిస్సన్. సంసార సంబంధిని పథి తదభిశ్రమేణ తత్కృతేన క్లేశేన చరన్నయం జీవః. మహతః తస్యైవేశ్వరస్య అనుగ్రహం వినా. పునః కయా యుక్త్యా లోకం నిజస్వరూపం ప్రవృణీత సంభజేత. అభిశ్రమహేతుత్వేన పంథానం విశినష్టి ఉరూణి గుణ నిమిత్తాని కర్మాణి నితరాం బంధనాని యస్మిన్. ఈశ్వరస్య ప్రసాదం వినా జ్ఞానాభావాత్స ఏవ సేవ్య ఇత్యర్థః (15)

(ఈశ్వరానుగ్రహములేని కేవల జ్ఞానము చేత జీవుని సంసార బంధము తొలగునా? సాధ్యము కాదని చెప్పుచున్నాడు.) భగవంతుని మాయచేతనే జీవుడు తన స్వరూపమును విస్మరించును. ఆ కారణము చేతనే ఈ సంసారచక్రమున పరిభ్రమించుచుండును. సత్త్వ రజస్తమో గుణములతో గూడిన కర్మల నిమిత్తముగా సాగే జనన మరణ ప్రవాహ రూపమైన ఈ సంసార మార్గములో అనేక విధములుగా శ్రమపడును. అనేక క్లేశములననుభవించును. అట్టి జీవుడు ఆ పరమేశ్వరుని అనుగ్రహము లేకుండా ఇతరమైన ఏ ఉపాయము చేత తన స్వరూపమును తెలియగల్గును? తెలియజాలడని అర్థము. కేవల భగవదనుగ్రహము చేతనే ఉద్ధరింపబడగలడని తాత్పర్యము. ॥15 ॥

శ్లో ॥ జ్ఞానం యదేతదదధాత్కతమః స దేవః
త్రైకాలికం స్థిరచరేష్వనువర్తితాంశః ।
తం జీవకర్మ పదవీమనువర్తమానాః
తాపత్రయోపశమనాయ వయం భజేమ ॥ 16

టీ:- ఈశ్వర ఏవ జ్ఞానప్రద ఇత్యుపపాదయన్నాహ-జ్ఞానమితి. యదేతత్త్రికాల విషయం జ్ఞానం. తత్ తం వినా కతమో మయ్యదధాత్ న కోఽపి. కింతు స దేవ ఏవ ఈశ్వర ఏవ. నన్వన్యః ప్రకృష్టో జీవో విదధాతు, నేత్యాహ - జీవరూపాం కర్మపదవీం. అనునర్తమానా వయమితి తద్వ్యతిరేకేణ న కోఽపి సమర్థ ఇత్యర్థః. అన్యస్యాసంభవ ముక్త్వా తస్య సంభవమాహ-స్థిరేషు చరేషు అంతర్యామి రూపోఽను వర్తితోఽంశో యేన తం భజేమ. ॥ 16 ॥

ఈశ్వరుడే జ్ఞానదాత అని ఉపపాదించుచూ చెప్పుచున్నాడు. నాకు తెలియుచున్న భూత, భవిష్యత్, వర్తమాన జ్ఞానమును ఆ పరమేశ్వరుడే కలిగించుచున్నాడు. ఆ జగదీశ్వరుడు స్థావర జంగమాది సకలప్రాణులలో అంతర్యామిగా వ్యాపించియుండి నాకీ జ్ఞానము నిచ్చుచున్నాడు. జీవుడు తాను చేసికొన్న కర్మలచే నిర్ణయింపబడిన మార్గమున నడువవలసి యుండును. అలాంటి కర్మమార్గమునను సరించుచున్న మేము తాపత్రయ నివారణ కొరకు ఆ దేవదేవుని సేవించుచున్నాము. (తన లాంటి ఇతర జీవులను కూడా ఉద్దేశించి బహువచనమును ప్రయోగించినాడు) ॥ 16 ॥

శ్లో ॥ దేహ్యన్యదేహ వివరే జఠరాగ్నినాఽసృగ్
విణ్మూత్రకూప పతితో భృశతప్తదేహః ।
ఇచ్ఛన్నితో వివసితుం గణయన్ స్వమాసాన్
నిర్వాస్యతే కృపణధీర్భగవన్ కదా ను ॥ 17

టీ:- స్వదుఃఖం విజ్ఞాపయన్నాహ-దేహీతి. అస్య దేహ వివరే మాతురుదరకుహరే. యోఽసృగ్విణ్మూత్రకూపః తస్మిన్ పతితః తత్య

స్వదుఃఖమును విజ్ఞప్తిచేయుచు చెప్పుచున్నాడు. ఓ భగవానుడా! నేను వేరు నా తల్లివేరు అట్టి నా తల్లి ఉదరములో రక్తము, మలము, మూత్రము లతో కూడిన కూపములో పడియున్నాను. ఈ ఉదరములోని జఠరాగ్ని నన్ను తపింపజేయుచున్నది. నా మనస్సు మిక్కిలి దీనత్వముతోనున్నది. ఇచట నుండి బయటబడుటకు నెలలను లెక్కపెట్టుచున్నాను. నీవు నన్ను ఎప్పుడు బయటపడవేసెదవో అని ఎదురుచూచుచున్నాను.॥17॥

జఠరాగ్నినా భృశం తప్తో దేహో యస్య. అత ఏవ కృపణాధీరితో వివరాద్వివసితుం నిర్గంతుమిచ్ఛన్. స్వనూసాన్ గణయన్ అసౌ కదాను అహో బహిర్నిర్వాస్యతే. ॥ 17 ॥

శ్లో ॥ యేనేదృశీం గతిమసౌ దశమాస్య ఈశ
సంగ్రాహితః పురుదయేన భవాదృశేన ।
స్వేనైవ తుష్యతు కృతేన స దీననాథః
కో నామతత్ప్రతి వినాంజలిమస్య కుర్యాత్ ॥ 18

టీ:- తత్కృతముపకారం స్మరన్నాహ-యేనేతి. యేనేదృశీం గతిం జ్ఞానం. భవాదృశేనేతి నిరుపమేనేత్యర్థః. స్వకృతేనైవ స్వయం తుష్యతు. అంజలిమాత్రం వినా తత్ కృతోపకారస్య. ప్రత్యుపకారం కః కుర్యాదిత్యర్థః. ॥ 18 ॥

(భగవంతుడొనరించిన ఉపకారమును స్మరించుచు పలుకుచున్నాడు.) ఓ ప్రభూ! నీవు మిక్కిలి దయగల వాడవు. పది నెలల వయస్సు గల వాడను నేను. అయోగ్యుడను. ఇట్టి నాకు పూర్వ జన్మ జ్ఞానము కలిగించిన నీకు నీవే సాటి. నీవు చేసిన ఈ ఉపకారమే నీకు సంతోషమును కలిగించుగాక! కేవలము చేతులు జోడించి నమస్కారము చేయుట కంటె నీకు ప్రత్యుపకారము చేయగల వాడెవ్వడును లేడు. ॥ 18 ॥

శ్లో ॥ పశ్యత్యయం ధిషణయా నను సప్తవధ్రిః
శారీరకే దమశరీర్యపరః స్వదేహే ।
యత్సృష్టయాఽఽస తమహం పురుషం పురాణం
పశ్యే బహిర్హృది చ చైత్యమివ ప్రతీతమ్ ॥ 19

వైలక్షణ్యమును చెప్పుచున్నాడు. ఇతర జీవులగు పశు పక్షాదులు మూఢబుద్ధితో ఏడుధాతువులతో కూడిన తమ స్థూల శరీరమునకు మాత్రమే కట్టుబడి యుండును. ఆ దేహము నందు కలిగే సుఖ దుఃఖములను మాత్రమే అనుభవించుచుండును. కాని భగవానుడు నాకు వివేక జ్ఞానమునిచ్చినాడు. శమ, దమాదులు కలవాడనైనాను. ఆ

టీ:- ఈదృశీం గతిమిత్యనేన. జాత్యంతర విలక్షణం జ్ఞానం ప్రాపితవా -నిత్యుక్తం. తదేవ వైలక్షణ్యమాహ - పశ్యతీతి. అయమపరః పశ్వాదిః సప్త వర్ధిః జీవః. స్వదేహే శారీరకే శరీరభవే సుఖ దుఃఖే కేవలం నను పశ్యతి. అహం పునర్యత్సృష్టయా ధిషణయా యద్దత్తేన వివేకేన జ్ఞానేన దమశరీరీ. దమ ఇత్యుపలక్షణం. శమదమాదియుక్త శరీరవాన్. ఆస అభవం తమేవ చ పురాణం అనాదిం పురుషం పూర్ణం బహిశ్చ హృది చ పశ్యే పశ్యామీత్యన్వయః. దృశిర్ ప్రేక్షణ ఇతి ధాతోః ఆత్మనేపదమార్షం కథం. అపరోక్షతయా ప్రతీతం చైత్యమివ. అహంకారాస్పదం భోక్తార-మివేత్యర్థః. ॥ 19 ॥

శ్లో ॥ సోఽహం వసన్నపి విభో బహుదుఃఖవాసం
గర్భాన్న నిర్జిగమిషే బహిరంధకూపే ।
యత్రోపయాతముపసర్పతి దేవమాయా
మిథ్యామతిర్యదను సంసృతిచక్రమేతత్ ॥ 20

టీ:- అవివేకజ్ఞానకృతం సంసారోద్వేగం అనుస్మరన్మోక్షమార్గమేవ అధ్యవస్యతి సోఽహమితి ద్వాభ్యాం. హే విభో బహు దుఃఖవాసం యథా భవతి తథా గర్భే వసన్నపి సోఽహం గర్భాద్బహిర్నినిర్గంతు-మిచ్ఛామి. తత్ర హేతుః. అంధకూపప్రాయే యత్ర బహిరుపయాతం

వివేక జ్ఞానముతోనే నా హృదయములో అహంకారమునకు ఆశ్రయమగు, ఆత్మరూపములో భాసించే ఆ పరమేశ్వరుని స్పష్టముగా చూచుచున్నాను. ఆ పూర్ణపురుషుడినే జగద్రూపముగా బయటను దర్శించుచున్నాను. ॥ 19 ॥

ఈ రెండు శ్లోకములతో అవివేకముతో అజ్ఞానముతో సంభవించే సంసారోద్వేగమును స్మరించుచు జీవుడు మోక్షమార్గమును మాత్రమే కోరుచున్నాడు. ఓ ప్రభూ! ఈ గర్భవాసమున అనేకములగు దుఃఖములతో కలిసి నివసించుచున్నాను. అయినప్పటికి ఇచట నుండి బయటకు వెళ్ళుటకు ఇష్టపడకున్నాను. ఎందుకనగా బయట-పడినచో నన్ను నీ విష్ణుమాయ కప్పివేయును. మిథ్యారూపమగు దేహాభిమాన మేర్పడును. ఆ అభిమానము కారణముగా భార్యా పుత్రాదుల యందు సంబంధము ఏర్పడును. జనన మరణ చక్ర రూపమైన సంసారమున పడవలసి వచ్చును. ॥ 20 ॥

నిర్గతం ప్రాణినం. దేవస్య తవ మాయా. ఉపసర్పతివ్యాప్నోతి. యదను యాం మాయామను మిథ్యామతిః దేహే అహం బుద్ధిః సంసృతిచక్రం చ కళత్ర పుత్రాది సంబంధాదుపసర్పతి. ॥ 20 ॥

శ్లో ॥ తస్మాదహం విగతవిక్లబ ఉద్ధరిష్య
ఆత్మానమాశు తమసః సుహృదాత్మనైవ ।
భూయో యథా వ్యసనమేతదనేకరంధ్రం
మా మే భవిష్యదుపసాదిత విష్ణుపాదః ॥ 21

టీ:- తస్మాదితి. తస్మాదత్రైవ స్థితోఽపి విగత విక్లబః అవ్యాకులస్సన్ సుహృదా ఆత్మనా సారథిరూపయా బుద్ధ్వైవ. ఆత్మానం తమసః సంసారాత్. ఉద్ధరిష్యామి. అనేక రంధ్రం నానా గర్భవాసరూపం. ఏతద్వ్యసన దుఃఖం యథా మే మాభవిష్యత్ న భవిష్యతి తథా. కాత్ర తవ సాధనసామగ్రీ? తత్రాహ - ఉపసాదితౌ హృదయం ప్రాపితౌ. శ్రీవిష్ణోః పాదౌ యేన మయా సః. ॥ 21 ॥

అందువలన నేను ఇక్కడనే ఉండి కూడా వ్యాకులతను (ఆదుర్దను) విడిచిపెట్టెదను. హృదయమునందు శ్రీవిష్ణుమూర్తి పాదపద్మములను స్థిరపరచుకొనెదను. సారథి వంటిదగు 'బుద్ధి' సహాయము చేత నన్ను నేను నానా గర్భవాసరూపమైన సంసార-కూపము నుండి ఉద్ధరించుకొనెదను. దీనివలన అనేకరంధ్రములతో (దోషములతో) కూడిన దేహప్రాప్తి మళ్ళీ నాకు కలుగకుండుగాక! ఇందుకొరకు సాధన సామగ్రి ఏమిటనగా నా హృదయములో నున్న శ్రీవిష్ణుమూర్తి పాదములను స్మరించుటయే. ॥ 21 ॥

శ్రీకపిల ఉవాచ

శ్లో ॥ ఏవం కృతమతిర్గర్భే దశమాస్యః స్తువన్నృషిః ।
సద్యః క్షిపత్యవాచీనం ప్రసూత్యై సూతిమారుతః ॥ 22

శ్రీకపిలుడు ఇట్లు పలికెను

పుట్టుటకు సిద్ధముగానున్న పదిమాసముల వయస్సు, వివేక జ్ఞానముగల ఆ జీవుడు తనను తాను ఉద్ధరించుకొనవలెననెడు కృత-

టీ:- ఏవమితి. దశమాసాః పరిచ్ఛేదకా యస్యేతి ప్రసూతి పూర్వ-క్షణోపలక్షణం. ఋషిం జీవం సద్యస్తత్ క్షణమేవ. అవాచీనం అవాఙ్ముఖం తం. ప్రసూతిహేతుర్మారుతః క్షిపతి నుదతి.॥ 22 ॥

నిశ్చయముతో నుండును. పరమేశ్వరుని స్తుతించుచుండును. ఇంతలో అధోముఖుడైన ఆ శిశువును ప్రసూతివాయువు ప్రసవముకొఱకై క్రిందికి త్రోసివేయును. ॥ 22 ॥

శ్లో ॥ తేనావసృష్టః సహసా కృత్వాఽవాక్ శిర ఆతురః ।
వినిష్క్రామతి కృచ్ఛ్రేణ నిరుచ్ఛ్వాసో హతస్మృతిః ॥ 23

టీ:- తేనేతి. అవసృష్టః అధః క్షిప్తః సన్. ॥ 23 ॥

ప్రసూతి వాయువు ఆ శిశువును వేగముగా బయటకు నెట్టుచుండును. శిరస్సు క్రిందకుఉంచి బహూపీడననుభవించుచు అతి కష్టముతో బయటకు వచ్చును. ఆ సమయములో శిశువుకు శ్వాస ఉండదు. అప్పటివరకు ఉండిన పూర్వజన్మస్మృతి నశించును. 23

శ్లో ॥ పతితో భువ్యసృఙ్ మూత్రే విష్ఠాభూరివ చేష్టతే ।
రోరూయతి గతే జ్ఞానే విపరీతాం గతిం గతః ॥ 24

టీ:- పతిత ఇతి. రోరూయతి. రోరూయతే యఙంతాత్ రుశబ్ద ఇతి ధాతోః పరస్మైపదమార్షమ్ ॥ 24 ॥

ఆ శిశువు నేలపై, రక్తమునందు, మూత్రమునందు పడి క్రిమివలె కదులుచుండును. ఆ జీవుని పూర్వజ్ఞానము నశించుటచే జ్ఞాన విరుద్ధమగు దేహాభిమానము గలవాడై వెక్కివెక్కి ఏడ్చుచుండును. ॥24॥

శ్లో ॥ పరచ్ఛందం న విదుషా పుష్యమాణో జనేన సః ।
అనభిప్రేతమాపన్నః ప్రత్యాఖ్యాతుమనీశ్వరః ॥ 25

టీ:- పరేతి. పరస్య ఛందం అభిప్రాయం. నవిదుషా. అనభిప్రేతం

తన అభిప్రాయము సరిగ్గా తెలియని వ్యక్తిచే(తల్లిచే) శిశువు పోషింపబడును. పాలుత్రాగుటకై ఏడ్చుచున్నప్పుడు శిశువు కడుపు నొప్పితో బాధపడుచున్నాడని తలచి చేదుకషాయము త్రాగించును. శిశువు కడుపునొప్పితో బాధపడుచున్నప్పుడు స్తన్యమునిచ్చును (పాలు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

స్తన్యార్థం రోదనే ఉదరవ్యథాం ప్రకల్ప్య నింబ రసం పాయయంతి. ఉదరవ్యథయా రోదనే క్షుధం పరికల్ప్య స్తన్యం పాయ యంతీత్యాది. 25

శ్లో ॥ శాయితోఽశుచి పర్యంకే జంతుస్వేదజదూషితే ।
నేశః కండూయనేఽంగానామాసనోత్థానచేష్టనే ॥ 26

టీ:- శాయిత ఇతి. ఆసనోత్థానచేష్టనే చానీశః సన్. రోరూయతీత్యనుషంగః. ॥ 26 ॥

శ్లో ॥ తుదంత్యామత్వచం దంశా మశకా మత్కుణాదయః ।
రుదంతం విగత జ్ఞానం క్రిమయః క్రిమికం యథా ॥ 27

టీ:- తుదంతీతి. ఆమా కోమలా త్వగ్యస్య విగతం గర్భే జాతం జ్ఞానం యస్య. ॥ 27 ॥

శ్లో ॥ ఇత్యేవం శైశవం భుక్త్వా దుఃఖం పౌగండమేవ చ ।
అలబ్ధాభీప్సితోఽజ్ఞానాదిద్ధమన్యుః శుచార్పితః ॥ 28

త్రాగించును.) ఈ దశలో శిశువు తనకిష్టము కాని దానిని త్రోసి పుచ్చుటకు సామర్థ్యములేనివాడై బాధపడుచుండును. గత్యంతరము లేక అనుభవించుచుండును. ॥ 25 ॥

ఆ శిశువును పడుకోబెట్టే మంచము నల్లులు మొదలగు చెమట నుండి పుట్టే క్రిమిలతో కూడి అపరిశుభ్రముగా నుండును. శిశువు కదులుటకు, కూర్చుండుటకు, లేచుటకు శక్తి చాలనివాడై ఏడ్చు చుండును. ॥ 26 ॥

గర్భమునందున్నప్పటి పూర్వజ్ఞానము ఇప్పుడా శిశువునకు తొలగిపోయినది. కోమలమగు చర్మముగల శిశువును ఈగలు, దోమలు, నల్లులు మొదలగునవి, పెద్దకీటకములు చిన్న క్రిమిని కరచుచుండినట్లు కరచుచుండును. ఆ బాధను తట్టుకోలేక శిశువు ఏడ్చుచుండును. ॥ 27 ॥

ఈ విధముగా శైశవదశయందు దుఃఖమువననుభవించును. (అయిదు సంవత్సరములు పూర్తియగు వరకు శైశవదశ. ఆరవ సంవత్సరము నుండి యౌవనము ప్రారంభమయ్యేవరకు ఉండే వయస్సు

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- ఇతీతి. శైశవం పంచవర్షాణి. తతః పౌగండం యౌవనాధర్వాక్. తత్ర చాధ్యయనాది దుఃఖం. యౌవనే దుఃఖమాహ -సార్ధై స్త్రిభిః అలబ్ధాభీప్సితత్వేన శుచార్పితః వ్యాప్తః. అజ్ఞానాదిద్ధో దీప్తో మన్యుర్యస్య సః. ॥ 28 ॥

పౌగండదశ) ఈ పౌగండదశలో కూడా విద్యాభ్యాసమునందలి క్లేశములుండుట చేత దుఃఖమననుభవించును. (ఈ మూడున్నర శ్లోకములతో మనిషి యౌవనములో అనుభవించే బాధను చెప్పు చున్నాడు.) యౌవనమునందు తాను కోరిన కోరికలు తీరనందున కోపము పెరిగి అధిక దుఃఖముననుభవించును. ॥ 28 ॥

శ్లో ॥ సహదేహేన మానేన వర్ధమానేన మన్యునా ।
కరోతి విగ్రహం కామీ కామిష్వంతాయ చాత్మనః ॥ 29

టీ:- సహేతి. దేహేన సహైవ వర్ధమానేనాభిమానేన మన్యునా చ. విగ్రహం విరోధం కరోతి. ఆత్మనోఽంతాయ నాశాయ. ॥ 29 ॥

తన శరీరముతో బాటు అభిమానము మఱియు కోపము పెరుగు చుండును. కామపరవశుడగు జీవుడు తన నాశనము కొరకై ఇతరులగు కాముకులతో కలహించుచుండును. ॥ 29 ॥

శ్లో ॥ భూతైః పంచభిరారబ్ధే దేహే దేహ్యబుధోఽసకృత్ ।
అహం మమేత్యసద్గ్రాహః కరోతి కుమతిర్మతిమ్ ॥ 30

టీ:- అజ్ఞానం ప్రపంచయతి-భూతైరితి. భూతైః పంచభిః. ఆరబ్ధే దేహే. అసద్గ్రాహోఽహం మమేతి మతిం కరోతి. ॥30 ॥

(ఈ శ్లోకములో అజ్ఞానమును వివరించుచున్నాడు.)

జీవుడు అవివేకియై, చెడుపట్టుదల, చెడుఆలోచనలు కలవాడగును. పృథివ్యాది పంచభూతములతో ప్రారంభమైన ఈ శరీరము నందే నేను, నాది అనే అభిమానము కలిగి యుండును. ॥ 30 ॥

శ్లో ॥ తదర్థం కురుతే కర్మ యద్బద్ధో యాతి సంసృతిమ్ ।
యో౽నుయాతి దదత్క్లేశమవిద్యాకర్మబంధనః ॥ 31

టీ:- తదర్థమితి. తదర్థం దేహార్థం. యత్ యేన కర్మణా బద్ధః. యో దేహః అనుయాతి పునః పునరుపయాతి. అనువర్తత ఇతి వా. కుతః అవిద్యాకర్మభ్యాం బధ్యత ఇతి తథా. ॥ 31 ॥

కర్మ జీవుని బంధించును. జనన మరణ ప్రవాహ రూపమగు సంసారమునకు లాగును. అవిద్యవలన చేసే కర్మ వలననే దేహము ఏర్పడును. ఈ దేహము అనేక క్లేశములను తెచ్చిపెట్టును. జీవుడు మళ్ళీ ఈ దేహము కొఱకే అవిద్య వలన కర్మను చేయుచున్నాడు.॥31॥

శ్లో ॥ యద్యసద్భిః పథి పునః శిశ్నోదర కృతోద్యమైః ।
ఆస్థితో రమతే జంతుస్తమో విశతి పూర్వవత్ ॥ 32

టీ:-- యదీతి. యద్యసద్భిః అసతో౽ధిష్ఠితస్సన్ తేషాం పథి రమతే. పథి సన్మార్గే ఆస్థితో౽పి యద్యసద్భిః సహ రమత ఇతి వా తర్హి యాతనా దేహ ఆవృత్యేత్యాది పూర్వోక్త ప్రకారేణ తమో నరకం ప్రవిశతి.॥32॥

సన్మార్గములో నడచుచుండిననూ, ఒకవేళ కాముకులు, కేవలము ఉదర పూరణకు ప్రయత్నించే దుర్మార్గుల స్నేహము నందు ఆసక్తి చూపినచో ఆ వ్యక్తి, పూర్వము వలెనే నరకమును పొందును. 32

శ్లో ॥ సత్యం శౌచం దయా మౌనం బుద్ధిః శ్రీ ర్హ్రీయశః క్షమా ।
శమో దమో భగశ్చేతి యత్సంగాద్యాతి సంక్షయమ్ ॥ 33

టీ:- అసత్సంగం నిందతి – త్రిభిః. సత్యమితి. బుద్ధిః పరమపురుషార్థ విషయా. హ్రీః లజ్జా. శ్రీః ధనధన్యాది లక్షణా. యశః కీర్తిః క్షమా సహిష్ణుత్వం శమో బాహేంద్రియనిగ్రహః . దమో మనోనిగ్రహః భగ ఉన్నతిః యత్సంగాత్. యేషాం అసతాం సంగాత్. ॥ 33 ॥

(ఈ మూడుశ్లోకములతో దుష్టసాంగత్యమును నిందించుచున్నాడు.) దుష్టుల సాంగత్యమువలన 1.సత్యము, 2. బాహ్యాభ్యంతరములలో పరిశుభ్రత, 3.దయ, 4.మౌనము, 5.బుద్ధి (పరమ పురుషార్థమును పొందవలెననెడు నిశ్చయము), 6.ధన ధాన్యసంపద, 7.లజ్జ, 8.కీర్తి, 9.క్షమ(సహిష్ణుత), 10.శమము (బాహ్యేంద్రియ నిగ్రహము), 11.దమము (మనో నిగ్రహము), 12.చిత్త శాంతి అనే సద్గుణములు నశించును. ॥ 33 ॥

శ్లో ॥ తేష్వశాంతేషు మూఢేషు ఖండితాత్మస్వసాధుషు ।
సంగం న కుర్యాచ్ఛోచ్యేషు యోషిత్క్రీడామృగేషు చ ॥ 34

టీ:- తేష్వితి. ఖండితాత్మసు దేహాత్మబుద్ధిషు. యోషితాం క్రీడామృగవదధీనేషు. ॥ 34 ॥

1.శాంతిలేని వారు, 2.మూఢులు, 3.దేహాత్మబుద్ధిగల వారు, 4.శోకింపతగని వారు, 5.స్త్రీలకు (ఆట బొమ్మలవలె) వశులైన వారు అయిన దుష్టులతో సంగమము (స్నేహము) చేయరాదు. ॥ 34 ॥

శ్లో ॥ న తథాస్య భవేన్మోహో బంధశ్చాన్యప్రసంగతః ।
యోషిత్సంగాద్యథా పుంసో యథాతత్సంగి సంగతః ॥ 35

టీ:- నేతి. యథా చ యోషిత్సంగినాం సంగతో బంధః తథా అన్యప్రసంగతో న భవేత్. ॥ 35 ॥

దుష్టస్త్రీల సంగమువలనను, దుష్టస్త్రీ సాంగత్యము గలవారి సహవాసము వలనను కలిగే దృఢమైన బంధము, మోహము ఇతర సంగము వలన కలుగదు. ॥ 35 ॥

శ్లో ॥ ప్రజాపతిః స్వాం దుహితరం దృష్ట్వా తద్రూపధర్షితః ।
రోహిద్భూతాం సోఽన్వధావదృక్షరూపీ హతత్రపః ॥ 36

టీ:- యోషిత్సంగస్యానర్థతాం ప్రపంచయతి-సప్తభిః ప్రజాపతిరితి. రోహిద్భూతాం మృగీ రూపాం సతీం ఋక్షరూపీ మృగా కారస్సన్. హత త్రపో నిర్లజ్జః. పూర్వార్ధే వర్ణాధిక్యమార్షం. ॥ 36 ॥

(ఈ ఏడుశ్లోకములతో అనర్థములకు కారణమైన స్త్రీసంగమును విశదీకరించుచున్నాడు.) బ్రహ్మ ఒకప్పుడు తన కుమార్తెయగు సరస్వతి యొక్క రూపమును చూచి మోహముచెందెను. భయపడిన ఆమె ఆడ లేడి రూపమును ధరించి పరుగెత్తగా బ్రహ్మ సిగ్గులేనివాడై మగలేడి రూపమును ధరించి ఆమె వెంట పరుగిడెను. (పూర్వార్ధములో అక్షరము ఎక్కువ కావడము ఆర్షము.) ॥ 36 ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తత్సృష్ట సృష్ట సృష్టేషు కో న్వఖండితధీః పుమాన్ ।
ఋషిం నారాయణమృతే యోషిన్మయ్యేహ మాయయా ॥ 37

టీ:- తదితి. తేన బ్రహ్మణా సృష్టా మరీచ్యాదయః తైః సృష్టాః కశ్యపాదయః తైరపి సృష్టాః దేవమనుష్యాదయః తేషు కో ను పుమాన్ అఖండితధీః అనాకృష్టమనాః. ॥ 37 ॥

అట్టి బ్రహ్మచే సృష్టింపబడిన వారు మరీచి మొదలగు మహర్షులు. ఆ మరీచ్యాది మహర్షులచే సృష్టింపబడిన వారు కశ్యపుడు మొదలగు ప్రజాపతులు. ఆ కశ్యపాది ప్రజాపతులచే దేవ మనుష్యాదులు సృష్టింపబడిరి. ఈ విధమైన సృష్టిలో ఒక్క నారాయణ మహర్షి తప్ప స్త్రీ రూపమైన మాయచేత మోహింపబడని మరియొకడు కలడా? లేడు.॥ 37 ॥

శ్లో॥ బలం మే పశ్య మాయాయాః స్త్రీమయ్యా జయినోదిశామ్ ।
యా కరోతి పదాక్రాంతాన్ భ్రూవిజృంభేణ కేవలమ్ ॥ 38

టీ:- బలమితి. దిశాం జయినః శూరానపి. ॥ 38 ॥

స్త్రీరూపములో నున్న నా మాయా బలమును చూడుము. దిక్కులను జయించిన శూరులను కూడ స్త్రీ తన కనుబొమ్మల కదలిక చేత పాదాక్రాంతులను చేసికొనును. ॥ 38 ॥

శ్లో॥ సంగం న కుర్యాత్ప్రమదాసు జాతు
యోగస్య పారం పరమారురుక్షుః ।
మత్సేవయా ప్రతిలబ్ధాత్మలాభో
వదంతి యా నిరయద్వారమస్య ॥ 39

టీ:- సంగమితి. ప్రతిలబ్ధః ఆత్మరూపో లాభో యేన సః. అస్య ముముక్షోః యాః ప్రమదాః నిరయద్వారం వదంతి యోగినః. ॥39॥

ఏ మానవుడు నన్ను సేవించుచూ ఆత్మానాత్మ వివేకము పొంద గోరుచున్నాడో, యోగము యొక్క పరమ పదమును అధిష్ఠించగోరు-చున్నాడో, ఆ యోగి (భక్తుడు), ఒకప్పుడైనను స్త్రీ సంగము చేయరాదు. అట్టి భక్తుడైన యోగికి స్త్రీసంగము నరకద్వారమని చెప్పుచున్నారు. 39

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ యోఽుపయాతి శనైర్మాయా యోషిద్దేవ వినిర్మితా ।
తామీక్షేతాత్మనో మృత్యుం తృణైః కూపమివావృతమ్ ॥ 40

టీ:- యేతి. శనైః శుశ్రూషాదిమిషేణ ఉపయాతి యా యోషిద్రూపా మాయా తాం మృత్యుం ప్రతికూలామీక్షేత. ॥ 40 ॥

శ్లో ॥ యాం మన్యతే పతిం మోహాన్మన్మాయామృషభాయతీమ్ ।
స్త్రీత్వం స్త్రీసంగతః ప్రాప్తో విత్తాపత్యగృహప్రదమ్ ॥ 41

టీ:- ముముక్షుః స్త్రియం ప్రత్యేతదేవాహ-యాం మన్యతే ఇతి. ద్వాభ్యాం - యామితి. ఋష భాయతీం పురుషవదాచరంతీం యాం మమ మాయాం విత్తాదిప్రదం పతిం మన్యతే తదా తాం పురుషరూపాం మాయాం మృత్యుం విద్యాదిత్యుత్తరేణాన్వయః. యతః పూర్వజన్మని స్వయం పుమాన్ స్త్రీసంగతః అంతకాలే స్త్రీధ్యానేన స్త్రీత్వం ప్రాప్తో జీవః. ॥ 41॥

శ్లో ॥ తమాత్మనో విజానీయాత్ పత్యపత్యగృహాత్మకమ్ ।
దైవోపసాదితం మృత్యుం మృగయోర్గాయనం యథా ॥ 42

టీ:- తమితి. తాం పత్యాదిరూపం మృత్యుం జానీయాత్. మృగయోర్లుబ్ధకస్య గాయనమనుకూలత్వేన ప్రతీయమానమపి యథా మృగస్య మృత్యుః. ॥ 42 ॥

భగవంతునిచే ఏర్పరచబడిన మాయ, స్త్రీరూపములో, సేవ-చేయుట అనే మిషతో మెల్లగా సమీపించును. భక్తుడు ఆ స్త్రీని గడ్డి పొరకలచే కప్పబడిన 'బావి' వలె, తనకు మృత్యువును తెచ్చిపెట్టేదిగా భావించవలెను. ॥ 40 ॥

(ఈ రెండు శ్లోకములతో మోక్షమును కోరే స్త్రీకి కూడా ఇదే విషయమును చెప్పుచున్నాడు.) పురుషుడు పూర్వ జన్మలో దుష్ట స్త్రీ సంగము చేయుటచేత మరణకాలమున ఆ స్త్రీనే తలపోయుట చేత ఈ జన్మలో స్త్రీగా పుట్టినాడు. ఆ స్త్రీ ఇప్పుడు తన భర్త తనకు ధనమును, సంతానమును గృహమును సమకూర్చు గొప్ప వ్యక్తిగా తలపోయును. నా మాయాశక్తియే పురుషరూపములో భర్తగా ఏర్పడినదని తెలియవలెను. ॥ 41 ॥

కిరాతుడు పాడే పాట మృగములను ఎంతో ఆకర్షించును. చివరకు మృత్యురూపముగా పరిణమించును. అట్లే భర్తను, సంతానము, గృహము రూపములో మాయ తనకు దైవము ఏర్పాటు చేసినదనియు స్త్రీ గ్రహించవలెను. ॥ 42 ॥

శ్లో ॥ దేహేన జీవభూతేన లోకాల్లోకమనువ్రజన్ ।
భుంజాన ఏవ కర్మాణి కరోత్యవిరతం పుమాన్ ॥ 43

టీ:- తదేవం జీవస్య సంసృతిః ప్రపంచితా తత్ర చ తస్య కర్మవశేన లోకాల్లోకాంతరగమనం జన్మమరణం చోక్తం. తత్త్రైవం శంక్యతే. నను వ్యాపకస్య కథం లోకాల్లోకాంతరగమనం, నిత్యస్య చ కథం జన్మ మరణే. భోగేన కర్మక్షయే సతి జన్మమరణంచ నేష్యతే. తత్కుతః పునరపి తస్య కర్మసంభవ ఇతి, తత్ర లోకాల్లోకాంతరగమనం కర్మ చ సంభవతీత్యాహ -దేహేనేతి. జీవస్యోపాధితయా భూతేన జాతేన లింగ దేహేన లోకాంతరమనువ్రజన్. అవిరతం కర్మాణి కరోతీతి. కర్మణాం అసమాప్తిరుక్తా. ॥ 43 ॥

జీవుని సంసారచక్రమును, ఒక లోకము నుండి మరియొక లోకమును పొందుటను వివరించుచున్నాడు. ఇచట మూడు సంశయములు ఉత్పన్నమగును. 1.అంతటా వ్యాపించి యున్న వాడికి ఒక చోటి నుండి మరియొక చోటికి పోవుట ఎట్లు సంభవము, 2.నిత్యుడై యున్న వాడికి జనన మరణములు ఎట్లు? 3.ఉపాధిగతమైన కర్మ, అనుభవించుటతో క్షయమగుచున్నది గదా! అట్టి దశలో మళ్ళీ జన్మ మరణములు ఉండగూడదు కదా! ఆకాశము అంతటా వ్యాపించియున్నను ఘటాకాశము ఘటము పగిలినప్పుడు మహాకాశము లో కలియుచున్నది. కొత్త ఘటము ఏర్పడినపుడు మళ్ళీ ఘటాకాశము అగుచున్నది. అట్లే జీవుని లింగశరీరము ఒక లోకమునుండి మరియొక లోకమునకు వెళ్ళును. ప్రారబ్ధకర్మ రూపములో గత జన్మలలో చేసిన కర్మననుభవిస్తూనే ఈ జన్మలో కర్మచేయుచుండును. ఆ చేసే కర్మ మరియొక జన్మ పొందుటకు కారణమగును. ఈ రకముగా నిరంతరము కర్మలను చేస్తూ జననమరణ ప్రవాహరూపమున కొట్టుకొని పోవుచుండును. ॥ 43 ॥

శ్లో ॥ జీవో హ్యస్యానుగో దేహో భూతేంద్రియమనోమయః ।
తన్నిరోధోఽస్య మరణమావిర్భావస్తు సంభవః ॥ 44

(జన్మము, మరణము సంభవమే యని అదెట్లో చెప్పుచున్నాడు.)

జీవుడియొక్క ఉపాధిరూపమైన లింగశరీరము మోక్ష ప్రాప్తి వరకు ఆ జీవుని అనుసరించుచునే యుండును. పంచ భూతములు,

టీ:- జన్మమరణసంభవానాహ-జీవ ఇతి. జీవో జీవోపాధిర్లింగ దేహః అస్యాత్మనః అనుగః అనువర్తీ. భూతేంద్రియమనోమయః స్థూలభూతాదివికారః. దేహః భోగాయతనం తయోర్నిరోధః కార్యా యోగ్యతా తదస్య జీవస్య మరణముచ్యతే. ఆవిర్భావస్తు సంభవః. జన్మోచ్యతే. ॥ 44 ॥

శ్లో ॥ ద్రవ్యోపలబ్ధిస్థానస్య ద్రవ్యేక్షాయోగ్యతా యదా ।
తత్పంచత్వమహంమానాదుత్పత్తిర్ద్రవ్యదర్శనమ్ ॥ 45

శ్లో ॥ యథాక్ష్ణోర్ద్రవ్యావయవదర్శనాయోగ్యతా యదా ।
తదైవ చక్షుషో ద్రష్టుర్ద్రష్టృత్వా యోగ్యతాఽనయోః ॥ 46

టీ:- ఏతదేవ దృష్టాంతేన స్పష్టయతి-ద్రవ్యేతి. యథేతి. ద్రవ్యోపలబ్ధిస్థానస్య నేత్రగోళకాదేః ద్రవ్యేక్షాయాం రూపాదిదర్శనే. కాచ కామలాది -దోషేణ యదా అయోగ్యతా భవతి తదైవ చక్షుషః ఇంద్రియస్యాప్య -యోగ్యతా. అనయోః స్థాన చక్షుషోః. యథా అయోగ్యతా తదైవ ద్రష్టుర్జీవస్య ద్రష్టృత్వాయోగ్యతా. ఏవం స్థూలదేహస్య వైకల్యే లింగస్య వైకల్యం తదేవ జీవస్య మరణం న స్వత ఇత్యర్థః. క్వచిదేకః శ్లోకోఽధికః పఠ్యతే. తత్రాయమర్థః. ద్రవ్యోపలబ్ధిస్థానస్య స్థూలశరీరస్య ద్రవ్యేక్షాయాం యదా అయోగ్యతా తత్పంచత్వం మరణం. అహం మానాత్

ఇంద్రియములు, మనస్సు అనే వాటితో కూడిన దేహము ఆ జీవునకు భోగసాధనము. జీవుడు మరియు దేహము కలిసి పనిచేసే సామర్థ్యము లేకుండాపోవుటయే మరణము. జీవుడు, దేహము కలిసి ప్రకట మగుటయే జన్మ. ॥ 44 ॥

(దీనినే దృష్టాంతముతో స్పష్టపరచుచున్నాడు.)

ద్రవ్యోపలబ్ధిస్థానము, అనగా పదార్థములు తెలియబడే స్థానమే ఈ స్థూలదేహము. ఈ స్థూలదేహము ఒకప్పుడు ద్రవ్యములను తెలిసికొనే యోగ్యతను కోల్పోవును. అదియే మరణము. ఈ స్థూల శరీరమే "నేను" అనే అభిమానముతో పదార్థములను దర్శించ గలుగుటయే జన్మ. చర్మ చక్షువు(కన్ను) వేరు. చక్షురింద్రియము వేరు. మోతెబింద మొదలగు ఏదేని నేత్ర రోగము వచ్చినప్పుడు చర్మ చక్షువు పనిచేయదు. అప్పుడు చక్షురింద్రియము కూడా పనిచేయదు. ఈ రెండును పనిచేయనప్పుడు సాక్షియగు జీవుని యందు చూచే సామర్థ్యము లోపించును. జీవుని జనన మరణములు కూడా ఇట్టి ఉపాధి ధర్మములు మాత్రమే. ॥ 45,46 ॥

ఇదమేవాహమిత్యభిమానేన. ద్రవ్యస్య స్థౌలశరీరస్య దర్శనముత్పత్తిః. అక్ష్ణోఃగోళకయోః ద్రవ్యావయవస్య రూపాదిదర్శనే అయోగ్యతా. శేషం సమానం. ॥ 45,46 ॥

శ్లో ॥ తస్మాన్న కార్యః సంత్రాసో న కార్పణ్యం న సంభ్రమః ।
బుద్ధ్వా జీవగతిం ధీరో ముక్తసంగశ్చరేదిహ ॥ 47

టీ:- తస్మాదితి. యస్మాన్న వస్తుతో జీవస్య జన్మమరణాది. తస్మాన్మరణాత్. సంత్రాసో న కార్యః జీవనే చ న కార్పణ్యం దైన్యం కార్యం. సంభ్రమశ్చ జీవనప్రయత్నే. ॥ 47 ॥

కావున వివేకముగల ధీరుడు భయపడరాదు. దైన్యము పొందరాదు. మోహపడరాదు. వాస్తవమైన జీవుని స్వరూపమగు ఆత్మను తెలిసికొనవలెను. ఆసక్తి తొలగినవాడై సంసారములో చరించవలెను. వాస్తవమునకు జీవునికి జననమరణములు లేవని గ్రహించవలెను. 47

శ్లో ॥ సమ్యగ్దర్శనయా బుద్ధ్యా యోగవైరాగ్యయుక్తయా ।
మాయావిరచితే లోకే చరేన్న్యస్య కళేబరమ్ ॥ 48

టీ:- నను సర్వదా ముక్తసంగత్వే కథం జీవనమతఆహ-సమ్యగితి. సమ్యక్పశ్యతి విచారయతీతి సమ్యగ్దర్శనా తయా బుద్ధ్యా మాయా విరచితే లోకే కళేబరం న్యస్య నిక్షిప్య. తస్మిన్నాసక్తిం త్యక్త్వాచరేదిత్యర్థః॥ 48 ॥

అన్ని విధములుగా ముక్తసంగుడై జీవించుట ఎట్లో చెప్పుచున్నాడు. సాధకుడు చక్కటి ఆలోచన (విచారణ) కలిగి యుండవలెను. ఈ లోకము మాయామయమను దృష్టి కలిగి, నిత్యానిత్యవస్తు వివేకము గలవాడై యుండవలెను. దేహాభిమానము విడిచి వైరాగ్యము గలవాడై యుండవలెను. ఈ రకమైన నిశ్చయ బుద్ధిగలిగి యుండి లోకములో సంచరించవలెను. ॥ 48 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే, కపిలోపాఖ్యానే జీవగతిర్నామైకత్రింశత్తమోஉధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు ముప్పది ఒకటవ అధ్యాయము సమాప్తము

ద్వాత్రింశోఽధ్యాయః

శ్లో ॥ ద్వాత్రింశే సాత్త్వికైర్ధర్మైరూర్ధ్వం గతిరుదీర్యతే ।
తత్త్వజ్ఞాన విహీనస్య తతశ్చ పునరాగతిః ॥

శ్రీభగవానువాచ

శ్లో ॥ అథ యో గృహమేధీయాన్ ధర్మానేవావసన్ గృహే ।
కామమర్థం చ ధర్మాన్ స్వాన్ దోగ్ధి భూయః పిపర్తి తాన్ ॥1

టీ:- తదేవం పాపకర్మణో గతిరుక్తా ఇదానీం కామ్యకర్మణో గతిమాహ - చతుర్భిః అథేతి. యో గృహ ఏవావసన్ స్వాన్ ధర్మాన్ దోగ్ధి. దోహ్యమాహ - కామమర్థం చ ధర్మాంశ్చ. తాన్ దుగ్ధాన్ ధర్మాన్ భూయః పిపర్తి పూరయతి అనుతిష్ఠతి. ॥ 1 ॥

శ్లో ॥ స చాపి భగవద్ధర్మాత్కామమూఢః పరాఙ్ముఖః ।
యజతే క్రతుభిర్దేవాన్ పితౄంశ్చ శ్రద్ధయాన్వితః ॥ 2

టీ:- స ఇతి. సోఽపి భగవదారాధన రూపాద్ధర్మాత్పరాఙ్ముఖః సన్. ప్రాకృతానపి దేవాన్ పితౄంశ్చ యజతే. ॥ 2 ॥

32 వ అధ్యాయము

ఈ ముప్పది రెండవ అధ్యాయమున సాత్త్విక ధర్మానుష్ఠానము ద్వారా జీవుని ఊర్ధ్వగతి మరియు తత్త్వజ్ఞానము లేనివాని పునరాగతిని వర్ణించడమైనది.

శ్రీ కపిలుడు ఇట్లు పలికెను

(పాపకర్మలు చేసేవారి గతి చెప్పియున్నాడు. ఇప్పుడు ఈ నాలుగు శ్లోకములతో “కామకర్మలు”చేసేవారి గతి చెప్పుచున్నాడు) ఓ తల్లీ! ఎవడైతే గృహమునందే ఉంటూ గృహస్థాశ్రమ ధర్మములను పాటిస్తాడో వాడు, ఆ ఆచరణ ఫలితముగా అర్థము, కామములను అనుభవించును. తిరిగి ఆ గృహస్థుడు అర్థకామముల యందే ఆసక్తి గలవాడై ధర్మాచరణకు పూనుకొనును. ॥ 1 ॥

గృహస్థుడైన స్వధర్మాచారపరాయణుడు కూడా భగవదారాధన రూపమైన భాగవత ధర్మము నుండి విముఖుడై కామనలచే మోహింప బడును. క్రతువులచే దేవతలను ఆరాధించును. శ్రద్ధావంతుడై పితరులను ఆరాధించును. ॥ 2 ॥

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

శ్లో ॥ తచ్ఛ్రద్ధయాక్రాంతమతిః పితృదేవవ్రతః పుమాన్ ।
గత్వా చాంద్రమసం లోకం సోమపాః పునరేష్యతి ॥ 3

టీ:- తతః కిమతఆహ - తదితి. తేషాం శ్రద్ధయా ఆక్రాంతా వ్యాప్తా మతిర్యస్య. పిత్రర్థం దేవతార్థం చ వ్రతం నియమో యస్య సః. సోమపాః తత్ర సోమం పీత్వేత్యర్థః. ॥ 3 ॥

(దానివలన ఏమగునో చెప్పుచున్నాడు). దేవతలను, పితృ దేవతలను ఆరాధించుటయే వ్రతముగా గల ఆతనిబుద్ధి వారియందలి శ్రద్ధతో నిండియుండును. అట్టి అనుష్ఠానపరుడు మరణించిన పిదప చంద్రలోకమును చేరి సోమరసమును పానము చేయును. కాని పుణ్య క్షయము కాగానే మళ్ళీ పతనమునొంది ఈ లోకమునకు వచ్చును. 3

శ్లో ॥ యదా చాహీంద్ర శయ్యాయాం శేతేఽనంతాసనో హరిః ।
తదా లోకా లయం యాంతి త ఏతే గృహమేధినామ్ ॥ 4

టీ:- లోకే తిష్ఠత్యపి పుణ్యక్షయాత్పతనముక్త్వా లోకానామపి లయమాహ - యదేతి. యదా చాహరహః ప్రళయే. ॥ 4 ॥

(పుణ్యక్షయానంతరము పతనమగుట చెప్పి ఆ లోకములు కూడా లయమొందుటను చెప్పుచున్నాడు.) శేషశాయియగు శ్రీహరి కల్పాంతమందు ఆదిశేషుని శయ్యగా చేసికొని నిద్రించును. అప్పుడు కర్మిష్ఠులైన గృహస్థులు పొందే ఈ లోకములన్నియు లయమును పొందును. 4

శ్లో ॥ యే స్వధర్మాన్న దుహ్యంతి ధీరాః కామార్థ హేతవే ।
నిస్సంగాన్యస్తకర్మాణః ప్రశాంతాః శుద్ధచేతసః ॥ 5

శ్లో ॥ నివృత్తిధర్మ నిరతా నిర్మమా నిరహం కృతాః ।
స్వధర్మాఖ్యేన సత్త్వేన పరిశుద్ధేన చేతసా ॥ 6 ॥

(భగవద్ధర్మ నిష్ఠులైనవారు భగవంతునే పొందెదరని ఈ మూడు శ్లోకములతో చెప్పుచున్నాడు.) ఏ వివేకవంతుడైన పురుషుడు తన స్వధర్మములను అర్థకామములను పొందుటకు వినియోగించు-కొనడో, సరికదా భగవంతుడిని ప్రసన్నుడిగా చేసికొనుటకు వినియోగించునో ఆతడు అన్ని విధములుగా శుద్ధ- చిత్తుడగును. ఆతడు అనాసక్తుడు, ప్రశాంతమైనవాడు, నివృత్తిధర్మ పరాయణుడు,

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

టీ:- భగవద్ధర్మనిష్ఠానాం తత్ప్రాప్తిమేవ గతిమాహ - య ఇత్యాది త్రిభిః - య ఇతి. యే తు కామార్థప్రయోజనాయ స్వధర్మాన్న దుహ్యంతి న దుహంతి. నిస్సంగాః అనాసక్తాః న్యస్తాని ఈశ్వరే సమర్పితాని. కర్మాణి యైః. ॥ 5-6 ॥

శ్లో ॥ సూర్యద్వారేణ తే యాంతి పురుషం విశ్వతోముఖమ్ ।
పరాపరేశం ప్రకృతిమస్యోత్పత్త్యంతభావనమ్ ॥ 7

టీ:- సూర్యేతి. విశ్వతోముఖం పరిపూర్ణం పురుషం యాంతి. తథా చ. శ్రు."సూర్య ద్వారేణ తే విరజాః ప్రయాంతి యత్రామృతస్స పురుషో హ్యవ్యయాత్మే"తి. ప్రకృతిముపాదాన కారణం. ఉత్పత్త్యంతభావనం నిమిత్తకారణమ్. ॥ 7 ॥

శ్లో ॥ ద్విపరార్ధావసానే యః ప్రళయో బ్రహ్మణస్తు తే ।
తావదధ్యాసతే లోకం పరస్య పరిచింతకాః ॥ 8

టీ:- పరమేశ్వరదృష్ట్యా హిరణ్యగర్భోపాసకానామపి క్రమేణ

మమతా రహితుడు, అహంకారశూన్యుడుగా నుగును. స్వధర్మము అనే సత్త్వగుణముచేత పరిశుద్ధమైన మనస్సు గలవాడగును.॥5,6 ॥

పైరెండు శ్లోకములలో పేర్కొనబడిన భగవద్ధర్మనిష్ఠగల వివేకులు సూర్యమార్గము గుండా పరిపూర్ణుడు, సర్వవ్యాపకుడునగు శ్రీహరిని పొందెదరు. దీనికి "సూర్యద్వారేణతే విరజాః ప్రయాంతి యత్రామృతస్స పురుషో హ్యవ్యయాత్మే" అను శ్రుతివాక్యము ప్రమాణము. ఈ సూర్యమార్గమునకే అర్చిమార్గము మరియు దేవయానము అను పేర్లు కూడా కలవు. శ్రీహరి కార్యకారణ రూపమైన ఈ జగత్తునకు ప్రభువు. ఆ శ్రీహరియే ఈ జగత్తునకు ప్రకృతి రూపములో ఉపాదానకారణము. ఈ జగత్తు యొక్క ఉత్పత్తి ప్రళయములను సంకల్పించే నిమిత్తకారణము కూడ శ్రీహరియే. ॥ 7 ॥

(ఈ మూడు శ్లోకములలో పరమేశ్వరబుద్ధితో హిరణ్యగర్భుని ఉపాసించేవారుకూడా క్రమముగా ఆతనినే పొందెదరని చెప్పు-చున్నాడు.) పరమేశ్వరబుద్ధితో హిరణ్యగర్భుడగు విరాట్పురుషుని ఉపాసించువారు రెండు పరార్ధముల కాలము (బ్రహ్మదేవుని

తత్రాప్తిమాహ -ద్విపరార్ధావసాన ఇతి త్రిభిః. పరస్య హిరణ్యగర్భస్య. పరిచింతకాః పరమేశ్వరదృష్ట్యా హిరణ్యగర్భోపాసకాః. ॥ 8 ॥

శ్లో॥ క్ష్మాఽంభోనలానిల వియన్మన ఇంద్రియార్థ
భూతాదిభిః పరివృతం ప్రతి సంజిహీర్షుః ।
అవ్యాకృతం విశతి యర్హి గుణత్రయాత్మా
కాలం పరాఖ్యమనుభూయ పరః స్వయంభూః ॥ 9

టీ:- క్ష్మేతి. క్ష్మాదీని పంచమహాభూతాని మనశ్చేంద్రియాణిచార్థాశ్చ శబ్దాదయః భూతాదిశ్చాహంకారః ఏవమాదిభిః పరివృతం యుక్తం. బ్రహ్మాండం ప్రతిసంహర్తుమిచ్ఛుః సన్. అవ్యాకృతమీశ్వరం పరాఖ్యం. ద్విపరార్ధలక్షణం కాలమ్. ॥ 9 ॥

శ్లో॥ ఏవం పరేత్య భగవంతమనుప్రవిష్టా
యే యోగినో జితమరున్మనసో విరాగాః ।
తేనైవ సాకమమృతం పురుషం పురాణం
బ్రహ్మ ప్రధానముపయాంత్య గతాభిమానాః ॥ 10

టీ:- ఏవమితి. పరేత్య దూరం గత్వా భగవంతం హిరణ్యగర్భం

50+50=100 సంవత్సరములు) సత్యలోకములోనే నివసింతురు. ఆ పిమ్మట ప్రళయకాలమున బ్రహ్మ లయమును పొందును. ॥ 8 ॥

బ్రహ్మ తన ద్విపరార్ధ కాలము తన అధికారముననుభవించును. (ఈ ద్విపరార్ధ కాలమే పర ఆఖ్యము) పిమ్మట భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, ఇంద్రియములు, ఆ ఇంద్రియార్థము లైన విషయములు, అహంకారము అనే వాటితో కూడుకున్న సంపూర్ణ విశ్వమును ఉపసంహరించ గోరినవాడై సత్త్వ రజస్తమో గుణాత్మకమైన ప్రకృతితో బాటు నిర్గుణ నిర్వికారుడగు పరమేశ్వరుని లోనికి ప్రవేశించును. ॥ 9 ॥

శ్వాసను, ప్రాణమును జయించినవారు, విరక్తులగు యోగులు ఈ విధముగా దేహము విడిచిపెట్టిన పిదప ఆ హిరణ్యగర్భునితో కలిసియే పరమానందస్వరూపమగు పరబ్రహ్మ యందు లీనమగుదురు. ఇందుకు "బ్రహ్మణాసహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే! పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పదం" అనెడి స్మృతివాక్యము ప్రమాణము, హిరణ్యగర్భుడు ఆ పరబ్రహ్మలో లీనమగుటకు పూర్వము,

అనుప్రవిష్టా యే యోగినః అమృతం పరమానందరూపం. ప్రధాన-ముత్కృష్టం బ్రహ్మ తేనైవ సహోపయాంతి, న తు పూర్వం. యత స్తదాగతాభిమానాః. తథా చ స్మృతిః - శ్లో."బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే, పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పదమి"తి. ॥ 10 ॥

శ్లో ॥ అథ తం సర్వభూతానాం హృత్పద్మేషు కృతాలయమ్ ।
శ్రుతానుభావం శరణం వ్రజ భావేన భామిని ॥ 11

టీ:- భగవదుపాసకాస్తు సాక్షాదేవ తం ప్రాప్నువంతి న తు క్రమేణ, అతస్త్వం సాక్షాత్తమేవ భజేత్యాహ-అథేతి. అథ తస్మాత్ భావేన ప్రేమ్ణా. ॥11 ॥

శ్లో ॥ ఆద్యః స్థిర చరాణాం యో వేదగర్భః సహర్షిభిః ।
యోగేశ్వరైః కుమారాద్యైః సిద్ధైర్యోగ ప్రవర్తకైః ॥ 12

టీ:- ఏవం తావద్భగవద్భక్తానాం నిరంతరమేవ తత్ప్రాప్తిః భగవద భేదేన హిరణ్యగర్భోపాసకానాం తు క్రమేణేత్యుక్తం. భేదేనోపాసనే తు బ్రహ్మాదయోఽ ప్యావర్తంతే కిముతాన్య ఇత్యాహ-చతుర్భిః ఆద్య ఇతి.

అభిమానముతో కూడిన వారగుటచేత ఆ యోగులు పరబ్రహ్మ యందు లీనము కాజాలరు. ॥ 10 ॥

(భగవదుపాసకులు క్రమపద్ధతిలో కాకుండా నేరుగా(చక్కగా) ఆ శ్రీహరినే పొందెదరు) శ్రీహరి సకలప్రాణుల హృదయపద్మముల యందు నివసించేవాడు. నేను నీకు ఆ శ్రీహరి మహిమను చెప్పి యున్నాను. కావున ఓ జననీ! నీవు భక్తితో ఆ శ్రీహరినే శరణు పొందుము. (సేవించుము) ॥ 11 ॥

భగవద్భక్తులకు నిరంతర భగవత్ప్రాప్తి కలుగును. హిరణ్యగర్భో పాసకులకు క్రమముగా భగవత్ప్రాప్తి కలుగునని చెప్పినమీదట ఈ నాలుగు శ్లోకములతో భేదోపాసనతో బ్రహ్మాదులకు కూడా పునరావృత్తి యగుచుండగా ఇతరుల విషయమేమని చెప్పవచ్చునని తెల్పుచున్నాడు బ్రహ్మ స్థావర జంగమములగు ప్రాణులన్నింటికిని కారణుడు మరియు వేదనిధి. ఇట్టి బ్రహ్మ మరీచి మున్నగు మహర్షులతో, యోగేశ్వరులతో, సనత్కుమారాది జ్ఞానులతో సిద్ధపురుషులతో కూడిన వాడై

యో వేదగర్భః. సోఽపి గుణవ్యతికరే జాతే యథాపూర్వం బ్రహ్మ పదాధి కృతః సన్. ప్రజాయతే ఇతి తృతీయేనాన్వయః. న కేవలం స ఏవైకః కింతు ఋషిభిర్మరీచ్యాదిభిర్యోగేశ్వరాదిభిశ్చ సహ. ॥ 12 ॥

శ్లో ॥ భేదదృష్ట్యాభిమానేన నిస్సంగేనాపి కర్మణా ।
కర్తృత్వాత్సగుణం బ్రహ్మ పురుషం పురుషర్షభమ్ ॥ 13

టీ:- భేదేతి. జన్మని హేతుద్వయం. భేద దృష్ట్యా అభిమానేన కర్తృత్వాదితి చ. యథా పూర్వత్వే హేతుః. నిస్సంగేన నిష్కామేన కర్మణేతి. ॥ 13 ॥

శ్లో ॥ స సంసృత్య పునః కాలే కాలేనేశ్వరమూర్తినా ।
జాతే గుణవ్యతికరే యథాపూర్వం ప్రజాయతే ॥ 14

టీ:- స ఇతి. కిం కృత్వాత్ర ప్రజాయతే. ప్రథమం పారమేష్ట్యమైశ్వర్యం నిషేవ్య, పశ్చాత్ప్రళయే సగుణం గుణాధిష్ఠాతారం ప్రథమావతార రూపం పురుషం సంసృత్య ప్రాప్య. ॥ 14 ॥

పురుషశ్రేష్ఠుడు, ఆదిపురుషుడు సగుణబ్రహ్మ అయిన నారాయణుడిలో లీనమైనాడు. మరల సృష్టి కాలము రాగానే కాలస్వరూపుడగు ఈశ్వరుని -చే ప్రేరేపింపబడినాడు. సత్త్వరజస్తమో గుణాత్మకమగు ప్రకృతిలో వైషమ్యము రాగానే పూర్వకల్పము నందువలెనే జగద్రూపముగా ప్రకటమగుచున్నాడు. బ్రహ్మ మరల పుట్టుటకు (ప్రకటమగుటకు) రెండు కారణములు. 1. భేద దృష్టి, 2.అభిమానముతో కూడిన కర్తృత్వము. పూర్వము వలెనే (యథా పూర్వముగా) ప్రకటమగుటకు కారణమేమనగా నిష్కామ కర్మచేయుట. ॥ 12-14॥

శ్లో ॥ ఐశ్వర్యం పారమేష్ఠ్యం చ తేఽపి ధర్మవినిర్మితమ్ ।
నిషేవ్య పునరాయాంతి గుణవ్యతికరే సతి ॥ 15

టీ:- ఐశ్వర్యమితి. తేఽపి ఋషిముఖ్యాః. స్వకర్మనిర్మితమైశ్వర్యం నిషేవ్య. పురుషం చ సంస్మృత్య యథాపూర్వం స్వస్వాధికారేణ పునరాయాంతీత్యన్వయః. ॥ 15 ॥

ఇదే ప్రకారముగా మరీచి మున్నగు ముఖ్య ఋషులు ఇతరులు గూడా స్వధర్మానుష్ఠానము చేత సంపాదింపబడిన బ్రహ్మలోకమునందలి ఐశ్వర్యమును అనుభవించి గుణవైషమ్యము రాగానే, వారి వారి అధికారములననుసరించి తిరిగి జన్మించెదరు. ॥ 15 ॥

శ్లో ॥ యే త్విహాసక్తమనసః కర్మసు శ్రద్ధయాన్వితాః ।
కుర్వంత్యప్రతిషిద్ధాని నిత్యాన్యపి చ కృత్స్నశః ॥ 16

టీ:- యదా బ్రహ్మోపాసకానామపి. భేదదర్శనాభిమానాభ్యామేవమావృత్తిః. తదా కామ్య కర్మిణాం కిం వక్తవ్యమితి తాన్నిందన్నాహ-షడ్భిః యఇతి. యే త్విహ కర్మస్వాసక్తమనసః సంతోఽప్రతిషిద్ధాని కామ్యాని నిత్యాని చ కర్మాణి కృత్స్నాని కుర్వంతి. తే అర్యమ్ణో దక్షిణేన పథా ధూమమార్గేణ పితృలోకం వ్రజంతీతి పంచమేనాన్వయః. ॥ 16 ॥

(ఈ ఆరు శ్లోకములతో భేదదర్శనము మరియు అభిమానముల కారణములచేత బ్రహ్మోపాసకులకు కూడా పునరావృత్తి యగుచుండగా కామ్యకర్మచేయువారి విషయమేమి చెప్పవచ్చుననుచు? వారిని నిందించుచున్నాడు.) ఎవరైతే ఈ సంసారమునందే ఆసక్తితో కూడిన మనస్సు గలవారై కర్మఠులైయుందురో, వేదనిషిద్ధకర్మలను వదలి నిత్య కర్మలను, కామ్యకర్మలను శ్రద్ధతో చేయుచుందురో వారు దక్షిణ మార్గముచే అర్యముడు పాలించే పితృలోకమును పొందెదరు. ॥ 16॥

శ్లో ॥ రజసా కుంఠ మనసః కామాత్మానోఽజితేంద్రియాః ।
పితౄన్ యజంత్యనుదినం గృహేష్వభిరతాశయాః ॥ 17

టీ:- మధ్యే తన్నిందామాహ - రజసేత్యాదినా. ॥ 17 ॥

రజోగుణము చేత విక్షిప్తమైన మనస్సుగల వారు, కోరికలయందే ఆసక్తి గలవారు, ఇంద్రియములను జయింపజాలనివారు, గృహ కార్యములందు మాత్రమే ప్రీతిగలవారై ప్రతిదినము పితృదేవతలను ఆరాధించెదరు. ॥ 17 ॥

శ్లో ॥ త్రైవర్గికాస్తే పురుషా విముఖా హరిమేధసః ।
కథాయాం కథనీయోరువిక్రమస్య మధుద్విషః ॥ 18

టీ:- త్రైవర్గికా ఇతి. హరతి సంసారం మేధా యస్య హరిమేధాః తస్య కథనీయా ఉరవో విక్రమా యస్య తస్య మధుద్విషః కథాయాం విముఖాః సంతః యే త్రైవర్గికాః. ॥ 18 ॥

శ్రీహరికథ సంసారదుఃఖమును పోగొట్టే శక్తికలది, 'మధువు' అనే రాక్షసుని సంహరించిన గొప్ప పరాక్రమముగల ఆయన కథ కీర్తింపతగినది. ఇట్టి శ్రీహరి కథలను వినుటకు త్రైవర్గికులు (ధర్మార్థ కామములందు కట్టుబడియుండువారు) విముఖులుగా ఉందురు. 18

శ్లో ॥ నూనం దైవేన నిహతా యే చాచ్యుత కథాసుధామ్ ।
హిత్వా శృణ్వంత్యసద్గాథాః పురీషమివ విడ్భుజః ॥ 19

టీ:- నూనమితి. యే చాచ్యుత కథాసుధాం హిత్వా అసతాం కామినాం గాథాః శృణ్వంతి తే నూనం దైవేన నిహతా ఇత్యన్వయః19

అచ్యుతునికథ అనెడి అమృతమును విడిచిపెట్టి చెడు కథలను వినువారు నిశ్చయముగా దైవముచేత (ప్రారబ్ధ కర్మచేత) నిహతులు. (చంపబడినవారు) సూకరము మాలిన్యము తినునట్లు వీరు నీచమును కోరినవారగుదురు. ॥ 19 ॥

శ్లో ॥ దక్షిణేన పథాఽర్యమ్ణః పితృలోకం వ్రజంతి తే ।
ప్రజామను ప్రజాయంతే శ్మశానాంతక్రియాకృతః ॥ 20

టీ:- దక్షిణేనేతి. పితృలోకాత్పునః ప్రజామను స్వపుత్రాదిషు ప్రజాయంతే. గర్భాధానాదారభ్య శ్మశానాంతాః క్రియాః కృతవంతః. యథోక్తకారిణ ఇత్యర్థః. ॥ 20 ॥

గర్భాధానము మొదలుకొని శ్మశానములో చేసే అంత్యేష్టి వరకు గల కర్మలను, శాస్త్రములలో చెప్పబడినట్లు చేయువారు దక్షిణ మార్గములో 'అర్యము'డిచే పాలింపబడే పితృలోకమును పొందెదరు. పుణ్య క్షయానంతరము తమ సంతానమునకే మరల సంతానమై జన్మించెదరు. ॥ 20 ॥

శ్లో ॥ తతస్తే క్షీణ సుకృతాః పునర్లోకమిమం సతి ।
పతంతి వివశా దేవైః సద్యో విభ్రంశితోదయాః ॥ 21

టీ:- కథం ప్రజాయంతే తదాహ -తత ఇతి. తతస్తే పునరిమం లోకం ప్రతి పతంతి. విభ్రంశిత ఉదయో భోగ సాధనం యేషాంతే. 21

(మరల ఎట్లు జన్మించెదరో చెప్పుచున్నాడు). ఆ కర్మనిష్ఠుల పుణ్యము క్షీణించగానే వారి భోగములు తొలగిపోవును. వెంటనే దేవతలు వారిని ఆ లోకము నుండి ఈ మర్త్యలోకమునకు త్రోసి వేయుదురు. అస్వతంత్రులైన ఆ జీవులు మరల ఈ లోకములో జన్మించెదరు. ॥ 21 ॥

శ్లో ॥ తస్మాత్త్వం సర్వభావేన భజస్వ పరమేష్ఠినమ్ ।
తద్గుణాశ్రయయా భక్త్యా భజనీయపదాంబుజమ్ ॥ 22

టీ:- తస్మాదితి. పరమేష్ఠినం పరమేశ్వరం. సర్వభావేన అతిప్రీత్యా తస్య గుణానాశ్రయతే యా భక్తిః తయా. ॥ 22 ॥

ఆయన చరణారవిందములు భజింపదగినవి. కావున నీవు నిండు మనస్సుతో(త్రికరణములతో)ఆ పరమేశ్వరుని భజించి, ఆయన గుణములే ఆశ్రయముగాగల భక్తితో ఆయనను ఆశ్రయించుము. 22

శ్లో ॥ వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః ।
జనయత్యాశు వైరాగ్యం జ్ఞానం యద్బ్రహ్మదర్శనమ్ ॥ 23

టీ:- భజనే చ జ్ఞానవైరాగ్యే స్వత ఏవ భవత ఇత్యాహ - వాసుదేవ ఇతి. ॥ 23 ॥

(ఆ శ్రీహరిని భజించుటచేత జ్ఞానవైరాగ్యములు స్వతహాగా ఏర్పడునని చెప్పుచున్నాడు). భగవంతుడైన వాసుదేవుని యందు భక్తి కలిగియున్నట్లయితే శీఘ్రముగా వైరాగ్యము ఏర్పడును, బ్రహ్మ సాక్షాత్కారమును కలిగించే జ్ఞానము కలుగును. ॥ 23 ॥

శ్లో ॥ యదాఽస్య చిత్తమర్థేషు సమేష్వింద్రియవృత్తిభిః ।
న విగృహ్ణాతి వైషమ్యం ప్రియమప్రియమిత్యుత ॥ 24

టీ:- తదేవోపపాదయతి - యదేతి. యదా అస్య భక్తస్య చిత్తం భగవద్గుణానురాగేణ తస్మిన్నేవ నిశ్చలం సత్. ఇంద్రియవృత్తిభిః. అర్థేషు వైషమ్యం న విగృహ్ణాతి. ॥ 24 ॥

శ్లో ॥ స తదైవాత్మనాత్మానం నిస్సంగం సమదర్శనమ్ ।
హేయోపాదేయరహిత మారూఢం పదమీక్షతే ॥ 25

టీ:- స ఇతి. తదేవ ఆత్మనా ఆత్మానం స్వప్రకాశమీక్షతే. కథంభూతం. సమం చ తద్దర్శనం చ. తత్కృతః. నిస్సంగం సంగాద్ధి వైషమ్యం భవతి. నిస్సంగత్వే హేతుః. హేయోపాదేయరహితం. తత్కృతః.పదం వ్యవసితం. ఆరూఢం పరమానందోఽహమితి నిశ్చయం ప్రాప్తమిత్యర్థః ॥25॥

శ్లో ॥ జ్ఞాన మాత్రం పరం బ్రహ్మ పరమాత్మేశ్వరః పుమాన్ ।
దృశ్యాదిభిః పృథగ్భావైర్భగవానేక ఈయతే ॥ 26

(అదే విషయమును ఉపపాదించుచున్నాడు).

ఎప్పుడైతే భక్తుని చిత్తము ఇంద్రియములకు విషయములైన శబ్దాదుల యందు ప్రియము, అప్రియము అనే వైషమ్యము లేకుండా యుండునో, భగవద్గుణములయందు అనురాగముతో కూడి, అందులోనే నిశ్చలముగా ఉండునో, సర్వము ఈశ్వరరూపముగ దర్శించునో అప్పుడా భక్తుడు ఆత్మరూపములో బ్రహ్మసాక్షాత్కారము పొందును. ఆ ఆత్మ నిస్సంగము, జ్ఞాన పూరము అంతటా సమానముగా నున్నది. త్యజింపదగిన, స్వీకరింపదగిన గుణములు లేనిది. భక్తుడు ఈ లక్షణములు గల తన ఆత్మను దర్శించి తన స్వరూపమగు ప్రత్యగభిన్న బ్రహ్మతో ఏకీభావమును పొందును. ॥24,25 ॥

అద్వితీయుడగు భగవానుడు జ్ఞానస్వరూపుడు. ప్రకృతికి అతీతుడు, నిరతిశయ బ్రహ్మతత్త్వము, ఆత్మస్వరూపము, సర్వమును

టీ:- సమేష్వర్థేష్విత్యుక్తం తదేవసామ్యం దర్శయతి - జ్ఞానమాత్రమితి. జ్ఞానమేవ పరబ్రహ్మేది శబ్దైః ప్రసిద్ధం. దృశ్యాదిభిర్దృశ్య ద్రష్టృకరణరూపేణ పృథక్ప్రతీయతే. జ్ఞానమాత్రత్వేన సమేష్విత్యర్థః. ॥ 26 ॥

శ్లో॥ ఏతావానేవ యోగేన సమగ్రేణేహ యోగినః ।
యుజ్యతేఽభిమతో హ్యర్థో యదసంగస్తు కృత్స్నశః ॥ 27

టీ:- నను జ్ఞానమాత్రమాత్మనః స్వరూపత్వాన్నిత్య ప్రాప్తమేవేతి కిమ-నేక సాధనసాధ్యేన యోగేన ప్రాప్యతే తదాహ - ఏతావానితి. యుజ్యతే. ప్రాప్యతే. ప్రపంచసంగస్య వ్యుదాస ఏవ యోగస్య ఫలమిత్యర్థః. 27

శ్లో॥ జ్ఞానమేకం పరాచీనైరింద్రియైర్బ్రహ్మ నిర్గుణమ్ ।
అవభాత్యర్థరూపేణ భ్రాంత్యా శబ్దాదిధర్మణా ॥ 28

టీ:- నను కథం ప్రత్యక్షాదిప్రతీతః ప్రపంచో వ్యుదసితుం శక్యతే ప్రతీతేర్భ్రాంతిత్వాదిత్యాహ - జ్ఞానమితి. పరాచీనైః పరాఙ్ముఖైః. శబ్దాది ధర్మో యస్య తేన అర్థరూపేణ జ్ఞానరూపం నిర్గుణ. బ్రహ్మైవావభాతి న త్వర్థః పృథగస్తీత్యర్థః. ॥ 28 ॥

శాసించువాడు, పురుషుడు. ఆతడే దృశ్యముగా,(జగత్తుగా), ద్రష్టగా (జీవుడిగా) దర్శించుటకు ఉపయోగపడే ఇంద్రియములుగాను భాసించుచున్నాడు. జ్ఞానయోగము ద్వారా బ్రహ్మస్వరూపముగాను, అష్టాంగ యోగము ద్వారా పరమాత్మగాను, శుద్ధభక్తి ద్వారా భగవద్రూపము పరమపురుష రూపముగాను కనబడును.॥26॥

(స్వస్వరూప జ్ఞానము మాత్రమే నిత్యత్వమును పొందించు చుండగా అనేక సాధనలతోగూడిన యోగముచేత పొందదగినదేమి? ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.) సాధకుడగు వ్యక్తి సమగ్ర యోగ సాధనలచేత పొందే గొప్పప్రయోజనమేమనగా, ఈ సంసారము నందు ఏ మాత్రము ఆసక్తి లేకుండా చేసికొనుటయే. అనగా సంపూర్ణ వైరాగ్యమును పొందుటయే పరమ ప్రయోజనము. ॥ 27 ॥

(ప్రత్యక్షముగా కనిపించుచున్న ఈ ప్రపంచమును కాదనుట ఎట్లు సాధ్యము? ఈ ప్రశ్నకు సమాధానమును చెప్పుచున్నాడు). వాస్తవముగా ఉన్న పదార్థము ఒక్కటే. అదే విజ్ఞానఘనము, అద్వితీయము, నిర్గుణ పరబ్రహ్మము. అయినప్పటికి జ్ఞానాంశములపై ఆసక్తి కనబరచక, వదలవలసిన నామరూపాత్మకమగు బాహ్య-విషయములందు ఆసక్తిగల ఇంద్రియములు, భ్రాంతిచేత శబ్దాది

శ్లో ॥ యథా మహానహం రూపస్త్రివృత్పంచవిధః స్వరాట్ ।
ఏకాదశ విధస్తస్య వపురండం జగద్యతః ॥ 29

టీ:- అర్థరూపత్వమేవోదాహృత్య దర్శయతి - యథేతి. అహంరూపః అహంకారః. స చ త్రివృత్ త్రిగుణాత్మకః. పునశ్చ భూతరూపేణ పంచవిధః, పునరింద్రియరూపేణైకాదశ విధశ్చ. స్వరాట్ జీవరూపః తస్య జీవస్య వపురండం జగచ్చ. యతో యేభ్యో మహదాదిభ్యస్తదా వభాతి. ॥ 29 ॥

శ్లో ॥ ఏతద్వై శ్రద్ధయా భక్త్యా యోగాభ్యాసేన నిత్యశః ।
సమాహితాత్మా నిస్సంగో విరక్త్యా పరిపశ్యతి ॥ 30

టీ:- నను తర్హి జనః కిమిత్యేవం న ప్రత్యేతి? తత్రాహ - ఏతదితి. ఏతద్బ్రహ్మ. ॥ 30 ॥

శ్లో ॥ ఇత్యేతత్కథితం గుర్వి జ్ఞానం తద్బ్రహ్మదర్శనమ్ ।
యేనానుబుధ్యతే తత్త్వం ప్రకృతేః పురుషస్య చ ॥ 31

టీ:- ఉక్తమేవార్థం సుఖప్రతీత్యర్థం సంక్షేపేణానువదతి - ఇతీతి. హే గుర్వి పూజ్యే. ॥ 31 ॥

ధర్మములతో కూడిన వేర్వేరు రూపములను దర్శించుచున్నవి.॥28॥

పై శ్లోకములో పేర్కొనిన ఒకే పరబ్రహ్మము మహత్తత్త్వము, సాత్త్విక రాజస తామసాహంకారములు, పంచభూతములు మఱియు పదకొండు ఇంద్రియములుగా ఏర్పడెను. ఆ స్వయంప్రకాశ పర-బ్రహ్మయే అహంకార, ఇంద్రియ, గుణ, పంచభూతములతో కలిసి 'జీవుడు' అగుచున్నాడు. జీవుడు ఆ పరబ్రహ్మ యొక్క వ్యష్టి రూపము. ఈ బ్రహ్మాండము పరబ్రహ్మ యొక్క సమష్టిరూపము, అహంకార, ఇంద్రియ, త్రిగుణములు మహత్తత్త్వము కన్నా వేరుకాదని అభిప్రాయము. ॥ 29 ॥

అయినచో జనులు ఎందుకు తెలిసికొనలేక పోవుచున్నారు అనగా, ఎవరైతే శ్రద్ధతో, భక్తితో, నిత్యము యోగాభ్యాసముతో, నిస్సంగుడై, విరక్తుడై, సమాధి స్థితిని పొందుచున్నాడో, అతడు మాత్రమే ఈ జగత్తును బ్రహ్మరూపముగా చూడగలడు. ॥ 30 ॥

(చెప్పిన విషయమునే సుఖముగా బోధపడుటకై సంక్షేపముగా తిరిగి చెప్పుచున్నాడు.) పూజనీయురాలవగు ఓ తల్లీ! నేను నీకు బ్రహ్మ సాక్షాత్కార సాధనమగు జ్ఞానమును బోధించినాను. దీని వలన సాధకునకు ప్రకృతిపురుషుల తత్త్వము తెలియును. ॥ 31 ॥

శ్లో ॥ జ్ఞానయోగశ్చ మన్నిష్ఠో నైర్గుణ్యో భక్తిలక్షణః ।
ద్వయోరప్యేక ఏవార్థో భగవచ్ఛబ్దలక్షణః ॥ 32

టీ:- అనేన చ జ్ఞానయోగేన భగవానేవ ప్రాప్యో యథా తథా భక్తియోగేనేత్యాహ - జ్ఞానేతి. నైర్గుణ్యో జ్ఞానయోగశ్చ మన్నిష్ఠో భక్తి-లక్షణశ్చ యో యోగః తయోర్ద్వయోరేక ఏవార్థః ప్రయోజనం. కోఽసౌ భగవచ్ఛబ్దో లక్షణం జ్ఞాపకో యస్య. తదుక్తం గీతాసు. శ్లో."తే ప్రాప్నువంతి మామేవ సర్వభూత హితే రతా" ఇతి. ॥ 32 ॥

నిర్గుణ పరబ్రహ్మమును తెలిపే జ్ఞానయోగము మఱియు నా యందు నిష్ఠగల భక్తియోగము అనే ఈ రెండింటి చేత పొందే ప్రయోజనము ఒకటే. ఆ ప్రయోజనమునే "భగవానుడు". భగవద్గీతలో "తే ప్రాప్నువంతి మామేవ సర్వభూత హితే రతాః" అని ఇదే విషయము ప్రతిపాదింపబడినది. ॥ 32 ॥

శ్లో ॥ యథేంద్రియైః పృథగ్ద్వారైరర్థో బహుగుణాశ్రయః ।
ఏకో నానాయతే తద్వద్భగవాన్ శాస్త్రవర్త్మభిః ॥ 33

టీ:- నను జ్ఞానయోగస్యాత్మలాభః ఫలం శాస్త్రేణావగమ్యతే భక్తియోగస్య తు భజనీయేశ్వరస్య ప్రాప్తిః కుతస్తయోరేకార్థత్వమిత్యా-శంక్యా దృష్టాంం తేనోపపాదయతి - యథేతి. యథా బహూనాం రూపరసాదీనాం గుణానాం. ఆశ్రయో గుడక్షీరాదిరేక ఏవార్థః. మార్గ భేదప్రవృత్తైరింద్రియైర్నానా ప్రతీయతే. చక్షుషా శుక్ల ఇతి, రసనయా మధుర ఇతి, స్పర్శనేన శీతఇత్యాదిః. తథా భగవానేకఏవ తత్తద్రూపేణా వగమ్యతే. శాస్త్రమార్గైః. ॥ 33 ॥

జ్ఞానయోగమునకు స్వస్వరూప దర్శనము ఫలమని శాస్త్రములు తెలుపుచున్నవి. భక్తియోగమునకు ఉపాస్యదైవప్రాప్తి ఫలము. ఈ రెండును విభిన్న ఫలములు. ఈ రెండింటి ప్రయోజనము ఒకటే అని దృష్టాంతమును చూపుచున్నాడు. పాలు ఒకే పదార్థమయినను కంటి చూపుచే తెలుపుగా, నాలుకచే మాధుర్యముగా, స్పర్శచేత వేడిగా, లేదా చల్లగా తెలియుచున్నవి. అట్లే ఒకే భగవానుడు వివిధ శాస్త్రమార్గముల చేత వివిధములుగా తెలియబడుచున్నాడు. ॥ 33 ॥

శ్లో ॥ క్రియయా క్రతుభిర్దానైస్తపస్స్వాధ్యాయ దర్శనైః ।
ఆత్మేంద్రియజయేనాపి సన్న్యాసేన చ కర్మణామ్ ॥ 34

టీ:- శాస్త్రమార్గానేవ ప్రపంచయతి-త్రిభిః క్రియయేతి. క్రియయా పూర్తరూపయా. క్రతుభిర్యాగైః. దర్శనం మీమాంసా, ఆత్మేంద్రియజయో నిషిద్ధ వర్జనం. ॥ 34 ॥

శ్లో ॥ యోగేన వివిధాంగేన భక్తియోగేన చైవ హి ।
ధర్మేణోభయచిహ్నేన యః ప్రవృత్తి నివృత్తిమాన్ ॥ 35

టీ:- యోగేనేతి. ఉభయ చిహ్నేన సకామ నిష్కామ లక్షణేన. తమేవాహ - య ఇతి. సకామం ధర్మ ప్రాప్యం స్వర్గాద్యపి భగవత ఏవ సగుణం స్వరూపమితి భావః. ॥ 35 ॥

శ్లో ॥ ఆత్మతత్త్వావబోధేన వైరాగ్యేణ దృఢేన చ ।
ఈయతే భగవానేభిః సగుణో నిర్గుణః స్వదృక్ ॥ 36

టీ:- ఆత్మేతి. ఏభిః వర్త్మభిః. స్వదృక్ స్వప్రకాశః. ॥ 36 ॥

ఈ మూడు శ్లోకముల ద్వారా శాస్త్రమార్గములను వివరించు చున్నాడు. 1.పూజాది కర్మలు, 2.క్రతువులు, 3.దానములు, 4.తపస్సు, వేదాధ్యయనము, మీమాంస, 5.మనస్సును ఇంద్రియములను జయించుట, 6.కర్మలను త్యజించుట(సన్న్యాసము), 7.ఎనిమిది అంగములతో కూడిన అష్టాంగయోగము, 8.భక్తియోగము, 9.ప్రవృత్తి నివృత్తి రూపములలో నున్న సకామ నిష్కామ ధర్మము, 10. దృఢమైన వైరాగ్యము అనే ఈ సాధనలన్నింటి చేత భగవానుడు లభించును. ఈ సాధనలన్నింటి చేత సగుణ, నిర్గుణ, స్వయంప్రకాశ స్వరూపుడైన భగవానుని చేరవచ్చును. ॥ 34-36 ॥

శ్లో ॥ ప్రావోచం భక్తియోగస్య స్వరూపం తే చతుర్విధమ్ ।
కాలస్య చావ్యక్తగతేర్యోఽంతర్ధావతి జంతుషు ॥ 37

టీ:- తదేవం జ్ఞానయోగముపసంహృత్య తస్య చ భక్తియోగేన సమానార్థత్వముక్త్వా భక్తియోగాద్యుపసంహరతి ద్వాభ్యాం - ప్రావోచమితి. చతుర్విధం త్రిగుణనిర్గుణభేదేన. అంతర్ధావతి ఉత్పత్తి నిధనాది కరోతి. ॥ 37 ॥

(జ్ఞానయోగమును ఉపసంహరించి, ఆ జ్ఞానయోగమునకు భక్తియోగము యొక్క సమానార్థత్వమును చెప్పి, ఈ రెండు శ్లోకముల ద్వారా భక్తియోగమును కూడా ఉపసంహరించుచున్నాడు). ఓ తల్లీ! నీకు సాత్త్విక, రాజస, తామస మఱియు నిర్గుణ (నాలుగు విధములైన) భక్తియోగమును తెల్పినాను. కాలము యొక్క చేష్టలు తెలిసికొనుట సాధ్యము కాదు. అట్టి కాలము యొక్క స్వరూపమును చెప్పినాను. కాలము ప్రాణుల లోపల ఉండి జనన మరణాది వికారములను కలిగించును. ॥ 37 ॥

శ్లో ॥ జీవస్య సంసృతీర్బహ్వీరవిద్యాకర్మనిర్మితాః ।
యాస్వంగ ప్రవిశన్నాత్మా న వేద గతిమాత్మనః ॥ 38

టీ:- జీవస్యేతి. అంగ హే మాతః. ॥ 38 ॥

ఓ అమ్మా! అజ్ఞానము చేత, ఆ అజ్ఞానము నుండి పుట్టిన కర్మల చేత జీవుడు అనేక గతులను పొందును. జీవుడు ఆ గతులను పొందుతూ తన యథార్థస్వరూపమును తెలియజాలకున్నాడు. ఈ వివరములను కూడ నీకు చెప్పినాను. ॥ 38 ॥

శ్లో ॥ నైతత్ఖలాయోపదిశేన్నావినీతాయ కర్హిచిత్ ।
న స్తబ్ధాయ న భిన్నాయ నైవ ధర్మధ్వజాయ చ ॥ 39

టీ:- ఉపదేశే అనధికారిణో దర్శయతి ద్వాభ్యాం - నేతి. ఖలాయ పరోద్వేజకాయ. భిన్నాయ దురాచారాయ. ధర్మధ్వజాయ డాంభికాయ. ॥ 39-40 ।

(ఈ రెండు శ్లోకములలో ఉపదేశమునకు అర్హులు కాని వారిని పేర్కొనుచున్నాడు) ఈ జ్ఞానమును దుర్మార్గునకు, వినయము లేనివానికి పొగరుబోతునకు, దురాచారునకు, దాంభికునకు ఏ కాలమునందైనను ఉపదేశించకూడదు. ॥ 39 ॥

శ్లో ॥ న లోలుపాయోపదిశేన్న గృహారూఢచేతసే ।
నాభక్తాయ చ మే జాతు న మద్భక్త ద్విషామపి ॥ 40

ఇంద్రియభోగలాలసునికి, ఇంటి యందే మనస్సు లగ్నము చేసిన వానికి, నా భక్తుడు కానివానికి, నా భక్తులను ద్వేషించు వానికి ఈ జ్ఞానమును ఏ కాలమందైనను ఉపదేశింపకూడదు.॥40 ॥

శ్లో ॥ శ్రద్దధానాయ భక్తాయ వినీతాయాఽనసూయవే ।
భూతేషు కృత మైత్రాయ శుశ్రూషాభిరతాయ చ ॥ 41

శ్లో ॥ బహిర్జాత విరాగాయ శాంత చిత్తాయ దీయతామ్ ।
నిర్మత్సరాయ శుచయే యస్యాహం ప్రేయసాం ప్రియః ॥ 42

టీ:- అధికారిణ ఆహ- ద్వాభ్యాం. శ్రద్దధానాయేత్యాదినా. ॥42 ॥

(ఈ రెండు శ్లోకములతో ఈ జ్ఞానమును ఉపదేశించుటకు అర్హులెవరో చెప్పుచున్నాడు). 1.శ్రద్ధగలవానికి, 2.భక్తునికి, 3. వినయముగలవానికి, 4.అసూయ లేనివానికి, 5.సకల ప్రాణుల యందు స్నేహభావము గలవానికి, 6.మాతా పితృ గురువులను సేవించవలెననెడి కోరిక గలవానికి, 7.వైరాగ్యము గలవానికి, 8. శాంతమైన మనస్సుగలవానికి, 9.మాత్సర్యము లేనివానికి, 10.శుచి గల వానికి, 11.నన్నే ప్రియతముడిగా భావించే వానికి ఈ జ్ఞానమును బోధించవలెను. ॥ 41-42 ॥

శ్లో ॥ య ఇదం శృణుయాదంబ శ్రద్ధయా పురుషః సకృత్ ।
యో వాఽభిధత్తే మచ్చిత్తః స హ్యేతి పదవీం చ మే ॥ 43 ॥

టీ:- ఏతచ్ఛ్రవణ కీర్తనపరస్యాపి మత్పదప్రాప్తిరేవ ఫలమిత్యాహ - య ఇతి. అంబ హే మాతః. అప్యర్థే చకారః. సోఽపి మత్పదవీమేతి. హిర్నిశ్చితమ్. ॥ 43 ॥

(దీని శ్రవణకీర్తన ఫలమును చెప్పుచున్నాడు). ఓ అమ్మా! ఎవడైతే నా యందు మనస్సును లగ్నము చేసినవాడై నేను చెప్పిన ఈ యోగమును ఒక్కసారైననూ వినునో లేదా చెప్పునో వాడు నిశ్చయముగా నా పరమపదమును పొందును. ॥ 43 ॥

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే తృతీయస్కంధే, కపిలోపాఖ్యానే ద్వాత్రింశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు



త్రయస్త్రింశోఽధ్యాయః

శ్లో ॥ త్రయస్త్రింశే తు తస్యైవ కపిలస్యోపదేశతః ।
జ్ఞానభావేన తన్మాతుర్జీవన్ముక్తిరుదీర్యతే ॥

శ్రీమైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఏవం నిశమ్య కపిలస్య వచో జనిత్రీ
సా కర్దమస్య దయితా కిల దేవహూతిః ।
విస్రస్తమోహపటలా తమభిప్రణమ్య
తుష్టావ తత్త్వవిషయాం కితసిద్ధిభూమిమ్ ॥ 1

టీ:- ఏవమితి, విస్రస్తం మోహరూపం పటలమావరణం యస్యాః సా. తత్త్వాన్యేవ విషయః తేనాం కితా సిద్ధిః సాంఖ్యజ్ఞానం తస్య భూమిం క్షేత్రం ప్రవర్తకమ్. ॥ 1 ॥

దేవహూతిరువాచ.

శ్లో ॥ అథాప్యజోఽంతః సలిలే శయానం
భూతేంద్రియార్థాత్మమయం వపుస్తే ।
గుణప్రవాహం సదశేషబీజం
దధ్యౌ స్వయం యజ్జఠరాబ్జజాతః ॥ 2

ముప్పది రెండవ అధ్యాయము సమాప్తము

33 వ అధ్యాయము

ఈ ముప్పది మూడవ అధ్యాయమున దేవహూతి తన కుమారుడైన కపిలుని ఉపదేశానుసారము జ్ఞానమును పొందుట మఱియు జీవన్ముక్తురాలగుట అను విషయములు వర్ణింపబడినవి.

మైత్రేయుడు ఇట్లు పలికెను

ఓ విదురుడా! కపిలదేవుని ఈ మాటలను విని కర్దమముని ప్రియురాలగు దేవహూతి యొక్క మోహము అనే తెర (పరదా) తొలగిపోయెను. ఆమె ప్రకృతి, పురుషుడు మొదలగు తత్త్వములను తెలియజెప్పే సాంఖ్యశాస్త్ర జ్ఞానమునకు ఆధారభూమియైన కపిల దేవునకు నమస్కరించి ఇట్లు స్తుతించెను. ॥ 1 ॥

('అథ' వాక్యాంతరమును జ్ఞప్తికి తెచ్చును).

ఓ కపిలుడా! బ్రహ్మ నీ నాభికమలము నుండియే ఉత్పన్నమయ్యెను. ప్రళయజలములో శయనించిఉన్న నిన్ను బ్రహ్మ ధ్యానించెను. కాని దర్శించలేకపోయెను. పంచభూతములు,

టీ:- అథేతి వాక్యాంతరే. బ్రహ్మాపి తే వపుః కేవలం దధ్యౌ, న తు దృష్టవాన్. స చ స్వయం సాక్షాత్ యస్య తవ జఠరాబ్జే జాతః స భవానేవ విశ్వస్య సర్గాది విధత్తే. న తు తవ సర్గాదికర్తా కశ్చిదస్తి. స ఏవంభూతస్త్వం మే మయా కథం జఠరేణ ధృత ఇతి. త్రయాణా-మన్వయః. కథంభూతం వపుః. సత్ వ్యక్తం తత్ర హేతుః. అంతస్సలిలే శయానం కీదృశం. భూతాని చ. ఇంద్రియాణి చ అర్థాశ్చ శబ్దాదయ. ఆత్మా చ మన. ఏతన్మయం ఏతైర్వ్యాప్తమిత్యర్థః. కుతః. గుణానాం ప్రవాహో యస్మిన్. తత్కుతః. అశేషస్య కార్యకారణస్య బీజం కారణమ్. 2

ఇంద్రియములు, శబ్దాది విషయములు, జీవులు అన్నియు నీ యందే ఇమిడియున్నవి. ఈ సమస్త జగత్తు సత్త్వ రజస్తమో గుణముల ప్రవాహరూపమైయున్నది. ఈ సృష్టికి సత్ స్వరూపమగు నీ సగుణ రూపమే బీజమైయున్నది. ఇట్టి నిన్ను బ్రహ్మ ధ్యానించెను. ॥ 2 ॥

శ్లో ॥ స ఏవ విశ్వస్య భగవాన్ విధత్తే
గుణప్రవాహేణ విభక్త వీర్యః ।
సర్గాద్యనీహోవితథాభి సంధిః
ఆత్మేశ్వరోఽతర్క్య సహస్రశక్తిః ॥ 3

టీ:- స ఇతి. కథంభూతో భగవాన్ సర్గాది విధత్తే గుణప్రవాహ రూపేణ. విభక్తం వీర్యం శక్తిర్యేన సః. శక్తిద్వారేణైవ విధత్తే న సాక్షాదిత్యర్థః. యతః అనీహో నిష్క్రియః. కథం తర్హి శక్తిద్వారేణాపి సర్గాదివిధత్తే తత్రాహ - అవితథా అభిసంధిః సత్య సంకల్పః. కిమర్థం విధత్తే. ఆత్మనాం జీవానామీశ్వరః. జీవానాం భోగ్యార్థమిత్యర్థః నను

నీవు నిష్క్రియుడవు. సత్యసంకల్పుడవు. సమస్త జీవులకు ప్రభుడవు. అనంతములైన శక్తులు గలవాడవు. నీవే నీ శక్తిని సత్త్వరజస్తమో గుణ ప్రవాహము చేత బ్రహ్మ మొదలగు అనంతమూర్తు-లలో విభాగము చేసి ఈ ప్రపంచము యొక్క సృష్టి స్థితి లయములను చేయుచున్నావు. ॥ 3 ॥

కథం విచిత్రాన్ భోగాన్ ఏక ఏవ విదధ్యాత్తత్రాహ – అతర్క్యాః సహస్రం అపరిమితా శ్శక్తయో యస్య సః. ॥ 3 ॥

శ్లో ॥ స త్వం భృతో మే జఠరేణ నాథ
కథం ను యస్యోదర ఏతదాసీత్ ।
విశ్వం యుగాంతే వటపత్ర ఏకః
శేతే స్మ మాయా శిశురంఘ్రిపానః ॥ 4

ఓ ప్రభూ! ప్రళయకాలమందు ఈ విశ్వమంతయు నీ యందు లీనమగును. కల్పాంతమునందు మాయాబాలకుడవై మఱ్ఱి ఆకుపైన పడుకొని కాలిబొటనవేలిని త్రాగుతుందువు (చప్పరించుచుందువు) అంతటి మహిమాన్వితుడవైన నిన్ను నా ఉదరములో ఎట్లు భరించితినో కదా!॥ 4 ॥

టీ:– స ఇతి. కించ ప్రళయేయ స్యోదరే ఏతద్విశ్వమాసీత్ స త్వం మయా జఠరేణ కథం ధృతః. నను శిశౌ మయి కిమేతదుచ్యతే? తత్రాహ – వటపత్ర ఇతి. అంఘ్రిం పాదాంగుష్ఠం పిబతీత్యంఘ్రి పానః. ఇదమపి శిశుత్వం తద్వదేవ మాయేతి భావః. ॥ 4 ॥

శ్లో ॥ త్వం దేహతంత్రః ప్రశమాయ పాప్మనాం
నిదేశభాజాం చ విభో విభూతయే ।
యథావతారాస్తవ సూకరాదయః
తథాఽయమప్యాత్మపథోపలబ్ధయే ॥ 5

ఓ విభూ! నీవు పాపాత్ములను నశింపజేయుటకును, నీ యాజ్ఞననుసరించి ప్రవర్తించు భక్తుల అభివృద్ధి కొఱకును వరాహము మున్నగు అవతారములను స్వీకరించితివి. ఇప్పుడు శుద్ధజ్ఞాన మార్గమును ప్రపంచమున వ్యాప్తిజేయుటకై నా సంతానరూపముగా నా ఉదరమున భరింపబడితివి. సాంఖ్యయోగ వ్యాప్తియే నీ ఈ అవతార

టీ:– అథవా న త్వం మయా అపత్యాంతరవ జఠరే భృతః కింతు

వరాహాద్యవతారవదిచ్ఛయైవావిర్భూతోఽసీత్యాహ - త్వమితి. త్వం దేహతంత్రః దేహపరికరః. స్వీకృతమూర్తిరసి. పాప్మనాం దుష్టానాం. నిదేశభాజాం ఆజ్ఞానువర్తినాం విభూతయే సమృద్ధయే. ఆత్మపథోపలబ్ధయే జ్ఞానమార్గప్రదర్శనాయ. ॥ 5 ॥

శ్లో ॥ యన్నామధేయ శ్రవణానుకీర్తనాత్
యత్ప్రహ్వణాద్యత్స్మరణాదపి క్వచిత్ ।
శ్వాదోఽపి సద్యః సవనాయ కల్పతే
కుతః పునస్తే భగవన్ను దర్శనాత్ ॥ 6

టీ:- అతస్త్వద్దర్శనాదహం కృతార్థోఽస్మీతి కైముత్యన్యాయేనాహ- యదితి. యన్నామధేయస్య శ్రవణమనుకీర్తనం చ తస్మాత్. క్వచిత్కదాచిదపి శ్వానమత్తీతి శ్వాదః శ్వపచః సోఽపి సవనాయ సోమాదియాగాయ కల్పతే యోగ్యో భవతి. అనేన పూజ్యత్వం లక్ష్యతే. ॥ 6 ॥

శ్లో ॥ అహో బత శ్వపచోఽతో గరీయాన్
యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యమ్ ।
తేపుస్తపస్తే జుహువుః సస్ను రార్యా
బ్రహ్మానూచుర్నామ గృణంతి యే తే. ॥ 7

ప్రయోజనము. ॥ 5 ॥

(నీ దర్శనముచేత నేను కృతార్థురాలనైనానని కైముతిక న్యాయముగా చెప్పడమైనది) ఓ భగవానుడా! కుక్కమాంసమును వండుకొని తిను పరమకిరాతకుడైనప్పటికిని ఎప్పుడైనను నీ 'నామము'ను కీర్తించినను, లేక వినినను, నీకు నమస్కరించినను అతడు సోమయాజి వలె యోగ్యుడగును (గౌరవమును పొందుటకు అర్హుడగును). ఐనప్పుడు నిన్ను ప్రత్యక్షముగా దర్శించిన (పూజించిన) వ్యక్తి కృతకృత్యుడగుననుటలో చెప్పవలసినదేమున్నది? ॥ 6 ॥

(ఈ విషయమునే ప్రతిపాదించుచున్నాడు) అహా! ఏమి ఆశ్చర్యము! శ్వపచుడు(కుక్క మాంసమును వండుకొని తినేవాడు) నిన్ను కోరి నీ నామమును కీర్తించినంతనే నీ నామ మహిమవలన

టీ:- తదుపపాదయతి - అహో ఇతి. అహో బతేత్యాశ్చర్యే. యస్య జిహ్వాగ్రే తవ నామ వర్తతే సః శ్వపచోఽపి. అతః అస్మాదేవ హేతోర్గరీయాన్. యత్ యస్మాద్వర్తతే అత ఇతి వా. కుత ఇత్యత ఆహ-త ఏవ తపస్తేపుః కృతవంతః. జుహువుః హోమం కృతవంతః సస్నుః తీర్థేషు స్నాతాః. ఆర్యాస్త ఏవ సదాచారాః. బ్రహ్మ వేదమనూచుః అధీతవంతః. తన్నామకీర్తన ఏవ తప ఆద్యంతర్భూతం అతస్తే పుణ్యతమా ఇత్యర్థః. యద్వా జన్మాంతరే తైస్తపోహోమాదిసర్వం కృతమితి త్వన్నామకీర్తనమహాభాగ్యోదయాదవగమ్యత ఇత్యర్థః. ॥ 7 ॥

శ్రేష్ఠుడగుచున్నాడు. భక్తితో నీ నామ సంకీర్తనమును చేయువారు తపస్సు చేసిన వారితో, హోమములు చేసిన వారితో, వేదాధ్యయనము చేసిన వారితో సమానులు. వారే పూజింపదగినవారు. ॥ 7 ॥

శ్లో॥ తం త్వామహం బ్రహ్మపరం పుమాం సం
ప్రత్యక్స్రోతస్యాత్మని సంవిభావ్యమ్ ।
స్వతేజసా ధ్వస్తగుణప్రవాహం
వందే విష్ణుం కపిలం వేదగర్భమ్ ॥ 8

టీ:- తమితి. ప్రత్యక్స్రోతసి ప్రత్యాహృతే ఆత్మని మనసి సంవిభావ్యం సంచింత్యం. వేదాః గర్భే యస్య సః. ॥ 8 ॥

నీవు పరబ్రహ్మవు. పరమపురుషుడవు. విషయ ప్రవాహము నుండి మరల్చిన బుద్ధితో ధ్యానించునది నిన్నే. నీవు నీ తేజస్సు చేత మాయ యొక్క కార్యములైన సత్త్వ రజస్తమో గుణముల ప్రవాహ-రూపమైన సంసారబంధమును నశింపజేతువు. నీ ఉదరమునందు సమస్త వేదతత్త్వము ఇమిడి యున్నది. శ్రీమహావిష్ణువు యొక్క అవతారమైన కపిలభగవానుడవైన నీకు నమస్కారము. ॥ 8 ॥

మైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఈడితో భగవానేవం కపిలాఖ్యః పరః పుమాన్ ।
వాచాఽవిక్లవయేత్యాహ మాతరం మాతృవత్సలః ॥ 9

టీ:- ఈడిత ఇతి. అవిక్లబయా గంభీరయా వాచా. ॥ 9 ॥

మైత్రేయుడు ఇట్లు పలికెను

పురుషోత్తముడు, తల్లియందు వాత్సల్యముగలవాడు అయిన కపిలభగవానుడు తల్లి చేసిన స్తోత్రమును విని గంభీరముగా ఇట్లు పలికెను. ॥ 9 ॥

కపిల ఉవాచ

శ్లో ॥ మార్గేణానేన మాతస్తే సుసేవ్యేనోదితేన మే ।
ఆస్థితేన పరాం కాష్ఠామచిరాదవరోత్స్యసి ॥ 10

టీ:- మార్గేణేతి. తే తవ. సుసేవ్యేన. మే మయా ఉదితేన. ఆస్థితేనా- నుష్ఠితేన. పరాం కాష్ఠాం జీవన్ముక్తిం అవరోత్స్యసి ప్రాప్స్యసి.॥ 10 ॥

కపిల భగవానుడిట్లు పలికెను

ఓ తల్లీ! నేను బోధించినదియు, సుఖముగా అనుష్ఠింపవీలైనదియునగు ఈ యోగమును నీవు అనుష్ఠించి తొందరలోనే జీవన్ముక్తిని పొందెదవు. ॥ 10 ॥

శ్లో ॥ శ్రద్ధత్స్వైతన్మతం మహ్యం జుష్టం యద్బ్రహ్మవాదిభిః ।
యేన మామభవం యాయా మృత్యుమృచ్ఛంత్యతద్విదః 11

టీ:- శ్రద్ధత్స్వేతి. యాయాః యాస్యసి అతద్విదః మన్మతమవిద్వాంసః ॥ 11 ॥

నీవు నా ఈ బోధయందు శ్రద్ధావంతురాలవగుము. బ్రహ్మవేత్తలు దీనినే ప్రీతితో సేవించినారు. నీవు దీనిననుష్ఠించుట వలన జనన మరణ రహితుడనైన నన్ను పొందెదవు. ఎవరైతే ఈ జ్ఞానమును పొందరో వారు జన్మమృత్యురూపమైన ఈ సంసారమునే పొందెదరు. ॥ 11 ॥

శ్రీమైత్రేయ ఉవాచ

శ్లో ॥ ఇతి ప్రదిశ్య భగవానుశతీమాత్మనో గతిమ్ ।
స్వ మాత్రా బ్రహ్మవాదిన్యా కపిలోఽనుమతో యయౌ ॥12

టీ:- ఇతీతి. అనుమతః. అనుజ్ఞాతః. ॥ 12 ॥

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను

కపిలభగవానుడు ఈ విధముగా శ్రేష్ఠమైన ఆత్మజ్ఞానమును బోధించెను. ఆయన తల్లి దేవహూతి బ్రహ్మజ్ఞానము పొందెను. కపిలుడు తల్లి వద్ద అనుమతి పొంది అచటి నుండి వెళ్ళిపోయెను. 12

శ్లో ॥ సా చాపి తనయోక్తేన యోగాదేశేన యోగయుక్ ।
తస్మిన్నాశ్రమ ఆపీడే సరస్వత్యాః సమాహితా ॥ 13

టీ:- సేతి. సరస్వత్యాః ఆపీడే పుష్పమకుటతుల్యే. సరస్వత్యేతి పాఠే పుష్పమకుటేనేవ సంవేష్టితే. బిందు సరసి సమాహితా బభూవ. 13

అప్పుడు ఆ దేవహూతి తన పుత్రుడైన కపిలుడు బోధించిన యోగమును సాధన చేయుచుండెను. ఆ ప్రదేశము సరస్వతీ నదికి అలంకరించిన పూలకిరీటమువలె శోభిల్లుచుండెను. ఆ ప్రదేశమే బిందుసరోవరము. ॥ 13 ॥

శ్లో ॥ అభీక్ష్ణావగాహ కపిశాన్ జటిలాన్ కుటిలాలకాన్ ।
ఆత్మానం చోగ్రతపసా బిభ్రతీ చీరిణం కృశమ్ ॥ 14

టీ:- కథంభూతా సతీ సమాహితా తదాహ- అభీక్ష్ణం త్రిషవణ-మవగాహః స్నానం తేన కపిశాన్ పిశంగాన్ స్వత ఏవ కుటిలానలకాన్ కేశాన్ తథా ఆత్మానం దేహం చీరధారిణం కృశం చ బిభ్రతీ సతీ అభీక్ష్ణావగాహేత్యత్ర వర్ణాధిక్యమార్షం. ॥ 14 ॥

(తపోకాలమున ఆమె ఎట్లైనదో తెల్పుచున్నాడు)

ప్రతిరోజు మూడుమార్లు స్నానము చేయుటచే ఆమె అందమైన గిరజాల (ఎరుపురంగు) వెంట్రుకలు బూడిదరంగుగలవయ్యెను. జడలు గట్టెను. ఆమె నారచీరలు ధరించెను. కఠోరమైన తపస్సు చేయుటచే ఆమె శరీరము మిక్కిలి చిక్కిపోయెను. ॥ 14 ॥

శ్లో ॥ ప్రజాపతేః కర్దమస్య తపోయోగ విజృంభితమ్ ।
స్వగార్హస్థ్యమనౌపమ్యం ప్రార్థ్యం వైమానికైరపి ॥ 15

టీ:- ప్రజాపతేరితి. ప్రజాపతేః కర్దమస్య తపో యోగాభ్యాం విజృంభిత మతిశయితం స్వగార్హస్థ్యం అనౌపమ్యం హిత్వా పుత్రభూతేశ్వర విరహాతురా సతీ వదనం కించిత్ అనిర్వాచ్యం శోకవ్యాకులం చకారేతి షష్ఠేనాన్వయః. ॥ 15 ॥

కర్దమప్రజాపతి యొక్క తపోయోగ మహిమ వలన ఏర్పడిన సాటిలేని గృహస్థ సుఖమును ఆమె వదిలిపెట్టెను. ఈ రకమైన గృహస్థ సుఖమునకై దేవతలు కూడా తీవ్రమైన కోరిక గలవారై ఉందురు. అమితమైన సంపదను త్యజించి తపోదీక్షచేసిన ఆమె ముఖము పుత్రవియోగముచే కొంచెము ఉదాసీనముగా నుండెనని ఆరవ శ్లోకముతో అన్వయము. ॥ 15 ॥

శ్లో ॥ పయః ఫేన నిభాః శయ్యా దాంతా రుక్మ పరిచ్ఛదాః ।
ఆసనాని చ హైమాని సుస్పర్శాస్తరణాని చ ॥ 16

శ్లో ॥ స్వచ్ఛ స్ఫటిక కుడ్యేషు మహామరకతేషు చ ।
రత్నప్రదీపా ఆభాంతి లలనా రత్నసంయుతాః ॥ 17

టీ:- పయఇతి. యత్ర గార్హస్థ్యే. క్షీరఫేననిభాః మృదుశుభ్రాశ్శయ్యాః ఆస్తరణాని భాంతి దాంతా దంతఘటితాః మంచకాశ్చ. స్వర్ణమయాః పరికరాః. ఆసనానిపీఠాదీని. సుస్పర్శాన్యాస్తరణాని యేషు. 16-17

దేవహూతి కర్దముల గృహ సంపత్తిని వర్ణించుచున్నాడు. ఆమె గృహమునందు పాలనురుగువంటి మెత్తనైన శయ్యలు (పడకలు), సుఖ స్పర్శగల మెత్తలు(దిండ్లు), బంగారముతో చేసిన ఆసనములు, స్వర్ణపరికరములు, ఏనుగుదంతములతో చేసిన మంచములు ఉండెను. ఆ ఇంటి గోడలు స్వచ్ఛమైన స్ఫటికముతో నిర్మింపబడినవి. ఆ గోడలయందు గొప్ప మరకత మణులు పొదగబడి యుండెను. ఆ గోడల యందు అమర్చబడిన రత్నములు దీపములవలె ప్రకాశించు-చుండెను. ఆ ఇల్లు పరిచారిక స్త్రీలతో నిండి యుండెను. ఆ గృహమునకు చెందిన ఉద్యానవనములో పూలతో విరిసిన అనేక దేవతా వృక్షములుండెను. ఆ తోట జంటపక్షుల కూతలతో, మదించిన

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ గృహోద్యానం కుసుమితైః రమ్యం బహ్వామరద్రుమైః ।
కూజద్విహంగ మిథునం గాయన్మత్త మధువ్రతమ్ ॥ 18

టీ:- గృహేతి. బహుభిరమరద్రుమైః రమ్యమ్. ॥ 18 ॥

శ్లో ॥ యత్ర ప్రవిష్టమాత్మానం విబుధానుచరా జగుః ।
వాప్యాముత్పలగంధిన్యాం కర్దమేనోపలాలితమ్ ॥ 19

టీ:- యత్రేతి. యత్రోద్యానే ప్రవిష్టమాత్మానం దేవహూతిమ్. 19

శ్లో ॥ హిత్వా తదీప్సితతమమప్యాఖండల యోషితామ్ ।
కించిచ్చకార వదనం పుత్ర విశ్లేషణాతురా ॥ 20

టీ:- హిత్వేతి. ఆఖండలః ఇంద్రః. తస్యయా యోషితః, తాసామ పీప్సితతమం ప్రాప్తుమిష్టతమం. తద్ధిత్వా తత్రాభిమానం త్యక్త్వా. 20

శ్లో ॥ వనం ప్రవ్రజితే పత్యావపత్య విరహాతురా ।
జ్ఞాతతత్త్వాప్యభూన్నష్టే వత్సే గౌరివ వత్సలా ॥ 21

టీ:- సుహృద్వియోగస్య సుదుస్సహతామాహ - వనమితి. నష్టే వత్సే వత్సలా గౌరివాభూత్. ॥ 21 ॥

తుమ్మెదల ఝుంకారములతో నిండియుండెను. ఆ ఉద్యానవనము నందు కలువల సువాసనతో కూడిన గొప్ప దిగుడు బావి ఉండెను. దేవహూతి ఆ సరస్సులో ప్రవేశించగా కర్దముడు ఆమెను లాలించెడివాడు. ఆమె సౌభాగ్యమును గంధర్వులు గానము చేసెడివారు. దేవహూతి యొక్క ఈ గృహస్థసౌభాగ్యమును ఇంద్రుని స్త్రీలు కూడా ఎంతో మక్కువతో కోరురుందురు. కాని దేవహూతి ఆ గృహస్థాశ్రమమును విడిచిపెట్టెను. ఆమె మనస్సు పుత్రవియోగముచే కలతచెందినదై వ్యాకులముగా, ముఖము ఉదాసీనముగా నుండెను. ॥ 16-20 ॥

ఆత్మీయుల ఎడబాటు దుస్సహమని చెప్పుచున్నాడు. భర్తయైన కర్దముడు సన్న్యసించి అడవికి వెళ్ళెను. పుత్రుడు కపిలుడు కూడా దూరమయ్యెను. దేవహూతి ఆత్మజ్ఞాన సంపన్నురాలైనను, దూడను

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.
ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య

శ్లో ॥ తమేవ ధ్యాయతీ దేవమపత్యం కపిలం హరిమ్ ।
బభూవాచిరతో వత్స నిస్పృహా తాదృశే గృహే ॥ 22

టీ:- విరహ కృత ధ్యాన ఫలమాహ - తమితి. నిస్పృహా నిర్వాసనా. హే వత్స విదుర. ॥ 22 ॥

శ్లో ॥ ధ్యాయతీ భగవద్రూపం యదాహ ధ్యానగోచరమ్ ।
సుతః ప్రసన్నవదనం సమస్తవ్యస్తచింతయా ॥ 23

టీ:- ధ్యాయతీతి. తతః స్వసుతః కపిలో యదాహ - తద్భగవతో రూపం ధ్యాయంతీ తథా. ఆత్మానం చ విశ్వతోముఖం సర్వగతం ధ్యాయతీ. బ్రహ్మణ్యవస్థితమతిః బభూవేతి పూర్వస్యైవానుషంగః. కేన ధ్యాయతీ. విశుద్ధేనాత్మనా మనసా. ॥ 23 ॥

శ్లో ॥ విశుద్ధేన తదాత్మానమాత్మనా విశ్వతోముఖమ్ ।
స్వానుభూత్యా తిరోభూత మాయాగుణ విశేషణమ్ ॥ 24

శ్లో ॥ భక్తిప్రవాహయోగేన వైరాగ్యేణ బలీయసా ।
యుక్తానుష్ఠానజాతేన జ్ఞానేన బ్రహ్మహేతునా ॥ 25

టీ:- విశుద్ధౌ కారణాన్యాహ-భక్తీతి. భక్తిప్రవాహరూపేణ యోగేన వైరాగ్యేణ చ యుక్తానుష్ఠానేన జాతం యత్ జ్ఞానం తేన చ.

కోల్పోయిన ఆవువలె దుఃఖించెను. ॥ 21 ॥

విరహము కారణముగా కలిగిన ధ్యానఫలమును చెప్పు-చున్నాడు. కుమారా విదురా! కపిలుడనే పేరుతో శ్రీహరియే పుత్రుడుగా జన్మించెను. దేవహూతి ఆ కపిలుడినే ధ్యానిస్తూ కొద్ది కాలములో ఇంటి యందలి ఆసక్తిని (స్పృహను) వదిలిపెట్టెను. 22

తన కుమారుడు తనకు ఉపదేశించిన ఆ భగవంతుని నిండైన రూపమును ఆమె విశుద్ధమై మనస్సుతో ధ్యానించెను, అట్లే ఆ దేవదేవుని అవయవములను విడి విడిగా కూడా ధ్యానించెను. ॥ 23 ।

విశుద్ధమగు అంతఃకరణమేర్పడుటకు కారణములను చెప్పు చున్నాడు. 1. నిరంతరమగు భక్తి యోగము చేత, 2. తీవ్రమైన వైరాగ్యము చేత, 3. యుక్తమైన అనుష్ఠానము చేత బ్రహ్మసాక్షాత్కారము నకు కారణమగు 'జ్ఞానము' ఉదయించును. భగవద్గీత యందు "యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా" అని యున్నది కదా! పై మూడింటిచేత

యుక్తానుష్ఠానం చ గీతాసూక్తం. శ్లో.“యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు, యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహే”తి. బ్రహ్మ-హేతునా బ్రహ్మత్వాపాదకేన. విశ్వతోముఖత్వహేతుః. స్వానుభూత్యా స్వరూపప్రకాశేన తిరోభూతం మాయాగుణైర్విశేషణం పరిచ్ఛేదో యస్య. ॥ 24,25 ॥

విశుద్ధత ఏర్పడును. దేవహూతి ఈ రకమైన విశుద్ధ అంతఃకరణముతో సర్వవ్యాపకమగు ఆత్మతత్త్వమును ధ్యానించెను. ఇట్లు ధ్యానించుట ద్వారా తన స్వరూపము ప్రకాశించెను. అప్పుడు మాయాశక్తి యొక్క సత్వరజస్తమో గుణముల కార్యమగు దేహము యొక్క బంధము(దేహము నందలి అభిమానము) దూరమయ్యెను. ॥ 24,25 ॥

శ్లో ॥ బ్రహ్మణ్యవస్థితమతిర్భగవత్యాత్మ సంశ్రయే ।
నివృత్త జీవాపత్తిత్వాత్ క్షీణ క్లేశాప్త నిర్వృతిః ॥ 26

టీ:- బ్రహ్మణీతి. కథంభూతే బ్రహ్మణి. ఆత్మనాం జీవానాం సంశ్రయే భగవతి. తస్యాః జీవన్ముక్తిమాహ సార్ధై స్త్రిభిః. తదా చ నివృత్తా జీవా-పత్తిర్జీవభావో యస్యాస్తస్యా భావస్తత్వం తస్మాత్. విగతక్లేశా ప్రాప్త-నిర్వృతిశ్చ సతీ ఆత్మానం దేహం న సస్మారేత్యుత్తరేణాన్వయః.॥26 ॥

ఈ మూడున్నర శ్లోకములలో దేవహూతి జీవన్ముక్తిత్వమును చెప్పుచున్నాడు. దేవహూతి, జీవులందరికి అధిష్ఠానభూతుడైన పరబ్రహ్మ యందు బుద్ధిని స్థిరముగా నిలిపెను. ఆమెకు జీవభావము తొలగి-పోయెను. ఆ కారణముగా దుఃఖము క్షీణించి పరమానందము కలిగెను. తన దేహమును కూడా స్మరింపజాలకుండెనని తరువాతి శ్లోకముతో అన్వయము. ॥ 26 ॥

శ్లో ॥ నిత్యారూఢ సమాధిత్వాత్పరావృత్త గుణభ్రమా ।
న సస్మార తదాత్మానం స్వప్నే దృష్టమివోత్థితః ॥ 27

టీ:- నను తథాపి గుణానాం విద్యమానత్వాత్కథమస్మరణం? తత్రాహ - నిత్యేతి. నిత్యారూఢో లబ్ధప్రతిష్ఠః సమాధిర్యస్యాస్తస్యా భావస్తత్వం తస్మాత్. పరావృత్తః శాంతో గుణనిమిత్తో భ్రమో యస్యాః సా. ॥27॥

గుణముల ప్రవాహము కొనసాగుచుండగా దేహవిస్మరణ ఎట్లో చెప్పుచున్నాడు. నిరంతరము సమాధిస్థితియందే ఉండిన కారణముగా దేవహూతికి సత్త్వరజస్తమోగుణముల వలన కలిగే దేహాత్మభ్రాంతి

శ్లో ॥ తద్దేహః పరతః పోషోఽప్యకృశశ్చాధ్యసంభవాత్ ।
బభౌ మలైరవచ్ఛన్నః సధూమ ఇవ పావకః ॥ 28

టీ:- తదితి. పరతః పరాభిరేవ కర్దమ సృష్ట విద్యాధరీభిః పోషః పోషణం యస్య సః. ఆధిః మనోగ్లానిః తదసంభవాదకృశః. మలైరవచ్ఛిన్నోఽపి బభౌ. ॥ 28 ॥

శ్లో ॥ స్వాంగం తపోయోగమయం ముక్తకేశం గతాంబరమ్ ।
దైవగుప్తం న బుబుధే వాసుదేవ ప్రవిష్టధీః ॥ 29

టీ:- స్వాంగమితి. దేవగుప్తం ప్రారబ్ధకర్మ పాలితం. ॥ 29 ॥

శ్లో ॥ ఏవం సా కపిలోక్తేన మార్గేణాచిరతః పరమ్ ।
ఆత్మానం బ్రహ్మనిర్వాణం భగవంతమవాప హ ॥ 30

టీ:- ఏవమితి. నిర్వాణం నిత్యముక్తం. ॥ 30 ॥

తొలగినది. కలలో చూచిన తన శరీరము మెలకువ తరువాత ఉండనట్లు దేవహూతికి తన శరీర ధ్యాస లేకుండెను. ॥ 27 ॥

కర్దమమహర్షి యోగ ప్రభావము వలన పుట్టిన విద్యాధరస్త్రీలు ఆమెను పోషించుచుండిరి. ఆమెకు ఎట్టి మానసిక క్లేశము లేనందున ఆమె శరీరము కృశించలేదు. దుర్బలము కాలేదు. మాలిన్యములచే కప్పబడిన ఆమె దేహము పొగతో ఆవరింపబడిన అగ్నివలె నుండెను28

దేవహూతి మనస్సు వాసుదేవుని యందే లగ్నమైయుండెను. అందువలన ఆమెకు దేహమునందు ధ్యాసలేకుండెను. తపస్సు, యోగాభ్యాసముచేయుట వలన ఆమె చెల్లాచెదరైన జుట్టుతో నుండెను. తొలగిన వస్త్రములతో నుండెను. కేవలము ప్రారబ్ధకర్మ మాత్రమే ఆమె శరీరమును రక్షించుచుండెను. ॥ 29 ॥

ఓ విదురుడా! ఈ విధముగా దేవహూతి కపిలదేవుడు ఉపదేశించిన మార్గమునసరించి కొద్దికాలములోనే పరబ్రహ్మము, నిత్యముక్తుడు, మోక్షస్వరూపుడు, వైకుంఠనాథుడు అగు శ్రీహరిని పొందెను. ॥ 30 ॥

శ్లో ॥ తద్వీరాసీత్పుణ్యతమం క్షేత్రం త్రైలోక్యవిశ్రుతమ్ ।
నామ్నా సిద్ధపదం యత్ర సా సంసిద్ధిముపేయుషీ ॥ 31

టీ:- తదితి. హే వీర విదుర. ఉపేయుషీ ప్రాప్తా. ॥ 31 ॥

శ్లో ॥ తస్యాస్తద్యోగ విధుతమార్త్యం మర్త్యమభూత్సరిత్ ।
స్రోతసాం ప్రవరా సౌమ్య సిద్ధిదా సిద్ధసేవితా ॥ 32

టీ:- తస్యా ఇతి. హే సౌమ్య విదుర. తస్యాస్తన్మర్త్యం శరీర. సరిదభూత్. కథంభూతం. యోగేన విధుతా విలీనా మార్త్యా దైహికా ధాతుమలా యస్య. ॥ 32 ॥

శ్లో ॥ కపిలోఽపి మహాయోగీ భగవాన్ పితురాశ్రమాత్ ।
మాతరం సమనుజ్ఞాప్య ప్రాగుదీచీం దిశం యయౌ ॥ 33

టీ:- కపిలోఽపి యయావిత్యుక్తం తదేవ ప్రపంచయతి - త్రిభిః కపిలోఽపి ఇతి. సమనుజ్ఞాప్య అనుజ్ఞాం సంప్రాప్య. ॥ 33 ॥

ఓ విదురుడా! ఆమె సిద్ధిపొందిన ప్రదేశము సిద్ధపదము అను పేరుతో అతిపవిత్ర క్షేత్రమై మూడులోకములలో ప్రఖ్యాతిని గాంచినది. దానినే ఇప్పుడు సిద్ధపురి, సిద్ధపూర్, (మాతృగయ) అను పేర్లతో పిలుచుచున్నారు. ॥ 31 ॥

సాధుస్వభావము గల ఓ విదురుడా! యోగసాధనవలన ఆమె శరీరమునందలి మాలిన్యములన్నియు తొలగిపోయినవి. ఆమె శరీరము సిద్ధపురుషులందును సేవించే "సిద్ధిదా" అనే పేరుగల నదిగా మారెను. సాధకులందరికి ఫలసిద్ధిని సమకూర్చగలది ఆ నది. ॥ 32 ॥

మూడు శ్లోకములతో కపిలుడు వెళ్ళిన విధమును వివరించుచున్నాడు. మహాయోగియగు కపిలమహర్షి తన తల్లి అనుమతిని పొందిన వాడై తన తండ్రి ఆశ్రమమునుండి ఈశాన్యదిశకు వెళ్ళెను. 33

శ్లో ॥ సిద్ధచారణ గంధర్వైర్మునిభిశ్చాప్సరో గణైః ।
స్తూయమానః సముద్రేణ దత్తార్హణ నికేతనః ॥ 34

టీ:- సిద్ధేతి. దత్తమర్హణమర్ఘ్యం నికేతనం చ యస్మై. ॥ 34 ॥

సిద్ధులు, చారణులు, గంధర్వులు, మునులు, అప్సరసగణములు స్తుతించుచుండగా సముద్రుడు కపిలదేవునికి అర్ఘ్యము నిచ్చి నివాసస్థానము నిచ్చెను. ॥ 34 ॥

శ్లో ॥ ఆస్తే యోగం సమాస్థాయ సాంఖ్యాచార్యైరభిష్టుతః ।
త్రయాణామపి లోకానాముపశాంత్యై సమాహితః ॥ 35

టీ:- ఆస్త ఇతి. ఉపశాంత్యర్థం సమాహిత ఆస్తే. ॥ 35 ॥

కపిలుడు సాంఖ్యాచార్యులందరి చేత స్తుతింపబడేవాడు. ఆయన మూడులోకములు శాంతిగానుండుట కొఱకై యోగ మార్గమును అవలంబించి సమాధినిష్ఠుడై ఉండెను. ॥ 35 ॥

శ్లో ॥ ఏతన్నిగదితం తాత యత్పృష్టోఽహం తవానఘ ।
కపిలస్య చ సంవాదో దేవహూత్యాశ్చ పావనః ॥ 36

టీ:- ప్రకరణార్థముపసంహరతి - ఏతదితి. తవ త్వయా. ॥ 36 ॥

ఉపసంహారము చెప్పుచున్నాడు. ఓ పాపరహితుడవైన విదురా! వత్సా! నీవు నన్నడిగిన మన్వంతరాది విషయములను,కపిలదేవహూతి సంవాదమును కూడ చెప్పినాను. ॥ 36 ।

శ్లో ॥ య ఇదమనుశ్రుణోతి యోఽభిధత్తే
కపిలమునేర్మతమాత్మయోగ గుహ్యమ్ ।
భగవతి కృతధీస్సుపర్ణకేతౌ
ఉపలభతే భగవత్పదారవిందమ్ ॥ 37

టీ:- ఏతచ్ఛ్రవణకీర్తనఫలమాహ -య ఇతి. సుపర్ణకేతౌ గరుడధ్వజే. ఉపలభతే ప్రాప్నోతి. ॥ 37 ॥

అష్టాదశ సాహస్రికాయాం పారమహంస్యాం
సంహితాయాం శ్రీమద్భాగవతే, మహాపురాణే
తృతీయస్కంధే, కపిలోపాఖ్యానే
త్రయస్త్రింశత్తమోఽధ్యాయః
సమాప్తోఽయం తృతీయస్కంధః

ఈ కపిలాఖ్యాన శ్రవణ కీర్తనలఫలమును చెప్పుచున్నాడు. కపిలదేవుని యొక్క ఈ అధ్యాత్మయోగము పరమరహస్యమైనది. ఎవరైతే దీనిని శ్రద్ధగా వింటారో, ఎవరైతే చెప్పుతారో వారు గరుడవాహనుడగు శ్రీహరియందు మనస్సును లగ్నము చేసినవారై ఆ భగవానుని పాద పద్మములను పొందెదరు. ॥ 37 ॥

శ్రీమద్భాగవతమున తృతీయస్కంధమందు
ముప్పదిమూడవ అధ్యాయము సమాప్తము.
తృతీయస్కంధము సమాప్తము.

సదానందో విజయతే

జయ కృష్ణానంద

మదనానందో విజయతే తరామ్

జయ మాధవానంద

# శ్రీగురుమదనానందసరస్వతీపీఠము

## రాంపురం, తొగుట మం., మెదక్ జిల్లా



పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ మాధవానందసరస్వతీస్వామివారు**

సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్